శ్రీ మీనాక్ష్యైనమః

# శ్రీమదాంధ్ర లింగపురాణము



గ్రంథకర్త:

విద్వాన్

ములుగు చంద్రమౌళి శాస్త్రి





రజత ముద్రాక్షరశాల : తెనాలి.

నాల్గవ పుష్పము.

శ్రీ మీనాక్ష్యైనమః

# శ్రీమదాంధ్ర లింగపురాణము

అష్టాదశ మహాపురాణములలో నొకటియని ప్రసిద్ధిగాంచిన
లింగపురాణమున కాంధ్రీకరణము

గ్రంథకర్త,
తెనాలి తాలూకా హైస్కూలునందు ఆంధ్రోపాధ్యాయుడగు
విద్వాన్
ములుగు చంద్రమౌళి శాస్త్రి

(౧)

ప్రకాశకులు,
నందికేశ్వర గ్రంథమండలివారు

మొదటి కూర్పు 1000 ప్రతులు

రజత ముద్రాక్షరశాల : తెనాలి.

 1929

శ్రీమీనాక్ష్యైనమః.

# విజ్ఞాపనము



చరాచర ప్రపంచనిర్మాతయగు పరమేశ్వరుడు తనకు ప్రపంచోద్ధరణంబు ముఖ్యకర్తవ్య మగుటజేసి ప్రతియుగంబునను నేదియో నొక యవతారంబు ధరించి యనుగ్రహంబున శిష్టరక్షయు నిగ్రహంబున దుష్టశిక్షయు గావించుచుండును. "వ్యాసో నారాయణో హరి" యనునట్లు వేదవ్యాసమహర్షి శ్రీమన్నారాయణాంశ సంభూతుడు. అమ్మహాత్ముడు కరుణార్ద్రహృదయుడై ధర్మబోధకంబులుగ శ్రుతి స్మృతి పురాణేతిహాసంబుల నొసగెను. అందు పురాణంబులు పదునెనిమిది. అవి సుహృత్సమ్మితములు. అందు లింగపురాణము పదునొకండవది. పురాణ లక్షణంబులగు సర్గప్రతిసర్గ వంశమన్వంతర వంశానుచరితంబులతో కరంబలరారుచు పురాణరాజమన ప్రశస్తిగాంచినది. ప్రత్యేకము శివోత్కర్ష ప్రతిపాదకమేగాక విష్ణుభక్తిపూరితంబులగు కథలుగలిగి శ్రవణమాత్ర పాపనివారకమైయున్నది. జగత్కారణమగు లింగమహిమయు తద్ధారణఫలంబును లింగధారణాధికారి లక్షణంబును నిందు ముఖ్యంబులు. జగత్కర్త్రియగు భవానీమనోహరు డీగ్రంథకరణమునకు లక్ష్యము. ఈ గ్రంథము రెండు భాగములుగ విభజింపబడినది. పూర్వభాగంబున నూటతొమ్మి దధ్యాయంబులును నుత్తరభాగంబున నేబదియైదధ్యాయంబులును గలవు. ఇందుత్తరభాగంబున నిరువదియొకటవ యధ్యాయంబున లింగధారణకు ముఖ్యాంగమగు దీక్షావిధి విశదముగ వర్ణింపబడినది.

షణ్మతములందు శైవమగ్రగణ్యము. కనుకనే శైవము ప్రథమమున పరిగణింపబడినది. అనాది సిద్ధమైనది. కాని; ప్రస్తుతకాలమున శైవమతము స్వల్పమైనందువలనను తక్కిన మతములు బాహుళ్యము లగుటవలనను శైవులలో విశేషముగ పండితులును ధనవంతులును లేకుండుటవలనను శైవగ్రంథములన్ని నముద్రితములై జీర్ణించుచున్నవి. మొదటినుండియు బరమత శ్రేయస్సహిష్ణుత్వము గలవారరుదు, చాలమంది ముద్రాపకులు శైవేతరులగుటచే శైవగ్రంథములలోని శివోత్కర్ష ప్రతిపాదకములగు విషయముల మార్చుటయో తగ్గించుటయో సంభవించుచున్నది. దానిని సవరించుట కష్టసాధ్యము. "కలౌ శైవమరోచక" మను పలుకు నిజమైనది; సమయము దొరకెగదాయని తమకు బాధకములనితోచిన యితర గ్రంథములందలి విషయముల తగ్గించువారు షణ్మతాచార్యుండగు వ్యాసమునీంద్రు నుద్దేశమునకు భంగము కలిగించుట సాహసకృత్యమేయగునని తలంపకుండుట వింతయగుచున్నది.

ఈపురాణరాజ మఱువదిసంవత్సరములకు బూర్వము దెలుగులిపిలో ముద్రింపబడినది. ఆపుస్తకము లిప్పుడు దొరుకుటలేదు. పిమ్మట యిరువదియైదు సంవత్సరములకు బొంబాయిలో నాగరలిపియందు ముద్రింపబడినది. ముద్రాపకులా గ్రంథమందలి యుత్తరభాగంబున దీక్షావిధిలో నీక్రింది శ్లోకములు తీసివేసిరి.”

శ్లో॥ పంచబ్రహ్మమయేనాథ పంచాక్షరయుతేనచ శక్తిపాతం విధాయాథ
సమ్యగ్జ్ఞానాభివృద్ధయే పీఠస్థితేభిషిక్తేచ గంధపుష్పాది పూజితే జలాధివాస
నాద్యైశ్చ సంస్కారైః ప్రోక్షసంస్కృతే అష్టత్రింశత్కళా
న్యాసంలింగేకృత్వావిధానతః షడధ్వానో న్యసేత్పీఠే బ్రహ్మవిష్ణు శివాత్మకే
లింగేప్రాణాంస్తుసంస్థాప్య అసునీతేతిమంత్రితః స్వస్యాగ్రేసంస్థితస్యాస్య దేశికః
కరుణానిధిః కుర్యాద్దీక్షాం మహాశైవీం అవిద్యాపాశకృన్తనీం, క్రియతే లింగసంబం
ధః క్షీయతేచ మలత్రయం దీయతేక్షీయతేతస్మాత్సాదీక్షేతి నిగద్యతే సాదీక్షా
పరమాదైవీ త్రిధాభవతినిర్మలా ఏకావేదాత్మికా సాక్షాదన్యామంత్రాత్మికామతా
క్రియాత్మికాపరాకాచి దేవమేవత్రిధాభవేత్ హస్తమస్తకసంయోగా చ్చలాద్వేదేతి
గీయతే గురుణోదీరితాకర్ణే యాసామంత్రాత్మికధ్యతే శిష్యపాణితలేదత్తాయాదీక్షా
సాక్రియోద్యతా పాశానశేషాన్కర్తర్యా చ్ఛిత్వాలింగ సమాదిశేత్ కర్తరీశివదీక్షా
స్యాద్యయాపాశాన్ ఛినత్త్యసౌ కృత్వాశైవీం పరాందీక్షాం తత్త్వవిద్యాం శివాత్మికాం
ఛిత్వావిద్యామహాకోశం కళాధ్యానం విచింతయేత్ యథాకళాతథాభావో యథాభా
వస్తథామనః యథామనస్తథా దృష్టిర్యథాదృష్టిస్తథాస్థలం యాకళాపరమాసూక్ష్మా
మన్త్రాణాం బోధినీపురా తామాకృష్యయథాన్యాయం లింగేసముపవేశయేత్
తతస్తల్లింగమస్యాంగే శిష్యస్యామితతేజసా సంయోజనీయంగురుణా పూర్వోక్తేనైవ
వర్త్మనా తనుత్రయగతానాది మలత్రయమసౌగురుః దీక్షాత్రయేణనిర్దగ్ధ్వాలింగత్రి
తయమాదిశేత్ లింగస్తుత్రివిధ ప్రోక్తం స్థూలంసూక్ష్మంతు కారణం ధారయన్తో
నరాస్థూలం కారణం సంప్రయాంతిహి, కుర్యాత్త్రిపుటిసంధానం శివసాయుజ్యకా
రణం వక్ష్యేత్రిపుటిసంధానలక్షణం శివయోగినాం స్థూలలింగస్య దేహస్యసూక్ష్మస్య
మనసస్తథా కారణస్యాత్మనో నిత్యంకుర్యాదైక్యమతంద్రితః లింగేనధారయేల్లింగం
ధ్యాయేచ్చిత్తేన శంకరం స్వాత్మనా భావయేత్పూర్ణమైక్య భావేనసర్వతః ఏతత్త్రి
పుటిసంధానలక్షణం పరికీర్తితం కీటోభ్రమరయోగేన భ్రమరోభవతిధ్రువం మానవ
శ్శివయోగేన శివోభవతినిశ్చయం అనేనవర్త్మనాగచ్ఛన్ సజీవన్నేనశంకగః బ్రహ్మ
విష్ణ్వాదయోదేవామునయో గౌతమాదయః ధారయంతి సదాలింగ ముత్తమాంగే
విశేషతః వేదేషుశాస్త్రసంఘేషు పురాణేష్వాగమేషుచ బ్రాహ్మణస్య సమా
ఖ్యాతం లింగధారణముత్తమం బ్రహ్మేతిలింగమాఖ్యాతం బ్రహ్మణఃపతిరీశ్వరః
పవిత్రం తద్ధివిఖ్యాతం తత్సమ్పర్కాత్తనుశ్శుచిః ఋగిత్యాహపవిత్రంతే వితతం

బ్రహ్మణస్పతే. తస్మాత్పవిత్రం తల్లింగంధార్యం శైవమనామయం అతప్తతనుర జ్ఞోవైహ్యఘీ సంసారలక్షణః దీక్షరయారహితహ్నాత్షాక్ నాప్నుయాల్లింగముత్తమం యఃకరోతితపఃపూర్వం సతప్తతనురుచ్యతే. పరిపక్వోవిమోక్షాయ సోస్నుతే లింగ ధారణం నకరోతితతః పూర్వం సోబ్రతద్దనురుచ్యత్తే అథర్వోయం విమోక్షాయ సోస్నుతే లింగధారణం యజురప్యాహసర్వం వై లింగంస్థాపయతీతిచ. తస్మాద్ధార్యం మహాలింగం పాణిమంత్రేతి మంత్రతః, పాణౌలింగంవినిక్షిప్య దీక్షా కాలెగురుశ్శివం యేనస్తువతి తన్మంత్రంపాణి మంత్రంవదంతిహి, పవిత్రత్వాత్వాన్మహేశస్య శివస్య ప్రతి పాదనాత్. పవిత్రకరణాత్ పుంసాంపవిత్రమితికథ్యతే. అతస్సర్వేషు కాలేషు ధారయేల్లింగముత్తమం, గచ్ఛంస్తిష్ఠన్ స్వపన్ జాగ్రన్నున్మిషన్నిమిషన్నపిశుచిర్వాప్యశు చిర్వాపిలింగం సర్వత్రధారయేత్. లింగధారీసదాశుద్ధో నిజలింగంమనోరమం అర్చ యన్ గంధపుష్పాద్యైఃకరపీఠైస్సమాహితః, నిత్యానికర్మబృందాని తథానైమిత్తికానిచ శివార్పణధియాకుర్యాత్సమ్య జ్ఞానాభివృద్ధయే. కర్మణాజ్ఞానవాన్ భూత్వాజ్ఞానే నానందమాప్నుయాత్, జ్ఞానాదేవతుకైవల్యమితివేదవిదాంవరాః, అకృత్వావిహితం కర్మనిషిద్ధం పరివర్జయేత్. నిషిద్ధపరిహారేణ విహితే లభతేమతిం. తస్మాత్సర్వ ప్రయ త్నేన శివారాధనతత్పరః నిత్యంనైమిత్తికం కృత్వా కామ్యంకర్మసదాత్యజేత్. నకర్మ ణానప్రజయాధనేనచ సదైవహి అమృతత్వసువాప్నోతిత్యాగేనైకైనకేవలం, అవిద్యా పటలంఛేత్తుం సమర్థంకర్మచోదితం. కర్మణః పాశహేతుత్వాత్పాశాబంధన హేతవః, అవిరోధిత యాకర్మనా విద్యాంవినివర్తయేత్. విద్యావిద్యాం నిహం త్యేవతేజస్తిమిరసంఘవత్. అవిచ్ఛిన్నమివాజ్ఞానం తన్నాశేసతికేవలం స్వయం ప్రకా శతేలింగం మేఘాపాయేంశుమానివ. అజ్ఞానకలుషంజీవం జ్ఞానాభ్యాసాద్వినిర్మలం కృత్వాజ్ఞానంస్వయం నశ్యేజ్జలం కతకరేణువత్. సంసారస్వప్నతుల్యోహిరాగద్వేషాది సంకులః స్వకాలే సత్యవద్భాతి ప్రబోధేసత్యవద్భవేత్. తావత్సత్యం జగద్భాతిశుక్తి కారజతంయథా, యావన్నజాయతే లింగంసర్వాధిష్ఠానమద్వయం, సత్యేలింగేహ్యను స్యూతెనిత్యేలింగేప్రకల్పితాః శక్తయోవివిధాస్సర్వాహాటకేకటకాదివత్. నానో. పాధి వశాదేవనామజాత్యాశ్రమాదయః లింగేహ్యారోపితాస్తేయే రసవర్ణాదిభేదవ ఆచార్యలింగంప్రథమం గురులింగంద్వితీయకం శివలిగంతృతీయం స్యాచ్చరలింగం చతు ర్థకం ప్రసాదంపంచమంలింగం మహాలింగంతుషష్ఠకం. భక్తోమహేశ్వరశ్చైవ ప్రసాదీ ప్రాణలింగకః శరణైక్యంస్త వైషడ్భిః క్రమాల్లింగముదాహృతం. సహస్రారాంబుజ గతం చంద్రమండలమధ్యతః గురుంతన్మంత్రతోవాహ్యతద్వామాంకస్థశక్తికం. శుద్ధ స్ఫటికంసంకాశం శ్వేతవస్త్రధరంవరం తత్వప్రసూనమాల్యాదిభూషణైవ విభూషితం వరాభయకరధీరం త్రిణేత్రంకరుణానిధిం. పరమానందముదితం మందస్మితముఖాంబుజం ఏకలింగంత్రయం రూపంచరేష్టగురునామతః. షట్చక్రస్థానసంచారో జ్యోతీరూపో మహేశ్వరః. స్వయంభులింగం పరమంబాణలింగం చతుర్థకం. చిల్లింగం పంచమం

జ్ఞేయం షష్ఠమానందలింగకం జ్యోతిర్లింగం సప్తమంతు విజ్ఞేయం యోగిభిస్సదా. బిందు
స్వరూపామలమూలపీఠం నాదస్వరూపస్ఫురదూర్ధ్వపీఠం. కళాత్మతిర్యగ్గత గోముఖా
ఖ్యం చిద్రూపలింగం హృదయాబ్జసంస్థం. పుష్పాణ్యహింసేంద్రియ నిగ్రహశ్చదయాక్షు
మాజ్ఞానసమాహ్వయాని. ధ్యానంతపస్సత్యమయీభిరేవం ప్రపూజయేదాత్మనిషిద్ధ
లింగం. అతఏవమహాశ్చర్యం యోగమష్టాంగమాదరాత్. శివపూజాగమేతద్ధి తస్మా
దభ్యసనంచరేత్. నిరంతరకృతాభ్యా సాజ్జరామరణవర్జితః. సజీవేదిచ్ఛయాలోకేతతో
ముక్తిమవాప్నుయాత్. యమేననియమేనైవ మన్యేభక్త ఇతిస్వయం. స్థిరాసన సమా
యుక్తో మహేశ్వరపదాన్వితః. చరాచరలయస్థానం లింగమాకాశసజ్ఞకం. ప్రాణే
తద్వ్యోమ్నిసంలీనే ప్రాణలింగీభవేత్పుమాన్ ప్రత్యాహారేణ సంయుక్తః ప్రసాదీతి
సంశయః ధ్యానధారణసంయుక్త స్మరణస్థలవాన్ సుధీఃలింగైక్యోద్వైతభావాత్మనిశ్చల
శ్చసమాధినా. ఏవమష్టాంగయోగేన చిరజీవీభవేన్నరః. తస్మాత్సర్వప్రయత్నేన
కర్మణా జ్ఞానతోపివా. సదాచాష్టాంగమార్గేణ శివపూజాం సమభ్యసేత్ అంతర్లింగాను
సంధాన మాత్మవిద్యాపరిశ్రమః.గురూపాసనశక్తిశ్చ కారణం మోక్షసంపదాం వైరాగ్య
జ్ఞానయుక్తానాం యోగినాంస్థిరచేతసాం. అన్తర్లింగానుసంధానే శుచిర్బాహ్యేవ
జాయతే. తస్మాత్సర్వప్రయత్నేన గురుణాశాస్త్రవేదినా. అనుగ్రహేయయద్దత్తం తల్లిం
గంపూజయేత్సదా. మునేవక్ష్యే విశేషేణశృణులింగార్చనక్రమం. పూజోపచారవిధినా
షట్త్రింశద్భేదమీరితం. పూజాద్వాదశధాప్రోక్తా శివసిద్ధాంతతత్పరైః. ఉపచారా
స్తథాచైవ చతుర్వింశ ద్విధాస్మృతాః. విభూత్యభ్యుక్షణం లింగేకరణంస్నపస్యచ.
అంగారతాపనంచైవ భూతసంజీవనంతతః. ధూపప్రసారణంచైవ తతోగంధావతంసనం.
అక్షతారోపణంచైవ పుష్పోపహరణంతతః. దీపప్రకాశనంచైవ నైవేద్యాన్నసమర్పణం.
తాంబూలస్య ప్రదానంచవస్త్రప్రావరణంతతః.ఏవంద్వాదశధాప్రోక్తా శివలింగార్చన
క్రియా. ఆవాహనాసనార్ఘ్యానిపాద్యాచమనకంతతః.యజ్ఞోపవీతమాల్యానులేపనా భర
ణానిచ. ఛత్రంచచామరంచైవ తాలవృంతంచదర్పణం, ఘంటాంశంఖంచగీతంచవాద్యం
నృత్తంప్రదక్షిణం. నమస్కారస్తుతిర్ధ్యానం విజ్ఞప్తిస్తువిసర్జనం. ఇత్యేవముపచారాంశ్చ
చతుర్వింశద్విధాస్మృతాః. సమర్చనోపచారాణాం షట్త్రింశద్భేదభేదతః.షట్త్రింశత్త
త్త్వమయ్యేషా శైవీశ్రుతికీర్తిస్థితిః. అథార్చనోపచారాణాం యోగక్రమముదీర్యతే. భస్మ
స్నానాదిభిశ్శుద్ధికరణం విధివత్తతః. సంవిత్పంక్షారీమంత్రానుష్టానంతత ఆసనం కరాబ్జ
పీఠరూపేణ తతఆవాహనంపరం ఆనీయాసస్థలం లింగాత్ప్రవేశంతత్ప్రదానకం. విభూ
త్యభ్యుక్షణంనిత్యం సమన్త్రకమనన్తరం. అర్ఘ్యాద్యైశైవసామాన్యం తతస్నపనకర్మచ.
అంగారతాపనాదీని దశచోక్తానిపూర్వవత్. తతోయజ్ఞోపవీతాది విజ్ఞప్త్యంతాయథా
యథా.విసర్జనంకరస్థస్యలింగస్యాంగేనివేశనం. ఏవంలింగార్చనం యస్తుకురుతేభక్తిపూర్వ
కం. తస్యపుణ్యఫలంసమ్యగ్వక్తుంనాలంచతుర్ముఖః. లింగమధ్యేమహాదేవస్సాక్షా
న్నిత్యం వ్యవస్థితః. అనుగ్రహేయలోకానాంతస్మాల్లింగం ప్రపూజయేత్. లింగమధ్యే

జగత్సర్వం త్రైలోక్యం సచరాచరం. లింగవాహ్యాత్పరం నాస్తి తస్మాల్లింగం ప్రపూజయేత్. యోజాతునార్చయేల్లింగం నస్మరేన్న చ పూజయేత్. కిం తేనజాతమాత్రేణ భూభారేణాన్నశత్రుణా. జన్మకోటిసహస్రాణి నూకరాంతానియానిచ. సకృదభ్యర్చనాల్లింగే ముక్తస్సంసారబంధనాత్. సకృత్పూజయతే లింగం గర్భజన్మ నవిద్యతే. సతతంపూజయేద్యస్తు సయాతిపరమాంగతిం. అసమర్ప్య శివాయాథయోభుంక్తే పాపకృత్తమః. శ్వమాంసభక్షణంతావదనేన రచితం భవేత్. భుంజీయాద్రుద్రభుక్తంచ రుద్రవ్రతజలం పిబేత్. రుద్రాఘ్రాతం సదాజిఘ్రేదితి జాబాలికీ శ్రుతిః, ప్రోక్తం త్రియంబకేనైవ అశ్నీయాద్వేదవిత్తమః. యవిపాప్నా శివాయాథభుంక్ష్వానర్పితమేవతత్. వినేభుంక్ష్వేమ లోభుంక్ష్వే క్రిమిం భుంక్ష్వేతి వైద్విజాః. అధోగచ్ఛేదధోగచ్ఛేదిత్యాహ పరమాశ్రుతిః. నిర్మాల్యధారణాచ్ఛంభోస్సాలోక్యంలభతే నరః పాదోదకస్యపానేన సామీప్యం లభతే సదా. తత్ప్రసాదోపభోగేన సారూప్యం ప్రతిపద్యతే. శుద్ధే శివప్రసాదే చ శుచిత్వం నైవ భావయేత్. సోపి యాతి నరో ఘోరం నరకం కాలమక్షయం. సుప్రతిష్ఠితలింగే చ నయథా పూర్వభావనా. తథా శివప్రసాదస్య పూర్వనామ నసంస్మరేత్. ప్రసాదం ప్రత్యరూపేణ గురోర్మానుషభావనా. శివలింగే శిలాబుద్ధిస్సఖలు బ్రహ్మహా భవేత్. ఏవం దీక్షా ప్రకర్తవ్యా యావజ్జీవం ప్రతిజ్ఞయా త్రికాలమేకకాలంవా పూజయేత్పరమేశ్వరం. అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ యజ్ఞాశ్చ బహుదక్షిణాః శివలింగార్చనస్యైతే కోట్యంశేనాపినో సమాః సదాయజతి యజ్ఞేన సదాదానం ప్రయచ్ఛంతి. సదా వైవాయుభక్షశ్చ సకృదభ్యర్చయేచ్ఛివం, ఏకకాలం ద్వికాలంవా త్రికాలం నిత్యమేవవా. లింగేయస్య మనోలీనం లింగస్తుతిపరాచవాక్. లింగార్చనపరౌ హస్తౌ సరుద్రో నాత్ర సంశయః. గవాంకోటి ప్రయత్నేన విధిదత్తేన యత్ఫలం. లింగస్యైక పుష్పస్య సహస్రాంశనపూరయేత్” లింగపురాణమునకు ముఖ్యము లింగధారణము. అద్దాని కవయవభూతంబులగు దీక్షాలక్షణంబును లింగధారణ ఫలంబును పూజావిధియు మున్నగువానిని జెప్పు పై శ్లోకంబుల దీసివేయుటలో ముద్రాపకుల యాశయ మెట్టిదో చదువరులే యూహింతురుగాక.

నన్నయభట్టారకుడు మొదలు నేటివరకెందరో మహాకవులు జన్మించిరి. ఎన్నియో యితిహాసముల వ్రాసిరి. ఎన్నియో పురాణముల నాంధ్రీకరించిరి. ఎన్నియో ప్రబంధముల గల్పించిరి. కాని యెక్కరును నిట్టి మహోత్తమ మగు పురాణరాజమును భాషాంతరీకరించుటగాని యట్టి ప్రయత్నము గావించినట్లుగాని తెలియదు. “లింగపురాణము జెప్పిన పింగళి సూరన్న” యను వాక్యమువలనఁ గొందరీపురాణమును పింగళి సూరనార్యుడాంధ్రీకరించియుండునని తలఁతురు. అట్లయినచో సూరనార్యుని కృతులం దెందును లింగపురాణప్రశంసయైనను లేకుండునా? కవుల చరిత్రయందైన వ్రాయబడ కుండునా. కావున ఈగ్రంథ మింతవరకెవ్వరిచేతను వ్రాయబడియుంటలేదనియె జెప్ప

వచ్చును. లేక సూరనార్యకృతమైగాని తదితరరచితమైగాని యాంధ్రలింగపురాణ మెందైననుండినను నుండవచ్చును. ఇంతటి విశాలమగు దేశంబున నేమూల నేదికలదో యెట్లు దెలియను.

భగవచ్చరిత్ర మెందఱెన్నిగతుల వర్ణించినను కండచక్కెరపానకమువలె మధురముగ నేయుండును. ఉదాత్తనాయకప్రాప్తిచే గ్రంథమునకును బవిత్ర చరిత్రమువలన నాయకునకును గౌరవము గలుగుటయేగాక కవికిని కృతార్థతయగును. భక్తజన సులభుండగు మీనాక్షీమనోహరుడు సుందరేశ్వరుడు కృతినాయకుడుగను శ్రేయఃప్రాప్తికి మూలమై పదునాలుగుతరముల దరింపజేయగల లింగపురాణ మాంధ్రీకరింపదగినదిగను నుండ స్వల్పమైనను నాకావ్యము గౌరవాస్పదమే యగునని నేనీ కృతికిం గడంగితిని. ఈ గ్రంథ మాంధ్రభాషలో భాషాంతరీకరింపబడుటచే దీనికి "శ్రీమదాంధ్ర లింగ పురాణమను" పేరిడితిని. రసగ్రహణధురీణులగు పాఠకు లిందేవియేని ప్రమాదపతితంబులగు నెరసులున్న దోషైక దృక్కులుగాక సహృదయులై గుణమాత్ర స్వీకారంబున సంతృప్తి జెందుదురుగాతమని ప్రార్థించుచున్నాడను. శైవమతోద్ధారకులును నిరంతర శివపూజా పరాయణులును అద్వితీయ వేదాంత విద్యావిశారదులును మదీయ విద్యాగురువులును నగు బ్రహ్మశ్రీ పులిపాక మహానందీశ్వరశాస్త్రిగారును మహోపాధ్యాయ బిరుదాంకితులును నలంకార విద్యాగురువులును శైవరహస్యబోధినీ పత్రికాసంపాదకులును నగు బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారును నాకీ గ్రంథకరణమం దెక్కుడు ప్రోత్సాహ మొనర్చుటయేగాక వలసినంత సాయము గావించి యందులకు వారికెంతయు గృతజ్ఞుడను.

ఇట్లు పండితవిధేయుడు

విద్వాన్ పులుగు చంద్రమౌళిశాస్త్రి,

ఆంధ్రోపాధ్యాయుడు,

తాలూకాహైస్కూలు, తెనాలి.



శ్రీ మీనాక్ష్యైనమః.

# విషయసూచిక.




| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| ఇష్టదేవతాదిప్రశంసనము | 1 |
| లింగపురాణప్రశంస | 2 |
| కృతిభర్తృప్రశంస | 4 |
| షష్ట్యంతములు | 4 |
| నైమిశారణ్యవర్ణనము | ,, |
| నారదుడు నైమిశారణ్యమునకువచ్చుట | 6 |
| నైమిశీయులు సూతునితో లింగపురాణము జెప్పుమని యడుగుట | 7 |
| సూతుడు నైమిశీయులకు లింగపురాణము వినుచుట | |
| లింగపురాణాను క్రమణిక | 8 |
| ప్రాకృత ప్రాథమిక సర్గాదికథనము | 20 |
| కల్పాదికాలవిభాగ కథనము | 12 |
| సనకసనందనాద్యుత్పత్తి | 23 |
| వ్యాసరుద్రావతారకథనము | 25 |
| యోగలక్షణము | 27 |
| యోగాభ్యాస విఘ్నములు | 28 |
| యోగసిద్ధులు | 29 |
| ఈశ్వరప్రసాదాహ్వానాలు | ,, |
| సద్యోజాతోత్పత్తి | 20 |
| వామదేవోత్పత్తి | 22 |
| తత్పురుషోత్పత్తి | ,, |
| అఘోరోత్పత్తి | 22 |
| అఘోరమంత్రమహిమ | 23 |
| ఈశానోత్పత్తి | ,, |
| జ్యోతిర్లింగోత్పత్తి | 24 |
| బ్రహ్మవిష్ణులుపరస్పరాధిక్యంబుపలుకుట | 25 |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| ద్వితీయాశ్వాసము | |
| శివుడు దారుకావనముప్రవేశించుట | 28 |
| దారుకావనాంగనలు పరమేశునిగాంచి భ్రాంతచిత్తలగుట | 29 |
| దారుకావన మునులు శివునెఱుంగలేక పరుషంబు లాడుట | 30 |
| దారుకామునులకు బ్రహ్మదేవుండతిథిమహిమవినిపించుట | 31 |
| సుదర్శనోపాఖ్యానము | 33 |
| యముడు సుదర్శనుని బరీక్షించుట | 36 |
| బ్రహ్మదేవుడు దారుకామునులకు సన్న్యాసయోగము జెప్పుట | 40 |
| శ్వేతోపాఖ్యానము | ,, |
| శ్వేతయమ సంవాదము | 42 |
| బ్రహ్మదేవుడు దారుకామునులకు లింగపూజావిధి నెఱింగించుట | 47 |
| శివుడు దారుకామునులకు హితోపదేశము జేయుట | 49 |
| యోగిధర్మములు | 51 |
| క్షుపదధీచోపాఖ్యానము | 52 |
| దధీచి క్షుపునకు బ్రాహ్మణాధిక్యంబు జెప్పుట | 54 |
| దధీచి క్షుపుని కొట్టుట | 56 |
| శుక్రుడు దధీచికీశ్వరారాధన ముపదేశించుట | 57 |
| క్షుపుడు శ్రీహరిని వినుతించుట | 59 |

| విషయము. | పుట సంఖ్య. |
|---|---|
| క్షుపుడు విష్ణువుతో దధీచియొనర్చిన యవమానము జెప్పుట | 60 |
| దధీచి విష్ణువుతో సంభాషించుట | ,, |
| దధీచి బీరంబులకు నారాయణు డలుగుట | 63 |
| నారాయణుండు దధీచిపై చక్ర ప్రయోగించుట | 64 |
| నారాయణుండు దధీచిచే పరాజితుం డగుట | 65 |
| నారాయణుడు దధీచిని పొగడుట | 66 |
| తృతీయాశ్వాసము | |
| నందీశ్వరుడు సనత్కుమారునకు నిజచరిత్రము జెప్పుట | 70 |
| శిలాదుడు పుత్ర వాంఛ నింద్రుని గూర్చి తపము జేయుట | 71 |
| శిలాదుడయోనిజుడగు పుత్రు నిమ్మయింద్రుని గోరుట | ,, |
| యాచకలక్షణము | 72 |
| పద్మయోని యండయోని త్వాది కథనము | 74 |
| వైష్ణవ సృష్టి | 75 |
| యుగధర్మములు | ,, |
| కలియుగ ధర్మములు | 78 |
| పద్మయోని దేవీపుత్రు డగుట | 79 |
| శిలాదు డయోనిజు డగు పుత్రునికై విచారించుట | 81 |
| శివుడు శిలాదునకు బ్రసన్ను డగుట | 82 |
| బ్రహ్మదేవుడు శివునితో బ్రపంచ స్థితిని జెప్పుట | 85 |
| బ్రహ్మదేవు డీశ్వరుని బ్రపంచమున ధర్మ రక్షకై యవతరింపు మని ప్రార్థించుట | 89 |
| నందికేశ్వర ప్రాదుర్భావము | 90 |
| శిలాదుడు నందీశ్వరుని గొనియాడుట | 91 |
| నందికేశ్వర జాతకర్మాది కరణము | 92 |
| మిత్రావీరు ణులునందీశ్వరుగాంచ వచ్చుట | 93 |
| శివుడు నందీశ్వరునకు వరము మొసగుట | 95 |
| పంచన దప్రభావము | 97 |
| జప్యేశ్వర మాహాత్మ్యము | 98 |
| శివుడు పార్వతితో నందీశ్వరుని ప్రమ థాధి పతిని జేయుదునని జెప్పుట | ,, |
| నందికేశ్వర పట్టాభిషేకము | 100 |
| నందికేశ్వర వివాహము | 105 |
| పాతాళాది లోకంబులు | 108 |
| ద్వీపేశ్వర కథనము | ,, |
| భారతవర్ష వర్ణనము | 110 |
| భరతుడు పుడమి పాలించుట | 111 |
| మేరుపర్వతాది వర్ణనము | ,, |
| నవవర్షాది వర్ణనము | 115 |
| భువనవిన్యాసోద్దేశస్థాన వర్ణనము | 116 |
| దేవకూటాది పర్వతస్థశంకరాలయాది వర్ణనము | 118 |
| నవవర్షానువృత్త వర్ణాయు ర్భోజనాది కథనము | 119 |
| ప్లక్షాదిసిపస్థ పర్వతకథనము | 121 |
| చతుర్థాశ్వాసము. | |
| ధ్రువోపాఖ్యానము | 123 |

| విషయము | పుట సంఖ్య. |
|---|---|
| ఉత్తానపాదుని పరిపాలనము | 124 |
| ఉత్తానపాదుడు కొలువుండుట | 128 |
| ధ్రువుడు తండ్రికడ కేగుట | ,, |
| సురుచి ధ్రువుని పరిభవించుట | 129 |
| ధ్రువుడు సురుచితో సంభాషించుట | 130 |
| సునీతి ధ్రువుడు రాక తడయుటచేఁ జింతించుట | 131 |
| సునీతి ధ్రువునితో హరిని సేవింపుమని చెప్పుట | 132 |
| ధ్రువుడు తపోవనమున కేగుట | 134 |
| విశ్వామిత్రుడు ధ్రువునాదరించుట | 136 |
| ధ్రువుడు తపము గావించుట | 137 |
| సునీతి రూపంబున పిశాచము ధ్రువుని వంచింపదలచుట | 138 |
| శ్రీమన్నారాయణుడు ధ్రువునకు ధ్రువస్థానమిచ్చుట | 140 |
| దేవదానవాద్యుత్పత్తి | ,, |
| శక్త్యాఖ్యవసిష్ఠ సుతోపాఖ్యానము | 143 |
| పరాశరుఁడీశ్వరానుగ్రహమున మృతులైన పితృతాదుల బ్రదికించుట | 145 |

పంచమాశ్వాసము

| విషయము | పుట సంఖ్య. |
|---|---|
| సూర్యవంశవర్ణనము | 148 |
| చంద్రవంశవర్ణనము | 154 |
| యయాతిచరిత్రము | 156 |
| యయాతి పౌరజనసంవాదము | 157 |
| యదువంశాదివర్ణనము | 160 |
| త్రిపురాసురోపాఖ్యానము | 161 |
| పరమేశ్వరుడు త్రిపురాసురులకు వరములొసగుట | 161 |
| త్రిపురాసుర భాధితులగు వేల్పుల నారాయణుఁడాదరించుట | 165 |
| త్రిపురాసురుల ధర్మవిఘ్నంబునకై విష్ణువు మాయాపురుషుని సృష్టించుట | 166 |
| శివుడు త్రిపురాసురులవధించుట | 168 |
| బ్రహ్మాదులుత్రిపురారిని స్తుతించుట | 169 |
| బ్రహ్మదేవుడు విష్ణ్వాదులకు లింగార్చనా వశ్యకత్వము జెప్పుట | ,, |
| లింగభేదములు | 170 |
| తత్తల్లింగఫలములు | 171 |
| ఈశ్వర సగుణత్వకథనము | ,, |
| ఉమామహేశ్వరవ్రతము | 171 |
| శారదాచరిత్రము | 173 |
| మునిమోహశమనము | 179 |
| అణిమాది గుణప్రాప్తికథనము | 180 |
| శౌచాచారాదిలక్షణము | ,, |
| మృతచిహ్నములు | 181 |

షష్ఠాశ్వాసము.

| విషయము | పుట సంఖ్య. |
|---|---|
| అంధక గాణపత్య ప్రదానకథనము | 183 |
| అంధకచరిత్రము | ,, |
| వరాహరూప విష్ణుకృత హిరణ్యాక్షవధ | 187 |
| యజ్ఞవరాహమూర్తి హిరణ్యాక్షరుధిరపానంబున మత్తుఁడై జగముల గలంచుట | 197 |

| విషయము | పుట సంఖ్య. | విషయము | పుట సంఖ్య. |
|---|---|---|---|


యజ్ఞవరాహ కృతబాధకోర్వక సురలు వగచుట 198
సురలీశ్వరునితో యజ్ఞవరాహ కృత బాధల జెప్పుట ,,
ఈశ్వరుడు యజ్ఞవరాహంబునకు నీతి నుపదేశించుట 201
యజ్ఞవరాహ మీశ్వరుదిస్కరించుట ,,
విష్ణువు శంకరుని ప్రార్థించుట 202
శివుడు యజ్ఞవరాహ దంష్ట్రిఁదాల్చుట ,,
దితిసంతానార్థము కశ్యపుని వేడుట 205
దితిదుష్టసంతానప్రాప్తిగూర్చి చింతించుట 209
బ్రహ్మదేవుడు సురలకు హిరణ్యాక్ష హిరణ్యకశ్యపుల జన్మప్రకారము జెప్పుట 212
సనకాదులు జయవిజయులకు శాప మిచ్చుట 223
హిరణ్యాక్ష హిరణ్యకశ్యపుల జననము 228
హిరణ్యకశ్యపుడు హిరణ్యాక్షుని మృతికై వగచుట 220
హిరణ్యకశ్యపుడు బ్రహ్మను స్తుతించుట 222
బ్రహ్మదేవుడు హిరణ్యకశ్యపునకు వరములిచ్చుట 224
ప్రహ్లాదచరిత్రము 225
ప్రహ్లాదుని విద్యాభ్యాసము 228
ప్రహ్లాదుని వైరాగ్యము 231
హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదుని బరీక్షించుట 222
ప్రహ్లాదుడు హిరణ్యకశ్యపునకు విష్ణు ప్రభావము జెప్పుట 231
హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదుని నిందించుట 232
హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదుని దండించుట 235
ప్రహ్లాదుడు భగవంతుని స్తుతించుట 236
నృసింహావిర్భావము 238
నృసింహమూర్తి హిరణ్యకశ్యపుని వధించుట ,,
దేవతలు నృసింహదేవుని స్తుతించుట 239
దేవతలు నృసింహోత్కటకోర్వక యీశ్వరునితో మొరవెట్టుట 240
శరభావతారఘట్టము 242
వీరభద్రుడు నృసింహమూర్తికి నీతిగరపుట 242
నృసింహమూర్తి వీరభద్రుని దిరస్కరించుట 243
నృసింహుండు శరభతేజంబున జితుండగుట 245
నృసింహు డీశ్వరుని స్తుతించుట 246
దేవేంద్రుడు శివుని పూజింపగోరి కైలాసమునకేగుట 249
ఇంద్రుడు ప్రమథునిపై గినియుట 251
పరమేశ్వరు డింద్రునిపై ఫాలనేత్రము దెరచుట 252
శివనేత్రాగ్నిజలపతనంబున జలంధరుడుదయించుట 254
వరుణుడు జలంధరుని గొనిపోవుట 255

| విషయము | పుట సంఖ్య. |
|---|---|
| బ్రహ్మదేవుడువరుణుని గాంచబోవుట | 256 |
| బ్రహ్మదేవుడు వరుణునితో జలంధరుండు రాక్షసుడని చెప్పుట | 258 |
| జలంధరుండు జాలంధరంబునేలుట | ,, |
| జలంధరుండు దిగ్జయంబు గావించుట | 261 |
| నారాయణుండు జలంధరునితోఁబోరి విజితుండగుట | 264 |
| బృంద జలంధరునితో శివమహిమ జెప్పుట | 267 |
| జలంధరుండు శివునిపై దండెత్తుట | 268 |
| పరమేశ్వరువాక్యంబులకు జలంధరుండు గినియుట | 269 |
| దేవతలు దానవబాధకోర్వక నారాయణుని జేరుట | 270 |
| నారాయణుడు శివారాధనము గావించుట | 272 |
| శివుడు నారాయణునకు చక్రమిచ్చుట | 273 |
| దేవీసంభవకథనము | 273 |
| దక్షుండీశ్వరు ద్వేషించుట | 274 |
| దక్షుడు శివుని గాదని యజ్ఞము జేయుట | 276 |
| దాక్షాయణి దక్షుయజ్ఞము జూడనరుగుట | 278 |
| దక్షుడు శివునిదూరుట | ,, |
| వీరభద్రావిర్భావము | 279 |
| వీరభద్రుండు దక్షు యజ్ఞధ్వంసము జేయుట | 281 |
| నారాయణుడు వీరభద్రునిచే విజితుడగుట | 282 |
| ఇంద్రాదులు తారకుని బాధలకోర్వక బృహస్పతి కడకేగుట | 284 |
| బృహస్పతి యింద్రాదుల బ్రహ్మకడకు గొనిపోవుట | 284 |
| ఇంద్రాదులు పార్వతీ పరమేశ్వర యోగఘటనకై మన్మధునంపుట | 286 |

శ్రీ మీనాక్ష్యైనమః.

# విషయసూచిక


| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| పార్వతీదేవి తపముజేయుట | 1 |
| బ్రహ్మదేవుడు పార్వతీదేవినిదర్శించుట | 2 |
| పార్వతీదేవిబ్రహ్మతోసంభాషించుట | 3 |
| శివుడుతపముజేయుగౌరిని గాంచనరుగుట | 5 |
| పార్వతి పరమేశ్వరు స్తుతించుట | 7 |
| శివుడుపార్వతిచే ఆతిథ్యముగొనుట | 8 |
| శివుడు పార్వతితో తపముమానుమని చెప్పుట | ,, |
| పార్వతిశివునితో తన నిజతత్వము చెప్పుట | 10 |
| శివుడు పార్వతికి వరమిచ్చుట | 11 |
| హిమవంతుడు పార్వతి వియోగంబున విచార మొందుట | ,, |
| పార్వతిహిమవంతుని కడకుబోవుట | 13 |
| పార్వతి మేనకతో శివునిప్రభావము గూర్చి చెప్పుట | 14 |
| హిమవంతుడు పార్వతి వివాహ ప్రయత్నములు చేయుట | 15 |
| దేవకాంతలు పార్వతిని పెండ్లికూతుం జేయుట | 17 |
| శివుడు బాలుడై పార్వతి తొడలపై నాడుట | 19 |
| కపటబాలుడగు నీశ్వరు దండింప బోయి వేల్పులు పరిభవింపబడుట | 20 |
| కపటబాలుండీశ్వరుడని యెరిగి బ్రహ్మాదులు స్తుతించుట | 22 |
| ఈశ్వరుడు బ్రహ్మాదులకు విశ్వరూపము జూపుట | 24 |
| బ్రహ్మదేవుడు శివునితో గార్హ పత్యము గొనుమని వేడుట | 25 |
| శివుని వివాహ దర్శనంబునకై నానావిధ దేవతలు వచ్చుట | 27 |
| ప్రమథగణములీశ్వరునకు కానుకలు దెచ్చుట | ,, |
| శివుడు వివాహమంటపము సమీపించుట | 28 |
| పౌరకాంతలు శివునిజూచుట | 29 |
| బ్రహ్మదేవుడు విష్ణువుతో శివమహి జెప్పుట | 31 |
| విష్ణువు శివపాదప్రక్షాళనంబుజేయుట | 32 |
| బ్రహ్మదేవుడీశ్వరునిచే నగ్నికార్యము జేయించుట | 34 |
| శివుడు పార్వతీసహితుడై కాశికరుగుట | 35 |
| మేనక పార్వతి వియోగంబునకై విచారించుట | 36 |
| పార్వతి మేనకకు కన్యాధర్మము జెప్పుట | 37 |
| హిమవంతుడీశ్వరుని ప్రార్థించుట | 38 |
| పరమేశ్వరుడు మహిమవంతు నూరడించుట | 39 |
| మేనక గౌరికిబుద్ధుల గఱపుట | ,, |
| శివుడుమార్గమందలి చిత్రంబులపార్వతికి జెప్పుట | 43 |
| అగస్త్యుడీశ్వర దర్శనమునకైతహతహపడుట | 44 |
| అగస్త్యుడీశ్వరుని గాంచుట | 45 |
| పార్వతి శివుని కాశీపుర మహిమ జెప్పుమని యడుగుట | 46 |
| వారణాశీ మాహాత్మ్యము | 47 |

| విషయము. | పుట. సంఖ్య. |
|---|---|
| శివుడు దేవోద్యానంబున పార్వతితో విహరించుట | 48 |
| అవిముక్త క్షేత్రమహిమ | 49 |
| మణికర్ణికా ప్రభావము | 50 |
| గోప్రేక్షక క్షేత్రమహిమ | 52 |
| సంగర క్షేత్రమహిమ | 53 |
| శుక్రేశ్వర మహిమ | ,, |
| శివుడునిజసాత్వికమూర్తులసృష్టించుట | 54 |
| సూతుడు మునులకు గజాననోత్పత్తి విధంబెఱిగించుట | 57 |
| బ్రహ్మాదులీశ్వరుని స్తుతించుట | 58 |
| విష్ణుమూర్తి రాక్షసుల దుండగము లీశ్వరునితో జెప్పుట | 60 |
| శివుడు సురల నూరార్చుట | 62 |
| గజాననావిర్భావము | 63 |
| దేవతలు గజాననుని నుతించుట | 64 |
| గజానను డీశ్వరుని నుతించుట | 65 |
| శివుడు గజాననునకు గణాధిపత్యం బొసంగుట | ,, |
| సంధ్యాకాల వర్ణనము | 67 |
| పరమేశ్వరుడు తాండవము జేయుట | ,, |
| దారుకాసుర చరిత్రము | 68 |
| దారుకుడు లోకంబుల బాధించుట | 69 |
| దారుకుని బాధల కోర్వక వేల్పులు బృహస్పతిని జేరుట | 70 |
| బ్రహ్మదేవుడమరుల శివుకడకు గొని పోవుట | 71 |
| శివుడు దారుకాసుర సంహారంబునకై పార్వతిని నియోగించుట | 72 |
| పార్వతి కాళికా రూపము వహించుట | 74 |
| కాళిక దారుకు నెదిరించుట | 75 |
| దారుకుడు కాళితో బీరములాడుట | ,, |
| దారుకుని వాక్యంబులకు కాళి కోపించుట | 76 |
| దారుకుడు కాళికతో యుద్ధము జేయుట | ,, |
| కాళిక రాక్షససైన్యంబును దునుముట | 78 |
| కాళిక లోకము బాధించుట | 79 |
| శివుడు కాళికా దేవిని శాంతింపజేయ భైరవునంపుట | ,, |
| ఉపమన్యు చరిత్రము | 80 |
| ఉపమన్యుడు తపము జేయుట | 83 |
| శివుడుపమన్యుని బరీక్షించుటకై దేవేంద్ర రూపమున బ్రత్యక్షమగుట | 85 |
| ఉపమన్యుడు కుహనా దేవేంద్రుని నుతించుట | 86 |
| ఉపమన్యుడు కుహనా దేవేంద్రునకు శివప్రభావంబు జెప్పుట | 87 |
| ఉపమన్యున కీశ్వరుడు ప్రత్యక్షమగుట | 88 |
| ఉపమన్యుడు శివుని నుతించుట | ,, |
| శివుడుపమన్యునకు గాణపత్యంబిడుట | 89 |
| అంబరీషుడు మార్కండేయాశ్రమమున కేగుట | 92 |
| మార్కండేయు డంబరీషునకు కాశికోపాఖ్యానము జెప్పుట | 93 |
| కాశికుడు విష్ణుభక్తి ప్రసిద్ధుడగుట | 94 |
| కళింగాధిపతి కాశికాదుల నవమానించుట | 99 |
| బ్రహ్మదేవుడు కాశికాదుల గౌరవించుట | 100 |
| శ్రీవిష్ణువు కాశికాదులకు యథోచిత వరములిచ్చుట | 102 |
| తుంబురుడు వైకుంఠమునకు వచ్చుట | 103 |

విషయము. పుట. సంఖ్య.


| విషయము. | పుట. సంఖ్య. |
|---|---|
| గానమహిమ | 106 |
| నారదుడు గానబంధువను నులూకమును దర్శించుట | 107 |
| రాజపురుషులు హరిమిత్రుని బంధించుట | 111 |
| భువనేశ్వరుడు హరిమిత్రుని దండించుట | 112 |
| హరిమిత్రుడు భువనేశ్వరునకు బరమేశ్వరునాధిక్యము జెప్పుట | ,, |
| భువనేశ్వరు డంతకునితో సంభాషించుట | 115 |
| భువనేశ్వరుడు యమాజ్ఞ నులూకయోనిబుట్టుట | 116 |
| శ్రీహరి నారదుని గానమున కసంతృప్తి జూపుట | 118 |
| శ్రీకృష్ణుడు నారదుని గానము బరీక్షించుట | 121 |
| శ్రీకృష్ణుడు నారదుని గానవిద్యావిశారదుని జేయుట | 125 |
| భక్తిస్వరూపము | 123 |
| శివభక్తలక్షణము | 127 |
| విష్ణుభక్తలక్షణము | 129 |
| అంబరీషోపాఖ్యానము | 130 |
| పద్మావతి భర్తతో స్వప్నవృత్తాంతము జెప్పుట | 131 |
| అంబరీషుని జననము | 136 |
| అంబరీషుడు తపము జేయుట | 139 |
| శ్రీ విష్ణువంబరీషునకు బ్రత్యక్షమగుట | 140 |
| అంబరీషుని కడకు నారదుడరుదెంచుట | 144 |
| నారదుం డంబరీషునితో గార్హపత్యప్రాముఖ్యంబు జెప్పుట | 145 |
| పర్వతుడను ముని యంబరీషుని కడ కరుదెంచుట | 149 |
| శ్రీమతి విష్ణువు పాణిగ్రహణంబు జేయుట | 150 |
| జ్యేష్ఠాదేవి చరిత్రము | 161 |
| మార్కండేయుడు దుస్సహునకు శుభాశుభ ప్రదేశంబుల జెప్పుట | 163 |
| అలక్ష్మీస్థానంబులు | 164 |
| దుష్టస్త్రీలక్షణము | 168 |
| అష్టాక్షర మంత్రమహిమ | 171 |
| ద్వాదశాక్షరీ ప్రభావము | 172 |
| పంచాక్షర మహిమ | 178 |
| దౌంధుమూకోపాఖ్యానము | 179 |
| దౌంధుమూకుండు వేశ్యగూడుట | 182 |
| దౌంధుమూకుం డంగిరోమునితో నిజవృత్తాంతము జెప్పుట | 183 |
| కళావత్యుపాఖ్యానము | 186 |
| కళావతి దశరధునితో పంచాక్షరీ మంత్రము జపించుమని చెప్పుట | 191 |
| కళావతి వజ్రబాహునకు సూర్యశర్మ చరిత్ర జెప్పుట | 194 |
| మానదుడు సూర్యశర్మని సాధింప బూనుట | 195 |
| అంగిరోముని దౌంధుమూకునకు రుద్రాక్షమహిమ జెప్పుట | 205 |
| రుద్రాక్షోత్పత్తి | 206 |
| రుద్రాక్షమహిమ | 207 |
| సగంగుడు సుప్రతీపుని పరిభవింప బూనుట | 222 |
| జామిత్రోపాఖ్యానము | 222 |
| సుప్రతీపుడు సాలంకునకు శాంతోపాఖ్యానము జెప్పుట | 224 |

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|
| శాంతుడు కాళికా బలికై విక్రయింప బడుట | 226 |
| అంగిరసుఁడు దౌంధుమూకునకు విభూతి మహిమ జెప్పుట | 230 |
| పాశుపత వ్రత మాహాత్మ్యము | 237 |
| నందీశ్వరుడు సనత్కుమారునకు పాశుపత వ్రతమహిమ జెప్పుట | 238 |
| భక్తి భేదములు | 239 |
| పార్వతీ పరమేశ్వరుల విభూతి మహిమ | 242 |
| ఈశ్వర స్వరూపములు | 244 |
| ఈశ్వర మహిమ | 245 |
| పంచ బ్రహ్మను కథనము | 246 |
| శివమాహాత్మ్యము | 247 |
| శివపూజావిధి | 250 |
| గురుశిష్య లక్షణము | 253 |
| శివపూజాక్రమము | 256 |
| సౌరస్నానవిధి | 265 |
| అఘోరార్చన విధి | 264 |
| హోమ ద్రవ్య విశేషవిధి | 273 |
| అభిచారిక విశేషవిధి | 272 |
| వజ్రవాహినీ విద్య | |
| వజ్రవానీ విద్యావినియోగ క్రమము | 276 |
| త్రియంబక మంత్రవినియోగవిధి | 277 |
| ఈశ్వర ధ్యాన క్రమము | 278 |
| ఫలశ్రుతి | 280 |

శ్రీ మీనాక్ష్యై నమః

# శ్రీ మదాంధ్ర లింగ పురాణము.

## పూర్వ భాగము.

### ప్రథమాశ్వాసము.

### ఇష్టదేవతాది ప్రశంసనము

ఉ॥ శ్రీలకు వాసమైనది య♦శేష చరాచర లోక సృష్టికిన్
జాలినదై జగత్త్రితయ♦శాసనకర్తృతఁ దాల్చి పాండ్య భూ
పాలమనస్సరోజదళ♦భానుసహస్రమునై మదీయ భ
ద్రాళికిఁ గారణంబయిన♦యాదిమ తత్త్వము నాశ్రయించెదన్.

సీ॥ తనపాండ్యరాజసు♦తాత్వంబునకు సాక్షి, యలమధురాధిప♦త్యంబొకండు
తనపంచభూతాత్మ♦తకు సాక్షి క్షణమాత్ర, నిర్మితాఖిలలోక♦నికర మొకఁడు
తన భక్తవాత్సల్య♦మునకు సాక్షి యజస్ర, వర్ధమానాస్మద్వి♦భవమొకండు
తనదైత్యనాశక♦త్వంబునకున్ సాక్షి, సంహృతాశేష దు♦ష్టతతియొండు
గాఁగ సకలంబునకుఁ దాన♦కర్త్రియగుచు, సుందరేశ్వరు నర్ధాంగ♦మందుఁ జెలఁగు
మధుర మీనాక్షియెప్పుడు మా♦మక హృదబ్జ,రాజమున వసియించి భ♦ద్రముల నొసఁగు.

మ॥ తలిదండ్రుల్ తొడపైని జేర్చుకొని య♦త్యంతానురాగంబుమై
నలరన్ జెక్కుల నొక్కరొక్కటిగ నా♦స్యంబెత్తి ముద్దాడు వే
ళల నవ్వారి ముఖద్వయంబొకటి స♦ల్పన్ గోరి యాత్మాననం
బు లలిన్ వెక్కసులాగు విఘ్నపతి మమ్మున్♦బ్రోఁచు నశ్రాంతమున్.

ఉ॥ పాప భయంబు వీడి తమ♦వారి కనిష్టమొనర్చుచున్ సభన్
ద్రౌపది కట్టు పుట్టముల♦రాల్చ పరాభవమున్ బొనర్చ నా
పాపుల ద్రుళ్ళడంచి శ్రిత♦వత్సలతన్ సతిఁగాఁచి నట్టియా
గోపకుమారుఁడెల్లపుడుఁ♦గోరిన కోర్కెలు మాకొసంగుతన్.

సీ॥ జనకుఁడాయన్యజీ♦వన రక్షకుండునై, యలరారుచుండు ర♦త్నాకరుండు
అవరజుండౌ నిధి♦లాదితేయానీక, సంతర్పణకరుండు♦శశధరుండు
హృదయేశుఁడా జగ♦త్సృష్టిస్థితిలయంబు, లకుఁ గర్తయైన పూ♦నికి గలాఁడు
తనయుఁడౌ లోకమో♦హనకార్యకరణశ, క్తాత్ముఁడై తనరు పు♦ష్పాయుధుండు
తల్లియా సురవృద్ధునా♦దరము మీఱఁ, గాంచి గుజ్జెనగూళ్ళఁ ది♦న్పించు తల్లి
గాఁగ నాశ్రితులకుఁ గల్ప♦కంబునగుచు, నెసఁగు శ్రీదేవి మాయింటఁ♦బొసఁగుఁ గాత.

మ॥ తనకృత్యంబు నిరంతరంబఖిల భూ♦తవ్రాతమై సృష్టికా
ర్య నిరూఢస్థితినాత్మ కౌశలము న♦వ్యాజంబుగా జాట వే

దని యంతృత్వముఁ దానఁబూనిన జగ ♦ ద్వంద్యుండు వాణీధవుం
డనుకంపామతి మాకొసంగుతను స ♦ ర్వార్థాయురారోగ్యముల్.

చ॥ వినయ నతోత్తమాంగులయి ♦ విఘ్నులజస్రము భక్తి భావముల్
దనరఁగ నేసతీమణి ప ♦ దంబుల మ్రొక్కుచు నుందురట్టి పా
వననిరవద్య హృద్య గుణ ♦ భాసిత నప్పరమేష్ఠిరాణి వా
ణిని వికచాబ్జపాణిని వి ♦ నీలసువేణినిఁబ్రస్తుతించెదన్.

మ॥ ప్రళయాభీల కృశాను కీలములకున్ ♦ బ్రత్యర్థియై దక్షయా
గలతాతీక్ష్ణ లవిత్రమై విమతశి ♦ క్షాదక్ష కౌక్షేయకో
జ్వలమై నీలపయోద సన్నిభమునై ♦ భ్రాజద్భుజాటోప ని
స్తులమై యొప్పెడి వీరభద్రు విలస ♦ ద్రూపంబు ధ్యానించెదన్.

ఉ॥ కల్లజగంబునిత్యమని ♦ కాలుని తత్వమొకింతయేని దా
యల్లమునం దెలుంగక ని ♦ జోచితకృత్యము వీడి పాపులై
తల్లడమందు నజ్ఞులను ♦ దాన తరింపఁగఁ జేయునెవ్వఁడా
యల్లమ దేవుఁ డాధ్యుఁడు మ ♦ హాత్ముఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

చ॥ అసమ శరారిభక్తులకు ♦ నాశ్రయుఁడౌటను సర్వపాతక
పరిసరము బూదిఁజేసి శివ ♦ భక్తిమహీజముఁ బాదుకొల్పి య
గ్రసరుఁడనన్ బ్రసిద్ధుఁడయి ♦ రాజిలు నేసుగుణాభిరాముఁడా
బసవఁడు మాయెడన్ విమల ♦ భావమునన్ జరియించుఁ గావుతన్.

మ॥ తనపాండిత్యము దేవతా గురునిపై ♦ దండెత్తఁగాఁజాలు నూ
తనభక్తిన్ దనరారుచుండఁ దనవా ♦ త్సల్యంబుశిష్య ప్రశి
ష్యనికాయంబున కద్భుతంబయిన వి ♦ ద్యాపూర్తిఁగల్గింపఁగా
ఘనుఁడై భైరవమూర్తి సద్గురుఁడు ద ♦ క్షత్వంబు మాకీవుతన్.

సీ॥ పసితనంబున నె య ♦ ద్వైతవాదులఁ బూర్వ, పక్షంబొనర్చిన ♦ పండితుండు
శ్రీగిరీంద్రంబునఁ ♦ జేరి యిరువదేండ్లు, తపమొనరించిన ♦ తపసిపున్న
శంఖంబుఁ బూరించి ♦ శార్దూల శతిఁబాఱఁ, ద్రోలనేర్చినయిందరి ♦ జాలికుండు
భస్మంబుపైఁజల్లి ♦ పరిబల భూతప్రేత, సంతతి నడచిన ♦ శక్తిపరుఁడు
వ్యాసహృదయం బెఱింగి య♦వ్యాజభక్తి, వెలయు శ్రీకంఠ భాష్య టీ♦కికనొసగ్న
సిద్ధవీరయ దేశికుం ♦ డిద్ధచరితుఁ, డతని యడుగులు మాకు సే ♦ వ్యంబులెపుడు.

మ॥ పదలాలిత్యము నర్థ గౌరవము శుం ♦ భద్భావ వైచిత్ర్యముల్
హృదయాహ్లాదకరంబులై తనరు స ♦ త్కృతుల్ విపశ్చిన్ముదా
స్పదముల్ వృత్తులు నేరసజ్ఞకవితా ♦ సౌశీల్యముల్ దెల్పు నా
సదయాత్ముండగు ముగ్గుపాపయమనీ ♦ పావంతుఁ బ్రార్థించెదన్.

శా॥ నానామేయపురాణకర్త నిఖిలా ♦ మ్నాయార్థవేద్యుండు బ్రి
హ్మానందాధి పదాభిషిక్తుఁడు జగ ♦ ద్వ్యామోహశూన్యుండు వ్యా
సో నారాయణయంచు శాస్త్రచయమే ♦ సుశ్లోకుఁ గీర్తించు నా
మౌని శ్రేష్ఠుఁ బరాశరాత్మజుని సం ♦ భావింతు సత్రాంతమున్

తే॥ ఎవరి కెలుకపడక ♦ యెసఁగు ఛందోమయ, వాగమృతమె వాని ♦ వదన సరసి
జంబునుండి వెడలె ♦ సాధుచరిత్రుఁడా, పుట్టకొడుకు మాకుఁ బూజ్యుఁడెపుడు.

సీ॥ జిలిబిలి పలుకులఁ ♦ బలుకనేర్చుట మొద, లే కవికావ్యంబు ♦ శేబతింతు
చిలుకతల్ పరులకుఁ ♦ జెప్పనేర్చుట మొద, లే సుధీవరు కథ ♦ లే వచింతు
మెల్ల మెల్లన మాట ♦ లల్ల నేర్చుట మొద, లే రసజ్ఞునిపక్కి ♦ నే గ్రహింతుఁ
గరములజోడింపఁ ♦ గలుగనేర్చుట మొద, లే దాసునియుపాస్య ♦ నే భజింతు
"సజ్జభపురాణిచేద్వమే♦వాహ"మనుచుఁ, జెప్పబడినాఁడు కవికుల ♦ శేఖరుండు
కాళిదాస సుకవియతఁ ♦ డోలిమాకుఁ, జెలఁగి యొసఁగెడు గాల ని ♦ శ్రేయసముల.

సీ॥ పరమతాచార్యులఁ ♦ బ్రతిఘటించి జయించి, శివవిశిష్టాద్వైత ♦ మవని నిల్పె
నమలకార్తిక గ ♦ ణారాధ్యవ్రిత మొనర్చి, శిష్టులనెల్ల సం ♦ తృప్తిఁజేసె
ధాత్రిపాళికి బ్రహ్మ ♦ సంబంధమున్ దెల్పి, త్రిభువనారాధ్యుఁడై ప్రథగణించె
సాంగవేద చతుష్ట ♦ యాధ్యయన మొనర్చి, వైదికాచారవి ♦ భ్రాజియయ్యె
ప్రిబల కౌండిన్య గోత్రిసం ♦ భవతఁ జెందినములుగు కొలమును పావనం ♦ బుగనొనర్చె
నతఁడు మాకన్న తండ్రి బు ♦ ధాగ్రసరుఁడు, నందనారాధ్యగురుని ధ్యా ♦ నంబొనర్తు.

తే॥ చన్నబసవన్న కలఁ జెప్పి ♦ మున్నెమంచి, కైసరుండనఁబరగిన ♦ ఘనుఁడతండు
ప్రథితమతి యత్తలూరు పా ♦ పయమనీషి, మామకీన చరిత్రంబు ♦ మనుచుఁగాఁత.

సీ॥ గసవత్రిప్రబంధ ని ♦ ర్మాణ ధీనిధిపాల, కురికిసోమేశ్వర ♦ కోవిదుండు
ప్రత్యర్థినుదనాగ ♦ పంచాస్యమష్ట, భాషాకవిముఖ్యు బ ♦ సవగురుండు
బసవపురాణాది ♦ పటుకావ్యరచయిత, పరశక్తి పిడుపర్తి ♦ బసవసుకవి
శైవరహస్య సం ♦ భావితచిత్తుండు, సరసుండు ముదిగొండ ♦ శంకరుండు
కాశినాథను లాబ్ధిరా ♦ కాశశాంకుఁ,డీశసముఁడు బ్రహ్మయలింగ ♦ దేశికుండు
మొదలుగాఁగల యారాధ్య ♦ మూర్తులెల్ల, వందనీయులు మాకు క ♦ పద్యతతికి.

తే॥ మఱియు నెవ్వారిపాత్తముల్ ♦గలుచుకతనఁగబ్బమును జెప్పఁగల తెల్వి♦గలిగెఁ గాండు
బాసలను గైత సెప్పు నా ♦ పండితులకు వందనంబొనరింతు నా ♦ నందమతిని.

చ॥ శ్రవణవిదారకంబులు వ ♦ చస్సులు చిత్తము వక్రగామి క
న్గనవిషపూరితంబు పర ♦ కార్యవినాశన హేతువుల్ పనుల్
కవిజనులుండు దేశములు ♦ కంటకతుల్యములై తనర్చు దు
ష్కృతులకు వారి వెగ్గినియఁ ♦ గా ఫలమించుకయేని కల్గునే.

# శ్రీమదాంధ్ర లింగపురాణము.

## —* లింగపురాణప్రశంస *—

ఉ॥ పండితులుల్లసిల్ల నొక ♦ పద్యము వ్రాయుటె కష్టమందురం
దొండును రెండుగాక తగ ♦ నొక్కపురాణము వ్రాయు కష్టమె
ట్లుండునొ దానినెల్లఁ దమ ♦ యూహకుఁ జేర్చి రసంబు గ్రోలి తా
రుండక దోషముల్ నెమకు ♦ చుండినవారల నేమనం దగున్.

చ॥ అనఘము నిర్వికల్పకము ♦ నైనది లింగపురాణ మేడ నే
నెనఁగున వ్రాయు టేడ గణు ♦ తింపక దుస్తరమంచు సాగరం
బును సొరకాయ బుర్రఁ గొని ♦ పూన్కి నిదాఁటఁ దలంచినట్టుల
య్యెను జగదీశుఁ డేకరణి ♦ నియ్యెడ సాయముఁ జేయఁ బూనునో.

చ॥ అరసికులందు వ్యర్థమగు ♦ నైనను విజ్ఞజనైకచిత్త వి
స్ఫురణముఁ జేయ నేర్చుఁ బొరి ♦ వోవక లింగపురాణ మెల్లెడన్
దరుణికటాక్షపాతములు ♦ దారకులన్ దనియింపకుండినన్
సరసుల స్వాంతముల్ దవిలి ♦ జాణతనంబు వహింపకుండునే.

వ॥ అని యిష్టదేవతా వందనంబును, కుకవి తిరస్కారంబును బ్రస్తుత పురాణ ప్రశంసయుఁ గావించి భూతభవిష్యద్వర్తమానకాలిక, పండిత పామర శ్రావ్యంబగు లింగ పురాణంబు నవ్య ప్రకారంబున నాంధ్రీకరింపఁ బూని,

## —* కృతిభర్తృప్రశంస *—

చ॥ వినయము లేని విద్య బుధ ♦ బృందము చేరఁగరాని గోష్ఠి యౌ
వనము నెఱుంగనట్టి చెలి ♦ వైరము లేని రణోద్యమంబు కాం
చనరహితంబు జన్మ జల ♦ జంబులు లేని కొలంకు సద్గుణుం
డినుఁడు లభించనట్టి కృతి ♦ యెన్నటికిన్ వృథయే తలంపఁగన్.

సీ॥ పదియాఱు పుటములఁ ♦ బడిన బంగారున, కలరుకమ్మని తావి ♦ గలిగినట్లు
తొలుకారు మబ్బులో ♦ పలమించు మించున, కిలనిశ్చలత్వంబు ♦ చెలఁగినట్లు
రెంటి నొంటిగఁ జేయు ♦ దంటకింతనరాక, యెసఁగు రూపం బావ ♦ హిల్లినట్లు
క్రొత్తజవ్వనమున ♦ గొనబాఱు కన్నెకు, పీసమంతయు సిగ్గు ♦ వీడినట్లు
దోషరహితయు సద్గుణ ♦ భూషితయును, సహృదయాహ్లాదకరయగు ♦ సాధుకావ్య
కన్యకకుఁ దగు నాథుండు ♦ గలిగెనేని, కర్తహృదయంబునకు హాళి ♦ గలుగకున్నే.

సీ. ఖలతాసుమాళికై ♦ కరములఁ జాచి చూ, పఱులు నవ్వఁగ భంగ ♦ పడినయట్లు
శశవిషాణంబు నా ♦ సక్తినై జరలాడి, వనమున నాయాస ♦ పడినయట్లు
సైకతంబునఁ దిల ♦ సారంబు యత్నించి, తనను లోనిందించు ♦ కొనినయట్లు
పెలుచ మరీచికా ♦ జలములు ద్రావంగ, వరిగి పరాభవ ♦ ముండినట్లు

గోముఖవ్యాఘ్రములఁ బ్రభు ♦ నామకులను, నమ్మి చిరమగుకావ్య ర ♦ త్నమ్ము నొసఁగి
నిమిషసుఖముల నన్నిటి ♦ నిత్యములని, చతురుఁడుంగాని కవిచెడు ♦ సంతతంబు.

వ॥ కావున నాచంద్రార్కస్థాయిస్థమై నాలుగు పురుషార్థముల కాలయమై యలరు నీకావ్యకన్యకునాయకుం డెవ్వఁడర్హుఁడగునని యనేక విధంబులఁజింతించుచు.

సీ॥ పదునాల్గుభువనముల్ ♦ పరితపింపఁగఁజేసి, మించువిషంబు ♦ భక్షించెనెవ్వఁ
డనివారిత ప్రవా ♦ హగఁదనర్చెడిగంగఁ, దీసికేశముల బం ♦ ధించెనెవఁడు
మునికుమారుని ప్రాణ ♦ ములఁగొనయత్నించు, యముని శూలంబున ♦ నడచెనెవఁడు
దివిజులపాలి ♦ మృత్యువులుగఁ బుట్టిన, తిగకొట్టికలను మ ♦ ర్దించెనెవ్వఁ
డలరు నర్థాంగమందు మా ♦ నాక్షిఁదాల్చి, నిత్యసుఖములఁ జెంచెడి ♦ నిపుణుఁడెవ్వఁ
డట్టి శ్రీసుందరేశ్వరుఁ ♦ డపుడు నాదు, స్మృతిపథమునకువిచ్చేయు ♦ డతిముదమున.

సీ॥ అంబకంబులకుఁ గా ♦ నంబడు నీచరా, చరలోకమును సృష్టి ♦ సలిపెనెవ్వఁ
డెచ్చోటఁగనుఁగొన్న ♦ నచ్చోటఁదానయై, కనుపట్టునట్టి శం ♦ కరుఁడెవండు
గుటివెట్టి కన్నము ♦ గ్గురుగ నొక్కండుగ, స్మృతిమార్గమునఁజేరు ♦ చతురుఁడెవ్వఁ
డేనునీవనిపల్కు ♦ నెల్లవిజ్ఞానుల, హృదయాంతరంబుల ♦ నెసఁగునెవ్వఁ
డష్టమూర్తులఁదాల్చి య ♦ నాదిమధ్య, చరముఁడైయొప్పు నెవ్వాఁడు ♦ సంతతంబు
నట్టివేల్పుల వేలుప ♦ వగుదుగాదె ♦ జగముఁగన్నయ్య మాయయ్య ♦ శంకరయ్య.

వ॥ అని యద్దేవదేవు ననేకవిధముల స్తుతించి.

తే॥ అర్థి వెదకఁగఁబోయిన ♦ యట్టితీవె, కాళ్లకుఁజుట్టుకొనినట్టి ♦ కరణి నస్మ
దీయకృతిఁగొను భర్తకై ♦ వేయుగతులఁ జింతిలుచునుండ నీవేల్పు ♦ స్మృతికివచ్చె.

వ॥ అని యపరిమితానంద భరితాంతరంగుఁడనై.

—* షష్ఠ్యంతములు. *—

క॥ ప్రణతార్తి ప్రశమనునకు, నణిమాద్యైశ్వర్యయుతున ♦ కస్మత్కృతిభూ
షణునకు భక్తాంబుజ దిన, మణికి నిఖిల శుభదునకు ను ♦ మానాథునకున్.

క॥ మీనాక్షీ హృదయేశున, కానందమయునకుఁ బోషి ♦ తాశ్రితునకు నా
నానిగమ గోచరునకుఁ బ్ర, సూనాయుధసంహారునకు ♦ సోమేశునకున్.

క॥ వరకౌండిన్యస గోత్రా, భరణాయిత నందికేశ ♦ పాణితల లస
ద్గురులింగరూపిక మరే, శ్వరనుతునకు సుందరేశ ♦ పరమేశునకున్.

వ॥ సమర్పణంబుగ నాయొనర్పన్ బూనిన శ్రీమదాంధ్ర లింగపురాణంబునకుఁగథా క్రమం బెట్టిదనిన.

—* నైమిశారణ్య వర్ణనము. *—

సీ॥ పరిణతఫలవిన ♦ మ్రరుచిరశాఖాస, మాలంకృతోర్వీరు ♦ హాస్పదంబు.
వికసత్కుసుమసౌర ♦ భకలితవిజు ...బు, వివిధలతా పరి ♦ వేష్టితంబు

విచలద్విశిరచంచు ♦ పిగళత్ఫల రసార్ద్రి, విమలవితర్దికా ♦ విస్తృతంబు
సంభ్రమద్రాజహం ♦ ససమాగమాలోల, వరటాలలత్సరో ♦ భ్రాజితంబు
సాంగవేదచతుష్ట యా ♦ ధ్యయననిరత, మునికుమారక గమనా గ ♦ మనపథశ్ర
మాపనోదన చతుర మం ♦ దానిల ప్ర, పుణ్యదేశంబు నైమిశా ♦ రణ్యమలరు.

వ॥ అమ్మహావిపినంబున

సీ॥ ఒకవంక సింహశా ♦ బకములు లేడిపి, ల్లలకు దర్భాంకురం ♦ బులనొసంగు
నొకమూలఁ దపసితో ♦ డునులుకొమ్ములతోడఁ, బులులకండూయనం ♦ బులనుమాన్పు
నొకచాయ గున్నలే ♦ నికలు పంచాననం, బులకుఁ దొండములెత్తి ♦ జలములిచ్చు
నొకయోరఁ జంపక ♦ ప్రకరంబు మధుపాంగ ♦ నలకు మరందపా ♦ నంబుఁగూర్చు
నొకయెడ బిడాలములు చుంచు ♦ లకుఁ బ్రియంబుఁ గఱపు వేయేలనప్పుణ్య ♦ కాననము ప
రస్పరవిరుద్ధములునగు ♦ ప్రాణితతికి, మమతఁ గల్గించు సత్తపో ♦ మహిమకలిమి.॥

తే॥ అమ్మహాకాననమునయం ♦ దాశ్రమంబుఁ జేసికొని శౌనకాది ఋ ♦ షిప్రకరము
సంతతము నిత్యకృత్యావ ♦ సానసమయములఁ బురాణశ్రవణము స ♦ ల్పుచుండు వేడ్క.

వ॥ ఇట్లుండ నొక్కనాఁ డిసుండు రాగంబు మెయిఁ బశ్చిమాంగనా సమాలింగన సౌఖ్యం
బుఁగోరివోలె యస్తగిరి శృంగంబలంకరించియున్నెడ.

—* నారదుఁడు నైమిశారణ్యమునకు వచ్చుట *—

సీ॥ శైలేశ్వరంబున ♦ స్వర్లీనమునసంగ, మేశ్వరంబునను వ్యా ♦ ఘ్రేశ్వరమున
నవిముక్తమునను మ ♦ హాలయంబందున, శుక్రేశ్వరమునఁ బా ♦ శుపతమందు
గోమాయుకంబున ♦ గోప్రత్యకంబున, రౌద్రంబునందు హి ♦ రణ్యగర్భ
మునను గేదారమం ♦ దున త్రివిష్టపమున, నీశానమునను జం ♦ ద్రేశ్వరమున
భక్తవత్సలునద్రి జా ♦ ప్రాణకాంతు ♦ భక్తిలతయంకురింప న ♦ ప్పద్మయోని
యంకసంభవుఁడగు నార ♦ దర్షి కొలిచి, శౌనకాదులఁ గనుఁగొను ♦ సంతసమున.

సీ॥ బాలార్కకోటి ప్ర ♦ భా భాసురంబులై, నిడుదపెన్నేరిగుంపు ♦ జడలు వెలయ
శాంతమై బ్రహ్మతే ♦ జముమూర్తిఁ దాల్చిన ♦ రీతిమోమున భస్మ ♦ రేఖలలర
వన్నెచీరనజాళు ♦ వాటంగులీ నెడు, నట్టిదేహమున రు ♦ ద్రాక్షలెసఁగఁ
గటిభాగమున బిగఁ ♦ గట్టిన పసిదిండి, తోలుమీఁగాళ్లపై ♦ తూలియాడ
లాలితస్ఫటికాక్షమా ♦ లాపవిత్రి, తాంగుళీధూత మహతీస్వ ♦ రానుషక్త
మంజులాత్మీయ కంఠ ని ♦ ర్మలనినాద, మాశలఁ జెలంగవచ్చె న ♦ య్యాశ్రమంబు.

ఉ॥ వచ్చిన దేవమౌనిఁ గని ♦ వారనిభక్తి నమస్కరించి తా
రచ్చటిమౌనులెల్లసము ♦ దంచితులై తగు కాంచనాసనం
బిచ్చి తదీయదర్శన స ♦ మేధితహర్ష పరీతచిత్తులై
యచ్చుపడంగనున్న జల ♦ జాసనుసూనుఁడు వారికిట్లనున్.

తే॥ తిరుగఁదగినట్టి దేశముల్ • తిరిగితిరిగి, చూడఁదగుచిత్రంబులగుచోట్లఁ • జూచిచూచి
చేయఁగలిగిన కార్యముల్ చేసిచేసి, లింగమాహాత్మ్యమాత్మ నె • ఱుంగఁగోరి.

వ॥ సకలపురాణేతిహాస శ్రవణనిర్ధూతపాపులైన భవాదృశులగు తాపసోత్తములు సంస్మృతిక్లేశాపనోదకంబగు కథాప్రసంగంబునకుఁదగిన నెలవులగుటంజేసియుఁ జరాచర ప్రపంచనిర్మాతయగు పరమేశ్వరుమహిమ వినుటయత్యంతావశ్యంబగు కతనను నేతత్పుణ్యాశ్రమంబునకు రానవసరంబు ప్రాప్తించెనను నెడ.

శా॥ ఆలోనన్ జనుదెంచెనచ్చటికి ధ • ర్మాధర్మనిర్ణేతృతా
శీలుం డార్జితపుణ్యసంచయుఁడు శ్వ • శ్రేయఃకృదుత్తుంగవి
ద్యాలోలాత్ముఁడు రౌమహర్షణి పురా • ణానీకముల్ నైమిశీ
యాళిన్ గూర్చి వచించుకోర్కెమెయి స • త్యానందసంధానతన్.

తే॥ అటులనరుగుదెంచు • వ్యాసశిష్యునిఁగాంచి, హర్షపులకితాంగు • లగుచునచటి
మౌనులెల్ల రుచిత • మర్యాదలాచరించి, యతనితోడనిట్టు • లనిరి వేడ్క.

—* నైమిశీయులు సూతునితో లింగపురాణము, జెప్పుమనియడుగుట *—

మ॥ ప్రియశిష్యుండవు శక్తిపౌత్రునకు సం • ప్రీతిన్ బురాణార్థ సం
చయమెల్లప్పుడు నీకతండుఁగడు వా • త్సల్యంబునన్ జెప్ప సం
శయమెచ్చోటను నీకుఁగల్గవిల వా • చాప్రౌఢిఁ జూపింతువో
నయవేదీ! కృతివన్న నీవకద పు • ణ్యంబన్న నీదే కదా?.

ఉ॥ నీవలనన్ బురాణము ల • నేకములన్ వినినార మాదర
ప్లావితశాత్ముఁడైన పుర • శాసనుసత్కథలెన్నివిన్నఁ జే
తో విభవాకరంబులయి • తో, చెడుఁగాని యొకింతయున్ మనీ
షావిలకారణంబులగు • నా సుధఁద్రాగుట యొగ్గుగూర్చునా?.

తే॥ లింగమాహాత్మ్యసంహితా • లీనహృదయుఁ, డైయరుగుదెంచెనిటకు దే • వర్షితల్ల
జుండు నారదముని భవ • త్సూక్తిముక్తి, దంబుగావున విన్పింపఁ దగునుమాకు.

చ॥ అనుటయు సూతమౌని దర • హాసముమోమునఁ జెంగలింప ని
ట్లను మునివర్యులార! సక • లార్థవిదుల్ మిమువంటివారలుం
గనిదొకఁ డెందుగల్గుఁ గర • కంఠుమహత్త్వము వేయునోళ్లఁ జె
ప్పినను గొంతయౌనె విని • పించునెలాతికతల్ శ్రుతిద్వయిన్.

ఉ. తజ్జ్ఞజనైకసేవ్యముని • తాంతగిరీశ సమర్చనాక్రియా
భిజ్ఞముదాపహంబు భవ • పీడితమాదృశభక్తతారకం
బజ్ఞదురూహ మార్యనుత • మట్టిద లింగపురాణమొక్క యం
బ్రాజ్ఞుఁడు జెప్పుటన్న నుడు • పంబున సంద్రము దాఁటుటేగదా?.

తే॥ అయిన నన్నొక పెద్దఁగ • నాత్మఁదలఁచి, యడిగితిరిమీరు బ్రహ్మణ్యు • లైనవారు
మీకుఁగాదని పలుకుట • మేలుగామి, యగుట వినిచెదఁదెలిసిన • యంతనిపుడు.

చ॥ అని యొక రెప్పపాటు హృద • యంబుఁ జలింపఁగనీకభక్తియున్
వినయము సంభ్రమంబును వి • వేకము ధైర్యముఁ జెంగలింపఁగాఁ
దనగురుఁడైన వ్యాసుని ప • దంబులఁ జిత్తమునందునిల్పి యి
ట్లని స్తుతియించె వేదవిహి • తార్థయుతంబుగ నద్రిజాధవున్.

సీ. నీకతనన్ బుట్టు • నిఖిలలోకంబుల, గములునీలోఁస్థితిఁ • గాంచుచుండు
నీయంద లీనమౌ • వాయుకపంచభూ, తంబులు నీయాజ్ఞ • యందె చెందు
బ్రహ్మ విష్ణ్వాది ని • ర్జరులైన నీనిజ, తత్త్వంబుఁ దెలియ నిం • తయునుజాల
రాదిమధ్యాంత శూ • న్యత్వంబునన్ జేసి, యిట్టిఁడవని నిన్ను • నెఱుఁగరాదు
కాలరూపంబు నీవ యు • గంబులీవ, యజ్ఞమూర్తివినీవ వే • దాంతమీవ
ప్రణవమీవ శబ్ద బ్రహ్మ • భాసకుండ, వీవదిక్కులు వర్షంబు • లీవగిరిశ.

ఉ॥ నీ కను రెప్పపాటున • జనించును లోకములెల్ల భౌతికం
బైకనుపట్టు నీ జగము • నంతయుఁ బ్రోచుచునుందువీవమా
యాకలిత ప్రపంచము య • గాఁతమునన్ నశియింపఁజేసి నీ
వేకదయొక్కరుండవయి • వెల్గుచునుందువు నిర్మలాత్మకా!.

తే॥ స్థూలములయందు మిక్కిలి • స్థూలమగుచు, సూక్ష్మములలోన నత్యంత • సూక్ష్మ
మగుచుఁ
బండితులచేతఁ జూడంగఁ • బడెడినీదు, దివ్యరూపంబు ధ్యానింతు • దేవదేవ!

తే॥ అని యనేకవిధంబుల • నప్రమేయుఁ డభవుఁడాద్యుఁడు నిర్గుణుం • డవ్యయుఁడు
చిత్స్వరూపుండయిన పర • శివునుతించి, పలుకు నిట్లని మంజుల ఫక్కిదనర.

—* సూతుడు నైమిశీయులకు లింగపురాణము వినుచుట *—

సీ॥ వఱలు నీశాన క • ల్ప ప్రవృత్తిన్ గూర్చి చతురాస్యుఁడగు పద్మ • సంభవుఁడు
రచియించి లింగపు • రాణంబుగణుతింపఁ గోటిమైన పురాణ • కోటి నెల్ల
ద్వాపరాదులయందుఁ • దగురీతిగాఁ బదు నెనిమిది విధముల • నెనయఁజేసె
శతకోటి వృత్త విస్తరములౌనవ్వాని సాత్యవతేయుఁడు • సంగ్రహించి
నాల్గులక్షలుగాఁజేసి • నాఁడు దొంతనందు నేకాదశంబునై • యలరు లైంగ్య
మవనినేకాదశ సహస్ర • మై తనర్చు శివపురాణంబులందున • శ్రేష్ఠమగుచు.

—* లింగపురాణానుక్రమణిక *—

వ॥ ఇమ్మహాపురాణంబు ప్రాకృత వికృత ప్రాథమికసర్గంబును బ్రహ్మాండ సంభూతియు,నండముయొక్క యావరణాష్టకంబును, రజోగుణ సమాశ్రయంబున నీశ్వరాండోద్భవత్వంబును, విష్ణుత్వంబును కాలరుద్రంబును నాపోశయనంబును ప్రజాపతి

సర్గంబును, పృథివ్యుద్ధరణంబును, బ్రహ్మయొక్క దివారాత్రంబులును, నాయు
గణనంబును బ్రహ్మ యజ్ఞముగావించుటయు వాని యుగకల్పంబును దివ్యమాను
షార్షవైధ్రావ్యవర్షణంబును పిత్ర్యంబును పితృసంభూతియు నాశ్రమి ధర్మంబును
జగత్తుయొక్క యభివృద్ధియు దేవి వలనశక్త్యుద్భవంబును స్త్రీపుంభావంబునువిరించి
సర్గంబును మిథున సంభవంబును రోదనాంతరకథితంబగు రుద్రాభిదానాష్టకంబును
బ్రహ్మ విష్ణు వివాదంబును పునర్లింగసంభవంబును, శిలాదతపశ్చరణంబును
వృత్రారిదర్శనంబును నయోనిజప్రార్థనయుఁదత్సుతదుర్లభత్వంబును, శిలా
దశక్రసంవాదంబును పద్మయోనిత్వంబును, కలియుగంబున నాచార్య శిష్యులు
భగవద్దర్శనంబు గావించుటయు వ్యాసావతారంబులును కల్పమన్వంతరంబులును
ఆఖ్యాభేదంబులందు కల్పములయొక్క కల్పత్వంబును, కల్పేషుకల్పంబు ననువారా
హంబునను హరియొక్క మహాత్వంబును మేఘవాహన కల్పవృత్తాంతంబును,
రుద్రగౌరవంబును ఋషిమధ్యంబున రుద్రునియొక్క పునర్లింగోద్భవంబును లింగా
రాధనంబును స్నాన విధానంబును శౌచలక్షణంబును, వారాణసీమాహాత్మ్యంబును,
తత్క్షేత్రమహాత్మ్య వర్ణనంబును, హరిహరాలయసంఖ్యయు, బ్రహ్మాండాంతరిక్షంబులం
దలి దేవాయతనవర్ణనంబును దక్షపతనంబును స్వారోచిషమన్వంతరంబున దక్ష
శాపంబును, తచ్ఛాప మోక్షంబును, కైలాసవర్ణనంబును, పాశుపతయోగంబును,
చతుర్యుగ ప్రమాణంబును, యుగధర్మంబును, సన్ధ్యాంశక ప్రమాణంబును, భవుని
సంధ్యావృత్తంబును, శ్మశాన నిలయంబును, చంద్రరేఖా సముద్భవంబును, శంకరో
ద్వాహంబును పుత్రోత్పాదనంబును, అతిమైథున ప్రసంగంబున జగద్వినాశంబును,
దేవతలకు సత్యాకృతంబగు శాపంబును, విష్ణు పరిపాలనంబును, రుద్రుని శుక్రోత్స
ర్గంబును, గాంగేయోద్భవంబును, గ్రహణ స్నానఫలంబును, క్షుబ్దధీచివివాదంబును,
ఇంద్ర దధీచివివాదంబును, నందికేశ్వరోత్పత్తియు, పతివ్రతాఖ్యానంబును, పశు
పాశవిచారణయు, ప్రవృత్తి నివృత్తిలక్షణ జ్ఞానంబును, వసిష్ఠ తనయోత్పత్తియు,
వాశిష్ఠవంశ విస్తారంబును, రాజశక్తి వినాశనంబును, కౌశిక దౌరాత్మ్యంబును,
సురభి బంధనంబును, వసిష్ఠ సుతశోకంబును, నరుంధతీ ప్రలాపంబును, స్నుషాప్రేష
ణంబును, పరాశరావతారంబును, వ్యాసశుకావతారంబును, శక్తిపుత్రుండు రాక్షస
వినాశంబు గావింపఁదలంచుటయు, దేవతా పరమార్థంబును విజ్ఞానంబును,
పురాణ కరణంబును, భువన ప్రమాణంబును, గ్రహజ్యోతిర్గతియు జీవచ్ఛ్రాద్ధ
విధానంబును, శ్రాద్ధాహారంబును, శ్రాద్ధంబును, నాంది శ్రాద్ధవిధానంబును, నధ్య
యనలక్షణంబును, పంచయజ్ఞప్రభావంబును, పంచయజ్ఞ విధానంబును, రజస్వలా
వృత్తియు, పుత్రవిశిష్టత్వంబును, తత్తద్వర్ణోచిత మైథునంబును, సకలవర్ణోచిత
భోజ్యాభోజ్యవర్ణనంబును, ప్రాయశ్చిత్త విధానంబును, నరకస్వరూపంబును, కర్మాను
రూపదండంబును, స్వర్గనారక జన్మాంతర చిహ్నంబును, నానావిధదానంబులును,
శ్వేతరాజపురంబును, పంచాక్షరీ కల్పంబును, రుద్రమహాత్మ్యంబును, వృత్రేంద్ర
మహాయుద్ధంబును, విశ్వరూప విమర్దనంబును, శ్వేతమృత్యు సంవాదంబును,

శ్వేతార్థకాలనాశంబును, శివుండు దేవదారువనము ప్రవేశించుటయు సుదర్శనో పాఖ్యానంబును, క్రమసన్న్యాస లక్షణంబును, బ్రహ్మదేవుండు శ్రద్ధాసాధ్యుండు రుద్రుండని చెప్పుటయు, మధుకైటభులచే విభుని పురాహూతగతియు, విష్ణువు యొక్క మీనావతారంబును, హరిసర్వావస్థలును జననంబును, రుద్ర ప్రసాదంబున విష్ణు జిష్ణుల సంభవంబును, కూర్మావతారంబును, సంకర్షణోత్పత్తియు, కాశికీపునర్భవంబును, యదుసంభూతియు, విష్ణు యాదవత్వంబును, భోజరాజ దౌరాత్మ్యంబును, కృష్ణ బాల్యక్రీడయు, హరి పుత్రార్థము శంకరార్చన గావించుటయు, నారదోత్పత్తియు, భూభార నిగ్రహంబునకై హరి యీశ్వరార్చన గావించుటయు, పృథువు భూమికి దోహదంబు గావించుటయు, భృగుమహర్షి విష్ణువును శపించుటయు, కృష్ణుడు ద్వారకయందుండుటయు, దుర్వాసుండు హరిని శపించుటయు, పిండారవాసులు వృష్ణ్యంధకుల శపించుటయు, ఏరకతోమరోత్పత్తియు, వృష్ణి విగ్రహంబును యాదవకుల సంహారంబును, జాలంధరవధయు, విష్ణువరాయుధప్రాప్తియు, హరిపితామహశక్రుల ప్రభావానుభావంబును, పరమేశ్వర ప్రభావంబును, శివలోకవర్ణనంబును, భూగత రుద్రలోకవర్ణనంబును, పాతాళమందలిహాటకేశ్వరవర్ణనంబును, తపోలక్షణంబును, ద్విజవైభవంబును సర్వమూర్తులకన్న లింగమూర్తి యధికంబనుటయు మొదలగు విషయంబులవర్ణించు నూటతొమ్మిదధ్యాయంబులుగల పూర్వభాగమును నేబదియైదధ్యాయంబులుగలయుత్తర భాగంబును నను రెండుభాగంబులచే విలసిల్లుచు నేకాదశ సహస్రగ్రంథసంఖ్యగలిగి యీశానకల్పవృత్తాంతము నుద్దేశించి వ్రాయఁబడియె.

—* ప్రాకృత ప్రాథమిక సర్గాదికథనము. *—

తే॥ ఎవని కరుణవలన ♦ నెల్ల పురాణసారమును గ్రోలఁగలిగి ♦ తమలచరితు
నతని వ్యాసమౌని ♦ నాత్మఁదలంచి భజింతుఁ గార్యసిద్ధి ♦ గాంతునిపుడు.

చ॥ అనివచియించి సూతుఁడు మ ♦ హర్షులఁగన్గొని పల్కెనిట్లు లో
మునివరులార వ్యాసుఁడు త ♦ పోనిధియమ్మహితాత్ము సత్కృపన్
గనుగొనఁగల్గి తించుకయ ♦ గాధమునైన పురాణసాగరం
బున భవభక్తియన్ సుధను ♦ బూనికఁ గ్రోలుఁడు మీకొసంగెదన్.

సీ॥ హరుఁడ లింగుఁడు నా ♦ నలరునవ్యక్తంబు, లింగంబు నాఁగబో ♦ సంగుచుండు
మఱియు నా లింగంబు♦మహిఁ బ్రధానమనఁ బ్రకృతియన నొప్పు సం♦గతమమించి
గంధవర్ణరసాది ♦ కరహితమగుచు శబ్దస్పర్శసుఖవర్జిత ♦ తమయియగుణ
మక్షయమై శివ ♦ లక్షణంబగు నలింగంబు వినుతిఁగాంచు ♦ ద్యూతలమున

గంధవర్ణ రసంబులు ♦ గలిగి శబ్దమును మఱియు నొప్పునా స్పర్శ ♦ యను మొదలగు
లక్షణంబులుగలిగి స్థూ ♦ లమును సూక్ష్మమగుచు బ్రకృతి వెలయుననిశ్యామ్యులఁద్రు.

తే॥ అరయఁగ జగత్తునకు యోని ♦ యై జగత్స్వరూపమగుచు నలింగని ♦ రూపితమయి
లింగ మలరారు ననుచు నె ♦ ఱుంగవలయు ప్రాజ్ఞులై చరియించెడి ♦ పండితులకు.

తే॥ ఏడువిధములుగను ♦ నెనిమిది రీతులఁ బదునొకండు గతులఁ ♦ బరఁగులింగ
మిల నలింగ మాయ ♦ సంగతివ్యాపించు ననుచుఁ బల్కుదురు మ ♦ హాత్ము లెపుడు.

తే॥ వానివలనఁ బ్రధాన దే ♦ వత్రయంబుగలిగె నందొక్క దేవుని ♦ కారణమున
నుదయమగు విశ్వమెల్ల వే♦ రొకని కతన వృద్ధియగు వేరొకండు ల♦యింపఁజేయు.

వ॥ అలింగంబును లింగంబును లింగాలింగమూర్తులును దగునట్లు జెప్పంబడు. జగంబు స్వయం బ్రహ్మయగు. అలింగియు భగవంతుండునగు బీజియే పరమేశ్వరుండు. జగత్కారణంబగు ప్రకృతి యోనియనియు బీజంబనియు నిర్బీజంబనియు నెఱుంగునది. బీజయోని ప్రధానంబుల కాత్మయను నామంబుగలదు.

సీ॥ పరమాత్మయును ముని ♦ బ్రహ్మయు నిత్య బుద్ధుండును మఱియు శు♦ద్ధుండునైన
రుద్రుండె శివుఁడని ♦ రూపించును బురాణ సంతతి శివునిచే ♦ సరగదృష్ట
యగుచుఁ బ్రకృతి శైవియయ్యె సర్గాది నా ప్రకృతి గుణములచే ♦ భాసిలుచును
తొలుతస్వభావంబు ♦ తోడ నవ్యక్తమై యలరె నవ్యక్తాది ♦ యై విశేష

చరమమగ విశ్వమెల్లను ♦ జరుగుచుండు నా ప్రకృతి విశ్వధాత్రి నా ♦ నజయనంగ
శైవినాఁబడు నిర్మల ♦ స్వాంతులైన బుధజనంబులచేత నె ♦ ప్పుడు ధరిత్రి.

వ॥ అజయు లోహితయు శుక్లయుఁ గృష్ణయు నేకయు బహుప్రజయు జనిత్రియు నిజరూపిణియు నగు నా ప్రకృతి నొకండు జుషమాణుండై యనుసరించును. మఱియొక్కండు భుక్తశేషయగు ప్రకృతిని విడుచును. జగజ్జనిత్రియగు నా ప్రకృతినే వేరొకండజుండధిష్ఠించియుండు. సృష్టికాలంబునఁ బురుషాధిష్ఠితయగు ప్రధానము యొక్క గుణంబులచే నజాజ్ఞావలన మహత్తు జనించి సృష్టించు నిచ్ఛచే నవ్యయంబగు నవ్యక్తంబునఁజేరి తనతో వ్యక్తంబగు సృష్టిగావించు. మహత్తువలన రజోధికంబును త్రిగుణయుతంబును నగు నహంకారంబును, నహంకారంబువలన శబ్దతన్మాత్రంబును, దానివలన శబ్దకారణంబగు నాకాశంబును, దానివలన స్పర్శతన్మాత్రంబును దానివలన వాయువును వాయువువలన రూపతన్మాత్రంబును దానివలన నగ్నియును, నగ్నివలన రసతన్మాత్రంబులును వానివలన జలంబులును, వానివలన గంధ తన్మాత్రంబును దానివలనఁబృథివియును బృథివివలన నోషధులును, వానివలన నన్నంబును, నన్నంబువలనఁ బురుషుండును క్రమంబుగ నుదయించె. అందుఁ బృథివియందైదు గుణంబులును, జలంబులందు నాలుగు గుణంబులును, నగ్నియందు మూఁడుగుణంబులును, వాయువునందు రెండుగుణంబులును, నాకాశంబున నొక్క గుణంబును నుండు. వైకారికంబును, సాత్వికంబును, నగు సర్గం బేకకాలంబున నె గలుగుచుండు...

దులగ్రహించుటకు మన స్సభయాత్మకమైయుండు. మహదాది విశేషాంతంబులగు భూతంబు లండజనకంబులైయుండు. జలబుద్బుదములట్టు లయ్యండమువలనఁ బితామహుండగు శివుండవతరించె. అతండె విష్ణుండును రుద్రుండునగు. ఈలోకంబు లెల్ల నయ్యండంబునందె యుండు. అండము నీటిచేత పదిరెట్లుగ నావరింపబడియుండు. ఆపోదశగుణంబుగ దేజస్సును, తేజోదశగుణంబుగ వాయువును, వాయుదశగుణంబుగ నాకసంబును వెలయు. అహంకార సంభూతమగు నాకాశముచే వాయువావరింపఁ బడియుండు. ఆకాశము మహత్తుచే నావరింప బడియుండు. సప్తాండావరణంబుల కాత్మ కమలాసనుఁడు. కోటికోట్ల యుతింబునగు నండంబులుగల వందొక్కొక్క దానఁ జతుర్వదనులగు బ్రహ్మలును హరిహరులును బ్రధానముచే సృష్టింపఁబడి యీశ్వర సన్నిధిజేరుచుందురు. సృష్టిస్థితిలయంబుల కాదికర్త మహేశ్వరుండు. ఇదియె ప్రాకృత ప్రాథమిక సర్గాది కథనమింకఁగాల విభాగంబు గూర్చి వక్కాణింతు నాలకింపుడని సూతుఁడిట్లనియె.

—* కల్పాదికాల విభాగకథనము *—

సీ॥ పగలు సృష్టించు న ♦ ప్పరమేశ్వరుఁడు రాత్రిలయమొనరించు నె ♦ ల్లజగములను
వికృతులై యలరెడి ♦ విశ్వదేవతలు బ్రజాపతులును సహ ♦ స్సమయమందుఁ
జరియించెదరు రాత్రి ♦ శమియించెదరు నిశాంతంబున జనియింత్రు ♦ ధరణిలోన
నాలుగు వేల యు ♦ గాలు చతుర్దశ మనువులు వర్తింత్రు ♦ నుహితగతిని

కృతయుగము నాల్గువేలయి ♦ క్షిత్రిగాంచు మూఁడువేలు త్రేతాయుగం♦బున దనర్చు
ద్వాపరము ద్విసహస్రమై ♦ వఱలునొక్క వేయివత్సరములు కలి ♦ వెలయుచుండు.

వ॥ ఈ వత్సరములు దేవమానగణితములు. క్రమంబుగ నాలుగు యుగములకును సంధ్యాకాలంబు చతుశ్శతంబును త్రిశతంబును ద్విశతంబును నేకశతంబులైయుండు.

సీ॥ పదునేనునిముసముల్ ♦ పరఁగుగాష్ఠయనంగ నవి ముప్పదియయిన ♦ నలరును కల
యవిమూఁడు పదులైన♦ నవని ముహూర్తమా నవి పదునేనైన ♦ నలరురజని
యంతటికాలమె ♦ యైన సహస్సగు నిల నహోరాత్రంబు ♦ లెసఁగు వాస
రంబయి ముప్పది ♦ రాత్రులహస్సులు గలిసి మాసంబగు ♦ క్ష్మాతలమున

మాసమున రెండు పక్షముల్ ♦ మహిని జెలఁగు శుక్లకృష్ణ సమాఖ్యల ♦ సూరివరులు
పదియు నైదుదినంబులు ♦ పరఁగెనేని పక్షమగునని వచియింత్రు ♦ దక్షులగుచు.

తే॥ జగతిఁ బితృదేవతలకుఁ గృ♦ష్ణసితపక్షములు క్రమముగనహోరాత్ర♦ములుగనుండు
మనుజమాసము ♦ [illegible] ♦ వెలయుచుండు.

వ॥ షష్ట్యుత్తర త్రిశతమాసంబులైనఁ బితరుల కొకవత్సరంబగు. మనుష్య వత్సరంబులు శతంబగునేని వారికి మూఁడుహాయనంబులు. మనుష్య మానంబున నుత్తర దక్షిణాయనంబులు దేవతల కహోరాత్ర రూపంబగు నొక్కదివసంబగు. ముప్పది మానవ వత్సరంబులు వారి కొకమాసంబగు. మనుష్య వత్సరంబులు మూఁడయిన దివ్యులకు మూఁడుమాసంబులగు. మూఁడు వందల యఱువది మనుష్యాబ్దంబులు వేల్పుల కొక వత్సరంబగు. మూఁడు వేల ముప్పది మానవ హాయనంబులు సప్తర్షుల కొకవత్సరంబగు. తొమ్మిది వేల తొంబది నరాబ్దంబులు ధ్రువున కొకవత్సరంబగు. ముప్పది యాఱు వేల పై నొకమానవ శతవర్షంబులు విధికి సంవత్సరంబు. మూఁడులక్షల యఱువదివేల మనుష్య వత్సరంబులు దివ్యులకు వర్షసహస్రంబగు.

తే॥ రమణఁ గృతము త్రేతయు ద్వాప • రము కలియును నాఁగ యుగములు వరుస
జె • న్నలరుచుండు.
బదియు నాల్గు నియుతముల • పై నలుబదివేల సంవత్సరంబులు • వెలయ గృతము

తే॥ పది నియుతముల పై నెను • బది సహస్ర వత్సరము లొప్పఁ ద్రేత ద్వా • పరము సప్త
నియుతముల నిరువది వేల • నెగడుఁ గలియు త్రినియుతము లఱువది వేలఁ • దేజరిల్లు.

—* సనకసనందనాద్యుత్పత్తి *—

సీ॥ తొలుత సృష్టి నొనర్పఁ • దలఁచి నప్పంకజుండు మోహంబుఁ జెందె న • బుద్ధిపూర్వ
మగుదానిఁ దమము మో • హము మహామోహంబు తామిస్రము నతియం • ధంబు నాఁగ
నజ్ఞాన మిల నొప్ప • నైదువిధంబుల నట్టి మోహంబుచే • నావృతుఁడయి
సృష్టిఁ జేయుదునంచు • నెంచి ముందుగ సర్పముల సృజియించి నిర్మలినగాత్ర
మెలమి మూఁడువిధంబుల • నలరఁ జేయ నంత దిర్యగూర్ధ్వా ర్వాక్కు • లైన స్రోత
సములు జనియించె మఱి ప్రథ • మమున భూతములు ద్వితీయంబు భౌతిక • ములు నెలంగె.

సీ॥ అరయమూఁడవది ప్ర • త్యక్ష సర్గము తురీయము ముఖ్యసృష్టి తి • ర్యక్స్రమాహ
మైదవ దాఱవ • దయ్యె దైవికమయి సప్తమంబిల మాను • షం బనుగ్ర
హం బష్టమంబయి • యలరుఁ గౌమారంబు ప్రాకృత వికృత సర్గంబు లివియ
నాళీకభవుఁడు స • నందుని సనకుని తొలుత సృజించె. నిర్మలిన మతులఁ
బ్రాజ్ఞుల మరీచి భృగ్వంగి • రః పులస్త్య పులహాసహాన దక్షాత్రి ము • ఖ్యుల వసిష్ఠు
సృష్టిగావించె నంత న • హీనమతులఁ బరఁగఁ దొమ్మండ్రుగురఁ బ్రజా • పతుల హితులఁ

వ॥ సంకల్పంబును, ధర్మా ధర్మంబులును, నవ్యక్త జన్ముండగు బ్రహ్మయొక్క సంతానంబులు.

తే॥ ఊర్ధ్వరేతసులు మ • హోన్నతుల్ బ్రహ్మవాదులు ద్విజాగ్రజన్ము • లలఘుమతులు
బ్రహ్మతుల్యులైన • పరమ మునీంద్రుల ఋభుసనత్కుమారు • సృష్టిఁ జేసె.

క॥ శతరూపను వైరాజిని జతురాస్యుఁడు తొలుత సృష్టి • సలిపెఁ గడంకన్
జతురులగు బ్రజాపతులకు సతులను గూర్పంగఁ దలఁచి • స్వాంతమునందున్.

సీ॥ అసదృశ మహిమాఢ్య • యగు శతరూపయు స్వాయంభువుని చెట్టఁ • బట్టి వేడ్క
సుతుల నిర్వుర • నతి చతురులను బ్రియ వ్రతోత్తాన పాదుల • నున్నతులను
నాకూతియుఁ బ్రసూతి•నాఁగ నిద్దఱఁ గూఁతులను గాంచె, నాకూతి•ఘనుని రుచి య
నంబడియెడు ప్రజా • నాథుని బెండ్లియై దక్షిణయని యెడు • దాని సుతను
యజ్ఞుఁడను పుత్రునిం గాంచె • నా ప్రసూతి దక్షు నుద్వాహమయ్యె సం • తసము మీఱ
నా పులోమజ యమృతాశనాధి నేతఁ బరిణయంబైన మాడ్కి దే•వతలు మెచ్చ.

వ॥ దక్షిణకు ద్వాదశ సంఖ్యాకులగు తనయులు గలిగిరి. ప్రసూతియు దక్షుని వలన శ్రద్ధయు, లక్ష్మియు, ధృతియు, బుష్టియుఁ దుష్టియు మేధయుఁ, గ్రియయు బుద్ధియు, లజ్జయు, వపుస్సును, శాంతియు, సిద్ధియు, కీర్తియు, ఖ్యాతియు, సంభూతియు, స్మృతియు, ప్రీతియు, క్షమయు, సన్నతియు, ననసూయయు, నూర్జయు స్వాహయు, సురారణియు, స్వధయు, మహాభాగయు, నను నిరువది నల్వురఁ బుత్రికలన్ గాంచె. అందు శ్రద్ధ మొదలగు వారిని బదుముగ్గుర ధర్మ ప్రజాపతియు, భృగు ప్రజాపతి ఖ్యాతిని సురారణిని, మరీచి సంభూతిని, నంగిరసుండు స్మృతిని, పులస్త్యుండు ప్రీతిని, పులహుండు క్షమను, క్రతువు సన్నతిని, నత్రి యనసూయను వసిష్ఠుఁ డూర్జను విభావసుండు స్వాహను, పితరులు స్వధను బెండ్లియైరి.

తే॥ కమలభవుఁడు సర్గాదిని • కాలకంఠు నర్ధనారీశ్వరుని గాంచి • యనియె నిట్లు
దేవ దీనశరణ్య నీ • దివ్యమైన తనువు విభజింపు లోకయా • త్రను గుఱించి.

మ॥ అనినన్ శంకరు డట్లయయ్యెడు నటం • చాత్మీయ దేహంబు మె
ల్లన స్త్రీపుంయుగమై కనంబడెడు లీ • లన్ రెండుభాగంబులై
తనరన్ జేసిన స్త్రీస్వరూప మగు నే • తత్ప్రభూత జాలంబు చ
య్యన నాశక్తిమయంబె యై యలరె దృ • శ్యంబైన లోకంబునన్.

తే॥ అవని నేకాదశ విధంబు • నగుచు నలరురుద్రసంఖ్య యాపుంరూప•రూపమెసగుఁ
బుంస్త్వ సంయుతమైనయా • పుడమియెల్లనిర్మలతదంశమగుఁగాదె • నిత్యమగుచు.

తే॥ ఈశ్వరాంగ విభక్తమై యొసఁ•గు శక్తిఁ గాంచి కమలాసనుఁడు కౌతు•కంబు జెంది
దక్షుని గుఱించి పలికె నెం•తయును బూనికఁ గంటివే యీసతీదేవిఁ • గన్నులార.

ఉ॥ ఈమెను గొమ్మ పుత్రిఁగ ర • హింతుము నీవును నేను నింక పుం
నామ మహాభయంకరము • నారకమున్ దరియించి సంతత
శ్రీమహితుండు శంభుఁడు వ • రింపఁగ నీసతి యోగ్యయౌ పరం
ధామున కన్న వేరొకఁడు • దారుఁడు గల్గునె యల్లుఁ డిమ్మహిన్.

తే॥ అనిన నజుని పల్కు ♦ లాలించి దక్షుఁడు సతిని సుతఁగఁ బొంది ♦ చంద్రశేఖ
రున కొసంగె సతిగ ♦ ననఘుఁ డాహరుఁ డామెఁ గూడి కౌతుకంబు♦తోడ నుండె

వ॥ ధర్మ ప్రజాపతి శ్రద్ధాదులగు భార్యలందుఁ గామ, దర్ప నియమ, సంతోష, లోభ
శ్రుత, దండ, సమయ, క్షేమ, సుఖ, యశ ప్రభృతులఁ బుత్రులం గాంచె.

సీ॥ పరఁగ భృగుప్రజా ♦ పతి ఖ్యాతి యందున ధాతృవిధాతృలన్ ♦ దనయులను ము
రారి పత్నియయిన ♦ యట్టి లక్ష్మిని గాంచె ఘనుఁడు మరీచి నందనులఁ బూర్ణ
మాసమారీచులన్ ♦ మహితుల దుష్టియు దృష్టియు జ్యేష్ఠయు ♦ గృషి యపచితి
యను పుత్రికలఁ గాంచె♦నా ప్రభూతి కతన పులహుండు క్షమ యందు♦నలఘులైన
కర్దమముని వరీయాంసుని ♦ ఘను సహిష్ణు కనక పీతాంసపీవరి ♦ యనెడు సుతను
ప్రీతియందుఁ బులస్త్యుండు ♦ విమలయశుల సుతుల నిర్వురఁ దనయు నొ♦క్కతనుగనియె.

వ॥ వారు దత్తోర్ణావుండును, వేదబాహుండును దృషద్వతి యను నామంబులఁ
బరఁగిరి.

తే॥ అతులకీర్తియైన ♦ క్రతువు సన్నతి యందుఁ గృతమతులగు ♦ వాలఖిల్య ముఖుల
నాత్మజోత్తములగు ♦ నఱువది వేవురఁ గాంచె నీశ భక్తి ♦ కలితుఁ డగుచు,

వ॥ అంగిరో ముని స్మృతియందు సినీవాలియు, కుహూ, రాకయు గుతూహాలుండును
లబ్ధానుభావుండును, నగ్నియు గీర్తిమంతుండు నను బుత్రులను గాంచె. అత్రిప్రజాపతి
యనసూయయందు సత్యనేత్రుండును, భవ్యుండును, నాపోమూర్తియు, శనైశ్చ
రుండును సోముండు నన నైదుగురఁ బుత్రులను, శ్రుతియను గూఁతును గనియె.

తే॥ అనఘుఁడు వసిష్ఠుఁ డూర్జయం♦దునను గాంచెజ్యాయసియుఁ బుండరీకాక్షుఁడన♦రజస్స
హోత్రయును బాహుసవనులు♦నుదితగుణులుసుతపుఁడును శుక్రుఁడనియెడిసుతుల నెలమి.

తే॥ హరి హర బ్రహ్మల కెవాని♦యందుఁ బ్రీతియొవని కతమున వేల్పులు ♦ తృప్తిగాంతు
రాతఁ డనలుండు స్వాహాయం♦దాత్మజులను ముగురఁ గాంచెజగద్ధితం♦బు మదిఁ గోరి.

వ॥ అనిపలికి సూతుం డగ్నివంశాది వర్ణనంబు సంగ్రహంబుగ వక్కాణించి మఱియు
నిట్లనియె. మున్నొకప్పుడు

## —* వ్యాస రుద్రావతార కథనము *—

క॥ అనిమిషులు ఋషులుఁ బితరులు ననఘులు తక్కఁగలవార ♦ లందఱు వినఁగన్
ఘనుఁడగు సనత్కుమారుని గనుఁగొని శైలాదిపలికెఁ ♦ గరుణాన్వితుఁడై.

సీ॥ భగవత్ప్రసాదంబు ♦ వలన జ్ఞానముగల్గు జ్ఞానంబు కతన యో ♦ గము జనించు
యోగ మూలంబున ♦ నుర్వి ముక్తి లభించుఁ గావున నె ప్రసాద కాంక్షఁ జేసి

సిద్ధులెల్లరు మాని ♦ సేవితుండగు సుమాధవుని పూజలయందుఁ ♦ దవిలి యింద్రు
ద్వాపరయుగమున ♦ వ్యాసావతారముల్ గలి శివయోగి వ ♦ ర్యులును వెడలి
సంసృతి క్లేశముల నొంది ♦ శర్వభక్తిఁ గొల్వ నేరని పామర ♦ కోటి కెల్ల
భక్తియోగంబు లెఱిఁగించి ♦ పరమ పదముఁ గూర్చుచుందురు నిరతంబు ♦ కోవిదులయి.

తే॥ వినుత వైవస్వతాంతర ♦ మున వరాహకల్పమున ద్వాపరయుగ ని ♦ కాయములును
వ్యాస రుద్రావతారముల్ ♦ వఱలువాని నెల్లవచియింతు వినుము నా ♦ యెఱిఁగినటుల.

వ॥ క్రతువును, సత్యుండును భార్గవుండును నంగిరుండును, సవితయు, మృత్యువు, శతక్రతువును, ధీమంతుండును, వసిష్ఠుండును, శతతేజుండును స్వయంధర్ముండును, నారాయణుండును, తరక్షువు, సారస్వతుండును, త్రిధాముండును, త్రివృతుండును, నరుణియు, గృతంజయుండును, భరద్వాజుండును, గౌతముండును, కవిసత్తముండును, వాచశ్రవుండును, శుష్మాయణియు, శుచియు, తృణబిందుండును, సుక్షుశక్తియు, శాక్తేయుండును, నుత్తరుండును, జాతూకర్ణియు, హరియు, గృష్ణద్వైపాయనుండును, ననువారువ్యాసరూపులు. స్వాయంభువుండును, స్వారోచిషుండును, ఉత్తముండును, తామసుండును, రైవతుండును, చాక్షుషుండును, వైవస్వతుండును, సావర్ణియు, ధర్మసావర్ణియు, బిశంగుండును, నపిశంగుడును, శబలుండును, వర్ణకుండును, ననువారు చతుర్దశమనువులు. వారును శ్వేతపాండురక్త తామ్ర పీతకపిల కృష్ణ శ్యామధూమ్ర సుధూమ్రమా పిశంగ పిశంగ త్రివర్ణ శబల కాలంధు వర్ణులై యుందురు.

తే॥ అనిమిషాది పిశాచాంత ♦ మైనభూత సంచయంబు పశువులన ♦ జగతిఁ బరగు
వారలకుఁ బతియౌట నీ ♦ శ్వరుని సతముపశుపతియటంచు వినుతింత్రు ♦ పరమమునులు.

తే॥ అరయఁగ బరావరవిభూతి ♦ నాత్మఁదలఁచిపశుపతిరచించెయోగంబుఁ ♦ బాశుపతము
నాఁదగినదాని నద్దాని ♦ నాశ్రయించి ముక్తులగుదురు యోగులై ♦ మునులు చెలఁగి.

వ॥ శ్వేతుండును, రుద్రుండును, సుతారుండును, మదనుండును, సుహోత్రుండును, కంకణుఁడును, లోకాక్షియు, జైగీషవ్యుండును, మహాతేజుండును, దధివాహనుండును, ఋషభుండును, నుగ్రుండును, నత్రియు, సుబాలకుండును, గౌతముండును, వేదశీర్షుండును, గోకర్ణుండును, గుహావాసియు, ఖండభృతుండును, జటామాల్యాట్టహాసుండును, దారుకుండును, లాంగలియు, మహాకాయుండును, శూలియు, దండియు, ముండియు, సహిష్ణుండును, సోమశర్మయు, లకులీశుండును, ననువారు వైవస్వత మన్వంతరంబున యోగోపదేష్టలై యోగాచార్యులనఁ బరఁగుదురు. ప్రతియుగంబునను వీరి కందఱకును నలువురేసి శిష్యులును ననేకులు ప్రశిష్యులునుందురు.

-* యోగలక్షణము *-

తే॥ తెలియ నాభియు నూర్ధ్వాధః ప్ర ♦ దేశములును | కనుబొమలమధ్యదేశంబు ♦ గళముక్రింది
భాగమును స్థానమయ్యెను ♦ యోగమునకు హరవిరచితంబు యోగంబు ♦ సురనుతంబు.

తే॥ జగతి నాత్మాఖిలార్థ చి ♦ జ్జనక మిదియె యోగమందురు మానివర్యులు చెలంగి
తత్ప్రసాదంబు కతన నె ♦ స్థైర్యమలరు ననుభవైకవేద్యము ప్రసా ♦ దామృతంబు.

తే॥ ఇట్టిది ప్రసాద రూపమం ♦ చెఱిఁగి పలుక సరిసి జాదులకేనియుఁ ♦ దరముగాదు
క్రమముగ నదియె నరులకుఁ ♦ గలుగుచుండు యోగమున జేసియీశ్వర ♦ యోగమగును.

తే॥ యోగమునకు హేతు ♦ వున్నత స్థానంబు జ్ఞానమిలఁ బ్రసాద ♦ కారణమునఁ
గలుగు జ్ఞానమునను ♦ కలుషము ల్వాయును విషయ వాంఛలేక వెలయు నరుఁడు.

తే॥ చిత్తమయ్యె ప్రవృత్తులఁ ♦ జేరకుండ నిగ్రహించుటె యోగమై ♦ నెగడుచుండు
నింద్రియ ప్రవర్తనము జ ♦ యించు వాఁడు యోగసిద్ధిని జెందు నీ ♦ యుర్వియందు.

వ॥ యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధులన నెని
మిది విధంబుల యోగసాధనంబులు వక్కాణింపఁ బడియె.

సీ॥ పరగఁ దపస్థిర ♦ త్వంబు యమము నాఁగఁ బడు నహింసయె యగుఁ ♦ బ్రథమ కార
ణము సత్యమస్తేయ ♦ ము మహిత బ్రహ్మ చర్య పరిగ్రహంబులు ♦ నపర హేతు
వులు నియమమునకుఁ ♦ దెలియ యమం బె మూలము తనకట్లు భూ ♦ తముల కెల్ల
హిత మాచరించుట ♦ యే యహింస యగును నదియ యాత్మజ్ఞాన మలరఁ జేయు
నను మితంబు దృష్టంబును ♦ స్వానుభూతమును యథార్థకథన మన్య ♦ జనుల బాధ
సేయకుంట సత్యంబని ♦ న్యాయవిదులు తెలియఁ బలుకుదు రెప్పుడు ♦ ధీరులగుచు.

సీ॥ పరదోష మెఱిఁగియుఁ ♦ బలుకకుంటయు నితరార్థంబు నాపదలందయేని
గైకొనకుంటయుఁ ♦ గనలియే నితరుల నొప్పింపకుంటయు నొచ్చియేని
యనృత వాక్యంబుల ♦ నాడకుండుట యును త్రికరణశుద్ధిగఁ ♦ దెలివలందు
నాసఁ జెందకయుంట ♦ యభిమానముం బూని యార్యుల వచనంబు నసదు సేయ
కుండుటయు నింద్రియోద్ధత ♦ ఘోటకముల స్వేచ్ఛఁ జరియింప నీకుంట ♦ చెనఁటివారిఁ
జేరకుంటయు నిల బ్రహ్మచారులకును యతులకును బ్రహ్మ చర్యమై ♦ యలరుచుండు.

సీ॥ అగ్నిసాక్షిగ వివా ♦ హంబైన సతియందు శ్రుతివిహితంబగు ♦ చూడ్కి నిలిపి
యన్యదారల నింద్రి ♦ య ప్రవృత్తిని మాని యవని మసలుట గృ ♦ హస్థులైన
సాధువులకు బ్రహ్మ ♦ చర్యమై నుతిఁగాంచు ద్విజ గుర్వనల పూజ ♦ విధిగఁ జేయు
నెడల హింసయును న ♦ హింసయే యగు మఱి కుణపమందును వోలెఁ ♦ గోమలాంగు
లందుఁ జిత్తముంచి ♦ యర్యైయ్య సమయములఁ దగిన రీతి నడువఁ ♦ దగును గృహికి
బాహ్యదేశమటుల ♦ భావించి చెలితోడ రతిని సలుపఁదగు ని ♦ రంతరంబు.

తే॥ హవ్యమున వీతిహోత్రుఁడ ♦ ట్లనుభవించు కొలఁది కామంబు బెరుగుచుఁ ♦ జెలఁగుకత—
రాగము దృజింపఁ దగును వి ♦ రాగి యయ్యె నేని మోక్షంబు సిద్ధించు ♦ నృచయమునకు—

తే॥ అగ్నిపోలె వెలుఁగు ♦ నంగన ఘృత కుంభ మటులఁ బురుషుఁ డుండు ♦ నక్క—తము—
సగసిజాక్షులందు ♦ సంసర్గమును దూరముగను విడువ వలయు ♦ మోహిగాక.

తే॥ ద్రవ్యమునఁ గర్మమున మిత్ర ♦ దార పుత్ర బంధు సంచయమున నైన ♦ బనయరాదు
తనకు నిలనమృతత్వంబు ♦ త్యాగమునన గాక గృహపతి యిది యెఱుఁ ♦ గంగదగును

సీ॥ జగతి శౌచంబు ని ♦ జ్యయు తపోదానముల్ స్వాధ్యాయ పరత యు ♦ పస్థ నిగ్ర
హము వ్రత ముపనా సమరయ మౌనంబును స్నానంబు ననునవి ♦ సాధనములు
నియమంబున కిల న ♦ నీహయు మఱి శౌచమును తుష్టియును దపం ♦ బును జపంబు
నీశ్వర ప్రణిధాన ♦ మెసఁగును పద్మ కాద్యంబగు నయ్యాస ♦ నంబు లివియు
బాహ్యసాధనములు ♦ పరఁగు నాభ్యంతర సాధనములు వీని ♦ సలిపి నియమ
మును గడింప వలయు ♦ మునులకు యోగసంసిద్ధిఁ గోరునట్టి ♦ శ్రేష్ఠులకును.

తే॥ బాహ్యశౌచంబు మఱియు నా ♦ భ్యంతరమగు శౌచము నుదాల్ప వలయు స ♦ త్సంగుల కిల
నివి వహింపక స్నానంబు ♦ లెన్ని యేని జేసియును నిష్ఫలమె యోగ ♦ సిద్ధిఁ గోరి.

క॥ శ్రుతులందు స్మృతులయందును నితిహాసములందు నెంత ♦ యేఁ జెప్పఁబడుఁగా
క్షితియోగ సిద్ధికరములు నతులములు యమాది లక్ష ♦ ణావళులు తగన్.

—* యోగాభ్యాస విఘ్నములు. *—

సీ॥ పరఁగు నాలస్యంబు వ్యాధి పీడలు ప్రమాదంబును సంశయ ♦ స్థానములును
నాత్మ చంచలతయు ♦ నశ్రద్ధయు నదర్శనంబు భ్రాంతియుఁ ద్రివి ♦ ధంబులైన
దుఃఖంబులును మఱి ♦ దుర్మనస్యంబు నయోగ్యవిషయము ల ♦ యోగతయును
నివి దశ విఘ్నములై ♦ యెల్లయోగాభ్యాస ములకు విఘ్నంబులై ♦ వెలయు ధరణి
దలఁపఁ గాయ చిత్త ♦ ముల గురుత్వంబునఁ గలుగుచుండుఁ బ్రథమ ♦ కారణంబు
వఱలుచుండు ధాతు ♦ వైషమ్యమునఁ జేసి వ్యాధు లనవరతము ♦ నవనియందు.

తే॥ తలఁపగ సమాధి సాధనం ♦ బుల గణింప కుంటయె ప్రమాదమ్మగును న ♦ న్నింటనిశ్చ
యంబదియొ యిదియొ యనుచు ♦ నాత్మ దెలియకుంట సంశయస్థానమా ♦ క్షోణియందు.

తే॥ సాధనములగు వృత్తుల సంతతంబు శ్రద్ధదాల్పక యుంట య ♦ శ్రద్ధయగును
నొక్క-దాని గని మఱొక్క-టి గా నెంచు చుంట భ్రాంతియగుచు ♦ నుండు ధరణి.

తే॥ అవసరంబులైన ♦ యట్టి కార్యంబులఁ దలఁప కునికి యేయ ♦ దర్శనమగు
నాధి దైవతంబు ♦ నాధ్యాత్మికం బాది భౌతికమన దుఃఖ ♦ భావమలరు.

తే॥ తపముచేత రజముచేత • దగులువడుట దౌర్మనస్యంబునా నొప్పు ధరణిలోన
సంతతోత్సాహమును గాంచు • సాధులందు నంతరాయముల్ గలుగవొ • క్కింతయేని.

—* యోగసిద్ధులు. *—

తే॥ అంతరాయంబులు సమాధి • కాదియందు నుపద్రవముఁ గూర్చునని యయ్యె • బరగసిద్ధి
కరములై యొప్పెడు నవాని • గతి నెఱింగి యోగి చరియింపఁదగు నెల్ల • యోగములను.

వ॥ ప్రతిభయు శ్రవణంబును వార్తయు, దర్శనమును నాస్వాదంబును, వేదనయు నను నివి యోగసిద్ధులనంబడు. ఈయోగసిద్ధులు లభించునేని యోగికి సకలైశ్వర్యంబులు కరతలామలకంబులగు.

తే॥ ధరణియందు వోలెఁ • దగ జలంబులయందు సంచరించుటయును • సాగరముల
నైనఁ బ్రావుటయును • నాత్మఁ గోరిన వస్తుచయము జెందుటయును • సంభవించు.

సీ॥ కలశంబులేకయ • జలముల నఱచేత నిలుపఁ గలుగుటయు • నెట్టిశస్త్ర
వితతిచేనైనను • వెతనొందకుంటయు దనువునందగ్నిని • దాల్చుటయును
[illegible]ంబుమధ్యంబున • ననలంబు నిల్పుటయును దహించియు దాని • యన్నరూపు
గలిగించుటయు మింట • నిలుచుటయును నగముల క్షణమాత్రసం • దలఁగఁజేయు
టయును బర్వతముల • రయమున బాహువులందు బూనుటయు వి • లాసగతిని
గాలినైనఁ గాని కరముల బట్టుటయును సుకరములగుచు • నుండునవని.

సీ॥ అంగుళంబులచేత • నవనీతలంబెల్లఁ గంపింపఁజేయుట • తెంపులేక
యాకసంబునఁ బక్షి • యట్లు యెగురుటయు దవ్వులనుండి శ • బ్దంబు వినుట
యును బరోక్షంబున • నున్నదానిఁ గనుట యెల్లరహస్యంబు లెఱుఁగుటయును
ఛాయా విహీనమౌ • సర్గంబొనర్చుట యొకనూతిలో దిగి . యొక్కనూత
వెడలుటయును నిఖిల • వేతృత్వమును గాంచి తెలియకున్నదానిఁ • దెలియుటయును
కామ రూపములను • గాంచఁ గల్గుటయును చెలఁగుచుండు యోగ • సిద్ధికతన.

తే॥ తలఁప యోగసిద్ధి • వలన లభించు నైశ్వర్య మిట్టిదనుచు • బ్రహ్మకేని
పలుకరాదు రక్త • భావంబు విడచి విరాగియగుట వలయు • యోగమునను.

తే॥ మఱియు మృగపక్షిరుతముల • మానసమునఁ దెలియఁగా నేర్చు యోగంబు • వలనయోగి
పాశుపత యోగమున సుల • భంబుగాని వస్తువొక్కటి కలుగునే • వసుధ యందు

తే॥ ఈశ్వర ప్రసాద • మీ యోగసిద్ధికి ముఖ్య కారణమని • ముని వరేణ్యు
లెల్ల గాశ్రయింతు • రీశ్వరు నాశ్రిత లోకరక్షకుని బి • నాకపాణి.

—* ఈశ్వర ప్రసాదార్హులు *—

వ॥ సత్పురుషులును, జితాత్ములును, ధర్మజ్ఞులును, నాచార్యులును, దయావంతులును తపోధనులును, సన్యాసులును, జ్ఞానులును, వశులును, త్యాగులును, దాంతులును,

సత్యవాదులును, నలుబ్ధులును, యోగులును, స్మృతి వేత్తలును నీశ్వర ప్రసాదా
ర్హులు.

చ॥ హరునెడ భక్తిగల్గి విష • యాభిరతిన్ జరియింపఁబోక సు
స్థిరమతి నెల్లవేళలను • శేషభుజంగవతంసు నమ్మహే
శ్వరు భజియించువారి భవ • పాశవిమోచనుఁడైన శంకరుం
డురు కృపఁగాఁచుచుండు సుగు • ణోన్నతుఁడాతఁ డటంచు నెంచుచున్.

తే॥ భక్తికతనఁ గల్గు • పరమేశ్వర ప్రసాదంబు దానివలనఁ • దగజనించు
యోగసిద్ధి దాన • నున్నత పదమొంది ముక్తుఁడగు నరుండు • ముదముఁ జెంది.

తే॥ భక్తివలన హరుఁడు • వశ్యుఁడై యఖిలార్థన్ సిద్ధిగూర్చు భక్తి • చెలగు నేని
సంసృతిని తరించి • సతత మహేశ్వర పదముఁ జెంది వెలయుఁ • బామరుండు

ఉ॥ మున్నొకనాఁడు శైలజప్ర • మోదముమై సవిముక్తమందునన్
బన్నగ భూషణున్ సకల • పాపవినాశను జంద్రశేఖరున్
గ్రన్నన పల్కె నో నిఖిల • కామ్యద యేసరణిన్ జరించినన్
బన్నుగఁ బామరావళికి • వశ్యుడవయ్యెద వీవుచెప్పుమా.

క॥ అనినవిని హరుఁడు దేవిన్ గనుఁగొని వచియించె నపుడు • కనికరమున నో
వనజాక్షి యివ్విధం బే వనజభవుం డడిగె నన్ను • వారిని భక్తిన్.

వ॥ అప్పుడు నేనాతనిఁ గాంచి యోయీ సద్యోజాత వామదేవ తత్పురుషా ఘోరేశానాది ముఖోపేతుండనగు నేను భక్తివలన వశ్యుండనగుదునని వచించితి ననియెఁ గావున భక్తిచే బూజించువానికిఁ బరమేశ్వరుండు వశ్యుండగుఁగాని తపస్సుచేతను విద్యచేతను శంకరుండు వశ్యుండుగాఁడు.

—* సద్యోజాతోత్పత్తి *—

సీ॥ అలనిరువది తొమ్మి • దవ శ్వేతలోహిత కల్పంబునందునఁ • గనకగర్భుఁ
డమలచిత్తుండయి • యతిభక్తి శంకర ధ్యాన మీలిత నేత్రుఁడై సమాధి
నున్న యంతట శిఖా • యుక్తుండు శ్వేతలోహితుఁ డతీంద్రియుఁడయి • యొసఁగువాఁడు
మహితాత్ముఁ డొక్క కు • మారుఁడు గనుపట్టె భానుకోటి ప్రభా • భాసితాంగుఁ
డమ్మహాపురుషునకు బా • ర్శ్వమ్ములను సునందనందనులును విశ్వ • నందనోప
నందనులనెడు శిష్యుల • నంత తేజులలరు చుండుట గాంచి యా • జలజభవుఁడు.

క॥ ఈతండు గుణత్రితయ సమేతుఁడు పరమేశ్వరుండు • మృత్యుంజయుఁ డి
ట్లీతఁడె యియ్యెడ సద్యోజాతుండై నన్నుఁబ్రోవఁ జనుదెంచె నొగిన్.

వ॥ ఈసద్యోజాతేశ్వరు సమక్షంబున.

తే॥ శ్వేతవర్ణాకృతియగుచు శ్వేతుఁడనెడు ముని యుదయమయ్యెనిదె కనుంగొనఁగ సకల
కలుషహరమగు నీ శుభ కాలమందు ధ్యానయుక్తుఁడనగుట మే లయ్యె నాకు.
తే॥ భక్తలోకావనుండగు పార్వతీశుఁ డివ్విధిని నాకు దర్శన మిచ్చుకతన
వఱలు గాత సద్యోజాత వదన సంజ్ఞ సకల లోకార్చితుండగు శంకరునకు.
వ॥ అని చతుర్ముఖుండు సభక్తి నా సద్యోజాత మూర్తిని ధ్యానించెఁ గావున నీశ్వ
రుండు సద్యోజాత ముఖుండనఁ బరఁగె.

## వామదేవోత్పత్తి

సీ॥ ముప్పదియవ కల్ప మునఁ జతురాస్యుండు పురహరు దర్శనంబును దలంచి
ధ్యానయోగస్థిరుఁ డైన యున్నయెడ రక్త మాల్యావతంసుండు మహితరక్త
నయనుండు విమతదుర్జయుఁడు రక్తాంబరుఁడనఘుండు హరుఁడు ప్రత్యక్షమయ్యె
విరజవిపాదులు విగతశోకుండును విశ్వభావనుఁ డన వెలయువారు
నలుగురు కుమారులై పార్శ్వ ములఁ జెలంగఁ గాంచ నోదరుఁడా కఱకంఠుఁ గాంచి
భక్తి వినతోత్తమాంగుఁడై పరివిమలార్ఘ సంయుతంబగు నట్టి వాగ్జాలమునను.
వ॥ కరయుగంబు మోడ్చి వినుతించిన
తే॥ అంత వామదేవుఁ డబ్జాసనుని గాంచి హృష్టమానసుఁడయి యిట్టులనియె
నీ యొనర్చు ధ్యాన మీయెడ నాకు సంతృప్తిఁ గూర్చె మెచ్చి తి పుడు నిన్ను.
క॥ ప్రతికల్పంబున యంచగతి నను ధ్యానంబుఁ జేసి కాంచఁ గలవు నీ
హిత మొనరింతు సతమున స్తుతిభక్తి భజించుచుండుమా చతురాస్యా.
తే॥ అబ్జభవనీకతమునన ఘనౌఘనాశకంబు వాఙ్మానసా గోచ రంబునైన
వామదేవ రూపంబు వి శ్వ ప్రపంచమునకు గోచరమై మోద మును ఘటించె.
వ॥ అని పలికి వామదేవుం డదృశ్యుఁడయ్యెఁ బరమేశ్వరుండు రక్తాంగుఁడై పరమేష్ఠికిఁ
బ్రసన్నుం డగు కతన నాకల్పంబు రక్త కల్పంబునాఁ బ్రసిద్ధిగాంచె నిది వామదేవో
త్పత్తి ప్రకారం బింక తత్పురుషోత్పత్తి వినంబాలింపుడు.

## తత్పురుషోత్పత్తి

సీ॥ అవని ముప్పదియొక టవ కల్పమునఁ జతురాస్యుండు పీతవ స్త్రాంచితుఁడయి
పుత్రకామనజేసి పురహరు ధ్యానింపఁ బీతాంబరుండును పీతమాల్య
విలసితో రస్కుండు పీత గంధానులిప్తుండు పీతోష్ణీష భూషితుండు
కనక యజ్ఞోప వీ తనిబద్ధ దేహుండు యౌవనాన్వితుఁడను నట్టి వాఁడు
విపుల తేజుండు మానిరా డ్వినుత పాద పంకజాతుండు శతకోటి భాస్కర ప్ర
తాపుఁడగు పూరుషుండు ప్రత్యక్షమైన గమలజుఁడు వొడఁ గని వినయముదలిర్ప.

తే॥ ధ్యానసంయుక్తుఁడగుచుఁ జి ♦ త్తమున సమ్మహానుభావుని జిత్రించి ♦ యనులభక్తి
వినుతిఁ జేసినఁ బరమేశు ♦ విమలవదన బిలమునందుండి యప్పుడు ♦ లలితమగుచు.

సీ॥ నాల్గు మొగంబులు ♦ నాల్గు పాదంబులు నాల్గు హస్తంబులు ♦ నాల్గు చనులు
నాల్గు శృంగంబులు ♦ నాల్గు దంష్ట్రిలును ముప్పదిరెండు గుణములు ♦ వఱలుచుండ
విశ్వ రూపయును మ ♦ హేశ్వరియును మహా తేజయు విశ్వదా ♦ త్రియునగుచును
గోరూప ధారిణి ♦ యై రహించుచు నొక్క ♦ దివ్య తేజము సము ♦ ద్దీప్త మగుచుఁ
గానవచ్చుటయును సిలి ♦ కంఠుఁ డప్పుడామె కరము గ్రహించి య ♦ య్యబ్జభవునిఁ
గాంచి నిర్వ్యాజమగునను ♦ గ్రహసమేతుఁ డగుచు వచియించె నిట్లని ♦ యందఱు విన.

తే॥ ఈ మహాదేవి నెఱుఁగవొ ♦ యేమొ నీవు సకలలోక జనని యీమె ♦ సర్వవేద
కీర్తిత చరిత్ర మునిమనో ♦ వర్తిని యయి యలరు రుద్రాణియగుచు వే ♦ ల్పులనుతింప.

తే॥ అగ్రజహితంబుఁగోరి గా ♦ యత్రి యగుచు నీజగద్ధాత్రి రక్షించు ♦ నెల్ల వేద
సంచయము బ్రిజావాంఛచే ♦ సాధుభక్తి నన్ను ధ్యానించుకతన నో ♦ నళినజాత.

తే॥ పుత్రికగఁ గైకొనుము సర్వ ♦ మునకు నీమ హేశ్వరియె కారణంబగు ♦ నింకమీఁద
బ్రాహ్మణత్వంబు జగమునఁ ♦ బాదుకొల్పి ధర్మముఁ జెలంగఁజేయుచు ♦ ధరణియందు.

క॥ అని వచియించుచు గాయత్రిని రౌద్రి నొసంగె హరుఁడు ♦ స్థిరమతిఁ జతురా
ననుఁ డా పరమేశ్వరి పద వనరుహముల మ్రొక్కె నిల్చె ♦ వారని భక్తిన్.

వ॥ అత్తఱిఁ బీతాభులును, బీతకేశులును, బీతమాల్యాంబరధరులును నగుకుమారులు నలువురు జనియింపి రప్పుడు తత్పురుషస్వరూపుండగు శంభుఁడు చతురాస్యునకు దివ్యయోగంబును నైశ్వర్యంబును బహుశ్రుతంబును జ్ఞానసంపత్తియు నొసంగెనంత నక్కుమారులు వర్ష సహస్రాంతంబునఁ బరమేశ్వరునం దైక్యమొందిరి. ఈశ్వరుం డట్లు పీతవాససుండై ప్రసన్నుండైన కారణంబున నాకల్పంబు పీతావాసః కల్పంబునాఁ బరఁగు నింక నఘోరోత్పత్తి కథనం బాలింపుడు.

## —♦ అఘోరోత్పత్తి ♦—

తే॥ విలయ కాలంబునందున ♦ విశ్వ మెల్ల నర్ణవపరీత మైన స్వ ♦ యంభువుండు
మఱలసృష్టింపఁగలఁచియు ♦ మార్గ మెఱుఁగకెంతయును జింతిలుచునుండు ♦ నెడను బూన్కి

సీ॥ కృష్ణవర్ణుండును ♦ కృష్ణాంబరుండును కృష్ణవదనుఁడును ♦ కృష్ణమాల్య
రాజితోరస్కుండు ♦ రాజధరుండు ఘోరా కారుడైన వాఁ ♦ డనఘుఁడొకఁడు
కానుపించుటయునుఁ ♦ గనకోదరుండు నిశ్చింతాత్ముఁడై పొంగి ♦ యంత నతనిఁ
దనకు సాయముఁ జేయఁ ♦ జనుదెంచినాఁడని తలఁచి యనేక రీ ♦ తులనుతింప

నయ్యఘోరదేవుఁ • డజునిపై కృపతోడ దివ్యదృష్టి నొసఁగె • ధీరుఁడగుచు
నంత హంసుని పార్శ్వ • మందునఁ గనుపట్టి రట్టివారలైన • యట్టి వారు.

వ॥ అంత కృష్ణుండును, కృష్ణ శిఖియు, కృష్ణాస్యుండును, కృష్ణ వస్త్రధారియు నను నలుగురఁ గాంచి వాణీ మనోహరుఁడు సంతుష్టుండయ్యె.

మ॥ పరమేశుండు కృపార్ద్రచిత్తుఁడగుటన్ • వాణీ మనోనాయకున్
గరుణింపంగ నఘోర రూపుడగుచున్ • గన్పట్టుటన్ జేసి యు
ర్వారనా కల్పము కృష్ణసంజ్ఞఁదనరెన్ • రాకేందు చూడుండు ని
ర్జర సంతాన మఘోర రూపుఁ డనుచున్ • స్వాంతంబులన్ గొల్వఁగన్.

తే॥ కీర్తనీయుఁడయ్యె • గేశవాద్యఖిలామరాళికనయమిల మహాత్ముఁ డతనిఁ
గొలిచి ముక్తులగుచుఁ • గలిచయంబును బాసి చెలఁగుచుండ్రు మాని • శేఖరులును.

— • అఘోర మంత్ర మహిమ • —

తే॥ అతి భయంకరమైన కృ • ష్ణాఖ్యకల్ప మరుగఁ జతురాస్యుఁ డేకాంత • మందుఁ జేరి
పాపములు భువనములందుఁ • బ్రబలె వీనినడఁచుమార్గంబు తెలియరా • దయ్యె నాకు.

క॥ అని చింతించుచు నున్నెడ నను కంపానిధి మహేశుఁ • డజుని కనులకున్
గనబడి మధురవచోళిన్ వనజాసనుఁ గాంచి పలికె వరదుం డగుచున్.

సీ॥ చతురాస్యనీకు వి • చారింపఁ బనియేమి తనరు నఘోరమం • త్రంబు కతన
బ్రహ్మహత్యాది పా • పములు హరింపవె యెవఁడేని నిశ్చల • హృదయుఁడగుచు
సద్భక్తి నీమంత్ర • జపమొనరించిన నిష్టకామ్యంబుల • నెల్లఁ బడయు
నీమంత్రరాజంబు • నిపుడ నీకొసఁగెద నీవును నహర్నిశము • నిప్రకరముఁ
జేరఁ బిలిచి వీనిఁ జెప్పుము క్రమముగ జగములందు వెలసి • సకలపాత
కముల నుక్కడంపఁ • గలదు దీని మహిమ నెఱుఁగ శక్యమగునె • యెవ్వరికిని,

తే॥ ఇదియ కాక కలుష • మెప్పుడు బలితమా నపుడు ఫాలలోచ • నాగ్నితోడ
నెల్ల లోకముల ద • హింతు సంశయమేల సృష్టిసేయుమింక • క్షితితలంబు.

తే॥ అని యఘోరమంత్ర • మును జెప్పి శంభుండు కనుమొఱంగెనంతఁ • గనకగర్భు
డెల్ల లోకములను • సృష్టించె నయ్యఘో రాఖ్య మంత్రమహిమ • నఘము వాయ

ఈశానోత్పత్తి

తే॥ అజుఁడు ముప్పదిమూఁడవ • దైనయట్టి యలరు నీశాన కల్పంబు • నందు జగము
సృష్టిసేయుదు ననుచును • జింతఁజేయ నవసరంబున విస్వరూ పాంచితము యి.

తే॥ విశ్వరూల్యాంబర ధరయు ♦ విశ్వగంధ విశ్వమాల మహోష్ణిక విశ్వధాత్రి
విశ్వయజ్ఞోపవీతిని ♦ విశ్వరూప యగు మహాధ్వని యుదయించె ♦ నబ్బురముగ.
తే॥ కాంచి యావిశ్వమూర్తిని ♦ కమలభవుఁడు సంభ్రమాశ్చర్యములఁ జెంది ♦ స్వాంతమందు.
భళిర యిదియేటి చిత్రంబ ♦ పాదమగుచుఁ గానవచ్చెడి నిది యెఱుఁగంగ ♦ రాదు.
తే॥ అని యపూర్వమైన ♦ యాదివ్య నినదంబుఁ దెలియఁ గోరి యపుడు - జలజభవుఁడు
స్ఫటిక సన్నిభాంగుఁ ♦ జంద్రకళాధరు ధ్యానమును బొనర్చె ♦ నాత్మనంత.
తే॥ ప్రణవరూపుఁడీశానుండు ♦ భక్తలోక రక్షకుండు కాలాంతకుం ♦ డక్షయుండు
నిగమవేద్యుఁడు రాజత ♦ నగనివాసి యజునకున్ గోచరించె ద ♦ యామయుఁడయి.
తే॥ అవ్విధిని గోచరించిన ♦ యంధకారిఁ గాంచి భక్తి నతుండు వి ♦ రించినమక
చమకసూక్తుల ధ్యానించి ♦ సంతసమున నిర్విఘ్నంబున వచియించె ♦ నీశుఁ గూర్చి.
తే॥ విశ్వరూపయగుచు ♦ విమలారవంబుఁ గావించు నీ భగవతి ♦ వేయుగతుల
నేల యుద్భవించె ♦ నే వాని యనుమతి సంచరింపఁ దలఁచు - జగములందు.
తే॥ అనిన శంభు డనియె ♦ నబ్జాసనునిఁ గాంచి తగిన దానిఁ దెలియఁ ♦ దలఁచి తీవు
సకల వేద మంత్ర ♦ సారంబు దీని నీ వెఱుఁగఁ గలవె సుంత ♦ యేని మదిని.
తే॥ ప్రకృతినాఁ బ్రధానంబునాఁ ♦ బరఁగు నెద్ది గౌరినా మాయనా నెద్ది ♦ ఖ్యాతిఁ గాంచు
నదియ యిది సుమ్ము నీకు సా ♦ యంబొనర్ప వెలసె నీరూపమున నీవు ♦ తెలియు మిపుడు.
తే॥ ఈమహేశ్వరి సాయమూ ♦ నింక నీవు సృష్టిఁ గావింపు లోకంబు లెల్ల నిపుడ
ధరణి నీశానమూర్తినై నాఁ ♦ బరఁగి యేను పాపులను శాసనమొనర్తుఁ ♦ బలువిధముల.
వ॥ అని పరమేశ్వరుం డంతర్హితుండైన నజుఁడు ప్రకృతి సాయంబున భూతసర్గంబుఁ
గావించె. ఈశాన కల్పంబున బ్రహ్మదేవునకు బరమేశ్వరుఁడు దర్శనమిచ్చుటఁ
జేసి యాకల్పంబు నేర హరుం డీశానుండన నుతిఁ గాంచె నని సూతుండు జ్యో
తిర్లింగోత్పత్తి క్రమం బాలింపుడని యిట్లనియె.

—♦ జ్యోతిర్లింగోత్పత్తి ♦—

సీ॥ మున్నొకప్పుడు వేలు ♦ పులు మూని వర్యులు వనజ సంభవుఁ గాంచి ♦ పలికి రిట్టుల
లింగంబనఁగ నెద్ది ♦ లింగి యెవ్వండు త ల్లింగంబు నందు న ♦ నంగహరునిఁ
బూజించు వేళ శం ♦ భునకు లింగము తోడి సంబంధ మెట్టిది ♦ సరగ మాకు
దెలియఁ జెప్పుము నావుఁ ♦ డలరి వారలతోడఁ బలికె నిర్విఘ్నమునఁ ♦ జలజభవుఁడు
లింగమనఁగఁ బ్రధానంబు ♦ లింగి నాగ నలరుఁ బరమేశ్వరుండు జ ♦ లార్ణవమున
లింగ ముదయించెఁ బూర్వమా ♦ లింగ మహిమ మింత వచియింతు వినుఁడు మీకె
ఱుఁగు నటుల.

వ॥ చతుర్యుగ సహస్రాంతంబున నా యాధిపత్యంబు సమత్వంబు లేక యంతమునొందినప్పుడనావృష్టి వశంబున సహస్రకరుని కిరణజాలంబు లోకసంతానంబు నెల్ల దహించుటయు, సర్వసాగరంబు లేకంబై మహీతలంబు గానఁబడకుండ జేయుటఁ జేసి మహాప్రళయంబు సంభవించె నప్పుడు.

తే॥ తామసుండయి శంభుడే • తత్ప్రపంచ
మెల్ల లయమొనరించి య • హీనుఁడగుచు
మాదృశులకును గోచరిం • పక నిజోరు
తేజమున వెల్గుచుండె ను • తింపఁదగుచు.

వ॥ పశువులును, మనుష్యులును, వృక్షంబులును పిశాచంబులును పిశితాశనులును గంధర్వాదులును వేయేల దృశ్యాదృశ్యంబగు సకల చరాచర ప్రపంచంబు దగ్ధంబయ్యె. నా సమయంబున సహస్రాక్షుండును సహస్ర శీర్షుండును విశ్వాత్ముండును సహస్ర పాదుండును సహస్ర బాహుండును సర్వజ్ఞుండును సర్వదేవమయుండును నగు నారాయణుండు నిశ్చలాత్ముఁడై మహాఘోరంబును దమోభూతంబును గంభీరంబు నగు నేకార్ణవంబున నిద్రించియున్నంత.

సీ॥ కాలనాభుండును • గాలాత్ముఁడును గృష్ణ
రూపుడు దీర్ఘబా • హు పటిష్ఠుఁ
దఖిలగుణ గరిష్ఠుఁ • డయ్యు నాగమముల
గుణహీనుఁ డను నుతిఁ • గొనెడువాఁడు
సర్వసర్వంసహా • చక్రరక్షకుఁడయ్యు
నఖిలంబును హరించు • నట్టివిభుఁడు
సదసన్మయుండును • సర్వాత్ముఁడును నిజ
మాయాపరీవృత • స్వాత్మతలుండు
నిఖిలలోకాధినేత య • వ్యయుఁడు భక్త
సంచయాధీశుఁ డీడ్యుండు • శాశ్వతుండు
పురుషోత్తముఁడైన యా • నీరజాక్షు
సన్నిధిఁ జేరి చిత్త చాంచల్యము మెయి.

క॥ ఇతఁడు జగదీశ్వరుఁడు సం
తతనుతిపాత్రుండు దుష్ట • దానవలోక
ప్రతతి లవిత్రమటంచున్
మతిఁదెలియఁగలేక దురభి • మానముకతనన్.

తే॥ నను సురజ్యేష్ఠుఁ బూరికిఁ • గొనక యిదియె
దీర్ఘనిద్రాపరుఁడయి మ • త్తిల్లి యీతఁ
డంబునిధి మధ్యతలమున • యందునున్న
వాఁడు వీనిని శిక్షింప • వలయుననుచు,

క॥ ఘోరమాయావృతుఁడనగుచు
హరిఁ గాంచి మహాగ్రహమున • నాతనితో నే
విరసంబుగ నిట్లంటిని
పరుషోక్తులు సెలఁగ నీవె • వండవో చెపుమా.

తే॥ ఇమ్మహాసాగరంబున • నేల యిట్లు
నిదురఁ గూర్కెదు వచియింపు • మెదభయంబు
గలుగదే నను జగదీశుఁ • గాంచననుచు
నొక్క ప్రహరణ మొనరించి • యుక్కుమిగుల.

వ॥ అట్లు జంకు గొంకు లేక ప్రహారంబుఁ గావించిన సనాతనుండును విశ్వసంభవుండును, ప్రకృతి ప్రవర్తకుండును సర్గసంహార కారకుఁడును, హసన్ముఖుండును నగు

చ॥ సరసిజలోచనుఁడపుడు • చయ్యన నిద్దురనుండి లేచి కో
పరసపరీవృతుండునయి • భాసిలు నన్నని వత్సయేల యీ
కరణి సమస్తలోకవిభుఁ • గానక నన్ను దృణీకరించి ని
బ్బరమునఁ గొట్టనేర్చితివి • పామరుఁడుం బలె తెల్విలేకొగిన్.

తే॥ బాలకుండవగుటఁ జేసి • ప్రజ్ఞలేక
బాల్యచాపల్యములకు లోఁ • బడితివీవు
నీ స్వభావంబు సాధువో • నే తలంప
పిన్నపెద్దలనియెడి వి • వేకివగుదే.

వ॥ నీవు మదీయ మాయామోహితుండవై కరణతురంగంబుల నాఁగఁజేయు మార్గంబు గానక యహంకారంబూనితి విందు నీ యపరాధం బేమి? మహాయోగులకేనియు నెఱుంగరాని నన్ను నీవంటి యల్పజ్ఞుం డెఱుంగనేర్చునే, చరాచరంబగు నే తజ్జగజ్జాలంబునకు నేన గదా శాసనకర్తను పరంజ్యోతియుఁ బరమాత్ముండును విభుండును నగు పరమేశ్వరుఁడేనయని విచారింపవైతి వదియునుగాక.

తే॥ సకలలోకేశ్వరుఁడ నన్ను • సరకుగొనక కొట్టితివె సాహసంబునఁ • గొండికనటు
లౌరనిను బాలకుఁడవంచు • నరసి యేను మిన్నకుంటి కాకున్నను • మేలుగలదే.
క॥ అనియెడు వెన్నునిపలుకుల విని ముప్పిరిగొన్న కినుక • వెసనాలినిఁగ
న్గొని యోయినన్ను బాలుం డని పల్కెదవేల తెలియ • వా లోకేశున్.

—• బ్రహ్మ విష్ణులు పరస్పరాధిక్యంబులు పలుకుట •—

సీ॥ అఖిల దృశ్యాదృశ్య • మైన ప్రపంచంబు నాకతమునఁగా • దే కలుగును
ఈ జనించెదు లోక • మెల్ల భరించెదు నేర్పుగల్గినవాఁడ • నేనకాదె
హరునకు నీకును • నాయుమాయి యధికార ములనొసంగినవాని • ననఘచిత్తు
నను గైకొనక బాలుఁ • డని పచియించెదు మోహంబు పెంపున • నూహలేక

పంచభూతములును • బంచేంద్రియంబులు బంచ తత్వములును • బరఁగమామ
కాజ్ఞఁ జేసి కాచె • యలరుచుండు ధరిత్రి నెఱుఁగఁగలవె ననుమ • హేళుమదిని
క॥ అని పచియించిన వెన్నుఁడు కనలుచు నిని యేటి మాట • కనకాండజనీ
కును నాకును గల భేదముఁ గననేర్తువో యల్పమతివి • గావున నింకన్.
తే॥ నాకరుణ గల్గదేని యీ • లోకజాత మెల్ల నప్పుడ నసిుంచు • నీశ్వరుండ
నన్నుఁ గాదని వర్తించు • నాశశాంక మౌళియైనను గాని యి • మ్మహీ దలంప.
తే॥ ప్రకృతి నాకతమున • వఱలుచుండును నేన పూరుషోత్తముఁడను • బుధనుతుండ
నన్నుఁ దెలియలేక • పిన్న వయసువాఁడు వోలె నీకుఁ బలుకు • టేల చెపుమ.
తే॥ అని యిటుల మేమిరువురమన్యోన్యగౌర వంబుఁ గోరుచు వాక్కలహంబెగాక
యుద్ధమునకును గూడ సంసిద్ధులమయి యున్నయప్పుడు భయదమౌను దధియందు
తే॥ జ్వాల మాలా సహస్ర వి • భ్రాజితంబు ప్రళయకాలానల ప్రభాబంధురంబు
నాది మధ్యాంతరహితంబునైన యొక్క యనఘ లింగంబుదయమయ్యె నాక్షణమున.
తే॥ అటుల నుదయమైన యాలింగమునసుండి హరుఁడు వెడలి యిట్టులనియె మమ్ము
మీరలిరువురిప్పు డారసిరండు సుచ్ఛరణమూర్ధములను • శక్తిఁగొలఁది.
క॥ పిమ్మట మీలో నెవ్వా రిమ్మహి నధికులయి యుందు • రేఁ జెప్పెద స
త్యమ్మనిన మాధవుఁడు మోహమ్మున వారాహరూప • మందికడంకన్.
వ॥ భూతలంబుఁ ద్రవ్వుచుఁ బరమేశ్వరు పాదమూలంబుఁ గాంచు కోర్కె నేగెనంత
నేనును హంసరూపంబుబూని లింగశిరంబుఁ గాంచువాఁడనై మనోజవంబున
నూర్ధ్వంబున నెగసి యనేక వర్ష సహస్రంబు లరిగితినిగాని గమ్యస్థానంబు
సమీపించదయ్యె. పిమ్మట నరుగు శక్తిలేక యథాప్రదేశంబునకుఁ జేరితి నప్పుడు.

తే॥ చెమ్మగిల్లిన మేనితోఁ • గిమ్ముఁ బడిన మనసుతో గుంటలు వడిన • కనులతోడ
మొక్క వోయిన పంటితో • మురహరుండు వచ్చి నిలుచుండె నా చెంత • వనటతోడ.

క॥ హరిలింగ మూలమును గని యరుదెంచెనొ యేమొ యని భ • యంబుగ దురవ
త్పరిభవ మూహించెడి నను బిరబిర వచియించె నిట్లు భీతి వడంకుచును.

చ॥ కనుఁ • గొనినట్లె కన్పడెదు • కాంచితె కాంచన గర్భ నీవు ని
త్య నిరుపమానమై యలరు • నట్టిది లింగ శిరంబు తత్పదం
బనఘము నాకు దవ్వగుట • నారయనైతి శ్రమంబె యయ్యె నే
ను నివచియింప నేర్తు గత • మయ్యె నహంకృతి యెల్ల నాయెడన్.

తే॥ ఈయహేతుక కలహంబె • యిటులనాకుఁ బరిభవముఁ గూర్చెఁ బార్వతీ • శ్వరుని కృపను
బాత్రుఁడవగుటఁ దచ్ఛిరో • భాగ మీవు కాంచఁ గలిగితి విప్పుడో • కమలగర్భ.

తే॥ అని మఱియు నేదియో పలుక • నవసరమున ప్లుత యుతంబును శబ్దల • క్షితమునైన
"ఓం"మనెడు నాదమొక్కటి • యుద్భవించె లింగయామ్య భాగమునను • తుంగమగుచు.

వ॥ సూర్యమండల సంకాశంబగు నకారంబు దక్షిణంబునను, పావక ప్రఖ్యంబగు నుకారంబుత్తరంబునను, శీతాంశుమండల ప్రముఖ్యంబగు మకారంబు మధ్యంబునను గలిగి యోంకారరూపంబైన యానాదాగ్రంబున శుద్ధస్ఫటికాభుండును, తురీయాతీతుండును, నిష్కలుండును, నిరుపప్లవుండును, నిర్ద్వంద్వుండును, నానందకారణుండును, నకారాదిక్షకారాంత వర్ణరూపుండును, నగు నీలలోహితుండు గోచరించిన నమ్మహాదేవు నరవిందాక్షుండు స్తోత్రింపఁ గావించె నంత.

చ॥ హరుఁడు కృపాన్వితుండయి ము • రాంతకు నన్నునుఁ గాంచి మీరలి
ర్వురుఁ గననేరకైతిరి స • రోజభవాచ్యుతులార మత్పదాం
బురుహములన్ శిరంబును మి • మున్ గరుణించితి నింక మీరలి
ద్దరును సమానులే యనుచు • దద్దయుఁ దోఁచెడు నెమ్మనంబునన్.

వ॥ అయినను

తే॥ సరసిజాసనుఁడు • సకల జగంబుల సృష్టి సలుపుచుండు • స్థితిని గూర్చుఁ
బంకజాక్షుఁడేను • ప్రళయంబొనర్చెదఁ దామసుండనగుచు • ధరణి నెల్ల.

వ॥ అని నారాయణుని గాంచి యిట్లనియె.

తే॥ మోహమును వీడుమింక నో • మురవినాశ పాద్మమను కల్పమునయందుఁ • బద్మభవుడు
పుత్రుఁడగు నీకుఁ బరమేష్టి • బ్రోవు మిఁక యవరమొసంగితి నీకు మ • త్కరుణ వెలయ.

తే॥ అనుచు నంతర్హితుండయ్యె • సంఘకారి వెన్నుఁడు యథేచ్ఛ నరిగెను • వీతగర్వుఁ
డనయి యేనును వచ్చితి • నస్మదీయ సత్యలోకమునకు సంత • సమున నపుడు.

తే॥ లింగవేది మహాదేవి • లింగమూర్తి యీశ్వరుఁడు దాని యందున • నెల్ల జగము
లయమునొందుటఁ జేసియ • నయము లింగమూర్తి యనఁ నొప్పుచుండు నా • పురహరుండు.

తే॥ భక్తి యుక్తి విమల • భావుఁడై యెవ్వఁడు సతము లింగపూజ • సలుపువాఁడు
కలుషవితతిఁబాసి • కామారి కరుణకుఁ బాత్రుఁడగుఁగు బేర • మిత్రుఁడగుచు.

క॥ కావున మీరును శంకర సేవాపరతంత్రులై య • శేష జగత్సం
భావితులై మనుఁ డనుచున్ జీవాదినిలింప తతికిఁ • జెప్పెనటంచున్.

వ॥ సూతుండు శౌనకాది మహామునులకుఁ జెప్పెనటయు

## ఆశ్వాసాంతము.

చ॥ ఋషిజనతాశరణ్య పతి • పూర్ణ కృపాకలితాంతరంగ ది
క్పరిధిత యశో విశాలగిరి • రాజ సుతాప హృతార్ధదేహ మ
న్మథ మదభంగ నిర్జర స • మాజ నుతామల పాదపంకజా
ప్రధన జితాంధకాది సుర • వైరి సమూహ సురా సురేశ్వరా.

క॥ కమలహితాశ కమల సంభవ కమలాహిత నయన విధృత • కమలా విలస
త్కమలాధవ శర నిర్మల కమలాకరతూణ సకల • కామ్యనిధానా.

క॥ సురతటినీ బంధుర శీకరసిక్త మృదుల శరీర • కల్యాణ గుణా
కర శ్రీకర రిపుజన భీకర కరుణాలవాలమామ • కగిరింధపతీ.

గీ॥ కష్టపడి పెంచి యిడితినా • కవితకన్నె నెవ్విధంబునం నలరి తో • యింకమీఁద
గంగవోలెను గయ్యాళి • కాదు బేల సుమ్ము నీతల నెక్కి నా • ట్యమ్ము సేయ.

సీ॥ ఏమహామహుఁడు శ్రీ • వేమనా రాధ్యవంశాబ్ధికిఁ బూర్ణశ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి • కేనయై బుధుల్ మెచ్చ మహిని బాతివ్రత్య • మహిమఁ బూనె
నట్టి నందయకు గా • రమగు ద్వితీయపుత్రుండఁ గౌండిన్య గో • త్రుండ దక్షి
ణామూర్తి కిని శివా • నందునకును సోదరుండఁ గూరిమియగ్ర • జుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మసీయమగు శ్రీ మదాంధ్ర లింగపురాణ పూ • ర్వార్ధమందు
నలరు తొల్లింటి ప్రియాశ్వాస • మయ్యె దీని సతము రక్షించుఁ గావుతఁ • జంద్రమౌళి



శ్రీ మీనాక్ష్యైనమః.

# శ్రీమదాంధ్ర లింగపురాణము



## పూర్వభాగము.

---

## ద్వితీయాశ్వాసము.

క॥ ధరణీభృత్తనయా హృ । త్సరసిరుహదళాగ్రభాగ ♦ సంచర దళినీ
శ్వర యీశ్వర మీనాక్షీ వర సోమేశ్వర మదీయ ♦ వరకావ్యపతీ.

తే॥ ఆవధరింపుము శౌనకా ♦ ద్యఖిలమౌని వర్యులకు సూతుఁ డిట్లని పలికె నాస
నత్కుమారునితోడ నా ♦ నంది నందికేశ్వరుఁడు వచియించిన ♦ యీశుమహిమ.

వ॥ అభ్యంతర లింగపూజా కథానానంతరమున సనత్కుమారుండు శైలాదిఁ గాంచి యిట్లనియె.

—* శివుఁడు దారుకావనముఁ బ్రవేశించుట. *—

మ॥ ఘనుఁడా చంద్రకళాధరుండు వికృతా ♦ కారంబునన్ దారుకా
వనికిన్ బోవఁగ నేల యప్పసమునన్ ♦ వ్యాఘ్రాసురారాతి చే
సినకార్యంబది యెద్ది యెట్లు జరిగెన్ ♦ శ్రీకంఠు డామౌనులన్
గని మన్నించెనొ లేదొ తెల్పఁగదె ద ♦ క్షత్వంబు వాటించుచున్.

మ॥ అని ప్రార్థించిన నందికేశుఁ డను కంపాయత్త చిత్తంబునన్
వినయస్వాంతు సనత్కుమారుఁ గని సం ♦ ప్రీతిన్ వచించెన్ గిరీ
శునకున్ దృష్టి నిగూర్చు వాంఛమెయి న ♦ చ్చోనున్న మౌనీంద్రు లె
ల్ల నిజాగ్నుల్ సతులున్ సతుల్ గొలువ హృ ♦ ల్లావణ్య దేశంబునన్.

చ॥ త్రిపురమదాపహారకుఁ బ్ర ♦ తిష్ఠితుఁ జేసి యవార్యభక్తి ని
ష్కపట మనస్కులై తపము ♦ సల్పుచునున్నెడ నాత్మ మెచ్చి య
త్తపసుల చిత్తవృత్తి విశ ♦ దత్వము భక్తి నెఱుంగఁగోరి లో
కపతి మహేశ్వరుండు శితి ♦ కంఠుఁడు దారువనాంతరంబునన్.

—♦ శివుండు దారుకావనముఁ బ్రవేశించుట ♦—

మ॥ ఘనుఁడా చంద్రకళాధరుండు వికృతా ♦ కారంబునన్ దారుకా
వనికిన్ బోవఁగ నేల యవ్వనమునన్ ♦ వ్యాఘ్రాసురారాతి చే
సిన కార్యం బది యెద్ది యెట్లుజరిగెన్ ♦ శ్రీకంఠు డా మౌనులన్
గని మన్నించెనొ లేదొ తెల్పఁగదె ద ♦ క్షత్వంబు వాటించుచున్.

మ॥ అని ప్రార్థించిన నందికేశుఁ డనుకం ♦ పాయత్తచిత్తంబునన్
వినయస్వాంతు సనత్కుమారుఁ గని సం ♦ ప్రీతిన్ వచించెన్ గిరీ
శునకున్ దృష్టిని గూర్చు వాంఛమెయి న ♦ చ్చో నున్న మౌనీంద్రు లె
ల్ల నిజాగ్నుల్ సతులున్ సుతుల్ గొలువ హ్యా ♦ ల్లావణ్య దేశంబునన్.

చ॥ త్రిపుర మదాపహారకుఁ బ్రతిష్ఠితుఁ జేసి యవార్య భక్తి ని
ష్కపట మనస్కులై తపము ♦ సల్పుచు నున్నెడ నాత్మ మెచ్చి య
త్తపసుల చిత్తవృత్తి విశ ♦ దత్వము భక్తి నెఱుంగఁ గోరి లో
క పతి మహేశ్వరుండు శి ♦ తికంఠుడు దారు వనాంతరంబునన్.

వ॥ వారి ప్రవృత్తి జ్ఞానంబు వారించి నివృత్తి మార్గం బుపదేశింపఁ గోరి.

—♦ దారుకా వనాంగనలు పరమేశుని గాంచి భ్రాంతచిత్తలగుట ♦—

చ. హరుఁడు దిగంబరుండును ద్వి ♦ హస్తుఁడు ముగ్ధుఁడు గృష్ణదేహుఁడై
దరహసితాననుం డగుచు ♦ దారువనంబునఁ జేరి భ్రూవిలా
స రుచితలిర్ప గానమును ♦ సల్పుచుఁ దద్యువతీ జనంబులన్
స్మరశర పీడితాంగలయి ♦ సంభ్రమ మొందఁగఁ జేసె నత్తఱిన్.

క॥ పతి దేవతలయ్యును వా రతి చంచల చిత్తలై ది ♦ గంబరుఁ డగు నా
క్షితి భృచ్చాపునిఁ గనుఁ గొని హతధైర్యలగుచును వెంట ♦ నరిగిరి వేడ్కన్.

చ॥ కువలయ పత్ర నేత్ర లొక ♦ కొందఱు బంధురమూర్తిన్ నామనో
భవహరుఁ గాంచు కోర్కెమెయి ♦ ద్వారము చెంతనె నిల్చి యాతనిన్
గలిసిన యట్లు సంతసముఁ ♦ గాంచిరి తన్మృదుహావ భావసం
భవదురు చిత్రచేష్టిత ర ♦ మా కలనన్ గృతకృత్యలున్ బలెన్.

మ॥ అరవిందానన యెవ్వఁడే యితఁడు చం ♦ ద్రాస్యుండు మహిమ్మగతిన్
స్మరబాణాహతి సొక్కఁ జేయునని యు ♦ త్సాహంబుతో నొక్కబం
భర నీలాలక సంభ్రమంబునఁ గుచ ♦ వ్యావృత్తి కృద్వల్కలాం
బరముల్ మెల్లనఁ బైకిఁ ద్రోయుచుటజ ♦ ద్వారంబుఁ జేరెన్ దగన్.

తే॥ మదవిఘూర్ణిత నేత్రలౌ ♦ సుదతులొక్క కొందఱయ్యెందుధరుఁ గాంచు ♦ కౌఁగలిగ
మునుకొని విలాస బాహ్యాల ♦ యున్న కడంక భ్రూవిలాసంబొనర్పఁగఁ ♦ బూనిరిపుడు
క॥ మొలనూలు జారిపడఁగఁగ దలఁగఁగ వసనములు హరుని ♦ దారె వశునిగా
సలుపుదు మనుచుఁ గొందఱు జలజాక్షులుదరహసనము ♦ సలిపిరి వేడ్కన్.
చ॥ తిరమగు మామనోఘనముఁ ♦ దేసవఁ గైకొని తస్కరుండు నాఁ
బరగి డెడేల నీవు మముఁ ♦ బాసి మనోహరరూప నిల్వవిగా
వరుగకుమంచుఁ గొందఱు ల ♦ తాంగులు లజ్జఁ దొలంగి పార్వతీ
వరుని గుఱించి పల్కుచు న ♦ వారితలై చనుదెంచి రయ్యెడన్.
క॥ ఇదె చిక్కెఁ గౌఁగలించుఁడు సుదతీమణులార మరుని ♦ సోయగమునకున్
బదని డెడు వీని నని య మ్మదవతు లెల్లరును సంభ్రమం పడి రపుడున్.
చ॥ మునిసతులొక్క కొందఱిదె ♦ పోయె భుజంగవతంసుఁ డింకనీ
తనిఁ జననీయకుండని ప ♦ థంబున కడ్డమువచ్చి నిల్చిరే
పున మఱి కొందఱంగనలు – పూరుషవర్యుడఁనంగ నీతఁడే
యని పరిహాసమున్ సలిపి ♦ రప్పుడు తత్పతులున్ గనుంగొనన్.
చ॥ మగువలు కొందరప్పు డస ♦ మాన వయోవిభవాభి రాముఁడా
నగ తనయా పతిన్ గని య – నంత గుణాఢ్యుఁడ వీవు నీకిటుల్
దగునె పరాంగనల్ నిలుచు ♦ తావునకున్ జనుదెంచి వారికిన్
దగులముఁ గూర్చుటంచుఁ బ్రమ ♦ దంబునఁ బల్కి హసించి రొక్కటన్.
ఉ॥ బంగరు బొమ్మలోయనఁగ ♦ భాసిలు కొందఱు కామినీమణుల్
పొంగుచు నృత్యమున్ సలిపి ♦ భూతపతిన్ ముదమొందఁ జేసి రు
త్తుంగ కుచద్వయంబు లవ ♦ ధూత మనోహర కంచు కంబులై
రంగులనీన దర్పక క – నంబులఁ జాచిన బొంగరాలనన్!
తే॥ తారు ముని పత్నులమటంచుఁ ♦ దలఁపగైరి కులసతులకిట్లు దగదని ♦ తలఁగగైరి
హరునిమాయ నెఱుంగలే ♦ కచనటి సతులు తారుమాఱైరి వివిధ శృం ♦ గారలీ
తే॥ వారిచేష్టలఁ గనుగొని ♦ పార్వతీశుఁ డుచితమన కనుచితమన ♦ కూరకుండె
నంత మునివర్యులెల్లరు ♦ స్వాంతములను తెలివి నించుకఁ గాంచి ♦ యధీరులగుచు

—♦ దారుకా వన మునులు శివునెఱుంగలేక పరుషంబులాడుట ♦—

ఉ॥ ఏటివిరుద్ధ దర్మమిది ♦ హేయము నాకపురంధ్రు లెల్ల రా
రాటమునన్ జరింతు రను ♦ రాగము పెంపున నీతఁ డెవ్వఁడి
చ్చోటకుఁ జేరుడేల పరి ♦ శుద్ధ పదంబునఁ బాపబీజముల్
నాటిన యట్లు మోహమును ♦ నాటఁదలంచుచు నున్నవాఁడిటన్.
వ॥ అట్లు

క॥ హరమాయా మోహితులై స్థిరతన్ గోల్పోయి మౌని • శేఖరులెల్లన్
గరముసుఖితులై పరమే శ్వరుఁగాంచి వచించి రిట్లు • భయరహితులునై.

మ॥ కలుషాత్ముండ వెవండ వీవు సుకృతా • కారంబునన్ వచ్చి పె
న్వలపున్ గూర్చుచునుంటి వీ సతులకున్ • బాపంబు నాకిందు మా
నుల తేజంబటి దుస్సహంబగుట యెం • దున్ గాంచవే తొల్లి ని
ర్మల మీదేశముఁ జేరుటొప్పునె యనం • భావ్యుల్ గదా త్వాదృశుల్.

క॥ పతి దేవతలై నిరతము వ్రతములను గృహించు నట్టి • పరకాంత లస
ద్గతిఁ గనఁ జేయుందగునే పతివిరహితలైన చెలుల • పట్లనువోలెన్.

తే॥ అలఘుమతుల పజ్జ • నడఁగి మడఁగి యుండ వలయుఁ గాక యిట్లు గలుషబుద్ధి
స్వైరగతిఁ జరింపఁ • జనునె శ్రేయముఁ గోరు నట్టి వారి కెనట • నైనఁగాని.

క॥ మునులన్ వంచింపఁ దలంచిన చెడుసులపడు నవస్థ • చెవిఁబడదె బళా
యనిమిష వర్యులె దుర్దశఁ గని కుందిరి పలుఁ జెప్పఁ • గా నేలయిఁకన్.

సీ॥ మునిశాపమునఁ గాదె • వనజోద్భవుని సేయు నగ్వరంబు విశాశ • మయ్యెఁ దొల్లి
భృగుకోపమునఁ గాదె • నగధరుండును దశ యోనులయందుఁ దా • నుదయమగుట
గౌతముఁ డలుగుటఁ • గాదె యాఖండలు నండద్వయము ఛిన్న • మగుచుఁ బడియె
ననఘ శాపమునఁ గా • దా వసువులు గర్భ వాస నరకమున • వనటఁ గనుట
నహుషునంతటి యాతండె • నాగమగుచుఁ దల్లడిల్లెను మునుల క్రో • ధంబు కతన
మౌని శాపంబు సామాన్య • మౌనె నీవు వారికన్నను నొక గొప్ప • వాఁడవగుదే.

క॥ స్రష్టనుగాదని వేరొక సృష్టి నొనర్పంగఁజాలి • చెలఁగె నొకండున్
కష్టాత్మ మునుల మహిమం బష్టశరీరునకునైన • నలవియె నొగడన్.

మ॥ మునివర్యుం డొకరుండు తొల్లి కలశాం • భోరాశిపై నల్గినం
తన తక్షీరచయం బపేయమగుటన్ • దైత్యారి నారాణసిన్
జనియచ్చో నవిముక్త లింగముఁ బ్రతి • ష్టన్ జేసి క్షీరాభిషే
చనమున్ సల్పి కృతార్థుఁడయ్యె ముని తే • జంబన్న సామాన్యమే.

తే॥ మఱియు మాండవ్యముని ధర్మ•ముఁ బాపుఁడిట్టె వృష్ణికులజులు కుటిలులై•కృష్ణు కతన
శాపమున్ గాంచి రారామ•జనవిభునకు నలిగెదూర్వాసముని పూర్వ•మందు వినవె.

తే॥ వంచనామతులై దుష్ట • వర్తనులగు వార లెందఱో మునిలోక పాళివలన
శాపముంగాంచి చెడరె నీ • చక్కఁగన్న నందరఅను మించునట్లుగ•నాత్మఁదోఁచె.

తే॥ అని శ్రుతికఠోరముగఁ బల్కు • నవసరమున వారికిన్ బ్రతిసెప్పక•వామదేవుఁ
డందరబ్బురమున్ జెందు • నట్లదృశ్యుఁ డైన నమ్మునివర్యులు • నాత్మలోన.

తే॥ అట్లదృశ్యుఁడైన • యాతని చరితంబుఁ దెలియలేక తారె • పలువిధములఁ
దలచి తలఁచి విసికి • జలజాసనునికడ కేగి రపుడు కాంతి • హీనులగుచు.

—• దారుకావనులకు బ్రహ్మదేవుఁ డతిథి మహిమ వినిపించుట •—

ఉ॥ వారలఁ గాంచి పద్మజుఁ డ • పార కృపాకలితాంత రంగుఁడై
దారువనంబునన్ శివకృ • తంబగు మాయయు మౌనివర్యులా
మారవిదారు బల్కుటయు • మానసమందుఁ దలంచి యిట్లనున్
సారెకు శంభుపాద జల • జంబుల భక్తిఁ దలంచు చయ్యెడన్.
చ॥ హరుడు దిగంబరుండనుచు • యాత్మఁ దలంపఁగ లేక మీరెదన్
గరుణవహించి వచ్చిన జ • గత్ప్రభుఁ గన్గొని యింత లేసిగాఁ
బరుసములాడి పంపితిరె • పాపము నాక యదృష్టహీనులై
దురితము గాదె మీకిపుడు • తోడయి సాయముఁ జేయబూనుటల్.
క॥ దారువనంబున వికృతా కారుండై యపుడు మీకుఁ • గన నయినయతం
డేరుద్రుఁడనితలంపక మీరలు సాహసముఁబూని • మీఱితిరతనిన్.
చ॥ శ్రుతిచయభూషితాంఘ్రియగు • సోమకలాధరుఁడట్లు కిల్బిషా
వృతులగు మీయెడన్ గరుణఁ • గృష్ణశరీరముఁదాల్చివచ్చినన్
హతమతులై యెఱుంగక మ • హాత్ముని దూరితిరింక మీకు స
ద్గతి యెటులన్ లభించునొ వృ • థాయయిపోయెను మీతపంబిలన్.
క॥ మిమ్ముఁబరీక్షింపక మో క్షమ్మిడగాదనుచుఁ దలఁచి • శంభుఁడతిథియై
సమ్ముఖమున కరుదెంచిన నెమ్మది నాదేవు నెఱుఁగ • నేరరయితిరే.
క॥ హరు నెఱుఁగ నేరకున్నన్ గరము వినయమును వహించి • ఘనతరభక్తిన్
దురితంబులువో నతిథికిఁ బరిచర్యయొనర్ప వలదె • నారక మీకున్.
క॥ అతిథియై యరుదెంచిన • యట్టివాని గారవింపక విడుతురా • ఘనులకెందు
నతిథియే పూజనీయుఁడై • యలరుఁగాదె కలదె వేర దైవ మతిథి • కన్న జగతి
చ॥ తపముల నెన్ని చేసినను • దానములెన్ని యొనర్చినన్ మహా
జపములు సల్పినన్ సవన • సంపతులెల్లొనరించినన్ మదిన్
గపటవిహీనుఁడై యతిథిఁ • గన్గొని పూజయొనర్పఁగల్గు న
య్యపరిమితంబునౌ సుకృత • మందున నించుకయైనఁ బోలునే.
తే॥ అతిథి యెట్టి దుష్టుఁ • డైన నాతని భక్తి యుక్తి గారవించు • టుచితమె యగు
నతనిఁగని విరూపి • యని సురూపియటంచుఁ దలఁపబోలదెట్టి • తగవరికిని.
క॥ అతిథియె పరమేశ్వరుఁడని మతిఁదలఁచి భజించునట్టి • మానవునకు స
ద్గతి సులభమగు నసాధ్యము క్షితిఁగలుగదు వాడె సకల • సేవితుఁడు నగున్.
తే॥ అతిథి సంతర్పణంబె గృ • హస్థులైన వారికెల్లను విహితమై • వసుధఁ జెలఁగు
నతిథిపూజా పరుండైన • యట్టివానిఁ గాంచినన్ మృత్యువేనియుఁ • గంపమొందు.

—* సుదర్శనోపాఖ్యానము. *—

తే॥ అతిథిపూజా పరుండగు ♦ నగ్రజుడు సుదర్శనుఁడు తొల్లి మృత్యువుఁ ♦ దగ జయించి
యభిమత సుఖాప్తి నలరారఁ ♦ డా ధరిత్రి నతిథిపూజను మించిన ♦ నదియుఁ గలదే.

వ॥ అతిథిపూజాఫలం బిట్టిదని వచియింప సాధ్యముగాదు. ఇందులకు నిదర్శనంబగు సుదర్శనోపాఖ్యానం బాలింపుఁడు.

చ॥ కలఁడు సుదర్శనుండను నొ ♦ కండు మునిప్రవరుండు తొల్లి ని
ర్మల చరితుండు ధీరుఁడు ని ♦ రంతర శంభుపదార్చనాపరుం
డలఘుఁడు సాధుసేవకుఁ డ ♦ హంకృతివర్జితుఁ డుత్తముండు ధ
ర్మలలితబుద్ధి సత్యనిధి ♦ మాన్యుఁడు పుణ్యుఁ డగణ్యుఁ డిద్ధరన్.

ఉ॥ ఆ వసుధాసురేంద్రుఁ డఖి ♦ లాగమ పారగుఁడున్ వివేక సం
భావితచిత్తుఁడౌట బుధ ♦ వర్గము తత్తదనూన ధర్మశా
స్త్రావన కాంక్షఁజేసి యన ♦ యంబు జనించెడి సంశయంబులన్
బోవిడుచుండు రా ఘనుని ♦ బ్రోల నిజార్థ మెఱింగి యెంతయున్.

మ॥ పరమేశాంఘ్రి సమర్చనా నిరతి న ♦ ప్పారుండు నిత్యంబు సు
స్థిరుఁడై భక్తులఁగూడి త్రిమ్మరు జగ ♦ త్క్షేమంకరున్ గన్గొనన్
గరణాశ్వంబులఁ గట్టివైచి యరివ ♦ ర్గంబున్ దగన్ గెల్చి స
త్పురుషుండై యితరంబువీడి కుతుకం ♦ బున్ బొందు యోగంబునన్.

చ॥ అతఁడు పరోపకారమతి ♦ యై యనయంబును సాధుసేవయున్
శ్రితజనరక్షయున్ గిరిశ ♦ చింతనయున్ మునిలోక గోష్ఠియున్
గ్రతురచనంబు ముఖ్యములు ♦ గా ద్విజవంశమునందు రత్నమై
వ్రతముల దానధర్మములఁ ♦ బండితవర్గముఁ దృప్తిసేయుచున్.

చ॥ తలపఁడు దుష్ప్రవర్తకుల ♦ ధర్మువు దప్పి చరింపఁబోఁడు సా
ధులయెడ గ్రోధముంగనడు ♦ తోరఁపుటాసమెయిన్ జరింపఁబోఁ
డలపులఁ జేరఁగాఁడు గిరి ♦ శార్చనసున్ విముఖుండు గాఁడు భ
క్తులవిడనాడి యుండఁడు కు ♦ తూహలచిత్తుఁడు విప్రుఁడెన్నడున్.

క॥ అతిథియె పరమాప్తుండని ప్రతిదిన మతిథులకు గౌర ♦ వంబును మతి స
మ్మతమైన భోజనంబిడి యతఁడున్ బరితృప్తిఁ గూర్చు ♦ ననవరతంబున్.

ఉ॥ ఆతని ధర్మపత్ని సుగు ♦ ణాఢ్య వయో విభవాభిరామ వి
ఖ్యాతచరిత్ర సంతత శి ♦ వాంఘ్రి సరోజ సమర్చనారతిన్
జేతము శుద్ధిఁజేయుచు న ♦ శేష సపర్యల సాధులోకమున్
బ్రీతివహింపఁజేసి పతి ♦ ప్రేమకు నాస్పదమై మెలంగుచున్.

క॥ పతియె నిరంతర సౌఖ్య స్థితికి నిదానంబు ముఖ్య ♦ జీవన మెందున్
బతికన్నఁగలదె యితరము సతికంచు మదిన్దలంచు ♦ సంతసమొందున్.

క॥ పతిసేవయె తన కుచిత వ్రతముగ భావించి సుగుణ ♦ రాశియయిన యా
సతి పతి ముదితాత్ముండగు గతిని జరించును సతంబు ♦ ఘనతరమతియై.

చ॥ పతిచరణాబ్జముల్ విమల ♦ భావతలంబున నిల్పి సంతత
స్తుతిపరయై ముదంబుగను ♦ సౌఖ్యఁ దరించితినంచు నుబ్బు వి
స్మృత సకలాన్య కార్యయగు ♦ శ్రీనగజా లసమాన మానస
స్థితమగు రాజహంసమును ♦ జేరితినంచు వచించు నెప్పుడున్.

తే॥ అసువద్యను చేసిన ♦ యధిక పుణ్య ఫలమె యీసతి యీసతి ♦ సలిపినట్టి
వ్రతఫలమె పతియని యెల్ల ♦ వారు వొగడ నారిదాంపత్య మిలమనో ♦ హరియయ్యె.

చ॥ పిలువకమున్న వచ్చి పని ♦ వెట్టుడు చేయుదు దాసుగాలనం
చెలమిని దోసిలొగ్గి వచి ♦ యించును చెప్పకమున్న సర్వమున్
సలుపు నితాంత భక్తి పతి ♦ స్వాంతము సంతసమొందునట్లు నా
జలరుహ నేత్ర నిత్యమును ♦ సాధుగుణాన్వితయై చెలంగుచున్.

క॥ తనమనసులోన వర్తించి నిరంతర ముదగి నుదగి ♦ సేవించుసతిన్
గనుగొని సుదర్శనుఁడు ముద మున నొకనాఁడిట్టులనియెఁ ♦ బూనికయలరన్.

మ॥ పరమేశార్చనకున్ నిదానము గురు ♦ త్వప్రాప్తికిన్ హేతు వ
త్యాసంతానము పట్టుగొమ్మ బుధసే ♦ వాలబ్ధికిన్ గారణం
బురుసౌఖ్య ప్రదమాశ్రితావన సము ♦ ద్యోగంబు మూలంబిలన్
దరుణీకంబె గృహస్థధర్మము మహా ♦ నందాహాస్పదంబై తగున్.

వ॥ అట్లు గృహస్థధర్మంబూనియుండువారిలో

చ॥ ఎవని గృహాంతరంబున న ♦ భీష్టపదార్థము లంది నిచ్చలున్
బ్రివిమలచిత్తులౌ నతిథి ♦ వర్గము లెంతయుఁ దృప్తిఁగాంచు నా
సవినయు గేహసీమ బుధ ♦ సన్నుత మాతని జన్మనిర్మలం
బవని నతండె పుణ్యుఁడు కృ ♦ తార్థుఁడు సాధుజనప్రియుండునౌ.

తే॥ అతిథి సంతర్పణంబులు ♦ యజ్ఞములును దేవతారాధనంబులే ♦ ధీరునింట
సతము జరుగుచునుండునా ♦ సజ్జనుఁడు మోక్షరమ కరము గ్రహింప ♦ దక్షుఁడగును.

చ॥ హరుఁడతిథి స్వరూపమున ♦ నాశ్రితభక్తజనంబుఁ బ్రోవఁగా
ధరణిఁ జరించుచుండునని తజ్ఞులు సెప్ప వినంగలేదె భూ
సురులకు నందు గేస్తులకుఁ ♦ జూడఁగఁ దక్కినవాని కన్న ను
ర్వ్యానధికంబెయౌ నతిథి ♦ వర్గముఁ దృప్తివడంగఁ జేయుటల్:

ఉ॥ సంతత దానధర్మములు ♦ సత్క్రతువుల్ జపముల్ దపంబు ల
త్యంతము భక్తితో సలిపి ♦ యాజకాన నేసినయట్టి పుణ్యమా
గంతులగొల్పు పుణ్యమున ♦ కన్న ఫలంబిడ నేర్చునే యుమా
కాంతుఁడు సంతతం బతిథి ♦ గావసుధన్ జరియించు చుండుటన్.

తే॥ "అతిథి దేవోభవ"యటంచు♦నాగమములు పలుకు టెఱుగ మెచ్చి త్రవి♦భ్రాంతితోడ
పండితమ్మన్యులైనవై ♦ తండిపు లిల నతిథులను గారవింపలే ♦ రైరి గాని.

ఉ॥ పూరుషుఁ డెవ్వఁడే నతిథి ♦ పూజయొనర్పక యెట్టి సత్క్రియన్
గారవమూని చేసియును ♦ గాంచఁగలేఁడు ఫలంబొకింత భూ
దారుని యాశ్రమంబున కృ ♦ తజ్ఞతఁ గాంచును గాని లేకదో
వారికులన్ భజించి నిజ ♦ వాంఛితమున్ బడయంగ నేర్చునే.

క॥ తనయింటి కాసఁగొనివచ్చిన యావేశికుని ద్రుఁ ♦ ప్తు జేయక తా స
ల్పిన భోజనంబు పలలం బును వోలె గృహస్థు నరక♦మునఁ బడఁ ద్రోయున్.

చ॥ ఇతఁడు భుజింపఁజేయుఁనని ♦ యొంతయు నాసవహించి వచ్చువా
రతిథులు వారికిష్టమగు ♦ నట్టి పదార్థచయం బొసంగి స
మ్మతిఁ బరితృప్తి, గూర్చిన ♦ మానవ్యుఁడు నిచ్చలు స్వర్గలోప సం
స్థితిఁగని సౌఖ్యమొందుచును ♦ దృప్తి వహించు సుధాశనంబునన్

వ॥ కావున మనయింట నెప్పుడును నతిథి సంతర్పణంబులు ముఖ్యంబులై జరుగుచుండ వలయు.

తే॥ పిన్న పెద్దల నెడి ♦ భేదంబుకూడదు పరులు జుట్టములని ♦ యనయదగదు
సుగుణి దుర్గుణియని ♦ చూడంగరాదింక నతిథి పూజనేయు ♦ నవసరమున.

తే॥ అతిథి యరుదెంచి యాసచే ♦ నడిగనేని యీను వలయును లేదన ♦ కెద్దియైన
నతఁడు సంతృప్తుఁడగు నేని♦ యంతకారి మదిని సంతృప్తినొందు ని♦మ్మహీసతంబు.

చ॥ కొడుకును జంపిపెట్టె నొక ♦ కోడదుఁ డొక్కకి భోజనంబు నొ
క్కఁ డతిథి యీశ్వరుండె యని ♦ కాంతి నొసఁగి తరించె వేరొ
కం డిడియె శరీరమెల్ల భుజి ♦ యింపుమటంచును గాన నీకిఁకన్.
దడయక సేయుమా యతిథి ♦ తర్పణమున్ బొలివోనిభక్తిమై.

క॥ ఏనింట లేనితటి నెవఁడే నతిథి గృహంబుఁజేరి ♦ యిడుమంచనిన
మానిని తావక దేహంబైన నొసఁగి తృప్తిఁ గూర్చు ♦ మా యాతనికిన్.

చ॥ అనివచియించి విప్రవరుఁ డ ♦ ర్థి మెయిన్ దనయింటి కేగుదెం
చిన పరదేశవాసులన ♦ శేష మనోహర భోజనంబులన్
దనియఁగఁ జేయుచున్ వివిధ ♦ ధానములన్ బరితృప్తిఁ గూర్చుచున్
వినయముఁ జూపుచున్ మెలఁగు ♦ విస్తృత కీర్తి రమాసమేతుఁడై.

వ॥ అట్లు సుదర్శనుండు నిత్యం బతిథి పూజలఁ జేయుచున్నంత నొక్కనాఁడు సమవ

—• యముడు సుదర్శనుని బరీక్షించుట •—

తే॥ తనతనుధనంబు లొసఁగి ని • త్యంబు నతిథి పూజసేయుచునుండు నా • భూమిసురుఁడు
వానిభక్తిఁ బరీక్షించి • వత్తుననుచుఁ దలఁచి బ్రాహ్మణవేషంబుఁ • దాల్చి యపుడు
చ॥ అకుటిలచిత్తుఁడైన వసు • ధామరు వాకిటనున్న యొక్క వే
దికపయి నట్టె కూలఁబడి • చీనుఁడ విప్రుఁడ జాతరంబు సై
పక యిటులేగుదెంచితిని • ప్రాణము నిల్పఁగదమ్మ యింత య
న్నక బలహీనుఁగదమ్మ యొక • నాటి మనుష్యుఁడనమ్మ మ్రొక్కెదన్.
శా॥ మూన్నాళ్ళయ్యెను కూడు ముట్టి యపరల్ • వోనున్న విప్పట్ల నా
కన్నం బింత యొసంగి ప్రోవగద వ • మ్మా వృద్ధుఁడన్ దిక్కులే
దన్నన్నా యెవరేని పల్కరది యే • లా గేస్తులౌ నారలే
మన్నింపంగఁ దలంపరై రతిథికిన్ • మాటీయరై రక్కటా.
క॥ అనివాపోవుచునున్నన్ గనుగొని వేవేగవచ్చి • కనికరమున వి
ప్రునిభార్య యతని కిట్లను ననఘా యాకొంటె కుడువు • మన్నంబిదటన్.
తే॥ కాళ్లు గడిగెదనీవు వే • న్నీళ్ళతోడ నింతచాలునో స్నానంబు • సేయొనర్చి
మడుగుదోవతి గట్టి వే • గుడు వదఁలదో వృద్ధుఁడవు నీ మనోరథ • మెద్ది చెవుమ
చ॥ భోజనశాలలోపల స • రూపసమన్వితమైన యన్నమున్
నేజని పెట్టు దచ్చుటికి • నీవరుదెంతువో మెల్లమెల్లగా
కీజగలేక నసించి భుజి • యింతువొ చెప్పుము ప్రొద్దుబోయనే
యోజఁ జరించు టిష్టమగు • నో ధరణీసురవర్య నీకిటన్.
వ॥ అనిన నా కపట విప్రుండు
తే॥ వృద్ధుఁడను కండ్లుగానవిం • తేని యింత దవ్వునడచుటచేతఁ బం • దములునొచ్చె
క్షుత్తుపీడించుచున్నది • చోటనుండి కదలఁగా నేరబళ్యమిం • క్కడికె తెమ్మ.
క॥ అనిన నాసతి బిరబిర • నరిగి యొక్క పళ్ళియంబున ఘృతసూప • పాయసాన్న
ములను గొనితెచ్చి వడ్డింప • భూమిసురుఁడుపడిచి సంతృప్తిఁ గాంచియా • పడతికనియె
మ॥ తరుణీ నాజఠరాగ్ని చల్లఁబడియెన్ • దాహంబు శాంతించెఁ ద్వ
త్కరుణానీతములైన భక్ష్యములు గ • క్రిం బారగింపంగ శం
బరవిద్వేషి శితాంబకంబులను నా • పై నాటఁగా సాగె నీ
పరితాపంబును మాన్పి ప్రాణములఁ గా • పాడన్ దగున్ నీకిటన్.
తే॥ క్షుత్పిపాసల బాధను • సులులుపోవ కుండ నిల్పితివేగాని • దండతాడి.
తోంగదశనములు వోలె • నుఱమునాటూ మరుని కోలల నేకిలి • మాన్పదలివా.

మ॥ పడఁతీ యీ కలిబాధ కించుక సహిం ♦ పన్ వచ్చునేగాని తుం
దుడుకై పిన్నలు పెద్దలంచనక వృ ♦ ద్ధుల్ నాక పెల్లుబ్బి మా
రుఁడు ధీరుండయి వేయు కోలలకు రు ♦ ద్రుం డైన నోర్వంగ శ
క్తుఁడె కాంతాకరుణావిహీనుఁడయినన్ ♦ క్షోభించుగా కిమ్మహిన్.
తే॥ అనుచు లజ్జావనతముఖి ♦ యైన సాధ్విఁ గాంచి మఱియును నిట్లను ♦ గపటవిప్రుఁ
డతిథినైవచ్చితిని మన్మ ♦ థార్తిఁబాప నిచ్చగింపవో ♦ చెప్పుమా యింతి యిపుడు.
తే॥ సిగ్గుపడెదవీవు ♦ చెనఁటివైయి మారుండు విడుచు కోలలకును ♦ వడకుచుంటి
నవునో కాదో చెప్పు ♦ మబ్జాక్షి వేరొక కాంతఁజేరి బ్రదుకఁ ♦ గందునింక.
ఉ॥ ఏమెలతాంగి మార్వలుక ♦ వీమెయి ప్రొద్దుగుచుండెఁ గాముఁడు
ద్దామశరంబులన్ గొని యె ♦ దన్ గుఱినేయుచునున్నవాఁడు నా
కామముఁ దీర్తొ తీర్పవొ యిఁ ♦ కన్ వచియింపుము లాతిచోటికిన్
బ్రేమువిడినేగి యిప్పుడ య ♦ భీష్టముఁ దీరుచుకొందు నెంతయున్.
చ॥ అనవుడు విప్రపత్ని వసు ♦ ధామరుపల్కుల నాలకించి యీ
యనఘున కిట్టికోర్కి తగు ♦ నా పతి దేవతయై చరించు కాం
తను గల యంగరమ్మనుట ♦ తండ్రినివోలె బహూకరించి యే
మని చెయిబట్టుదాన నక ♦ టా తగదంచును మందలింతునో.
తే॥ ఇరుగు పొరుగువార ♦ లిదివిన్న నేరీతిఁ దలఁతురొక్కొ కులము ♦ వెలితిఁబడదొ
ధర్మ సంశయంబు ♦ దగిలెనా మనసున నేమిసేయుదాన నిపుడు వీని.
మ॥ అతిథుల్ గల్గరె పుణ్యమూర్తులు మహీ ♦ యా వాసమున్ జేరరే
హితమృష్టాన్నమొసంగి వారిమొద నెం ♦ తే భక్తిబూజింప నే
యతులోత్సాహముతోడ వారరుగరే ♦ యాశీస్సులన్ బల్కి యీ
గతి సందిగ్ధ మొకప్పుడున్ గలిగనే ♦ కామించెనే యెవ్వఁడున్.
తే॥ వయసు చెల్లినవాఁడుసత్వము తలంగె మూఁడుకాళ్ళ ముదుసలియై ♦ బ్రొగ్గినాఁడు
ఇతనికేటికొ పరకాంత ♦ సతులఁజెఱచు పూన్కియేగాక యీబుద్ధి ♦ పుట్టెటిపుడు.
క॥ అని కొండొకతలఁచి సుదర్శనుని వచనమును స్మరించి ♦ సతి వృద్ధుని శం
భునిగను భావించి యతని ప్రణయంబును దీర్పనెంచి ♦ వారనిభక్తిన్.
ఉ॥ అంతట విప్రుఁగాంచి జల ♦ జానన యో ద్విజవర్య మాకు నా
గంతుఁడె యీశ్వరుం డతని ♦ కన్న మరొక్కటి లేదటంచు మే
మెంతుము గాన నీవు పర ♦ మేశుఁడవైతివి నీ మనోరథం
బెంతయుఁ దీర్చులే ఫల ♦ మహీనముగాఁ గనుపట్టుఁ గావునన్.
తే॥ కలుషమూలమైన ♦ కాయంబు నిక్కంబు గాదటంచు నెఱిఁగి ♦ ఘనులు తారు
తను ధనంబులొసఁగి ♦ తర్పణంబొనరింతు రతిథులైనవారి ♦ కనవరతము.

ఉ॥ ఎట్టి యసహ్యకారణ • మేని సహించుచు బాలు నేయియున్
బెట్టుచు జాగరూకులయి • పెంచిన యీ మలమూత్ర బద్ధమౌ
నట్టి శరీరమున్ దుదకు • నగ్నిని బూదియొనర్చుకంటె ని
ట్టిట్టనఁబోక శ్వాదృశుల • కీయఁదలంచుట మేలుగాదొకో.

క॥ ఇదె శయనాగారము నీ కెద సంతోషంబుగలుగ • నీసుచరిత్రన్
విదితముగ, ననుభవింపుడు మదనార్తిన్ దొలంగిమనుడు • మమతచెలంగన్.

చ॥ అని వినయంబు దంబు మెఱ • యంగ సరోజదళాక్షి వృద్ధ వి
ప్రుని మెలమెల్ల దోడుకొని • పోయి మనోహర పుష్పశయ్యపై
నునిచి సుగంధధూపమిడి • యుజ్జ్వలసైతగు దివ్వెఁబెట్టి ని
ల్చిన ధరణీసురుండును న • చేతనుఁడై కనుపట్టె నత్తఱిన్.

చ॥ హరిహర తారతమ్యము బు • ధావళికిన్ దెలుపంగఁగోరియో
పరమతఖండనంబు సలు • పంగఁ దలంచియొ యీశ్వరార్చకై
విరులును బిల్వపత్రములు • వేగొని తేనెనో పోయినాఁడు భూ
సురవరుఁ డాసుదర్శనుఁడు సూరివరేణ్యుఁడు వచ్చె నింటికిన్.

తే॥ అటులవచ్చి నిజాలయ • ద్వారదేశ మందు నిలిచి కవాటంబు నట్టె తట్టి
గడియ వేయఁబడినయట్లుఁగని యతండు కారణంబెఱుఁగఁగలేక • కలఁతపడుచు.

మ॥ అతివా లోపల నేమిచేయుదువు ర • మ్మా తల్పు దీయంగఁ దె
చ్చితి నర్హంబగు వస్తుసంచయము వేం • చేయంగ నున్నారు స
మ్మతి నావేశిసలెల్ల రిచ్చుటికి స • మ్మానంబుజేయందగున్
క్షితి నాగంతులె కాదె మాదృశులకున్ • శ్రేయస్కరుల్ చూడఁగన్.

తే॥ అనిన నాలకించి • యాసుహాసాభూమిసురుఁడు విసిగికొనుచుఁ • జూడ్కు లెఱ్ఱఁ
జేసి యిట్టులనియెఁ • జడుగ నీకిత్తఱిఁ బిలువఁదగునె పాప • భీతిలేక.

చ॥ తరుణియు 'నేనుగూడి సుర • తంబొనరింపఁదలంచియున్నచో
బిరబిర నేగుదెంచి చెలిఁ • బిల్చెద వేమిటికింత నిల్వక
కరణి నధూవరుల్ గలిసి • కామితమున్ బడయంగనున్న దు
శ్చరితులుగాక సాధువులు • సల్పుదురేయొక విఘ్న మింతయున్.

తే॥ అతిథు లేగుదెంతు • రని వేగిరంపడె దతిథులందుభక్తి • యగునయేని
యతిథి వాంఛితంబు • నఱపఁజేయుదే కపటమతివిగాక • కనుఁగొనంగ.

వ॥ అని పలికిన సుదర్శనుండు తద్వృత్తాంతం బెఱింగి సంతుష్టహృదయుండై యిట్లనియె.

మ॥ అనఘా యేను కృతాపరాధుఁడను గ • ర్వాంధుండనై మీ సుఖం
బునకున్ విఘ్నముఁగూర్చి యిట్టి కలుషం • బున్ గట్టుకొంటిన్ భవ

ఘ్నన కారుణ్యము నాయెడన్ నిలిపి మ ◆ త్కాంతామణిన్ గూడి చ
య్యన నా నేరమి సైపుమయ్య భవదీ ◆ యాంఘ్రిద్వయిన్ గొల్చెదన్.
తే॥ అతిథికన్న దైవ ◆ మన్యంబు లేదని యెంచుచుండువాఁడ ◆ నిటులఁ జెనఁటి
నగుచు నతిథి సుఖము ◆ నఱచేసితిని నాదు జనితరించుటెట్లు ◆ సాధుచరిత.
క॥ తెలియక యపరాధంబున్ సలిపితి మన్నించి విమల ◆ చరిత యయిన యీ
జలజాక్షి ననుభవింపుము పలువిధముల నీకెయిడితి ◆ భవనము గూడన్.
చ॥ చనియెద గేహమున్ విడిచి ◆ చయ్యన నేనిదె భూప్రదక్షిణం
బొనరిచి నాదొనర్చిన మ ◆ హోద్ధత దుష్కృతముల్ హరింతు నీ
వనితనుగూడి నిచ్చలు న ◆ వారిత సౌఖ్యము జెందుమింక నో
యనఘ చరిత్ర మాకులము ◆ నందలివారు కృతార్థులైతగన్.
వ॥ అనినఁ గృత్రిమభూసురుఁడైయున్న ధర్మరాజాతని మెచ్చి నిజరూపంబుఁ జూపుచుఁ గరుణాళుండై యిట్లనియె.
చ॥ అవని సుగాన్వయోదధి శ ◆ శాంక నినున్ మదిన్ మెచ్చితిన్ భవ
త్ప్రవిమల వర్తనంబునకు ◆ స్వాంతము సంతసమొందెఁ ద్వాదృశుం
డవని నొకండు కల్గనె గు ◆ ణాఢ్యుఁడు యాచకకల్పభూరుహం
బవిరళ మోక్షదంబగుఁ గ ◆ దా యతిథిప్రకారార్చనంబిలన్.
క॥ నీయభిమత మియ్యది సుగు ణాయత సంశయమువీడి ◆ యడుగు మొసఁగెదన్
గాయంబుతోడి స్వర్గమొ కాయజజనకాంతికంబొ ◆ కైలాసంబో.
తే॥ అతిథిలోకంబునకు నీవ ◆ యాశ్రయంబు నీమనసులోన వర్తించు నీమెలంత
తగిన దాంపత్యమిదియు కా ◆ దాఘరిత్రి నన్నివిధముల యోగ్యుఁడ ◆ వయ్య నీవు.
వ॥ భవాదృశులగు గృహస్థులకతన నాగంతులెట్టి యాతంకము లేక సుఖింతురని పలికి యా సుదర్శనున కనేక వరంబులొసఁగి శమనుఁడంతర్హితుండయ్యె.
క॥ కావునఁ బలుగతుల మహా దేవుండె యటంచు మది న ◆ తిథిగని భక్తిన్
సేవింపవలయుఁ బురుషున కావిర్భవమగును దాన ◆ నభిమతమెల్లన్.
తే॥ మీరు దురదృష్టవంతులై ◆ మిత్తిఁగొంగఁ గనుఁగొనెడు నేర్పులేక ని◆ష్కాముఁడైన
యమ్మ దేవుమాకితి ◆ రఘము నాక యిపుడు పరితాపమొందిన ◆ నేమిఫలము.
వ॥ పెక్కు జన్మంబుల నారాధించినను గనరానివాఁడు మహాదేవుఁడు సన్నిధికేతెంచిన నజ్ఞానంబునఁ దెలియలేక యాతని నిందించితిరి. మీదోషంబా పరమేశు ననుగ్రహంబునఁగాక వేరొకమార్గంబునఁ దొలఁగనేర దింక నయ్యద్రిజామనోహరు నాశ్రియింపుఁడనిన శారదాపతిన్ గాంచి యవ్వనవాసు లిట్లనిరి.
చ॥ వలవదు మాకుజీవితము ◆ వైభవముల్ పదివేలు కోర మీ
నెలఁతుల వంకఁ జూడము వి ◆ నీతులమై చరియింతుమింక నో

జలరుహ సంభవా సుమం బ్ర • సన్నుఁడవై కరుణింతువేని ని
ర్మలచరితుల్ బురాంతకుసు • మాధవుఁ గన్గొను త్రోవఁజూపుమా.

తే॥ మమ్ముఁ బ్రోవవచ్చి • మాచేతనే దూరు వడియె నట్టిహరుఁడు • వనటఁగుందు.
మాకుఁ గానఁబడునె • మమ్ము రక్షించునే యెదిత్రోవ యిప్డు • దేవదిక్కు.

తే॥ ఆశ్రమములందు సన్యాస • మధికమంద్రు తత్సహాయింబుకతన వి • పత్సమూహ
వారకుండగు హిమశైల • జారమణునిఁ గాంచు నేరుపుగలుగును • గాదె జగతి.

వ॥ కావున నుగ్రుండును భీముండును, కపర్దియునగు నా దేవదేవు దర్శించుటకై మాకు
సన్యాసయోగం బుపదేశింపుమని ప్రార్థించిన.

—• బ్రహ్మదేవుఁడు దారుకామునులకు సన్యాసయోగంబు జెప్పుట. •—

క॥ సన్యాసయోగమిల సామాన్యముగ గ్రహింపరాదు • మారవిదారుం
డన్యంబునఁ జిక్కఁడు స మ్మాన్యుండగుదాన నరుఁడు • మమతఁదొలంగుల్.

సీ॥ గ్రహణాంత మొండెలే • క పవియు రెండువ, త్సరములు భక్తి నా•చార్యునొద్ద
వేదముల్ పఠియించి • విమలబుద్ధిఁదదర్థ, ము నెఱింగి గార్హస్థ్య•మునువహించి
పూతచరిత్రులౌ • పుత్రులఁగని ముని, ధర్మంబుఁదెలిసి నం • దనుల నుచిత
వృత్తుల విభజించి • వెలయు నగ్నిష్టోమ, ముఖయజ్ఞముల దక్షి • ణఖనిహంత
యైన హరు యజించి • యమలాంతరాత్ముఁడై యడవిఁజేరి ద్వాద • శాబ్దములనొ
వర్షమాత్రమొండె • బదిరెండు పక్షంబు లొండొ నట్టిదినము • లొండెభక్తి.

వ॥ క్షీరమాత్రాశనుండై హోమంబుఁగానించి మంత్రపూర్వంబుగ యజ్ఞపాత్ర
ముల నుదకంబునంజేర్చి స్వీయధనంబెల్ల గురునకును విప్రులకును నొసంగి విరక్తుఁడై
సన్యసింపఁదగు "శిఖా యజ్ఞోపవీతంబులఁ ద్యజించి" భూస్వాహాయని పంచవా
రంబు లుదకంబున హోమంబుఁగావించి పర్ణపయోఫల వృత్తులలో నొకదాని
నిగ్రహించి జీవించియు మృతుండువోలె నుండఁదగు. ఈవిధికి భిన్నంబుగ సంచరిం
చిన భూసంచారముఁ గావింపఁదగు. ఇట్లు జరించునేని యతి ముక్తింగాంచఁగలండు
శివభక్తుండగు యతికిఁ ద్యాగంబును వ్రతంబులును యజ్ఞంబులును ననవసరంబులు.
శివభక్తిమహిమచే శ్వేతుండునాఁబడువాఁడు తొల్లి మృత్యువును జయించె. మీకా
తని చరిత్రంబు వక్కాణింతు వినుఁడు.

—• శ్వేతోపాఖ్యానము. •—

చ॥ అనఘుఁడు శ్వేతుఁడన్ మునివ • లాగ్రణి వేదరతుండు సత్యజీ
వనుఁడు దయాపరుండు నిర • వద్యచరిత్రుఁడు పార్వతీశ ప

ద్వనజసమర్చనాపహృత • పాపచయుండు తపఃప్రభావ జీ
వననిధి శిష్యవత్సలుఁడు • బ్రాహ్మణపుంగవుఁడొప్పు నిద్ధరన్.

ఉ॥ ఆమునిలోకవర్యుఁ డన • యంబు శమంబుఁ దమంబుఁ బూని ని
ష్కాముఁ డజాతశత్రుఁడు ని • గర్వుఁడునై సకలేంద్రియంబులన్
నేమముఁ జేసి చిత్తమున • నిష్ఠమెయిన్ భజియించుచుండు నా
సోమకళాధరున్ సకల • సూరినుతున్ నిగమాంతగోచరున్.

చ॥ తనకు శశాంకశేఖరు ప • దంబులు సేవ్యములౌట సన్యచిం
తన మొకయింత లేక నను • భాసురుఁ డెప్పుడు మేశు సత్కథల్
మననముఁ జేయుచుండు హరు • మంత్రములే జపియించుచుండు శం
భుని భజనంబె సేయుఁ బరి • పూతమనస్కుఁడు బ్రాహ్మణుండొగిన్.

తే॥ ఏది యెటులనున్న • నెవ్వరేమనుకొన్నఁ బలుకఁడింతయేని • పిలువఁడెవరి
మనసు హరుని పాద • వనరుహంబులనిల్పి పూజసేయుచుండు • భూసురుండు.

క॥ పురహరుఁడు రజతగిరి మం దిరుఁడగుటఁ దలంచియేమొ • ధీనిధియతఁడున్
ధరణీధర గహ్వరమునఁ స్థిరమతి లింగంబుఁ దాఁబ్ర • తిష్ఠగొనెచ్చెన్

చ॥ ధరణియుఁ జంద్రసూర్యులును • దారకలున్ నభమున్ గ్రహంబులు
న్మరధులు సప్తశైలములు • శక్రముఖామరులున్ విరించియున్
హరిహరులుండుదాక విమ • లాత్ముఁడునై గిరిగహ్వరంబునన్
బురహరు గొల్చుచుండునని • భూమిసురుండు వినిశ్చితాత్ముఁడై.

వ॥ అనుదినంబును నిష్ఠాగరిష్ఠుఁడై యీశ్వరు నారాధించుచుండు దినంబులయం దొకక్క-
నాఁడు దండధరుం.

ఉ॥ ఆయువుసీర శ్వేతునకు • నాతని ప్రాణములన్ హరింపఁగాఁ
బోయెద నాతఁడున్ హరునిఁ • బూజయొనర్చుచుఁ దాను శాశ్వతుం
డై యవనిన్ మనంగఁ గల • నంచుఁ దలంచుచున్నవాఁడు నా
కీయెడలన్ జయంబు లభి • యించుట యెట్లొ యెఱుంగనింతయున్.

తే॥ ఏమి సేయువాఁడ • నిట్టి సందిగ్ధమౌసమయమందు నాకు • సాయమెవఁడు
చేయఁగలుగుఁబరులు • సీయనరే యొక్క మనుజుఁగూర్చి యేను • వనటఁగనిన.

చ॥ అతఁడొ శివార్చనానిరతుఁ • డాయువొ చెల్లెను నేను కాలుఁడన్
బ్రతిదిన మేనొనర్చుపని • ప్రాణుల దండనసేయుచుంట నేఁ
డతులతపఃప్రభావుఁ డగు • నాతని దెత్తునొ యూరకుందునో
మతికిసుమంత తోఁచ ద • భిమానము నెండగుచుండె నక్కటా.

క॥ తన భక్తున కలిగితినం చనఘుఁడు చంద్రార్ధమౌళి • యాగ్రహమున దం
డన సేయఁడె నన్నా ద్విజుఁ గొనివత్తునయేని యింక • గోడువడంగన్.

చ॥ హరుఁడు మహానుభావుఁడు చ • రాచరలోకనియంత యాతనిన్
నిరతము పూజఁజేసెడి ము • నిన్ గరుణించుట యహా మంచులో
నరయుదు నేని నాకుచిత • మై తగు ధర్మ్మవుమీఱినట్లగున్
బురుషులు పక్షపాతమును • బూనితినంచు దలంతు రెంతయున్.

ఉ॥ మున్నొకవేళ నిల్లె ముని • పుత్రుని ప్రాణములన్ హరింపఁగా
నున్న హరుండు నన్నుఁగని • యుగ్రక శూలముకోడఁగ్రుచ్చి యా
పన్నని జేసె తజ్జనిత • బాధ శమింపఁగలేదు నేటికిన్
బన్నగభూషుఁ గైకొనక • బాడబు నెట్లు వధింప నేర్తునో.

తే॥ అపుడె చెప్పె శంభు • డాతనిభక్తుల జోలి మానుమనుచు • నేనయిపుడు
మునిసమీపమునకుఁ • బో నేర్తుఁ బోకున్న నెటులజరుగు లోక • వృత్తమింక.

వ॥ అని కొండొక చింతించి యెట్టకేలకు ధైర్యంబుఁ దాల్చి కార్యంబు తప్పివచ్చునదయేని యప్పుడ యీశ్వరు బ్రార్థింతునని నిశ్చయించి.

సీ॥ ప్రళయకాలాంబుద • ప్రథనోప్ప భీకరం బైన మహోగ్ర దే • హంబుతోడ
బ్రహ్మాండమందిర • ద్వారార్గళములట్ల నమరెడు బాహు దం • డములతోడ
కాలాగ్ర ధృతమహా • కాలోరగము వోలెఁ జటులమైయలరు పా • శంబుతోడ
హిమశైలశృంగ య • గమురీతిఁ జెన్నొందు నమలిన తీక్ష్ణ దం • ష్ట్రములతోడ
నంజనక్ష్మాధరోన్నత • మైన మహిష వాహనముతోడఁ గంపిత • ధ్వజముతోడ
దండధరుఁడు ప్రచండుఁడై • తపసికడను వచ్చె నప్పుడు భూతముల్ • విచ్చిపాఱ.

## — • శ్వేత యమ సంవాదము. • —

ఉ॥ అగతి వచ్చి నిల్చిన కృ • తాంతుని గన్గొని భీతచిత్తుఁడై
యోగివరేణ్యుఁ డీతఁ డె మ • హోన్నతకాయుఁడు వచ్చె నెట్టి దు
ర్యోగముఁ గూర్పఁగాఁ దలఁచు • నో పదివేల యుగంబులయ్యె నే
నీగిరి గహ్వరంబున ను • మేశుని గొల్చుచునుండ నేటికిన్.

ఉ॥ ఈతని బారిసుండి యిపు • డెట్లు తలంగఁగవచ్చు లోక సం
త్రాతవు మమ్ము వంటి ముని • రాజుల హింసయొనర్పఁ గూడదం
చీతని హెచ్చరింతునొగి • రీశ్వర పాదపయోజ చింతనా
ఖ్యాత సుధాశనంబు మెయి • నంతము లేదని నిశ్చయింతునో.

క॥ ఈ కాలుఁడు లోకాంతకుఁ • డా కామహరుం నంత • కాంతకుఁడగు నీ
ప్రాకృతుఁడు చంపఁబూనిన • నా కామవిరోధి ప్రోవఁ, డా నన్నింకన్.

ఉ॥ ఇందుకళాధరుండె సక ♦ లేష్టఫలప్రదుఁడంచు సంతతా
నందమయుండటంచు మది ♦ నమ్మి భజించెడి భక్తసంతతిన్
మ్రందగ జేయనున్నతటి ♦ మార్కొని కాలుని గిట్టడంపఁడో
యొందఁగఁ బ్రోవఁడో గిరిశుఁ ♦ డిట్టిద నాకు విచారమేటికిన్.

చ॥ నిమసమయేని వీడక ము ♦ నిప్రకరార్చిత పాదపద్ముఁడౌ
శమనవిరోధిపూజనము ♦ సల్పుచునుండఁ ♦ గృతాంతుఁ డెట్లు ధై
ర్యమును వహించి యిప్పుడు శి ♦ వార్చకు భంగముఁగూర్చి నాదు ప్రా
ణముల హరింపనేర్చునో య ♦ నంతుఁడు శంకరుడెట్లు సైఁచునో.

క॥ నాయసురుఁ గొనఁదలఁచి తా నీయెడకరుదెంచె శమనుఁ ♦ డేగతి నన్నీ
కాయజ హరు సామీప్యముఁ బాయగ నొనరింపఁగలఁడొ ♦ పదపడి యింకన్.

వ॥ ఏనింక ధైర్యంబుఁ గోల్పోవక పరమేశ్వరు నారాధించుచు భక్తత్రాణ పరాయణుండగు శివుండు నన్నీ యాపదనుండి రక్షింపఁగలఁడని విశ్వసించి రుద్రాధ్యాయంబు పఠించుచు లింగంబుసన్నిధినుండునని నిశ్చయించి యట్లా శైలగహ్వారంబున శ్వేతుండీశ్వరు బూజించుచుండె నంత.

ఉ॥ అంతకుఁడప్పుడా ద్విజకు ♦ లాగ్రణిచెంతకుఁజేరి నిర్మల
స్వాంతుఁడునై గిరీంద్ర తన ♦ యాహృదయాంబుజ మధ్యవర్తి యా
కంతువిరోధిసన్నిధి న ♦ ఖండ తపోనిధియై దిగంత వి
శ్రాంత మహోవిశాలుఁడగు ♦ నమ్మునిఁ గన్గొని కంపితాంగుఁడై.

తే॥ అహహ మధ్యందినార్క తే ♦ జోతిశాయి యగుచు నీతపోధనుని మ ♦ హస్సు వెలయు
నితని చెంతకుఁబోవుట ♦ యే భయంబుఁ గూర్చుచున్నది ప్రాణముల్ ♦ గొనుటయెట్లొ.

ఉ॥ ఈతని ప్రాణముల్ గొనుట ♦ కేనరుదెంచితిఁగాని నామనం
బీతతి నీమునీంద్రుపయి ♦ నింతయుఁ బాఱదు నోట మాట రా
దాతత భక్తియుక్తి గిరి ♦ శార్చనసేయు తపస్వి కార్య మే
రీతి యఘంబు నాకయె హ ♦ రింతు గృతాఘ్నతఁ గాంతు నియ్యెడన్.

చ॥ అని తలపోయుచున్ శమనుఁ ♦ డాత్మనొకించుక ధైర్యమూని య
మ్మునికులవర్యుఁ జంపుటయె ♦ ముఖ్యమటంచును నిశ్చయించి మె
ల్లనఁదన పాశమున్ గరము ♦ లన్ సవరించుచు దండతాడనం
బునగుహ మాఱుమ్రోయ ముని ♦ ముఖ్యునిఁ గన్గొనిపల్కె నివ్విధిన్.

చ॥ అవనిసురేంద్ర నన్నెఱుఁగ ♦ వా శమనుండను దక్షిణాశకున్
ధవుఁడ సమస్త భూతములఁ ♦ దద్దయుఁజంపెడి పాలుపత్తెమున్
బ్రవిమలబుద్ధిఁగైకొని య ♦ వారితరీతిఁ జరించువాఁడఁ బ్రా
ణివితతికెల్ల నాయకుఁడ ♦ నేను శ్రుతీహిత ధర్మరూపుఁడన్.

చ॥ అకుటిలచిత్తులై స్వవిహి ♦ తాఖిల ధర్మపథానుగాములై
ప్రకటిత దివ్యతేజులయి ♦ బంధురకీర్తి సమేతులై బుధ
ప్రకరవిధేయులై తనరు ♦ ప్రాజ్ఞులకున్ సురలోకవాసమున్
సకల శుభంబులిచ్చి విల ♦ సత్కృపఁ గాంతు ననారతంబిలన్.

చ॥ కరణతురంగసంహతిని ♦ గట్టెడి నేరుపులేక దుష్కృతా
చరణమె గారవించుచును ♦ సంతతమున్ ధనలుబ్ధులై నిజో
దర పరిపోషణార్థమయి ♦ తజ్ఞుల వంచన సేయఁ జూచు ము
ష్కరులను జాలిపీఁడిన ర ♦ కంబునఁ జేరిచి హింసఁ జేయుదున్.

తే॥ ఎట్టి సుకృతవంతుఁ ♦ డేని పాతకియేని మామక కృపలేక ♦ మనఁగ లేఁడు
సర్వమునకు నేను ♦ శాసనకలనను నాయధీనము భువ ♦ నత్రయంబు.

తే॥ ఎవని కాయుష్యపరిమాణ ♦ మెంతకలదొ యెవనిచేసినసుకృతదు ♦ ష్కృతములెవియొ
యెవనిగతి యెట్టిదియొ సర్వ ♦ మెఱిఁగి నేను సంచరించుచునుందు నిచ్చలు జగముల.

ఉ॥ ఆయువు తీఱినంతఁ దృటి ♦ యైనను నిల్వఁగనీక ప్రాణముల్
గాయమునుండి పాపి యెడి ♦ కంబున వారల కర్హమైన సౌ
ఖ్యాయతనంబొ పాపనిల ♦ యంబొ యొసంగుట నాకు నిచ్చలున్
న్యాయముగాన యిట్లు వసు ♦ ధామర యేను చరింతు నెల్లెడన్.

ఉ॥ కాలముచేఱె నీకిపుడు ♦ కావున నేనిదె వచ్చినాఁడ నా
ప్రోలికి నీదు ప్రాణములఁ ♦ బూనికఁ గైకొని పోఁదలంచి నీ
శీలము సద్గుణంబులును ♦ శ్రేష్ఠతయున్ నిను నింగ ప్రోవఁగా
జాలవు స్వర్గమో నరక ♦ సంగతియో లభియించు నీకికన్.

క॥ ఇదె మత్పాశము దీనన్ బదిలంబుగఁ బ్రాణములను ♦ బంధించి ముదం
బొదవఁగ మత్పురిఁ గొనిపోవుదుఁ గాంచితె దీని మౌని ♦ పుంగవ యిపుడున్.

చ॥ అనవరతంబు సాధువుల ♦ కాశ్రయమై సుకృతంబొనర్చు స
జ్జనులకుఁ గుందదామమయి ♦ సంతసముం బొనగూర్చు దుష్టులై
మనుగడ నిత్యమంచుఁ బలు ♦ మార్గములన్ జరియించుచుండు దు
ర్జనులకుఁ గాలసర్పమయి ♦ సాధ్వసమున్ గలుగించు నిచ్చలున్.

క॥ అని పాశమతని కంఠం బున వైవఁగఁ బోవుటయును ♦ మునివర్యుఁడు కా
లుని గూర్చి వలవదుడుగుము చనునే దండధర యిట్టి ♦ సాహసము మదిన్.

మ॥ హరుఁ బూజించుచు నున్నవాఁడ నిపుడే ♦ లా నన్ను రమ్మందు భా
స్కరపుత్రా యిది నీకు ధర్మమగునే ♦ సత్కార్యముల్ సేయుచున్
స్థిరులై యున్న మునీంద్రులన్ బిలుతురే ♦ నేమంబు చేకూరునే
పరఁగన్ దావకధర్మరాష్ట్రమున కీ ♦ పాటే ఫలంబౌనకో.

తే॥ ఏన ధర్మనియంతనం • చెప్పెడె పల్కి నాఁడవుగదా హరుని పూజ • వీడి యెటుల
రమ్మనఁగ గల్గితివి దు • ష్కరమ్ము గాదె ధర్మమే యిట్లుబల్కుట • ధర్మరాజ.

మ॥ శమనా నాయుసురల్ గ్రహింపమది ను • త్సాహంబెయానేమొ నెమొ
క్క ముహూర్తంబు సహించి నిల్వఁదగదే • గౌరీశు పూజావసా
నముఁ గావించెదనంతలోనె బలవం • తంబైన పాశంబులో
శమముల్ బూనక కట్టనెంచెదవు నీ • సామర్థ్యముల్ జూపుచున్.

క॥ హరపూజా విఘ్నకరుల కరయగ శ్రేయంబుగలుగు • నా నన్నిటులన్
ద్వరసేయు టేమిఫలమూ ధరణిని నీకౌలుఁగరాని • ధర్మవుకలదే.

వ॥ అనిన దండధరుండు ప్రచండుండై యుద్దండగతి నిట్లనియె.

శా॥ నీకున్ గాలముచెల్లిపోయెనిపు డిం • తేసైపఁగాఁబోల దా
శ్రీకంఠుండయినన్ రమేశుఁడయినన్ • జేవోడు గావచ్చి తా
రీకాలున్ దలఁగింపనేరరు వృథా • యీ వాగ్వివాదంబు లే
లా కానున్నది కాకమానదిఁక లె • మ్మా ప్రొద్దువోయెన్ గదన్.

ఉ॥ ఎందఱు పుట్టరో జగతి • నెందఱు చావరొ వారిలోన నీ
వెందులకైన సాటియగు • దే హరుఁ గొల్చినయంతమాత్ర నీ
యందున భీతిఁ గాంచి విన • నాడుదునే యిటువంటి వెఱ్ఱి నీ
కెందులకయ్య రమ్మమిఁక • మృత్యువుఁ గెల్చినవారలుందురే.

క॥ ఈతుచ్ఛమైన తనువునఁ బ్రీతివహింపఁగనేల • పృథ్వీసువి
ఖ్యాతి మగు త్రిశివమిపుడ నిరాతంకగతిన్ లభించు • నట్టిది కాఁగన్.

మ॥ హరుఁ బూజించుచునుంటినంటివిది మే • లౌ త్రోవయే ధాత్రిపై
హరభక్తుండయినంతమాత్రమున న • ష్టాయుష్కుఁడౌనాతఁడున్
మరణంబొందక నిత్యుఁడై వెలయునే • మత్పాశముల్ ద్రెంచునే
హరుఁడన్నన్ హరియన్న నాకు భయ మే • లాగల్గు ధర్మంబునన్

వ॥ అనిన శ్వేతముని నిర్భీతుఁడై దండధరున కిట్లనియె.

చ॥ హరుఁడు ప్రపంచనేత పర • మాత్ముఁడు శంకరుఁ డమ్మహాత్మునిన్
నిరతము నిశ్చలాత్ములయి • నిష్టభజించెదువారు మృత్యువున్
ధరణిజయించి నిత్యులయి • తారు సుఖింతురుగాని, ఘోరమౌ
నరకమునొంది కుందుదురె • న్యాయము నాక వచింతుగాకిటుల్

ఉ॥ కాలముసీ తెలసంచు నను • గంపితుజేయఁగఁ బూనెదేల యో
కాల కృపాలవాలు సితి • కంఠుని జేరిన నాకు భీతియే
లీలజనించుఁ ద్వాదృశులు • లెక్కకు మించినవారలైన నా
శూలిని గాదటంచునను • శ్రుక్కఁగఁ జేయఁగలారె యింతయున్.

ఉ॥ దక్షమఖారిఁ గైకొనక • తద్దయు గర్వమునన్ జరించె దీ
దక్షిణ దిక్ప్రభుత్వమును • దండధరత్వమొసంగినట్టి వాఁ
డక్షయుఁడైన యీశ్వరుఁడె • యాఁగద విస్మృతిఁ గాంచినాఁడవే
రాక్షసహంతయైన హరు • రాజకళాధరు నాశ్రితావనున్.

ఉ॥ వచ్చిన త్రోవఁబొమ్ము పుర • వైరిమహత్త్వ మెఱింగెఱుంగన
ట్లిచ్చట మాటలాడనిఁక • నేమిఫలంబు లభించు శైవులన్
హెచ్చిన గర్వమూని వధి • యింపఁగఁజూచుట నీకుఁగీడెయౌ
నచ్చుపుఁ జీఁకటిన్ బడకు • మంతక తీరినకన్నులుండియున్.

క॥ శివపూజానిరతుల కిట్లనిశ యమబాధ కలుగు • ననెదట్లయినన్
శివునిభజించెడివారెవ రవనిన్ నీకతనశివుఁడె • యంతంబగునే.

క॥ అనుటయు దండధరుఁడు లోచనముల నిప్పులు సెలఁగ • జటులార్భటి హుం
మ్మని సింహనాద మొనరించి నిశిత దంష్ట్రోగ్రుఁడగుచుఁ • జెలఁగుచు నంతన్.

మ॥ నినురక్షింపఁదలంచి శంకరుఁడె రా • నీ మామకాభీల పా
శనిబద్ధాంగునిగా నొనర్చికొని పో • శక్తుండనా యీశ్వరా
గ్రహమున్ జేసినయంతమాత్రమున నీ • ప్రాణంబులీ ధాత్రి ని
ల్చునె యీ కాలుని బారికిన్ బడక యే • లోకంబునన్ డాఁగినన్.

క॥ హరుఁడేఁడీ నిశ్చేష్టం బరయఁగ నీయంకభాగ • మందునఁ గలఁడే
కరుణ నిను బ్రోవరాఁడే ఫణీశ్వర మత్ప్రతాప • దహనము నాఁపన్.

వ॥ అని యమ్మునిని బలిమిదన పాశంబునఁ గట్టిన నతండును.

శా॥ ఓ వాగీశముఖామరార్చితపదా • యో నిర్వికల్పప్రభూ
భావాతీత శ్రితావన క్షమ జగ • ద్బంధూ దయాంభోనిధీ
దేవా తావక పాదసేవకుఁడ నన్ • దీనుండ రక్షింపఁగా
రావేమీ కరుణింపవేమి సురవ • ర్యా దీనరక్షాకరా.

క॥ అని పరిదేవన మొనరించిన యజ్ఞధ్వంసి హరుఁడు • శ్వేతమునీంద్రున్
దన భక్తుఁ బ్రోవ శమనున్ ఘనతర రోషాగ్నిఁ గాల్పఁ • గా నయ్యెడలన్.

క॥ గిరిజాసహితుఁడు నందీశ్వరవాహుఁడు ప్రమథనికర • పరివృతుఁడగుచున్
బిరబిర నేతెంచిన భీకరమూర్తిన్ యముఁడు తనువు • కంపమునొందన్.

వ॥ దేవా జగద్వ్యాపకుండవగు నీప్రభావంబెఱుంగక నాచేసిన యపరాధంబు సైరిం
రక్షింపుమని సాష్టాంగ ప్రణామంబుఁ గావించి గద్గదస్వరంబున వేఁడిన దీనరక్షకుం
డగు శివుండాతని కరుణించి యిట్లనియె.

క॥ కలనైననింక నా భక్తులయెడ నాగ్రహముఁ జెంద • కుము నాయందున్
వలె శైవులందు వినయము గలిగి ప్రవర్తింపు ముచిత • కార్యములందున్.

ఉ॥ ఈమునివర్యుఁ డుత్తముఁ డ • హీనగుణాఢ్యుఁడు నాకు భక్తుఁ డీ
భూమిసు రేంద్రునిట్లు పరి • భూతునిజేయఁదలంచితే మదీ
యామక కోపవహ్ని కణు • మాత్రమరయేని సహింప నేర్తువే
తామసమూని నాకనుచి • తంబుగఁ ద్రిమ్మరు టొప్పునే ధరన్.
తే॥ ఇతని కాయువునీ కెఱ సం • చీవు మదినిఁ దలఁచినచ్చితి వేకాని • తులువవగుచు
నితనికలమున నీయాయు • వే ధరిత్రిఁ జెల్లునని యెంచవైతివి • చెడుగుబుద్ధి.
వ॥ నీవు యమలోకాధిపత్య గర్వంబునఁజేసి మదీయ ప్రభావంబెఱుంగక నాభక్తున
కపకారం బొనరింపఁబూనినను నీయం దనుగ్రహంబుఁ జెందితి నీనాటికి నీవదృష్టవం
తుఁడవింక నరుగుమనిన నంతకుండు మెల్లన నరిగెఁ బరమేశ్వరుండును శ్వేతమునికి
నలసిన వరంబులొసంగి యంతర్హితుండయ్యెఁ గావున.
చ॥ పలుకులు వేయునేమిటికి • భక్తికతంబున భుక్తిముక్తులున్
గలుగును కామవైరి యను • కంపవహించుచు వశ్యుఁడౌ నిలన్
దలఁపగ భక్తిసాటియొక • తత్త్వము కల్గదు భక్తిచేఁగదా
యలఘుఁడు శ్వేతమౌని శమ • నాతిఁ గొలంగి సుఖంబుఁగాంచుటల్.
క॥ కావున మీరు స్థిరాత్ముల వై వృషభధ్వజునియం ద • యమలిన భక్తిన్
గావింపుఁడు తత్కృపచే నావిర్భవమొందు మీకు • నఖిలశుభంబుల్.
చ॥ అని పరమేష్ఠి పల్కిన ము • దన్వితచిత్తులరౌచు దారుకా
వనమును లెల్ల రిట్లనిరి • వారిజసంభవుఁగాంచిరే తపం
బున మతిమెట్టి యజ్ఞమున • భూమి పరల్ భవభక్తులౌదుగో
యనఘ వచింపవే కరుణ • నాశ్రితవత్సలయన్న బ్రహ్మయున్.

—• బ్రహ్మదేవుండు దారుకామునులకు లింగపూజావిధి నెఱింగించుట •—

సీ॥ దానంబుచేత న • ధ్వరములచే తపం బులచేత మఱియు వి • ద్యలకతమున
వ్రతములు యోగశా • స్త్రములచే శ్రుతులచేఁ బరమేశ్వరునియందు • భక్తికలుగ
దమలపూజావిధా • నమునఁ గాక సతంబుశివభక్తునకసాధ్య • మవని లేదు
నావిని మునులెల్ల • నావిరించికి మ్రొక్కి రేనును శివభక్తిఁ • బూని మృత్యు
వును జయించితి చ్యావనుం • డనెడు మునియె హరిని నిర్జించిశ్రుపసరా • వరునిపాద
తలమునఁ గొట్టి శివభక్తి • వలనఁగాదె వజ్రిశల్యుండగుచు నొప్పె • వసుధయందు.
వ॥ అని వచియించి నందికేశ్వరుఁడు సనత్కుమారుని గాంచి యిట్లనియె. అట్లు దారుకా
వన మునీంద్రులు విరించికి మ్రొక్కి శివభక్తి గలుగు మార్గంబుపదేశింపు మనినఁ
గాంచన గర్భుఁడిట్లనియె.
తే॥ వేలుపులయందు బుషులందుఁ • బితరులందుఁ గనుఁగొనఁగ మహాదేవునకన్న జగతి
నున్నతుఁడు గానరాఁడు వి • పన్న శరణుఁ డాతఁడె మహేశ్వరుండన • నలరు నెపుడు.

సీ॥ ఆమహేశ్వరుఁడు మ • హాకాలుఁడై నాల్గు వేలయుగంబులై • విగమసమయ
మరుదెంచినప్పుడ • యఖిల భూతంబుల సంహరించును స్వతేజంబుచేతన
మరల సృజించు న • మ్మహితాత్ముఁడే చక్రి వజ్రియు శ్రీవత్స • వక్షుఁడు
కృతయుగంబున యోగి • త్రేతయందుఁ గ్రతువు ద్వాపరమందుఁ గా • లాగ్నికలి
ధర్మమగుచు వినుతిఁగాంచుఁ • దత్పదాబ్జ సంగతిని మహాయోగి సంచయమ్ము ముక్తి
కామినీ కరముగ్రహించి • కలుషపాశ సంతతిని ద్రెంచుచుందురు • సంతతంబు.

వ॥ పరమేశ్వరు ననన్యగతమానసులై పూజింపక భక్తిజనింపదు. కావున ముందుగ రుద్రుని శ్వేతమూర్తులఁ బండితులు ధ్యానింతురు. చతురశ్రింబును, బిండికాశ్రయము బహిరంతర్భాగములయం దష్టాశ్రింబును, సుదర్శనంబును, యోగ్యంబును, నగు లింగంబును బూజింపఁదగు. తమః ప్రధానుండగు నగ్నియు, రజఃప్రధానుండగు బ్రహ్మయు, సత్వప్రధానుండగు విష్ణుండును, పరమేశ్వరరూపంబులు. కావున దేవదేవుఁడును, నీశానుండును నవ్యయుండును నగు ప్రభుండీశ్వరుండయని జితేంద్రియులగు విప్రులు పూజింతురు.

సీ॥ అంగుష్ఠమాత్రంబు • నఖిలలక్షణసంయుతము సుశుభము సువృత్తంబు సర్వ
జనసమ్మతంబును • సమనాభమును షోడశాశ్రయుతంబో య • ష్టాశ్రయుతమొ
యగు లింగమునుగూర్చి • తగునట్లు దానికి సమముగనో ద్విగు • ణముగ గోము
ఖాకారమగు వేది • నమరించి యంతట యవమాత్ర పట్టిక • యలవరించి
స్వర్ణరాజిత తామ్ర పా • షాణమయము గానొనర్చి వేదికయందుఁ • గలశమొకటి
స్థాపనముఁజేసి భక్తిని • శ్చలులగుచును బూజసేయంగవలయును • భూమిసురులు.

వ॥ పంచబ్రహ్మ మంత్రంబులచే నభిమంత్రించి సహిరణ్యంబును సబీజంబును నగు లింగంబును నీవిధంబుగఁ బూజింతురేని పరమేశ్వరుండు వారియెడలఁ బ్రసన్నుండగు బొండు.

సీ॥ అని పరమేష్ఠి ప • ల్కిన దారుకావన మునిపుంగవులు ముదం • బును వహించి
యాశ్రమంబులకేగి • యజుఁడు చెప్పినరీతి స్థండిలంబుల గుహా • స్థానములను
బులినతలంబులఁ • బూజింప సాగిరం తర్జలావాసులై • లేఁరు భక్తి
నటులొక వత్సరం • బగుటయును వసంత సమయంబునందుఁ దు • షార గిరివి
హారుఁడు కరుణాళుఁడై ముని • వరుల కిష్టవరము లొసఁగఁదలఁచి దిగం•బరుఁడువికృత
లక్షణోపేతుఁడును భస్మ • లక్షితాంగుఁ డగుచు దారువనంబున • యందుఁజేరి.

తే॥ ఉల్ముకవ్యగ్రహస్తుఁడు • నుచితరక్త పింగళాక్షుండు నగుచును • భీకరముగ
నొక్కపరినవ్వు మఱియు వే • రొక్కతఱిని దరహసనమొనరించు న•తంద్రితుఁడయి
తే॥ ఆడునొక్కవేళఁ • బాడు నొక్కప్పుడు పరుగువారుచుండు • భయముఁ జూపు
నాశ్రమాయులఁగని • యాచించు భిక్షంబు మాయియగుచు నతఁడు • మాధవుండు

చ॥ అదిగని మానివర్యులితఁ ◆ డంధకవైరియొయకాను గాని చో
నదవద లేక యిట్లు మన ◆ యాశ్రమ దేశముఁ జేర నేర్చునే
మదనవిరోధికిప్పటికి ◆ మాయెడ సత్కృపఁ గల్గెనంచుఁ దా
నెదఁ గుతుకంబునొందుచు న ◆ హీనగతిన్ స్తుతియించిరీశ్వరున్.

ఉ॥ అంబుజసంభవాది సుర ◆ లైనను తావక చిత్రమౌ చరి
త్రంబు నెఱుంగలేరనినఁ ◆ దద్దయు మాకెఱుఁగంగ నౌనె యో
యంబరకేశమా సలిపి ◆ నట్టి యఘంబులు వాయ నీదు పా
దాంబుజభక్తి నే యొసఁగు ◆ మా వినుతింతుము నిన్ను నిచ్చలున్.

సీ॥ కాలత్రయంబులఁ ◆ గలుగు స్థావర జంగమంబైన యీ ప్రపం ◆ చంబు తావ
కశరీరమున బుట్టుః ◆ నశ్మలంబైన యీ తను వనిత్యంబని ◆ తలఁచి యెల్ల
సిద్ధులు మునులును ◆ సేవించెదరు నిన్ను త్రికరణశుద్ధిగ ◆ దేవదేవ
యజ్ఞానహతులన ◆ ప్రాజ్ఞుల మమ్మిట్లు గావవచ్చితి నీవు ◆ కనికరమున
వేద వేత్తలైన ◆ విబుధులేరూపంబుఁ గాంచఁ గోరుచుందు ◆ కలుష నాశ
కమగు నట్టి రూపుఁ ◆ గానంగఁ జేసి రక్షింప వేడెదము ని ◆ లింపశరణ.

ఉ॥ తావక దివ్యరూపము ము ◆ దంబునఁ గన్గొనఁ గోరుచుంటిమో
దేవ జగత్త్రయీవినుత ◆ దీనశరణ్య భవత్పదాబ్జ సం
సేవకులన్ మముల్ గరుణఁ ◆ జేసి కృతార్థులఁ జేయుమయ్య లో
కావనదీక్షఁ బూని యన ◆ యంబుఁ జరించుచునుందు వీవిలన్.

మ॥ అని ప్రార్థించిన చంద్రశేఖరుఁడవి ◆ ద్యానాశకృద్దివ్య లో
చనముల్ వారికొసంగి యోగిజనతా ◆ సంతోష సంధాయకం
బు ననూనంబు సురాసురప్రకర సం ◆ పూజ్యంబు బ్రహ్మాది లో
క నియంతృస్తుతిపాత్ర మాత్మతనువున్ ◆ గాన్పించినన్ వారలున్.

తే॥ అటుల నిజరూపమును జూప ◆ నఖిలమౌని శేఖరులు కౌతుకాబ్ధి వీచికలయందు
దోఁగుచును శ్రుతి విహితోక్తి ◆ నాగభూషణుని వినుతిచేసి పల్కి రిట్లు నకళంక.

సీ॥ నీవు బ్రహ్మ వఖిల ◆ నిర్జరులందున నీలలోహితుఁడవు ◆ నిఖిలరుద్రు
లందు భూతంబుల ◆ కాత్మస్వరూపుఁడ వరయ సాంఖ్యులు బుధ ◆ సాఖ్యనిన్ను
వినుతింత్రు గిరులందు ◆ వెలయుదు మేరువట్లు డురాశిఁ బూ..ల్ చం ◆ ద్రుఁడవు తలఁప
బుషులం దరుంధతీ ◆ హృదయేశుఁడవు శ్రుతు లందు నోంకారమై ◆ యొప్పుచుందు
నటవులకు, పశువులకుఁ బం ◆ చాస్యమీవ యిదియనియనంగ నేల రే ◆ పెట్టి భావ
మును వహించిన నట్టి రూ ◆ పును వహించి కానఁబడుచుందు వెప్పుడో ◆ దీనశరణ.

— శివుఁడు దారుకావన మునులకు హితోపదేశము జేయుట. —

క॥ అని వినుతించి వచించినఁ గనుగొని యమ్మునుల నిఖిల ◆ కామ్యఫలదుఁడా
త్రిణయనుఁడు వారికిట్లను ననుకంపాసహితబుద్ధి ◆ నవ్యాజముగన్.

చ॥ హితమువచింతుమీకు వినుఁ ♦ డీ మునులార సమాహితాత్ములై
యతులము సర్వసమ్మత ర ♦ హస్యము పద్మభవాది నిర్జర
ప్రతతి కెఱుంగరానిదియుఁ బ్రాజ్ఞజనైక ముదావహంబు స
ద్గతికి బదంబు సృష్టికిని ♦ గారణ ముత్తమ సమ్మతంబికన్.

సీ॥ శ్రీలింగమఖిలంబు ♦ దేవియా ప్రకృతి రూపంబది నా దేహ ♦ భవమె యయ్యెఁ
బుంలింగరూపంబు ♦ పురుషుఁడతండును నాశరీరమున యం ♦ ద జనియించె
వారికతంబున ♦ వఱలు సృష్టి ధరిత్రిఁ గావున యతిఁగాంచి ♦ కనలవలవ
దతఁడు దిగ్వాససుం ♦ డయ్యె సేవ్యుఁడైయగు భస్మనిరతులును ♦ భస్మదగ్ధ
కలుషులగుచు విహిత ♦ కార్యాభిరతిఁ జరి యించు విప్రవర్య ♦ లెపుడు నన్ను
భజనసేయువారు ♦ పరగమత్సాలోక్య సిద్ధిఁగాంచి సుఖముఁ ♦ జెందుచుంద్రు.

సీ॥ భస్మవ్రతులును వి ♦ శ్వస్వరూపులు ముండు లగు వ్రతుల ననహాన్ ♦ మైన వాక్య
వితతినొప్పింపరా ♦ దతిశయింపఁగఁగూడ దటుల సల్పిరయేని ♦ యడియ నాకుఁ
జెందును వారిఁ బూ ♦ జించిన నన్నుఁ బూజించినయట్లగు ♦ క్షితితలమున
ననయంబు లోకహితార్థమై ప్రతియుగంబున నేను యోగినై ♦ పూని భస్మ
దీపితాంగుఁడనగుచునుఁ ♦ దిరుగుచుందుఁ గాన యోగుల భక్తి సం ♦ క్రాంతచిత్తు
లై భజించుచునుందుఁడు ♦ నఖిలశుభము లనుభవించి మత్సామీప్య ♦ మున వసింత్రు.

చ॥ అతులభయ ప్రణాశకమ ♦ ఘౌఘనివర్తకమంత కృన్మహో
నితము శుభాకరం బఖిల ♦ దేశికలోకశరణ్యమైన యా
హితము నెఱింగి మానివరు ♦ లెల్లరు మోహముఁ బాసి పార్వతీ
పతికిఁ బ్రణామముల్ సలిపి ♦ స్వాంతము లుల్లసిలంగ నప్పుడున్.

తే॥ సూనకుశసంకలిత పవి ♦ శుద్ధ గంధ వారి పూరిత స్వర్ణ కుం ♦ భములతోడ
స్నపనమొనరించి సాధువ ♦ శంకరుఁడగు శంకరుని వినుతించి రా ♦ సకల మునులు.

సీ॥ దేవాది దేవాయ ♦ దివ్యస్వరూపాయ పరమేశ్వరాయ తు ♦ భ్యంనమోస్తు
వామార్ధజానయే ♦ వ్యాఘ్రచర్మోత్తరీయాయ శివాయ తు ♦ భ్యంనమోస్తు
గజచర్మవాసినే ♦ కళ్యాణ ఫలదాయ ప్రపిపులా భాయ తు ♦ భ్యంనమోస్తు
సకలలోకేశాయ ♦ చంద్రావతంసాయ యఘ విదారాయతు ♦ భ్యం నమోస్తు
నాగయజ్ఞోపవీతినే ♦ నందినాహనాయ బ్రహ్మేంద్రముఖ వంది ♦ తాయ సంత
తార్చితాయ తుభ్యంనమోస్తు ♦ ని యటంచు నిన్ను ధ్యానింతుమెప్పుడో ♦ నీలకంఠ.

క॥ భక్తి నతాంగులగుచు నను రక్తి స్తవముఁ జేయుచూని ♦ రాజులఁగని య
ముక్తీశ్వరుండు శంభుఁ డశక్తావనుఁడిట్టులనియె ♦ సదమలమతితోన్.

క॥ మెచ్చితి మీభక్తికి వర మిచ్చెదఁ గోరుడుఁ మహాము ♦ నీంద్రులు మీవలె
సచ్చరితులు మిముఁ బోలిన యచ్చపు భక్తిగలవార ♦ లరుదు ధరిత్రిన్.

తే॥ అనిన విని కృతార్థులమైతి ◆ మనుచుగౌత మాదిమునివర్యులెల్లర ◆ నాదిమధ్య
లయుఁడగు మహేశుఁగాంచివి◆నయముదోపనడిగిరెలుఁగఁదలంచిన◆యర్థమిటుల.

వ॥ సర్వజ్ఞుండవగు సోమమహేశా! భస్మస్నానంబును, నగ్నత్వంబును, కామత్వంబును, బ్రతిలోమతయు నెట్టివి మా కెఱింగింపుమన నభవుండు వారల కిట్లనియె. అగ్నియును సోమకర్తయును నేన. సోమమగ్ని నాశ్రయించును. లోకసమాశ్రయంబునఁ జేసి యగ్నికృతమును వహించును.

—◆ యోగిధర్మములు ◆—

సీ॥ స్థావరజంగమా ◆ త్మకము ప్రపంచంబు వహ్నిచేదగ్ధమై ◆ భస్మముగను
జేయంగఁ బడునిది ◆ శ్రేష్టంబు సర్వంబు భస్మంబుచే వీర్య ◆ వంతుఁడగుచు
భక్తి భూతంబులఁ ◆ బరిషేచనమొనర్చి యగ్నికార్యంబు త్రి ◆ యాయుషముగ
నొనరించువాఁడు పా◆పనికాయమునుండి ముక్తుఁడౌ సుకృతంబుఁ◆బొందునెపుడు.
భాసమానంబు పాపని ◆ వర్తకంబు మహితశుభదంబగుటను ◆ భస్మంబునాఁగ
వెలయులిది సర్వదేవతా ◆ వినుతమగుచు నట్లగుటఁ దాల్పఁదగు భస్మ ◆ మనవరతము

వ॥ ఊష్మపులగు పితరులు సోమసంభూతులని యెఱుంగునది.

సీ॥ నిఖిలజగంబు ◆ లగ్నసోమరూపంబు లగ్నిన యేను ను ◆ హాంబికయును
సోమంబునాఁబడు ◆ సోమరూపంబగు ప్రకృతితోఁ బురుషాఖ్యుఁ ◆ బనఁగఁదాల్తుఁ
గావున భస్మంబు ◆ గణుతింపమద్వీర్య మనఁబడును స్వవీర్య ◆ మును శరీర
మునఁ దాల్చి వెలుఁగుదు ◆ ననయంబులోకరక్షార్థమై భూతచయంబుఁగూడి
సకలభయముల నూతికా ◆ సదనములను నిఖిలగోగంబులందు ని ◆ న్నిద్రులగుచు
రక్షయొనరింత్రు భూతిచే ◆ దక్షులైన మంత్రవేత్తలు సతత భ ◆ స్మరతులగుచు.

క॥ భూతిస్నానముకతనఁ బూతాత్ములగుచుఁ గ్రోధ ◆ మును నింద్రియ సం
ఘాతము గెల్చిన వారు నిరాతంకము మత్పదంబు ◆ నందుదు రెపుడున్.

తే॥ మున్ను పాశుపత వ్రతం◆బును మఱియును గాపిలంబగు యోగంబుఁ◆గమలభవుఁడు
సృష్టిఁగావించి పిమ్మట ◆ సృష్టిఁజేసె నాశ్రమిణాల నందఱును మ ◆ దాజ్ఞబూని.

సీ॥ వలుబులలజ్జామోహ ◆ భయరూపమగు సృష్టి యెల్లనొనర్తునే ◆ నెల్లయెడల
సురలు మానులును ని ◆ తర మానవులు ధాత్రి నగ్నులగుచు జన ◆ నంబుఁ గాంతు.

సీ॥ రజితంబులగు నింద్రి ◆ యములచే సంవృతుండగుఁ గాని ప్రాణివ ◆ స్త్రావృతుండు,
గాఁడు వైరాగ్యంబు◆క్షమ యహింసయును మా ◆ నావమానములు తు◆ల్యముగునుత్త
మంబయిన యావరణమగు ◆ మహిత భూతి దిగ్ధదేహుండగుచువిసు ◆ లింపఁదగిన
నన్ను ధ్యానించు వాఁడ పుణ్యంబులెన్ని సలిపియును బుణ్యవంతుఁడై◆జగతినొప్పు.

చ॥ అనుచితకార్యముల్ సలిపి ◆ నట్టి యతం డెవఁడేని భూతిపా
వనుఁడగు నేనితత్తనువు◆ బ్రిసిన పాపముల న్హరించునీ

ఘనమగు భూతియగ్నివన • కాండములన్ వెసఁగాల్చినట్లుగా
వున నిలఁగొన్నవారలును • భూతిని దాల్పఁగ యోగ్యమౌఁగదా.

తే॥ భస్మమున స్నానమొనరించు•వారుగాణ పత్యమును జెందుదురు శుభ•ప్రాప్తిఁ దా
సర్వయజ్ఞ కార్యంబుల • సంగ్రహించి పాశుపతము ననుష్ఠించి • పావనులయి.

సీ॥ అమలభూతి స్నాన • మాచరించియును స ద్భావభావితులయి • దేవదేవు
నను ధ్యానమొనరించు ఘనమతులార్య మా ర్గంబగు నుత్తర • గతి వహించి
యమృతత్వమును దాల్తురట్లు దక్షిణ మార్గ మున స్మశానంబును • బొందువా
లష్టవిభూతులు • నమరత్వమును జెంది యపగతపాపులై • యలరుచుంద్రు
వాసవాదులు సకలగీ • ర్వాణవరులు కామికవ్రతమూని ని • గర్వులగు చు
నతులితైశ్వర్యమును జెంది • యద్వితీయు లగుదు రమరత్వమున్ జెంది • యనఘుగుచు

క॥ కావునఁ గామాదిజయముఁ గావించి రజస్తమములఁ • గైకొన కయురా
గావేశము నడచి విమల భావంబునఁ దిరుగవలయు • భక్తుండెపుడున్.

క॥ ఈ పాశుపతవ్రత మిల పాపనివారకము పుణ్య • ఫలదంబగుటన్
దీపించునిది ధరించినఁ దాపత్రయమడఁగు యోగ్య • దశ ప్రాపించున్.

వ॥ అని పలికి పరమేశ్వరుం డంతర్హితుండయ్యె నంత

మ॥ పరమేశోక్త విధిప్రకారమున వి • శ్వామిత్రముఖ్యుల్ ము నీ
శ్వరులున్ బాశుపత వ్రతంబు నెడ ను • త్సాహంబు పెంపొందఁగా
నిరతంబున్ భసితావతంసులగుచున్ • నిష్ఠాగరిష్ఠాత్ములై
హరుధ్యానించుచునుండి రవ్వనమునం • దైశ్యముల్ జెందుచున్.

వ॥ కావున

తే॥ వికృతరూపులైన • విద్వేషులైనను మలినదేహులైన • మానకెపుడు
శివునియందు భక్తిఁ • జేయువారలఁగన్న గారవింపవలయు • ఘనులటంచు.

చ॥ హరునెడ భక్తిగల్గిన మ • హాత్మునకీ భువనంబులందు దు
ష్కరమగు కార్యమెద్దియును • గల్గదు మున్ను వినంగలేదె యా
హరియె దధీచిపై మొనసి • యమ్మునివర్యున కోడిపోయెఁ బా
మరులను గూర్చి యేల పలు • మాటలు బూటకముల్ గణింపఁగన్.

క॥ హరిని దధీచి జయించిన చరితము వినిపింతు నీకు • శరగ వినుము దు
ష్కర కార్యసాధనంబున్ దురితౌఘ వినాశకంబ • దుఃఖకరంబున్.

—• క్షుప దధీచోపాఖ్యానము. •—

ఉ॥ మున్నొకనాఁడు పద్మజుఁడు • మూర్తిన్ ధరించిన శాంతమోయనన్
జెన్నువహించి కిన్నరులు • సిద్ధులు సాధ్యులు యక్ష రాక్షసుల్

ముప్పగువారలెల్ల స్తవ • ముం బొనరింపఁగఁ దమ్మిగద్దెపై
నున్నెడ నాత్మఘోణమున • నొక్కమశం బెటులో చొరంబడెన్.

తే- అటులనాశికారంధ్రంబు•నందుమశకమొండుచొరఁబడుటయునజుఁ•డుర్ముఖుఁడయి
సభ్యులెల్లరు సాధ్వస•సంభ్రమముల నొంద నొక్క క్షుతముఁజేసె•నూర్ధ్వముగను.

వ॥ అటులఁగావించిన క్షుతంబున.

తే॥ విపులవక్షస్థలమువాఁడు • వెల్లదుగ్ర బాహువులవాఁడు గర్విత • వైరి లోక
భీకరాస్యంబువాఁడు లో • కైక వీరుఁడైన యోధుఁడొకరుఁ డుద • యంబుఁ జెందె.

ఉ॥ ఆతఁడు వజ్రజిహ్వోదితుఁడు • నైశితకోటిధరించి వైరిలో
కాతిశయావహు తేజమున • నంతకసన్నిభుఁడై జగత్త్రయిన్.
ఖ్యాతివహించిమించె సక • లామరపాళికిఁ దోడునీడయై
యాతతకీర్తి నల్దెసల • యందు నమందగతిన్ జరింపఁగన్.

తే॥ మఱియు నతఁడు స్వేచ్ఛ • మానవుఁడై నరపాలకత్వమూని • లీల సార్వ
భౌముఁడనుచు నిఖిల • పరిపంథినుల సంక్షయముసలుపు క్షుపాఖ్య • నవనియందు.

ఉ॥ ఆ నరనాథమౌళి చతు • రబ్ధిపరీత మహీతలంబునన్
దానొకరుండె యోధుఁడును • తత్వవిదుండును ధర్మశాస్త్ర వి
జ్ఞానియునై చెలంగుచు న • కారణ బంధుఁడునై యశేష వి
ద్యానిధియై నుతింగనియె • యాచకసంతతిఁ దృప్తిఁజేయుచున్.

చ॥ అతనికిఁ బ్రాణమిత్రము చు • హాముని శంకరపాదపంకజా
శ్రితహృదయుండు నిర్మల చ • రిత్రుఁడు సాధుజనావనుండు సం
తత మునితాత్మఁ డీశ్వరక • థానిరతుండు దధీచినాఁగ వి
శ్రుతగుణశాలి చ్యావనుఁడు • సూరివరుండలగారు సన్నిధిన్.

చ॥ అతుల తపోవిశాలుఁ డఖి • లాగమపారగుఁ డాత్తకీర్తి యు
ద్ధతమద భంజనుండు పర • తత్వవిదుండు సమస్తధర్మ సం
హితి పదమై దధీచి యన • యంబు ముదంబున ముఖ్యమంత్రిగా
క్షితితలమేలు నానృపతి • శేఖరుఁడైన క్షుపాభిదుండొగిన్.

చ॥ అనయ మతండె వారికెది • యైన నొసంగఁదలంచినన్ ముదం
బున నెదియేనియున్ సలుపఁ • బూనిన నే దురితాత్ముఁబట్టి శా
సన మొనరింప నెంచినను • చ్యావన మౌనివరేణ్యు నాజ్ఞఁ గై
కొనక యొకింత యుండడు ని • గూఢచరిత్రుఁడు నిశ్చలాత్ముఁడై.

తే॥ మునికి నృపతియందు • మునియందు నృపతికి నెట్టి కారణమున • నేని కినుక
కలుగదింతయేని • కలిగిన నప్పుడె సమసిపోవుచుండు • సంతతంబు.

క॥ వారల సౌహార్దంబును వారలయనసూయయు విమల • భావంబెం దే
వారలమెచ్చఁ గానమనుచు వారలఁ గనుగొన్నవారు • పలుకుదు రెలమిన్.

ఉ॥ ఆ విధి మానిరాజులు ని ♦ రాకుల చిత్తులరై పరస్పర
చ్ఛావిధి సంచరించుచు ల ♦ సచ్ఛితపక్ష శశాంక చంద్రికా
శ్రీవిలసిల్ల వృద్ధియగు ♦ స్నేహసుఖంబుకు జెంది యుండి స
ద్భావ విభావితాత్ములయి ♦ భాసిలుచుండిరి పెద్దకాలమున్.

వ॥ అట్లు సుహృద్భావంబునఁ గతిపయ దినంబులు కడచన నొక్క నాఁడు

సీ॥ ఒకవంక సామగా ♦ యకులు మిన్నంది య న్నాగానతంసుగా ♦ నంబుఁ జేయ
నొక యోర వేదాంతు ♦ లకలంకమతి పర బ్రహ్మముఁ గూర్చియు ♦ పన్యసింప
నొక వజ్జఁ దార్కిక ♦ ప్రకరంబు శ్రుతులను బౌరుషేయములని ♦ పలుకుచుండ
నొకమూల వేద పా ♦ ఠకులు సుస్వరముగ సాగ నట్టంబుల ♦ సంతఁ జెప్ప.
ముఖ్యమంత్రులు రాజ్యాంగ ♦ ములనుగూర్చి చర్చ సేయఁగఁ గవివరుల్ ♦ సత్ప్రబంధ
వితతి నంకిత మొనరింప ♦ వేడుకలర నిండుకొలువుండి నృపధారుణీవిభుండు.

—దధీచి, నృపునకు బ్రాహ్మణాధిక్యంబు జెప్పుట—

మ॥ ఘనుని దధీచిమౌనివరుఁ ♦ గన్గొని మించినపూన్కితోడ ని
ట్లనియెను నాల్గువర్ణముల ♦ యందధికుం డెవఁ డగ్రజుం డెనం
డనయ మెవానియాజ్ఞ మెయి ♦ నందఱుఁ దిమ్మరుచుందు రెవ్వనిన్
గని కలుషంబు వాయు నెఱుఁ ♦ గన్ వచియింపఁగదయ్య నావుఁడున్.

తే॥ అవనినాథ నీయడిగిన ♦ యర్థమిది సమస్త ధర్మమూలము శ్రుతి ♦ మానితంబు
మానిసమ్మత మగణిత ♦ మైనదగుట నెఱుఁగఁగాఁదగు నీవంటి ♦ నృపులకిలను.

క॥ నాలుగుయుగములయందున్ ♦ నాలుగువేదములయందు ♦ నరనాయక యా
నాలుగు వర్ణములందుఁ ద్రికాలంబుల విప్రుఁ డధిక ♦ గౌరవ మొందున్.

చ॥ వదనమునందు విప్రులును ♦ బాహువులందున క్షత్రియుల్ మునుం
బొదవగ నూరుభాగమున ♦ నూరుజులున్ మఱి శూద్రసంతతుల్
బదములఁబుట్టి రట్లగుట ♦ వర్ణచతుష్టయమందు విప్రుఁడా
స్పదముగుఁ బుణ్య సంహతికి ♦ బ్రాహ్మణునట్టిఁడు లేఁడు చూడఁగన్

క॥ యుగములయందునఁ గృతయుగ మగముల స్వర్ణాద్రివేల్పు ♦ లందున హరుఁడున్
బొగడఁదగునట్లు విప్రుం డగణితకీర్తిన్ వహించు ♦ నావర్ణములన్.

చ॥ నరవర బ్రాహ్మణుండొకఁడె ♦ నాలుగువర్ణములందు శ్రేష్ఠుఁడై
గురుపదమున్ వహింపఁదగి ♦ కోవిదుఁడై యలరారు నాతనిన్
స్థిరమతులై భజించెదర ♦ శేషజనంబులు శంకరార్చనా
నిరతిఁ జరించు వాఁడగుట ♦ నిస్పృహుఁడౌటను సంతతంబిలన్

మ॥ అరిషడ్వర్గముఁ గెల్చి సర్వవిషయ ♦ వ్యాసంగమున్ వీడి దు
స్తర సంసార పయోధిఁ దాఁటి పరమా ♦ ర్థం బైన తత్త్వంబునన్.

నిరతిఁ జెంది నిరంతరంబటువులన్ • నిర్నిద్రుఁడై పారమే
శ్వర యోగంబున సంచరించు ద్విజుఁడు • త్సాహంబు చేకొల్తగన్.

సీ|| అగ్నిముఖంబున • నాహుతి వ్రేల్చి యా దిత్యసంతతికి సం • తృప్తిఁ గూర్చు
సత్కారణంబున • నఖిలసురలు కృపా న్వితులయి తమతమ • విహిత ధర్మ
ములఁ జరించుటఁ జేసి • పుడమి సర్వౌషధు లను ఫలియించు దా • నను నృపాల
కుఁడు ధాత్రి నేలు న • కుంఠిత తేజుఁడై యీతిబాధలు లేక • యెల్లజగము.
లుల్లసిల్లుచుండు • నుచితానుచితముల నెఱిఁగి స్వామిభక్తి • యెసఁగ మంత్రి
పుంగవులును గడఁక • భూపాలునకు సాయ మగుచుచుందు రెప్పు • డవసరముల.

వ|| ధ్యానాధ్యయన యజ్ఞ వేద బోధకత్వ ప్రతి గ్రహీ తృత్వములయం దధికారియై క్రమంబుగ నాలుగుజాతుల కన్యలన్ బరిగ్రహింపఁదగి వెలయువాఁడు బ్రాహ్మణుం డొక్కరుండయగు. వేదములందతని కన్యదుర్లభంబగు ప్రాజాపత్య లోకంబు గలుగునని చెప్పంబడియె మఱియు

తే|| క్ష్మాసురేంద్రులు పూజార్హ • మస్కృతులకుఁ బాత్రములు ధర్మనిధులు భ • వ్యజ్ఞులగుట
వారికరుణకుఁ బాత్రులైరె • వసుధ నెల్ల వారు శుభములఁ గాంతురు • వ్వారిగాఁగ.

సీ|| రాజులకొక్క శ • స్త్రప్రయోగంబున యందె శక్తిగలుగు • నగ్రజులకు
శాపంబునందును • శరమునందును గౌశలంబు గలుగును త • పంబువారి
యందె జన్మించిన • దగు కారణంబునఁ సృష్టికిఁ బ్రతిసృష్టి • సేయఁదగుదు
రమ్మహాత్ములకు బ్ర • హ్మాదిదివిజులైన వశ్యులై చరియింత్రు • వనజసంభ
వాండములకెల్ల నాధారు • లైనవారు బ్రాహ్మణులెయంచు వేదముల్ • బలుకుచుండు
నవనివారి కసాధ్యకా • ర్యంబు లేదు విప్రతేజంబవార్యంబు • విస్తృతితంబు.

క|| వర్ణత్రితయమునకు నప వర్గమునకుఁ గారణంబు • వసుధామరు లా
స్వర్లోకసులైనను ద్విజ వర్గము నెడ నవినయంబుఁ బాటింపరాగిన్.

సీ|| అనుటయు భూధవుం • డమ్మునివరుఁ గాంచి కినుక చేకొల్తని • ట్లనియె నప్పు
డో యి వృద్ధుఁడవు నీ • వుర్వీసురుఁడవౌట నభిమానమును వీడు నట్టి ప్రజ్ఞ
కలుగమిఁ జేసి యి క్కడిణిఁ బల్కెదుగాని నృపతి కన్నను విప్రుఁ • డే ధరిత్రి
నిక్కంబు శ్రేష్ఠుఁడో • నే యింత మోమోట మును లేక వచియింతె • మనుజవిభుని
మోఱిల నెందునకును • జాలకతక్కిన వారి కరుణవడసి బ్రతుకు విప్రు
కులముఁ బెద్దఁజేయు • టలఘులకున్ గోప కారణంబుగాదె • క్ష్మాతలమున.

ఉ|| నిన్నొక పెద్దఁజేసి యవ • నీధవుఁ డిట్లని • గారవించినన్
గన్నుల కెక్కనే మదము • కానదె మంచిచెడుంగు లింతయున్
చిన్నలు పెద్దలున్ నయము • పెంపొనరించుచునుండ నీ సభన్
జిన్న దృణంబుచేసితివి • న్యాయము సెప్పవు నీవు దుర్మతీ.

చ॥ వినియెడివారికిఁ గల వి ♦ వేకము గౌరవభావముంగనుం
గొనియెడి తెల్వి లేక తన ♦ కుఁ గల పాండితి జూప నోటవ
చ్చిన పలుకెల్ల సర్వమని ♦ చెప్పుచు నాత్మకులాభిమానమున్.
గొనిన యతుండు సత్సభల ♦ గోడువహించును గాదె చూడఁగన్.

క॥ నరపతికన్నఁ బ్రాహ్మణుఁ డరయఁగ నధికుఁడటంచు ♦ నాడఁగఁ దగునే
ధరణీశ్వరుండొకించుక కరుణింపఁడయేని ద్విజుని ♦ గౌరవముచెడున్.

సీ॥ దిక్పాలకుల దివ్యతేజంబు ధరియించి జనియించు ధారుణీ ♦ శ్వరుఁడు జగతి
విష్ణ్వంశమునఁ గాక ♦ విశ్వంభరాధి పత్యంబెట్లు సిద్ధించు ♦ నవనిపులకు
కావున క్షత్రియుల్ ♦ క్ష్మాదేవతలకన్న శ్రేష్ఠులటంచును ♦ జెప్పనొప్పు
నింతమాత్రి మెఱుంగ ♦ కీవహంకృతిఁజేసి పలువుర విననిట్లు ♦ బలుకఁ దగునె
యమరవర్యులైన ♦ నవనీశు సాయంబుఁ గోరుచుందు రెపుడు ♦ కొదుకులేక
యీవుహితుఁడవంచు ♦ నెఱుఁగఁ దలంచిన నన్నుత దోషఫలము ♦ నందఁ దలఁతె.

క॥ తనవారిఁ బొగడుకొనుటయు ఘనులను నిందించుటయును ♦ గావుమనుచు వ
చ్చినవారిఁ బ్రోవకుంటయు నన్నృగముకు సాటియనుచు ♦ నాడిరి తజ్ఞుల్.

తే॥ అడవులందుఁ జేరి ♦ యాకలలంబులు ప్రాణధారకముగ ♦ బ్రతుకునట్టి
బాడబులను భూమి ♦ పాలురకన్న నగ్రేసరులనె దీవు ♦ దోసమనక.

చ॥ హరిహయవీతిహోత్రయమ ♦ నాగ్రజనైఋత ముఖ్యదిక్పతుల్
నరపతిరూపమున్ గొని య ♦ నారతమున్ జరియింతురంచు
నీ కొరులు పచింపఁగా వలయు ♦ నోయి ఘమంత నెఱుంగ వే యస
చ్చరితుఁడవిప్రలాపములు ♦ సాగవు నాయెడనింకఁ బొమ్మిటన్.

క॥ "నావిష్ణుఃపృథివీపతి నావినవె సమర్థులవని ♦ నాయకు లవనీ
దేవతలకన్నఁ గ్రిందని భావింతువె నన్ను వంటి ♦ ప్రభుఁడడుగంగన్.

తే॥ విశ్వకారణమగు శక్తి ♦ వెలయు నృపుల యెడలఁ గావున భూపతు లెంతయేని
పరిభవింపఁగ దగరు స ♦ భలనటంచు క్షుపుఁడు పల్కిన చ్యావనుం ♦ డపుడుక

—♦ దధీచిక్షుపుని కొట్టుట ♦—

చ॥ గరువముతోడఁ బల్కెదవు ♦ కాపురుషుండటు వీవు నన్న నా
దరమొనరించి నీ నియతి ♦ తక్కినొ యేమొ యెఱుంగరాదు భూ
సురవరులేడ సంతతము ♦ క్షుద్రులునై విషయాభిలాషఁ ద్రి
మ్మరు నరనాథులేడ నభి ♦ మానమునన్ వచియింతుగాకిటుల్.

తే॥ భూసురప్రభావ ♦ ము నెఱుంగ శక్యమె వసుధవేయుగనుల ♦ వానికైనఁ
గొండడీకొనంగఁ ♦ గోరెడు తగరునా నన్నెదుర్పఁ బూనఁ ♦ జన్నె చెప్పుమా.

సీ॥ ఎదిహితంబగుదాని ♦ నే యొనర్తురు గాని ధర్మవుఁ దలఁప రిం ♦ తయును మదిని
శక్తి కలుగునేని ♦ శాపింపఁజూతు రశక్తాత్ములైన ని ♦ శ్శంక నాజి
వెన్నిచ్చి పారుదు ♦ రెన్నిగతుల నీతి బోధించినను గాని ♦ బుద్ధి నిడరు
తమకుఁ దోఁచిన దెల్లఁ ♦ దగవని వాదింతు రెదిరి వాక్యంబుల ♦ నేవగింత్రు
పాపభీతి విడచి ♦ పలుకుదు రెంతటి పరుషవాక్యములైనఁ బ్రతిఘటించి
మంచిచెడుగు లెఱుఁగ రెంచరు బుధులను కఠినమతులు భూమి ♦ కాంతులవని
ఉ॥ ఇంత నృపాలకత్వము వ ♦ హింపఁగఁ గలిగిరయేని దేవతా
కాంతు నెదిర్ప నేర్తుమని ♦ గర్వమునన్ జరియించుచుందు ర
శ్రాంతము గ్రిందుమీఁదెఱుఁగఁ ♦ జాలరు రాజు లింతమాత్రనే
భ్రాంతినిఁ బొందుటేటికో స ♦ భన్ ద్విజులన్ హసియించుటేటికో.
వ॥ అని మఱియు నిట్లనియె.
సీ॥ భూసురుఁ డాగ్రహం ♦ బుం బొందునేని స హింపఁగవచ్చునే ♦ యెట్టివాని
కైన స్వర్గాధీశు ♦ నంతవానినె చెడఁ దిట్టఁడె గౌతముఁ ♦ డట్టె యలిగి
యంబోధి నింకింపఁ ♦ డాయగస్త్యుఁడు దొల్లి యతఁడును విప్రుఁడె ♦ యగును కాదె
వేల్పుల కెల్ల దృ ♦ ప్తిన్ గూర్చు ననలుండు శమియింపఁడే భృగు ♦ శాపమునను.
నత్రిదానవానీకంబు ♦ హతముఁ జేసెఁ దక్కఁగల రాజు లెందఱో ♦ ధరణిసురుల
కోపవహ్ని మిడుతలట్ల ♦ గూలిరీవు కూలఁదలఁచితి విపుడు నా ♦ కోపమునను.
క॥ అనిపలుకుచు వీగక య య్యనఘుఁడు మూర్తీభవించి ♦ నట్టి క్రుధవలెన్
దనరుచును వామ ముష్టిన్ జనపతి తలమీఁదఁ గొట్టె ♦ సభికులదరఁగన్.
వ॥ అట్లు గొట్టిన నాదిట్టరి కట్టలుక నుఱ్ఱిపడుచు నట్టె లేచి.
క॥ గిరిపక్ష చ్ఛేదకమగు సురవజ్రముఁ గొని నృపాలుఁ ♦ డుగ్రుఁడయి ముని
శ్వరు మేను దలుగ నాతఁడు ధరణిబడియె బవన నిహత ♦ తరువుం బోలెన్.
వ॥ అటులఁబడి

— శుక్రుఁడు దధీచి కీశ్వరారాధన ముపదేశించుట. —

ఉ॥ సర్వసమర్థుఁ డాధ్యుఁడు మ ♦ హామతిమంతుఁడు నిర్జరారి గా
ధూర్వహుఁ డిద్ధతేజుఁడవ ♦ ధూత విరోధి చయుండు సంతతా
ఖర్వ తపస్సమూహుఁడగు ♦ కావ్యుని జిత్తమునన్ దలంచినన్
శర్వ సమప్రభుండతఁడు ♦ చ్యావను సన్నిధిఁ జేరి యిట్లనున్.
తే॥ ఏల విలపింతు వీకితిఁ ♦ నీ వుదగ్ర తేజుఁడవు నీకిటులఁ బరిదేవనంబుఁ
గూర్చినఖిలుం డెవండో ♦ యొక్కరుఁడు నిన్ను బరిభవించినపఁగ నేర్చి ♦ వాఁడుగలఁడే.
క॥ హరిహరులైన నీయెడల ♦ నాదరమూని భవత్ప్రభావమున్
గరమునుతింతురన్న నొక ♦ కాపురుషుం డెఱుఁగంగఁ జొచ్చునే నే

హరహర భాగ్యహీనుఁ డగునట్టి దురాత్ముఁ డెవండు నీకు దు
ర్భరమగు నిట్టి నెవ్వగను ♦ పాపము నా కొనరించెఁ జెప్పుమా.

క॥ అని యోగశక్తికతన నశని భిన్నంబైన తనువు ♦ సంధించి వెసన్
మునివర్యుఁ గాంచి యిట్లను ననఘుఁడు భార్గవుఁడు నిశ్చలాత్ముండగుచున్.

సీ॥ హరుఁడు పరాత్పరుం ♦ డతని గొల్చియు నవధ్యత్వంబుఁ గాంచఁగ ♦ దయ్యనీశ
హరున నుగ్రహమున ♦ నార్జించితిని మృత సంజీవనంబు ♦ నీశ్వరహితంబు
నద్దాని మహిమ నై ♦ వావలి కెల్లను మృత్యుభయము నశి ♦ యించు సకల
సంపదల్ వొడము శా ♦ శ్వత కీర్తి వాటిల్లు నవ్విద్య నీకిత్తు నమలమతిని.
త్ర్యంబకుని యజింపు ♦ మరికృతమగు వెత తొలఁగి చనును నీకుఁ ♦ దోయజాండ
భాండమందు సాటి ♦ ప్రాజ్ఞుండు లేనట్లు వెలయుచుందువీవు ♦ విమలకీర్తి.

వ॥ మండలత్రయమునకును త్రిగుణంబులకును త్రితత్వంబులకును వహ్నిత్రితయంబునకు
బుష్టివర్ధనుండును, దేవతలయందును గణములయందును బుష్పములందును బుష్టియు
సుగంధమును గలిగించువాఁడును, విష్ణువునకును, బ్రహ్మకును మహామునులకును
మహదాది విశేషాంత వికల్పంబునకును బలకరుండును, మృత్యుహంతయు నగు ప
మేశ్వరునివలన నాకైకొనిన మృతసంజీవన మంత్రంబు నీకొసంగె దదాని నీశ్వ
సన్నిధి జపించిన నీ యభినుత సిద్ధి గలుగునని శుక్రుండు దధీచికి మృతసంజీవన
బనుగ్రహించిన నాతండును తత్ప్రభావంబున వజ్రాస్థిత్వంబును నవధ్యత్వంబును న
నత్వంబును బొంది క్షుపధరాపతిని గాంచి యిట్లనియె.

చ॥ ధరణిసురుండు పూజ్యుఁడు ప ♦ దంపడి యాతఁ డొకప్పు డెదిరియే
నరయక సల్పినన్ గనల ♦ కమ్మహితాత్ము భజింప నొప్పగాఁ
గురక యవాచ్యముల్ పలికి ♦ యుద్ధతుఁడై వధియింపఁ బూనుటల్
నరవర చెల్లునే పుడమి ♦ నాథున కింత యెఱుంగకే మదిన్.

తే॥ కలుషబుద్ధి వి ♦ ప్రకులము దూషించుటకును మునీంద్రు నన్నుఁ ♦ గుందఁ జేయు
టకును ఫలముగలుగు ♦ నీకె వేర తలఁపక యనుభవింపుమో ♦ ధరాధినాథ!

క॥ అనిపలుకుచు మునివర్యుఁడు నెనరింతయు లేక ధారు ♦ ణీపతి మూర్ధం
బుఁ వామపాదతాడన మొనరించె సదస్యులెల్ల ♦ దూరక కనఁగన్.

తే॥ ఆప్రహరణమునకు నొచ్చి ♦ యవనినాథుఁ డుగ్రుఁడై మండిపడుచు దా ♦ నాగ్రహమున
నశనిఁ గొని కొట్టుటయు నది ♦ యతనియురము దాఁకి నుగ్గయిపోయిన ♦ నవనిపుండు

చ॥ ఘనుడు పులోమజాపతియొ ♦ కప్పుడు మామక బాహువిక్రమం
బున కెదలోన మెచ్చి పర ♦ భూధరపక్ష విఖండనక్షమం
బు నిడియె దీని నీయశని ♦ భూసురునందున కుంఠితంబునై
చనియె నిదేటి యద్భుతమొ ♦ స్వాంతమునన్ దెలియంగరాద హో.

చ॥ కదనమునందు నిల్చి బల • గర్విత దుష్టసురారి సంతతిన్
మదమడగించి నిర్జర సమాజము మెప్ప వహించి విక్రమా
స్పదుఁడనఁ బేరు గాంచిన య • సహ్యపరాక్రముఁడైన యీ నృపున్
బెదరెడు నట్లొనర్చ నొక • వృద్ధుఁడు నాకిఁక కీర్తి యేటిదో.
తే॥ ప్రబల రాక్షసవక్షః క • వాటపాట నంబుఁ జేయుచో నైన భృ • శంబు మొక్క
వోని వజ్రాయుధంబొక్క • భూమిసురుని యెడల వమ్మయిపోయె ని • నేమి కలియో.
ఉ॥ ఇందఱు సూచుచుండఁగ మ • దీయ మహాశని నుగ్గునూచగా
నెందుకు గాకపోయె నిఁక • నేశరరాజముఁ బూని యీ బధి
చిం దుదముట్టఁ జేయుదు ని • సీయొక పారునకోడె రాజటం
చెందఱో పల్కుచుండ విని • యెవ్విధి సైపఁగ నేర్తు నెమ్మదిన్.
తే॥ హృదయ దాహకమగునట్టి యీ పరాభ వాగ్ని వేరీతి జల్లార్తు • నఖిలదిశల
నలరు మామక సత్కీర్తి • యడఁగకుండ నెటులఁ గాపాడుకొందునో • యింకమీఁద.
వ॥ అని యొకింత చింతించి భక్తరక్షణ పరాయణుఁడగు నారాయణు నాశ్రయించినఁ
గాక చ్యావనునిఁ బరాభవింపరాదని నిశ్చయించి వైకుంఠున కర్బించిన నప్పుడు.
ఉ॥ శ్రీలఁ జెలంగు పార్శ్వముల • శ్రీయును భూమియుఁ గ్రొత్తక్రొత్త లీ
లాలపనంబులన్ సలుప • నాస్యమునం దొక వింతనవ్వు ము
త్యాల జిగిన్ హసింపఁ గన • కాంబరమున్ గటిఁగట్టి నాఁడు కెం
గేల సువర్ణ దండమును • గేదఁగి రేకును బూని నాఁడొగిన్.
క॥ నానావిధ మణిఖచితం బైన కిరీటంబుఁ దాల్చి • యనుగులు సూరుల్
మానులును బలిసి కొలువఁగ శ్రీనాథుఁడు కానవచ్చె • క్షితిపతి కెలమిన్.

—క్షుపుఁడు శ్రీహరిని వినుతించుట—

ఉ॥ అగతిదగ్నసంబిడిన • యంబుజనేత్రు దయామయున్ మహా
భోగిశయాను గాంచి నృప • పుంగవుఁ డుల్లము పల్లవింప స
ద్యోగి జనైక గోచరు గు • ణోన్నతు వెన్నుని భక్తియుక్తుఁడై
యాగమసూక్తులన్ వినతుఁ • డై నుతి సల్పె ముదంబెలర్పఁగన్.
సీ॥ కారణంబును నీవ • కార్యంబును నీవ ప్రకృతివీవ పురుషుండ • వీవతలఁప
జగదీశ్వరుండ వీవ • సర్వమయుండ వీవ విష్ణుండవీవ వ • ర్ధిష్ణువీవ
బ్రహ్మవు నీవ వి • శ్వస్వరూపుండ వీవ తత్వంబు నీవ పి • తామహుండ
వీవ పరంజ్యోతి • వీవ జనార్దనుండవు నీవలఁ గల్గు • నవని యెల్ల.
నేను నీవను భేదంబు • నెల్లవిడచి విష్ణుమయము జగత్తని • విమలబుద్ధి
నరయు విజ్ఞానులకు నీవ • యాశ్రయంబు సకలమునిజన నుతనామ • జలజనయన.

ఉ॥ తావక కోపసంభవుఁడు ♦ తారక హంత తమోవృతుండు లో
కావళిఁ గాల్చుచుండుఁ జతు ♦ రాస్యుఁడు నీయను కంపఁబుట్టి యీ
జీవుల నెల్ల వేళల సృ ♦ జించుచు నుండు రజఃపరీతుఁ డిం
ద్రావరజుండు బ్రోచును చ ♦ రాచర లోకము సత్త్వమూర్తియై.

సీ॥ కాలరూపుఁడవు జ ♦ గన్మయుండవును భూ తాదియైనట్టి మహత్తు మఱియు
దన్మాత్రలింద్రియ ♦ తతియును నీవధిష్ఠించి సంతతమును చెలఁగుచుండు
వలరు నీయాసనం ♦ బవ్యక్తమును దివ్య మై సహస్ర ఫణాఢ్య ♦ మగుచు మధ్య
భాగంబున సహస్ర ♦ ఫణ సంయుతమయి తమోరూపమైనట్టి ఘోర సర్ప
మదుగుభాగంబునందు ధ ♦ ర్మాకృతియును జ్ఞానవైరాగ్యమయమయి ♦ క్రాలుదాని
పాద మైశ్వర్య రూపమై ♦ పరగుచుండు నీవు జగదేకకర్తవో ♦ నీరజాక్ష

సీ॥ సప్తసాళములో ♦ చరణయుగ్మము గాఁగ స్వాంసహోతలి ♦ జఘనముగను
సాగరచయము వ ♦ స్త్రంబుగా దిక్కులు నాతత బాహువులై తనర్ప
గగనంబు మూర్ధంబు ♦ గాఁగఁ బ్రకంపనుఁ డున్నతఘోణమై ♦ యొప్పుచుండఁ
బుష్కలావర్తకం ♦ బులు కేశములు గాఁగఁ జంద్రసూర్యులు విలో ♦ చనములుగను
దారకావళి స్వర్ణావ ♦ తంసములుగ వెలయుచుందువు తావక ♦ విమలమూర్తి
నెవ్విధంబున ధ్యానింతు ♦ నింకమీఁద సకల సురలోక వంద్య యీ ♦ శ్వర మహేశ.

తే॥ శ్రద్ధచే నొండె లేక య ♦ శ్రద్ధ నొండె యెవి యొసఁగఁబడు మఱి ♦ యేవి వినఁగఁ
బడునొ యేవి కీర్తింపంగఁ ♦ బడునొ దాని నెల్ల సైరింపుమయ్య గ ♦ ణేశ యీశ.

—క్షుపుఁడు విష్ణువుతో దధీచి యొసర్చిన యవమానమును జెప్పుట—

వ॥ అని స్తుతించి యిట్లనియె.

మ॥ అరవిందాక్ష భవత్పదాబ్జయుగళ ♦ ధ్యానామృతా స్వాదన
స్థిరచిత్తుండగువానికిఁ గలుగునే ♦ చింతామహోర్మిల సా
గరమగ్నత్వము నిర్వికల్పమగు మో ♦ క్షప్రాప్తిచే నెల్ల యం
దరయన్ వాఁడు బుధుల్ నుతింపఁగను బ్రహ్మానందమున్ బొందఁడే.

తే॥ వాఁడు సుగుణాభిరాముండు ♦ వంశదీప కుండు బురుషోత్తముఁడు న ♦ ఖండవైభ
వాఢ్యుఁడగు సంతతమె వాని ♦ యాలయమునఁ దాన కార్పన జరుగునో ♦ దేవదేవ.

చ॥ నిను గరుడధ్వజున్ జగము ♦ నేతయటంచును నిశ్చలాత్ముఁడై
యనయముఁ గొల్చువానికి మ ♦ హా పదలేవియుఁ గల్గునే శ్రితా
వన చతురుండ పీవతని ♦ పక్షమునన్ వసియించి యాజిలో
ననుపమమైనయట్టి విజ ♦ యంబును గూర్పకయుందువే దయన్.

తే॥ అనితరప్రాప్యమైన నీ ♦ యాశ్రయంబు జెందువానికి నపజయ ♦ మెందుఁగలుగుఁ
బావనాకార నీభక్తుఁ ♦ బరిభవింపఁ జతురుఁడగువాఁడు గలుగునే ♦ క్షితితలమున.

చ|| కలఁడు దధీచినాముని య ♦ ఖండ తపోనిధి నాకు మిత్రమై
యలరినవాఁడు సచ్చరితుఁ ♦ డంధకవైరి పదాబ్జ సేవకుం
డలఘుఁడు చంద్రశేఖర వ ♦ రాహృతదుస్సహ తేజుఁ డాతనిన్
గలిసి చరించినాఁడఁ జిరకాలము ప్రాణము నట్లు జూచుచున్

చ|| సరసుఁడె యైన నాతఁడు ♦ ప్రసంగవశంబున నాలు జాతులం
దరయఁగ బ్రాహ్మణుండొకఁడె ♦ యగ్రసరుండని మత్తచిత్తుఁడై
సరగ వచించి యేనపుడు ♦ క్షత్రియుఁ డందరకన్న శ్రేష్ఠుఁడౌ
నరుఁడని పల్కినంతవిని ♦ నాయెడ నెంతయు నాగ్రహంబునన్.

తే|| కొలువుకూటంబునన్ గల ♦ కోవిదాగ్రగణ్యు లెల్లెరుఁ గనుఁగొనఁ ♦ గా నతఁడు
వామపాదంబునన్ శిరో ♦ భాగమందుఁ దన్ని వెడనవ్వు నవ్వుచు నున్నయంత

క|| ఏ నతనితోడఁ గొట్టితిఁ గాని యతనితనువు డాకి ♦ క్ష్మాధర పతతిన్
బూనికఁ జెక్కుడు నది వమ్మై నేలన్ బడియెఁ జూప ♦ నదరిపడంగన్.

ఉ|| ఆతఁడవధ్యుఁడెల్లెడల ♦ నమ్మని దేహము వజ్రసన్నిభం
బేతఱినైన దీనత వ ♦ హింపనివాఁడు పరాభవాగ్నిచే
నాతనువెల్లఁ గాల్చె నిఁక ♦ నాకలుషాత్ము జయించు మార్గమే
రీతిగనైనఁ జూపుము హ ♦ రీ నిను నెమ్మది విశ్వసించితిన్.

ఉ|| వైరికృతావమాన ఘన ♦ వహ్ని దహించెడి నాయెడన్ గృపా
సార మొకింతయేఁ గురిసి స్వాంతముఁ జల్లఁబడంగఁ జేయు మో
సారసపత్రనేత్రముని ♦ సన్నుత పాద త్వదంశ లేక యే
ధారుణినాయకుండు వసు ♦ ధన్ జనియింపఁ డటం చెఱుంగవే.

మ|| హరి నీపాదపయోజముల్ గొలుచు భ ♦ క్తాగ్రేసరుల్ క్రూరుఁడై
నిరసింపంగఁ దలంచుచుండు నతఁడే ♦ నీ కెగ్గుఁ గావించువాఁ
డరయన్ వానిని నిగ్రహించుటయె గా ♦ దా నీకు ధర్మంబు దు
శ్చరితుండైన దధీచి నెట్టులయినన్ ♦ శాసింపుమా నాకునై.

చ|| చెనఁటియతండు నాయెడలఁ ♦ జేసినయట్టి యవజ్ఞ నెవ్విధం
బున మఱవం గలాఁడనో వి ♦ భుండవు నీవు కృపాయుతుండవై
కనుఁగొన నెంచవేని బుధ ♦ కంటకుఁ డంచుదలంచునాని శా
సన మొనరింపవేని యిఁక ♦ క్షత్రియ ధర్మము నిల్చు టెట్టులో.

తే|| పొలసుఁడు దధీచి ని ♦ ర్భయముతోడఁ దన్నె దిక్చ్ఛడివారలీ ♦ ధాత్రియందుఁ
గలుగరని పల్కె సభికులు ♦ గాంచుచుండ నింక నేమన దగువాని నీశ చెపుమ.

క|| అని దైన్యంబుగఁ బల్కిన జననాథుని గాంచి యపుడు ♦ సరసిజనేత్రుం
డనుకంపజనింపఁగ ని ట్టనియెను మృదుమధుర వాక్చ ♦ యంబు వెలయఁగన్.

మ॥ ధరణీ నాయక యేనెఱుంగుదుఁ ద్వదీ ♦ య చ్చిత్రచారిత్రమీ
శ్వర సేవారతుఁడైన నేమి ముని మ ♦ ద్భక్తుండవౌ నీయెడన్
దురితంబుల్ బొనరించెఁ గాన యిఁక వ ♦ ధ్యుండేయగున్ వాని నా
దర మొక్కింతయు లేక చెండెదను బ్రో ♦ ద్యచ్చక్రయోగంబునన్.

క॥ ఆముని యామునఁ దా నీ భూమి నెవరివలన భయముఁ ♦ బొందనటంచున్
దానుసమున వచియించెఁ గదా నుద్గద కెట్టులోర్చు ♦ నగయుదు నింకన్.

క॥ అతని యవధ్యత్వంబే గతి సార్థకమౌనో యిపుడ ♦ కనుఁగొనియెద నా
తతమత్కార్ముక నిర్గత సితమార్గణతాడనమునఁ జేసి కడంకన్.

క॥ తన వజ్రాస్థిత్వం బెందున కేనియుఁ బనికివచ్చు ♦ నో దానవ లో
కనిహంతృతాపటిష్ఠం బనఘంబగు నాదు చక్ర ♦ మని బయలుపడన్.

చ॥ ఇదె కనుమా దధీచికడ ♦ కిప్పుడ యేగెద బ్రాహ్మణాధమున్
మదమడఁగించి వచ్చెదను ♦ మామక బాహుపరాక్రమంబునన్
బెదరెడునట్లు జేయుదును ♦ భీతిని వీడుము యేను నీయెడన్
సదయుఁడనైతి నో నృపతి ♦ సత్తను నాకెదురెందుఁ గల్గునే.

సీ॥ ఇఁకమీఁద నొక్క పు ♦ డీశ్వరుగాదని దక్షుఁడొనర్చు న ♦ ధ్వరమునందు
హవిరంశమునుగొను ♦ నాశచే సురలును నేనును బోయెద ♦ మెలమినటుఁ
చ్యావనుం డరుదెంచి ♦ శంకరుఁ బిలువక యజ్ఞంబుఁ జేయుట ♦ యఘమటంచుఁ
బలుకుచు మాయెడ ♦ నలిగి శాప మొసంగుఁ గావున నిప్పుడ ♦ కడిమి నెలఁగ
మానికడకుఁబోయి ♦ మామక దర్పంబుఁ జూపివత్తునో యి ♦ క్షుపమహీశ
యతఁడు నీకు సలిపి ♦ నట్టి పరాభవ వహ్ని చల్లఁబడెడి ♦ పగిది నింక.

క॥ ఇత్తఱి నాతని కెవ్విధి హత్తునొ విజయంబు నాకు ♦ నని పల్కుచు నా
చిత్తజ జనకుండు నిజా యత్తుండగు క్షుపుని పై ద ♦ యాన్వితుఁడగుటన్.

చ॥ నొసఁటి విభూతిరేఖ లొక ♦ నూతన తేజము సంక్రమించియిం
పెసఁగ శరీరమెల్ల బల ♦ హీనత బీగ నరాలు దేరఁగాఁ
బసిఁడి జిగిన్ జెలంగునెడ ♦ పై నొక జందెము వ్రేలుచుండఁ దా
నసురుసురంచు నొక్క వసు ♦ ధామరుఁడై మునిఁ జేరి యిట్లనున్.

ఉ॥ ఈవు శివార్చనారతుఁడ ♦ వెందును నగ్రసరుండ వౌదువౌ
చ్యావన నీ కసాధ్యమగు ♦ నట్టిది కాంచము గాదె యమ్మహా
దేవున కీవు ముఖ్యుఁడవు ♦ ధీనిధి వాశ్రిత పక్షపాతమున్
బోవిడ కెట్టి యిష్టమును ♦ బొందఁగఁ జేయుచు నుందు వెంతయున్.

క॥ ఏనొక వగమర్ధించెద బూనిక నావిడుము సర్వ ♦ మును చాతుర్యం
బూని యొసంగు నుదారుఁడ వౌ నిను వాంఛించి విఫలుఁ ♦ డగునె యొకఁడున్

—దధీచి విష్ణువుతో సంభాషించుట—

చ॥ అనవుఁడు మౌని యిట్లను మ • హాత్మ యెఱింగితి నీ మనోగతం
బు నయిన నాకు సాధ్వసము • పుట్టును యించుక యేని నీ వొకర్
జనపతి కారణంబున ద్వి • జత్వముఁ గైకొని వచ్చి వాఁడవో
యనఘ సరోజలోచనుఁడ • వయ్యెదో కావో నిజంబుఁ దెల్పుమా.

క॥ నృపునకు సాయముఁ జేయఁగఁ గపటద్విజుఁడవయి నీవు • కలుషము నాకే
తపసిని వంచింపఁదలఁచి యిపుడిచ్చటికేగుదెంచి • తే జలజాక్షా.

క॥ నృపతియెడ నాయొనర్చిన యపరాధంబునకుఁ దగిన దగు శాసనముల్
గపటివయి సేయనలయుదె యపురూపంబైన వేష మహాణంబగునే.

తే॥ రాజమాత్రుని రక్షింప • నైజమైన తత్త్వముల్ వీడి విప్రతఁ దాల్చి కంటె
తపసి మిన్నను శిక్షింపఁ • దలఁతువేని నీ హరిత్వంబనర్హమా • నే మురారి.

చ॥ హరుఁడు పరాత్పరుండు • కరుణాన్వితుఁడై ననుఁ గాచు పూన్కి త్రి
మ్మరసురసిద్ధ సాధ్యముని • మానవకిన్నర రాక్షసాప్సరో
గరుడ భుజంగమాదుల నో • కండును బీరముతోడ నాకిలన్
బరిభవ మాచరింపఁగల • వాఁడు కలండె మురారి చెప్పుమా.

ఉ॥ ఏమిటికిన్ ద్విజాకృతి ర • మేశ త్యజింపు మివండయేని యు
ద్దామ పరాక్రముం డెఱిఁగ • తద్దయు హాస్యము సేయఁడే నినున్
భీమబలుండు వెన్నుఁడొక • భీతుని వృద్ధ తపస్విఁ జంపఁగా
భూమిసురాకృతిన్ బగసె • మున్నొకవేళ నటంచు నెమ్మదిన్.

తే॥ భక్తజన రక్షణార్థమై • బ్రాహ్మణత్వ మును ధరించుట తగుఁగాని • వనజ నయన
యేను నీకతనన్ భయ•మూనువాఁడఁ గాను నీదంభ మిఁక. సాధన్•కమగుటెటులొ.

చ॥ నరపతి వేడినంత ముని • నాథుని వంచనసేయ పూన్కి ని
క్కరణిని మారు వేసమును • గైకొనివచ్చుట లెస్సయౌనె యీ
శ్వర కరుణాప్రసాదిత మ • వధ్యత యున్ మఱి వజ్రదేహతా
స్ఫురణయుఁ గల్గ నన్నొకఁడు • త్రుక్కఁగఁ జేయునె సంగరంబునన్.

క॥ నాకు భయమెటులఁ గల్గెడి నో కమల దళాక్ష చెప్పు • మురహర రణమం
దో కాక వేరొకంట నో నీ కడిమి బయల్పడెడు మ • నీష చెలంగన్.

—దధీచి బీరంబులను నారాయణుఁ డలుగుట—

వ॥ అనిన విని నారాయణుండు దధీచి వాక్యంబుల కాశ్చర్యంబును గినుకయు జెలంగ నిజరూపు దాల్చి యాతనికిట్లనియె.

చ॥ శివునకు నీవు భక్తుఁడవ • శేషజనంబు లజస్రముల్ ముని
ప్రవరుఁడవంచు నిన్ను ధను • భక్తులఁ గొల్చుచు నుందు రంతయున్

బ్రవిమలసత్తపో మహిమ ♦ భాసిలుచుండుఁగాన నీకునీ
యవని భయంబుఁ గూర్పఁగల ♦ యంతటివాఁడొకఁడున్నె చెప్పుమా.
మ॥ నిను శిక్షించెడివారు లేరనుచు నెం ♦ తే సాహసంబొప్పఁగా
జననాథున్ సుగుణావతంసు సతతో ♦ త్సాహున్ సటసుల్ గనుం
గొనుచుండన్ హితుఁ డంచు నెంచక యతి ♦ క్రూరోరు వామాంఘ్రిఘాతా
దనమున్ జేయుట నీకు లగ్గగునె శ్రే ♦ ష్ఠత్వంబు ప్రాపించునే.
క॥ నేయపుఁగలదనుచున్ సరివారల నొవ్వంగఁజేయు ♦ వాఁడు ధరిత్రిన్
ధీరుండయ్యు నధీరుం డై రాణింపంగ నేరఁ ♦ డనవరతంబున్.
చ॥ కలుగదు నాకు భీతియని ♦ గర్వమునన్ వచియించె దేలకో
యలఘు మదీయ చక్రహతి ♦ నంతకుఁడైన భయంబుఁగాంచు భీ
తిలి పరుగెత్తుచుండు రగ ♦ తిన్ గొని దానవు లెంతవారలేఁ
గలన నెదిర్చునట్టి మొన ♦ కాఁడొకడున్ గనరాఁడు నాకిలన్.
క॥ నీయెడ సౌహార్దంబున నే యపకారంబు సలుప ♦ నెంచఁడు కానే
నాయెడ నీవుఁడు నిన్నపు డే యంత మొనర్పకుండు ♦ నే కోపమునన్.

—నారాయణుండు దధీచిపై చక్రము ప్రయోగించుట—

చ॥ ఎదిరెటులైననేమి యిది ♦ యే కనుమిప్పు డవక్రవిక్ర మా
స్పదము మదీయ చక్ర మరి ♦ వర్గ వినాశక మిద్ది పేన నీ
మదికి భయంబు గల్గకయ ♦ మానుట యెట్లొ యెఱుంగుదింక నే
నదయుఁడనేని రుద్రునకు ♦ నైనను సంకటమౌఁగదా ధరన్.
క॥ అని పలుకుచు నలుక మెయిన్ వనజాక్షుఁడు చక్ర మెత్తి ♦ వారకముని వ
ర్యుని గొట్టుటయును కుంఠితమువగుచు నది నేలఁబడియె ♦ భూపతి కనఁగన్.
చ॥ కనుఁగొని మౌనివర్యుఁ డలు ♦ కన్ జలజాక్షునితోడఁ బల్కెనో
యనఘ సుదర్శనాఖ్యమగు ♦ నట్టిది చక్రము బీరుపోయె నీ
విన్ని చిరకాలయత్నమున ♦ నీవు గడించితి వీశ్వరుండు నీ
యనఘతపంబు మెచ్చి కరు ♦ ణాన్వితుఁడై యిడెఁగాద నీ కొగిన్.
మ॥ ఇఁక నీ చక్రమునన్ బ్రయోజనము లే ♦ దింతేని నీ విట్టు లూ
రక చైతన్య విహీనుఁడున్ బలెను సం ♦ గ్రామంబునన్ నిల్వఁగా
నెకసక్కెం బొనరింత్రు యోధులు వి ♦ కుంఠేశా మరేవైన న
స్త్రకదంబంబులఁబూనియేయుము రణో ♦ త్సాహంబు నీకుండినన్.
క॥ ఒక ముసలి తపసికై యిట్లకటా నీపడు నవస్థ ♦ యంతయు వమ్మై
యకలంకమైన నీ కీర్తికి భంగముఁ గూర్చునో హ ♦ రీ యని పోనన్.

ఉ॥ ఆ మునివర్యుఁ డట్లు బరి • హాసమునన్ వచియింప నుద్ధతుం
డై మురవైరి కొన్ని నిశి • తాంబకముల్ గురియించె నప్డును
త్రాసము ఖామరుల్ దనకుఁ • దారునతోడయి యాజిలోన నా
నాలలితాస్త్ర శస్త్రముల • నంతములన్ బ్రతిపక్షిపైనిడన్.

చ॥ మునియదిగాంచి యొక్కకుశ • ముష్టి గ్రహించియు మా మనోహరున్
ఘనుని స్మరించి యప్డు త్రిశి • ఖంబు స్మరించుచుప్రయున్ యుగాస్త్ర వ
హ్నిని చయముం బలేన్ దిశల • నెల్లదహించుచు నాత్రిశూల మ
య్యనిమిష సైన్యమున్ గలిసె • నందఱు డెందములందు గుందఁగన్.

—నారాయణుఁడు దధీచిచే పరాజితుండగుట—

తే॥ దేవతాప్రయుక్త • దివ్యాస్త్ర నిచయంబు వహ్నిఁబడిన శలభ • వారమట్టుల
భస్మమగుచుఁ గూలె • బహుళ త్రిశూల తేజోగ్ని కీలలందు • నపుడు హరియు.

చ॥ ఒక మునిరాజు తేజమున • నొగ్గక యాహవసీమ నిర్జర
ప్రకరము డిల్లవోయెఁ బరి • పంథికులాంతకమై చెలంగు మా
మక బహుశాస్త్ర సంతతియు • గ్రమ్మెడ సుదర్శన మిట్లు కుంఠమై
వికలతనొందె నేపగిది • విప్ర తిరస్కృతి నీఁగ నేర్చెదన్.

ఉ॥ ఏనొకపోటుబంటనని • యీతనితోఁ బని సేయవచ్చి నే
నానివహంబుఁ గోలుపడి • నందకముఖ్య మహాయుధంబులన్
హీనములట్లు సల్పితి ము • నీంద్రుని తేజ మవార్యమయ్యె నే
పూనిక చేసి నాకు జయ • మున్ గొనవచ్చునో తోఁచ దింతయున్.

చ॥ మునికృత వంచనాంబునిధి • మున్గి తరింపఁగలేక నన్నె నా
చనుగఁ దలంచియున్న నగ • పాలున కెవ్విధి సంతసంబుఁ గూ
ర్తునో హరికన్న ధాత్రి నొక • రుండుమగంటిమి వాఁడు లేఁడటం
చనయము బల్కుచుండు విబు • ధాళికిఁ బ్రత్యయ మెట్లు నిల్చునో.

క॥ అని కొండొక తలఁచుచు హరి మునిని బరాభవ మొనర్చు పూన్కి చెలంగన్
దన విశ్వరూపమును జూపె నపుడు వేలుపులమూఁక • విస్మయ మొందన్.

ఉ॥ అంత దధీచి మౌనిదర • హాసము మోమునఁ జెంగలింప శ్రీ
కాంతుని విశ్వరూపమును • గన్గొని యాదల నట్టె యూఁచుచున్
స్వాంతము విస్మయంబున ర • వంత నవీన వికారమొందఁగా
భ్రాంతి పరీత చిత్తుఁడగుఁ • బంకజలోచనుఁ గాంచి యిట్లనున్.

మ॥ భళిరా నీవు మహానుభావుఁడవె నీ • ప్రాజ్ఞత్వమున్ మెచ్చఁగా
వలయున్ ద్వాదృశులైన మాంత్రికులు విశ్వవ్యాపకుల్ ధారుణిన్

గలచే కొండొక జోగిచేతిఁ గలనన్ • గారించు ప్రాన్కిన్ మహా
ప్రళయంబందును బోలె భీకరుఁడవై • రాణించి తిప్పట్టునన్.

క॥ నీ విశ్వరూపమున్ గని యీ వృద్ధుఁడు భయముఁ గాంచఁ • డే యనుచు సహో
భావించితె నాకుఁ బరీభావముఁ గూర్పంగఁ దలఁతె ప్రజ్ఞానిధివై.

చ॥ తెలియనె నీ ప్రభావమును • ధీరతయున్ ననువింత వానిఁ గాఁ
దలఁపఁగనేల యిట్టి భయ • దంబగు రూపముఁ గాంచినంత భీ
తిలె దనటంచు నెంచితివె • తేఁకువ కూడునె నీకు నాయెడన్
గలుష మొనర్చు ప్రాన్కి • కొఱఁగామియె గా ఫలియించు నిత్తఱిన్.

చ॥ కనుమిదె నా శరీరమునఁ • గన్పడు నెల్లయజాండ భాండముల్
వనజభవాది నిర్జరులు • వార్నిధులున్ కులపర్వతంబులున్
సనకసనందనాది ముని • సంతతులున్ భువనాళి వీరు వా
రని వచియింపనేల వన • జాయతలోచన పంచభూతముల్.

వ॥ అని వచియించి దధీచి మునీంద్రుఁడు ముహూర్తమాత్రంబున నిజదేహంబున
సమస్త ప్రపంచంబుఁ గాన్పించిన బ్రహ్మాది నిర్జరు లాశ్చర్యంబుఁ బొంది సాంజలులై
యమ్మౌని కులశేఖరు నభినందించిరంత నారాయణుండు విచారంబున.

ఉ॥ ఈముని లోకవర్యుని జ • యించెడి యాస హుళక్కి యయ్యె నే
నేమి యొనర్చినన్ బ్రతిగ • నీతఁ డొనర్చుచునుండె నియ్యెడన్
మామక పౌరుషంబు నభి • మానము గీర్తియు బీరువోయె సం
గ్రామము సల్పినన్ ఫలము గల్గునె యాతనితోడ నాకికన్.

ఉ॥ అందఱవంటి వాఁడె యితఁ • డౌనని యాత్మఁ దలంచి వీనితో
డం దళమెత్తి తిప్పు డక • టా వినుతంబగు మత్పరాక్రమం
బెందుఁకు గాకపోయెఁ గద • యీతని సన్నిధి నింక నేమి సే
యందగు వేల్పు లేండ్లు బరి • హాస మొనర్పరె నన్ను నెంతయున్.

వ॥ అని తలంచి సామంబున నాతని శమింపఁజేయఁ దలఁచి మెల్లన నిట్లనియె.

—• నారాయణుండు దధీచిని బొగడుట •—

మ॥ అతిలోకంబు భవత్ప్రభావము మునీం • ద్రా తావకంబైన య
ద్భుత చారిత్ర్యము నేటికిన్ విశలయం • దున్ వ్యాప్తమై సంతత
స్తుతి పాత్రంబయి యొప్పెఁ ద్వాదృశులయం • దున్ ద్వేషముం బూనియే
మతిమంతుండు భవాంబురాశి దరియిం • పన్ నేర్చునే సుంతయున్.

సీ॥ నరనాయకుఁడు భవ • చ్చరణాశ్రితుండయి సన్నాశ్రయించినంతనె తదీయ
హృదయతాపముఁ దీర్ప • నెంచి తావక మహిమం బెఱుంగఁగలేక • మానసమ

నపరాధ మొనరించి • తిపుడు శైవాగ్రేస రుఁడవగు నీకు నీ • పుడమి వేల్పు
టేఁడ నాయెడఁ గృప • తోడ మత్కృత మెల్ల సవరింపుమయ్య నిస్సంగులైన.

వారికిన్ గిన్కగల్గదే కారణమున నైనఁ గలుగున యేని యా • య్యదను నందె
యంతరించునటంచు సు • స్వాంతులైన యార్యులు వచించుచుంద్రు గ • దా ధరిత్రి.

క॥ శైవున కపరాధంబున్ గావించినచో శివునకుఁ • గావించిన య
ట్లౌ వసుమతినని యెఱిఁగియు నీవిధి నీయెడల నలిగి • తిన ధచరిత్రా.

క॥ నగపతి కిముడముఁగూర్పఁగ నరసితినే గాని • మానియాగ్రహమునకున్
గరము గుఱియగుదునని ముని వా యింత యెఱుంగనైతి • భావమునందున్.

వ॥ అప్పుడు క్షుపుండు వినయంబున నిట్లనియె.

ఉ॥ రాజ్యమదంబుఁ జేసి పిన • గాని యసద్వచనంబు లాడినిన్
బూజ్యుని నొవ్వఁ జేసి తిని • భూనుత నాయ పరాధసంతతిన్
బ్రాజ్యకృపన్ వహించి భవ • దంఘ్రి యుగంబు భజించు భక్తి సాం
బ్రాజ్య మొసంగుమయ్య యభిమాన హతున్ నను సానుకంపతన్.

మ॥ అనఘా నీమహిమం బెఱుంగనగునే • యల్పజ్ఞుఁడౌ నన్ను వం
టిని క్ష్మాపాత్ముని కెన్నిజన్మములయం • దే కాని కైలాస వా
సునకున్ ముఖ్యుఁడవీవు నీకతన సు • శ్లోకుల్ మహాసిద్ధులీ
శుని సాన్నిధ్యముఁ జేరి చిత్సుఖమునన్ • శోభింతురశ్రాంతమున్.

క॥ హితుఁడవు ధరణీసురుఁడవు చతురుఁడవు గుణోన్నతుఁడవు • శంకరభక్తి
వ్రతుఁడవు మునివరుఁడవు మత్కృతదోషము సైఁచి ప్రోవు • మీ యిర్యోడలన్.

క॥ తెలిసియుఁ దెలియనివాఁడుం బలె నీయెడ నిట్లు దుర్భి • మానముకతనన్
సలిపితి నపరాధంబుల నలుగక రక్షింపుమయ్య • యమలగుణాఢ్యా.

చ॥ ఇనుమునఁ జేసి నిప్పునకు • నెంతయు సమ్మెటదెబ్బ గల్గిన
ట్లనఘుఁడు కేశవుండపజ • యంబును గాంచె దురాత్ముఁడైన యీ
జనపతి కారణంబుమెయి • సాధుచరిత్ర మునీంద్ర నాయెడన్
గనికరమూని కావఁగదె • గౌరవబుద్ధి నినున్ భజించెదన్.

చ॥ క్షితిపతికన్న భూసురుఁడె • శ్రేష్ఠుఁడటంచు దయార్ద్రబుద్ధిమై
హితమొనరింప నున్న నిను • నెంతయు దుర్విధి దాఁటలేకయీ
గతిఁ బరుషోక్తులాడి యొడి • కంబున వంచనసేయఁ బూనితిన్
నతజనతా శరణ్య ముని • నాయక మామకరక్ష సేయుమా.

క॥ చిరకాలమిత్రమవగుచుఁ గరుణావతి నాపనెల్ల • కార్యంబుల స
త్పరణి నెఱిఁగించుచును మద్గురుఁడవయితి కాదె నీవు • కోవిదవర్యా.

చ॥ తెలియక యేదియోసలిపి • తిక్క గతమయ్యె మదీయ గర్వమీ
యిలపలికన్న భూమిసురుఁ • డే యధికుండని సమ్మతింతు ను
జ్జ్వలమగు తావకీన పద • పంకజయుగ్మము నాశ్రయింతు నా
కెలమి దలిర్పఁ దొల్లిఁటి సు • హృత్త్వమిఁకన్ దయసేయఁగాఁదగున్.

వ॥ అంత హిరణ్యగర్భుం డిట్లనియె.

క॥ కరుణార్ద్రచిత్తుఁడవు భూ వరునకు నీ యెడల గౌర • వంబును భక్తి
స్ఫురణంబును గలుగు నయిన దురితంబు పోసంగె నిపుడు • దుర్విధికతనన్.

ఉ॥ ఆయత బుద్ధిశాలి పర • మాత్ముఁడు భక్త జనావనుండు నా
రాయణుఁ డీమహీపతి ప • రాభవ దుఃఖము మాన్పఁ గోరి దు
ర్జేయుఁడవైన నీయెడఁ జ • రించె విరుద్ధమతిన్ ద్వణంబునై
పోయె సుదర్శనంబె ముని • పుంగవ నీకు నసాధ్యముండునే.

మ॥ కరుణాశాలియు మా మనోహరుని భ • క్తవ్రాతమం దెల్ల నీ
వరయన్ శ్రేష్ఠుఁడ వమ్మహాత్ముడును నీ • యం దాదరంబూని యి
ధరణిన్ విస్మరు నీకు నాతనికి భే • దం బింతయున్ గల్గునే
గురుకారుణ్య పయోధి భూపతిపయిన్ • క్రోధంబుఁ జల్లార్పుమా.

చ॥ ఇది పరమేశ్వరేచ్ఛ యెవఁ డేమి యొనర్పఁగ నేర్చు భూధవుం
డదవదమాటలాడి యెపు • డైనను నొవ్వఁగఁజేసెనే నినున్
మదన విరోధి భక్తులన • మన్ననసేయు ర మాధవుండిలన్
గదనమొనర్ప నెంచెనె యొ • కప్పుడు మానుల తోడ నింతయున్.

వ॥ అప్పుడు.

తే॥ వనజభవ నిర్మలోక్తి ప్ర • పంచ శమిత కోపసంచయుఁడై మాని కుంజరుండు
ధ్యానమీలిత నేత్రుఁడై తరుణచంద్రమౌళిని స్మరించి పలికె నీ • లీల నపుడు.

వ॥ ప్రజాపతులలో నొక్కరుండగు దక్షుఁడనువాఁడు దురాగ్రహంబు పెంపున యజ్ఞ
భోక్తయగు పరమేశ్వరుఁ దిరస్కరించి మఖంబుఁ గావించునట్టి యసత్కార్యంబునకు
దక్షుని భయంబునఁజేసి యెల్లలోకంబులవారును విందుఁ గావింపజనుదురదియె
ఱేఁగి త్రిపురాంతకుం డుగ్రుండై జన్నంబు బన్నంబుఁజేసివిష్ణ్వాదుల నెల్ల
నాశంబుఁ గావుంచు నదియు పరమేశ్వర సంకల్పంబు దీనికి నిదానంబుగ నీక్షుప
దధీచి చరిత్రము నెలంగె నింక మీరరిగి యథాశక్తి రానున్న యాపద నీఁగు
మార్గంబరసికొండని పలికె మునివరుం డెందే నరిగె నంత బ్రహ్మాదులును దమ
దక్షమఖంబునఁ గలుగనున్న యపకారంబునకుఁ బ్రతిక్రియ నూహించుచు నిజనివాస
బుల కేగి రప్పుడు మహీపాలుండు.

తే॥ శాంతుఁడైన మౌని ♦ స్వాంతంబునఁ గ్రోధ వహ్ని రవులఁజేసి ♦ పరిభవంబుఁ
గాంచి లోకవితతిఁ ♦ గాల్పించి తిట్టుల నింక నాఁడు బ్రదుకు ♦ చేల జగతి.
తే॥ అనుచు భూమినాథుఁ ♦ డాతలంబునసె ప్రా యోపవిష్టుఁడగుచు♦నూర్ధ్వదృష్టి
హరుని గనుచుఁదనువు♦త్యజియించి సాయుజ్య ముక్తిఁ గాంచె భక్తి♦యుక్తుఁడగుచు.
తే॥ ఆ ప్రదేశంబె స్థానేశ్వ ♦ రాఖ్యమించు తీర్థ రాజంబు దాన నిం ♦ తేని భక్తి
మునిఁగిన నరుండు కలిమలం ♦ బును దొలంగి చెలఁగు నిలశివ సాయుజ్య ♦ కలనజేసి
తే॥ సుకృతదాయకంబు ♦ వృష బద్ధేచి వివాద చరిత మెవ్వఁడేని ♦ స్థిరమనస్కుఁ
డగుచుఁ జదువువాని♦ కాయు రారోగ్య సం పదలు వొదలుచుండు♦భవునికరుణ.
తే॥ ఈపవిత్రచరిత్రంబు ♦ నిపుడునీకు సంగ్రహంబుగఁ జెప్పితి ♦ సదమలమతి
నెవఁడు దీనిఁబఠించి యా♦ హవమొనర్చు నతనికి జయంబు గల్గు సం♦తతముజగతి.
వ॥ అనిపలికిన శైలాది వచనంబుల కలరి
ఆశ్వాసాంతము.
శా॥ కైలాసాచల శృంగ భాగవిల స ♦ త్కల్యాణ ధామా జగ
త్పాలీరక్షణ దక్షదక్షయజన ♦ ధ్వాంతార్క భానూకన
ద్వ్యాళీడ్భూషణ భూషితాంగమదనా ♦ హంకారవిధ్వంసకా
నాళీకాక్షము ఖామరార్చిత యశం ♦ తా భక్తకల్పద్రుమా.
క॥ దారుకమౌని మనోజ్ఞ విహారా స్విహారపదమ ♦ లాహార్యసుతా
ధారా తారక దైత్యవి దారా సోమేశ సకల ♦ తత్త్వజ్ఞనుతా.
మాలినీ వృత్తము. సురవినుత పదాబ్జా ♦ నూకిలోకైకపూజ్యా
నిరుపమ గుణశాలీ ♦ నిర్జితారాతి పాళీ
నరహరిమదభంగా ♦ నాశితానంగసంగా
సురుచిరగుణభాసా ♦ సుందరేశా గిరీశా.

తే॥ కష్టపడిపెంచియిడిచితినా ♦ కవితకన్నె నెవ్విధంబున నలరింతొ ♦ యింక నీవు
గంగవోలెను గయ్యాళి ♦ గాదు జేల సుమ్ము నీ తలనెక్కి నాట్యమ్ము సేయ.
సీ॥ ఏమహామహుఁడు శ్రీ ♦ వేమనారాధ్యవంశాబ్ధికిఁ బూర్ణిశ ♦ శాంకుడయ్యె
నే తల్లి సావిత్రి ♦ కెనయై సతుల్ మెచ్చ మహినిఁ బాతివ్రత్య ♦ మహిమఁ గాంచె
నట్టి నందయకు గా ♦ రమకు ద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గోత్రుండ దక్షి
ణామూర్తికిని శివా ♦ నందునకును సోద రుండఁ గూరిమి యగ్ర ♦ జుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుడను మదీ♦య మగు శ్రీ మ దాంధ్ర లింగపురాణ పూ♦ర్వార్ధమందు
నమలమగు ద్వితీయాశ్వాస మయ్యెఁ గరుణసతము దీనిని రక్షించుఁ ♦ జంద్రమౌళి.



—శ్రీ మీనాక్ష్యైనమః—

# శ్రీమదాంధ్ర లింగపురాణము.

## పూర్వభాగము.

## తృతీయాశ్వాసము.

క|| శ్రీరుచిరమామకీన ప్రారబ్ధ మహాపురాణ • పరిపాలన ద
క్షారాజధరా మీనా క్షీరమణా సుందరేశ • సేవకశరణా

వ|| అవధరింపుమా బ్రహ్మవిద్యాగరిష్ఠుండగు రౌమహర్షణి నైమిశీయులఁ గాంచి సనత్కుమారునకు శైలాది చెప్పిన ప్రకారంబిట్లు చెప్పందొడంగె నట్లు క్షుప దధీచోపాఖ్యాన శ్రవణానంతరము సనత్కుమారుండు నందీశ్వరున కిట్లనియె.

—నందీశ్వరుడు సనత్కుమారునకు నిజచరిత్రము జెప్పుట—

ఉ|| నీయనుకంప పెంపున ము • నిప్రకరార్చితుఁడైన పార్వతీ
నాయకు సత్కథల్ విని య • నంత ముదంబు వహించి మించితిన్
ధ్యేయులు సాధుచిత్తులు ను • తిన్ గనువారల జన్మవృత్తముల్
పాయని పాపసంతతులఁ • బాయఁగఁ జేయుఁ గదా ధరిత్రిపై.

తే|| బహు పురాణకథలఁ • బలువిధముల నాకు విపులములుగఁ జేసి • విసుగు లేక
తెలియఁబలికితీవు • ధీనిధి నీ పవిత్రమగు చరిత్రఁ దెలియ • దలఁతు మదిని.

ఉ|| ఏయమ పూర్వపుణ్యమున • నిట్టి మహాత్ముని నిన్నుఁ గాంచెనో
యే యనఘుండు నీ కతన • నెంతయు ధన్యుఁడనంచు నెంచునో
యేయనుకంపనీయులకు • నీవు ముదంబును గూర్చుచుందువో
శ్రీయుత నాకు నంతయును • జెప్పఁగదే భవదీయ వృత్తమున్.

ఉ|| ఈవు మహానుభావుఁడ వ • తీంద్రియ గోచరుఁడై వెలుంగు నా
ర్యా విభు నెట్లు జేరితి చ • జాదులకైన లభింపనట్టి యా
దేవు ననుగ్రహంబుఁగొని • దివ్యుఁడవై నుతిఁ గాంచు టెట్టులో
పావకతేజ నా కెఱుఁగఁ • బల్కుము చుల్కన సేయ కెమ్మెయిన్.

క॥ అనుటయు సనత్కుమారున్ గనుఁగొని శైలాది వినయ ♦ కలితుండగుచుం
దన చరితంబును దెలిపెడి పనిఁబూని వచించె నిట్లు ♦ బ్రహ్లాదమునన్
చ॥ వినవె యగణ్యపుణ్యుఁడు వి ♦ వేక ధనుండు తపోంబురాశి స
జ్జన వినుతుండు ప్రాజ్ఞుఁడు వి ♦ శాల మనస్కుఁడు సాధుజీవనుం
డనఘుఁడు శాంతమూర్తిన్ సత ♦ తార్చిత శంకర పాదపంకజుం
డ నితరలోక సాధ్య నిధి ♦ లాగమ వేత్త శిలాదుఁడన్ మునిన్.

—శిలాదుఁడు పుత్రవాంఛ నింద్రునిగూర్చి తపముఁజేయుట—

చ॥ అతఁడనపత్యదోషమున ♦ నాత్మఁ గలంగి యనంతరంబునన్
బితరులకున్ నివాపముల ♦ బ్రీతినొసంగెడు వాఁడు లేమి స
ద్గతి లభియింపకుండును గ ♦ దా యని సంతతికై పులోమజా
పతిని గుఱించి దుశ్చర త ♦ పం బొనరించెను పెద్దకాలమున్.
ఉ॥ ఆముని లోకవర్యుని మ ♦ హాతపమున్ మదిలోన మెచ్చి సు
త్రాముఁడు శిష్టరక్షణ ప ♦ రాయణుఁ డుత్తమకీర్తి యాశ్రిత
స్తోమము పాలికల్పకము ♦ సూరినుతుండు దయార్ద్రన్ బుద్ధిఁ ద
త్కామితమిచ్చు పూన్కిఁ బ్రమ ♦ దంబున నాతనిఁ జేరి యిట్లనున్.
చ॥ తపఫలదుండ నీ తపముఁ ♦ దద్దయు నాకు ముదంబుఁ గూర్చె నీ
కిపుడ యొసంగెదన్ వలయు ♦ నెల్లవరంబులఁ గోరుకొమ్ము స్వ
ర్గపదమొ నిర్జరత్వమొ త్రి ♦ కాల భవద్బహుళార్థ వేత్తృతా
నిపుణతయో యువత్వమొ య ♦ నిందిత చిత్తుఁడవై రయంబునన్
క॥ మిమువంటివారి వాంఛిత మమలమతిన్ గూర్పవట్టె ♦ యధికార మెగా
క మహిని మాకు నితర కార్యము గలుగునె మానివర్య ♦ యనయఁగ నెందున్.
వ॥ అని పలికిన శిలాదముని యమరేంద్రుని గాంచి భక్తియుక్తుఁడై.

—శిలాదుఁడయోనిజుఁడగు పుత్రునిమ్మని ఇంద్రుని గోరుట—

మ॥ అమరాధీశ త్రిలోక పూజ్యమగు నీ యంఘ్రిద్వయిన్ గాంచు భా
గ్యము మత్పుణ్యమునన్ లభించెను మదీ ♦ య స్వాంత చింతాతి రే
కము వీడన్ గృతి నైతి నాజనియు సా ♦ ఖ్య స్ఫూర్తి దీపించె ని
త్య ముదావాప్తినిఁ గూర్చుచుండె దవు కా ♦ దా నీవు భక్తాళికిన్.
మ॥ జనుపాంథుండను వృద్ధుఁడన్ గరణముల్ ♦ సర్వంబునెల్లన్ దొలం
గెను సారంబు నశించె దేహమున ర ♦ క్షింపన్ గలాఁడెవ్వఁడున్
గనరాఁ డొక్కరుఁడేని నాకుఁ ద్రిజగ ♦ త్కళ్యాణ సంధాతవై
న నినున్ నమ్మితి నీవె కాదొ జగతీ ♦ నాథుండవో వాసవా.

క॥ కరుణామయుండ వమరేశ్వరుఁడవు నీ కనికరంబు ♦ వలననె యీ స్థా
వరజంగమ మగు లోకము నిరత సుఖానుభవ మొంది ♦ నెగడుచునుండున్.

తే॥ వృద్ధుఁడీతఁ డుదయ నీయఁ♦డేయటంచుఁ దలఁచి వరమీయవచ్చితే♦ దైత్యహరణ
మ్రొక్కిన వరం బొసంగెడి♦యక్కటి కఁపు వేల్ప వీవగదా యెల్ల♦ వేల్పులందు.

క॥ ఏ ననపత్య విచారముఁ బూని తపముఁజేసితిపుడు ♦ పుడుకు దొడుక వై
శా నని ముదుసలినిఁ గానగ నో నిఖిలాధీశ వచ్చితో యిచ్చటికిన్.

తే॥ ఇపుడు నాకు వరము ♦ నీయఁదలఁతువే న యోనిజుండు మృత్యు ♦ హీనుఁడగుచుఁ
గులము నుద్ధరించు ♦ కొడుకు నొసంగి నా యిడుము బాపు మో సు ♦ రేశ యింక.

చ॥ అనవుఁడు వాసవుఁడు భళి రా యిది యేటి విరుద్ధ వాంఛ యీ
ఘనునకు మృత్యుహీనుఁడు న ♦ ఖండుఁ డయోనిజుఁడైన వానిఁ బు
త్రు నెటు లొసంగ నేర్తునో యె ♦ దో వరమిచ్చెదనన్ దలంచి వ
చ్చినఁ దనకిట్టి కోర్కె యని ♦ చెప్పఁగవచ్చునె మాని కెంతయున్,

—యాచకలక్షణము—

తే॥ ఏది సాధ్యమగునొ ♦ యేది యసాధ్య మా నో యటంచుఁ దలఁప కొక్కపరిగ
మన్ను మిన్ను మ్రింగ ♦ మది నెంచుచుండెద రర్థులైన వార ♦ లాసతోడ.

చ॥ కనికరమాని నెమ్మదిని ♦ గైకొనుఁడిచ్చెదనంచుఁ బల్కినం
తనె బహుళాశతో నసు చి ♦ తంబుచితంబని యెంచ కింతయున్
గొనకొని యెల్లలోకముల ♦ కున్ దమ పెత్తమే యొసంగుమం
చని వచియింత్రు దాతృగుణ ♦ మారయ నేరక యాచకుల్ ధరన్.

చ॥ తనపని పూర్తిన్ యయ్యెడు వి ♦ ధంబుఁనె చూచును గాని యిచ్చునా
తనికిఁ గలట్టి శక్తిని ప ♦ దంపడి యెంచఁగఁ బోవఁ డిచ్చినం
తనె కొని సంతసం పడఁడు ♦ దాతమనంబున కహర్మైన రీ
తిని జరియింప నేరఁడు మ ♦ దిన్ గునియున్ గద యాచకుండిలన్.

ఉ॥ గౌరవబుద్ధితోడ నొక ♦ కాసిడినన్ బదివేలటంచు లో
నారసి తృప్తినొందెడి మ ♦ హాత్మున కెంతయొ యీయవచ్చుగా
కేరికిఁ దీర్పరాని యెది ♦ యే నొక కోరికఁ గోరువాని కే
తీరున నిచ్చినన్ మదికిఁ ♦ దృప్తి యొకింతయుఁ గల్గనేర్చునే.

తే॥ తనకు మృత్యుహీనుఁ ♦ డు నయోనిజుండగు కొడుకుఁ బడయఁ దగిన ♦ గొప్పతనమె
కలిగియున్న నింత ♦ కాలంబు తపమొనరింప వలయునే ధ ♦ రిత్రి నిటుల.

వ॥ అని యించుక మనంబునం దలంచి.

ఉ॥ ఓఋషివర్య యిట్లడుగు • టొప్పునె సాధ్యముగాని కార్యమే
వారును దీర్పనేర్తురె ప్ర • వాసమునన్ గృపసేయించి తన్యమా
గోరిక యేదియేని నను • గోరు మొసంగెద మృత్యుహీనులా
వార లెవారయో నిజులె • వారలొ యెక్కడ నే యెఱుంగుదే.

మ॥ తెలియక యిట్లు కోరితివ • ధీరతదుర్లభమైన దీనినే
వలఁతియు దీర్పనేరఁడు త • పంబునకున్ మది మెచ్చి కోరికన్
దెలుపుమనంగ నిట్లడుగు • దే నను నేరనివాని జేయఁగా
దలఁచితె లెస్సయయ్యెఁ గ • దా శ్రుతిమించిన రాగముండునే.

క॥ ననుగుఱిచి తపమొనర్చితి వనఘా యీ వరము దక్క • నన్యం బెదియై
న నొసంగెద సంతృప్తిన్ గని నాకుఁ బ్రతిష్ఠగూర్పఁగద • వత్సయికన్.

చ॥ అనిమిషనాథుఁ డొక్కతఱి • నర్థి మెయిన్ దన నాశ్రయింపఁగా
మునికి వరంబు నిత్తునని • మున్ను వచించి తనంతఁ దా నశ
క్తిని గనుపించె నంచు ననుఁ • దిట్టిరె లోకులు నీ మనోరథం
బు నిడకయున్నచో నిదియుఁ • బోల దిఁకేమి యొనర్పఁగాఁదగున్

సీ॥ అఖిలదృశ్యాదృశ్య • మగు ప్రపంచము సృష్టి సలుపంగఁ జాలిన • జలజభవున
కును నీ మనోరథం • బును దీర్పఁగాఁగాదు పలుగుఱిచి యెట్లు • పలుకవలయు.
నతఁడును యోనిజుం • డండసంభూతుఁ డీశ్వరదేహభవుఁడు భ • వానితనయుఁ
డా ఘనుండును మిత్తి•నతిశయింపఁగ నేరఁ డాయువు ద్విపరార్ధ•మై రహించు
మృత్యుహీనుఁ డయో నిజుం డే సుతుండు వలయునని యేల కోరెదీ • వాంఛితంబు
నడిగి నీవంటి పుత్రుని • బడసినాకు యశముఁ గూర్పఁగదయ్య గు • ణావతంస.

వ॥ అనిన శిలాదుం డమరేంద్రున కిట్లనియె.

శా॥ దేవాధీశ్వర నీవె యిట్లనిన నీ • దీనున్ గృపాదృష్టి మై
కావన్ గల్గినవారె వారు సకల • క్ష్మాచక్రమున్ నీవ కా
దే వర్ధిల్లఁగఁ జేయుచుండెదవు నీ • కింతే నసాధ్యంబొకం
డీ విశ్వంభర గల్గునె యెఱుఁగనే • నే నీ సమర్థత్వమున్.

చ॥ ఇతరవరంబు లేమిటికి • మృత్యువిహీనుఁ డయోనిజుండు నా
సుతునకు నై తపించితి • యశోధన ముందుగ మాటయిచ్చి యీ
గతి వచియింపనేల యొడికంబునఁ ద్వాదృశులైనవారి క
ప్రతిహత తేజులై యలరు • వారల కేని యసాధ్యమా నిలన్.

వ॥ ఇది యిట్లుండనిమ్ము నా మనోరథం బెప్పటి కెట్లు సమకూరవలయు నప్పటికట్లు సమకూర గలదు. కాని నీ వాక్యములందు నా కొండు సంశయంబు వొడమ చున్నది. దాని మున్ను నివారింపుము.

సీ॥ అనఘ యయ్యజునకు • నండయోనిత్వంబు పద్మయోనిత్వంబు • భవశరీర
సంభవత్వం బెట్లు • సంభవించెను దక్షుఁ డజునకుఁ బుత్రుఁడౌ • నతని కూఁతు
దాక్షాయణికి బ్రహ్మ • తనయుఁ డెట్లయ్యెను వినిపింపుమా నాకు విశదముగను
సృష్టిప్రకారంబు • శిష్టుల కేనియుఁ దెలియశక్యముగాదు. • సులభముగను
నిగమవేత్తవీవు • నిఖిలజ్ఞుఁడవు నీకుఁ దెలియరాని దొండు • గలదె యెందు
పరమకారుణికుఁడ • వరయ నీ మహిమంబు వినుతమైనరస్సు • ననవరతము.

—పద్మయోనియండయోనిత్వాది కథనము—

క॥ అనుటయు శిలాదమునిఁగని యనిమిష నాథుండు పలికె • నహర్ణంబగు దా
నినె వినఁగోరితి విపుడో యనఘా యవధానుఁడవయి • యాలింపుమికఁన్.
తే॥ తత్పురుష కల్పమున జగ•త్త్రాతయైన రుద్రుఁ డొక్కఁడు జ్యోతి స్స్వ•రూపమూ
యలరువాఁడు మరల సృష్టి•సలుపుపూన్కి నిజశరీరంబున సృజించిచె•నజుని వేడ్క
వ॥ నారాయణుఁడు సహస్ర దివ్యవర్షంబులు భక్తిమెయి మహాదేవుని వహించి
హరుండా మధుసూదనునందు వాత్సల్యంబునఁ జేసి సకలంబగు సృష్టికర్తృత్వ
బొసంగెఁ గావున నా కల్పంబు మేఘవాహన సంజ్ఞఁ దనరునప్పుడు.
క॥ పరమేశ్వరాంగజుండగు పరమేష్ఠియు హరుని గాంచి • ప్రణుతించి జగ
ద్భరణు నతనిఁ గని వినయ స్ఫురణన్ నచియించె భక్తి • పూర్ణుండగుచున్.
సీ॥ అనఘ నీ వామాంగ • మునఁ బుట్టె మధువైరి దక్షిణాంగంబునఁ • దగజనించి
తిని నేను వనజలోచ • నున కన్నను ముఖ్య భక్తుఁడ నీకు న • వ్యయుయు మేశ
యీ సృష్టికర్తృత్వ • మెల్ల నాతనికి యొసంగితి వేలయ • నంగహరణ
యేను శక్తుండఁగా • నే సృష్టి సేయంగ నప్పని దయసేయు • మయ్య నాకు
భక్తజన మనోరథము చీర్పంగ నీవు చతురుఁడవు కావె యాశ్రిత • సముదయంబు
పాలుపత్తెంబుల గడించి • ప్రథితులగుట నీ యనుగ్రహముఁ గాదె • నీలకంఠ.
తే॥ అనుచుఁ బ్రార్థింపఁ బరమేశుఁ•డవ్యయుండు కాంచ నోదరు నెడఁ గని•కరముఁబూ
యెల్ల సృష్టికర్తృత్వంబు • నిచ్చుటయును సరసిజభవుండు సంతోష•భరితుఁడగుచు.
ఉ॥ దారుణ మంధకార భరి • తంబు సువర్ణ మణీ మయ ప్రభాం
కూర విరాజితంబఖిల • కోపిదలోక సమర్చితంబు దు
ర్వార సమస్త పాపచయ • పర్వత వజ్ర మనంతపుణ్య దం
బైరహిమించు సాగర మ • హాలయమందుఁ జేరి యచ్చటన్.
మ॥ మృదులానంత శయానుధీరు నఖిలలో • కైకల్ప నోదారు ని
త్య దయాశీలు సరోజలోచనుఁ బ్రస • న్నాస్యున్ జితేంద్రారి సం
పదలక్ష్మీకరపంకజారుణిత దీ • వ్యత్పాదు సర్వాగమా
స్పదువందారు జనావనున్ ద్రిగుణ సం • పచ్ఛోభితున్ గేశవున్.

తే॥ శంఖచక్రగదాధరు • సకలభూషణాంచితుఁ జతుర్భుజునిఁబర • మాత్మునీశు
విమలకౌస్తుభవక్షుసు • వినుతచరితు నెలమియోరికలీక • లెత్తఁగాంచి.

తే॥ కదురయంబున క్షీరసా • గరమునందు యోగనిద్రాపరుండయి • యున్నవాని
యతని సన్నిధిఁజేరి యం • చిత గుణాఢ్యుఁ డజుఁడు మెల్లనఁబల్కె ని • ట్లనుచు నపుడు.

వ॥ పరమేశ్వర ననుగ్రహంబునఁ జేసి తొల్లి నీవు నన్నెటుల గ్రసించితి వటుల నిన్ని
పుడు గ్రసించె దననిన నారాయణుండు మేల్కనియించుక నగుచు నండోద్భవుం
డగు విరించి వదనబిలంబు సొచ్చుటయు నజుండు వైకుంఠుని మరల నిజభ్రూమధ్యం
బున సృజించె నప్పుడు మంచుసోహారుండు విక్కృతరూపంబుఁ దాల్చి వారి సమ
క్షంబునఁ దోఁచిన నజహరులమ్మహాత్ముని వినుతించి రంత దేవదేవుం డదృశ్యుం
డయ్యె నప్పుడు విష్టరశ్రవసుండు వాణీధవున కిట్లనియె.

—వైష్ణవ సృష్టి—

సీ॥ పరమేశ్వరుండు శం • కరుఁడు జగన్నాథుఁ డఖిల గుండాతండె • యందఱకును
మనకును నీశుఁడా • తని వామతనువునఁ గలిగితి దక్షిణాం • గమున నీవు
జన్మించితివి నన్ను • సకల ఋషులు ప్రధానమైన ప్రకృతిగన • వ్యక్తముగను
నిను బురుషునిగఁ జిం • తింతు రెప్పుడు మన కిరువురకును బీజ • మీశ్వరుండ
యయ్యె సృష్టిఁజేయు • నప్పని మనలోన నెవరయిందు నున్న • నేమి కొఱత
సర్వమునకు నేత • శంకరుండాతని కరుణ గలుగవలయుఁ • గాని మనకు.

సీ॥ అని వచియించి జ • లాంతర్నిమగ్నయౌ నవనీతలంబెల్ల • హరి తనంత
ను రుతరకిరి రూప • మూని యప్పుడ యుద్ధరించి నశేసము • ద్రాంచితమగు
వసుధ నిమ్నోన్నత • వర్జితంబుగఁ జేసి భువన చతుష్టయం • బును ఘటించె
నంత నగ జ్యేష్ఠుఁ డమలిన మతి వృక్ష సంతతియును బశు • సంచయంబు
సృష్టిఁ జేసి దైవ • సృష్టియు మానవ సృష్టియును బొనర్చి • చెలఁగి మున్ను
వితతమతు లరగుచు • వెలయు సనందుని సనకు సృష్టిఁజేసెఁ జతురుఁడగుచు.

వ॥ మఱియు మరీచి భృగ్వంగిరః పులస్త్య పులహ క్రతు దక్షా త్రివసిష్ఠాది ప్రజాపతు
లను సంకల్ప ధర్మాధర్మ ఋభుసనత్కుమారులను సృష్టించి సమస్తంబులఁ గల్పించె
నని శిలాదుండు వాసవున కిట్లనియె.

—యుగధర్మములు—

చ॥ అనిమిషలోకనాథ కమ • లాసనుఁ డెవ్విధి సృష్టిఁజేసె భూ
తనికర సేవ్యమైన యుగ • ధర్మ చయంబు యుగంబు లెవ్వి యె
వ్వని కెటులాచరింపఁ దగుఁ • బ్రాక్తన కల్మష నాశకంబు లా
యనఘములైన ధర్మములు • నారసి నాకెఱుఁగంగఁ దెల్పవే.

వ॥ అనిన నింద్రుం డాతని గాంచి యిట్లనియె. నయ్యుగంబులు కృత త్రేతా ద్వాపర తిష్యంబులను సంజ్ఞలచేఁ గ్రమంబుగ నలరు. కృతంబున సత్వంబును, త్రేత రజంబును, ద్వాపరంబున రజస్తమంబులును, తిష్యయుగంబునఁ దమంబును బ్రధానంబులైన గుణంబులుగ నుండు.

తే॥ కృతయుగంబున ధ్యానంబు • త్రేతయందు సవనమును ద్వాపరమున భ • జనము కలిని
దానమును ముఖ్యకార • ణత్వంబుఁ గాంచు సుకృత సంపాదనమున కో • శుద్ధచరిత.

సీ॥ కీర్తింపఁబడు నిలఁ • గృతము దివ్యచతుస్సహస్ర వర్షాన్వితం • బగుచు నెప్పు
డంతియ కాలమై • యలరు సంధ్యయును సంధ్యాంశంబు నాల్గువే • లబ్దములుగఁ
బ్రజల కాయుష్యంబు • పరఁగు నయ్యుగమున సంధ్యాంశమది • కడచనియె నేని
పాదావశిష్టమై • పరఁగు నయ్యుగధర్మ మలరుఁ ద్రేతాయుగ మందు మూఁడు
పాదములుగ మఱియు • ద్వాపరంబున రెండు చరణములు కలి నొక చరణమగుచు
నియమితంబునయ్యె • నీరజాసనుఁ డిట్టు లేర్పరించె యుగము • లెల్లఁ దొల్లి.

వ॥ సంధ్యాంశంబు క్రమంబునఁ ద్రిశతియు ద్విశతయు నేక శతయునై కల్పంబులందు బ్రతియుగంబు నందును నలరుచుండును.

సీ॥ కృతయుగంబున ధర్మ • మతులమై నాల్గు పాదంబుల నడచు సం • తతము ధరణి
త్రేతాయుగంబున • త్రిపదాభిరామమై విబుధమాన్యంబయి • వెలయుచుండు
ద్వాపరయుగమునఁ • బాదయుగముఁ బూని కుంటినడక లేక • గొనబుఁ జూపు
గలి నేకపాద సం • కలితమై యడుగడుగునఁ బడుచును • లేచును విసుగుచు
గృతమునఁ మిథునోత్పత్తి • కేవలంబు రససముల్లసితంబగుఁ • బ్రజలు సౌఖ్య
భోగులానంద యుతులునై • పొంగుచుండు నుత్తమాధమతా విశేషోక్తి లేక.

సీ॥ ఆదియుగంబున నాయుష్య సుఖరూపములు తుల్యములగుచు • వెలయుచుండు
బ్రజ కనర్హ స్త్రీలి • యు జనింపకుండు శీతోష్ణ కృతశ్రమ • ముండ దెపుడు
శైల సాగర నివా • సంబుఁ బ్రేమింతురు జనుల నికేతాశ్ర • య నిరతులయి
విగతశోకులును వి • శేషులు బహుళ సత్వులు నయి చరియింత్రు • లిప్సమతులు
కామ్యరహిత కర్మ • కరులయి సంతత ముదిత మానసులయి • విదిత వేదు
లగుచుఁ జెలఁగుచుండు • రగణిత కీర్తి విస్తారులగుచుఁ బ్రజలు • శౌర్యులగుచు.

తే॥ తలఁప సుకృత దుష్కృతకర్మ • ములను గలుగు నప్రవృత్తియు వర్ణాశ్ర • మాదులకు వ్యవస్థయగును
సాంకర్యంబు • వర్జితమగుఁ గృతయుగంబిల శాస్త్రసమ్మతయుగంబు.

వ॥ కాలయోగంబు కతనఁ ద్రేతాయుగంబునందు రసోల్లాసంబు నశించుఁ డు నితర సిద్ధి గలుగు మేఘాత్మచే నాపోసౌక్ష్మ్యంబు ప్రతిగతంబగుటఁ జేసి వలాహకంబులు వృష్టిసర్జనంబుఁ గావించు. అట్టి వర్షంబున నవనీతలంబు సంయుక్తంబై యుంటచే బ్రజలు వృక్షంబుల నిలయంబులుగఁ జేసికొని వానివలన సర్వ వృత్త్యుప భోగం

వ॥ అని యించుక మనంబునఁ దలంచి.

ఉ॥ ఓఋషివర్య యిట్లడుగు • టొప్పునె సాధ్యముగాని కార్యమే
వారును దీర్ప నేర్తురె ప్ర • వాసమునన్ గృపసియించి తన్యమా
గోరిక యేదియేని నను • గోరు మొసంగెద మృత్యుహీనులౌ
వార లెవారయో నిజులె • వారలౌ యొక్కర నే యెఱుంగుదే.

మ॥ తెలియక యిట్లు గోరితివ • ధీరతదుర్లభమైన దీనినే
వలఁతియు దీర్ప నేరఁడు త • పంబునకున్ మది మెచ్చి కోరికన్
దెలుపుమనంగ నిట్లడుగు • దే నను నేరనివాని జేయఁగా
దలఁచితె లెస్సయయ్యెనుఁ గ • దా శ్రుతిమించిన రాగముందునే.

క॥ నను గుఱించి తపమొనర్చితి వనఘా యీ వరము దక్క • నన్యంబేదియై
న నొసంగెద సంతృప్తిన్ గని నాకుఁ బ్రతిష్ఠ గూర్పఁగద • వత్సయికన్.

చ॥ అనిమిషనాథుఁ డ్రాక్కతతి • నర్థి మెయిన్ దన నాశ్రయింపఁగా
మునికి వరంబు నిత్తునని • మున్ను వచించి తనంతఁ దా నశ
క్తిని గనుపించె నంచు ననుఁ • దిట్టిరె లోకులు నీ మనోరథం
బు నిడకయున్నచో నిదియుఁ • బోలదిఁ కేమి యొసర్పఁగాఁదగున్

సీ॥ అఖిలదృశ్యాదృశ్య • మగు ప్రపంచము సృష్టి సలుపంగఁ జాలిన • జలజభవున
కును నీ మనోరథం • బును దీర్పఁగారాదు పరులఁ గుఱించి యెట్లు • పలుకవలయు.
నతఁడును యోనిజుం • డండసంభూతుఁ డీశ్వరదేహభవుఁడు భ • వానితనయుఁ
డా ఘనుండును మిత్తి • నతిశయింపఁగ నేరఁ డాయువు ద్విపరార్ధ • మై రహించు
మృత్యుహీనుఁ డయోనిజుం డే సుతుండు వలయునని యేల కోరెదో • వాంఛితంబు
నడిగి నీవంటి పుత్రుని • బడసినావు యశముఁ గూర్పఁగదయ్య గు • ణావతంస.

వ॥ అనిన శిలాదుం డమరేంద్రున కిట్లనియె.

శా॥ దేవాధీశ్వర నీవె యిట్లనిన నీ • కీనున్ గృపాదృష్టి మై
కావన్ గల్గినవారె వారు సకల • క్ష్మాచక్రమున్ నీవ కా
దే వర్ధిల్లఁగఁ జేయుచుండెదవు నీ • కింతే నసాధ్యంబొకం
డీ విశ్వంభర గల్గునె యెఱుఁగనే • నే నీ సమర్థత్వమున్.

ఉ॥ ఇతరవరంబు లేమిటికి • మృత్యువిహీనుఁ డయోనిజుండు నా
సుతునకునై తపించితి • యశోధన ముందుగ మాటయిచ్చి యీ
గతి వచియింపనేల యొడికంబునఁ ద్వాదృశులైనవారి క
ప్రతిహత తేజులై యలరు • వారల కేని యసాధ్యమా నిలన్.

వ॥ ఇది యిట్లుండనిమ్ము నా మనోరథం బెప్పటి కెట్లు సమకూరవలయు నప్పటికట్లు సమకూర గలదు. కాని నీ వాక్యములందు నా కొండు సంశయంబు వొడముచున్నది. దాని మున్ను నివారింపుము.

సీ॥ అనఘ యయ్యజునకు • నండయోనిత్వంబు పద్మయోనిత్వంబు • భవశరీర
సంభవత్వం బెట్లు • సంభవించెను దక్షుం డజునకుఁ బుత్రుఁడౌ • నతని కూఁతు
దాక్షాయణికి బ్రహ్మ • తనయుఁ డెట్లయ్యెను వినిపింపుమా నాకు విశదముగను
సృష్టిప్రకారంబు • శిష్టుల కేనియుఁ దెలియశక్యముగాదు. • సులభముగను
నిగమవేత్తవీవు • నిఖిలజ్ఞుఁడవు నీకుఁ దెలియరాని దొండు • గలదె యెంచ
పరమకారుణికుఁడ • వరయ నీ మహిమంబు వినుతమైనరచ్చు • ననవరతము.

—పద్మయోనియండయోనిత్వాది కథనము—

క॥ అనుటయు శిలాదమునిఁగని యనిమిష నాథుండు పలికె • నహర్గంబగు దా
నినె వినఁగోరితి విపుడో యనఘా యవధానుఁగవలయు • యాలింపుమిఁకన్.
తే॥ తత్పురుష కల్పమున జగ•త్త్రాతయైన రుద్రుఁ డొక్కఁడు జ్యోతి స్స్వ•రూపమూ
యలరువాఁడు మరల సృష్టి•సలుపుపూన్కి నిజశరీరంబున సృజించిచె•నజుని వేడ్క
వ॥ నారాయణుఁడు సహస్ర దివ్యవర్షంబులు భక్తిమెయి మహాదేవుని వహించి
హరుండా మధుసూదనునందు వాత్సల్యంబునఁ జేసి సకలంబగు సృష్టికర్తృత్వ
బొసంగెఁ గావున నా కల్పంబు మేఘవాహన సంజ్ఞఁ దనరునప్పుడు.
క॥ పరమేశ్వరాంగజాండగు పరమేష్ఠియు హరుని గాంచి • ప్రణుతించి జగ
ద్భరణు నతనిఁ గని వినయ స్ఫురణన్ నచియించె భక్తి • పూర్ణుండగుచున్.
సీ॥ అనఘ నీ వామాంగ • మునఁ బుట్టె మధువైరి దక్షిణాంగంబునఁ • దగజనించి
తిని నేను వనజలోచ • నున కన్నను ముఖ్య భక్తుఁడ నీకు న • వ్యయయు మేశ
యీ సృష్టికర్తృత్వ • మెల్ల నాతనికి యొసంగితి వేలయ • నంగహరణ
యేను శక్తుండఁగా • నే సృష్టి సేయంగ నప్పని దయసేయు • మయ్య నాకు
భక్తజన మనోరథము పూర్పంగ నీవు చతురుఁడవు కాదె యాశ్రిత • సముదయంబు
పాలుపత్తెంబుల గడించి • ప్రథితులగుట నీ యనుగ్రహముఁ గాదె • నీలకంఠ.
తే॥ అనుచుఁ బ్రార్థింపఁ బరమేశుఁ•డవ్యయుండు కొంచ నోదరు నెడఁ గని•కరముఁబూ
యెల్ల సృష్టికర్తృత్వంబు • నిచ్చుటయును సరసిజభవుండు సంతోష•భరితుఁడగుచు
ఉ॥ దారుణ మంధకార భరి • తంబు సువర్ణ మణీ మయ ప్రభాం
కూర విరాజితంబఖిల • కోవిదలోక సమర్చితంబు దు
ర్వార సమస్త పాపచయ • పర్వత వజ్ర మనంతపుణ్య దం
బైరహిమించు సాగర మ •హాలయమందునఁ జేరి యచ్చటన్.
మ॥ మృదులానంత శయానుధీరు నఖిలలో • ర్వీకల్ప మోదారు ని
త్య దయాశీలు సరోజలోచనుఁ బ్రస • న్నాస్యున్ జితేంద్రారి సం
పదులక్ష్మీకరపంకజారుణిత దీ • వ్యత్పాదు సర్వాగమా
స్పదువందారు జనావనున్ ద్రిగుణ సం • పచ్ఛోభితున్ గేశవున్.

తే॥ శంఖచక్రగదాధరు • సకలభూషణాంచితుఁ జతుర్భుజునిఁ బర • మాత్మునీశు
విమలకౌస్తుభవక్షు సు • వినుతచరితు నెలమిఁ గోరికలీరిక • లెత్తఁగాంచి.
తే॥ కడురయంబున క్షీరసా • గరమునందు యోగనిద్రాపరుండయి • యున్నవాని
యతని సన్నిధిఁజేరి యం • చిత గుణాఢ్యుఁ డజుఁడు మెల్లనఁబల్కె • నిట్లనుచు నపుడు.

వ॥ పరమేశ్వరు ననుగ్రహంబునఁ జేసి తొల్లి నీవు నన్నెటుల గ్రసించితి వటుల నిన్నిపుడు గ్రసించెద ననిన నారాయణుండు మేల్కనియించుక నగుచు నండోద్భవుం డగు విరించి వదనబిలంబు సొచ్చుటయు నజుండు వైకుంఠుని మరల నిజభ్రూమధ్యంబున సృజించె నప్పుడు మారసంహారుండు వికృతరూపంబుఁ దాల్చి వారి సమక్షంబునఁ దోఁచిన నజహరులమ్మహాత్ముని వినుతించి రంత దేవదేవుం డదృశ్యుం డయ్యె నప్పుడు విష్టరశ్రవసుండు వాణీధవున కిట్లనియె.

—వైష్ణవ సృష్టి—

సీ॥ పరమేశ్వరుండు శం • కరుఁడు జగన్నాథుఁ డఖిల గుండాతండె • యందఱకును
మనకును నీశుఁడా • తని వామతనువునఁ గలిగితి దక్షిణాం • గమున నీవు
జన్మించితివి నన్ను • సకల ఋషులు ప్రధానమైన ప్రకృతిగ • నవ్యక్తముగను
నిను బురుషునిగఁ జిం • తింతు రెప్పుడు మన కిరువురకును బీజ • మీశ్వరుండ
యయ్యె సృష్టిఁజేయు • నప్పని మనలోన నెవరయిందు నున్న • నేమికొఱఁత
సత్వమునను నేత • శంకరుండాతని కరుణ గలుగవలయుఁ • గాని మనకు.

సీ॥ అని వచియించి జ • లాంతర్నిమగ్నయౌ నవనీతలంబెల్ల • హరి తనంత
ను సూకరకిరి రూప • మూని యప్పుడ యుద్ధరించి నదీసము • ద్రాంచితముగ
వసుధ నిమ్నోన్నత • వర్జితంబుగఁ జేసి భువన చతుష్టయం • బును ఘటించె
నంత సుర జ్యేష్ఠుఁ డమలిన మతి వృక్ష సంతతియును బశు • సంచయంబు
సృష్టిఁ జేసి దైవ • సృష్టియు మానవ సృష్టియును బొనర్చి • చెలఁగి మున్ను
వితతమతు లరగుచు • వెలయు సనందుని సనకు సృష్టిఁజేసెఁ జతురుఁడగుచు.

వ॥ మఱియు మరీచి భృగ్వంగిరః పులస్త్య పులహ క్రతు దక్షాత్రివసిష్ఠాది ప్రజాపతులను సంకల్ప ధర్మాధర్మ ఋభు సనత్కుమారులను సృష్టించి సమస్తంబులఁ గల్పించె నని శిలాదుండు వాసవున కిట్లనియె.

—యుగధర్మములు—

చ॥ అనిమిషలోకనాథ కమ • లాసనుఁ డెవ్విధి సృష్టిఁజేసె భూ
తనికర సేవ్యమైన యుగ • ధర్మచయంబు యుగంబు లెవ్వి యె
వ్వని కెటులాచరింపఁ దగుఁ • బ్రాక్తన కల్మష నాశకంబు లా
యనఘములైన ధర్మముల • నారసి నా కెఱుఁగంగఁ జెప్పవే.

వ॥ అనిన నింద్రుం డాతని గాంచి యిట్లనియె. నయ్యుగంబులు కృత త్రేతా ద్వాపర తిష్యంబులను సంజ్ఞలచేఁ గ్రమంబుగ నలరు. కృతంబున సత్వంబును, త్రేత రజంబును, ద్వాపరంబున రజస్తమంబులును, తిష్యయుగంబునఁ దమంబును ప్రధానంబులైన గుణంబులుగ నుండు.

తే॥ కృతయుగంబున ధ్యానంబు ♦ త్రేతయందు సవనమును ద్వాపరమున భ ♦ జనముకలిని
దానమును ముఖ్యకార ♦ ణత్వంబుఁ గాంచు సుకృత సంపాదనమున నో ♦ శుద్ధచరిత.

సీ॥ కీర్తింపఁబడు నిలఁ ♦ గృతము దివ్యచతుస్సహస్ర వర్షాన్వితం ♦ బగుచు నెప్పు
డంతియ కాలమై ♦ యలరు సంధ్యయును సంఖ్యాంశంబు నాల్గువే ♦ లబ్దములుగఁ
బ్రజల కాయుష్యంబు ♦ పరఁగు నయ్యుగమున సంఖ్యాంశమది ♦ కడచనియెనేని
పాదావశిష్టమై ♦ పరఁగు నయ్యుగధర్మ మలరుఁ ద్రేతాయుగ మందు మూఁడు
పాదములుగ మఱియు ♦ ద్వాపరంబున రెండు చరణములు కలి నొక చరణమగుచు
నియమితంబునయ్యె ♦ నీరజాసనుఁ డిట్టు లేర్పరించె యుగము ♦ లెల్లఁ దొల్లి.

వ॥ సంఖ్యాంశంబు క్రమంబునఁ ద్రిశతియు ద్విశతయు నేక శతయునై కల్పంబులందు బ్రతియుగంబు నందును నలరుచుండును.

సీ॥ కృతయుగంబున ధర్మ ♦ మతులమై నాల్గు పాదంబుల నడచు సం ♦ తతము నరణి
త్రేతాయుగంబున ♦ ద్రిపదాభిరామమై విబుధమాన్యంబయి ♦ వెలయుచుండు
ద్వాపరయుగమునఁ ♦ బాదయుగముఁ బూని కుంటినడక లేక ♦ గొనబుఁ జూపు
గలినేకపాద సం ♦ కలితమై యడుగడుగునఁ బడుచును ♦ లేచును విసుగుచు
గృతమునఁ మిథునోత్పత్తి ♦ కేవలంబు రసముల్లసితంబగుఁ ♦ బ్రజలు సౌఖ్య
భోగులానంద యుతులునై ♦ పొంగుచుందు రుత్తమాధమతా విశేషోక్తి లేక.

సీ॥ ఆదియుగంబున నాయుష్య సుఖరూపములు తుల్యములగుచు ♦ వెలయుచుండు
ప్రజ కనహర్ష ప్రీతి ♦ యు జనింపకుండు శీతోష్ణ కృతశ్రమ ♦ ముండదెపుడు
శైల సాగర నివా ♦ సంబుఁ బ్రేమింతురు జనుల నికేతాశ్ర ♦ య నిరతులయి
విగతశోకులును వి ♦ వేకులు బహుళ సత్వులు నయి చరియింత్రు ♦ లిక మతులు
కామ్యరహిత కర్మ ♦ కరులయి సంతత ముదిత మానసులయి ♦ విదితవేదు
లగుచుఁ జెలఁగుచుందు ♦ రగణిత కీర్తి విస్తారులగుచుఁ బ్రజలు ♦ శౌర్యులగుచు.

తే॥ తలఁప సుకృత దుష్కృతకర్మ ♦ ములను గలుగు నప్రవృత్తియు వర్ణాశ్ర ♦ మాదులకువ్య
వస్థయగును సాంకర్యంబు ♦ వర్జితమగుఁ గృతయుగంబిల శాస్త్రసమ్మతయుగంబు.

వ॥ కాలయోగంబు కతనఁ ద్రేతాయుగంబునందు రసోల్లాసంబు నశించుఁడు నితర సిద్ధి గలుగు మేఘాత్మచే నాపోసౌక్ష్మ్యంబు ప్రతిగతంబగుటఁ జేసి వలాహకంబులు వృష్టిసర్జనంబుఁ గావించు. అట్టి వర్షంబున నవనీతలంబు సంయుక్తంబై యుంటచే ప్రజలు వృక్షంబుల నిలయంబులుగఁ జేసికొని వానివలన సర్వ వృత్త్యుప భోగం

బుఁ గాంతురు. అట్లు కొండొక కాలంబు చనఁ గాలవిపర్యయంబున రాగలోభాత్మకంబగు భావంబు గలుగు. అంత గృహభూతంబులగు వృక్షంబులు నశించుటఁ జేసి ప్రజలు మరల తరువ్రజంబుల సంహరింపఁజేసి వానివలన ఫలంబులును వస్త్రంబులును నార్జింతురు. ఆతరువులకతన గంధవర్ణరసంబులు జనించు. ఆమాక్షికంబును మహావీర్యంబు నగు మధుసేవనంబున జనులు సంతుష్టినొంది విగతజ్వరులై యుండియుఁ దీవ్రంబులగు శీతవర్షాతపంబుల కోర్వక క్రమంబున నాకులచేత నావరణంబుఁ గల్పించుకొని గిరులందొండెఁ గాంతారంబులందొండె నివసించుచు క్షుత్పిపాసల నడఁగించుకొనుచు భూజల సంయోగజంబులగు నోషధుల ఫలింపఁ జేయుచు వాని ఫలంబులఁ గుడుచుచుందురు. పిమ్మటఁ బ్రజాసంఖ్య యభివృద్ధియగుటచే నందఱును సుతదారపోషణార్థంబునకై క్షేత్రంబుల నియమించుకొందురు. అట్టియెడఁ బ్రజాపాలనం బావశ్యకంబగుడు విరించి క్షత్రియుల సృజించి వర్ణాశ్రమాచార వ్యవహారంబుల నియమించును. విప్రులకు యజ్ఞాచరణంబె ముఖ్యంబైయుండు. కొంద ఱహింసాపరాయణులు పశుయజ్ఞంబు నొల్లరు.

సీ॥ ద్వాపరయుగమునఁ • బ్రజలకభిప్రాయ భేదంబు వాటిల్లు • వివిధములగు
కార్యంబులందునఁ • గాయశ్రమముఁ జేసి లోభంబు ధృతియు వి • లోలతయును
గలుగు వాణిజ్యంబు • కలహం బనిశ్చయమును ధర్మసాంకర్య • మును జెలంగు
వర్ణాశ్రమంబులు • ధ్వస్తంబులగు నరి షడ్వర్గము జయించు • శక్తి లేక
యుండుచుందు రెపుడు • గుణవిహీనులగుచు వ్యాసమౌని నిగమ • వర్గ మెల్ల
నాల్గువిధములుగను • వ్యాసంబుఁ గావించు నాయువెల్ల క్షీణ • మగుటఁ జేసి.

వ॥ మంత్ర బ్రాహ్మణ విన్యాసంబులచేతను స్వరవర్ణ విపర్యయంబులచేతను ఋగ్యజుస్సామ సంహితలు వికృతంబులుగఁ జేయంబడు. బ్రాహ్మంబును పాద్మంబును వైష్ణవంబును శైవంబును భాగవతంబును భవిష్యంబును నారదీయంబును మార్కండేయంబును నాగ్నేయంబును బ్రహ్మకైవర్తంబును లైంగంబును వారాహంబును వామనంబును కౌర్మ్యంబును మాత్స్యంబును గారుడంబును స్కాందంబును బ్రహ్మాండంబును మున్నగాఁ గల పురాణంబులును బ్రాహ్మణకల్పసూత్రంబులును నితిహాసంబులును భేదంబుఁ బొందియుండు, ఈ ద్వాపరంబున లైంగం బేకాదశ విధంబులుగ భేదింపఁబడియుండు. మన్వత్రి విష్ణుహారీత యాజ్ఞ్యవల్క్య శనాంగిరో యమాపస్తంభ సంవర్త కాత్యాయన బృహస్పతి పరాశర వ్యాస శంఖలిఖిత దక్ష గౌతమ శాతాతప వసిష్ఠాదులు ధర్మశాస్త్ర కర్తలై యుందురు.

సీ॥ వర్షరహితమౌట • వ్యాఘ్రాద్యుపద్రవం బులఁ జేసి పంచత్వ • మును వహింత్రు
వ్యాత్మనఃకర్మ సం • భవ దుఃఖములచేత నిర్వేదమును బొందు • నృనిచయంబు
నిర్వేదమునఁ జేసి • నెగడు మోక్షవిచార ముద్దాన వైరాగ్య • మతిశయిల్లు
దానికతన దోష • దర్శనంబగు దానఁ జేసియు జ్ఞానంబు • చెలఁగుచుండు

నాదియుగమునయందు ధ♦ర్మాభివృద్ధి యైనటులఁ ద్రేతయందును ♦ నతిశయిల్లు
ద్వాపరంబున వ్యాకుల ♦ త్వంబుఁ గాంచుఁ గలిని ధర్మంబు నాశంబు ♦ గాంచియుండు

— కలియుగ ధర్మములు. —

సీ॥ కలియుగంబున♦ దమః ♦ కలితాంతరంగులై జనులు మాయాసూయ ♦ లమన హింస
సాధువుల నధింత్రు♦సంతతంబు ప్రమాద సంభవంబగు రోగ ♦ సంచయంబు
క్షుద్బాధ యధికమౌ ♦ ఘోరంబయిన యనా వృష్టిభయమునుగల్గు ♦ వివిధగతుల
దేశవిపర్యయ ♦ స్థితియగు శ్రుతులు ప్ర మాణముల్ గా వధ ♦ ర్మ ప్రవృత్తి
యగు నధార్మికులయి ♦ యాచారహీనులై యనృతవాదులగుచు ♦ నల్ప తేజు
లగుచు నధిక కోపు ♦ లై సంచరింతురుపలువిధముల నీతి ♦ బాహ్యులగుచు
తే॥ వేదములు సదువరు యజ్ఞ ♦ విధులు సేయఁ దలఁపకుందురభోజ్యత♦త్పరతఁ జెలఁగి
స్వకులధర్మంబువీడుదు ♦ రు కుటిలులయి విప్రులెల్లరు కలిదోష ♦ వివశులగుచు.
సీ॥ శయనాసనాశన ♦ సంబంధములుగల్గి ద్విజులు శూద్రులఁగూడి ♦ తిరుగుచుంద్రు
జనపతుల్ శూద్ర వం ♦ శజులయి బ్రాహ్మణ ప్రవరుల బాధింత్రు ♦ పాపమనక
తలఁపగ భ్రూణ హ ♦ త్యయు వీరహత్యయు నధికమౌ ప్రజలందు♦ ననవరతము
నవనీసురులు జప ♦ స్వాచారములఁదాల్తు రగ్రజాచారంబు ♦ లవరజులకు
హితమయగును నృపతు ♦ లెల్లఁ దస్కరవృత్తి సంచరింత్రు చోర ♦ సంచయంబు
రాజులట్లనుంద్రు ♦ రహి బతివ్రతల కా యుష్యలోపమగుచు ♦ నుండుఁగలిని.
సీ॥ అల్పబుద్ధులు జను ♦ లందఱు వర్ణాశ్ర మాచారములకు ని ♦ యమమొనర్తు
రవనియు స్వల్ప ఫ ♦ లాఢ్యయై యందందు నహర్నపలమొసంగు ♦ నధిపతులును
దక్షత్వమునువీడి ♦ ద్రవ్యార్జనాసక్తి ననుచితకర్మము ♦ లాచరింత్రు
జ్ఞానులై శూద్రులు ♦ క్ష్మాదేవతలచేత నభివందితులగుచు ♦ నతిశయింత్రు
నీచకులజులెల్ల ♦ నిందింతు విప్రుల నృపతులవరజులకు ♦ విహితులగుచు
వారి చెప్పినట్లు ♦ వర్తింత్రు ధర్మంబు నడవలేక నడచుఁ ♦ బదమునొకట.
సీ॥ ద్విజు లల్పతేజులై ♦ వేదతపోయజ్ఞ మంత్రసంతతి నక్ర ♦ మంబునాక
విక్రయింతురు శూద్ర ♦ వీర్యసంభవులకు యతిసంఖ్య బహుళమౌ ♦ నలసులగుచుఁ
బురుషులు కామినీ చరణ ♦ సేవకులయి నిందింత్రు కర్మల ♦ నిందితులయి
స్త్రీసంఖ్య యధికమై ♦ చెలగు బురుషు లల్ప వీర్యులగుదురు పా ♦ పిష్ఠులగుచు
శంకరుండు ధర్మ ♦ సంస్థాపనము సేయ వికృతరూపమూని ♦ వెలయుచుండు
నమ్మహానుభావు ♦ నర్చించి కలిఁబాసి పరమపదము గాంత్రు ♦ ప్రజలు కలిని.
వ॥ శ్వాపద ప్రబలత్వంబును గోపరిక్షయంబును పాపప్రవృత్తియు సాధునివృత్తియును
చతుర్విధాశ్రమ శైథిల్యంబగుడు ధర్మస్వరూపంబు చలించుకతన పార్థివులు స్వర
ణపరాయణులగుదురు.

సీ॥ అన్నవిక్రయులు వి ♦ ద్యావిక్రయులు బుత్రికా విక్రయులు ధాత్రి ♦ ఘనతగాంచు
రంగనల్ తమ దేహ ♦ మమ్మి సొమ్ముగడింతు చిత్రగతులను వ ♦ షించుజలద
మధమ వర్ణజులు వే ♦ దాధ్యయనమొనర్చి యశ్వమేధాదుల ♦ నాచరింతు
రుత్పాదితములగు ♦ నుర్విన ధర్మపీడితములై యజ్ఞ సంతతులు కీట
కములు మూషికములు భుజం ♦ గములు నరుల కిడుములఁ గూర్చు, హత్యలె ♦ యెల్లయెడల
నెసఁగును బరస్పరంబు జ ♦ యేచ్ఛ గలిగి నరపతులు కలహింతురు ♦ ధరణినెపుడు.

చ॥ అనవరతంబు స్వీయకుశ ♦ లార్థులరై యెదిరియేనుపాయముఁ
గొని యుపకారులుఁ బలెన ♦ కుంఠితరీతిఁ బరార్థసంతతిఁ
దనియుచునుందురెల్లరు ప ♦ దంపడి పూరుషులన్యకామినీ
జనగమనంబుఁ గోరుదురు ♦ సాధుహితంబొనరింప కెంతయున్.

చ॥ సతత నికృష్టమానసు ల ♦ సత్పథగాములు సాధువంచనా
రతులు దయావిహీను లను ♦ రస్తుల శస్తులు ద్రవ్యలోభు లు
ద్ధతులు మదాతిసక్తులు కు ♦ తంత్రులు మూర్ఖులు వేదబాహ్యులై
క్షితి జనులెల్ల పాపములఁ ♦ జేయుచునుంద్రు పరస్పరంబుగన్.

క॥ కులరూప వయోగుణములు బల మాయువు కలివశంబు ♦ వలన నశించున్
గలుషంబు వృద్ధియగుఁ బాపులకె జయము గలుగు విఘ్న ♦ ములు చెలరేఁగున్.

వ॥ ఇది కలియుగచర్య. ఇందు సంఖ్యాంశంబేకపాదంబై యుండు త్రేతాయుగంబున వార్షికంబును ద్వాపరంబున మాసికంబును కలియుగంబున నాహ్నికమై ధర్మస్థితి యొప్పు. అట్లు గొంత కాలంబు జరిగినంత స్వాయంభువ మన్వంతరంబున సోమవంశంబునఁ బ్రమతి యను సంజ్ఞ భగవంతుండవతరించి దుష్టసంతానంబు శాసించి ధర్మప్రతిష్ఠ గావించు. అది కలియుగాంతసమయం బప్పుడ కృతయుగ ధర్మంబు లంకురించు. ఇంకఁ బరమేష్ఠి దేవీపుత్రుండైన విషయంబు వక్కాణింతు.

— పద్మయోని దేవీపుత్రుఁడగుట. —

తే॥ వేయియుగములు గడచిన ♦ వెనుకనజుఁడు పూర్వమట్ల సృష్టియొనర్పఁ ♦ బూనితగిన
వెరవు గలుగమిఁ జేసి య ♦ వ్విశ్వనాథు గుఱించి తపమొనరించె ని ♦ గూఢమతిని.

తే॥ అటులఁ దపముఁ జేయు ♦ నజుని లలాట మధ్యంబునుండి వెడలి ♦ యంతకారి
నాఁడెమైన యర్ధ ♦ నారీశ్వరుఁడయి చెన్నారె స్త్రీ పురుష ♦ శరీరమూని.

సీ॥ అట్లు వెడలి పర ♦ మాత్ముండు హరుఁడు ని జాంబకంబుఁ దెఱచి ♦ యజునితోడ
సర్వంబునపుడ భ ♦ స్మంబుఁ గావించి నిజార్ధ దేహయగుచు ♦ నలరుచుండు

పరమేశ్వరిని యోగ ◆ భక్తి ననుభవించి సృష్టించె హరిని విం ◆ రించినంత
కాపునఁ బరమేష్ఠి ◆ దేవీసుతుండనఁ బ్రఖ్యాతిఁగాంచె భు ◆ వనములందు
హరియుఁ దన శరీర ◆ మంత రెండుగఁజేసి యజుని సకలజగము ◆ లాత్మదేహ
మున సృజించె బ్రహ్మ ◆ యును రుద్రు సృష్టించె నాదిసృష్టి యిదియ ◆ యనఘచరిత.

వ॥ మఱియుఁ గల్పాంతంబున రుద్రుండు హరివిరించుల సృజించె. సిమ్మట మఱి యొక కల్పాంతంబున హరి బ్రహ్మను సృష్టించె. ఇట్లు హరి విరించిని విరించి హరిని సృష్టించుకొనుట సంభవించిన నప్పుడు పరమేష్ఠి యావిధంబును విచారించి పదివేలేండ్లు సమాధిస్థితుఁడై యీశ్వరు సేవించిన భవుఁడష్టరూపంబులఁ బ్రసన్నుం డయ్యె. అదిమొదలీశ్వరుఁ డష్టమూర్తి నాఁబడు. అంత నీశ్వరుప్రసాదంబున బ్రహ్మ సకల జగత్సృష్టినిగావించె. కల్పాంతంబున సహస్రయుగపర్యంతంబు చరాచర ప్రపంచంబు సుస్తింగాంచుఁడు పితామహుండు పునస్సృష్టిఁగావింపఁ దలఁచి మార్గంబుఁగానక చిరకాలంబు దుఃఖించె. అట్టి దుఃఖంబునఁ గ్రోధంబును గ్రోధపూరితనేత్రంబుల నశ్రుబిందువులును వానభూతప్రేత పిశాచంబులును నావిర్భవించిన నదిగాంచి హిరణ్యగర్భుండు క్రోధపూరితుండై ప్రాణంబుల విడచె నంత.

సీ॥ ప్రాణమయుండైన ◆ భవుఁ డర్ధనారీశ్వ రుండు బాలార్క ని ◆ భుండునగుచు
నావిర్భవించి ని ◆ జాంగ మేకాదశ విధముల విభజించి ◆ విపులశక్తి
నర్ధాంగమున శివా ◆ ఖ్యయగు నుమను సృష్టిఁ గావించె నమ్మహా ◆ దేవియుం ద
నర్ధేందుశేఖరు ◆ నాజ్ఞఁగైకొని దుర్గ వాణియు లక్ష్మియు ◆ వైష్ణవియును
వామయును మహామాయయు ◆ బలవికరణి నాఁగలిగినట్టి వారలఁ ◆ గామినులను
సృష్టియొనరించె సంతత ◆ శ్రీసహితల లోకవృత్తంబుఁగోరి ని ◆ ర్వ్యాకులమతి.

తే॥ హరుఁడు వారినడుమ ◆ నధివసించి విరించి కొసఁగెఁ బ్రాణములను ◆ బిసరుహోద
రుండు హరునిఁగాంచి ◆ దండప్రణామంబుఁ జేసి పలికె వినత ◆ శీర్షుఁడగుచు.

చ॥ హర జగదీశ యీశ గిరి ◆ జాధిప పర్వతచాప దుష్ట సం
హర శుభదానశీల ◆ కరుణాకర భూరి భుజంగభూషణా,
సురుచిరరూప శాశ్వత యశోధన ◆ దీనజనావనా పరా
త్పర కృపఁజేసి ఘోర భవ ◆ పాశములన్ దొలగించి ప్రోవుమా.

క॥ అని వినుతించినఁ బద్మజుఁ గనుగొని యొకవింత నగవుఁ ◆ గావించుచు వేఁ
జనియె నదృశ్యుండై త్రిణ యను డప్పుడజుఁడు యథేచ్ఛ ◆ నరిగెఁ గడంకన్.

క॥ కావున జగతి నయోనిజుఁ డౌ వాఁడు లభించు టరిది ◆ కమలాసనుఁడే
నా విష్ణువే నమర్త్యుండై వెలసెడు పుత్రునొసఁగ ◆ నసమర్థు లిలన్.

వ॥ నీయిష్టమగునేని యితర వరంబు లెవ్వియే నొసఁగఁ గలుగు దని పలికి పురందరుండు కనుమఱుఁగై నంత శిలాదుండు తన మనంబున.

—శిలాదుఁ డయోనిజుఁడగు పుత్రునికై విచారించుట—

తే॥ ఎల్లధర్మంబులకుఁబుట్టు ♦ నిల్లు ముద్దు కొడుకుఁబడయఁగఁగోరి కా ♦ అడవినిట్టి
తపముసేసితి సురపతి ♦ తానవచ్చి విఫలునిగఁజేసిపోయె నీ ♦ విధిని నన్ను.

చ॥ చిరము తపంబుసల్పితి శ ♦ చీపతి నాకు నయోనిజుండు నా
వరసుతు మృత్యుహీనుఁ గుల ♦ వర్ధనునిన్ దయసేయుమంచు నా
దర మొకయింత లేకయ య ♦ తండు మదీయ మనోరథంబు నె
వ్వరికిని దీర్పరాదనుచుఁ ♦ బల్కి చనెన్ గద యేమనందగున్

ఉ॥ ఎంతయొ యాసతోడఁ దపి ♦ యించి వరంబును గొమ్మటంచు న
న్నంతనె పెన్నిధిన్ గనిన ♦ యట్టి దరిద్రుఁడు వోలె నెంతయున్
సంతసమొందితి బ్లైదియొ ♦ ఛద్మముఁబూని పురందరుండు నా
స్వాంతమునన్ విచారము పొ ♦ సంగఁగఁ జేయు వెలుంగకక్కటా

క॥ ఏనుతలంచినరీతి నయోనిజుఁడును మృత్యుహీనుఁ ♦ డున్నతమతియౌ
సూనుఁడు లభింపఁడేమొ వృథానిర్జరపతి వచింపఁ ♦ దలఁచునె యిటులన్.

చ॥ తనమది మెప్పుగల్గెనఁట ♦ దాను వరంబిడవచ్చెనంట నా
మనమునఁగోరినట్టి సుతు ♦ మాన్యు నొసంగ నసాధ్యమంట య
న్యునిగొని తృప్తినొందుటయె ♦ యుత్తమమంట యిదేటి ధర్మమో
యనిమిష నేతపల్కులకు ♦ నబ్బురమున్ వగగల్గు నెంతయున్.

చ॥ తనకు నసాధ్యమే యయినఁ ♦ దామదిమిన్నక యుంటయొప్పుఁగా
కనితరసాధ్యమైన ప్రణ ♦ యంబునఁజేసి ఫలంబుగల్గదం
చని వచియించుటర్హమగు ♦ నా? శ్రిత లోకమునం దనుగ్రహం
బునఁ జరియించు వేల్పులె ♦ ప్రోవకయున్న నెవారు మంతురో.

తే॥ మృత్యుముఖమునఁబడి కుల ♦ మెల్ల గోడువడఁగఁ జేసెడి కొడుకును ♦ బడయుకన్న
ధరణి ననపత్యుఁడగుటయె ♦ దగునుగాదె స్వల్పసుఖము బహుళ కష్ట ♦ సాధనంబు.

మ॥ ధరణీభారముఁ బూననేర్చిన మరు ♦ త్స్వన్నాథుఁడే నాకు నీ
వరమీయంగ నశక్తుఁడైనఁ ♦ గుటిల వ్యాపారవంతుండెవం
డరయన్ నాయెడ సానుకంపుఁడయి నా ♦ కానందమున్ గూర్చునం
చరుచిన్ జెందఁగ నేల యియ్యెడల నా ♦ ధ్యానాయకుం డుండఁగన్.

ఉ॥ హరుఁడు సమస్తలోకముల ♦ కాశ్రయుఁ డీశుఁ డయోనిజుండు దు
ర్భవభవపాశమోచనుఁడు ♦ పాలితలోకచయుండు మృత్యుసం
హరుఁడు గుణాభిరాముఁడు మ ♦ హాత్మ్యుఁడతండు మదీయవాంఛితం
బరసి యొసంగలేఁడె హృద ♦ యంబున నాకు విచారమేటికిన్.

తే॥ శూలి మృత్యుంజయుండయోనిఁ జూడుగాన ఘనునిమృత్యుహీనునయోనిఁ జనిడ నేన్చు జీవనార్థంబయిన కర్మ జీవన ప్రదుఁడగు నాతనిఁగొల్చెద నిడకయున్నె.

క॥ నా కోర్కె ఫలింపదనుచు నా కేశుఁడు పల్కినవచ నము వృథగాకె ట్లాపుల మొందించునొ నను వీఁకఁ గనుంగొనెదనింక విపులతపమునన్.

వ॥ అని నిశ్చయించి సహస్రదివ్య వర్షములు తపముఁ గావించిన

—శివుఁడు శిలాదునకుఁ బ్రసన్నుఁడగుట—

చ॥ రజతగిరీంద్ర మందిరుఁడు రాజకళాధరుఁ డంబికామనోం
బుజదళ మధ్యవర్తి క్రతు భుక్ప్రచయార్చిత పాదపద్ముఁడా
భుజగవిభూషణుండు ముని పుంగవు ఘోరతపంబు మెచ్చి వే
గఁజనియె వాని చెంతకను కంపమనంబున విస్తరిల్లఁగన్.

వ॥ అట్లుజని

క॥ గురుతర తపమున వైశ్వానరుబోలి వెలుంగువాని నాకుపరీతున్
బరమ శిలాదుని గనుఁగొని హరుఁ డాశ్చర్యంబు నొందె నతని యునికికిన్.

సీ॥ పెనుమ్రాఁకుచెదాములు తనువు జుట్టినఁగాని చలియింపఁ డింతయు సాధ్వసమున
వజ్ర సూచీముఖ ప్రబల కీటకములు కలచుచుండినఁగాని కదలఁ డింత
రక్తమాంసములు వి రహితంబులగుటచే ముడుతలు వడిపోయె బడుగుమేను
పవన పర్ణాంబువుల్ ప్రాణధారకముగాఁ బెద్దతపంబుఁ దద్దయునికి
స్థిపంజరముంబలె నలరువాఁడు ఘోరనిష్ఠాగరిష్ఠులౌ వారలెంద
ఱని యిమ్మునిఁ బోలుదురే నిజంబు వీఁ డసాధ్యవరముఁగోరు వాఁడె నిజము.

శా॥ కైలాసంబును నేలికాచలముఁ గాఁ గాంక్షించునో వైష్ణవ
శ్రీలాలిత్యమె కోరునో త్రిదివ ల క్ష్మీవల్లభత్వంబునన్
లోలుండౌనొ విరించికిన్ బదులుగా లోకంబు సృష్టింప నీ
శీలంబూనెనో యీ శిలాదుఁడు ముని శ్రేష్ఠుండు స్వాంతంబునన్.

తే॥ ఇతని నేయుతప మ హీనంబు గావున నితని కోరువరము నేదియైన
నీయవలయుఁగూడ నెదియంచుఁ బలుకక మెప్పుగలుగునేని యొప్పుననుచు.

ఉ॥ ఈతఁడె యెల్లలోకముల కీశ్వరుఁడై సరిలేక యాశ్రిత
వ్రాతముఁ బ్రోచుచుండు భగ వానుడటంచు మదిన్ దలంచి సం
ప్రీతి మెయిన్ ననున్గుతించి భీషణమైన తపంబొనర్చు వి
ఖ్యాతున కిమ్మునీంద్రునకు నహా వరంబిడకుండు టొప్పునే.

క॥ సామాన్యమైన వరమిడ నీముని నల్లే యటంచు నేగఁడితఁడు మ
తాన్నిమిష్యమొ సాయుజ్యమొ యేమో నుదిఁగోరి నేయు నిట్టి తపంబున్.

॥ ఎవ్వఁడ యేని భక్తిమెయి • నిచ్చనునీ భజియించుచుండు వాఁ
డవ్వనజాసనాది సుర • లందఱకన్నను నాకు ముఖ్యుఁడౌ
నవ్విమలాత్ముఁ గన్గొనిన • హర్షణ పరీతుఁడనై చరింతు వాఁ
డెవ్విధిఁ గోరినన్ వరము • లిచ్చుచు మెచ్చుచు సంతతంబిలన్.

॥ తనకు మహాభయంకర ని • దాఘ దినంబుల నగ్నిపంచకం
బునదుమఁ జేసి యిట్టితప • ముం బొనరించినఁ గాక వేఱు రీ
తిని వరమీయనంచును మ • దిన్ దలపోసెనో యేమొ యిమ్మహా
ముని యది కాదయేని యొక • పూరుషుఁ డిట్టి తపంబుసేయునే.

॥ ఇమ్మని నాథుఁడు కోరఁ వరమ్మొసఁగఁక యుందునేని • రాణించునె లో
కమ్మున నాశ్రితశరణ త్వమ్ము సురలు మెత్తురే ప • దంపడి నన్నున్.

॥ అని యించుక తలఁచుచు నెమ్మనమునఁ జంద్రార్ధధరుఁడు • మహనీయకృపా
జనితశిరఃకంపనుఁడై మునిపర్యుని డాయవచ్చి • ముదముపొసంగన్.

॥ వినమన్నిర్జరవాలిభాగ విలస • ద్విఖ్యాత నానామణీ
జనితాంశుప్రకరాను రంజితము వి • శ్వత్రాణ దక్షంబు స
జ్జనలోకాభయదాన కౌశల కళా • స్ఫారంబు గౌరీభుజా
గ్రసటన్మూర్తి నిజోరుసవ్యకరమున్ • గారుణ్యమేపారఁగన్.

॥ నిరశనవ్రతక్లిష్టాప • నీతసత్వమై కృశించెడి మునినాథు • నల్పదేహ
భాగమునఁజేర్చి నిమురుచుఁ•బార్వతీశుఁ డల్లనన్ నిలుచుండెన•య్యవసరమున.

॥ అమరనదీతరంగనిచ • యాంబుకణస్థితి శీతలంబునై
యమృతమయూఖపరికర • మట్టుల సత్వముఁ గూర్చునట్టిదై
యమలినచంద్రికాపముద • యంబటులన్ హృదయాభిరామమై
క్రమమున జీర్ణదేహమునఁ • గ్రమ్మిన యామృ మలంపు స్పర్శచే.

॥ అరయనవాఙ్మానస గోచరమగు నొక వింత సంత • సము నెమ్మది ము
ప్పిరిఁగొనఁగ మానికులపతి సరఁగున నేత్రముల. దెఱచి • శంకరుఁ గనియెన్.

॥ అట్లు గని తటాలున లేచి శరీరం బవిజ్ఞాత హేతుకంబైన రోమహర్షణంబున విరా
జిల్లుచుండ ముకుళిత కరకములుడై శిలాదుండు.

॥ వందనముం గొనంగదవె • వారిజసంభవ ముఖ్యదేవతా
వందిత పాదపంకరుహ • బాధిత శాత్రవలోక నిర్మలా
నందవికార ధీర కరు • ణానిధి చంద్రకళావతంస యిం
దిందిరనీలకంఠ భవ • దీనజనావన సర్వపోషకా.

గంగాతరంగ సం • కలితోత్తమాంగ పాప విభంగనీకిదె • ప్రణుతి గొనుము
దాక్షాయణీమన • స్తాప నివారణ కారణ యిదియె జో • హారు గొనుము

బందీకృతా రాతి ♦ సందోహ శరదిందు సుందర నీకిదె ♦ స్తుతినిగొనుము
నిర్మితాఖిలలోక ♦ భర్మభూధర చాప సురదీప నీకిదె ♦ శరణుగొనుము.
మామకతపః ప్రహృష్టని ♦ ర్మల హృదబ్జ నా యొనర్చెడి నిదియె ధ్యానంబు ♦ గొనుము
స్ఫాటిత కృతాంతవక్షః క ♦ వాట యిదియె గైకొనుము నతి సేయుదుఁ ♦ గరముమోడ్చి.
చ॥ నతజనతా శరణ్య గిరి ♦ నాధసుతాహృదయేశ తావకా
ద్భుత మహిమంబెఱుంగ నొక ♦ భూసుర మాత్రుఁడు శక్తుఁడౌనె య
ప్రతి హత తేజులైన మఘ ♦ వత్ప్రభృతుల్ సురపాలురేని సం
తత భవదీయ మాయఁబడి తద్దయుఁ జింతిలుచుండ నెంతయున్.
క॥ నీ దివ్యదర్శనం బామోదప్రదమయ్యె నిపుడు ♦ పురహరజననం
బాదిగనాసేయు నకృత్యాదికము నశించె నేఁ గృ ♦ తార్థుఁడనైతిన్.
క॥ అని వినుతించెడు తపసిన్ గని కనికర మొలయ నీల ♦ కంఠుండను నో
మునినాధ నీ తపంబునకును భక్తికిని వినయమున ♦ కును మెచ్చితెదన్.
ఉ॥ ఎందఱొ మౌనివర్యులు సు ♦ రేంద్రులు దైత్యులుదక్కనట్టి వా
రండఱుఁ బెక్కు భంగుల ద ♦ యామయు నన్ను గుఱించి యెప్పుడ
స్పంద మనస్కులై ఘనత ♦ పంబులొనర్పరె వార లెవ్వరీ
చందము నామనంబునకు ♦ సంతసమున్ బొనఁగూర్పఁజాలిరే.]
చ॥ అనితరభక్తియుక్తుఁడయి ♦ యర్థిమెయిన్ ననుఁగొల్చు నెవ్వఁ డా
తనికి ననన్యదుర్లభ ప ♦ దంబు నొసంగి బహూకరింతు భ
క్తనికరమందు వైరమును ♦ గాంచిన దుర్మతి నెట్టివానినై
నను గరుణింప కింతయును ♦ నాశము సేయుదు నొక్కపట్టునన్.
క॥ ఏవరమువలతువిప్పుడు పావకనిభతేజ నీ తపంబును మదిసం
భావించితి ష్మావిభుతయొ దేవత్వము కోరుమిపు డ ♦ దీనత్వమునన్.
తే॥ ఉద్దిలేక యిట్టి ♦ పెద్దతపము సేసి యలసితీవు వరము ♦ నందియింక
సౌఖ్యజీవనంబు ♦ సలుపుము భక్తుల పొందు సుఖమె నన్నుఁ ♦ బొందియుండు.
చ॥ అనుటయు మౌనిరాజు హృద ♦ యంబు నయంబున కుక్కపట్టు గాఁ
దనువున యందుఁ బుల్కలు ప ♦ దంబు వహింపఁగ భద్ర బాష్పముల్
కనుఁగవనుండి జారి చుబు ♦ కంబున ముత్తెఁపుఁ బూసలున్ బలెన్
దనరఁగ హర్షగద్గదిక ♦ దానవ సంహరుఁ గాంచి యిట్లనున్.
ఉ॥ ఈవు మహానుభావుఁడవు ♦ మేశ్వర తక్కన వేల్పు లట్ల యే
దో వచియించి పిమ్మట నె ♦ దోకొనుమంచును భక్తసంతతిన్
బ్రోవక శుష్కవాక్యములఁ బ్రోచినయట్లు నటింప వింతయున్
గావున దావకాశ్రయముఁ ♦ గాంచఁదలంచితి భక్తి మించితిన్.

తే॥ ఎల్లవేల్పులుండ • నీశ్వరుండవు నీవ ప్రోవఁగలుగుదనుచుఁ బూని కాంతతోడ
నీ పదములె మదిని నిల్పి తపించితిఁ గనికరంబు నీకుఁ గలుగకున్నె.

ఉ॥ సత్యచరిత్రుఁడై నిఖిల • సూరిజనార్చిత పాదపద్ముఁడై
సత్యవచోరతుండయి ప్ర • శస్తయశుండు నయోనిజుండునై
నిత్య సమస్త సంపదల • నీవలె భాసిలువానిఁ బుత్రునిన్
మృత్యువిహీను నాకొసఁగు • మీ హిమశైలసుతామనోహరా.

తే॥ నీకుఁ గృపగల్గునేని యీ • లోకమందు సాధ్యమగు కార్యమున్నె నీ • చరణయుగము
నాశ్రయించియె కాదె యం • బ్జాసనాది సురలు నిరతసుఖంబులఁ • బరఁగుచుండ్రు.

వ॥ అనిన హరుం డిట్లనియె.

చ॥ మునివరయిట్లు ఘోర తప • మున్ బొనరించుటఁ జేసి నీకుఁ గో
రినటు లయోనిజుండయిన • మృత్యువిహీనుని పుత్రునిచ్చుటే
చనునటులయ్యు నెవ్వరికి ? సాధ్యము గాని వరంబు వేడితే
మని ప్రతిసెప్పఁగావలయు • నయ్య శ్రమంబుననున్న నీకిఁకన్.

తే॥ ఏఁ దక్క నొక్కఁ • డేవాఁడయేని యయోనిజుండు మృత్యు • హీనుఁడైన
వాఁడు కలుగఁడెందు • వారింపరాని నీ యాసఁదీర్చు టెట్టు • లహర్హమగునొ.

వ॥ అయినను నీవాంఛితంబుఁ దీర్చుట నాకు ముఖ్యంబుగావున నిటువిను.

— బ్రహ్మదేవుఁడు శివునితోఁ బ్రపంచస్థితిని జెప్పుట —

మ॥ ఒకనాఁడేనును గట్టురాసుతయు నే • దో స్వైర సంభాషణం
బకలంకస్థితి సల్పుచున్ సురనదీ • ప్రాంతప్రదేశంబులన్
సుకుమారంబగు మందమారుతము పై • సోఁకంగ నెంతేని ద
ర్పక శాస్త్రాధ్యయనంబుఁ జేయుచును భ • ద్రమున్ స్ఫూర్తితోనుండగన్.

తే॥ అప్సరోగణంబు • లరుణపల్లవకోటి నధిగమించు కరత • లాంబుజముల
నిరతిఁ జేసి మాకు • నీవాళులొసఁగెడి సంతసంబుఁ గూర్చు • సమయమందు

చ॥ అంచహుమాయిరొత్తు పద • నాబ్జములన్ నిగమోత్కరంబు రా
ణించఁగఁ జేయువాఁడు కమ • నీయగుణాకరయై విపంచి వా
యించు లతాంగితోఁ గలిసి • యెల్లసుఖంబులఁ జెందువాఁడు స్ప
ష్టించెడి నేర్పువాఁ డజుఁడు • చెచ్చెర మాకడఁ జేరి యిట్లనున్.

ఉ॥ నీవు కృపామయుండవు మ • నిప్రకరార్చిత నీకతంబ యీ
స్థావర జంగమంబయిన • జంతుచయంబు జనించు నీవ కా
దే వెలయంగఁ జేయుదువు • మేశ్వర సత్వముఁ బూని తామస
ప్రావృతమూర్తివై జగము • నంత మొనర్తువు నిశ్చలాకృతిన్.

క॥ నీ కెఱుఁగరాని విషయం బీ కృతముఖయుగములందు • నేయెడఁగలుగన్
లోకేశ్వర తావక మాయాకలితములగును గాదె • యరయ జగంబుల్.

చ॥ కనికరమున్ వహించిన జ • గంబు గముల్ సుఖజీవనంబు గై
కొని చరియించు నిచ్చలును • కోపమునన్ గనుమూయుదేని ప్రా
ణి నికరమెల్ల నాశమగు • నీమది కెవ్విధిఁ దోఁచనట్లుగా
కొనరునె యొండు రీతిగ గు • ణోన్నత యీ సకలంబు చూడఁగన్.

చ॥ శరనిధి తూణమై నిగమ • సంచయముల్ తురగంబులై ధరా
ధరము శరాసనంబయి సు • ధా కిరణార్కులు బండి గండ్లునై
ధరణి శతాంగమై యలరఁ • దామరసాక్షుఁడు మార్గణంబుగా
నిరతిఁ జరించు యోధుఁడవు • నీవు పురాంతక భక్తవత్సలా.

మ॥ కలుషాంభోనిధి మగ్నులై దరిఁ గనం • గాలేక కామాది శ
త్రులకున్ లోఁబడి యింద్రియాశ్వచయ మెంతో బల్మి నీడ్వంగఁ జం
చలతన్ ద్రిమ్మరు లోకసంతతులఁ బ్రాం • చత్ప్రేమ రక్షింపఁగా
నిల నీవంటి కృపార్ద్రచిత్తుఁడు కలం • డే యొక్కరుం డేయెడన్.

చ॥ జలధి తరంగసంచయము • చాడ్పున నెంతయు గ్రొత్త క్రొత్తలై
పలుగతులన్ జెలంగెడి ప్ర • పంచపరిస్థితు లంతకంతకున్
దలఁప నసహ్యమయ్యెడు వృ • థాయిఁకఁ గాలము బుచ్చనేటికో
వలఁతి యనుగ్రహించి యప • వర్గము గల్గెడి దారి సేయుమా.

తే॥ ఎందుఁ గనుఁగొన్నఁ గలుషమే • యెసఁగుఁగాని సుకృతమనుమాట కనఁబడ • దకట జగ
ధర్మముకోఅంతవడియె న • ధర్మమునకు లొంగి చరియింతు రెల్ల ర • సంగదమన.

తే॥ జగము దుష్టమయ్యె • జననాయకులు దుష్టులైరి దుష్ప్రవర్తన • నాభిరతిని
ప్రజలు సంచరింపఁ • బ్రభువులు మిన్నక చూచుచుండి రిపుడు • శూలపాణి.

శా॥ యుక్తాయుక్తములన్ గణింపరు సదు • ద్యోగంబు వాంఛింప రా
సక్తిన్ వీడ రసద్ధనంబు నెడ దు • స్సాంగత్యమున్ మెత్తు ర
వ్యక్తుల్ దుష్టులునై చరింతురు ఘనా • హంకారులై మానవుల్
భక్తిన్ జూపరు వేల్పులందుఁ గుటిల • వ్యాపార పారీణులై.

తే॥ ఎట్టి నీచకార్య • మే యొనర్పంగ ముం దంజవేయుదురు ధ • నార్థులగుచుఁ
బౌరుషంబు వీడి • ప్రత్యహ మధముల సేవఁ జేయుచుండ్రు • చెనఁటులగుచు.

చ॥ ధనము గలాఁడ మాయకుఁ డు • దారుఁ డొకం డెవఁ డేని గల్గినన్
బనివడి వానిఁ జేరి పలు • వంచనలన్ బచరించి భీతినో
వినయముఁ బూనియో యతని • విత్తము నెల్ల హరింపఁ జూతురే.
పునఁ గుటిలాత్ములై నరులు • భూధరచాప యిఁకేమనన్ దగున్.

ఉ॥ భ్రాంతిని వీడలేక క్షణ ♦ భంగురమైన యాసచ్ఛరీర మ
శ్రాంతము నిల్పునంచుఁ గలు ♦ షంబనినన్ భయమింత వీడి వే
దాంతులమంచుఁ గోవిదుల ♦ మంచు నటించుచు వింతవారి న
త్యంతము మోసగించు దురి ♦ తాత్ములరైరి మనుష్యు లెంతయున్.

చ॥ అతిథులు ద్వారదేశమున ♦ నాకొని రోదనముం బొనర్ప దు
ర్మతులయి యారగించుచుఁ గ ♦ రంబు ముదంబును జెందువారలున్
హితులవలెన్ జరించి తుద ♦ కెద్దియొ సల్పి ధనంబుఁ గైకొనన్
మతిఁదలఁపోయువారును ను ♦ మాధవ పెల్లు చెలంగి రుర్వరన్.

సీ॥ దేవాలయములఁ బ్ర ♦ తిష్ఠంతుమని వ్యాజమూని చరించెడి ♦ హీనమతులు
నతిథిసంతర్పణం ♦ బరుదెంచుఁడని పల్కి – పరిభవింపఁగఁ జూచు పాలసులును
కులగోత్ర భేదంబుఁ ♦ దలఁప నేమిటికైక ♦ మత్యంబుఁ గనుఁడను ♦ మత్తచిత్తు
లనుచితకార్యంబె ♦ యైన నేమగులాభమగునేని చేయుదు ♦ మనెడు ఖలులు
గౌరవను గల్గుననియెడి ♦ కాంక్షఁ జేసి యనుచితాహార పానంబు ♦ లర్థిఁ గొనెడి
కలుషవర్తనులును బుణ్య ♦ కార్యవిముఖులవని నెల్లెడఁ జెలరేగి – రయ్యగిరిశ.

మ॥ ధనగర్వంబునఁ గన్ను గానక ♦ యవిద్యాబద్ధులై సాధువం
చనమున్ జేయుచు నాత్మగౌరవమునన్ ♦ సర్వంబు హీనంబుఁ గాఁ
గనుచున్ లోకము పాడిఁవీడి తిరుగం ♦ గా గోయ దుర్బుద్ధులౌ
మనుజుల్ ధర్మనియంతలైరి పెలుచన్ ♦ క్ష్మాభారముల్ గూర్చుచున్.

తే॥ తలఁప వర్ణాశ్రమాచార ♦ ములు నశించెఁ బైతృక క్రియలెల్ల స్వ ♦ ల్పంబులయ్యె
వాయువరుసలుఁ దప్పెఁ బా ♦ పంబు బలిసె దేవతారాధనంబులుఁ ♦ డీసిపోయె.

సీ॥ అగ్నిసాక్షిగఁ బెండ్లి ♦ యైన కామినులుండఁ బరసతులన్ గోరు ♦ విరసులకును
దమ విత్తమెల్లవ్య ♦ ర్థముగ పాడైపోవ నిత్యగార్థము హరించు ♦ హీనులకును
మోమోటమునఁ జేసి ♦ నేమంబు విడనాడి పాపంబులొనరించు ♦ పందలకును
నాలుబిడ్డలకునై ♦ యనుచితకార్యంబు లాచరించుచునుండు ♦ నధములకును
వెలఁదికై తల్లిదండ్రుల ♦ వేలుపుచ్చి వారిమరణంబుఁ గోరు న ♦ వాచ్యులకును
గోవధము సేయఁదలఁచెడి ♦ క్రూరులకును గౌరవము గల్గుచుండు నీ ♦ కాలమహిమ.

చ॥ పితృదివసంబులందును వి ♦ వేక మొకించుకయైన లేక లం
జైత యిడుతమ్ములంబుగొని ♦ స్వేచ్ఛఁజరించెడి పాపకారియే
స్తుతమతియై చెలంగు విబు ♦ ధుండొకఁ డుండునయేని వానికిన్
గతిగనరాదొకింతయును ♦ గారవమున్ బొనరింప రెవ్వరున్.

మ॥ సరివారల్ తన దాతృతామహిమమున్ ♦ శ్లాఘింతు రంచాసతో
ధరణీదేవత లెద్దికోరినను వా ♦ ద్దానంబుఁ గావించి క్ర

మ్మర శుష్కప్రియముల్ వచించుచును స • మ్మానంబు సేయంగ లే
కరుచిన్ గూర్చెడివాఁడె యుత్తమగుణుం • డై యొప్పు నిద్ధారుణిన్.

సీ|| మర్యాదఁ దలఁపక • మధుపాన మొనరించి పడఁతుల బల్మిఁబ • ట్టెడు ఖలులకు
గపటవేషముఁ దాల్చి • కనుచుండఁగనె దారిఁగొట్టి రొక్కములాగు • కూళలకును
సత్యంబుఁ జెప్పక • సభలందు సాధుల కవమాన మొనరించు • సాక్షులకును
ధనలోభమునఁజేసి • తనవారినైనను విడనాడి కడనుండు • దుడుకులకును
న్యాయపథములఁజేరి య • ధార్థవాదులమని చెప్పుకొనుచు దు • ర్నయము గడించు
దుండగీడులకును లొంగి • దోసమునకు వారికడ నిల్చుఁగలుముల • పడఁతి యిపుడు.

వ|| మఱియు జాతిభేదంబుఁ బాటింపక నీతిబాహ్యులై యవసరంబగుపట్ల దురన్నం
భుజించువారును ద్యూతంబు మరగి కొంపలార్చుకొనువారును మద్యపాన వ్యసన
బునఁ బైతృకంబగు ధనంబు సర్వంబును, గొల్లవెట్టి దారపుత్రులఁ బోషింపలే
సన్యసించువారును, మాంసాశనులై మత్తిలి చిత్తవృత్తిఁ జరించువారును, భ్రూ
హత్యాది పాపంబులఁ జేయువారును, సులభక్రోధులై యాయయి హత్యల
గావించి నేరంబుఁ బాపుకొన నవధూతలట్లు పరిభ్రమించువారును, దేవబ్రాహ్మ
భక్తివిరహితులై యాత్మగౌరవంబు, గోరువారును, ననుచితాచారులును, జై
చార్వాకాది హీనమత ప్రవిష్టులును, శివనిందాపరులును, స్వమత దూషకులునై
యసన్మార్గంబునకు భీతిలక నరపాలకులకు లొంగక కీర్తిప్రతిష్ఠలఁ గోరక ప్రజలె
నిరాటంకముగఁ జరియింపసాగిరిదియుంగాక

క|| మగలకు వెలివరు పరులకు నగుదురు పల్లవులఁ గాంచి • నన్ మోదమునన్
సొగసులఁ జేయుచునుందురు మగువ లపత్రపలు నిరభి • మానవతులునై.

చ|| పతి యతిలోక పౌరుష వి • భాసితుఁడైనను నిర్జితారిగా
ట్టితి యయినన్ సురూపజిత • దర్పకుఁడైనను యోగ్యయౌవనో
ద్ధతుఁడయినన్ గణింపక • వితండము సేయుచు సిగ్గుమాలి స
ద్గతిఁగన కింతయేని కుల • కాంతలు త్రిమ్మరుచుండి రెల్లెడన్.

తే|| పుట్టునింటివారు • పెట్టకయుండినఁ బెట్టిరనుచు వారిఁ • బెద్దఁజేసి
రమణు నం దనాద • రముఁ జూపుదురు సతీత్వంబు వీడి గౌర • వంబులేక.

మ|| అనురక్తుండగునేని భర్తయెడ ల • క్ష్యంబింతయున్ లేక మ
న్ననసేయంగఁ దలంప రెప్పుడు నితాం • తం బాదరం బూనకుం
డిన దుర్మార్గుఁడటంచు మూరుదురు సం • దేహింపరే కార్యముం
బొనరింపంగ లతాంగు లెల్లరు మహా • భూతంబులై ధారుణిన్.

సీ|| పతిమాట కెదురాడు • పనిబూనుటయెగాని పనిఁబూనఁదలఁపరు • భవనమందు
నాకొన్నవారిపై నాగ్రహించుటెగాని వేఁగహింప రిఁకంగఁ • బిడికెడేని

యాయాయిననగలఁ గైసేయఁగోరుదురెగాని కోరరు పూజింప • గౌరినింత
తనవారి కర్ఘ్యపా • ద్యంబు లిచ్చుదురెగాని యభ్యాగతులకీయ • రమలమతిని,
పలుకరించినయంతఁ బా • పంబు నాక పైఁబడి వధింపఁజూతురు • పతులనైన
కటకటా ధాత్రి గయ్యాళి • గంపలగుచుఁ గాంతలెల్లరు రాక్షసాం • గనలు వోలె.

మ॥ పతి యుచ్ఛిష్టము నారగించుట యసం • భావ్యంబుగా నెంచుచున్
బతికే యెంగిలిఁ బెట్టఁజూతురు స్వభా • వం బైన చాంచల్యపుం
గతికిన్ లోఁబడి స్థైర్యమున్ గనక • యేకాంత ప్రసంగంబులే
నితరుల్ గోరినఁ జెప్పుచుంద్రు మదిలో • హేయంబు నాకింతయున్.

తే॥ మగలఁ గాంచి భీతి • ల్లఁగ నేల వారి కాధిక్య మొసఁగుటేల • హీనవృత్తి
నడుగడుగున మడుగు • లిడనేలయని చెప్పుకొనుచుందు రెపుడు • వనితలవని.

చ॥ హరిహర భక్తిశూన్యమయి • నాస్తికవాదము మించె నింతయేఁ
గరుణయుఁ బాప భీతి యును • గానము సాధుసఖ్యయున్ గరం
బరుదయిపోయె ధర్మ మదు • గంటె నధర్మము మిన్నుముట్టె నీ
శ్వర యిఁక నేమి చెప్పుదుఁ బ్ర • పంచమునన్ విలయంబు గల్గునే.

—బ్రహ్మదేవుఁ డీశ్వరుని ప్రపంచమున ధర్మరక్షకై యవతరింపుమని ప్రార్థించుట—

తే॥ ఇంతకున్ ముఖ్యకారణ • మిద్ధతేజుఁడైనవాఁ డొక్కరుండు ప్ర • జ్ఞాన్వితుండు
ధర నవతరించి యాశ్రమ • ధర్మములనుఁ బ్రజకు బోధింపకుంటయె • పరమపురుష.

తే॥ ధర్మహానియై య • ధర్మంబు మించు కాలమున నీవు ప్రతియు • గమున నెట్లొ
యవతరించి ధాత్రి • న స్మా ధర్మస్థాపనంబుఁ జేయుదువు ము • దంబుతోడ.

ఉ॥ ఈవు నరావతారములగు • నెల్లజగంబుల కీశ్వరుండవౌ
దేవుఁడవుద్ధతారిజయ • దీక్ష వహించి చరించువాఁడవున్
గావున నీవ యిప్పు డను • కంపవహించి జగత్త్రయంబులన్
బ్రోవఁదగున్ మహేశ • సురపూజిత పాదపయోజ బంధురా.

చ॥ అనఘ చరిత్ర నీవ యిపు • డక్కటికంబు వహింపవేని లో
కనికర మెల్ల నాశమగుఁ • గాచెడు శక్తి కలాఁడెవండు నీ
కనికరమింత యుండుటను • గాదె జగంబుల సృష్టిఁ జేయుచుం
దును జలజాయతాక్షుఁడు కు • తూహలమున్ ఘటియించు నెంతయున్.

క॥ గౌరీనాయక యొకయవతారంబు ధరించి భువన • తతిఁ బ్రోవుము దు
ర్వారంబైన యధర్మము వారింపుము ధర్మమెల్ల • వఱలెడు నటులన్.

తే॥ అనుదినంబుఁ గృశించెడి • నట్టి శైవ కల్పభూమీరుహంబు న • నల్పమైన
కరుణ యను సుధ వర్షించి • క్రమకుసుమ ఫలభరితముగఁ జేయుమో • పార్వతీశ.

మ॥ అని ప్రార్థించినఁ బంకజోదరుని కు ♦ య్యాలించి శ్వానచక్రమున్
మనఁజేయుంగఁ దలంపుఁజెందితిపుడో ♦ మానీంద్ర నీ విప్విధం
బున మృత్యుంజయుఁడై యయోనిజుఁడునౌ ♦ పుత్రున్ మదీన్ గోరి త
ప్పనికై నీకు సుతుండ నయ్యెదను సం ♦ భావింతు నీ వంశమున్.

తే॥ నంది యను నామమూని య ♦ నంతకల్పములు నినున్ బిలఁగా నెంతు ♦ మునులలోన
నీవ పేర్గొన్నవాఁడవై ♦ నెగడుదింక సంతసంబున నరుగు మో ♦ సంయమీంద్ర.

క॥ అని కోరిన వనము నొసఁగి కనుమఱిఁగె శశాంకమౌళి ♦ గాథశపోని
ష్ఠ నెసఁగు మజ్జనుండా ఘనుఁడు మది సంతోషకారు ♦ క పరీతుండై.

చ॥ కృతినయితిన్ విశిష్టజన ♦ కీర్తితమయ్యెను వంగడంబున
ద్గతి బడనున్న మత్పితృ పి ♦ తామహు లెల్లరు నూర్ధ్వలోక సం
గతి ముదమున్ వహించిరి య ♦ ఖండ సుఖానుభవంబుఁ జెంది యు
న్నతమతులైరి బాంధవులు ♦ నాకు శివుండె సుతుండుగావుటన్.

తే॥ నాయొనర్చిన తప మ ♦ నంతఫలదమయి సంతతానందమును గూర్చె సాధులోక
కీర్తితంబై పొసంగె మ ♦ త్కీర్తి చయము మాదృశులుగలరే మహీ ♦ మండలమున.

మ॥ అని సంతోషపరంపరాంబుధి తరం ♦ గాగ్రంబులన్ దోఁగుచున్
ఘనుఁడమ్మౌనివరుం డనుత్తమ భవ ♦ త్కాంక్షా ప్రవాహంబు న
ల్లనవారించుచు నిశ్చలాత్ముఁడయి సా ♦ లంకాయనాఖ్యాకుఁడౌ
మునివంశంబు పవిత్రమయ్యెనని సం ♦ పూర్ణాత్ముఁడై మెల్లనన్.

వ॥ అగ్నిహోత్రంబుఁ గావించువాఁడై యజ్ఞాంగణంబు దాయన్ జని యప్పవిత్ర దేశంబున.

—నందికేశ్వర ప్రాదుర్భావము—

చ॥ ప్రళయదివాకరాభ సుర ♦ వందిత పాదసరోజు వజ్ర కుం
డల విచల చ్ఛవిద్యుతిద్వయు జ ♦ టామకుటాంచితు వజ్రహస్తు ని
ర్మలజలదోప మస్వను న ♦ మానుష దేహుఁ జతుర్భుజున్ గదా
కలితుఁ ద్రినేత్రుఁ బాలునను ♦ గన్గొనియెన్ మునినాథుఁ డచ్చటన్.

సీ॥ పుష్కలావర్తకం ♦ బులు మేఘములు పుష్పవర్షంబుఁ గురిసె న ♦ వారితముగ
నప్సరోనృత్యంబు ♦ లంతట విలసిల్లె నమరగాయకుల గా ♦ నములు వెలసె
బ్రహ్మాది నిర్జరుల్ ♦ ప్రస్తుతిఁ జేసిరి సురదుందుభులు మ్రోసె ♦ సురుచిరముగ
సకలదిక్కులఁ బుట్టె ♦ జయజయ ధ్వనులు తెమ్మెరలు వీచెను మృదు ♦ పరిమళముల
బుగ్యజుస్సామ సంభవా ♦ హీన మంత్రతతుల గానంబుఁ గావించి ♦ హితమతులయి
మ్రొక్కిరెల్ల బుషులు భక్తి ♦ పూరితులయి యేను మునితనూజత్వంబుఁ ♦ బూనినపుడు.

చ॥ హరిహరపద్మగర్భులు బ ♦ లారియు నాంగిరసుండుఁ జంద్ర భా
స్కరు లనిలాగ్నులున్ ధనద ♦ కంబుధినేతలు గాత్మసేశులున్
వరుసఁ దదీయ భార్యలును ♦ వారని ప్రేమవహించి యొక్క రొ
క్కరుగను ముద్దుబెట్టుకొని ♦ కౌఁగిటఁ జేర్చి నుతించి రెంతయున్.
చ॥ లలిత తపోభిరాముఁడు శి ♦ లాద మునీంద్రుఁడు హస్తపల్లవం
బులనను నెత్తి ముద్దుఁగొని ♦ పూతచరిత్రుఁడ నైతినంచు లోఁ
దలఁచుచుఁ బొంగుచున్ బలు వి ♦ ధంబుల నృత్యము సేయుచున్ సనున్
గిలకిల నవ్వువానిఁగని ♦ కీర్తనఁ జేసె మనోహరంబుగన్.

—శిలాదుఁడు నందీశ్వరుని గొనియాడుట—

తే॥ ముగురు వేలుపులకు ♦ మూలమైన ఘనుండ వెల్లలోకములకు ♦ నీశ్వరుండ
వాదిపూరుషుండ ♦ వస్మదన్వయ వృద్ధి కారకుండ వీవు ♦ గాదె దేవ.
ఉ॥ లోకహితంబుఁ గోరి బుధ ♦ లోకము సన్నుతిఁ జేయ నివ్విధిన్
నాకు సుతుండ వైతివె పి ♦ నాకి మనోహరహస్త పద్మ ప
ద్మాకమనార్చితాంఘ్రియుగ ♦ మామక భక్తికి సంతసించితే
వ్యాకులచిత్తుఁడైన యొక ♦ పామరునిన్ గృపఁ గావ నెంచితే.
చ॥ జనకుఁడ నీవ యీ సకల ♦ జంతుచయంబున కెల్లలోకముల్
జననము నొందు నీయెడల ♦ సర్వము నీ కృపఁ గోరుచుండుఁ బా
వనము సు నీ సుతత్వమునఁ ♦ బ్రాక్తన కల్మషమున్ దొలంగి నే
ననఘుఁడ నైతిఁ గాదె ని ♦ ఖిలామరపోషక మామకాత్మజా
చ॥ చిర మనపత్యదోషమున ♦ సేగిని జెంది కృశించు నాకు ని
క్కరణి సుతుండవై కులము ♦ గౌరవమున్ నిలఁ బెట్టినావు దు
స్తరభవ సాగరంబు నిఁక ♦ దాఁటుట శక్యము గాక యుండు నే
పరమపవిత్ర నీ చరణ ♦ పంకజముల్ మది నమ్మియుండుటన్.
వ॥ అని సురలన్ గాంచి యిట్లనియె.
తే॥ కాంచితిరె మీరు మద్భాగ్య ♦ కలన లోకజనకుఁడగు నవ్యయుండె మ ♦ త్తనయుఁడగుచు
నాకు జనకత్వ మొసఁగె లో ♦ కైక నాయకునకు నే జనకుండనై ♦ కొక్కఁగంటి.
వ॥ అని పలికిన బ్రహ్మాదులు శిలాదున్ గాంచి యిట్లనిరి.
చ॥ అనఘుఁడ వైతి వీవు భవ ♦ దన్వయ మెల్లఁ బవిత్రమయ్యె సా
ధునికర సేవితుండయిన ♦ ధూర్జటి తావక పుత్రుఁడౌటనో
మునివర దుర్లభంబయిన ♦ ముక్తి వధూపరిరంభణ క్రియా
జనిత సుఖం బిలన్ సులభ ♦ సాధ్యమె యయ్యెను నీకుఁ జూడఁగన్.

క॥ ఆనందమయుండగు భగవానుఁడు నీకులమునందుఁ బ్రభవించియు బ్ర
హ్మానందముఁగూర్చు కలన వీనికి నంది యను పేరు • వెలయు జగములన్.
చ॥ అని వచియించు వేలుపుల • కందఱకున్ వినయంబుతోడ వం
దన మొనరించి సంతసము • నన్ ననుఁ గైకొనిపోయె నప్డు న
జ్జనకుఁడు సాధుకీర్తి తల • సచ్చరితుండు తపోవశీకృతా
త్రి నిలయుఁ డుత్తముండు పరి • తృప్తుఁడు పావన పర్ణశాలకున్.
వ॥ అట్లు మజ్జనకుండు నన్ను బర్ణశాలఁ గొనిపోయి నంత.

—నందికేశ్వర జాత కర్మాదికరణము—

సీ॥ అతుల బాహుచతుష్క • యమదృశ్యంబయ్యెఁ గనఁబడియెను చిన్ని • కరయుగంబు
నొసటి మిక్కిలి కన్ను • వెసమాయమై పోయె నయనయుగంబె విం • తగఁ జెలంగె
జడనున్న శశిరేఖ • జాడయెఱుఁగరాదు కలుషగళమౌ వెంట్రుకల్ • మెఱుఁగువాఁడె
నేలగ నాటంక • శూలముల్ పాఱగట్ట వరుణిమయేదృశ్య • మై రహించె
వజ్రకుండలములు లేవు • పాపతొడవు లింతయునుఁ గానఁబడవు కా • సంతయేని
తెలివిగనరాదు దైవిక • దేహమెల్ల నపహృతంబయ్యె మనుజుండ • నైతినపుడు.
తే॥ పామరుండు వోలెఁ, బ్రాకృతజ్ఞానం బొకింతయైన లేక • యెల్లవార
లబ్బురంబుఁ జెంద • నా సమయమున మాయావృతుండ నైతి • ననఘ యేను.
ఉ॥ ఆగతియోనిజుండు వలె • నాకొనియేడ్చెడి నన్నుఁ గాంచి స
ద్యాగమవేత్త మజ్జనకుఁ • డబ్బురమున్ వగపొంది యక్కటా
భోగివిభూషణుం డిట్టులఁ • బూనిక నన్నుఁ బరీక్ష సేయునే
యాగజచర్మ నేలునకు • న్యాయమె నాయెడ నిట్లు సేయఁగన్.
చ॥ కరములు నాల్గులేవు తిగ • కన్నులు గానఁగరావు స్వర్ణ దీ
పవిత్రమయ్యె నేముకుట • భాగముఁ గానము చంద్రమః కలా
భరణము నీ కుమారుఁడొక • పామరుఁడయ్యెడుఁ గాని మృత్యు సం
హరుఁడగు నే హరుండు కరు • ణాన్వితుఁడంచుఁ దలంచు టెట్లొకో.
క॥ అని విలపించుచు సన్నిజ మునివరులొక కొందఱచట • మూఁగిన వారల్
ననుఁ గనుఁగొని యాశ్చర్యంబున మత్పితఁ గాంచి వినయ • మునఁబల్కి రొగిన్.
క॥ నీ వెఱుఁగని యర్థముగలదే విలపింపంగ నేల • యీశ్వరమహిమం
బా వారి జగర్భాదులకే విశదము గాదనంగ • నెప్పుఁడెఱుంగన్
చ॥ క్రతునిలయంబునన్ • మనము కాంచినరీతి నితండు దైవిక
స్థితిఁ గనుపట్టఁడంచు మదిఁ • జింతిలనేల నరుండవీవు నీ
సుతుఁడు నరాకృతిన్ గనుట • చొప్పడు నింతకె చంచలించి ప్రా
కృతుని విధంబునన్ బలుక • దేహము మాయ నెఱుంగనేర్చదే.

క॥ అనవుఁడు సాలంకాయన తనయుఁడు మజ్జనకుఁడింత • ధైర్యంబున నా
కొనరించెజాతక ర్మాది నిఖిలకృత్యముల సఖిల • దివిజులు వొగడన్.

వ॥ మఱియు నమ్మునివర్యుఁడు చిరకాల ప్రాప్తుండనగు నాయెడ ననురాగంబు మెయిఁ బెంచుచు దినదినాభివృద్ధిఁ దేజరిల్లు నాయెడ నెల్లప్రాణంబులుంచి నావలన నెంతయు సంతోషంబునఁ గాలంబుఁ గడపుచుండఁ గతిపయ దినంబులు చనియె నంత నాకు సప్తమవత్సరంబు నిండిన

సీ॥ శ్రుతివిహితంబుగ • సూరివరుల్ మెచ్చ నుపనయముఁజేసి • విపులశక్తి
ఋగ్యజుశ్శాఖల • నెల్లను బోధించి సామశాఖా సహ • స్రంబుఁగఱపి
యంగషట్కము నేర్పి • యతులితాయుర్వేదమును ధనుర్వేదంబు • బోధపరచి
యఖువదినాల్గువి • ద్యల సుకరమొనర్చి గాంధర్వ మశ్వలక్షణము హస్తి
చరితము మనుష్యలక్షణ • మరయ నెల్ల లిపుల నెఱిఁగించి సరివార • లెపుడు నంది
కేశ్వరునిఁ బోలువార లెం • దేని గలుగరని నుతింపఁగ యశమొందు • నటులఁజేసె.

వ॥ అట్లుపనీతుఁడనై యుపదిష్ట సకలవిద్యాకలాపుండనై తలిదండ్రులకు మోదంబుఁ గూర్చుచున్నెడ నొకనాఁడు.

—మిత్రావరుణులు నందికేశ్వరుఁ గాంచవచ్చుట—

క॥ గురుతర తపోభిరాములు నిరత శివాచారరతులు ము • నిప్రవరులు భా
స్కర తేజులైన మిత్రావరుణులనెడివారు యోగ • బలులు మహాత్ముల్.

సీ॥ తొలిపాతములను వ•ల్లెలు వేయుచును బ్రహ్మచారు లొక్కయెడ నిం•పారుచుండ
నొకవంకఁ బరమ త•త్త్వోపదేశమొనర్చు బ్రహ్మర్షివర్యులు • పరిఢవిల్ల
నొకమూల జంధ్యము • లకుముళ్ళు వేయుచు వృద్ధులౌ మానులు • వెలయుచుండఁ
బ్రవిమలభక్తి సం • పన్నులై యొకకొంద రతిథుల కర్ఘ్యపా • ద్యంబులిడఁగ
నగ్నిహోత్రంబులను జేయు • నట్టివారు దేవతార్చాసుమంబులఁ • దెచ్చువారు
గలిగి సుకృతాస్పదంబునై • కనులవిందుసేయుమా పర్ణశాలకుఁ • జేరిరపుడు.

చ॥ కులపతియైనవాఁడు ముని • కుంజరుఁ డధ్వరదీక్షితుండు ని
ర్మల చరితుండు ధీరుఁ డస • మానుఁడు మత్పిత యట్లు జేరు వా
రల విలసత్తపోధనుల • గాజితమూర్తులఁగాంచి భక్తిసం
కలిత మనస్కుఁడై యెదురు • గాఁజని తోడ్కొనివచ్చి ప్రేమ్మమై

తే॥ అర్ఘ్యపాద్యాది పూజల • నాచరించి యెచటనో యాడుకొనువాని • నీశకల్పు
నన్నుఁగొనివచ్చి చూపి యీ • చిన్నవానిఁ గాంచితిరె యంచు వారికిఁ • గానిపించె.

ఉ॥ ఆ మునివర్యులున్ నను ని • రామయు నిశ్చలచిత్తు బ్రహ్మ తే
జోమహిమాంచితున్ సకల • సూరినుతున్ గని చేరఁజీరి గా
గామున మేను దువ్వుచుఁ గ • రంబులఁ జెక్కుల నొక్కుచున్ గృపా

ఘాములునై కనుంగొనిరి ♦ దద్దయు నాతనువెల్ల మాటికిన్
క॥ పౌనఃపునికంబుగ నమ్మునివరులు తన్ను గాంచి ♦ మానసమున నెం
తే నెగడు నసంతుష్టినిఁ బూనికఁ దెలియంగ నీక ♦ ముదమె రహింపన్.
తే॥ తొలుదొలుత గల్గినట్టి సం♦తోషమెల్ల విదితమై నెమ్మొగంబున♦వెలయుటయును
గాంచి జనకుండిఁకేమి ప్రా ♦ ప్తించుననుచుఁ గంపమొందుచు గద్గదికమున ననియె.
చ॥ అమలిన చిత్తులార తన ♦ యాగ్రణిఁ గంటిరిగా భవిష్య ద
ర్థమెటుల వీనియందు విత ♦ తంబయి యొప్పు నుమేశ్వరప్రసా
దమున లభించినాఁడితఁ డు ♦ దారగుణాఢ్యుఁడునై మదీయ వం
శము నభివృద్ధి సేయునె య ♦ శంబు గడించునె చెప్పరే యిఁకన్.
ఉ॥ ఈ మునిపల్లెవారు తమ ♦ యెల్లసుఖంబుల కీ కుమారుఁడే
ధామమటంచు నెంచి ప్రమ ♦ దంబునఁ బ్రాణచయంబు వీనిపై
నేమము సేసినారు ధర ♦ ణీధర చాపు ననుగ్రహంబు మా
కేమిఫలంబొసంగెడి నొ ♦ యింతయుఁ దాఁచక చెప్పుడాయిఁకన్.
క॥ మీ ముఖవైఖరిఁ గనుఁగొనఁగా మాకు భయంబు హెచ్చుఁ ♦ గనికరమున నీ
మామక పవిత్రవంశ క్షేమంకరుఁ గుఱిఁచి యెట్లు ♦ సెప్పఁదలఁతురో.
వ॥ అని పలికిన మిత్రావరుణు లొకింత చింతించి మజ్జనకున కిట్లనిరి.
చ॥ మునివర యిక్కుమారునెడ ♦ మోహముఁ జెందఁగ నేలనయ్య యీ
యనఘున కొక్కవత్సరమె ♦ యాయువుగల్గినయట్లు మాకు నె
మ్మమునఁ దోఁచు నింక నను ♦ మానముఁ జెందకు నీ యభాగ్యమే
యొనరిచె నిట్టి పాపము గు ♦ ణోన్నత తీరునె చింత సేసినన్.
చ॥ తనువు లనిత్యముల్ పురుష ♦ ధర్మము ధైర్యము పూర్వసంచితం
బున జనియించు చుండెదరు ♦ పుత్త్రులుఁ బుత్రికలున్ ఋణంబు దీ
రిన యటుమీఁద నిల్వరు ధ ♦ రిత్రి మహార్తమయేని వారికై
యనఘులు చింత సేయుదురె ♦ యాదట కార్యముఁ జూడ కింతయున్
ఉ॥ ఎందఱిఁ గాంచలేదొ జని ♦ యించెడి వారలఁ జచ్చువారి నిం
కెందఱిఁ జూచుచుండమొ మ ♦ ఱెందఱిఁ గన్గొనఁబోము వారికై
కుంది కృశింప నేఫలమ ♦ గున్ విధిఁ దాఁటఁగ నెట్టివారికై
నందరమా నె మానికుల ♦ నాయక నీవఖిలంబెఱుంగవో.
తే॥ సర్వమునకు నేత ♦ శర్వుఁడా దేవుని యిచ్చ యెప్పు డెట్టు ♦ లెసఁగుచుండు
నప్పు డటుల జరుగు ♦ నఖిలంబు తద్భిన్నకార్య మించుకయును ♦ గలుగదెపుడు.
తే॥ కొడుకెవఁడు తండ్రియెవ్వఁడు♦పడఁతి యెవతె మగఁడెవఁడు వారికిట్టి సం♦బంధమేల
కలిగె నెందాక యుండు ని♦క్కార్యకర్త యెవఁడొ యెఱుఁగంగ శక్యమే♦యెవ్వరికిని.

సీ॥ ఇలఁబిహాస్రాప్రేరి ♦ తులయి నీరాగారమునఁ జేరుకొని త్రావి ♦ చనెడు నట్టి
పథికుల వడువునఁ ♦ బ్రాణసంతతి పూర్వకర్మ చోదనమునఁ ♦ గలుషమూల
మగు నీ శరీరంబు ♦ నందుఁ బ్రవేశించి తమ వచ్చినట్టి కృ ♦ త్యంబు సల్పి
వేఁజనుచుండుట ♦ విధిహితంబగుఁగాదె యంతమాత్రమునకె ♦ యెఱుకలేని
వారిఁబోలి వగవఁ ♦ బనియేమి వగచియు నిలుపఁగలరె యెట్టి యలఘు మతులు
ప్రకృతి ధర్మ మిదియ ♦ పరమేశు సంకల్ప మరయ నెట్టివారి ♦ కైనఁ దరమె.
మ॥ అనినన్ గన్నుల దుఃఖబాష్పములు దే ♦ హంబెల్ల స్నానంబుగా
నొనరింపంగను గుండె బాదుకొను చ ♦ య్యో పుత్రకా పుత్రకా
యని దుఃఖించుచు మిన్ను జూచుచు క్షణం ♦ బట్లుండి హాహాయటం
చును నేలన్ బడి ప్రాణముల్ విడచె న ♦ చ్చోనున్నవా రేద్వఁగన్.
చ॥ కనుఁగొని మత్పితామహుఁ డ ♦ కాల భవంబగు నమ్మహాలయం
బునకుఁ బ్రతిక్రియన్ సలుపు ♦ బుద్ధియె లేమిని నన్నుఁగూర్చి త
త్తనయుడు పంచతన్ గను క ♦ తంబున నోా వగపూని ప్రాణముల్
తనువునఁ దాల్పనొల్లక వ్య ♦ థా యసురుల్ విడచెన్ సుతార్తిమై.

—శివుఁడు నందీశ్వరునకు వరమొసఁగుట—

వ॥ అంత నేనును మామకాశుభశంకితాత్ముఁడై నాకతంబున నకాల మరణంబుఁగాం
చిన తండ్రిని, పుత్రశోకాకుల చిత్తుఁడై మృతిఁగాంచిన పితామహుని సాలంకాయ
నునిఁ గాంచి చింతించి యమ్మహాత్ములఁ బునర్జీవితులఁజేయు టొండె నిజప్రాణ పరి
త్యాగంబుఁజేయు టొండె ముఖ్య కర్తవ్యముగ నిశ్చయించి గంగాతీరంబునఁ జేరి
యీశ్వరారాధనఁ గావించినఁ బరమేశ్వరుండు ప్రసన్నుండై యిట్లనియె.
మ॥ తనయామృత్యుభయంబు నీకుఁ గలదే ♦ తథ్యంబుఁ జింతింపవే
నను నీవానినిఁగాఁ దలంపవె జగ ♦ న్నాథుండనౌ నాకు నీ
కును భేదంబు చెలంగునే సకల ♦ దక్షుండైన నీ తండ్రికిన్
దనువున్ వీడుట న్యాయమానె సుతవా ♦ త్సల్యంబుచే నిర్విధిన్.
క॥ మిత్రావరుణులఁ బరమపవిత్రులనే నంపి తిటకు ♦ విజ్ఞులువారల్
ఛాత్రులు నాకు శిలాదుని మైత్రిన్ గనవచ్చినారు ♦ మహితగుణాఢ్యుల్.
చ॥ తొలుత శిలాదమానికిఁ గు ♦ తూహలమున్ గలిగించె నెద్ది వే
ల్పులు దనుజుల్ మునిప్రవరు ♦ లున్ వినుతింపఁ జెలంగె నెద్ది ని
ర్మలమయి నిష్కలంకమయి ♦ రాజితమై నుతిఁగాంచె నెద్ది యా
లలితము దైవికంబు శుభ ♦ లక్షణలక్షితమైన దేహమున్.
క॥ ఏన యదృశ్యమొనర్చితి మానవదేహం బొసంగి ♦ మానీంద్రునకున్
మానసము సంశయాస్పదమై నీయెడఁ జంచలించె ♦ నస్థిరమగుచున్.

చ॥ అమలినచిత్త నిన్గురించి • యాత్మశరీరములన్ దొలంగి రు
త్తమచరితుల్ భవత్పితృ పి • తామహు లిప్పుడమత్కృపన్ స్వజీ
వముల ధరించి మించెదర • వారితనూ భవదీయ పూర్వపు
ణ్యము కతనన్ బితృఘ్నుఁడను • నట్టి యకీర్తి నశించు నీ కిఁకన్.

మ॥ అమృతత్వంబు వహించి నిర్జరుఁడవై • యక్షీణ దేహుండవై
యమలాచారపరుండవై నిఖిలలో కా • ధీశ్వరత్వంబుఁ గాం
చి మదీయాంగణపాలకుండవయి ని • శ్శ్రేయః పరీతుండవై
న మహాయోగ బలాన్వితుండవగు దో • నందీశ నీవింతటన్.

తే॥ స్వప్నమునసైన నీ కశు • భంబు గలుగ దెల్లయెడల జయమె లభి • యించుచుండ
ప్రమథగణరాజ్యమున కీవ • రాజవగుదు వనఘచిత్తుఁడవయ్యె ద • వమరులం

తే॥ మత్సదృశ పరాక్ర • మంబు మద్వీర్యోపమమగు వీర్యమును స • మస్తలోక
పాలకత్వమును గృ • పామతి నీ కిచ్చితింక నేమినలయు • నిపుడ చెపుము.

చ॥ అని కరుణారసార్ద్ర హృద • యాంబుజుఁడై గిరిశుండు పల్కుచున్
దనకువిధీంద్ర ముఖ్యవిబు • ధ ప్రకరంబులలోన నెవ్వడో
వినయముతో నొసంగిన ప • విత్ర కుశేశ యమాల మెల్లనన్
దనువున నుండి తీసి ప్రమ • దంబున నామెడవైచె నంతటన్.

చ॥ భుజద శకంబు పంచముఖ • ముల్ నయనత్రితయంబు వ్యోమమూ
ర్ధజములుఁ జర్మవస్త్రమును • రాజకళాభరణంబుఁ బున్కయున్
భుజగమయాంగదంబులును • భూతివిభూషితగాత్రవల్లియున్
ద్రిజగములేలు శక్తి యస • దృశ్మ హిమంబును గల్గె నయ్యెడన్.

ఉ॥ మారట శంకరుండనయి • మారుని బీరముఁ బాఱద్రోలు సిం
గారముఁ గల్గి ముమ్మొనలఁ • గ్రాలెడు వాలొక కేలఁబూని దు
ర్వార పరాక్రమక్రమ ప • రాజిత రాక్షస సంచయుండనై
మేరు శరాసనుండనయి • మించితి నెల్లరు సంభ్రమింపఁగన్.

తే॥ అటుల లోకోత్తరుండనై • యతులిత ప్రభావ సముపేతుఁడనయి య • బ్రంబుఁగొ
ననుగనుంగొని దరహాస • మును సలుపుచు కాలకంఠుండు మామక • కరముఁబ

చ॥ కలుష వినాశకంబు శ్రిత • కామ్య ఫలప్రదమున్ జటాటవీ
కలితము నోషధీశకర • కంపిత నీరము స్వర్ణపంకజో
ల్ల సదురువీచికా నివహ • లాలితముద్ధత షట్పద ప్రభా
చలితము పూతమై యలరు • స్వర్ణదిఁ జూపుచు సంతసంబునన్.

చ॥ విలసితమైన యొక్క జల • బిందువుఁ జేకొని చూడు మీకణం
బలరు నదీమతల్లియగు • నంచు వచించుచుఁ బాఱజిమ్మెన్

సలలిత నీరమైకమల • షండ విరాజితయై మహోత్తరం
గ లలితయై తనర్చునది • కన్నులపండువుఁ గూర్చు చెంతయున్.

తే॥ అంత నమ్మహానదిఁ గాంచి•యనఘుఁడైన తరుణ శశిశేఖరుఁడు జటో•దకముకతనఁ
దనరెఁగావున నిది జటో•దకయనంగఁ బరఁగెడి నటంచుఁ బలికి శాం•కరిని గాంచి.

తే॥ ఎవ్వఁడేని భక్తిఁ • డీ జటోదకయందు నెసఁగు భక్తిమునుఁగు • నేని వాఁడు
పాపములఁ దొలఁగి • ప్రవిమలంబగు మదీయాంతికంబుఁజేరి • యలరు నెపుడు.

వ॥ అని వచియించుచున్ గిరిశుఁ • డద్రిజ కిట్లను దేవి కాంచితే
తనయుఁడు వీఁడు నీకితఁ డు • దారగుణాఢ్యుఁడటంచు నన్ను వై
కొని జగదంబపాదముల • కున్ బ్రణుతింపఁగఁజేయ నా జగ
జ్జననియుఁ బాణిపద్మములఁ • జక్కఁగ దువ్వుచు ముద్దు సేయుచున్.

—పంచనదప్రభావము—

తే॥ పుత్రవాత్సల్యమునన య • ప్పుడు జటోదకాంబు శీకరత్రితయంబు • హస్త పల్ల
వమునఁ గొని మామకోత్తమాం•గమునఁ జల్ల నా కణములు నదీత్రయం•బైగ్రహించె.

తే॥ ఆ నదీత్రయముంగాంచి • యంధకారి యెసఁగుఁ ద్రిస్రోతసంబన • నిదియటంచుఁ
బల్కె నద్దానిఁ జూచి సా•ధ్వసము కతన నే నఱచితప్పుడో కనది•యెసఁగెనందు.

తే॥ మామకధ్వని జనిత ని • మ్నగయగుటను నది వృషధ్వని నానొప్పె • నవనియందు
నందు మునిఁగిన నరున కా•యిందు ధరుఁడు సకలవరము లొసంగు ని•స్సంశయంబు.

చ॥ సకల జగన్నియంతయగు • శంకరుఁ డప్డు కృపార్ద్రచిత్తుఁడై
ప్రకటిత దివ్యతేజము సుప • ర్ణమయంబుల సన్మణి ప్రభా
నికర పరీతమున్ నిజవి • నిర్మల మౌళితటీనిబద్ధమౌ
మకుటముఁ గుండలంబులును • మక్కువ నాకు నలంకరించినన్.

చ॥ కనుఁగొని పద్మినీపతి వి • కర్తనుఁడయ్యెడఁ గర్మసాక్షియై
తనరుచునుండు వాఁడగుటఁ • దద్దయు నాయెడ గౌరవంబునన్
వనద జలంబుతోఁ గుసుమ • వర్షముతో నభిషేచనం బొన
ర్చిననపు డజ్జలంబులు ప • రీతములయ్యెను గుండలంబులన్.

తే॥ అంత నా సువర్ణ మయంబు • లైన కుండలముల జనియించె నొకనది • యమలనీర
యగుచు జాంబూనదమకుట•మందుఁబడిన వారియెల్ల మఱియొక స్ర•వంతియయ్యె.

వ॥ క్రమంబున నా రెండునదులును సువర్ణయనియు జాంబూనదయనియుఁ బ్రఖ్యాతిఁ గాంచె. జటోదకయుఁ ద్రిస్రోతసయు వృషధ్వనియు, సువర్ణయు, జాంబూనదయు, గలిసి పంచనదయని ప్రఖ్యాతిగాంచె. ఏను పితృపితామహుల నుజ్జీవితులఁజేయఁ దలంచి యుమాశ్వరుని గుఱించి జపించిన క్షేత్రంబు జప్యేశ్వరంబునాఁబడు. అందు నాకు వరంబొసంగిన పరమేశ్వరుండును జప్యేశ్వరుండు నా నుతిఁగాంచె.

—జప్యేశ్వర మహాత్మ్యము—

మ॥ ధర నేమానవుఁడైనఁ బంచనద తీ ♦ ర్థం బాడి జప్యేశ్వరున్
స్థిరభక్తిన్ భజియించునేని సతత ♦ శ్రేయస్కరుండమ్మహే
శ్వరుఁ డెల్లప్పుడు వాని కంచు సుఖి వాం ♦ ఛాసిద్ధిఁ గూర్చున్ నిరం
తర సౌఖ్యంబున నించి వాఁడు ప్రముద ♦ త్వంబున్ వహించున్ వెసన్.
క॥ పంచనద స్నానముఁ గావించిన మానవుఁడు చెందు ♦ విమలపదంబున్
గాంచనగర్భునకును వర్ణించుట శక్యంబగునె ధ ♦ రిత్రి నొకపుడున్.
క॥ నరుఁ డెన్ని వేలయుగములు పరమతపముఁ జేసియైనఁ బడయని జప్యే
శ్వరు సాన్నిధ్యము వడయున్ స్థిరమతిఁ బంచనదమాడి ♦ ధీరుండగుచున్.
చ॥ గొనకొని యశ్వమేధములు ♦ కోటి యొనర్చి మనుష్యుఁ డేఫలం
బునుగనునట్టి సత్ఫలమె ♦ పొందును పంచనదంబు నాడినన్
మనుజుఁ డనేక వర్షములు ♦ మానక చేసిన యెట్టి హత్యలై
నను నశియింపఁ జేయుఁ గరు ♦ ణానిధి యీశుఁడు దానమున్గినన్.
వ॥ అని శైలాది వచియించి సనత్కుమారునితో వెండియు నిట్లనియె. అట్లు బరమేశ్వ
రుండు విశ్వకర్మ నిర్మితంబగు కిరీటంబు నాకొసఁగి జగన్మాత యగు హైమవతిన్
గాంచి యిట్లనియె.-
చ॥ ఇతఁడు పరోపకారరతుఁ ♦ డెల్లజగంబుల నేలు శక్తి వాఁ
డతుల పరాక్రమోన్నతుఁ డ ♦ హంకృతి దూరుఁడు మాకు నిష్టుఁడ
ప్రతిహత తేజుఁ డుత్తముఁడు ♦ భాస్కరతుల్యుఁడు నందికేశుఁ డీ
చతురుని మద్గణంబునకు ♦ శాసకర్తగఁ జేయనెంచితిన్.

—శివుఁడు పార్వతితో నందీశుని ప్రమథాధిపతిగ జేయుదునని చెప్పుట—

చ॥ పరహృదయజ్ఞుఁడై వితత ♦ బాహుబలంబున నెట్టి శాత్రవో
త్కరమునకైన భీతిలక ♦ తానొకరుండె రణాంగణంబునన్
స్థిరమతినిల్చి పోరఁగల ♦ లేసువఁగల్గిన వాఁడె కా చమూ
భరము వహింప నర్హుఁడగు ♦ స్వామికి మోదముఁ గూర్చు నెప్పుడున్
చ॥ చతురతగల్గి యుండియును ♦ స్వామికిఁ భక్తుడుగాక యుండునే
నతని కితంబునన్ ఫలము ♦ నందఁ డొకింతయు క్ష్మాధవుండు భూ
పతికి హితంబుఁగోరియును ♦ వాఁడు సమర్థుఁడుగాక యుండునే
నతులయశంబుఁ గోల్పడి ధ ♦ రాధిపుఁ డార్తిఁ గృశించు నెంతయున్.
తే॥ స్వామిభక్తుఁడగుచు ♦ సర్వసమర్థుఁడై మెలరువాఁడొకండె ♦ యర్హుఁడగును
చక్రరక్షణంబు ♦ సలుప నాతని కారణమున నిరతకీర్తి ♦ నందు నేఁడు.

చ॥ అతుల భుజాబలుండితని • కన్న మరొక్కఁడు గానరాఁడు భూ
తతతి కధీశ్వరుండయి ము • దంబును గూర్పఁగలట్టివాఁడు మ
ద్ధితుఁడితఁ డీతనిన్ గనిన • నెంతయుఁ బ్రీతి సెలంగు నాకు నీ
చెతురునకీఁదలంచితిని • సర్వగణాధిపతిత్వ మియ్యెడన్.

క॥ నీ యభిమత మెట్టిదొ కాత్యాయని యెఱిఁగింపు మీతఁ • డర్హుఁడకాదే
నా యఖిల బలంబునకున్ ధీయుక్తిఁ బ్రభుత్వమూన • దిటముదలిర్పన్.

చ॥ అనుటయు శైలపుత్రి దర • హాస రుచుల్ విమలోష్ఠకాంతులన్
గొనకొని సంక్రమించి యొక • క్రొత్త మెఱుంగుల నీన భక్తియున్
వినయము నెంగలింపఁగ వి • వేకము నీతియు విస్తరించుచున్
ఘనుని శశాంకశేఖరునిఁ • గన్గొని పల్కె ననల్పబుద్ధియై.

మ॥ అనఘానన్నుఁ బరీక్షసేయుదువె నీ • కై నట్టి పుత్రుండు నా
కును బుత్రుండగుఁగాక యన్యుఁడగు నే • క్రూరస్వభావంబుఁ గాం
తునె నీ యిచ్చెదు గాణపత్యమున కిం • దున్ విఘ్నమున్ జేయుదా
ననె నీ చిత్తము చొప్పకాక యొక చం • దంబూని వర్తింతునే.

క॥ దేవా నీకీతనిపై నేవిధి వాత్సల్యమెసఁగు • నీ దేవికి న
ట్లే వాత్సల్యముగలదని భావింపుమటంచు వేర • పలుకవలయునే.

తే॥ సుతుఁడు నాకితండు • కూరుఁడు జగదేకవీరుఁ డితనికన్న • వేర యొక్కఁ
డర్హుఁడనుచుఁ బల్క • టనుచితమనియేన యెఱుఁగకున్నదాన • నేమహేశ.

తే॥ అనఘ జగదేకవీరుఁడ • వైన నిన్నుఁ బరిణయంబయి నే వీర • పత్నినైతి
కూరుఁ డీతండు నాకిట్లు • సూనుఁడగుట కూరమాతనయితి నివ్వి • కారనయితి.

చ॥ ఇతనికి గాణపత్యమిదు • చే యుచితంబని మున్నయేఁదలం
చితిని పరేంగితజ్ఞుఁడవు • శిష్టజనావన దీక్షఁబూని సం
తతముఁ జరించు నీవును ని • తండె సమర్థుఁడటంచు నాత్మ నెం
చితి వదిగాన నీ తనికె • సేయుము భూతగణాభిషేకమున్.

ఉ॥ ఎంతటి క్రూరచిత్తులను • నింతులకేనియుఁ బుత్రులందు న
త్యంతముఁ బ్రేమముండునిలఁ • దంద్రులకన్న నటం చెఱుగవే
సంతసమయ్యె మత్సుతుఁడు • సర్వగణాధిపతిత్వమూని నా
కెంతయుఁ గూర్చునంచు నఖి • లేశ్వర శంకర భక్తవత్సలా.

తే॥ మంగళస్నాన మొనరించి • మహిత రాజ్య, పట్టభద్రుండగుచు వెల్గు • వాని సుతునిఁ
గాంచు టెప్పుడొకోయని • కాచియుంటి నధిప యాలస్యమేల నే • యంగనింక.

చ॥ ఒక గణరాజ్యమే యనకు • మో కరుణాకర నందికేశుఁ డే
లికయయి యెల్లలోకముల • లీల భరింపఁగ నేర్చువాఁడు తా

వక కృపగల్గునేని యిఁక ♦ వారక నీ వచియించినట్లు యీ
యునటిల చిత్తనందున గ ♦ ణాధిపతిత్వము నిల్పు డెంతయున్.
క॥ అనివచియించిన నుమఁగన్గొని హృష్టపరీతుఁడగుచుఁ ♦ గోమలి నందీ
శునకన్న వేరొకండిల మనకు హితుఁడుగల్గునే య ♦ మానుషశక్తిన్.
తే॥ పరమభక్తుండు నందికే ♦ శ్వరుని గాణపత్యమున నభిషేకింతుఁ ♦ బరఁతి యుపుడ
యింత సైరింపుమని వచి ♦ యించి హరుఁడు గణపతుల స్మరియించె న ♦ ఖండశక్తి.

—నందికేశ్వర పట్టాభిషేకము—

మ॥ జగదీశుండు శశాంకశేఖరుఁడు వి ♦ శ్వత్రాణ దక్షుండు స
ర్వగురుండక్కటికంబు మీఱ గణ సా ♦ మ్రాజ్యాభిషేకంబుఁ జే
య గణాధీశుల సంస్మరించుటయు రౌ ♦ ద్రాకారులౌవారు భూ
తగణేశుల్ హరుపాదపంకజములన్ ♦ ధ్యానించు చప్పట్టునన్.
సీ॥ త్రిణయనోన్నత ముఖుల్ ♦ దివ్యసహస్రహస్తులు సహస్రాయుధ ♦ కలితకరుఁ
శతకోటి కాలాగ్ని ♦ సంకాశులును జటామకుటధారులు భూతి ♦ మండితులును
దంష్ట్రికరాళవ ♦ దనులు భీకరమూర్తు లలఘులు నిత్యశు ♦ ద్ధులు మహాత్మ
లురుతర వ్యాఘ్ర చ ♦ ర్మోత్తరీయులు నాగయజ్ఞోపవీతులు ♦ యజ్ఞభుజులు
విమల మందాకినీ పయో ♦ విలస దుత్తమాంగులు పినాకధరులుఁ గా ♦ మాంతకులుఁ త్రి
శూలటంక గదాధరుల్ ♦ సూరిలోక సేవిత పదాంబుజుల్ జయ ♦ శ్రీలలితులు.
సీ॥ తురగవారణ వృష ♦ హరి మర్కటవిమాన ముఖవాహనారూఢు ♦ లఖిలవిదుఁ
పటహ భేరీవేణు ♦ పణవమద్దల మృదంగాదివాద్య పరిక ♦ రాభిరాము
లతుల పరిఘ పట్ట ♦ సాది దివ్యాయుధ కలితహస్త విరాజి ♦ తు లనఘులును
నవరత్నఖచిత నా ♦ నాకార శోభిత హాటకమకుటోత్త ♦ మాంగయుతులు
నేకముఖు లనేకముఖులు ♦ నిద్ధతేజు లూర్ధ్వరేతస్కులును భీక ♦ రోగ్రదృష్టు
లైన భూతగణేశ్వరు ♦ లంధకారి సన్నిధిఁ జేరవచ్చి రా ♦ సమయమందు.
తే॥ అటుల నేగుదెంచి ♦ యాదిమదంపతులైన శంకరునకు ♦ నంబికకును
వందనం బొనర్చి ♦ వారనికడఁక నిట్లనిరి వేల్పులెల్ల ♦ రదరిపడఁగ.
చ॥ పురహర యేల పిల్చితివి ♦ భూతగణంబుల మమ్ము వీఁగ కా
శరధుల నింకఁ జేయుదుమొ ♦ సర్వధరాధరముల్ పెకల్తుమో
హరిహయ పద్మసంభవ ము ♦ ఖామరసంతతిఁ గట్టి తెత్తుమో
ధరణిని వ్రక్కలింతుమొ స ♦ దంపడి మా కెఱుఁగంగఁ జేయుమా.
ఉ॥ తారల డుల్లఁజేయుదుమొ ♦ దైత్యచమూ నివహంబు నిష్ఠ సం
హారమొనర్చి వత్తుమొ గ్ర ♦ హంబుల వేఁజని మ్రింగివైతుమో-

ధీరతఁ దక్షవాసుకులఁ • ద్రిప్పి ధరన్ వెసఁ గొట్టి చీల్తుమో
వారకమిత్తి నాలుకల • బల్మి నిలాగుదుమో వచింపుమా.
క॥ అని దెసలు మాఱుమ్రోయఁగ ఘనగర్జారవము వోలెఁ • గఠిన ధ్వనులన్
మనుకొని పలికెడి గణములఁ గనుఁగొని వచియించె నీల • కంఠుండిటులన్.
చ॥ ఇతఁ డవనీసురోత్తముఁ డ • హీనచరిత్రుఁడు మత్కుమారుఁడీ
చతురుని సర్వభూతగణ • శాసనకర్తఁగఁ జేయనెంచి య
క్కతమున మిమ్ముఁ బిల్చితిని • గౌరవబుద్ధి నదాజ్ఞ మీరలం
చితమగు వస్తుసంచయము • సిద్ధమొనర్పుఁడు వేగ నియ్యెడన్.
చ॥ అనిన గణేశులెల్ల విన • యంబున నంజలిఁ జేసి దేవ నీ
తనయుఁడు నందికేశ్వరుఁ డు • దారగుణాఢ్యుఁడు మాకధీశుఁడై
యనికియె సమ్మతంబగు ని • యుక్తినిఁ జేయుము వస్తుసంచయం
బు నిపుడ సంగ్రహించెదము • భూతము లీతనినే తలంచెదున్.
వ॥ అనివచియించి
సీ॥ లతచంద్రకాంత ఖ • చితకుడ్యములతోడ స్వర్ణరచిత గవా • క్షములతోడ
హరి నీలమణి కల్పి • తానల్ప వివిధ కవాటచిత్రిత కథా • వళులతోడఁ
గన దురుపద్మరా • గప్రభాశోభిత చారుకుట్టిమ సభా • స్థలులతోడ
నభ్రంలిహోన్నత • హరి శృంగాగ్రలంబిత దివ్యకేతు సం • తతులతోడ
నమల పట్టాభిషేకోత్స • వావలోక నాగతానేక లోకపా • లానుకూల
శతసహస్రాపవరక సం • చయముతోడ నలరు దివ్యసౌధంబుల • నలవరించి.
వ॥ ఆ సౌధరాజములందొక విశాలభవనంబునఁ జామీకరప్రభంబును ముక్తాదామాలంకృతంబును మణిమయ రత్నావభాసితంబును, వైడూర్య మయకింకిణీజాల సంయుతంబును, శతయోజన విస్తీర్ణంబును, నగు నొక మండపము నిర్మించి తన్మధ్యభాగమున జాంబూనద వికారంబును నీల వజ్రమయ పాదపీఠ సంకలితంబును, నగు సింహాసనం బేర్పరచి
సీ॥ జలజావృతాననం • బులు దివ్య వివిధ తీర్థాంబు పూరితములు • హాటకమయ
ములు రజతవికార • ములు తామ్రరచితముల్ మృణ్మయములు నయి • యొసగునట్టి
కలశ సహస్రముల్ • లలితసింహాసనంబునకెల్ల దిశలయం • దునిచి మఱియుఁ
బరిమళత్కుసుమ సం • భారంబుఁ గొనివచ్చి బిల్వాది పత్రముల్ • ప్రీతిఁ గూర్చి
తండులాదికములు నవ • ధాన్యములును భూతిపంచామృతములు వి • భూతి కుంకు
మాదులును సంగ్రహించి గ • ణాధిపతులు హరునకు ముదంబుఁ గూర్చి ర • య్యవసరమున.
సీ॥ వాసోయుగంబు ది • వ్యసుగంధమును కుండలములు కేయూరముల్ • విమలహార
ములు ఛత్రచామరం • బులు చాలవృంతముల్ కనక కిరీటంబుఁ • గవచములును
రజత సువర్ణ వే • త్రములు మణికలిత లలితాంగుళీయకం • బులును బట్టు
పుట్టముల్ గొనితెచ్చి • కొందఱు గణపతుల్ ముదముఁ గల్గించిరి • పురహరునకు

సమరనాథుండు భక్తిన • యంబులలర దిగ్గజంబులఁ గొనివచ్చె • దివ్యులెల్ల
వారివారికిఁ దగినట్టి • వాహనములఁ గానికలఁ గొనితెచ్చిరి • కౌతుకమున.

ఉ॥ ఆగతి నెల్లవారుఁ దమ • కర్హములైన యుపాయనంబులన్
వేఁగొనివచ్చి యిచ్చుటయు • విశ్వశుభప్రదుఁడై చెలంగునా
భోగిధరుండు శంకరుఁడు • భూతచయంబుఁ గృపార్ద్రదృష్టిమై
తాఁగని సంతసంబున వి • ధాతనుగూర్చి వచించె నివ్విధిన్.

చ॥ ఘనుఁడవు నీ కతంబుననఁ • గాదె చరాచరమైన యీ జగం
బనయము సంభవించు నిగ • మావళి నీయెడ భారకత్వముల్
గను నిఖిలంబు నీముదలఁ గై • కొని త్రిమ్మరుచుండు నెప్పుడో
వనరుహసంభవా విమల • బావుఁడవీవకదా గణింపఁగన్,

చ॥ హితుఁడవు మాకు మాకయిన • యెల్లపనుల్ నినుఁజెంది యుండు నం
చితగతిముఖ్యమంత్రివయి • చేయుదువేమొనరింప నెంచుకా
ర్యతతుల వేరు నాకభవ • దర్ధ మొసంగితి సృష్టికార్యమున్
వితత యశోవిలాల పృధి • వీధవసన్నుత పాద పంకజా.

చ॥ స్థిరమగు భక్తిఁ గైకొని భ • జించుచు నుండెడివారలౌట నా
హరియును నీవు నాకుఁ బర • మాప్తులు మీకెఱుఁగంగఁజేయకే
కరణి రహించునట్టి యొక • కార్యముఁగూడ నొనర్పఁబూననో
సరసిజసూతి నీయెడల • సర్వము నిల్పితినంచు నెంచుమా.

చ॥ ఎఱుఁగుదుగా శిలాదసుతుఁ • డీతఁడు మత్కరుణాపదంబు క్ర
చ్చఱ గణరాజ భారమును • సర్వధరాపరిపాలకత్వ మి
త్తు తి నిడ నెంతు నీతనికి • ధర్మపదంబున సంచరించు నీఁ
డఱపడ కెల్లవారలఁ గృ • పాన్వితుఁడై మనుపంగలండు డీకన్.

క॥ నీవు పురోధసుఁడవగుచు నీ విమలోత్సవము నెఱపు • మీవకదా సం
భావింప నహర్ణుఁడవు మద్భావాయత్తంబులైన • పలుకర్జములన్.

చ॥ అనుటయు నట్ల కాకయని • యంబుజసూతి ప్రమోదచిత్తుఁడై
నను జలపూర్ణ కుంభముల • స్నానమొనర్చినవాని దివ్యకాం
చన రచితాసనంబు పయిఁ • జయ్యన నిల్పి యనేక మంత్రపూ
తునిగ నొనర్చి యెల్ల ప్రమ • ధుల్ సురలున్ మునులున్ గనుంగొనన్.

చ॥ వివిధ సుగంధ పుష్పములు బిల్వదళంబులు గంధమక్షతల్
ప్రవిమల కుంకుమాదులును • భస్మము మున్నగువానితోడ సం
భవమరణాది దుఃఖములఁ • బాసి వెలింగెడివాని నన్ను స
త్యవచనుఁ బూజ నేసె సక • లాత్ముఁడు శంభుఁడు సంతసంపడన్.

ఉ॥ అంత శివాజ్ఞఁ గైకొనిన • వాంబూరుహాంబకుఁడున్ బులోమజా
కాంతుఁడు వహ్నియంతకుఁడుఁ గర్బురుఁడున్ వరుణుండు మున్నుగాఁ

జెంతనయున్న వేల్పు లభి • షేకమొనర్చిరి భక్తియుక్తి సు
స్వాంతులరై మహర్షులుఁ • బ్రహర్షమునన్ జదువంగ మంత్రముల్.
ఉ॥ ఆ సమయంబునన్ గిరిశుఁ • డచ్చటి వారలఁగాంచి వింటిరే
యీ సకలజ్ఞుఁ డిప్డు జగ • దీశ్వరుఁడయ్యె మదీయ సత్కృపన్
భాసిలు వీని సల్పు పరి • పాలన మెల్లజగంబులందు స్వ
ర్వాసులె కాక తక్కుఁగల • వారును నీతనిఁ గొల్వఁగాఁ దగున్.
చ॥ ఇది మొదలెల్ల లోకముల • కీతఁడె యీశ్వరుఁడయ్యెఁ గావునన్
సదమలచిత్తులై యితని • శాసన మాదలఁ దాల్చి భక్తి యు
క్తిఁ దగినరీతిఁ గొల్వుఁడు వి • ధి ప్రముఖామరులైన మీరెడన్
ముదము వహించునేనితఁ డ • మోఘశుభంబులఁ గూర్చు మీకిలన్.
క॥ నందీశ్వరునకు మీరానందంబును గూర్తురేని • నాకును బ్రహ్మా
నందంబగు నో దానవ బృందారకులార! వింటిరే • నాపలుకుల్.
క॥ ఈతనికిఁ గినుక కలిగిన భూతవ్రాతంబు సమసి • పోవు నితనికిన్
బ్రీతి చెలంగిన నెల్లర కాతత సౌఖ్యములు గలుగు • ననవరతంబున్.
తే॥ ఇతనికిని నాకు భేద మిం • తేని కలుగ దట్లగుటఁజేసి యీ ఘను • నందు మీరు
వినయమును భక్తియును జెంది • వితతసుఖములంది మనఁదగు గణపతు • లార సతము.
చ॥ అనుటయు నెల్లవారును జ • యధ్వనులన్ బొనరించి రప్సరో
జనములు నృత్యమున్ సలిపి • సాధుమనంబుల నుల్లసిల్లఁగా
నొనరిచి రభ్రభాగమున • నుండిసుమంబులు రాలె దేవతాం
గనలును మంగళారతుల • గౌతుకమున్ ఘటియించి రయ్యెడన్.
చ॥ హరకరుణా ప్రసాదిత గ • ణా ధిపతిత్వమునన్ సహస్ర భా
స్కర సదృశోరు తేజమును • గాంచి దిదృక్షుజనావలోక న
స్ఫురణము మించి మించుచు వి • శుద్ధ యశోధన వైభవంబునన్
బరఁగెడి నేఁ గృతార్థుఁ డని గ • భావమునన్ దలపోయు చత్తఱిన్.
చ॥ జలజద వినీల కుంతలకుఁ • జారుతటిద్ద్యుతిదీప్త సజ్జటా
కలితున కుల్లస ద్విమల • కాంచనచేలకు వారణాజినో
జ్జ్వల దురువస్త్ర పూతునకు • భాసితమౌక్తికహారకున్ బృథా
కులలిత భూషణాంచితున • కున్ బ్రణతుల్ బచరించు లోక్య మై.
క॥ స్తుతమతులగు నాదిమ దంపతులను డాయంగఁ బోయి • భక్తిస్ఫురణన్
నతిసేయనున్న తఱి నప్రతిహత తేజుండు శివుఁడు • పల్కె ముదమునన్.
ఉ॥ అల్లదె విస్మరించితె శి • లాదుఁడు నీజనకుండు మౌనిరాట్
తల్లజుఁడున్నవాఁడు నిను • ధన్యుని పుత్రునిఁ గాంచినట్టి వాఁ
డెల్లరకన్న ముందతని • కే నతిసేయుము నీకుఁ గీర్తి సం
ధిల్లఁగఁ జేయువాఁ డతఁడె • నీ యభివృద్ధిని గోరు నాతఁడే.

క॥ నినువంటివాని సర్వజ్ఞునిఁ బుత్రునిఁగాంచినాఁడు ♦ కోవిద మణి యా
తనికన్నఁ గృతికలండే యనఘా యాతండె దైవ ♦ మగునీ కరయన్.
క॥ పితకన్నఁ గలదె యొక దేవత మానవలోకమునకు ♦ భక్తిస్ఫూర్తిన్
బితనర్చించినచో సద్గతి సుకరంబై తనర్చుఁ ♦ గాదె సతంబున్.
చ॥ జనకుఁడె యీశ్వరుండనుచు ♦ సంతతమాతని పాదపద్మముల్
మనమున నిల్పి కొల్చునస ♦ మానుఁడు ముక్తి సతీసమాగమం
బున కుచితుండు వానియెడఁ ♦ బూనిక నే మును జేరియుండు మ
య్యనఘున కందరానిది ప ♦ దార్థము గల్గదు ముజ్జగంబులన్
తే॥ పుత్రవాత్సల్యము గ ♦ లట్టి పురుషులందు దేవతాభక్తిగలిగిన ♦ ధీరులందు
సత్తపోధనులయి యొప్పు ♦ సాధులందు ముఖ్యుఁడగు మాకు నీముని ♦ పుంగవుండె
తే॥ సర్వమునకుఁ దాన ♦ శాసనకర్తగా దలఁచు సుతుఁడు తన్ను ♦ గెలువ నేర్పు
చతురుఁడగు విధాన ♦ సతతంబు యోజించుఁ దండ్రికన్న హితుఁడు ♦ ధరణిగలఁడె
ఉ॥ ఈ సదయుండు నీయెడల ♦ నెంతయు నక్కటికంబుఁ బూనుటన్
జేసియ కాదె నీవును న శేషగణాధిపతిత్వ మూని కై
లాసమునందు నిట్టులఁ గ ♦ శామయు నన్ను భజింప నేర్చితో
భూసుర నందికేశ తప ♦ మున్ జపమున్ బితకన్న శ్రేష్ఠమే.
తే॥ అనుచు నీతిఁ గఱపు ♦ నమ్మహేశుని గాంచి దేవ యాశ్రితుఁడను ♦ దీనుఁడను
దీయ నేరముల స ♦ హించి కృపన్ గావుమని వచించి యపుడ ♦ జనకుఁజేరి.
చ॥ అనఘుఁడ వీవు నీ మహిమ ♦ మాఱయ నేర్తునె యేను పామరుం
డను భవదీయ సత్కృపయె ♦ నాకు గణాధిపతిత్వ సంపదన్
గనుఁగొనఁజేసె నీయెడల ♦ గౌరవబుద్ధి యొకింత లేక నా
యొనరిచినట్టి నేరముల ♦ నోరిమి సైపుము మౌనిపుంగవా.
ఉ॥ నేరనివాఁడ నాయెడల ♦ నేరమియే యదియేని యన్నఁ బో
కారిచి పుత్రవత్సలతఁ ♦ గావుము నీ పదపంకజాతముల్
సారెకు సంస్మరించెద వి ♦ శాలయశోవిభవాభి రామ దు
ర్వార తమః పరీత జన ♦ పాలక సత్యవచో ధురంధరా.
క॥ అని పలుకుచు జనకుని పద వనరుహముల కెరఁగిన ♦ వాత్సల్యమునన్
నను ముని జపమాలా పావనములయిన మృదుల హస్త ♦ పంకజములతో.

వ॥ మెల్లన లేవనెత్తి చుబుకంబు ముద్దుఁ గొని యిట్లనియె.

ఉ॥ పావనమయ్యె నీ కతన ♦ బంధురమైన మదీయవంశము
జీవితుఁడయ్యె మత్పిత య ♦ శేష దిగంతములందు నెంతయున్
బ్రావృతమయ్యె నాయశ మ ♦ పారగుణాకర యెల్లలోక సం
భావనఁ గాంచి మించితి న మానుషశక్తి వహించితియ్యెడన్.

క॥ మామక తపోమహీరుహ మీ మెయిఁ ద్వద్రూపమగుచు ♦ నెసఁగు ఫలంబుల్
ప్రేమంబున నాకొసఁగుట కామారియనుగ్రహించె ♦ కారణముగదా.

చ॥ నిరత శివార్చనారతి ము ♦ నిప్రకరంబు నుతింప వెల్గునిన్
బరమునిఁ బుత్రుఁగాఁ బడయు ♦ భాగ్యము గల్గుటఁజేసి నాయెడన్
దురిత లతాలవిత్రుఁడగు ♦ ధూర్జటి యక్కటికంబుఁ దాల్చి యీ
కరణిఁ గృతార్థుఁజేసె నొడి ♦ కంబున నన్నొక పెద్దఁజేయుచున్.

తే॥ సుమము కారణమున ♦ నూత్రంబు నొదలఁ దాల్చునట్లు నీక ♦ తమున నన్ను
గారవించె నిట్లు ♦ గాలకంఠుండు నా భాగ్య మిట్టిదనుచుఁ బలుకఁదగమే.

చ॥ కుల మభివృద్ధిఁజేయుటకుఁ ♦ గోవిదరత్నమ నిన్ను వంటివాఁ
డిలనొకయండు పుత్రకుఁ డ ♦ హీన గుణాఢ్యుఁడు చాలకుండునే
పలువురు గల్గనేమి కుల ♦ పాంసనులై తమతండ్రి కీర్తిన్
గలుషముఁజేయువారు కొఱ ♦ గాని పనుల్ బచరించువారికన్.

క॥ నందనుఁడవైన కతమున నందనుఁడనయితిని నేను ♦ నాయెడ గిరిజా
నందితుఁడు కరుణఁగాంచెను నందీశ్వరమనుమ చిరము ♦ నందించు చిలన్.

—నందికేశ్వర వివాహము—

చ॥ అని మఱియేదియో పలుకు ♦ నట్టి యెడన్ నను స్నేహబద్ధలో
చనములఁ గాంచువారలు ప్ర ♦ శాంతమనస్కులనైనవారు మ
జ్జనకుని సుప్రలాపముల ♦ సంతసమొందెడువారు చండ శా
సనులు మరుత్తులీశ్వరుని ♦ సన్నిధి మెల్లనఁజేరి భక్తిమై.

చ॥ కరముల మోడ్చి మ్రొక్కి సితి ♦ కంఠయనాధ శరణ్య సత్కృపా
భరణ సమస్తలోక పరి ♦ పాలన దక్షయశేష మౌనిరా
డ్వర వినుతాంఘ్రి పంకజ సు ♦ వర్ణ ధరాధర చాప చంద్రశే
ఖర భవపాశమోచన య ♦ కారణ బాంధవ శైల జాధవా.

ఉ॥ ఏము భవత్కృపాకలన ♦ నెంతయు ధన్యులమైతి మద్రిజా
కాముక తావకీనపద ♦ కంజరుహంబులఁ గొల్చు వారి కీ
భూమి నసాధ్యమున్నె పరి ♦ భూతములై నశియింపకుండునే
బాములు శైవులై యలరు ♦ వారికి నూరక రాదె ముక్తియున్.

ఉ॥ ఏపరమేశు సత్కరుణ ♦ నెల్లజగంబులు మేలుగాంచుచున్
బాపచయంబునుండి విడి ♦ పాటి యజస్రము ముక్తి కాంత బా
హాపరిరంభణంబుల సు ♦ ఖాప్తిని జెంది చెలంగుచుండునే
మా పరమేశు నిన్ను విన ♦ యంబునఁ గొల్తుము సుందరేశ్వరా.

ఉ॥ ఓయయుడు రాజశేఖర గు ♦ ణోన్నత యెట్టి కృపన్ వహించి యీ
ధ్యేయుని నందికేశ్వరు న ♦ హీనచరిత్రు గణాధినేతఁగా .

జేయదలంచినాఁడవో య ♦ శేష సురాసురలోక కామ్యమా
నా యకలంకమైన కృప ♦ కహర్నల మాదుము కాదె యేమిలన్.
చ॥ వినయసమేతుఁడంచుఁ బృథివీధరమున్ భరియింపఁజాలు వాఁ
డని యఖిలేశ్వరత్వమును ♦ నంచిత భోగముఁ గూర్చి నాఁడ వీ
యనఘున కింక నేమికొఱ ♦ యో జగదీశ్వర మమ్ము వంటి భ
క్తనికర మీ కృపాళునకుఁ ♦ గానిక లేవి యొసంగ నేర్తునే.
చ॥ అతుల యశః పరీవృత ది ♦ గంతరుఁడైన శిలాదసూతి యు
న్నత భుజమండలాగ్రమున ♦ నాయకరత్నముఁ బోని వెల్గు నీ
క్షితి తల రాజ్యలక్ష్మికి సు ♦ శీలకుఁ దానుసపత్నియైన మా
సుతనుయశాఖ్య యెంతయు వి ♦ శుద్ధచరిత్రయగున్ గదా ధరన్.
చ॥ అకుటిలుఁడైన భక్తుని హృ ♦ దంబుజమీశ్వరునందలీనమై
న కరణిఁ జారుశీల సుగు ♦ ణ ప్రకరాన్విత మస్మదీయ పు
త్రిక హృదయంబు సంతతము ♦ ధీనిధి యీ గణనాథుఁ జేరి ని
ర్వికలతఁ గాంచి మించె సుర ♦ బృంద సమర్చిత ప్రోవ వేదయన్.
తే॥ ప్రథమ వర్షోదక జలంబు ♦ ప్రవిలమగు శుక్తి పుటమునఁ బడి శుద్ధ మౌక్తికత్వ
మును వహించినరీతిఁ బూఁ ♦ బోఁడి యర్హుఁడైన పురుషుని కతమున ♦ యశముఁ గాంచు
మ॥ చిరకాలంబున నుండి మా తనయ స్వ ♦ శ్రీనేతయౌ నందికే
శ్వరుఁ బాణిగ్రహణంబుఁ జేయుటకునై ♦ వాంఛించుచున్ శైలజా
చరణాబ్జంబులఁ గొల్చుచున్నయది వి ♦ శ్వాసంబునన్ జేసి స
త్కరుణాదృష్టి ననుగ్రహింపఁ గదె వి ♦ ద్వల్లోక సంసేవితా.
చ॥ అనఘుఁడు శైలరాజు నిను ♦ నల్లునిఁ గాఁగొని గట్లవంగడం
బును దరియింపఁజేయు గతిఁ ♦ బూనికనే మును నీ మహాత్మున
ల్లునిగ గ్రహించి మా కులను ♦ లోకమునన్ బరిపూతమౌ విధం
బున నొనరింపఁగోరెదము ♦ భూత పతీ కరుణింపవే యిఁకన్.
తే॥ అర్హమైన పాత్ర ♦ మందు నిడిన దాత సంతసించువటుల ♦ సంతతంబు
నందికేశ్వరునకు ♦ నందన నిడి యేము కృతులమగుదుమింకఁ ♦ గీర్తిఁ గాంచి.
తే॥ కారణాంతరమునఁ ♦ గన్నెకుఁ దగినవరుండు సంభవింప ♦ కుండు నేని
జనయితలకుఁ గలుగు ♦ వనట యింతని చెప్ప నలవియగునె బ్రహ్మ ♦ కైనఁగాని.
మ॥ తమ ప్రాణంబులకెల్ల నెల్లయని ని ♦ త్యంబర్థితోఁ బెంచుచున్
రమణీయోజ్జ్వల రూపయౌవనములన్ ♦ రాజిల్లు కన్యాలలా
మము నర్హుండగు వానికిచ్చినఁ గదా ♦ మాతాపితల్ ధాత్రి ను
త్తమ లోకస్థితిఁ గాంచఁగల్గుదురనం ♦ తాభక్త సంరక్షకా.
మ॥ అతిలోకోన్నత కీర్తిశాలియయి స ♦ ర్వారాధ్యుఁడై సంతత
స్తుతిపాత్రుండయి శాంతచిత్తుఁడయి యు ♦ ద్ధూతాఘుఁడౌ వాని కా

తతభక్తిఁ సుతనీయఁగల్గినఁగదా ♦ ధన్యుండవగుచున్ లోకమా
న్యతఁ గాంచుచు బురుషుండు వంశము ప్రతి ♦ ష్ఠావాలమై యొప్పఁగన్.
చ॥ సుగుణ పయోధి మాతనయ ♦ సూరిజన స్తవనీయుఁ డీ ఘనుం
డగణిత కీర్తివంతము శి ♦ లాదముని ప్రవరాన్వయంబు లో
క గురువులై మహోన్నతినిఁ ♦ గాంచినవారు మదీయ పూర్వు లీ
తగిన వివాహ మెల్లరకుఁ ♦ దద్దయు మోదముఁ గూర్చు నెంతయున్.
క॥ కావున మాకన్నియ నీ పావన చిత్తునకు ధర్మ ♦ పత్నిగఁ జేయం
గా వలతుము మాయెడఁ గృపఁ గావింపుము సకలలోక ♦ కారణ గిరిశా.
మ॥ అని ప్రార్థించు మరుద్గణంబు దెస నా ♦ ర్యా నాయకుం డాదరం
బున వీక్షించుచు దోష మేమి యటులే ♦ భూతేశ్వరుండైన యీ
తనికిన్ మీ సుత నీఁదలంచుటయు మో ♦ దంబే యగున్ నాకుఁ బా
వనమూర్తుల్ గద మీరు మీ విమల సం ♦ బంధంబు సామాన్యమే.
క॥ తమయంతఁ దామె వచ్చి ముదమునన్ సుత నిత్తుననినఁ ♦ దగదనక మహిన్
విమలమతి గ్రహించుట శ్రేయమనిరి దైవజ్ఞులైన ♦ యట్టి మునీంద్రుల్.
తే॥ ఎల్లలోకముల క ♦ ధీశ్వరుండగుటయు ననఘులైన మీకు ♦ నల్లుఁడగుట
యును శిలాదసూతి ♦ యొనరించు తొలిపున్నియంబె యనుచుఁబల్క ♦ నగును గాదె.
చ॥ వరుఁడిదె యహా యౌవన వి ♦ భాసితుఁడై కనుపట్టుచున్న వాఁ
డరయఁగ నిందు రాఁదగిన ♦ యట్టి మహామునులెల్ల మున్నె వ
చ్చిరి యభిజిన్ముహూర్తమిది ♦ శీఘ్రము మీ సుతఁ దోడితెచ్చి వే
గిరమ వివాహకార్యము ము ♦ గింపుఁడు ధాతయు సాయమయ్యెడున్.
వ॥ అని భగవంతుండగు శశాంకశేఖరుఁడు కరుణాళుండై పలికినప్పుడు మరుత్తుల పం
పున నరుంధతీ ముఖ్యసువాసినులరిగి.
తే॥ ప్రథమ వర్షర్తున్ జలద గ♦ర్భంబులోన మించుమించు హసించెడి♦మెఱుఁగుదాని
మేలిమి ముసుంగులోపల♦మెఱయుదాని సుయశఁగొనివచ్చి రప్పుడా♦సుదతులెల్ల.
తే॥ మానిపత్నులట్ల ♦ మామకాధాంగఁగానున్న సుయశఁదెచ్చి ♦ యొక్కచోఁట
వృద్ధసతులనడుమ ♦ విడిదిసేయించిరయ్యన్నుమిన్నఁ గాంచి ♦ యబ్బురమున.
క॥ అద్దిర యిమ్మద్దియకిల నుద్దియయిన ముద్దుగుమ్మ ♦ యొక్కతె గలదే
పెద్దతడవు పూనికలేకిద్దీని సృజింప నేర్చు ♦ నేవిధియిటులన్.
తే॥ కలికి నిట్టి సోయ ♦ గముగలదానిఁగ సృష్టిసేయనేర్చి ♦ సృష్టికర్త
కొమ్మ చక్కఁదనముఁ ♦ గూర్చి పల్కఁగనాకు వేయిముఖములేల ♦ యీయఁడయ్యె.
చ॥ తరుణియొకింత నూర్ధ్వముఁగ ♦ దల్చునయే జిలునవ్వు వెన్నెలల్
పరఁగువెడందకన్నుల వి ♦ లాసము మోసముఁ జేసె డెందమున్
చరణసరోరుహద్వయము ♦ సంగతిలత్తుకఁబూసినట్టులై
సరణి చెలంగె నీ పగమ ♦ సాధ్వి కరంబు గ్రహించుటహా హా.

వ॥ అని తలంచుచున్నయెడ లోకమాతయగు లక్ష్మియు, వాగ్దేవి శారదయు, సుయశో
నలంకరించి రంత నీశ్వరానుమతిఁ బరమేష్ఠి దైవజ్ఞుఁడై మాయిరువుర కుద్వాహంబుఁ
గావించె. నేనును బరమభక్తుఁడనై యీశ్వర సాన్నిధ్యంబు వీడక సుయశఁ
గూడి వివిధ సుఖంబు లనుభవించుచు నప్పుడప్పుడు జనకుని గాంచుచుంటిని. కావున
నీవును నిర్మలభక్తి నీశ్వరు సేవింపుము. భక్తిచే సాధింపరాని దొండు గల్గునే
యని శైలాది సనత్కుమారునకుఁ జెప్పెనని చెప్పి పాతాళాది లోకంబుల నెఱిఁ
గించువాఁడై సూతుం డిట్లనియె.

## —పాతాళాది లోకంబులు—

సీ॥ భవునాజ్ఞ భూర్భువ • స్స్వర్మహోజనతపస్సత్య పాతాళాది సకలలోక
రాజి యుఁదారకా•గ్రహసోమ భాస్కర ధ్రువ సప్తఋషి మండ•లవితతియును
జనియించునిది సుంత • యు నెఱుంగ నేరరు మూఢాత్ములగువారు • మోహితులయి
పరమేశ్వరు శరీర • భాగంబె యీ జగత్రయము గణింపంగఁ • దథ్యముగను
పృధివి మొదలగు లోకంబు • లేఁడు నండజములు వీనికిఁ గ్రింది దే • శంబునందు
నలరు సప్త తలంబులు • నతలవితల సుతల ముఖ్యంబు లవి సూరి • నుతములరయ.

వ॥ సర్వరత్నంబులచేతను, నిర్మలంబులును విచిత్రంబులును నగు శివాలయంబుల
చేతను హేమతలంబును మహాతలంబును బ్రకాశించు. వానియం దనంతుండును
ముచుకుందుండును బలియు వసింతురు. శైలమయంబు రసాతలంబు, తలాతలంబు
శాంకరంబు, సుతలంబు శీతంబు, వితలంబు విద్రుమ ప్రభంబు అతలంబు సితంబు,
తలంబు సితేతరంబును యొప్పు.

తే॥ సర్వశోభాయుతము విరో • చనహిరణ్యా నయన నరకాది సేవితం • బయి తలాత
లంబు వెలుగొందు నిల సుత • లంబు కాలనేమి ముఖ రాక్షసులతోడ • నెగడుచుండు.

వ॥ తారకాగ్ని ముఖ దానవ నికాయంబుతోడను, మహాన్తకాది నాగంబులతోడను
వితలం బలరు. మహాకుంభుండను వీరుఁడును, ధీమంతుండగు హయగ్రీవుండును,
శంకుకర్ణుండును నముచి మున్నగు వీరులును సుతలంబున నివసింతురు ఈ యెల్ల
తలంబులయందుఁ బరమేశ్వరుండు పార్వతియు నందీశ్వరుండును భూతగణంబులును
గొలువ నివసించు.

## —ద్వీపేశ్వర కథనము—

తే॥ సప్తసాగరములతోడ • సకలనదులతోడఁ బర్వతసంతతి • తోడఁ గూడి
పుడమియలరు సప్తద్వీప • ములను గూడి యఖిల దేవర్షి సన్నుత • మగుచు నెపుడు.

వ॥ జంబూప్లక్ష శాల్మలికుశ క్రౌంచశాక పుష్కరంబులను నామంబులు గలిగి సప్త
ద్వీపంబు లలరు.

తే॥ వివిధవేషంబులఁ బూని • విమలమతులు భూతగణములు సేవింపఁ • బురహరుండు
ద్వీపసప్తకమున నొప్పు • దీనలోక రక్షణము సేయఁగోరి • నిరంతరంబు.

వ॥ క్షారోదంబును నిక్షురసోదంబును, సురోదంబును, ఘృతోదంబును, దధ్యర్ణవంబును, క్షీరోదంబును, స్వాదూదంబును, ననసాగరంబు లేడు విధంబుల నొప్పు.

సీ॥ క్షీరార్ణవంబునఁ • జేరి శివజ్ఞానబుద్ధిచే వెన్నుఁడె • ప్పుడును యోగ
నిద్ర వహించునా • నీరజనేత్రుండు మేలుకువఁ గాంచ న • ఖిల జగంబు
లలరు సుప్తుండగు • నపుడు లయము నొందు సృష్టి స్థితి లయముల్ • సేయునతఁడె
సనకాది మౌనులా • యనఘుని సేవించి చిజ్జ్ఞానమును జెంది • చెలఁగుచుండు
ఎల్లద్వీపంబులందును • నెసఁగు నున్నతంబులగు పర్వతంబులు • డంబుమీఱి
కాలగౌరవమునఁ జేసి • లీలధరణిపతులయిరి కొండలుత్తముల్ • ప్రాజ్ఞతములు.

వ॥ అతీతానాగతంబులగు సర్వమన్వంతరంబులఁ గుమారజనకుండగు నీశ్వరు సామర్థ్యంబున ధరిత్రీపాలనంబుఁ గావించిన నారనేకులు గలరు.

క॥ స్వాయంభువమన్వంతర మీయవనీతలము నేలి • రిద్ధచరిత్రుల్
స్వాయంభువు పౌత్రులు లసదాయతబాహులు విరోధి • హంతలు భక్తిన్.

వ॥ ఆగ్నీధ్రుండును, నగ్నిబాహుండును, మేధసుండును, మేధాతిథియు, వసువును, జ్యోతిష్మంతుండును, ద్యుతిమంతుండును, హవ్యుండును, సవనుండును, వపుష్మంతుండును. ననఁ బ్రసిద్ధులగువారు పదుగురు స్వాయంభువ మౌని పౌత్రులును, బ్రియవ్రతుని పుత్రులును నైరి. వారిని గ్రమంబునఁ బ్రియవ్రతుండు జంబూద్వీపంబున కగ్నీధ్రుని, ప్లక్షద్వీపంబునకు మేధాతిథిని, శాల్మలంబునకు వపుష్మంతుని, కుశద్వీపమునకు జ్యోతిష్మంతుని, క్రౌంచద్వీపంబునకు ద్యుతిమంతుని, శాకద్వీపంబునకు హవ్యుని, బుష్కరద్వీపంబునకు సవనుని బరిపాలకులుగ నియమించిన

తే॥ పుష్కరద్వీపనాథుండు • పుడమినెల్ల నల్లకల్లోలముగఁ జేయ • కహారీతి
న్యాయముగఁ బరిపాలన • సేయుచుండె సాటివారలలోఁ గడు • మేటియగుచు.

క॥ ఆతనికి మహావీతుఁడు ధాతకిని నా నలరువారు • తనయు లిరువురు
ద్యోతప్రతిభాశాలురు వీతస్పృహు లుదయమైరి • విక్రమధుర్యుల్.

క॥ ఘనుఁడు మహావీతుం డేలిన పుష్కరభాగమునకు • లీల నతని యా
ఖ్య నలరెను మహావీతంబనఁగ జగన్నుతమగుచు బు • ధావళి వొగడన్.

క॥ ధాతకి యేలిన ఖండం బాతని పేరిటఁ దనర్చు • నతులితమగుచున్
ధాతకి నాఁగ నృపాల వ్రాతంబులు వినుతి సేయఁ బ్రథితంబగుచున్.

వ॥ శాకద్వీపేశ్వర ప్రభుండగు హవ్యునకు జలదుండును గుమారుండును సుకుమారుండును మణీచకుండును కుసుమోత్తరుండును మోదాకియు మహాద్రుముండును ననఁ బ్రసిద్ధు లేడుగురు పుత్రులు గలిగిరి.

క॥ ఘనమతులు జలద ముఖ్యులు మునుకొని శాఖాంతరీప ♦ మును వేర్వేరన్
జనకుననుజ్ఞను బాలన మొనరించిరి భూలపూర్వ ♦ ముగ నెల్లెడలన్.

తే॥ ప్రబలమతులు వారు ♦ పాలించినట్టి భాగములువారి పేర ♦ ఘనతఁ గాంచె
శిష్టరక్షణంబు ♦ దుష్టనిగ్రహము ముఖ్యములుగఁ దనరె ♦ భూపతులకు.

వ॥ జలదుండు పాలించిన ఖండమలదనునియుఁ గుమారుండు పాలించినది కౌమారంబనియు సుకుమారుండు పాలించినది సుకుమారంబనియు మణీచకుండు పాలించినది మాణీచకంబనియుఁ గుసుమోత్తరుండు పాలించినది కుసుమోత్తరంబనియు మోదాకి పాలించినది మోదకంబనియు వినుతిఁ గాంచె.

సీ॥ క్రౌంచాంతరీప వి ♦ ఖ్యాతుఁడౌ ద్యుతిమంతునకుఁ గల్గి రాత్మజు ♦ లకుటిలాత్ము
లనఘులు కుశలుండు ♦ మనుగుఁడు ష్ణుండు పీవరుఁ డంధకారకుఁ ♦ డరయమునియు
దుందుభియనువారు ♦ ధూర్వహుల్ వేరుగ ఘనులు వారేలిన ♦ క్రౌంచభాగ
ములు ధర్మదేవతా ♦ మోదావహములయి పూర్వరాజన్య సం ♦ పూర్ణకీర్తి
కాభరణములఁ గూర్చుచు ♦ నలరువరుస వారి సంజ్ఞల నాచంద్ర ♦ తారకంబు
శైవలోక ప్రసిద్ధియు ♦ సకలశాస్త్ర గౌరవంబును వెలయని ♦ ష్కంటకముగ.

వ॥ ఉద్భిదుండును, వేణుమతుండును, ద్వైరథుండును, లవణుండును, ధృతియుఁ, బ్రభాకరుండును, గపిలుండు ననువా రుదయించి జ్యోతిష్మత్పాలితంబగు కుశద్వీపంబున వారివారి నామంబులుగల ఖండంబుల నేర్పరించి పరిపాలించిరి. శ్వేతుండును హరితుండును, జీమూతుండును, రోహితుండును, వైద్యుతుండును, మానసుండును, సుప్రభుండును, నను వారేడ్వురు శాల్మలేశ్వరుండగు వపుష్మంతున కుదయించి యా ద్వీపంబున వారి నామంబులు గల ఖండంబులఁ బాలించిరి. శాంతుండును భయుండును, శిశిరుండును, సుఖోదయుండును, నానందుండును, శివుండును ధ్రువుండునను వారేడ్వురు ప్లక్ష ద్వీపాధిపతియగు మేధాతిథికి జనియించి యా ద్వీపంబు నేలిరి.

—భారతవర్ష వర్ణనము—

మ॥ సతతాఖండల వైభవుండయి శి ♦ వార్చాలోలుఁడై ధీరుఁడై
ప్రతిపక్ష ప్రకరాంతకుండయి శుభ ♦ ప్రారంభుఁడై యా ప్రియ
వ్రతుఁ డగ్నీధ్రు ననంత తేజుని కృపా ♦ పాఠీణు సత్యవ్రతా
ప్లుతు శిష్టున్ నియమించె రాజు గను జం ♦ బూద్వీపమందర్థిమై.

క॥ ఆ రాజర్షికిఁ గలిగిరి చారుచరిత్రులు ఘనులు ప్ర ♦ జాపతి సదృశుల్
శూరులు తొమ్మండ్రుగురు ధరారమణీకమను లఖిల ♦ రాజన్యనుతుల్.

వ॥ వారును నాభియుఁ, గింపురుషుండును, హరియు, నిలావృతుండును, రమ్యుండును, హిరణ్మంతుండును, కురుండును, భద్రాశ్వుండును, కేతుమాలుండును, ననఁగ వెల

గీ.ని. అందు నాభికి దక్షిణంబగు హైమాఖ్య వర్షంబును, గింపురుషునకు హేమ కూటంబును, హరికి నైషధంబును, నిలావృతునకు మేరువును, రమ్యునకు నీలాచలా శ్రితంబును, హిరణ్మంతునకు నుత్తరంబగు శ్వేతవర్షంబును, గురునకు నుత్తరశృంగ వర్షంబును భద్రాశ్వునకు మాల్యవద్వర్షంబును, గేతుమాలునకు గంధమాదన వర్షంబును నొసంగి

మ॥ అరిషడ్వర్గము గెల్చి నిర్విషయుఁడై • యగ్నీధ్ర భూపాలుఁడ
ధ్వరముల్ సెక్కులొనర్చి దక్షిణల వి • ప్రశ్రేణికిన్ దృప్తిఁ గూ
ర్చి రసాధీశుల యందు మిన్నయయి గౌ • రీనాథు నర్చించుచున్
నిరతం బాత్మజులందు రాజ్యమిడి మా • నిత్వంబుఁ గాంక్షించుచున్.

చ॥ అపహృతలోక భారుఁడయి • యన్నరపాలవరుండు సత్తపో
వ్యపగత కిల్బిషుండగుచు • నవ్యయనాభిరతిన్ జరించి యీ
శపద సరోజ చింతనమె • స్వాంతమునన్ బొనరించుచున్ లస
త్కృప శ్రితరక్షకుండగుచుఁ గీర్తి గడించె దిగంతరంబులన్.

సీ॥ అరయఁ గింపురుషాది • యైన వర్షాష్టకం బనఘమై సకల శు • భాన్వితమయి
యలరు వాననుసిద్ధి • యతి సుకరంబగు నందు విపర్యాస • మావహిల్ల
దురు జరామృత్యు భ • యోపేతులున్ గాక నిరతసుఖంబుల • నెగడుచుంద్రు
తలఁప ధర్మాధర్మ • ములు గానగా వుత్తమాధమమధ్య మా • ఖ్యాకములగు
దశలుగలుగ వెపుడు • పశుపతి క్షేత్రంబులందు వృతిని గాంచి • నట్టి వార
లచటఁ జేరుచుంద్రు • హరుఁడు వారి హితంబుకొఱకు సృష్టిఁజేసెఁ • గోరివాని.

క॥ ఆయ్యెనిమిది క్షేత్రంబుల నెయ్యంబున సంచరించు • నిఖిలేశ్వరుఁడా
పయ్యెరయయ్యసికగఁ గలదయ్యంబు నిరంతరంబుఁ • దద్దయుఁ గరుణన్.

క॥ అష్టక్షేత్రేశ్వరుహరు స్పష్టంబగు భక్తిఁ గొల్చు • వానికి సతతం
బష్టైశ్వర్యంబు లొసఁగి కష్టంబులనుండి పాఁచుఁ • గా మారి కృపన్.

తే॥ నాభికుదయించె ఋషభుఁడ • నంగఁ బరఁగువాఁ డఖిలరాజలోక సం • భావితుండు
వానికుదయించి గాథ్యులౌ • వారు నూఱుగుఱు సుతులు మిత్రసన్నిభుల్ • శోభిమలయి.

—భరతుడు పుడమి భావించుట—

క॥ ఆందగ్రజుండు భరతుఁడ మందప్రజ్ఞుండు లోక • మాన్యుఁడు నిరతా
నందుఁడు చందన సదృశా స్పంద విమలకీర్తియగుచు • భాసిలు నెందున్.

క॥ పురుషర్షభుండు ఋషభుఁడు భరతు నెడన్ సకలరాజ్య • భారమునిచి యీ
శ్వర సేవానిరతుండై యరిగె వనంబునకు మాను • లబ్బుర మొందన్.

ఉ॥ ఆ నరనాథమౌళి యిటు • లాత్మజునందు సమస్త భారముక్
బూనికనిల్పి యింద్రియ స • మూహముఁ గట్టడఁజేసి యెంతయుక్
జ్ఞానియు నగ్నుఁడుక్ జటియుఁ • గల్మషహారియుఁ ద్యక్తసంశయుం
డై నగజామనోహరు ద • యామయుఁ గొల్చుచునుండె భక్తిమై.

మ॥ నిరహంకారుఁ డనంతకీర్తి ప్రబలా • నీకేశ్వరుండాశ్రితా
మర భూమీరుహ మగ్రజావనుఁడు, స • మ్మాన్యుండు శూరుండునై
భరతుండేలె హిమాద్రి దక్షిణమహా • వర్షంబు హర్షంబునక్
సురలందుక్ ద్విజులందు భక్తిమెయి సు • శ్లోకుల్ మదిక్ మెచ్చఁగక్.

క॥ భరతుని పరిపాలనమున ధరణి యనావృష్టి ముఖ్య • దారుణబాధా
విరహితయై సురహితయై సురుచిరగతి నలరె నిఖిల • నూరులు వొగడక్.

సీ॥ దారిద్ర్య మింతుల • తనుమధ్యములందఁ గుటిలత కామినీ • కుంతలములఁ
జాంచల్యమతి వల • చారునేత్రములంద నైల్యమంగనల వే • నలులయంద
సుడివడియుండుట • సుదతుల పొక్కిళ్ళ నుద్ధతి సతుల ప • యోధరముల
మందగమన మర • విందాక్షుల నడలఁ గోపంబు తరుణుల • చూపులందు
గాక మఱి యెందు లేకుండఁ • గట్టుసేసి ధరణిఁ బాలించె భరతుండు • పరనృపాల
మకుట కోటికిరీట ర • త్న కిరణౌఘ హారి పదపంకజద్వయుఁ డై రహించి.

చ॥ నిరత వియోగ ఖిన్నలగు • నీరజనేత్రలఁగూడి కుండలీ
శ్వరుఁడు ముదంబుఁ జెందెను ర • సజ్ఞుఁడు కూర్మవిభుండు కామినీ
పరివృతుఁడై చరియించె సుఖ • బంధురులైరి కరీంద్రులెల్ల రా
భరతుఁడు ధారుణీతలము బాహువులక్ ధరియించి యుండుటక్.

మ॥ తనరెక్ ధర్మము నాల్గుపాదముల వే • దంబుల్ ప్రమాణంబు ల
య్యెను శాస్త్రాధ్యయనంబు లెల్లెడల నెం • తే వృద్ధిఁగాంచెక్ రహిం
చెను శీలంబును సత్యముక్ శుభము మిం • చెక్ శూరలోకస్తుతుం
డనఘుండా భరతుండు భూతల మని • ర్వ్యాజంబునక్ బ్రోవఁగక్.

చ॥ ధరణి యొసంగె సస్యములఁ • దద్దయుఁ గపర్కు లబ్బురంపడక్
దరు నిచయంబు పండెను ల • తానికరంబు సుగంధిపుష్ప బం
ధురమయి యొప్పె లోకము వి • నూతనశోభ వహించిమించె నా
భరతుఁడు ధర్మబుద్ధిఁ బరి • పాలనసేయఁగ నెల్లదిక్కులక్.

తే॥ ఆఱుబుపుల ధర్మంబు • లలరెనొక్క తఱిని నెలమూఁడు వానలు•ధాత్రిఁగురి
నీతిబాధావిరహితులై • యెల్లజనులు నిత్యసుఖములఁ జెలఁగుచు • నెగడి రెలమి.

తే॥ ఐదు పదిసేసి యనదలై • యాశ్రయించు వారికెల్లను శరణమై • పౌరుషమునఁ
బోరు మొనకాండ్లగెల్చి దు•ర్వార విక్ర మాఢ్యుఁడై యేపుమీఱె న•య్యవనినేత

చ॥ అనృతముఁ బల్కువారుఁ బరి ♦ హాసమొనర్చెడివారు నేరముం
బొనరుచువారు దుర్విషయ ♦ బుద్ధిఁ జరించెడివారు లుబ్ధులై
ధనము గడించువారుఁ బర ♦ దారల గోరెడివారు ఘాతుకుల్
గనఁబడకుండ నేలె రిపు ♦ కంటకుఁడా భరతుండు ధారుణిన్.

సీ॥ స్నానసంధ్యాద్యను ♦ ష్ఠానపూర్వంబుగఁ దపములొనర్చెడి ♦ ధరణిసురులు
వివిధ ధనుర్వేద ♦ విజ్ఞులై ధరణీభ రంబు మాన్పఁగ నెంచు ♦ రాజసుతులు
ధర్మసహితబుద్ధిఁ ♦ దగు లాభముఁ గొని వ్యాపార మొనరించు వైశ్యవరులు
నమరద్విజారాధ ♦ నములఁ గృతార్థులై కర్షకులైన జ ♦ ఘన్యజులును
నిరతగురుకులవాస ని ర్ణిద్రులగుచు బ్రహ్మచర్యాశ్రమ వ్రత ♦ భాసితులయి
యలరు విద్యార్థులును గల్గి ♦ యలరుచుండె భరతరాజ్యంబు ధర్మ సం ♦ భరితమగుచు.

క॥ ధీరుఁడు భరతుఁడు నేసిన ధారుణి రాజ్యంబు భార ♦ త సమాఖ్యంబై
సూరిజనస్తుతమై యలరారె స్మరణమాత్ర సంహృ ♦ తాఘంబగుచున్.

క॥ ఆరాజకుల శశాంకు డుదారుని సుమతియను వానిఁ ♦ దనయునిఁ గాంచెన్
స్ఫార యశోమండల విజితారాతి బలున్ సమర్చి తాంధక వైరిన్.

క॥ ధరణీరాజ్యంబంతయు భరతుఁడు సుమతియెడనిల్పి ♦ బంధురభక్తి
స్ఫురణన్ శంకరపూజా పరుఁడై వనమునకుఁ జనియె ♦ వార్ధకమందున్.

## — మేరుపర్వతాది వర్ణనము. —

వ॥ వివిధమణిమయ శృంగరాజితంబును; చతురాశీతి సహస్ర యోజనోత్సేధంబును ద్వాత్రింశత్సహస్రయోజన పరిమిత మూర్ధంబును లక్షయోజనాయామంబును నగు మేరుపర్వతం బీ ద్వీపంబునకు మధ్యంబున నలరు. మఱియు నమ్మహా పర్వతంబు పూర్వంబునఁ బద్మరాగ ప్రభంబును దక్షిణంబున హేమసన్నిభంబును బశ్చిమంబున నీలమణి సంకాశంబును నుత్తరంబున విద్రుమప్రభంబునై ప్రకాశించు.

క॥ ఆమ్మేరు గిరికిఁ బ్రాగ్భాగమ్మున నమరావతి యను ♦ కమనీయ పురం
బిమ్మహి నలరును నఖిలపురమ్ముల నుత్తమము నగుచు ♦ రాజిలుచెపుదుర్.

## — మేరుపర్వతస్థ దిక్పాలక పురవర్ణనంబు —

సీ॥ ప్రబల నానావిధ ♦ ప్రాసాదకలితంబు విమలగోపురనిక ♦ రమహితంబు
కాంచన చిత్రిత ♦ ఘనతోరణాఢ్యంబు రత్నఖచిత జాల ♦ రాజితంబు
సకల నిర్జరలోక ♦ సముదయాకీర్ణంబు సౌవర్ణకుట్టిమ ♦ స్థలయుతంబు
స్ఫటిక మణిమయ సో ♦ పాన విభ్రాజిత మణుల వితాన సం ♦ తతి లలితము

విమల భాగీరథీ దివ్య • వీచికాస మాగతాంబు కణనిచయ • వ్యాప్తనిఖిల
దిక్చయంబవధీరిత • త్రిపురవితతియగుచు నమరావతీ పుర • మలరునెపుడు.

క॥ స్తనభారవినమ్రలగుచు ననుపమ హేమమయ భూష • ణాంచితలగుచున్
ఘనలజ్జాపరవశలై యనిమిష కాంతలు వసింతు • రన్నగరమునన్.

చ॥ కరములు సాచి వారణ ని • కాయము సాయములందు స్వర్ణదీ
సరసిజముల్ పెకల్చి యతి • చంచలతన్ బయికెత్తి నంత న
చ్చర చెలులందుఁ గూరిమి పొ • సంగిన హస్తిపకుల్ గ్రహించి చా
తురిమెఱయంగ సంతురు కు • తూహలచిత్తులరై పురంబునన్

తే॥ మద విఘూర్ణిత నేత్రలా • మత్తకాశినులఁ గలిసి ప్రొద్దుగ్రుంకు వే • ళల సతంబు
త్రిదశ సంతతి యమర న • దీతటాగ్ర సైకతంబులఁ గ్రీడింత్రు • సంతసమున.

తే॥ అలరు తేజస్వినీ సమా • ఖ్యనువహించి పావక పురంబు కాంచన • పర్వతమున
కగ్నిదిక్కున నమరాల • యంబుఁబోలి చూడఁదగియుండు మేడల • తోడఁగూడి.

తే॥ అమ్మహాశైల రాజంబు • యామ్యదిశను చెల్లఁగు వైవస్వతియనంగఁ • జెన్నుమీఱి
యమపురము స్వర్ణసౌధ స • మన్వితంబు పాపిజన భీకరంబు భ • యప్రదంబు.

తే॥ నైఋతంబునఁ గృష్ణవ • ర్ణయగు శుద్ధవతి యనెడు నగి కర్బురు • పట్టణంబు
వరుణదిక్కున నలరు నా • వరుణపురము గంధవంతి యనెడు సమా • ఖ్యన్ జెలంగి.

తే॥ శోభనాఖ్య నొప్పు • సురపుర మట్టుల వాయుపురము గిరికిఁ • బశ్చిమమున
యక్షనాథు నగర • మలరు మహోదయ సంజ్ఞ నుత్తరమున • శైలమునకు.

వ॥ ఈశాన్యంబున యశోవతియను నీశానపురంబలరు.

చ॥ హరిహరపద్మసంభవుల • యా యతనంబులతోడ ప్రీ ఖ్రిణో
త్కరములు సర్వభోగములు • గల్గి సురాసుర యక్ష సిద్ధ కి
న్నర గరుడాలయంబులు గ • ణ ప్రకరంబుల కున్కిపట్టులున్
దిరమయి యొప్పు మేరుగిరి • దివ్యపదంబయి కీర్తనీయమై.

తే॥ పర్వతోపరితలము న • స్ఫటికరచితమైన యొక్క సింహాసన • మలరు దాన
హరుఁడు దేవియు స్కందుండు • ననుసరింప సతత మాసీనుఁడైయుండు • సంతసమున

తే॥ హరికిఁ బద్మభవున • కట్టివె సింహాసనములుగలవు వార • నవగతంబు
వానియందుఁ జేరి • భక్తిపూతులగుచు హరునిఁ గొల్చుచుందు • రాత్మలందు.

తే॥ ఛాత్రసహితులగుచు • సనకసనందన ప్రముఖులైన మునులు • భర్గుఁగొల్తు
రన్నగంబుఁజేరి • యది యోగమునకును భోగమునకు జన్మ • భూమిసుండు.

తే॥ పర్వతోన్నతమైన యా • స్వర్ణభూధరమున బాలార్కకోటి ని • భమయి యలరు
నందికేశ్వర సింహాస • నంబు దానసుయశతోఁ గూడియు శిలాద • సూతియుండు.

వ॥ వెండియు నమ్మేరుపర్వతాగ్రంబునస్కంద గణేశ్వర వీరభద్ర ముఖ్యాలయంబు లనేకములు గలవు.

క॥ సదమల జలపూరితమై మృదుల సరసిజాకరమయి ♦ యొసఁగును జంబూ
నది యా గిరిమూలంబున విదితంబై సర్వదిశల ♦ వెలయుచు నెపుడున్.

వ॥ మఱియు నప్పర్వతంబు దక్షిణభాగంబున.

సీ॥ పృధ్వీధరంబు ♦ వ్యాపించి యనేక సహస్ర యోజన దీర్ఘ ♦ మై తనర్చి
వితతశాఖా పరివృత దిగంతంబయి వివిధ విహంగమ ♦ విలసితమయి
తరణికరముల సుం ♦ తయుఁ జొరఁగానీక దట్టంబులైన ప ♦ త్రములు గలిగి
హరునిఁ బూజింపఁగ ♦ నరుదెంచువారల శ్రమము హరింపంగ ♦ శైలరాజు
పానరిచిన చల్వపందిరి ♦ యనఁగవెలసి యఖిల కాల ఫలప్రద ♦ మై యనేక
భూతసేవితమగుచు జం ♦ బూమహీజ మొకటి రేకెత్తియుండు న ♦ త్యున్నతమయి.

తే॥ ఈశ్వరారాధనముఁ గోరు ♦ నెల్లసురలు కాచియుందురాదేవుని ♦ కనికరంబు
గలుగునంతకు నత్తరు ♦ ఫలములందిని యలరు జంబూనదీ జలం ♦ బులనుద్రావి.

వ॥ ఇంక నదీనద గిరీశ్వర సమన్వితంబును, నవఖండ యుతంబును మధ్యమ ద్వీపంబు నాఁబరగు జంబూద్వీపంబును, నవవర్షంబులను గుఱించి వక్కాణింతు నాలకింపుడు. లక్షయోజన విస్తీర్ణంబై జంబూద్వీపంబలరు. దానికి సమీపంబగు ప్లక్షద్వీపంబు ద్విలక్ష యోజనాయామంబును పంచాశత్కోటి యోజన విస్తీర్ణంబును సకలసము ద్రోపేతయు సప్తద్వీప సంయుతంబును లోకాలోకావృతంబునయి భూమి వెలయు.

## —నవవర్షాది వర్ణనము—

సీ॥ స్వర్ణాద్రి యుత్తర ♦ భాగంబునన్ నీలమనియెడు పర్వత ♦ మలరుదాని
యుత్తరదిక్కున ♦ నుర్వీధరము శ్వేతమనునదియును శృంగి ♦ యనెడు గిరియు
నలరుచునుండు స్వ ♦ ర్ణాద్రి రాజమునకుఁ బ్రాగ్భాగమున జఠ ♦ రంబు దేవ
కూటంబు నానొప్పు ♦ కుధరములు వెలయును దక్షిణంబున నిష ♦ ధంబు హేమ
కూట హిమగిరులును స్వర్ణ ♦ గోత్రమునకుఁ బశ్చిమ దిశ నలరు మాల్య ♦ వంతమను
గంధమాదనమనియెడు ♦ క్ష్మాధరంబునుత్తరాయతములు నయి ♦ యొప్పియుండు.

వ॥ ఈ సప్త పర్వతంబులు నొక్కొక్కటి నవసహస్ర యోజన పరిమాణంబులైయుండు ఈ హిమవత్సంబంధియగు వర్షంబు భారతవర్షంబు నాఁబడు. హిమప్రాయంబయినది హిమవంతంబనియు, హేమమయంబు హేమకూటమనియుఁ గీర్తింపఁబడు.

తే॥ అరయ బాలార్క సన్నిభ♦మై హిరణ్యబహుళమగుచును నిషధ♦పర్వతము వెలయుఁ
గనక గిరిసువర్ణాఢ్యమై ♦ క్రాలునాల్గు వర్ణములు గల్గి యాయతో♦ర్ధ్వ తలమగుచు.

తే॥ శ్వేతగిరి నీలవైడూర్య • సితహిరణ్మయంబగుచు వృత్తమై త్రిశృం • గాన్వితమం
శాతకుంభవంతమయి వి • శాలమగుచు నలరుగిరులందు ముఖ్యమై • యనవరతము.

వ॥ సప్తద్వీప విరాజితమగు భూభాగంబీ పర్వతరాజంబుల కతన స్థిరమై యుండు.

తే॥ అలరుఁ బ్రాగ్దిశమందర • మంతకాశ గంధమాదనమనియెడు • క్ష్మాధరంబు
పశ్చిమోత్తర దిశలందుఁ•బర్వతములు విపులము సుపార్శ్వమనునవి• వెలయుచుండు

తే॥ లలితవృక్ష సమాకీర్ణ • ములయి యివియ నాల్గు పర్వతములు నసం • తంబులగుచు
ద్వీపకేతువులగుచును • దేజరిల్లు వాని మహిమంబగణ్యమై • వఱలుచుండు.

తే॥ మందరాచల శిఖరంబు • నందు లంబమాన శాఖాశిఖరమయి • మహిత వృక్ష
మలరును గదంబ మనఁగను • నదియ కేతురాజమనఁగఁ దనర్చు వి • రాజితమయి.

వ॥ గంధమాదన శిఖరంబున దక్షిణద్వీపంబున కెల్లఁ గేతుప్రాయమై జంబూవృక్
బును, విపులపర్వత శిఖరంబున బశ్చిమద్వీప కేతువై యశ్వత్థవృక్షంబును సుపార్శ్వ
గిరి శిఖరంబున నుత్తరద్వీప కేతువై న్యగ్రోధంబునున్నెనలరు.

సీ॥ కననగుఁ దూర్పుది • క్కునఁ జైత్రరథమను వనము మిత్రేశ్వరం • బనెడుకొలను
తనరారు గంధమా • దనమను వనముండు షష్ఠేశ్వరంబను • సరసుయామ్య
దిక్కునఁ బడమటి • దెసను వైభ్రాజమౌ వనము వర్యేశ్వరం • బనెడు ప్రాచ
ప్రవిమలోత్తర దిశ • సవితృవనం బామ్రకేశ్వరంబనఁగ నిం • పె సఁగుసరసి

యలరు సర్వకాలర్తుకం • బులయి రమ్యములును నిర్మలములునయి • మునిజనాశ్రి
తంబులగుచు నజస్రమో • దంబుఁ గూర్చునవి యగుచు వనహ్రదముల • య్యోగిరుల

—భువన విన్యాసోద్దేశ స్థాన వర్ణనము—

చ॥ తనరుసితాంత శృంగమునఁ • దద్దయు వెల్గుచుఁ బారిజాత కా
నన మచటన్ సతంబు సుర • నాయకుఁ డాశ్రమ మేర్పరించి కాం
చన కుసుమప్రకాండమున • శైలసుతా హృదయేశు నాశ్రితా
వన చతురున్ శశాంకధరు • వారక యర్చనసేయు భక్తిమై.

తే॥ అగ్గిరికిఁ దూర్పుదిక్కున • నలరుచుండు శైలకూటంబు బహుళ వి • స్తరము
నెనిమిది పురంబు లొప్పు దై • త్య నివహాభిరామములగుచు నిరత వి • రాజితము

తే॥ సురుచిరంబగు స్వర్ణ కో • టరమునందు రసికులగు నీలకాది రా • క్షసుల పు
లష్టషష్టి సంఖ్యాకంబు • లై తనర్చు నిరతమోదావహంబులు • నిర్మలములు.

సీ॥ శైలేంద్రమగు మహా • నీలాచలంబున హయముఖులయు ముఖ్యు • లైశ కిన్న
రులయు పురంబులు • వెలయును బదునేను వేణుసౌధంబను • విపులగిరిని

పొసఁగు విద్యాధర • పురములు మూఁడు వైకుంఠాచలమున న • కుంఠితుఁడగు
గరుడ నివాసంబు • కలదు కరంజాద్రి నీలలోహితుండు • లీలక్రోడ
రతుల వసుధార శైలంబు • నందు వసువులుండ్రు నిరతంబు సకల గు•ణోన్నతులయి
పరఁగు నిల రత్నధార భూ • ధరమునందు సప్తఋషుల నివాసముల్ • సంతతంబు.

సీ॥ ఏక శృంగంబు నా • నిలవాలు పరియందుఁ దనరుఁ బ్రజాపతి • స్థానమతుల
మగు గజష్మాధర • మందు దుర్గాదుల వసతులు నిరతంబుఁ • బొసఁగుచుండు.
నలసు మేఘాద్రిపై • నాదిత్యులును రుద్రు లశ్వినుల్ నివసింతు • రమలమతులు
హేమకక్షంబున • నెల్ల దేవపురంబు లలరారు నెమబది • యై రహించి
పంచకోటి శతంబులు • పరఁగు రాక్షసాలయములు సునీలాద్రి • యందుఁ బంచ
నూట భూధరమునఁ బంచ • కోటిపురము లొప్పు దర్శనీయంబులై •యున్నతములు.

క॥ శతశృంగాచలమునఁ బురశతమలరుచునుండు యక్ష • సంచయ వినుతం
బతిరమ్యం బతిలోకం బతుల మహాభోగ సహిత • మై నిరతంబున్.

సీ॥ వెలయుఁ బ్రమాణకా • చలమునఁ గాద్రవే యాలయ తతివిశా • ఖాద్రియందు
గుహునాలయం బొప్పుఁ • గోమలంబగుచును శ్వేతోదరంబునఁ • జెలఁగుచుండు
నసదృశంబగు సుప • ర్ణాలయంబు పిశాచ కమునఁ గుబేరాల • యము వెలుంగు
హరికూట శిఖరిపై • హరిమందిరం బొప్పుఁ గుముదాద్రిఁ గిన్నర • కోటినిలయ
మంజనాచలమునఁ జార • ణాలయంబు లెసఁగు గంధర్వనగరంబు • కృష్ణగిరినిఁ
బాండరంబున నగర స • ప్తకము చెలఁగు వానవిద్యాధరులు నన • వరతముండ్రు.

సీ॥ ఉగ్రకర్ములగు దై • త్యులు వసింతురు సహస్రశిఖరాచలమున • సంతతంబు
ముకుటాద్రియందున • భుజగాలయములొప్పుఁ దక్షకాచలమునఁ • దలఁప సోమ
వాయు వైవస్వత • పన్నగాలయములు వఱలును హరిహర • బ్రహ్మ యక్ష
నాయక సురలోక • నాయక శరజన్మ ముఖ్య నిర్జర గృహం • బులును దక్క-
గల గణాధిపతుల • కళ్యాణభవనంబు లెసఁగు వానియందు • నెల్లకాల
మధివసించి వార • లంధకాసురగర్వ భంజకుని భజింత్రు • భక్తి వెలయ.

శా॥ భక్తాభీష్టఫలప్రదుండు సకల • బ్రహ్మేంద్రముఖ్యామరా
వ్యక్తాకారుఁడు భోగిభూషణుఁడు • వేదాంతాగ్ర సంచారి ప్ర
త్యక్తత్వాశ్రయుఁ డీశ్వరుండనయ మా • ర్యన్ గూడి శ్రీకంఠమున్
ముక్తిద్వారము శైలకందరమునన్ • మోదించు నెల్లప్పుడున్.

క॥ శ్రీకంఠాశ్రయమగుటన్ శ్రీకంఠము నాఁగఁ దనరు • క్షితిధరమసురా
నీకంబు భక్తరక్షకు నా కామాంతకుని గొల్వ • నరుదెంతు రొగిన్.

క॥ ఈ విశ్వమెల్ల శ్రీకంఠావృతమై యలరుచుండు • నదియగు కతనన్
శైవంబు నాఁ దనరు వేదావళియును బలుకు "శివమ • యం జగ"దనుచున్.

—దేవకూటాది పర్వతస్థశంకరాలయాది వర్ణనము—

వ॥ శాఖాశతసహస్రాఢ్యంబును, సర్వద్రుమ విభూషితంబును, మహామూలంబును నసేక స్కంధంబును నానాపక్షిసమాకులంబును, దశయోజనమండలంబును, విరళచ్ఛాయం బును, నగు భూతవటంబను నొక మహావృక్షంబు హేమకూటాచలంబు మధ్యం బునందలి మహాకూటంబున నలరు.

తే॥ అమ్మహోర్వీరుహంబు మూ ♦ లమ్మునందుఁ బ్రాంతవిలసిత ప్రస్రవ ♦ ణాంచితంబు
ద్విజకులారవ బధిరిత దిక్చయంబు శంకరాయతనం బొప్పు ♦ సాధునుతము.

సీ॥ కాంచన ప్రాకార ♦ కలితంబునవ విధమణిమయతోరణ ♦ మండితంబు
విమలవిద్రుమ శిలా ♦ విరచిత గోపుర మున్నతశిఖర సం ♦ యుతము నిఖిల
పరమేశసత్కథా ♦ ప్రకరచిత్రిత కుడ్యభాగంబు మంటప ♦ భాసితంబు
రత్నసింహాసన ♦ భ్రాజిత మఖిలర్షి కులపాదఘట్టిత ♦ కుట్టిమంబు
సకలభూత పరీతంబు ♦ సతతమోక్ష దానచతురంబు నిర్మల ♦ తత్త్వకథన
దక్ష మునిసేవితంబు వి ♦ ద్వత్ప్రదంబు నగుచు నయ్యా యతనమొప్పు ♦ నహరహంబు.

క॥ ఆ యాలయమధ్యంబునఁ గాయజసంహారుఁడు సకల ♦ కామ్య ఫలదుఁడై
తోయజభవ ముఖ్యులు నుతిసేయఁగ నివసించు నెల్ల ♦ సేవములిడుచున్.

తే॥ మఱియు నా తరుమూల ని ♦ ర్మల తలంబునందు షణ్ముఖ వారణా ♦ స్యాదిసకల
దేవతానిలయంబులు ♦ తేజరిల్లుఁ జారుశిఖరోన్నతంబులై ♦ సంతతంబు.

చ॥ అలరుఁ గుబేర శైలశిఖ ♦ రాగ్రతలంబునఁ జారుకుడ్య సం
కలితము హేమతోరణ ని ♦ కాయ విరాజిత ముజ్జ్వలన్మణీ
లలితము మౌక్తికాంగణ చ ♦ లన్ముని బృందము పావనంబు ని
ర్మలము శివాలయంబనుప ♦ మానము యోగిజనార్చితంబునై.

తే॥ ఆ శివాయతనంబున ♦ కావలిదెస స్వర్ణసోపాన సహితంబు ♦ చారుజలము
వెలయు మందాకిని యనంగ ♦ నళిని విపులతట విరాజిత వివిధ ల ♦ తానివహము.

తే॥ స్వర్ణపంకజ మకరంద ♦ పానమత్తమధుపఝుంకృతి శ్రవణ భ్ర ♦ మత్సురాంగ
నా సహస్రంబగుచును నా ♦ నళిని యలరు మునిజనస్నానపూతమై ♦ యనవరతము.

తే॥ ప్రత్యహము సంధ్యవేళల ♦ భవునిపూజఁజేసి సిద్ధాదు లచ్చటఁ ♦ జేరి నిర్మ
లాంబు కణములఁ ద్రావిప్ర ♦ హర్షచిత్తులగుచునుందురు "ధన్యాస్మ" ♦ యనుచుమదిని.

క॥ ఆ సరసికి నుత్తరదిశ భాసిల్లు ననేకశిఖర ♦ పరివృతమగుచున్
వాసవ ముఖ్యార్చితుఁడగు నా సోమకళాధరాల ♦ యము దృశ్యంబై.

వ॥ ఆ యాలయము నిష్కుటమునఁ "గనకకంద" యను కాసారంబొండు గల దద్దాని తీరంబునఁ దూర్పుదిక్కున ద్విజసహస్ర సేవితంబును, మృగపక్షి సమాకులంబునగు నుద్యానవనంబలరు. అందుఁ జంద్రార్ధధరుండు పార్వతీసహితుండై క్రీడించు. మఱియు నా సరసికిఁ బశ్చిమభాగంబున రుద్రపురంబొప్పు. దానఁగూడఁ బరమేశ్వరుండు రమానాయకాది నిఖిల బృందారకు లభివందనములు సేయ విహరించుచుండు. ఇవియుఁ గాక పెక్కులు శివాలయంబులు ద్వీపంబులందును, బర్వతంబులందును, వనంబులందును నదీనదతటాకంబులందును సాగరసంఘులందును విలసిల్లును.

—నవ వర్షానువర్తి వర్ణాయుర్భోజనాది కథనము—

తే॥ ప్రాఙ్ముఖంబులు దక్షిణా • స్యంబు లుత్తర ప్రభవములుఁ బశ్చిమా • గ్రంబులగుచు
నెల్లవర్షంబులఁ జెలంగు • నిద్ధజలములైన నదులు వచింపంగ • నయ్యెనిపుడు.

సీ॥ అఖిలభూతంబుల • కాధారుఁడై యమృతా కారుఁడైన శ • శాంకువలన
నాకాశగామిని • యగుచుఁ బుణ్యోదకయై సప్తమానిలా • యనముతోడ
వెడలిన యడియొక • విమల తరంగిణి యది నిఖిలోడుగ • ణాన్వితంబు
నగుచుఁ గాంచనగిరి • నావహించి చెలంగి పవనంబు కతన వి • భజ్యమాన
మగుచుఁ గనకపర్వ • తాంతర కూటంబులందు నాక్రమించి • యఖిలవర్ష
ముల ననేకరూప • ములఁ బ్రవహించు శశాంకమాళి ముదల • యంది సలిలము.

సీ॥ ఆకాశగామిని • యైన యానదియందుఁ గలిగెను క్షుద్రన • దులు సహస్ర
ములు కేతుమాలమం • దలి నరుల్ కృష్ణవర్ణులు పవనాశనుల్ • చెలులు కుముద
సంకాశ వర్ణలు • చారురూపలు వారి జీవితము నియుత • మై వెలయును
భద్రాశ్వమున యందుఁ • బ్రజలు సితాంగులు నెలఁతలు చంద్రాంశు • నిభశరీర
పతులు గాలామ్ర భోజనల్ • వారలెల్ల రతినిరతలు నిరాతంక • గతులువారి
జీవితము పదివేలేడ్లు • శివునియందు భక్తిగలవారలైయుంద్రు • భావములను.

సీ॥ రమణకమందలి • ప్రజలున్యగ్రోధ ఫలాశను లీశ్వర • ధ్యానపరులు
బదివేలుమఱియును • బదివందలైదును నగువత్సరంబుల • యాయువొప్పు
వఱలు హిరణ్మయ • వనవాసు లీశ్వరభక్తితత్పరులు న • శ్వత్థభోజ
నులు వారి కాయుష్య మిలఁ బదికొండువేలును నైదువవర్షంబు • లునుగఁ జెలఁగు
నరయఁ గురువర్షమందలి • నరులు సంగమోద్భవులు క్షీరభోజను • లుత్తమాంగు
నాకరవొక్కరుఁ బ్రేమించు • చుండువారు విగతరోగులు నిశ్శోకు • లగుచునుంద్రు.

తే॥ తలఁపవారు స్వర్గపరిచ్యు • తులును యౌవనాఢ్యులును మహావీర్యులు • నమృతభోజ
నులు పరాంగనా విముఖులు • లలితయశులు నగుచు వినుతిగడించెద • రనవరతము.

తే॥ వారు పదునాల్గువందల ♦ వత్సరములు బ్రదుకుదురు శ్యామదేహులు ♦ ప్రబలభూ
ణాన్వితులు శంకరాగ్చాప్రి♦య వ్రతులును హృష్టులగుచును వెలయుదు ♦ రిల సతంబ

వ॥ భారతవర్షంబునకెల్లఁ గురువర్షంబు ముఖ్యంబు. అందుఁ జంద్రప్రభంబను ప
శ్వర విమానం బలరు.

సీ॥ వివిధ దేవార్చనా ♦ విగతపాపులు శతాయుష్కులు నల్పదే ♦ హులును నల్ప
భోగులు దుర్బలుల్ ♦ పుణ్యకర్ములు మర్త్యులయ్యును వృత్తుల ♦ నాశ్రయించి
భారతవర్ష సం ♦ వాసులు వెలయుదు రం దింద్రవర్షంబునం ♦ దు కొంద
ఱును కశేరుకమునం ♦ దును గొందఱును తామ్రవర్షంబునందు గ ♦ భస్తిమంత
మనెడు వర్షంబునందు సౌ ♦ మ్యంబునందునాగ గాంధర్వవారు ణా ♦ నంతములగు
వర్ణములఁజేరియుందుర ♦ వారితప్రవృత్తిని వసించి కొందఱు ♦ విమలమతులు.

సీ॥ కొందఱు మ్లేచ్ఛులు ♦ కొందఱు వివిధజాత్యుద్భవుల్ వ్యాధు ల ♦ త్యుచ్ఛ్రితము
పశ్చిమదిశను య ♦ వనులు వసింతురు బ్రాహ్మణ క్షత్రియ ♦ వైశ్య శూద్రు
లలరుచునుంద్రు మ ♦ ధ్యప్రదేశంబున సవనాజి వాణిజ్య ♦ సాధుసేవ
నంబులఁదాల్చి య ♦ నంతభక్తిస్వదేవతార్చానియమముల ♦ నభిరతులయి
మహితములగు సంకల్పాభి ♦ మానములను జెలఁగి స్వర్గాపవర్గ సం ♦ సిద్ధిఁగోరి
వరుసనుత్తరోత్తర గౌర ♦ వంబుఁబూని భరతవర్షంబునందలి ♦ ప్రజలు సతము.

తే॥ కింపురుష వర్ష వాసులు ♦ కృత్తివాస జపపరాయణులును స్వర్ణ ♦ సదృశదేహు
లంగనలు దేవకాంతలు ♦ నాఁదనర్తు రనవరత సుఖోపేతులై ♦ ఘనతఁగాంచి.

వ॥ దశవర్ష సహస్రాయుష్కులై యనామయులును, నిశ్శోకులునునై యుందు
హరివర్ష స్థితులు దేవలోకచ్యుతులును, దేవాకారులును, నై యజరాబాధాపిష్టు
జీర్ణింపక యిక్షురసపానంబుఁ జేయుచు దశ సహస్ర వర్షజీవనులై విశ్వేశ్వరు నా
ధింతురు.

సీ॥ అరయమధ్యమమగు ♦ నట్టి యిళావర్షమందలి ప్రజ లర ♦ విందముఖులు
పద్మనిభేక్షణల్ ♦ పద్మసుగంధినిభాంగులు జంబూ ఫ ♦ లాశనలును
పదుమూఁడు వేల య ♦ బ్దములు జీవించెదరచటఁ జంద్రార్క మ ♦ ఖ్యప్రకాశ
ములు గలుగవు మాన ♦ వులు దేవలోకాగతులు నిరామయులయి ♦ వెలయుచు
రాకలియుక్రమమును మృత్యు ♦ వాపదయునుఁ దప్పికయుఁ జెందరెప్పుడు ♦ తరుణచం
ధరుని గొల్తురు జాంబూన ♦ దంబు నాఁగ దేవభూషణ మలగారు ♦ దివ్యగతిని.

తే॥ అసదృశము హేమకూటంబు ♦ నందు నప్సరోగణంబు గంధర్వులుం ♦ ద్రుసతత
శేషవాసుకితక్షకుల్ ♦ చేరియుంద్రు నిషధమున యందు శితికంఠు ♦ నే తలఁచు

తే॥ ప్రబలులగు యాజ్ఞికులును ము♦ప్పదియుముగురు వెలయుచుందురు నీలమహా ♦ విపుల
సిద్ధులును బ్రహ్మఋషులును ♦ జేరియుంద్రు దైత్యదానవవసతి శ్వే♦తగిరి ధరణి.

రియనఁబరఁగెడు నవి ధరి • శ్రీధరములు శాకమను ద్వీపమున నొప్పు • సంతతంబు
నమలమగు మారుతంబున • కాస్పదంబులగుచు నుతియింపఁదగునమ్మ • హాచలముల.

చ॥ అమలమణీమయోరు శిఖ • రాంచితమై మునిలోకవాస యో
గ్యమయి విచిత్రసానుని క • రాఢ్యము నై వివిధౌషధిప్రకాం
డమునకుఁ బుట్టునిల్లయి క • నత్ప్రభమై తతపుష్కరాంత రీ
పమునఁ జెలంగు నేకశిల • బంధురమై గిరిరాజమై యిలన్.

వ॥ మఱియు నయ్యేక శిలాద్రియందు భగవంతుండగు త్ర్యంబకుం డుమాసహితుండై నిఖిలభక్తజనంబు సేవింప నివసించియుండు. ఇదియుఁగాక.

తే॥ పుష్కరాంతరీప • మున సగభాగంబు నాక్రమించి తూర్పు • నందుఁ జిత్ర
సానుసంజ్ఞ నలరు • శైలంబు వెలయు నప్పర్వతంబు వొగడ • వశమె జగతి.

వ॥ అమ్మహాచలం బనేక యోజనోన్నతంబును, పంచాశత్సహస్రయోజన విశాలంబును, జతుర్వింశత్సహస్రయోజనమూలంబునై యలరు. మఱియు నా ద్వీపంబున మానసోత్తరంబను గిరివరంబు చిత్రసాను సమానోన్నతంబై యొప్పు.

తే॥ అలరు నా పుష్కరద్వీప•మందు నిఖిలమునిజనావాసములుఁ బూత•ములగు జన ప
దములు మానసోత్తర మండ • లమున నలరు సర్వ మంగళాఢ్యంబులై •సంతతంబు.

వ॥ మానసోత్తర బాహ్యమందలి మహాపీఠాభ్యంతరమున ధాతకీఖండమలరు. పుష్కర ద్వీపంబు ప్రాగ్దిశయందు స్వాదూదకంబను సాగరంబు గలదు. దానికిఁ దూర్పున జనముదాయంబలరు. ఆ జనసముదాయంబునకుఁ దూర్పుదిక్కున లోకాలోకంబను గిరివరంబుండు. అమ్మహానగంబున కర్వాచీనంబున రవిరశ్ములు చెలఁగును. పరం బైన భాగంబున నిరంతరాంధకారంబు బంధురమైయుండు లోకాలోకాచలము మొదలు ధ్రువమండలమువఱకును నావహప్రవహానువహ సంవహ వివహ పరావహ పరివహంబులను వాయుసప్తకములుఁ బ్రకాశించుచునని వచియించి జ్యోతిర్గణ ప్రచారంబును, సూర్యరథ పరిమాణాదులును, చంద్రమండల వర్ణనంబును, బుధాది రథ పరిమాణంబును సూర్యగ్రహాది పట్టాభిషేకంబును సూర్యరశ్మి సహస్రప్రయోజనంబును సూర్యముఖ్య సప్తరశ్మి మహిమయు, గ్రహనక్షత్రాది స్థాన సంఖ్యావర్ణనంబును సంగ్రహంబుగ వక్కాణించి సూతుం డిట్లనియెను.

## —ధ్రువోపాఖ్యానము—

క॥ అనఘుఁడు మార్కండేయుఁడు వినిపించెను తొల్లి నాకు • వీనులలరఁ బా
వనమైన ధ్రువచరిత్రము మునులార వినుండు మోదమున మీఱంగన్.

క॥ అది విష్ణుభక్తిపూరిత మది వైష్ణవలోకవినుత • మసదృశముక్తి
ప్రదమది వీనులవిందై యెదఁగుతుకముఁగూర్చు వింటి • రేని కడంకన్.

క॥ అవిరళ శివార్చనారతుఁడవనీశ్వరసన్నుత ప్ర • భాఢ్యుఁడు నిత్య
స్తవనీయుండగు స్వాయంభువమనువు చెలంగు సుజన • పోషకుఁడగుచున్.

చ॥ మనువులలోన ముఖ్యుఁ డసి • మాన యశోవిభవాభి రాముఁ డా
ర్తనికర పోషకుండు పర • తత్త్వవిదుండు త్రికాలవేది స
త్యనిరత మానసుండు వివి • ధాధ్వరకర్మకరుండు సర్వలో
క నికర నేతయై పరమ • కారుణికుండయి యాతఁడుండఁగన్.

క॥ తనసేయు శివార్చాఫలమనఁ గొండ్రొక కాలమునకు • నతుల గుణాఢ్యుల్
ఘనులు చతుర్దశలోకావన దక్షులు విమతరాజ • వనవహ్నినిభుల్.

తే॥ తనయు లుదయించి రమలులు • త్తానపాదుఁడును బ్రియవ్రతుఁ డను వారు • జనకకీర్తి
కన్న తావతంసంబుల నొసఁగ నేర్చు వారలిరువురు దీపిత • బాహుబలులు.

క॥ ఉత్తమగుణాంబునిధులగు నత్తనయులలోఁ దనర్చె • నగ్రేసరుఁడై
యుత్తానపాదుఁ డఖిల జగత్తల నాయకులు వొగడఁ • గాఁదగి మిగులన్.

—ఉత్తానపాదుని పరిపాలనము—

చ॥ వితతయశోవిశాలుఁ డరి • వీరసహస్ర కిరీటకోటి సం
గతమణి కాంచనద్యుతి ని • కాయసమర్చిత పాదపద్ముఁడ
ప్రతిహత విక్రమాఢ్యుఁడు ది • వాకరసన్నిభ దివ్య తేజుఁ డా
శ్రితజనరక్షకుండు నృ • పశేఖరుఁడై యతఁ డొప్పె నెంతయున్.

తే॥ అతఁడు నాల్గు వేదంబు లా • అంగములును తనరు నలువదినాల్గువి • ద్యలును నేర్చె
తనకు సర్వజ్ఞుఁడను బిరుద • దంబు వెలయ సాటియగు రాసుతులలోన • మేటియయ్యె.

తే॥ రాజ్యతంత్ర వేది • రథగజతురగావరోహణ ప్రబుద్ధుఁ • డాహవజిత
సకలవైరి వీరుఁ • డకలంకచిత్తుఁడై యాతఁ డలరె దీక్ష • యంబునందు.

క॥ అతఁడు ధనుర్వేదంబును నతుల కృపాణంబుఁ దాల్చి • యఖిలావనిప
ప్రతతి కొకప్రక్క బల్లెము గతిఁ జెలఁగె జగత్త్రయమున • గాఢమనీషన్.

చ॥ అతుల భుజప్రతాపవిజి • తారిచయుండగు పుత్రునందు నీ
క్షితి తలభారముంచి సుర • సేవితు నద్రిసుతామనోహరున్
శ్రితపరిపాలు నీశు శశి • శేఖరుఁ గొల్చి తరింతునంచు న
ప్రతిహతకీర్తి యా మనువు • భావమునన్ దలపోసె నెంతయున్.

తే॥ అటులఁ దలఁచి స్వాయంభువుఁ • డఖిలభువన రాజ్యమున నభిషేకించెఁ • బూజ్యుఁడైన
తనయు నుత్తానపాదు న • తంద్రితాత్మ వంశదీపకుఁడగునని • పలుకబుధులు.

తే॥ కనదమలకీర్తి వల్లికా • క్రాంత నిఖిల భూనభోంతరుఁడైన యు • త్తానపాదుఁ
డ టుల నభిషిక్తుఁడై జన • కాజ్ఞఁదాల్చి ధర్మదేవతకు హితంబుఁ • దలఁచి మది॥

తే॥ శృంగగిరి పితృనిలయంబు • హిమధరాధరంబు యక్షులకును భూత • రాజి కీశ్వ
రునకుఁ బదమయియొప్పు నా • ఘనుఁడు హరుఁడు పరిజనముఁగూడియుండు
[నా • పర్వతమున.

వ॥ ప్రతియుగంబునను ప్రసిద్ధంబులగు నా గిరులందుఁ బరమేశ్వరుండు బ్రహ్మ విష్ణ్వాది నిర్జరులఁగూడి చరించుచుండునని సూతుండు శౌనకాదులకుఁ జెప్పుటయు.

ఆశ్వాసాంతము.

ఉ॥ తారక సింహవక్త్ర ముఖ • దానవనాయక బాహుకానన
స్ఫారకుఠార ధార నిరు • పద్రవశారద శుభ్రకీర్తి వి
స్తార సురాసురప్రకర • దాహక మామక కావ్య కన్యకా
ధార నమన్మునీంద్రచయ • తారక లింగపురాణ కీర్తితా.

క॥ కైలాసాచల ధామా! సాలంకాయనకుమార • సన్నుతనామా
లీలావిధృత సుధామా నాళీకప్రభవనుత స • నాతన ధామా.

మాలినీవృత్తము—

మనసిజమదభంగా • మానినీ సంస్కృతాంగా
యనఘవృషతురంగా • హస్తిచిప్యత్కురంగా
వననిధి సునిషంగా • భక్తచిత్తాబ్జ భృంగా
వినుత సుగుణ సంగా • విశ్వదాన ప్రసంగా.

తే॥ కష్టపడి పెంచి యిడితి నా • కవిత కన్నె నెవ్విధంబున నలరింతో • యింక నీవు
గంగవోలెను గయ్యాళి • గాదు చేలసుమ్ము నీతలనెక్కి నాట్యమ్ము సేయ.

సీ॥ ఏ మహామహుఁడు శ్రీ వేమ నారాధ్య వంశాబ్ధికిఁ బూర్ణశ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి • కెనయై సతుల్ మెచ్చ మహినిఁ బాతివ్రత్య • మహిమఁగాంచె
నట్టి నందయకు గా • రమకుద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోదరుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మ • నీయమగు శ్రీ మదాంధ్ర లింగపురాణ పూ • ర్వార్ధమందు
సమలరుగు తృతీయాశ్వాస • మయ్యెఁ గరుణసతము దీనిని రక్షించుఁ • జంద్రమౌళి.



శ్రీ మీనాక్ష్యైనమః

పూ ర్వ భా గ ము

—చతుర్థాశ్వాసము—

క॥ దక్షాయణీశ! దళితవిపక్షా! శ్రితలోకశరణ! పన్నగవిలస
ద్వక్షాకరిచర్మాంబర త్ర్యక్షా సోమేశ సకలదానసమర్థా.

తే॥ అవధరింపుము శౌనకా ద్వ్యాశ్రమీయులను గనుంగొని బహువిలాస మలర
దక్షుఁడగు రోమహర్షణి ప్లక్షముఖ్య నిర్మలాంతరీపగిరుల నెమ్మితోడ.

వ॥ ఎఱిఁగించువాఁడై మెల్లన నిట్లనియె.

—ప్లక్షాది ద్వీపస్థ పర్వత కథనము—

తే॥ ప్లక్షముఖ్యాంతరీపంబు లందొకొక్క దాన బుజ్వాయతంబులై దశదిశల
గ్రమ్మి యేడేసి వర్ష ప ర్వతము లలరు సారిది వివరింతు వినుఁడు సుస్థిరమతు...

సీ॥ తనరు గోమేధికంబును చాంద్రమును నారదము దుందుభియును సోమమును ...
సంబు వైభ్రాజమను సప్తపర్వతములు ప్లక్షంబనియెడి ద్వీ పమున నలరుఁ
గుముదంబు నాఁగ ను త్తమము నాగవలాహకంబు నా ద్రోణకం కములు
మహిషంబునాఁ దగు ద్మంతంబునా నొగి సప్తశైలంబులు శాల్మలియను
నంతరీపంబునఁ జెలంగు నలరువిద్రు మంబు హేమంబు మఱి ద్యుతి మంతమన
బుష్పితంబుఁ గుశేశయం బు హరగిరియు మందరము నాఁ గుశద్వీప మందు...

తే॥ మందరములన నుదకముల్ మహితగతిని వానిఁదాల్చుటఁజేసి య ప్పర్వ...
మందరంబనఁగఁ జెలంగు మహిని సకలపర్వతశ్రేష్ఠమగుచును బ్రథను గాంచె

సీ॥ మందరుఁడనియెడి క్ష్మాసురుఁ డొక్కరుఁ డవిముక్తమునఁ జేరి యంగ...
గుఱిచి తపమొనర్చి కోనియె వరంబును హరుఁడుఁ బార్వతియు గ ...
నంబీశ్వరుండును మందరాద్రి వసించునట్లు నక్కాతమున నంత కారి
సానుకంపుండయి యద్రిసుతఁ గూడి వారణాసినివీడి వైభవమునఁ
బ్రమథగణములు సేవింప నమరవరులు సన్నుతింపఁగ మందరాచలమునందు
నిలిచి భక్తవరదుఁడయి నిఖిలకామ్యముల నొసఁగుచుండు శ్రితజనంబులకుసతే...

సీ॥ క్రౌంచంబు వామన కం బంధకారకమును దివావృన్నామ మును వివిం...
మును బుండరీకాఖ్య మును దుందుభిస్వనమును ననునవి క్రౌంచ మునరహి...
నుదయంబు రైవత మున్నతశ్యామంబు రాజతమును నభి రామమైన
యాంబికేయంబును నఖిలౌషధి సమన్వితము సుశోభన మమ లమును ...

॥ తరుణుల్ పంచశరుండటంచు రిపు సం ♦ తానంబు రుద్రుండటం
చరిగాపుల్ శరణాగతావనుఁడటం ♦ చర్థి ప్రకాండంబు ని
ర్జర భూమీరుహమంచుఁ బండితులు శా ♦ స్త్రవ్రాత సర్వస్వ మం
చురుభక్తిన్ బొగడంగఁ బెంపెసఁగెన ♦ య్యుత్తానపాదుం డిలన్.

కన్నెత్తి చూచినఁ ♦ గంటకవైరి భూభృన్నికాయంబెల్ల ♦ నెత్తువడును
చేయెత్తి యిడిన ల ♦ క్ష్మీపుత్రులై యాచకులు లేమికడఁగండ్లఁ ♦ దలఁగుచుండ్రు
విల్లెక్కువెట్టిన ♦ వీరయోధ సహస్రములురువడి చనుదెంచి ♦ యనుసరించు
దండెత్తి నిలిచినఁ ♦ దతవిక్రమాఢ్యులు పగతురు వెన్నిచ్చి ♦ పాఱుచుందు,
ఖిలసాగర పరివేష్టి ♦ తావనీతలాధికార ప్రభాకన ♦ దంగుఁడగుచు
మ్మల యశోభిరాముఁడై ♦ నెగడుచుండు నాతఁ డుత్తానపాదుండు ♦ ప్రీతితోడ.

తార సన్యోన్యవిరుద్ధ విహార నిరతిఁ దిరుగువార ♦ లయ్యును లక్ష్మి
శారదులు మైత్రితో నాధీరుని సేవించుచుండ్రు ♦ స్థిరమతులగుచున్.

॥ ఆ నరనాథమౌళి యన ♦ యంబుఁ గృపాయుతుఁడై యొసంగు స
ద్దాన జల ప్రవాహములు ♦ తద్దయుఁ జేరుటఁ జేసి కాదె యం
భోనిధి యెంతయే నమృతపూరితమై ♦ భయదారవంబులన్
బూని తరంగసంతతులఁ ♦ బొంగునటంచు వచింత్రు పండితుల్.

నలుపులెల్లఁ దెలుపులయ్యెఁ ♦ దెలుపులెల్ల నలుపులై మించె నాతని ♦ లలితకీర్తి
కాంతదిక్కులనిండి భూ ♦ కాంతమకుటకోటి నటియింప నిర్జ ♦ రకోటి మెచ్చ.

అకుహైనఁ గదలలే ♦ కనయంబుఁ గాశిన్యమూనియుండెడి గట్ల ♦ పైన గోసి
తలయెత్తనేర కెం ♦ తయు నీళ్లలో మున్గి తేలి తేలని కచ్ఛ ♦ పాళికడరి
పంకంబు మెచ్చుచు ♦ వనములఁబడి పోతరించి చరించు కి ♦ రిని హసించి
ద్విజరాజవైరియై ♦ విషముఁ గ్రక్కుచు వక్రగామియైనట్టి త ♦ క్షకుని వీడి
సఁ దగినట్టి యాతఁ డు♦త్తానపాదుఁ డొక్కరుఁడె యంచుఁ ♦ బ్రత్యయ♦మూని సప్త
గరాంచిత వసుమతి ♦ సంతసమునఁ దన్నుఁ జేపట్టి వెలయ నా ♦ తఁడు రహించు.

అమ్మహీనాథ తల్లజుఁ ♦ డఖిలశత్రు మస్తకంబులతోడ నం ♦ బకశతంబు
ధరణిప్రాలంగఁ బాలించె ♦ నిరతదేవగురుసమర్చాభిరతుఁడయి ♦ కొదువ లేక

అతఁడు ప్రజార్థియై నృపకు ♦ లాభరణంబుల యోగ్యలన్ సమం
చితగుణరూప యౌవన వి ♦ శేష విశిష్టల సాధుచిత్తలన్
బతివిహిత ప్రవర్తనల ♦ బంధురకాంచన గాత్రలన్ గుణా
న్వితలఁ సతీమతల్లులఁ బ ♦ విత్రచరిత్రల నంబుజాక్షులన్.

వనితల సునీతి సురుచియు ననువారలఁ బెండ్లియై మ ♦ హామోదమున నెం
దును లేని సౌఖ్యసంపద నెనలేక చెలంగుచుండె ♦ నృపతులు మెచ్చన్.

క॥ పతిదేవతలై సతతము పతిశుశ్రూషాపరలయి • వర్తిల్లెడు నా
సతు లిరువురందు ధాత్రీపతి సమగౌరవముఁ జూప • వలయును గాదే.

క॥ ఆసతులిర్వురయందుఁ భాసురయౌవనవిలాస • బంధురగతులన్
జేసి సురుచిపతికుతుకావాసయయి సునీతికన్న • వల్లభయయ్యెన్.

తే॥ సురుచియు సునీతికన్నను • సొబగుమీఱి యందచందంబులు గలట్టి • దగుచుగాణ
వాసములలోన స్వాధీన • పతికయగుచు ఖండితయగుచు నలరె ద • త్పత్నిమాని.

చ॥ సురుచియెడన్ బ్రియుండగుచు • క్షోణివిభుండు సునీతియం దనా
దరము వహించి త్రిమ్మరుస • తంబు తదీయ మనోరథంబులన్
విరసము సేయు నాతరుణి • వేడినఁగాని యొకింత పల్కఁబోఁ
డరయఁడు దానిసేమముల • నైనను కూడదునాక నెమ్మదిన్.

తే॥ తనవమోధనంబు • లను సురుచికె యర్పణంబొనర్తునని భూ • శంబశందు
ప్రతినసేసె నాఁగ • సతతమా వెలఁదికి వశ్యుఁడై చరించు • బలువిధముల.

క॥ లలనాహృతహృదయుండై యిల కేఁడొక గడియయేని • యింతివిడిచినన్
నిలువంగలేక ప్రాణంబుల నాసతియందెయునిచి • పూన్కిఁజరించున్.

తే॥ రాజ్యమూలంబయిన త్రివ•ర్గంబునందుఁ గామమే ముఖ్యమనుచు నా•క్ష్మావిభుండు
వివిధభోగపరుండయి • వెలఁదితోడి కలయికయెస్వర్గమని మదిఁ•దలఁచి తిరుగు.

తే॥ సుదనరాజ్యభార • మెదవహించుటఁజేసి మోయలేఁడొయేమొ • ముఖ్యమైన
రాజ్యభారమెల్ల • రహిమంత్రిపుంగవులందునిలిపి తిరుగు • నా నృపుండు.

వ॥ అవ్విధంబున నుత్తానపాదుండు సురుచితోడిద లోకంబుగఁ దలఁచి నిరంతరంబు
తనుధనంబుల నామెకు సేవజేయుచుండుటయుఁ దన్ను స్వప్నంబుననేని స్మరింపకుం
డుటయుఁ గారణంబులుగ సునీతి తనమనంబున,

ఉ॥ అక్కట యేమిసేయుదు ధ • రాధిపుఁ డించుకయైన నాయెడన్
మక్కువఁజూపఁడయ్యె బతి • మాలినఁ బల్కఁదలంపఁడయ్యెఁ జెం
పెక్కినమూర్మి నాసపతి • నే తనప్రాణమువోలెనెంచు నిం
కెక్కడి జీవనంబు సుఖ • మేటిది కాంతుఁ డవజ్ఞఁ జూడఁగన్.

క॥ పతికన్న వేఱులేదని మతిఁదలఁచి చరించునట్టి • మానినులయెడన్
బతికనుగక్తి కలుగదే సతిదుఃఖాస్పదముగాదె • యదివసుమతిలో.

ఉ॥ కాంతుఁడు ప్రీతచిత్తుఁడయి • గౌరవబుద్ధివహించి మెల్లనన్
జెంతకుఁజేరఁయేమె సర • సీరుహలోచన, యంచుఁ బల్కఁగా
నెంతయు సిగ్గతోడఁ దల • యెత్తకయుండఁగ లట్టిభాగ్య మీ
కాంతకుఁ గల్గనేర్చునె యొ • కప్పటికైనను గాని యక్కటా.

ఉ|| ఏసుకృతంబొనర్చి జని ♦ యించెనొ యా లలితాంగి కాంతునిన్
దాసునిఁ గాఁగఁ జేసికొని ♦ తద్దయు సౌఖ్యపరంపరన్ మహో
ల్లాసముఁ జెందుచున్నదిఁయు ♦ లాపతియున్ దనప్రాణ సంచయం
బా సురుచి స్వరూపమని ♦ యాత్మఁదలంచి చరించు నెప్పుడున్.

చ|| సురుచినివోలె నన్నుఁ గృపఁ ♦ జూచుచు నక్కునఁ జేర్చి నామనం
బరసి చరింపకున్న హిత ♦ మయ్యెడుగాని యొకింత పిల్చినన్
బరుసదనంబువీడి యొక ♦ పల్కుఁయినన్ బలుకన్ దలంపఁడీ
తరుణికి వేఁఱదిక్కెవరొ ♦ తానిటులన్ జరియింపఁ బూనినన్.

తే|| ప్రాణములనెల్లఁ దనయందె ♦ పాదుకొల్పి కనికరంబెన్నటికినైనఁ ♦ గలుగకున్నె
యనుచుఁదలపోయుచుండు నా ♦ యందునిట్టి కినుకజనియించుచేల కో ♦ జనవిభునకు.

సీ|| కాసంతనాదెసఁ ♦ గన్నెత్తిచూచినఁ జెన్నిధిఁగన్నట్లు ♦ బ్రీతివడుదుఁ
బల్లెత్తి యొకపల్కుఁ ♦ బల్కిన నద్దియె పదివేలటంచును ♦ ముదముఁగాంతుఁ
గలనైన నాయింటఁ ♦ గాలువెట్టునయేని ధన్యనైతి నటంచుఁ ♦ దలఁచుచుండు
దరహాసముననన్నుఁ ♦ దరియవచ్చినఁ బట్ట మహిషినైతినటంచు ♦ మదిమురియుదు
సరసమాడునేని ♦ స్వర్గసౌఖ్యమెచెందినట్లు, బొంగుచుందు ♦ నకటఘనుఁడు
నామనోరథంబు ♦ నాశంబుఁ గావించి కానఁబడఁడు కనుల ♦ కైనఁగాని.

చ|| పతియనురక్తుఁడై వివిధ ♦ బంధములన్ గఱగించి నెమ్మదిన్
గుతుకముఁ గూర్చు నేనియదె ♦ కోమలికిన్ సురలోక సౌఖ్యమా
సతివయెడన్ మనోహరుఁ డ ♦ నాదరమూని చరించునేని దు
ర్గతి మఱియొండుగల్గునె జ ♦ గంబునఁ గాంతుఁడె దైవమౌఁగదా.

తే|| సురుచిసల్పినట్టి ♦ సుకృతంబదెద్దియొ నా యొనర్చినట్టి ♦ హేయమైన
కలుషమెద్ది దాని ♦ కలయికచే నన్ను మఱచిపోయెనిట్లు ♦ మనుజవిభుడు.

ఉ|| ఆయెలనాగయే తరుణు ♦ లందఱకన్నను సోయగంపుఁ బ
ట్టై యలగారునంచుఁ దన ♦ యాత్మకుఁ దోఁచునయేని యాసతిన్
బాయక గారవించుట శు ♦ భంబగుఁగాని యధీరనైన నా
కీ యిడుమల్ ఘటింపఁదగు ♦ నే సతికుందిన మేలు గల్గునే.

తే|| అర్థివాంఛితంబు ♦ నఱపడఁజేసిన వాని ధనముపలికిఁ ♦ గాని సోయ
గంబు కానలోనఁ ♦ గాఁచిన వెన్నెల వ్యర్థమేయగును గ ♦ దా ధరిత్రి.

తే|| అగ్నిసాక్షిగఁ బరిణయ ♦ మైన కాంత కతఁడెగాక మఱొక్కఁరుఁ ♦ డగునెదిక్కు
కటకటా పతిదేవత ♦ కిటులఁ గానఁబడని దుఃఖంబుగూర్చుట ♦ పాడియగునె.

మ॥ తన యర్ధాంగముఁ గైకొనంగఁ దగి ని ♦ త్యంబుత్తమ స్త్రీప్రవ
ర్తనముల్ బూని చరించు సాధ్వియెడలన్ ♦ రవ్వంతయున్ బ్రీతి లే
కనయంబున్ విడనాడియుండు టిల న ♦ హంబౌనె కాంతుండు కా
ననిచోఁ బంకజనేత్ర యేగతిని ♦ ధన్యత్వంబుఁ గాంచున్ ధరన్.

చ॥ పతి తన సోయగంబునకుఁ ♦ బల్మరు మెచ్చి తనంతఁ దానె సం
తతము ప్రియంబుఁగూర్చునని ♦ తద్దయుగర్వమునన్ జరించు నా
సతి ననుఁగాంచెనేని యొక ♦ సక్కెములాడునటంచు నెంతయున్
మతినిఁ దలంతునో మగని ♦ మన్నన లేమికి వంతఁగాంతునో.

తే॥ సుఖము దూరమయ్యె ♦ శూన్యమయ్యెను జన్మ సాటివారిలోనఁ ♦ జౌకనైతి
జగతి బ్రతికియుండి ♦ చచ్చినదాననైయుంటి భారమగుచు ♦ నుర్వికిటుల.

తే॥ కులమునకుఁ బ్రతిష్ఠఁ ♦ గూర్చెడివాఁడునై తడవుకాలమునకుఁ బొడమినట్టి
సుతుని వదనమైనఁ ♦ జూచి నాథుఁడు నన్ను కనికరింపఁడయ్యె ♦ గారవమున.

క॥ అని పలువిధముల నీగతిఁ దన దురదృష్టంబుఁగూర్చి ♦ తద్దయు మది వే
దన గుందంగ సునీతికిఁ జనియెన్ మఱియొక్క కొన్ని సంవత్సరముల్.

వ॥ అంత నొక్కనాఁడు.

—ఉత్తానపాదుఁడు కొలువుండుట—

చ॥ కవులును బండితోత్తములు ♦ గాయకులున్ నటులున్ రసజ్ఞులున్
బ్రవిమలకీర్తిశాలులగు ♦ పార్థివవర్యులు మంత్రిపుంగవుల్
వివిధభట ప్రకాండములు ♦ వేదవిదుల్ శ్రితసంతతుల్ ఘనుల్
స్తవమొనరింప భూమిగత ♦ శక్రుఁడు నాఁ గనకాసనంబునన్.

తే॥ నిండుకొలువుఁదీరి ♦ యుండి యుత్తానపాదుండు సంతసంబు ♦ తోడనిర్వి
చారుఁడగుచుఁ బౌర ♦ సంచయంబులతోడ సహర్ష రీతి మాట ♦ లాడుచుండి.

తే॥ సురుచిసుతుఁ డుత్తముండు నాఁ♦బరగు నాతఁడాఱు సంవత్సరముల ప్రా♦యంపువాఁడు
ముద్దుగులుకుచుఁ దనయం ♦ కమున వసించి చిన్నిపలుకులు పలుకుచు♦నున్నయెడను.

క॥ సురుచియొక పార్శ్వమున భాసుర కాంచన లతికవోలెఁ ♦ జూడఁదగి మనో
హరముగ జిలిబిలి పలుకులఁ గరఁగింపుచునుండఁ గౌతు ♦ కముతో నుండెన్.

వ॥ అట్టి యానందాకరమగు సమయంబున.

—ధ్రువుఁడు తండ్రికడ కేగుట—

చ॥ తనకొక మూర్తమేని పిత ♦ దగ్గఱఁ జేరుట సంభవించునే
ననుపమ భోగభాగ్యముల ♦ నందినయట్లె తలంచు నాతఁడున్

గొనముల కాటపట్టయిన ♦ కుఱ్ఱఁడు శాంతమనస్కుఁ డా ధ్రువుం
డనెడు సునీతి పుత్త్రుఁడు మ ♦ హాత్ముఁడు మెల్లనఁ జేరె నాస్థలిన్.
తే॥ అట్లు జేరి నృపతి ♦ యంకతలంబునఁ గూరుచున్నవాని ♦ మేరుశిఖర
మందు బాలచంద్రుఁ ♦ డట్లు వెలుఁగువాని సురుచి కొడుకుఁ గాంచి ♦ సరభసమున.
చ॥ కనుఁగవభద్రబాష్పములు గ్రమ్మఁగఁ దండ్రి ప్రియంబుఁ జేయుచున్
దనతొడమీఁదఁ జేర్చుకొనఁ ♦ దద్దయు నాడుచునున్నవాఁడు ధ
న్యునిగఁ దలంచుకొంచు నదె ♦ యుత్తముఁ డిక్షితి నేనుగూడఁ జ
య్యనఁ బితయంకభాగమున ♦ యాదునఁ జేరి సుఖింతు నెంతయున్.
తే॥ అతని యాటపాట ♦ లరయుచు డుటఁజేసి కాంచఁడయ్యె నన్నుఁ ♦ గన్నతండ్రి
కాదయేని వేడ్కఁ ♦ గరములనెత్తి ముద్దాడి యూరు దేశ ♦ మందు నిడఁడె.
తే॥ అతఁడు ననుఁ గాంచునంతలో ♦ నరిగియేన మెల్ల మెల్లనఁ జని తొడ ♦ మీఁదఁ జేరి
యుత్తమునిరీతి నాడుదుఁ ♦ దత్తరమునఁ దండ్రియిదియేమొకోయని ♦ తలఁచునటుల
తే॥ అనుచు సంతసమున ♦ నబ్బాలకుఁడు పంచవత్సరములవాఁడు ♦ వసుమతీశు
నంకతలముఁ జేరి ♦ యయ్య కాంచితె నన్ను ధ్రువునటంచుబలుకు ♦ నవసరమున.

—♦ సురుచి ధ్రువుని బరిభవించుట. ♦—

ఉ॥ కన్నుల నిప్పుకల్ సెలఁగఁ ♦ గా నిదియేటి విరుద్ధమార నా
కన్నకుమారుఁ డట్లనొడి ♦ కంబున భూపతి యంకభాగమున్
గ్రన్ననఁ జేరితీవు ననుఁ ♦ గాంచవె పట్టఁపుదేవి నెంతయున్
సన్నపు సేతసేయుదువొ ♦ సాగునె నీ యడియాసలింతయున్.
తే॥ ఉత్తమునకుఁ దగిన ♦ యుత్సంగమున నీవు చేరఁదలఁచుటేల ♦ చెనఁటి వగుచు
మకుటయోగ్యమైన ♦ మస్తకంబునఁ జలిచీమ యెక్కనటులఁ ♦ జెడుగయిపుడు.
చ॥ క్షితిపతి యంకభాగమును ♦ జేరఁగవచ్చితె సిగ్గులేక నే
న తగుదునంచు నిట్లు పల ♦ వా యొకజేనెడు లేవు నీవు నే
ర్చితివె సునీతియొద్ద యప ♦ కృత్యమొనర్చుట యిప్పుడే యస
ద్గతిఁ గన కేగు ముత్తమ ప ♦ దంబు లభింపదు నీకు సుంతయున్.
తే॥ భయము భక్తి లేక ♦ పాలసుండవయితె తల్లి గొనమె నీకుఁ ♦ దగులువడెనె
యూర యిట్టి దుడుక ♦ వగుదువటంచుచు దలఁపనైతి నింత ♦ కలనయినను.
తే॥ అనిపచించుచుఁ దండ్రి ప ♦ ర్యంకమందుఁ జేర్మిమై గూరుచుండిన ♦ పిన్నవాని
నట్టె యబుతినుబట్టి పొ ♦ మ్మనుచు నెట్టె సురుచి యచ్చటివారల ♦ బ్బురమునొంద
చ॥ మఱియు వచించె నామె యభి ♦ మానము పెంపున నోరిమింక ని
త్తెఱఁగున నెన్నడేనియును ♦ దేకువ సేయకు మెవ్వరేనియే

డైలఁ గనుగొన్న భూపతి ప్ర • తిష్టకు భంగము గల్గఁగాదె క్రి
చ్చుఱ నొక నీచసంకమున • యందు వసింపఁగఁజేయు టొప్పునే.

చ॥ అమల నృపాంక పీఠమున • యందు వసించు నదృష్ట మున్న ను
త్తముఁడును బోలె నీవును గృ • తజ్ఞుఁడవౌదువు నా సుతుండవై
యమరకపోయె నీయెడల • నంతటి పుణ్యము పూర్వజన్మ పా
పమనుచు నింక నీ జనని • పజ్జకుఁ బొమ్మిట నిల్వకింతయున్.

తే॥ ఎంతయో పాపమొనరించి • యీవభాగ్యురాలయిన యా సునీతిగ • ర్భమునఁబుట్టి
పెద్ద కోర్కులఁ గోరదే • బుద్ధిలేక చనుము నీ మోముఁ జూడంగఁ • జనదుమాకు.

చ॥ నృపతికిఁ బెద్దభార్యనని • యెంతయు నీ జనయిత్రి గర్వమున్
గపటము దుస్స్వభావమును • గల్గి చరించుట యేనెఱుంగనే
యిపుడిపుడే బయల్పడును • హీనుఁడ మీ కుటిల ప్రవర్తనం
బపరిచిత ప్రదేశమున • నట్లచరించిన యంత సాగునే.

తే॥ ఎంతకాల మిట్ల, హీనగర్వంబున సంచరింపఁగలరో • మించిమీరు
చూతుఁగాక విదియఁ • జూపట్టకుండిన శశిని గనఁగలేమె • చవితినాఁడు.

తే॥ పతినిజూచి సవతి • పచరించు దుండగంబుల సహించుచుంటి • ముందువెనుక
లరయవలదె యిట్టి • యాగడంబా సేయవలయుఁ గాంతలైన • వారికెందు.

—ధ్రువుఁడు సురుచితో సంభాషించుట—

చ॥ అనుటయు నా ధ్రువుండు నయ • నంబుల నెచ్చని నీరుగాఱఁగాఁ
దనువు వడంక నెమ్మొగము • దద్దయుఁ జెమ్మగిలన్ మనంబు శో
కనికర చంచలంబగుడు • గద్గదికన్ బినతల్లిఁ గాంచి యి
ట్లనియె నయంబు డంబుమెఱయన్ • గనువారికి వింతఁ గొల్పుచున్.

మ॥ జననీ యేమిటికాగ్రహించెదవు నీ • సంతానమేకాదొ యీ
జన మీరీతి సభాసదుల్ విన నస • త్సంభాషణల్ సేయఁగాఁ
జనునే నా యపరాధమేమి మది ను • త్సాహంబు రేకెత్తఁ దం
డ్రిని దర్శింపఁగ వచ్చినట్టి నను నిం • దింపంగ నొరాదునే.

చ॥ జనకుని ప్రేమ కెంతయును • స్థానముగాఁడె సుతుండు తండ్రి చెం
త నిలిచినంతఁ బొమ్మనుచు • దర్పమునన్ నను బొఱఁగొట్టె దీ
వనఘులు తల్లిదండ్రులకె • యాత్మజులందు నసూయ గల్గినన్
గనికగమాని యెవ్వరికిఁ • గాచెడివారలొ కన్నబిడ్డలన్.

చ॥ తనయుల వృద్ధిఁ గోరియె క • దా యనయంబును బాపపుణ్యముల్
బొనరిచి యష్టకష్టములఁ • బొందుచు సౌఖ్యములేక యుంతయున్

ధనము గడించుచుంద్రు తలి • దండ్రులు ధర్మముఁదప్పిరైన సో
జనని యెఱుంగమే తనయ • సంగతిగేహము ధన్యమం చిలన్.
తే॥ సవతికొడుకటంచు • ధ్రువునందు కన్న నీ యుత్తమునెడఁ బ్రేమ • ముండుగాక
తలఁపనేను నతఁడుఁ • దండ్రికొక్కటియగాదా యెఱుంగనైతె • ధర్మపదము.
తే॥ పిత్ర్యమైన సర్వస్వంబు • బిడ్డలైన వారి కందఱకును సమ • భాగమగుచు
నుండునే గాక యిలనొక్క•రుండె చెందనర్హ నైయుండునే చెప్పు•మమ్మయింత.
ఉ॥ నీకు జనించినంత జన • నీ మన యుత్తముఁడే సమస్తముగ్
గైకొన నర్హుఁడౌనె ననుఁ • గాంచఁడె పుత్రుని గా మహీధవుం
డీ కరణిన్ వచింపఁదగు • నే ననులాతిగఁ జూతువే కటా
నీ కెఱుఁగంగరాని నృప • నీ తిని నే వచియింపనేర్తు నే.
తే॥ నీ యనుఁగు కుఱ్ఱనిన్ గూర్చి • నాయెనర్చినట్టి తప్పేమికలదమ్మ • యందఱు విన
దాసి కొడుకును గనినట్లు • వీసమునకుఁ గాని వానిఁగఁబలికెదు • కనలినన్ను.
తే॥ ఇంతమాత్రమునకె • యింతలు సేసితి వెంత సేయఁగలవొ • యింక మీఁద
నింతదనుక తల్లి • వే యనుకొంటిని సవతితల్లివైతె • సరగ నాకు.
చ॥ తనయుఁడు ముద్దుకుఱ్ఱఁడు ము • దంబున సన్నిధి కేగుదెంచె నా
తనిఁ దొడమీఁదఁ జేర్చుకొని • తద్దయుఁ బ్రీతిని ముద్దుముచ్చటల్
గనుటయె పండు వంచు నను • కంపవహింపక తండ్రి యివ్విధిన్
గనుఁగొనుచుండె నీ సలుపు • కర్జము నెంతటి కర్కశాత్ముఁడో.
తే॥ ఉత్తమునియందు నీ ప్రేమ మున్నయటుల నన్నుఁ గన్న సునీతికి • నాయెడలను
ప్రేమముండక యుండునే • పెంచి పెద్దఁజేసి కొఱఁగానివానిగఁ • జేయఁగలదే.
చ॥ అని వచియించినన్ సురుచి • యాతని నెంతయుఁ గ్రోధచిత్తయై
యనియె దురాత్మ యిక్కరణి • నా డెద వే భయమింత లేక దే
వినలఁతిగాఁ గనుంగొనెద • వే చెడుబుద్ధిని మాననైతివే
జననిగుణంబె పట్టువడి • సర్వసమర్ధుని గా నొనర్చె నే.
తే॥ ఇచట సాగివచ్చు • నే నీ దుడుకుపల్కులెల్ల నింకఁ బొమ్ము • తల్లికడకు
బాలకుండవనుచుఁ • బాటించి విడిచినఁ బెద్దవాఁడవైతె • బింకమునను.
తే॥ అనుచుఁ బుడమి నాథుఁ • డడర నాతని గళసీమయందుఁ బట్టి • చెనఁటి యింకఁ
బొమ్ముపొమ్మటంచు • హుమ్మని త్రోచెనా సురుచి యెల్లవారుఁ • జూచుచుండ.
వ॥ అవ్విధంబున ధ్రువుండు సురుచిచేఁ బరాభవింపఁబడి దుఃఖించుచు జనని సాన్నిధ్యం బుఁజేరి.

—సునీతి ధ్రువుఁడు రాక తడయుటచేఁ జింతించుట—

చ॥ తనయుఁ డమాయకుండు పర • తత్వ మెఱుంగఁడు బాలుఁడాతనిన్
గనుఁగొనకున్న మూర్తమే యు • గంబుగ దుస్సహమాచుఁ దోఁచుఁ జ

య్యనని దియాడుకొందునని • యాయయి బాలురఁగూడి పోయె నెం
దునఁ జరలాడునో యెవరి • తోఁ గలహించుచు నుండెనో కదా.

తే॥ ఉత్తమునికడ కేగునే • నుత్తముఁడన కతని తల్లి నాపై నాగ్ర • హంబు గలిగి
యున్న కారణమున నెది • రోనె పంబుఁజేసి దండింపకుండదు • చిన్నవాని.

తే॥ పతిపరిత్యక్తనగుట న • భాగ్యురాలనై తపించుచుఁ దనువుపై • నాసలేక
సుతుని కతమున నించుక • గతిలభించు ననుచు జీవింతు సుతుఁ డెట్టు • లరిగెనొక్కొ.

తే॥ తనయుఁ డాడుకొనఁగఁ • దలఁచి వీధికిఁబోయివచ్చుదాఁక భయము • హెచ్చుచుండుఁ
గుడువఁడయ్యెఁ జలిదిఁ • దడవయ్యె నేఁడితఁ డసలుచుండె నేమి • పాసఁగెనొకొ.

తే॥ అని తపించు సునీతి డా • యంగఁబోయి కొడుకు కన్నీరు మున్నీర • గుచు ముంప
భోరుమని యేడ్వఁ గలకంఠ • కీరశారికా రవంబు పగిదిని వి • చారమొప్ప.

చ॥ అదిగని తల్లి భీతయయి • యక్కట యేమిపాసంగెనయ్య యి
ట్లదరెదవేల నీవు కొడు • కా వచియింపు మెవారలేని ని
న్నదయతఁగొట్టి పంపిరొ గ్ర • హంబులు చాలవు పోకుమన్నఁ బో
యెదనని యాడఁబోయి తిపు • డెందులకీ వగఁ జెందె దెంతయున్.

తే॥ ఉత్తముం డుత్తముండని యుఱుకుచుండు వటుఁ బోవుగదా యిప్డు • దతనితల్లి
మనయెడలఁ గోపనయగుచు • మండుచుండు నృపతి చనవిచ్చుటన్ జేసి • యెపుడుమదిని.

వ॥ అని పలికి కుమారుని విచారకారణం బెఱింగి దీనయై యిట్లనియె.

— సునీతి ధ్రువునితో హరిని సేవింపుమని చెప్పుట —

చ॥ పలుకనె యెన్నియోగతులఁ • బార్థివుచెంతకుఁ బోఁదలంపఁగా
వలదని వింటివే సురుచి • పట్టియె ప్రాణపదంబటంచు ని
చ్చలు ముదమొందు నాతని క • సహ్యుఁడవై కనుపట్టవే నినున్
దలఁచునె పుత్రుఁడంచు వసు • ధాపతి నీయెడఁ గూర్మిఁ గాంచునే.

క॥ సురుచికిలోనై జనకుఁడు ధరణీభారంబు నేప్ర • ధానులకొసఁగన్
గరుణాశాలియగుచు నిన్నరయునె నీకిట్టి భ్రాంతి • యనర్హంబగునే.

తే॥ జనపతి కతంబునన్ గల్గు • సౌఖ్యమెల్ల సురుచిపాలయ్యెఁ గష్టముల్ • చూఱకొనియె
నన్ను నిర్భాగ్యనైతి నా • పన్ననైన నా సుతుండవు నీకు సు • ఖంబు గలదె.

చ॥ కలుషమొనర్చి పుట్టితివి • క్ష్మాపతి యింతయు జాలిలేక ని
చ్చలు మనపేరు విన్న విర • సంబుగఁ జూచుచునుండు నుత్తమున్
బిలిచి ముదంబుఁగూర్చు నినుఁ • బిల్వక వచ్చినఁగాని నెమ్మదిన్
బలుకఁ దలంపఁడేమిటికి • పార్థివుఁ జేరఁగ నెంతు వక్కటా.

తే॥ విధికృతంబిదియేగతి ♦ విసుగుకొనిన తప్పదెంతటివారికిఁ ♦ దనయ తండ్రి
యంకభాగంబునన్ జేరు♦నట్టి భాగ్య మిలఁ గలుగదయ్యె ననుచుఁ జిం♦తిలకుమయ్య.

మ॥ తన యుత్సంగ మొసంగె నుత్తమునకున్ ♦ ధాత్రీశ్వరుండింక నా
తనికే రాజ్యముగూడ నీఁదలఁచుఁ ధ ♦ ధ్యంబించు నూహించి యెందు
నకున్ గూడని వంతఁ గుందకము వె ♦ న్నుండున్నవాఁడమ్మహా
త్ముని సేవింపుము నిత్యమైన పదమున్ ♦ మోదంబునన్ నీకిడున్.

తే॥ తనువు నిత్యంబుగా దస♦త్యంబు జగము కలుష భూయిష్ఠమైన యీ♦యిష్మతలంబుఁ
గోరి శుష్కింపనేల ప్రా♦జ్ఞులదిక్కు మాధవుండాతని స్మరించి ♦ మనుము పుత్ర.

తే॥ సానఁ దీరిన రత్నసం♦చయము గలుగ గులకరాలకై యత్నంబు ♦ సలుపుటేల
నిత్యసుఖదాయకుండగు ♦ నృహరియుండ నృపతి కరుణకై తపియించు ♦ టేలచెపుమ.

ఉ॥ ఎల్లజగంబులన్ మనుచు ♦ నేపనియాటను భూతరాశికిన్
దల్లియుఁ దండ్రియున్ గురుఁడు ♦ దైవము నై యలరారు దేవుఁడు
త్ఫుల్లసరోజలోచనుఁడు ♦ పూరుషముఖ్యుఁడు విష్ణుమూర్తి యం
దుల్లముఁజేర్చి ద్రిమ్మరుట ♦ యుత్తమధర్మము మానవాళికిన్.

ఉ॥ ఎన్ని భవంబులొందితిమొ ♦ యెందఱుతండ్రులో తల్లులెందఱో
మున్నిఁకమీఁద నెన్నిభవ ♦ ముల్ గొననయ్యెడినో యెఱుంగరా
దిన్నిట నెట్టిముక్తి లభి ♦ యించె నిఁకెట్టిది కల్గనున్నదో
యన్న వృథాప్రయాసమె గ ♦ దా పరమేశు భజింపకుండినన్.

తే॥ స్వప్నవృత్తాంతమున్ బోలె ♦ జగము తెలివిగలిగి నప్పుడ నశియించుఁ♦గాంచలేక
తల్లడంపడుచుండెద ♦ రెల్లవార లీశ్వరుని మహిమంబుఁ దా ♦ రెఱుఁగలేమి.

తే॥ రజ్జువును గాంచి సర్పమన్ ♦ భ్రాంతిఁజెంది భయమునన్ జీర్ణమయ్యెడు♦పగదిఁ గృత్రి
మంబయిన యీజగంబె ని♦త్యంబటంచునమ్మి చెడిపోవుచుండ్రు మా♦నవులుసతము.

తే॥ పుట్టుచుండువారి ♦ గిట్టుచుండెడివారిఁ బెరుఁగుచుండువారి ♦ నరయుచుండి
యింత తెలివిలేక ♦ యేల మాయావృతంబైన తనువునందు ♦ నాసఁగొనుట.

మ॥ చనరైరే మును పెందఱో నృపతు లీ ♦ సర్వంసహా మండలం
బును బాలించినవారు ధీరులు జగ ♦ త్పూజ్యుల్ మునిశ్రేష్ఠులున్
జనలేదే చన కీజగంబున నెని ♦ చ్చల్ నిల్వఁగా నేర్చునే
తనుభృత్సంతతి తుచ్ఛసౌఖ్యమునకై ♦ ధర్మంబుఁ బాటింపరే.

తే॥ తల్లిదండ్రులు హితులు బాం♦ధవులు భటులు మున్నయినవాగలీ తమం♦బునకులొంగి
ధనమును గుణించి గౌరవం♦బునఁ జరింతు రఘముఁగూర్చును గాదె ధ♦నాశజగతి.

తే॥ తండ్రి యుత్సంగ పదము ని♦త్యంబుగాదు హరియొసంగు పదం బని♦త్యంబుగాదు
నిత్యసుఖము లభింపన ♦ నిత్యమైన తుచ్ఛసుఖము నాశించుట ♦ దొడ్డపనియె.

చ॥ హరి పరమాత్ముఁడాతని ప • దాబ్జములన్ భజియింపు మా సురే
శ్వరుఁడు కృపాళుఁడై నిఖిల • సాధునుతంబగు నిత్యసౌఖ్యమా
దరమున నీకిడన్ గలఁడు • ధర్మపదంబున సంచరించినన్
గరము వశంవదుండగును • గాంచనచేలుఁడటం చెఱుంగవే.
తే॥ ఆడుకొందు ననుచు • నల్లరిపిల్లలఁగూడి తిరుగుటేల • కొఱఁత నాకు
కలిగినంతవఱకు • గంజియో గటకయో త్రావి హరిభజింపఁ • దలఁపుమింక.
క॥ అని యుపదేశ మొనర్చిన జనని కెఱఁగి ధ్రువుఁడు వినయ • సంయుతుఁడగుచున్
ఘనతర భక్త్యుద్రేకంబునఁ బలికె నమోఘసూక్తి • పుంజంబలరన్.
మ॥ జననీ ధన్యుఁడనైతి నిట్టి యుపదే • శంబేకదా చేయఁగాఁ
జను నావంటి తమఃపరీతునకు వి • శ్వవ్యాపకుండై మునీం
ద్ర నికాయార్చితుఁడైన దేవుని పద • ద్వంద్వంబు సేవించినన్.
గనుసన్నే నరుఁడెట్టివాఁడయిన మో • క్షం బక్రమంబొందుచున్.
క॥ కావున లక్ష్మీవల్లభు సేవింపఁగఁ గాననంబుఁ • జేరుదు నింకన్
నావంటి చంచలాత్మున కేవిధి స్థైర్యంబు గలుగు • నిలు వీడనిచో.
చ॥ హరిభజనానురక్తులగు • నట్టి మహాత్ములు మాను లెల్ల మం
దిరములవీడి ఘోరవన • దేశములన్ జపియించుటహహా మా
స్థిరమతులైనఁగాక సర • సీరుహనేత్రుఁడు మెచ్చునే తపం
బరయ నిరంతరాయమగు • నా జననీ గృహమందె యుండినన్.
చ॥ తనువు ధనంబు సర్వమును • దానవవైరి కొసంగి యా నిరం
జను నెడ భక్తి నిల్పి సర • సంబగు వృత్తి జపింపఁగోరు స
జ్జనులకు రత్ననిర్మిత వి • శాల మహాభవనంబులైన ని
ర్జన వనరాజియైనను గ • రంబు ప్రియంబులు గాకయుండునే.
తే॥ నీయనుగ్రహమున • నే వృద్ధియయ్యె నీ తనువు నీ కతమున • దైత్యవైరి
చరణసేవ సేయ • సమకట్టియున్నది తల్లి నీవ నాకు • దైవమిలను.
మ॥ నను దీవింపుము వేగఁ బంపుము జగ • న్నాథుండు గోవిందుఁడ
య్యనఘున్ శైశవభక్తిఁ గొల్చెదను లో • కాతీతమౌ స్థానమున్
గనుఁగొందున్ బరమార్థ తత్పరుఁడనై • కైవల్యమున్ జెంది యీ
జనిధన్యంబగునట్లు సేయుదును వి • శ్వాసంబు సంధించుచున్.
క॥ ఎదియేనొక కార్యముఁ జేయఁదలఁచి యున్నపుడు సంశ • యపరీవృతమౌ
పదమును ద్రొక్కమి యఫల ప్రదమగు మార్గముఁ గనుట శు • భంబనిరి బుధు

—ధ్రువుఁడు తపోవనమున కరుగుట—

క॥ అని జననివలన దీవెనలనుగొని పంచాబ్దములఁ జె • లంగెడి ధ్రువుఁ డ
గ్నినిభుఁడు వశియగుచు వనంబునకున్ బయనం బొనర్చె • బూనికయలరన్.

చ॥ కమలదళాక్షు నెవ్విధము ♦ గా భజియించుట యర్హమౌనొ
చిత్తమున నెఱుంగఁ డింతయు ము ♦ జంబున శ్రీధవునిన్ దపించి యు
త్తమపదమున్ వహింతునని ♦ తద్దయుఁ గోరును కాని బాలకుం
డమలినబుద్ధు లీశ్వరుని ♦ యందున భారము నిల్పరే భువిన్.

చ॥ హరిభజనంబె ముఖ్యమగు ♦ నాచరణీయముగాఁగ నా ధ్రువుం
డరిగెఁ బురంబు వెల్వడి భ ♦ యంకర సత్త్వ నివాసయోగ్యమై
తరణికరాసహిష్ణువయి ♦ దాసలోకపదంబునై నిరం
తర విచల త్పిశాచగణ ♦ దర్పితమైన మహాటవీస్థలిన్.

తే॥ ఎచటికేఁగఁదగునొ ♦ యెవ్వానిసాయంబుఁ గోరఁదగునొ యెటుల ♦ నీరజాక్షు
వశ్యునిగ నొనర్ప ♦ వలయునొ యరయక యుగ్రవనినిఁ బోవు ♦ చుండె ధ్రువుఁడు.

సీ॥ బుసకొట్టుచును బిట్టు ♦ విసముఁ గ్రక్కుచుఁ బైనిబడు త్రాఁచులను గాంచి ♦ భయముఁ గనఁడు
ప్రళయంబునన్ బోలెఁ ♦ బ్రజ్వరిల్లుదవానలముఁ గనినైనఁ ద ♦ లంగఁడింతఁ
జుట్టుమూఁగెడి పిశా ♦ చుల వికృతాకారములఁ జూచియును దల్ల ♦ డిలఁడు మదిని
యాయాసమును గూర్చు ♦ నట్టి యాఁకలిదప్పికలు మించినను గాని ♦ కలఁతపడఁడు
ప్రబలవాతాహతిన్ ద్రెళ్ళు ♦ వసుమతీరుహధ్వనులకైనఁ బాఱఁడయ్యర్భకుండు
ఈశ్వరధ్యాన నిరతి వి ♦ స్మృత సమస్తపరవిషయుఁడై మహావని ♦ నరుగునపుడు.

చ॥ చనిచని యమ్మహాటవిని ♦ సాధుజనాగ్రణి యా ధ్రువుండు క
న్గొనె నొక కొంతదూరమునఁ ♦ గోమలచారు లతావకీర్ణమున్
మునికృత హోమధూమ పరి ♦ పూతముఁ దత్తదభీష్ట దేవతా
ప్రణతి సమర్చనానిరత ♦ బ్రాహ్మణపూరితమైన దేశమున్.

క॥ కనుఁగొని యామున్యాశ్రమమునకున్ మెలమెల్లఁజని ధ్రువుండు ముదమునన్
దనువు గగుర్పొడువంగాఁ దనఃఋాసగువాని మౌని ♦ దారసి నొకనిన్.

క॥ కనిముప్పిరిఁగొను కౌతుకమున నయ్యాశ్రమము గాధి ♦ పుత్రునివాసం
బని యెఱిఁగి యతనివలనన్ ఘను విశ్వామిత్రుఁ గాంచఁ ♦ గాఁ గోరుచొగిన్.

వ॥ అమ్మునిపుత్రుని చూపిన మార్గంబున నాశ్రమాంతః కుటీరంబునఁ బ్రవేశించి యందు.

తే॥ మూర్తిఁదాల్చినయట్టి త ♦ పోనిచయము నాఁగనలరారు గాధి నం ♦ దనునిఁ గాంచి
భక్తిసంయుక్తి మ్రొక్కి య ♦ బ్బాలకుండు నిర్మలస్వాంతుఁడై యటు ♦ నిలిచినంత.

చ॥ అనఘుఁడు గాధిపుత్త్రుఁడు ద ♦ యాన్వితుఁడై నృపసూతిఁ గాంచి యి
వ్వనమున కిట్టిబాల్యమున ♦ వచ్చిన సాహసి యీతఁ డెవ్వఁ డీ
తనికిట నేమికార్యమొ ప ♦ దంపడి యాసి వీని కోర్కెఁ దీ
ర్తుననుచు నెంచి యా ధ్రువుని ♦ తోడ నెదగ్గఱఁజేరి యిట్లనున్.

—విశ్వామిత్రుఁడు ధ్రువు నాదరించుట—

ఉ॥ ఏటికి వచ్చినాఁడ విటు • లెవ్వఁడవీ వెవరంపిరయ్య యు
గ్రాటవి నిన్నువంటి యొక • యర్భకుఁ డొంటిగవచ్చు టహహా మే
మాటలవంటిదే విపిన • మార్గము బాలుఁడవిట్టి ధైర్యముల్
సాటిలె మానిసంతతికి • సత్కులధర్మము సాహసంబునన్.

క॥ అనియడిగి ధ్రువునివచ్చిన పని నెఱిఁగి మునిప్రవరుఁడు • బాలుని ధైర్యం
బునకును సాహసమునకున్ మనమున నచ్చెరువు పడుచు • మఱి యిట్లనియెన్.

చ॥ కనికరమింతలేక నినుఁ • గన్గొని నీ పినతల్లి యాత్మ నం
దను నెడ గారవంబు మెయిఁ • దద్దయుఁ బల్కిన బీదపల్కులన్
వినుచు సహింపలేకిటుల • వీఁగక కేశవునిన్ భజింపఁగా
వనమున కేగుదెంచితి వె • బాలక క్షత్రియధర్మ మొప్పఁగన్.

ఉ॥ పౌరుషశాలివేయగుదు • బాలక యించుక మాటవచ్చినన్
ధీరతనుత్తమంబయిన • దివ్యపదంబు గడింతునంచు నీ
ఘోరవనంబుఁజేరితివి • క్రూర భయంకర సత్త్వసంతతిన్
బూరికినైనఁ గైకొనక • పూతచరిత్రుని విష్ణుఁ గొల్వఁగన్.

సీ॥ చరణముల్ క్రొత్తమాం•సపు ముద్దలయ్యెఁ గంటకమార్గమున యందు•నడచుకతనఁ
గనులు గుంటలువడి • యెనుగదా సంపూర్ణమైన యాహారంబు • నందకుంట
మోము వివర్ణమై • ముడుతలువడియె నాతపవర్షములలోనె • తను గుడుచుటఁ
దనువెల్లఁ జెమ్మగి • ల్లెను పెనుదవ్వుట్లు శ్రమదీర్చుకొనక యా • సఁగొని రాఁగ
యతులకే గోచరింపని • యట్టివాని భక్తసులభుండటంచు భా • వమునఁ దలఁచి
యిదుమ లెన్నేని బడుచు ని • ట్లడవిలోన భళిరవచ్చితి నీ ధైర్య • మలఁతియగునె.

చ॥ పురమునువీడి పెన్వెతలఁ • బొందుచు వెన్నునిఁ గొల్తునంచు ని
క్కరణినిఁ జేరవచ్చితివి • గాధిసుతున్ నను నీకుఁ గాంచనాం
బరుఁడు కరంబు వశ్యుఁడగు • పద్ధతిఁ జూపెదఁ బ్రత్యయంబునన్
స్థిరమతివై యొఱుంగు మిఁక • ధీనిధి నాయెడ గౌరవంబునన్.

క॥ నీతలఁచినట్లు భక్తవ్రాత సులభుఁడైనవాఁడు • వనజాక్షుఁడు సం
ప్రీతి నతని భజియింపు మగాతికృతావజ్ఞఁ దొలఁగి • రాణింతువికన్.

తే॥ హరునిభక్తులందు • హరివోలె హరిభక్తులందు నీవు ఘనుఁడ • విందుధరుని
దక్షిణాంగమందుఁ • దైత్యారిపుట్టె నట్లగుట నీకొసంగు • నగ్రపదము.

తే॥ ప్రణవసహితమైన • పంచాక్షరీమంత్రజపము సేయ శివుఁడు • సంతసించు
ద్వాదశాక్షరిని ము • దంబున జపియింప హరిప్రియంబుఁ గూర్చు • నర్థి నీకు.

క॥ సర్వోత్తమంబగు పదము శర్వుఁడో కేశవుఁడో యిడఁగఁ ♦ జతురులగుదురే
యుర్విఁ దదన్యు లశక్తు లఖర్వము హరిభజన దానిఁ ♦ గావింపు మొగిన్.
క॥ యమునానదీ తటంబున నమరున్ మధుసంజ్ఞఁ దనరు ♦ నట్టి వనము నీ
వమలమతి ద్వాదశాక్షరిఁ గ్రమమున జపియింపు మచట ♦ ఘనమగుభక్తిన్.
మ॥ హరిసేవాపరులైన మానివరు లయ్యారామసీమన్ రమా
వరునిన్ గూర్చి తపంబొనర్తురు జగ ♦ ద్బంధుండు గోవిందుఁ డా
దరమున్ బూని వసంగుచుండు నిజ భ ♦ క్తశ్రేణికెల్లన్ వరో
త్కరమున్ నిచ్చలు నమ్మహావనిఁ దప ♦ స్థానంబు విప్రాళికిన్.
తే॥ ఇతరవనములందు ♦ నెన్నిసహస్రవత్సరములైనఁగాని ♦ తపము సల్పి
కనుఁగొనంగ లేని ♦ వనజాక్షు సులభంబ కాంచవచ్చునటఁ ద ♦ పించె నేని
చ॥ పరమపవిత్రయై యలరు ♦ భాస్కర నందిని యాస్రవంతిలో
స్థిరమతి మున్గి భక్తి మెయిఁ ♦ జెచ్చెర నమ్మధు సంజ్ఞకానన నాం
తరమునఁ జేరి వెన్నుని ము ♦ దంబునఁ గొల్చిరయేని యెట్టి దు
ష్కర తపమున్ బొనర్పకయె ♦ కాంతురు ముక్తిపదంబు సన్మునుల్.
తే॥ నదులలో యమునయును వనంబులందు మధువనంబును బ్రియములు ♦ మాధవునకుఁ
దజ్జలంబులయందాడి ♦ తల్లతాప్రసూనముల హరిఁ బూజింత్రు ♦ మానులెపుడు.

——ధ్రువుఁడు తపముఁ గావించుట——

క॥ అనుచున్ విశ్వామిత్రుఁడు జననాథకుమారునందు ♦ సదయుండగుచున్
ఘనమైన ద్వాదశాక్షరి యను మంత్రముఁ జెప్పిపంపె ♦ నంత నతండున్.
చ॥ అమలిన చిత్తుఁడౌచు ధ్రువుఁ డమ్మధు కాననమందుఁ జేరి ని
ష్ఠమెయి మునిప్రకాండములు ♦ సాధుబళా యని సన్నుతింపఁగన్
యమునమునుంగుచున్ జలరు ♦ హంబులఁ గైకొని మూఢభక్తిన
య్యమరవరేణ్యుఁ గేశవుద ♦ యామయుఁ బూజ యొనర్చు నెంతయున్.
తే॥ శాకమూల ఫలాహార ♦ సహితుఁడగుచుఁ బ్రాఙ్ముఖోపవిష్టుండయి ♦ ద్వాదశాక్ష
రినిఁ బఠింపుచు నన్యచిం ♦ తనము లేక హరిగుణించి తపము సేయు ♦ నవసరమున.
చ॥ అతనితపఃప్రభావమున ♦ కద్భుతమానసులై మునీంద్రులున్
యతులును యోగులున్ నృపతు ♦ లన్యులు వానికి శిష్యులైరి భూ
తతతి పిశాచ సంచయము ♦ దానవులున్ భయదంబులౌ మృగ
ప్రతతులు లొంగి యుంచుకయు ♦ బాధయొనర్పఁదలంప వాతనిన్.
క॥ ఈవిధి నొక సంవత్సర మావసుధేశాత్మజుండు ♦ హరిపూజా సం
భావితుఁడై యున్నెడఁ దత్ప్రావీణ్యము సైఁపలేక ♦ భయము జెలంగన్.

—సునీతి రూపంబున పిశాచము ధ్రువుని వంచింపఁదలఁచుట—

తే॥ ఒక పిశాచ మతని యున్నత తపము భంగంబొనర్ప నెంచి • కనలి యతని
జననిరూపమూని • చనుదెంచి బహుళదుఃఖార్తయగుచుఁ బల్కె • నతనితోడ.

మ॥ తన యాభీషణమైన యీ తపమునన్ • ధన్యుండవౌదే మునీం
ద్రనికాయంబునకే నసాధ్యుఁడగు నా • దైత్యారి సాధింతునం
చని వ్యర్థంబుగ నేల కాయమున కా • యాసంబుఁ గల్గించు టీ
తనువున్ నాశమొనర్చి యే సుఖము నొం • దన్ నేర్తు వాపిమ్మటన్.

తే॥ పతికిఁ గాకయుండి • సతతంబు నీయందె ప్రాణములను నిల్పి • బ్రదుకఁగోరు
చున్నదాన నను వి • పన్నఁగా నొనరించి తప మొనర్తుననుట • తగునె నీకు.

తే॥ సవతియెడఁగలకినుక నా • సమయమందుఁ బొమ్మనుచుఁ బల్కె నంతన • పూన్కి లోక
ఘోర కాంతారమున కిట్లు • జేరితీవు నాకు దిక్కెవరయ్య య • న్నగరమందు.

చ॥ స్థిరమతి నిమ్మహావనముఁ • జేరి తపంబొనరించినంత నా
హరి కరుణించునం చిటుల • నాన్మఁదలంచెదు గాని వృద్ధయై
పురమున దిక్కులేక వెతఁ • బొందుచు గ్రాసము లేమి జీర్ణమై
నిరతము నిన్ స్మరించు జన • నిన్ విడఁగూడదటంచు నెంచవో.

తే॥ తపము లెన్నియైన • దానంబులెవియైన వ్రతశతంబులైన • భక్తియుక్తి
సతత మాతృసేవ • సలుపు పుణ్యంబును బోల నేర్చునే నృ • పాలతనయ.

చ॥ అకట త్వదేకపుత్రనయి • యార్యునకున్ గొలగాని దాననై
సకలము నీవయంచు నిను • సాకుచు నెట్టులో జీవయాత్ర స
ల్పి కడచిపోవుటహ౯మని పేర్మిఁ జరించుచునున్న దానిఁ బూ
నిక విడనాడి రాఁదగునె • నీకు నృపాలసుతా వచింపుమా.

తే॥ అని యనేకవిధంబుల • నా పిశాచ మట్లు వ్యాజంబునన్ ఙ్క్షత్రి • యాంగనగతి
ధ్రువునితపము బన్న మొనర్ప • దుడుసుఁదనముఁ బూని పల్కియు విఫలయై • పోయెనంత.

చ॥ హరిభజనంబె ముఖ్యముగ • నారసి విఘ్నము లెన్నియే నవాం
తరములు గల్గినన్ మదిని • ధైర్యము వీడక యా ధ్రువుండు దు
శ్చరతపముం బొనర్చుటయు • సాధువశంవదుఁడైన కాంచనాం
బరుఁడు కృపాన్వితుండగుచు • బాలునకున్ వరమీఁదలంచుచున్.

సీ॥ కలశాబ్ధికన్యకా • కలిత పార్శ్వంబుతోఁ గరధృత శంఖచ • క్రములతోడఁ
గటిభాగవిలసిత • కాంచనాంబరముతోఁ జతుర చతుర్భుజా • లతలతోడఁ
గరుణారసాంచిత • కమనీయముఖముతోఁ దిలకరాజితఫాల • తలముతోడఁ
గౌస్తుభ మాణిక్య • నిస్తులోరస్సుతోఁ దతసూర్యచంద్ర నే • త్రములతోడ

సురలు సేవింప మౌనులు ♦ స్తుతియొనర్ప దివ్యగాయకుల్ గీర్తింప ♦ భవ్యమూర్తి
యగుచు గరుడవాహనమున♦యందు నెక్కి యంబుజాక్షుండు ప్రత్యక్ష♦మయ్యెనపుడు.

తే॥ అటులఁ బ్రత్యక్షమైన య♦బ్జాయతాక్షుఁ గనుఁగొని ధ్రువుండు నిజతపో♦జనితఫలము
గా నెఱింగెడి తెలివిలే♦కయును సుంత హరినిఁగూర్చి వచించె న♦బ్బురముదోఁప.

తే॥ గ్రద్దనెక్కినావు ♦ కన్నియనొకచెంపఁ బూనినావు సురలు ♦ మౌనివరులు
వెంటనంటియుండ ♦ వేవేగ నిచ్చటి కరుగుదెంచితెవఁడ ♦ వయ్యనీవు.

క॥ విపుల తపోవిభవంబున నపరబ్రహ్మలయి యీశ్వ ♦ రార్చారతులై
తపములు చరించుతావున కిపు డేమిటికేగుదెంచి ♦ తీవు మహాత్మా.

చ॥ పురమునయందు స్థైర్యమును ♦ బూని తపంబొనరింపలేక భీ
కరమగు కానఁజేరి యొడి ♦ కంబున విష్ణుభజించు మాదృశుల్
తిరిగెదు నాశ్రమంబులకుఁ ♦ దేఁకువసైన్యముతోడ వచ్చుటల్
పరుసదనంబు గాదె భగ ♦ వానుఁడు వెన్నుఁడు మెచ్చునే నినున్

తే॥ అనుచుఁ దన మహత్వ♦ము నెఱుంగలేక యేమొవచించు ధ్రువుని♦ముద్దుపలుకుఁ
దేనియలను గ్రోలి ♦ మానసం బుల్లాసమొందఁ జిఱునగవును ♦ జెందియపుడు.

చ॥ సరసిజలోచనుం డమల ♦ శంఖ పవిత్రితమైన హస్తకం
జరుహముతోడ నా ధ్రువుని ♦ చారుముఖంబు స్పృశించెనంత భూ
పరతనయుండు తెల్విఁగని ♦ ప్రాఁబలుకుంగమికేని యంద కీ
శ్వరపదవాచ్యుఁడై యలరు ♦ వాని రమాధవు మ్రొక్కి యిట్లనున్.

సీ॥ పరమేశ నీ మహ ♦ త్వమెఱుంగనేర్తురే బ్రహ్మాదినిర్జర ♦ వర్యులేని
ప్రాకృతంబైన స ♦ ర్గస్థితి సంహారములు నీయెడలనె నిచ్చలుఁ జెలంగు
నీమాయను దరింప ♦ నేరక సంసారబంధంబునన్ బడి పాపులగుచు
నిరయంబుఁ జెందు పా ♦ మరులఁ గనికరించి భక్తిసాధనమిడి ♦ భుక్తిముక్తు
లొసఁగుచుందువెప్పు ♦ డుర్వినీవంటి దైవంబొకండు కలఁడె ♦ పరమపురుష
యర్భకుండనగుట ♦ నరయలేనైతి నన్ బ్రోవవచ్చితని ని ♦ రూఢమతిని.

క॥ చేయెత్తి మ్రొక్కెదను శ్రీనాయక సైఁపఁగదవయ్య ♦ నా నేరములన్
హేయమగు తనువుఁదాల్చి త్వదీయమహిమ మెఱుఁగనేర్తు ♦ రే యేవారున్.

తే॥ చూడ సన్యాసిపెండ్లికి ♦ జుట్టుగూడ నెరవనెడురీతి నా తప ♦ శ్చరణమునకు
నన్నిసాధనములను నీ వాదరమున నొసఁగి ధన్యునిఁగాఁ జేసి ♦ తో మహాత్మ.

చ॥ అనఘ యవాంతరంబులగు ♦ నట్టివి విఘ్నము లెన్ని కల్గినన్
నను భజియించు వీఁడనుచు ♦ నాయెడ సత్కృపఁ జేసి వాని నె
ల్ల నడఁచి మత్తపంబు సఫ ♦ లంబగునట్లొనరించితీవు నీ
కనికరమిట్టిదం చెఱుఁగఁ ♦ గా వశమౌనె యెవారికే నిలన్.

చ॥ అని వినుతించు నా ధ్రువున • కంబుజనేత్రుఁడు పల్కె నో మునీం
ద్రనుతచరిత్ర నీ తపముఁ • దద్దయు మెచ్చితి నీ మనోరథం
బు నిపుడయిత్తుఁ గైకొనుము • పూర్వము శంకరుఁగొల్చి యేను గై
కొనినది సత్పదంబు సుర • కోటి సమర్చితమైన దెంతయున్.

—శ్రీమన్నారాయణుఁడు ధ్రువునకు ధ్రువస్థానమిచ్చుట—

తే॥ సప్తఋషిమండలోపరి • స్థము సమస్తమునిజనారాధ్యము ధ్రువంబు • ననఘ
పదముఁ గైకొని యందు శా•శ్వతసుఖంబు ననుభవింపుము నేఁడాది•యనవరత
తే॥ జ్యోతిరాలయమనఁగఁ బ్ర•ఖ్యాతమైన యా ధ్రువస్థానమందుఁ బూ•జ్యయగు
తోడ నివసింపుమింక నీ • వాఁడనగుచు సర్వసుఖము లొసఁగుచుందు • సంతత
వ॥ అక్షయంబును సర్వస్థానోత్తమంబును ధ్రువాఖ్యంబునగు నా దివ్యస్థానం
ష్ఠించి నిరంతర మాతృసేవాపరుండవై మనుమని వరంబొసంగి గోవిందుఁడు
దేవర్షిగణంబులు వినుతింప ధ్రువుని మాతృసహితంబుగ ధ్రువస్థానంబున
కించెనని వచియించి సూతుండు దేవదానవాద్యుత్పత్తినిగూర్చి యిట్లని
దొడంగె.

—దేవదానవాద్యుత్పత్తి—

సీ॥ పంచనూతికి జని • యించిరి వేవురు సుతులు దక్షప్రజా • పతి కతమున
వారలఁ గనుఁగొని • నారదమునిపల్కె భూప్రమాణంబును • బూన్కిఁగాంచి
రండుపిమ్మటను స • ర్గంబొనర్పుఁడు మీరలన విని వారును • నట్లయనుచుఁ
జని సాగరంబున • సంక్రమించిన నదులట్ల మరలిరాక • యాలసింప
దక్షుఁడాత్మగుంది • తగ వేవురను సూతియనెడు కాంతయందుఁ • గనియెశబళు
లనెడువారి నార • దుని వచనంబున వారుఁ జనిరి భ్రాతృ • వర్గమటుల.

తే॥ మఱియు దక్షప్రజాపతి • మమతతోడ వైరిణియనెడి కులకాంత • వలనఁగని
బుత్రికల నాఱుపదులను • ధాత్రిసృష్టి సలుపవలయు ననెడి బుద్ధి • గలిగియ
తే॥ పదుగురను ధర్మునకుఁ గశ్య•ప ప్రజాపతికిఁబదియు మువ్వురను జంద్రు•నకును
పదులపై నేగురను నల్వు • రఁ దగనిచ్చె ఘనుఁడరిష్టనేమి యనెడు•మునికిమఱి
వ॥ ఇరువుర భృగుపుత్రునకును, గృశాశ్వునకును నంగిరునకు నిరువురేసిగ నొసంగె
ధర్ముని సతులగు మరుత్వతియు వసువును, యామియు లంబయు, భానువును
ధతియు, సంకల్పయు, ముహూర్తయు, సాధ్యయు, విశ్వాసయు, భామినియు
వారు దేవమాతలై రది యెట్లనిన విశ్వకు విశ్వేదేవతలును, సాధ్యకు సాధ్య
మరుత్వతికి మరుత్తులును వసువునకు వసువులును, భానువునకు భానువులును ము
ర్తకు ముహూర్తకులును, లంబకు ఘోషసంజ్ఞలును, యామినికి నాగవీథు

సంకల్పకు సంకల్పులును ననువారు గలిగిరి. ఆపో, ధ్రువ, సోమ, ధరా, నిలానల ప్ర త్యూష, ప్రభాసులను వారష్టవసువులన నలరిరి. అజుండును, నేకపాదుండును నహిర్బు ధ్న్యుండును, విరూపాక్షుండును, రైవతుండును, హరుండును, బహురూపుండును, త్ర్యంబకుండును, సురేశ్వరుండును, సావిత్ర్యుండును, జయంతుండును, పినాకియను వారు పదునొకండ్రు రుద్రులు. అదితియు, దితియు, నరిష్టయు, సురసయు, మునియు, సురభియు, వినతియు, తామ్రయు, క్రోధనయు, నిళయు, కద్రువయు, ద్విపయు, దనువు మున్నగు కాంతలవలనఁ గశ్యపుండు బహుసంతానంబుఁ గాంచె నది క్రమం బుగ నాలింపుఁడు.

తే॥ రహినిజాక్షుషమన్వంత • రమునఁదుషి తులనఁజెలఁగువారు వైవస్వ • తాంతరమున నదితిపుత్రు లాదిత్యులై • యలరి రవనిఁ దలఁప ద్వాదశ సంఖ్యాకు • లలఘుమతులు.

వ॥ ఇంద్ర, ధాతృ, భగ, త్వష్టృ, మిత్ర, వరుణా, ర్యమ, వివస్వత్సవితృపూషాం శుమ, ద్విష్ణుసంజ్ఞల నాదిత్యులు వెలయుచుందురు.

తే॥ కనక కశిపు హిరణ్యాక్షు•లను తనయులదితికనియె నిర్వురను బలా•న్వితుల దనువు సుతశతంబును గాంచె ద • ర్పితుల విప్రచిత్తి మున్నగువారల • శ్రీలలితుల.

తే॥ శుకియు, శ్యేనియు, భాసియు, •సుగళగృధ్రి శుచియనఁ దగువారల • సుతలఁగనియెఁ దామ్రయనునది యార్వుర • ధాత్రిశుకికిఁ గలిగె శుకము లులూకముల్ • పలువిధముల.

తే॥ శ్యేని శ్యేనంబులఁ గాంచెఁ • జెలఁగిభాసియనునది కురంగములఁ గనె • నరిది గృధ్రి గృధ్రములఁగపోతంబుల • క్షితిని విహగసంచయంబు లనేకముల్ • గాంచెమించె.

తే॥ సరగ సుచియు హంస • సారస కారండ వప్లవములఁ గాంచె • వసుధ సుగళ గనె మహాశ్వమేష • ఖరమహాంగంబుల సవతులెల్లఁ దన్ను • సన్నుతింప.

తే॥ వినతగరుడు నరుణు • వెలయు సౌదామిని యనెడు సుతను గాంచె • నఖిలలోక భీకరను సురసయు • విఖ్యాతుల సహస్ర సర్పపతులఁ గనియె • సంతసమున.

॥ కద్రువు సహస్ర శీర్షులగు పుత్ర సహస్రంబుఁ గాంచె నందు శేషవాసుకి, కర్కో టక శంఖైరావత కంబళధనంజయ మహానీల పద్మాశ్వతరతక్షకైలాపుత్ర మహాపద్మ ధృతరాష్ట్ర వలాహక శంఖపాల మహాశంఖ పుష్పదంష్ట్ర శుభానన శంఖలోమ నహుషవామన ఫణి కపిలదుర్ముఖ పతంజలియను వారిరువదార్వురు ప్రధానులు. క్రోధవశకు రక్షోగణంబును మహామాయయు నుదయించిరి. సురభికి రుద్రగణం బును గోమహిషీగణంబును జనించె.

॥ అలరు మునిగణంబు • నప్సరోగణమును గనియె మునియనునది • గౌరవమునఁ గిన్నరులను మఱియుఁ • గీర్తనీయులను గంధర్వులను గనియెను • దగనరిష్ట.

॥ ఇళయనునది తృణవృక్షుల తాగుల్మంబులను, ద్విపయనునది యక్షరక్షస్సులను గాంచె. కశ్యపుండు వారి నందఱనయ్యైసదంబుల నభిషేకించె. క్రమంబున వారును బుత్ర పౌత్రులఁ గాంచిరి.

తే॥ మఱియుఁ గశ్యపుండు ♦ మహి నిజగోత్రంబు వృద్ధిసేయుదునని ♦ బుద్ధిఁదలఁప
వత్సరాసితులను ♦ వారలు గలిగిరి దివ్యమతులు వంశ ♦ దీపకులయి.

తే॥ జననమైరి వత్స ♦ రునకు నైధ్రువుఁడు రైభ్యుఁడను వారలిరువు ♦ రుదితయశుః
రైభ్యకులమువారు ♦ రైభ్యులు నావిలసిల్లి రుర్వియందు ♦ శ్రేష్ఠులగుచు.

తే॥ చ్యవన కన్యయందు ♦ సరగ నైధ్రువునకుఁ బొడమె నలసుమేధ ♦ సుఁడనునాతఁ
డేకపర్ణయందు ♦ నెలమి నసితుఁడు బ్రహ్మిష్ఠుఁ దనయుఁ గాంచెఁ ♦ గృతమతియుఁ.

సీ॥ అవనిఁ బదియు నొకం ♦ డవమనువునకుఁ గ్రమముగను నాల్గు యు ♦ గములుగడచ
ద్వాపరార్ధంబు న ♦ దముఁడనువాఁడు పుత్రుండయ్యె నతని క ♦ ఖండకీర్తి
గలవాఁడు తృణబిందు ♦ వలరె దాయాదిగ నతఁడుఁ ద్రేతాయుగ ♦ మందుభూమి
పాలుఁడయ్యె నతండు ♦ పసఁగ ఇలారూపయగు నిజపుత్రికఁ ♦ దగఁబులస్త్యుఁ

డనెడువానికిడియె ♦ నాతండు విశ్రవోమునినిఁగాంచె నాతఁ ♦ డనఘుఁడైన
దైలబిలునిఁగనియె ♦ నఖిలధనంబుల కీశుఁడైనవాని ♦ నిద్ధచరితు.

వ॥ బృహస్పతి కూఁతురు దేవవర్ణిని విశ్రవోమునికి పెండ్లియై వైశ్రవణుని గాంచె. మాల్యవంతునకుఁ బుష్పోత్కటయు బలాకయు నను నిరువురు సుత లుదయించిరి. మాలిని కన్యయగు కైకసి రావణ కుంభకర్ణ విభీషణులను పుత్రులను శూర్పణఖయను బుత్రికను గాంచె. పుష్పోత్కటకు మహోదర ప్రహస్త మహాపార్శ్వఖరులను బుత్రులును గుంభీనసి యను బుత్రికయు జన్మించిరి. బలాకకు త్రిశిరస్కుండును, దూషణుండును, విద్యుజ్జిహ్వుండను మువ్వురు తనయులును వైమాలికయను పుత్రికయు గలిగిరి. భద్రయు, నభద్రయు, జలదయు, మందయు, నందయు, బలాబలయు, గోపయు, దామరసయు, వరక్రీడయు నను వారు భద్రాశ్వునకు ఘృతాచియందుఁ గలిగి ప్రభాకరుని బొందిరి. ప్రభాకరుండు భద్రయందు సోమునిఁ గనియె. మఱియుఁ బ్రభాకరుండు తక్కినకాంతలందుఁ బుత్రులఁగాంచె. వారాత్రేయులనఁ బరఁగిరి. వారి కులంబున దత్తుండును దూర్వాసుండనువా రిరువురు సుతులును, యవీయసియను కన్యయుఁ గలిగిరి. దత్తునకును దూర్వాసునకును శ్యావుండును, బ్రత్వాసుఁడును, వవల్గుండును గహ్వారుండును, నను వారు జనించిరి. మఱియుఁ గాశ్యపుండును, నారదుఁడును, పర్వతుండును, నుద్ధతుండు నను వారు నలువు రాత్రేయకులదీపకులైరి.

తే॥ తొల్లి భీకరమగుచు దై ♦ త్యులకు దేవతలకు యుద్ధంబు గలిగిన ♦ తఱిని వర్ష
రహితమై లోకమెల్ల దు ♦ ర్వారకష్ట పరివృతంబయి యుండె దు ♦ ర్భరమునగుచు.

తే॥ అయ్యెడ వసిష్ఠమునివర్యుఁ ♦ డాదరమున హరునికృపఁగాంచిలోకసం ♦ చయముగాఁచె
నన్నపానీయములును ఫ ♦ లౌషధులును కందమూలంబు లొసఁగి ♦ దక్షత్వమాని.

తే॥ మునికులాగ్రగణ్యుఁ ♦ డనఘుండగు వసిష్ఠుఁ డతుల సాధ్వియైన ♦ యట్టి దక్ష
తనయయగు నరుంధ ♦ తిని గూడి కనియె నూర్వురనుసుతులగోత్ర ♦ కరుల బుధుల.
తే॥ అందు శక్తియనెడు ♦ నతఁడు పరాశర మునివరేణ్యుఁగనియె ♦ మోదమతిని
దనుజుఁ డొకఁడు రుధిరుఁ ♦ డనువాఁడు శక్తిని విందుఁ గుడిచినట్లు ♦ వెసభుజించె.
తే॥ శక్తితనయుండయిన పరా ♦ శరుఁడు కాళియందు వ్యాసునిఁ గనియె నా ♦ వ్యాసమౌని
యరణియను సతియందు శు ♦ కాఖ్యుఁ గాంచె నతఁ డఖిలయోగివర్యుఁడై ♦ క్షితిఁదనర్చె.
వ॥ ఆ శుకునకు భూరిశ్రవసుండును, ప్రభుండును, శంభుండును, కృష్ణుండును, గౌరుం
డును, నను పుత్రులును, కీర్తిమతియను సుతయు జన్మించిరి. కీర్తిమతి యణుహుఁ
డను వానికిఁ బత్నియై బ్రహ్మదత్తునిఁ గనియె. శ్వేతుండును, కృష్ణుఁడును, గౌరుం
డును, శ్యాముండును, ధూమ్రుండును, నరుణుండును, నీలుండును. బాదరికుండును
ననువా రెనమండ్రుగురు పరాశర గోత్ర ప్రవర్తకులైరి. పృథుసుతయందు భద్రుం
డును నతనికి వసువును జనియించిరి. ఉపమన్యుని పుత్రు లౌపమన్యులనఁబరఁగిరి.
మిత్రావరుణుల పుత్రులు కౌండిన్యులనఁ బ్రఖ్యాతిఁగాంచి వాసిష్ఠుల కేకార్షేయు
లైరి. ఇది దేవదాన వాద్యుత్పత్తి క్రమం బీమహాత్ము లెల్లరు క్రమంబుగ సూర్యకిర
ణంబులు వోలె జగంబెల్ల వ్యాపించి భూభరణ సమర్థులైరి.

## —శక్త్యాఖ్య వసిష్ఠ సుతోపాఖ్యానము—

తే॥ మునికులాగ్రణి యగు వసి ♦ ష్ఠుని తనయుల మ్రింగె నూర్వుర రుధిరుఁడ ♦ నంగఁబరఁగు
దానవుండు పరాశర ♦ మౌని శక్తి ముఖులఁ దండ్రుల హరికృపఁ ♦ బ్రోచె మున్ను.
తే॥ శ్రవణపేయంబు కలుషనా ♦ శకము మోక్షదాయకంబగు శక్తిక ♦ థాకథనము
వినుఁడు శ్రద్ధాళులై మీరు ♦ వినుతుననుచు సూతుఁ డిట్లని పలికె వి ♦ ఖ్యాతయశుఁడు.
సీ॥ మున్ను విశ్వామిత్ర ♦ మునిప్రేరణంబున దనుజుండు రుధిరాఖ్యుఁ ♦ డనఘమతుల
శక్తిముఖ్యుల వసి ♦ ష్ఠకుమారకుల నూర్వురను మ్రింగిన వసిష్ఠ ♦ మునియు సతియు
హాపుత్ర పుత్రయం ♦ చత్యంతముగ రోదనంబొనర్చుటయు దుః ♦ ఖంబుతోడ
శక్తిపత్ని కరాంబు ♦ జములతో నత్తమామల నెత్తి మెల్లన ♦ బలువిధముల
నాదరించుటయును వార ♦ లార్తివిడువ నేరరై రప్పుడాయింతి ♦ నిర్మలోద
ర ప్రదేశంబునందుండి ♦ రహిఁ జెలంగె నొక్కబుక్కది విని మౌని ♦ యూరడిల్లి.
॥ అనఘంబీబుక్కె దెస జనియించెనో తెలియఁబడదు ♦ చతురాస్యముఖం
బును బావనంబుగాఁ జేసినదిది నాకర్ణపుటముఁ ♦ జేరఁగడంకన్.
॥ ఘనమైన పుత్రశోకంబున సంతాపంబుఁజెందు ♦ మునిపైఁ గరుణన్
వనజాసనుండె పనిచెనో యనుచున్ సంశయము నొందు ♦ నత్తరుణమునన్.
తే॥ అంబుజనిభాంబకుండు శ్రీ ♦ హరి కృపాన్వితుండగుచు నాకసంబున ♦ నుండి మౌని
సత్తమునిఁ గాంచి పల్కెనో ♦ సంయమీంద్ర యెలుఁగ వేయావినులమైన ♦ బుక్కనింత.

చ|| ఘనుఁడగు శక్తిపుత్రుని ము ♦ ఖంబున వెల్వడియెన్ మునీంద్రుఁడా
యనఘుఁడు నీ స్నుషోదరము ♦ నందున వృద్ధిని బొందుచున్నవాఁ
డ నితర సాధ్యుఁడైన త్రిపు ♦ రాంతకు భక్తులలోన ముఖ్యుఁ డా
తని ననువొందఁ గొల్తురు ప ♦ దంపడి శైవులు వైష్ణవుల్ ధరన్.
తే|| రుద్రపూజాపరుండయి ♦ రుద్రతుల్య తేజుఁడై నీ కులమునకు ♦ దీపకుఁడయి
మౌనిరాజ్యపదాధీశుఁ ♦ డై నిరతము నలరఁగలవాఁడు గర్భస్థుఁ ♦ డైనవాఁడు.
క|| కావునఁ గోడల గర్భం బే వేళను బ్రోచుచుండు ♦ మీ శనిభుఁడు వాఁ
డావిర్భవించువఱకును బోవిడువుము నీదు దుఃఖ ♦ మును నెమ్మదిలో.
తే|| అనెడు హరివచనము ♦ లాలించి యమ్మౌని విగతశోకుఁడయ్యె ♦ విస్మయముఁ
బది నెలలును గడవఁ ♦ బతిదేవతయగు నా తరుణి గనియెఁ బుత్రు ♦ ధన్యతముని.
తే|| అటుల నుదయించినట్టి య ♦ య్యనఘుఁ గాంచి సంతసమున నరుంధతి ♦ చారుగాత్రి
నతనిఁ బోషించుచుండెఁ బ్రే ♦ మాన్వితయయి పుత్రునందున వోలె సం ♦ పూర్ణమైత్రి.
వ|| అట్లు వసిష్ఠుండును నరుంధతియు స్నుషయు నత్యంతానురాగంబునఁ బరాశరునిఁ
బెంచుచుండఁ గతిపయవర్షంబులు గడచె నంత నొక్కనాఁడు.
చ|| పతివిరహంబునన్ విగత ♦ బంధుర వస్త్రయుఁ ద్యక్తభూషణ
ప్రతతియు జీర్ణదేహయయి ♦ వాడిన చంపకవల్లివోలె నా
నతయయి యున్న తల్లిఁ గని ♦ నైజసుతత్వముఁ జేసి మెల్లనన్
హితవచనంబులన్ బలికె ♦ నీద్యగుణుండు పరాశరుండొగిన్.
తే|| ఇటుల మంగళాలంకార ♦ హీనవగుచుఁ జంద్రబింబరహితమైన ♦ శర్వరి గతిఁ
గానఁబడుచుంటి వేల కో ♦ కన్నతల్లి యీ విచారంబు కారణ ♦ మేమి చెపుమ.
తే|| ఎట్టి కొఱఁత గల్గు ♦ నిట్టి ఘనుండు పరాశరుండు పుత్ర ♦ రత్నమగుచు
వలయు వాని నెల్ల ♦ సులభంబ కొని తేఁగలిగియుండ నీకు ♦ లలితచరిత.
మ|| చిరకాలంబునుండి కన్పడఁడు నా ♦ శ్రేయంబుఁ గాంక్షించువాఁ
డు రతేజోనిధి కన్న తండ్రి యిది యె ♦ ట్లో చెప్పి నా సంశయం
బు రహిన్ దీర్పఁగదమ్మ తండ్రికి ముదం ♦ బున్ గూర్పకున్నన్ బరా
శరుజన్మంబిల వ్యర్థమేయగుఁగదా ♦ సాధ్వీమణీ చూడఁగన్.
తే|| జనకపాదపరాగలే ♦ శంబు సోఁకకుండునే వాని జన్మ ♦ మఖండకీర్తి
కలిమె యయ్యును వృథయగుఁ ♦ గాదె జననితండ్రి నెఱిఁగించి పుణ్యప ♦ దంబుఁ గనుము.
క|| అనివచియించెడి పుత్రుని వినయోక్తులు కారణముగ ♦ విపులవిచారం
బునఁ జేసి జనని సుతయఁ దనయునకున్ మాఱుపలుకఁ ♦ దలపక యుండెన్.
తే|| అటుల బదులు సెప్ప ♦ కానతవదనయై యున్న జననిఁ గాంచి ♦ యోర్వలేక
పట్టియడుగుటయును ♦ బౌనః పునికముగఁ బలికె నా వసిష్ఠపత్ని యిటుల.

వ॥ అయ్యా నీ తండ్రి సానుజుండు రుధిరుం డనుదానవాధమునివలన భక్షింపఁబడి యెను. అది కారణంబునఁ బురంధ్రీ రత్నం బీమె కృశించుచున్నది.

చ॥ అనినఁ బరాశరుండనియె • నయ్య మరారికృతాపరాధుఁడై
మునులకు నిల్వనేర్చునె యు • మోఘము గాదె తపోబలం బిలన్
వనజదళాయ తాంబకుని • వంటి మహాత్ముఁడె వెన్నుఁజూపె నా
ఘనుఁడు దధీచితో నెదిరి • కయ్యమునన్ మును గెల్వలేకొగిన్.

తే॥ అతుల తేజులైన • యట్టి మునీంద్రులయెడల సాగనేర్చు • నే తలంపఁ
దనదు రాక్షసత్వ • మనఘుఁబరాశరు నలఁతిగాఁగ నెంచె • నధముఁడగుచు.

చ॥ హరుని కృపన్ ధరిత్రి నన • యం బభివృద్ధినిఁ గాంచనున్న వ
ద్గురువుల నందఱన్ గినుకఁ • గూడదు నాకవధించె నే పరా
శరుని తపోబలం బెఱుఁగఁ • జాలక దుర్మతియై సురారి క్రి
మ్మర బ్రతికింతుఁ దండ్రుల న • మానుష తేజుల మత్తపంబునన్.

తే॥ ఇదియె నిటలాక్షుఁగొల్తు న • హీనవరముఁగాఁతు జీవింపఁజేయుదుఁ • గన్నతండ్రి
ననుజసహితంబుగాఁ బూజ్యులైన మీరు ముదలయొసఁగుదు రేని యిప్పుడ నిజంబు.

తే॥ అనివచించి పరాశరుఁ • డాశ్రమమున నొక్కచో దివ్యదేశమం • దున్నతమగు
స్ఫటికలింగంబుఁ గల్పించి • పార్వతీశుఁ బూజనేసె విమలభక్తి • పూతుఁడగుచు.

—పరాశరుఁ డీశ్వరానుగ్రహమున మృతులైన పితాదుల బ్రదికించుట—

తే॥ అతనిభక్తికి మెచ్చి చం • ద్రార్ధమాళి సురగణపరీతుఁడై పరా • శరుని మ్రోల
నిలిచి కరుణారసార్ద్రి • సూక్తులను నూత్నజలద గంభీరముగ నిట్లు • బలికెనపుడు

చ॥ ఓ మునివంశదీపక సు • రోరగ కిన్నర సిద్ధసాధ్యులం
దేమునుగాంచఁ ద్వాదృశు న • హీనతపోమహిమాఢ్యు నెన్నఁడున్
బ్రాములకోర్చినాయెడల • భక్తిభజించితివీవు మెచ్చితిన్
నీ మది వాంఛ యెట్టిదొ య • నిందిత యిచ్చెదఁ గోరు మెంతయున్.

తే॥ అనఘుఁడవయ్య • నసుర భక్షిత పితృవ్యులను బితను జీవి • తులఁగఁ జేయఁ
దలఁచి దుష్కరమగు • తపముఁ గావించితి వౌర పూతమయ్యె • నన్వయంబు.

తే॥ అర్కమండలతుల్యంబు • లగు విమానముల నధిష్ఠించియున్నారు • కలుషరహితు
లైన పితయుఁ బితృవ్యులు • నదెముదమునఁ గాంచి యాహ్వానమొనరింపు • మంచితగతి.

క॥ గణనాతీతములగు నయ్యణిమాద్యైశ్వర్యములకు • నధిపతివై ధా
రుణి నెల్లవారిచేతన్ బ్రణుతింపఁగఁబడుము • సకలభద్రంబులతోన్.

తే॥ అష్టసిద్ధులఁ గాంచి య • ష్టాంగయోగములుఁ గరతలామలకములై • యలరుచుండ
సంయమీంద్రులలో స్వగ • సరుఁడవగుచుఁ గీర్తిన్ గాంచు మా చంద్ర • తారకముగ.

చ॥ అని వచియించి కన్మొఱఁగె • నా పరమేశ్వరుఁ డప్పరాశరుం
డనఘులు శక్తిముఖ్యులగు • నట్టి మహాత్ములకున్ నమస్కృతుల్

బొనరిచి పిల్చె వారలును • బుత్రముఖాంబుజ ధర్శనార్థులై
కనుఁగవలన్ శుభాశ్రువులు • గ్రాలఁగ మెల్లన నేగుదెంచియున్.

మ॥ అని వార్యంబగు పుత్రదుఃఖమున దే • హంబెల్ల జీర్ణింపఁగా
ఘనసంతాప పరీతులై విపుల శో • కంబూనియున్నట్టి త
ల్లినిదండ్రిన్ గని భక్తియుక్తిఁ బ్రణతుల్ • సేయంగ వారున్ గ్రమం
బున దీవించిరి సూర్యులన్ సుతుల స • మ్మోదంబు విందై తగన్.

తే॥ అప్పుడు పరాశరుండు క్రో • ధారుణిత విలోల లోచనుఁడగుచు దై • త్యాళి నె[...]
నాశమొనరింతుననుచు స్వాం • తమునఁ దలఁచి యొక్క కుశనభిమంత్రించి •
[ యున్నయెడను

క॥ కరుణాకరుఁడు వసిష్ఠుఁడు సరగున నిజపౌత్రుఁ గాంచి • సర్వజ్ఞుఁడ వి
క్కరణి దురితాలయంబగు సరణిన్ నడవంగఁదలఁతె • సంయమివయ్యున్.

చ॥ ఖలమతియైనయొక్క కొఱఁ • గానియతం డొనరించుదాని కై
తలపడి యిట్లు ఘోరముగ • దానవవంశము నెల్ల బూదిగా
సలుపుదునంచుఁ బల్కుట య • శస్కరమౌనె దయాపరుండవై
తలఁపగదయ్య యిప్పని నె • దన్ నగఁజేయఁగ రాదటంచొగిన్.

తే॥ అసురులకు సాజమైన కార్యంబునుమ్మ మనుజ భక్షణ మొనరించు • టనుదినం[...]
వానిచేసినపాపంబు • వాఁడ యనుభవించు నీకేల యిట్లు గో పించుటనఘ.

వ॥ అని మనుమని శమింపఁజేసి వసిష్ఠుండు మృతులగు సుతులు పునర్జీవితులైన సంతో
షంబునఁజేసి యొక్క సత్రంబుఁ బ్రారంభించియున్నెడ నొక్కనాఁడు.

తే॥ చతురుఁడు పులస్త్యుఁడను ప్రజా•పతి వసిష్ఠుచెంతకరుదెంచినన్ గని•శీఘ్రమ[...]
మౌను లెదురేగి యుచిత స • న్మానములును నర్ఘ్యపాద్యాది పూజల • నాచరింప[...]

తే॥ ఆ పులస్త్య ప్రజాపతి • యాశ్రమీయులైనవారెల్ల వినఁబ్రహ్మ • ప్టాంతరంగుఁ
డై పరాశరుఁ గనుఁగొని • యనియెనిట్లు బ్రవిమలార్థాన్వితంబులౌ • పలుకుగము[...]

చ॥ గురువుల గౌరవంబు మదిఁ • గోరి శమించితి నీవు రాక్షసో
త్కరము నశింపఁజేయు నొడికం • బుననుండి గిరీశదత్తమౌ
వరమున నెంతలేని సుల • భంబుగఁ జేయఁ గలట్టి నీకు దు
ర్భరమగు కార్య ముండునె య • పారముగాదె తపోబలంబిలన్.

తే॥ బాలకుఁడవయ్యుఁ బెద్దలు • వోలె ధర్మనిర్ణయముఁ జేయఁగల్గిన • నేర్పుగంటి
నీవు నిమ్మది మెచ్చితినిపుడు సకల మునికులవరేణ్య వంశదీ • ప నయగణ్యా.

వ॥ నీవింకఁ బురాణసంహితాకర్తవై యొసంగుదువని పలికి యొందేని చనియె. అంత[...]
బరాశరుండు పులస్త్యవరంబున షడంగ విశిష్టంబును సమస్తార్థ ప్రదంబును, జ్ఞానస[...]
చయ సాధకంబును, షట్సహస్ర మితంబును సర్వవేదార్థసమ్మతంబును, జతుర్థంబు[...]
నగు వైష్ణవపురాణంబురచియించె నిది శక్తిచరిత్రంబని సూతుండు వచియించుటయు.

— ఆశ్వాసాంతము —

ఉ॥ అంతకగర్వ భంజన సు • రాసురలోక శరణ్య దక్ష య
జ్ఞాంతక తారహారపరి • హాస కృదున్నత కీర్తి వల్లికా
క్రాంత దిగంతరాళ శ్రిత • కల్ప మహీరుహ నందికేశ సు
స్వాంత పయోజపత్ర విల • సన్నవషట్పద కామితప్రదా.

క॥ విసమద్బ్రహ్మాది సురావన చతురా పాండ్యభూమి • పాలసుతాహ్వా
ద్వనజ దివాకర మామక ఘన లింగపురాణ రక్ష • కా సోమేశా.

క॥ భసితోద్ధూళిత విగ్రహ కుసుమాస్త్ర నిహనన దేవ • కోటీరమణి
ప్రసరాంచిత పాదాంబుజ వసుధాధీశ్వర సమస్త • వాంఛిత ఫలదా.

తే॥ కష్టపడి పెంచి యిడితి నా • కవితకన్నె నెవ్విధంబున నలరింతొ • యింకమీఁద
గంగవోలెను గయ్యాళి • గాదు జేల సుమ్ము నీ తలనెక్క నా • ట్యమ్మొనర్ప.

సీ॥ ఏ మహామహుఁడు శ్రీ • వేమనారాధ్య వంశాబ్ధికిఁ బూర్ణశ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి • కెనయై బుధుల్ మెచ్చ మహిని బాతివ్రత్య • మహిమఁగాంచె
నట్టి నందయకు గా • రమకుద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోదరుండఁ గూరిమియగ్ర • జుండసుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మ • దీయమగు శ్రీమదాంధ్ర లింగపురాణ పూ • ర్వార్థమందు
నమలమగు చతుర్థాశ్వాస • మయ్యెఁ గరుణసతము దీనిని రక్షించుఁ • జంద్రమౌళి.

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీ మీనాక్ష్యైనమః

# శ్రీమదాంధ్ర లింగపురాణము.

## —: పూర్వభాగము :—

### —: పంచమాశ్వాసము :—

క॥ క్షోణీత్రాణ పరాయణ వాణీశాద్యఖిలదేవ ◆ వందిత చరణా
యేణాంకవతంసాగిరి బాణాసనసుందరేశ ◆ ప్రణతార్త్తినాగా.

తే॥ అవధరింపుము సూతమ ◆ హర్షిఁగాంచి నైమిశారణ్యవాసుల ◆ నంత తేజు
లర్థిపచియించి రిట్టు ల ◆ ఘూఘహరము లీశ్వరచరిత్రములు వింటి ◆ మెన్నియేని.

### —సూర్యవంశవర్ణము—

చ॥ తమము హరించి యెల్లరను ◆ దాను ప్రబోధమొనర్చు ధీరుఁడు
త్తమచరితుండు సూర్యుఁడు ప్ర ◆ ధానుఁడు ప్రాణులకెల్ల సర్వ వే
దములకు నునికిపట్టు సుకృ ◆ తంబులకున్ నిలయంబు తచ్చరి
త్రముఁ దెలియంగఁజేయుము ము ◆ దంబున సాన్వయమై రహింపఁగన్.

తే॥ వినఁదగిన యంశముల నెల్ల వింటిమేము చెప్పఁదగువాని నర్మిలిఁ ◆ జెప్పితీవు
సార్థకులఁ జేయుమింక నహస్కరుని యథార్థవంశ క్రమముఁ జెప్పి ◆ యనఘ మమ్ము.

వ॥ అనుటయు మోమున దరహాసంబు భాసురంబుగా సూతుం డిట్లనియె.

తే॥ కశ్యపునకు జనించె న ◆ ఖండకర సహస్రమండితుఁడగు నాతఁ ◆ డదితియందు
నదితి కశ్యపులకుఁ బుత్రుఁ ◆ డగుట నాతఁ డలరె నాదిత్యుఁడనఁగఁగా ◆ శ్యపియనఁగ.

తే॥ సంజ్ఞయును రాజ్ఞియును బ్రభ ◆ ఛాయయనఁగ నలువురను బెండ్లియయ్యె ని ◆
[ర్మల చరిత్రుఁ
డైన యాదిత్యుఁ డఖిలలో ◆ కైక రక్షణాభిరతిఁ జేసి నిజవంశ ◆ మలరుఁటుల.

సీ॥ త్వష్టృప్రజాపతి తనయ యా సంజ్ఞకు మనువుయముండు య ◆ మునయు నాఁగ
నలరువారుదయియించి ◆ రాదిత్యునివలన రాజ్ఞికి జనియించె ◆ రైవతుఁడనఁ
బ్రభకు జనించెఁ బ్ర ◆ భాతుండనెడువాఁడు ఛాయకు సావర్ణి ◆ శనియుఁ దపతి
విష్టి యనెడువారు ◆ వెలసి రాదిత్యుని వంశంబు వెలయించు ◆ వారలగుచు
ఛాయతక్కిన పుత్రసం ◆ చయమునందు కన్నమనువుపై నత్యంత ◆ మైనవత్స
లత్వముఁ బూనియుండెఁ గ ◆ శంకరహితుఁడై యతఁడు భూమి బాలించు ◆ ననుచు నెంచి.

తే॥ ఛాయను మనువునందువా•త్సల్యమధికమగుటఁగనుఁగొని సైఁపక•యముఁడుమిగులఁ
గనలిదోషంబు నాకస•త్యనిరతయగు సాధ్విని దన్నె దక్షిణ•చరణమునను.

చ॥ సవసులు నూచుచున్నెడల • ఛాయయకారణ మిట్లు పుత్రుచే
నవమతినొంది నొచ్చుకొని • యక్కటట తన్నునె వీఁడు మత్తుఁడై
యవినయబుద్ధి నన్ననుచు • నాగ్రహమొంది కృపావిహీనయై
సవలితనంబుఁజూపెననఁ • జయ్యన నయ్యముదిక్కు గాంచుచున్.

క॥ ఓరీ భయమింతయులే కీరితిని దల్లినాక • హీనకులజన
ట్లారసినను దన్నుదె నీశూరత్వము సాధులందుఁ • జూపఁదలఁచెదే.

తే॥ తల్లిఁదండ్రులందుఁ • దగగురువులయందు దైవమందు భక్తిఁ • దాల్పకున్న
వాని నంత్యజునిఁగ • భావించి విడుచుట యహాయమంద్రుతజ్ఞు • లైనమునులు

క॥ లోకంబు పాడిఁదలఁపక తేఁకువఁగొని యివ్విధమున • ధీరుఁడవై నీ
వే కాల నన్నుఁ దన్నితి వా కాలికిఁగుంటువడక • యలరిగలదే.

తే॥ అనుచు శపియించిపోయె న • య్యంతకుండు పూయశోణితపూరిత • మై యనేక
కీటకపరీవృతంబునై • క్లిన్నమగుచుఁ బూతిగంధయుతంబునై • పాలుపుఁదక్కె.

వ॥ దుష్టంబైయున్న నిజదక్షిణ చరణంబున్ గాంచి లజ్జయు భయంబును దుఃఖంబును నావరింప నజ్ఞాతప్రతిక్రియాకలాపుండై కొండొకచింతించి పరమేశ్వరారాధనంబునఁ గాక యథాపూర్వస్థితి కలుగనేరదని తలంచి మహాఘోరంబుగ వర్షాయుతం బీశ్వరునిగుఱించి తపంబుఁ గావించిన భగవంతుండగు నుమాకాంతుండు ప్రసన్నుండై దండధరునకుఁ బితృలోకాధిపత్యంబును, దక్షిణదిక్పతిత్వంబును నొసంగి ఛాయాదత్త శాపవిమోచనంబుఁ గావించె నంత.

తే॥ భాస్కరుని తేజమును సహిం • పంగలేక సంజ్ఞబడబాస్వరూపంబు • సరగఁదాల్చి
చంద్రశేఖరుని గుఱించి•సాంద్రమతిని తపము సేయఁగఁదొడఁగె నెంతయునుభక్తి,

తే॥ పెద్దకాలంబు సంజ్ఞకై • వెదకివెదకి కనుఁగొనియె బడబారూప • మును వహించి
తపముఁగావించుచున్నట్టి • తన్వినొక్క యాశ్రమంబున యందు న• హస్కరుండు.

క॥ కనుఁగొని భాస్కరుండు నిజ • కాంత నఖండ తపోనియుక్తయై
తనరుచు నున్నదానిఁ బ్రమ • దంబున డాయఁగఁబోయి యా సరో
జ నయనయందుఁ గాంచె విల • సన్మతిమంతుల ధీరులైన య
శ్వనులనువారి నిర్వర న • శేషమహామయకాననాగ్నులన్.

వ॥ జ్యేష్ఠుండగు వైవస్వతమనువునకునిక్ష్వియందు నిశాఖ్యయగు నొక కన్యయు, నిక్ష్వాకుండును, నభసుండును, దృష్టుండును, శర్యాతియు నరిష్యంతుండును, నాభాగుండును, నరిష్టుంకును, కరూషుండును బృషధ్రుండును, ననువారు తొమ్మండుగురు పుత్రులును జనించిరి.

తే॥ ఘనులు మిత్రావరుణులను • మునులకతనఁ బుంస్త్వముఁ బొంది యిళ యొ • [కప్పుడు శరవణ
సంజ్ఞ నలరువనముఁ జేరి • సరసిజాక్షియయ్యెఁ జూపఱు లబ్బుర • మందునటుల

తే॥ శరవణ ప్రవేశ • సంజనిత స్త్రీత్వసంయుతుండునగుచు • క్ష్మాధవుండు
పూతచరితుఁడైన • బుధునాశ్రమంబునఁ దపము సేయువాని • దైవసముని.

క॥ కనియతని చక్కఁదనమునకును మహిమకు లోనగుచును • కుసుమశరార్తిన్
దనయార్తిఁ దీర్పుమని యాతనిఁ బ్రార్థించుటయు బుధుఁడు • ధర్మప్రీతిన్,

వ॥ దివ్యదృష్టినిజచరిత్రం బెఱింగి యాతరుణిఁ బరిగ్రహించిన నామెకు బుధునను గ్రహమునఁ బురూరవుండను సుతుం డుదయించె నంత బుధుం డాతనికొక మాసంబు స్త్రీత్వంబును నొక మాసంబుఁ బుంస్త్వంబును గలుగునట్లుగ వరంబొసంగి సుద్యుమ్నుండనఁ బ్రసిద్ధిఁ గాంచుమని పంపిన నాతం డరిగెఁ బిమ్మట.

తే॥ ఉత్కలుండు గయుఁడు • నున్నతుండగు వినతాశ్వుఁడనెడువార • లార్యనుతుల
ముగురుసుతులు గలిగి • రగణితమతులు సుద్యుమ్నునకు నిఖిల గు • ణోన్నతులయి.

తే॥ ఉత్కలుండు సెందె • నుత్కలరాష్ట్రంబు గయుఁడు గయకు నాథుఁ • డయి రహించెఁ
బశ్చిమాశకెల్లఁ • బతియయ్యె వినతాశ్వుఁ డఖిలభూమినాథు • లభినుతింప.

తే॥ ధన్యుఁడైన సుద్యుమ్నుండు • తలఁప స్త్రీత్వమును వహించినవాఁడౌట • ననఘ రాజ్య
భాగమును జెందకయు సురభోగకలితమగు ప్రతిష్ఠానమునకె రా • జయ్యె నెలమి.

తే॥ పుత్రవత్సలుఁడైన యా • భూమిధవుఁడు తన ప్రతిష్ఠాన నగరంబుఁ • దగనొసంగె
నాపురూరవునకు నతఁ • డేపుమీఱ ధర్మరతిఁ బ్రజ సేలె స • త్యప్రియుఁడయి.

వ॥ ఇక్ష్వాకునకు వికుక్షియు నతనికిఁ బుత్రశతంబును గలిగె నందు జ్యేష్ఠుండగు కకుత్స్థునకు సుయోధనుండును నతనికిఁ బృథువును విశ్వకుండును, విశ్వకున కార్ద్రకుండు నికి యువనాశ్వుండును శ్రావస్తియు శ్రావస్తికి వంశకుండును జన్మించిరి. శ్రావస్తికుండు గౌడదేశంబున శ్రావస్తియను నగరంబుఁ బ్రతిష్ఠించె. వంశకునకు బృహదశ్వుండును నతనికిఁ గువలయాశ్వుండనువాడును జనియించిరి. కువలయాశ్వుండు దుంధువనువాని జయించి దుంధుమారుండనఁ బ్రసిద్ధిఁ గాంచె. దుంధుమారునకు దృఢాశ్వుండును దండాశ్వుండును గపిలాశ్వుండును ననువారు ముగ్గురుదయించిరి. అందు దృఢాశ్వునకుఁ బ్రమోదుండును నతనికి హర్యశ్వుండును నతనికి నికుంభకుండును నతనికి సంహతాశ్వుండును, నతనికిఁ గృశాశ్వుండును రణాశ్వుండును ననువారుదయించి రందు రణాశ్వునకు యువనాశ్వుండును నతనికి మాంధాతయు నతనికిఁ బురుకుత్సుండును నంబరీషుండును ముచుకుందుండు ననువారు నుదయించిరి. అందంబరీషునకుఁ బర యువనాశ్వుఁడును నతనికి హరితుండు గలిగె మఱియు సంఘాతిక నరణ్యుండనువాఁడు గలిగి త్రైలోక్యవిజయ సమయంబున రావణునిచే హత

దయ్యె. అయ్యనరణ్యునకు బృహదశ్వుండును నాతనికి హర్యశ్వుండును నతనికిఁ బర
మేశ్వర పూజారతుఁడగు త్రిధన్వుండును గల్గె నాతఁడు.

తే॥ ధనవిరహితుఁడాత్రి • ధన్వుండు తాసహస్రాశ్వమేధఫలము • నందు వాంఛ
సలిపె నెల్లయత్న • ముల నించుకేనియు ఫలము గలుగదయ్యెఁ • బార్థివునకు.

ఉ॥ ఏవిధి నా మనోరథము • నెల్ల ఫలింపఁగ జేయువాఁడ నా
రావిధియిట్లు నాయెడ ద • యారహితుండగు నే సమస్తముఁ
బ్రోవఁగలట్టి తాను నను • భూపతిగా నొనరించి యెంతయుఁ
లేవడిఁగూర్చుటొప్పునె య • శీకమునాడఁగఁజేయునే ననుఁ.

క॥ ధనరహితుఁడనగు నాపై ననుకంపజనింపకున్న • నహాంబగుఁగా
కనయము నిష్ఫలమగు వాంఛను సృష్టింపంగనేల • జలజభవునకుఁ.

తే॥ అశ్వమేధసహస్రంబు • నాచరించి తత్ఫలముఁ గాంతుననుచు నెం • తయుఁదలంచి
సాధనములేమి యత్నంబు • సాగదనుచు నూరకుండిన నవ్వరే • యుర్విజనులు.

తే॥ కష్టములు నెన్నియేనియుఁ • గలుగుఁగాక యెప్విధంబుననైన నే • నింకమీఁద
నశ్వమేధసహస్రంబు • నాచరింపఁగలుగునట్టి ఫలంబును • గాంతునిపుడు.

క॥ అని నిశ్చయించి భూపతి వనజాసనపుత్రుఁడైన • వానిని దండిఁ
గని మ్రొక్కి నిజాగమనము వినిపి చిన నతఁడు పలికె •విమలవచోళిఁ.

తే॥ వగవనేటికి నీకు భూపాలతిలక యశ్వమేధ సహస్రంబె • యనఁగనేల
గాణపత్యంబు మఱియు న•ఖండ భక్తిపదము లభియించు మార్గంబు•కుదిరియుండ.

వ॥ తొల్లి మజ్జనకుండగు పితామహుండు లోకానుగ్రహార్థంబు రుద్రదివ్య నామసహస్ర
స్తోత్రంబు విరచించె. అద్దానిఁగైకొని యేను గాణపత్యంబు వహించితి.పరమపవిత్రం
బునుసకల పాతకహరంబును నగు నమ్మహా స్తోత్రరాజంబు నీకొసంగెద భక్తిపూతుం
డవై దాని బఠించుతువేని యశ్వమేధ సహస్రాచరణ ఫలంబును గాణపత్యంబును
నీశ్వరానుగ్రహంబును గాంతువని తండి త్రిధన్వునకు రుద్ర నామ సహస్ర స్తోత్రం
బునుపదేశించిన నాత డుఁ జిరకాలప్రవృద్ధంబు నగు నిజ మనోరథంబుఁ గాంచి
గాణపత్యంబుఁ జెందె.

తే॥ ఆతనికి జనియించెఁ ద్ర • య్యారుణాఖ్యుఁడతని కుదయించె సత్యవ్ర • తాభిధానుఁ
డాతఁడు విదర్భపతిఁ జంపి•యతనిపత్నిఁ నపహరించుటయును దండ్రి•యాగ్రహమున.

తే॥ అన్వయక్రమంబు • ననుసరింపక యకారణముయిటుల నొక్క • రాజుఁజంపి
యతని పత్నిఁ దెచ్చి • తిధమయంత్యజ సహవాసివగు మటంచు • వనికిఁజనియె.

తే॥ తండ్రికోపంబు కతన స•త్యవ్రతుండు శ్వపచులఁగూడి తిరుగుచు•బహుదినములు
కడపి యొక్కప్పుడు వసిష్ఠు•కారణమున నవనిని త్రిశంకువనఁగ వి•ఖ్యాతిఁగాంచె.

తే॥ తపసి యేదు గాధి • తనయుఁడు తనకు వసిష్ఠమానియందుఁ • జెలఁగునట్టి
వైరమునను జేసి • ధీరత నాత్రిశంకునకు మేలుగూర్తు • ననుచుఁదలఁచి.

మ॥ పరదారాపహరణాత్త దోషము మెయిన్ ♦ బాపిష్ఠుండై యంత్యజో
త్కరముం గూడి చరించునాతనికి ని ♦ త్యంబైన రాజ్యంబు ని
చ్చిరహింగ యజ్ఞమొనర్పఁజేసి దివమి ♦ చ్చెన్ మేనితో నెల్ల ని
ర్జరసుతానముఁ బూరికిన్ గొనక వి ♦ శ్వామిత్రుఁ డత్యున్నతిన్.

తే॥ విగతపాపుఁడగుచు ♦ వెలయు నాతండు సత్యవ్రతయను కైక ♦ యకులజాత
యందుఁ గనియెఁ బుత్రు ♦ నధిప హరిశ్చంద్రుఁడ నెడువాని ధీరు ♦ నమలచరితు.

చ॥ ప్రతినరపాల మస్తకవి ♦ రాజదనేక మణీ నికాయ రం
జిత చరణాంబుజుండయి య ♦ శేష సముద్రపరీత భూమి న
ప్రతిహత శాసనుండగుచుఁ ♦ బాలనసేసె నతండు దేవతా
ప్రతతియు నబ్బురంపడెడు ♦ భక్తి నసత్యము రూపుమాపుచున్.

క॥ అతనికిఁ జంద్రమతియనెడు పతిదేవతయందుఁ గలిగె ♦ భానునిభుండ
ప్రతిముఁడు సత్యరతుఁడు లోహితుఁడనియెడువాఁడు ధారు ♦ణీశతిలకుఁడై.

సీ॥ ఆలోహితాస్యన ♦ కాత్మజుండయ్యె దుంధుండను నాతఁడ ♦ ఖండతేజుఁ
డతనికిఁ గల్గి రం ♦ చితమూర్తులగు విజయాఖ్యుండును సుతేజుఁ ♦ డనెడువార
లందగ్రజుఁడు సను ♦ స్తారాతి జేతయై తనరు నవ్విర్ధాభి ♦ ధానుఁడగుచు
నతనికి రుచకుఁడన్ ♦ సుతుఁడుదయించెయ్యె వాఁడు వృకుండను ♦ వానిఁగాంచె
నాతనికి బాహువనెడువాఁ ♦ డాత్మజుఁడయి వితతబాహుబలోద్ధతి వెలయునట్టి
శాత్రవానీకమున్ జెండి ♦ సకలరాజ్యభారమూంబూని కీర్తిఁ జెం ♦ పారు ధరణి.

క॥ ఆ బాహువున కుఁగల్గెఁ బ్రభాబంధురుఁడైనవాఁడు ♦ పార్థివముఖ్యుం
డై శౌహులేయుఁడను సురియైబాడబహితుఁడగు సగ ♦ రాఖ్యుఁడు ఘనుఁడై.

తే॥ ప్రథయు భానుమతియనెడు ♦ పద్మముఖులఁ బరిణయంబై సగరుఁడౌర్వ ♦
[ వహ్నిఁగొలిచి
భానుమతియందుఁగనియె న ♦ ద్వయపవిత్రుఁడగు నతఁ డసమంజసుం ♦ డనెడువాని.

తే॥ ప్రథకుఁ గల్గిరి పుత్రులు ♦ ప్రాజ్ఞులైనవార లఱువదివేలు శుం ♦ భత్ప్రతాప
ప్రాథ్యుఁడగు కపిలుని కో ♦ పాగ్నికిం ధనములయిరి వారు వసుధాభ ♦ నన మొనర్చి.

తే॥ సగరుఁ డశ్వమేధ ♦ సవనం బొనర్పంగఁదలఁచి యశ్వాగక్షు ♦ కులుగ సుతుల
ననిచె వారలశ్వ ♦ ము గనుఁగొనలేక క్రోధచిత్తులగుచుఁ ♦ గుటిలగతిని.

తే॥ కపిలమునితపోగమ్యుఁగొని ♦ యిపుడయేగెఁ దమ్ముఁగని భీతిచేతఁ బా ♦ తాళలోక
మునకటంచుఁ దలఁచి వారు ♦ పుడమి నెల్లఁ ద్రవ్వుకొనుచును జనిరి పా ♦ తాళమునకు.

క॥ చనియొకచో సవనాశ్వంబును గనుఁగొని చెంతనున్న ♦ మునివరుఁ గపిలున్
గని వీఁడె యశ్వచోరుఁడని నిశ్చయమూని యతని ♦ నదలించుటయున్.

క॥ అమ్మునినాథుఁడు తన సైర్యమ్మును భంగంబొనర్చి ♦ నట్టి ఖలులఁగో
పమ్మునఁ గన వారలు భస్మమ్మయి కూలిరి పలెంగ ♦ సంచనుమనుబులన్.

తే॥ అంశుమంతుఁడనెడు • నతఁడసమంజసునకు జనించి సగర • నందనులకుఁ
గలిగినట్టి పాటుఁ • గని కపిలమహర్షిఁ గరుణఁదెచ్చె సవన • తురగమెలమి.

క॥ ఆతనికిదిలీపుఁడనియెడు సుతుఁడుదయంబయ్యె వైరి • సూదనుఁడు సమం
చిత విమలకీర్తియగుచుఁ క్షితిపతివర్గంబులోన • శ్రేష్ఠుండగుచుఁ.

తే॥ ఆదిలీపనృపతి కాత్మజుండయ్యె భగీరథుండు సకల • వైరిలోక
భీకరుండు పాప • భీతుండు దేవతాభక్తియుతుఁ డసదృశ • శక్తియుతుఁడు.

తే॥ కపిలముని కోప • కారణంబున దగులైన సగరసుతుల • నధికభక్తి
ధన్యులుగ నొనర్పఁ • దలఁచి స్వర్గమునుండి గంగఁదెచ్చె నతఁడ • ఖండకీర్తి.

తే॥ ఆ భగీరథునకు • నధిగత శ్రుతుఁడగు శ్రుతుఁడు కొమరుఁడయ్యె • నతనికవని
నాథమౌళియైన • నాభాగుఁడలరె దాయాదుఁడగుచు నృపజ • నార్చితుఁడయి.

వ॥ ఆతని కంబరీషుండును నతనికి సింధు ద్వీపుండును వానికయుతాయువును జని
యించిరి.

క॥ అతనికి జనియించె సుతుఁడు ఋతుపర్ణుండనగఁ నతఁ • హృదయజ్ఞుఁడు సం
తతశర్వ పాదసేవారతుఁడు సకలవైరి మకుట • రాజిత పదుఁడై.

వ॥ ఋతుపర్ణునకు సుదాసుండును, నతనికిఁ గల్మాషపాదుఁడనఁ బ్రసిద్ధుండగు మిత్ర
సహుండును గలిగిరి.

క॥ ఘనుఁడు వసిష్ఠుండశ్మకుఁడనువానిఁ గనియె నతని • కాత్మజుఁడయ్యెఁ
వినుతింపఁదగిన మూలకుఁ దను నాతఁడు వైరికుల ని • హంతయగుచిలఁ.

తే॥ పరశురాముని భీతిన • ప్పార్థివుండు కామినీవేషముంబూని • కాంతలందు
దాఁగె నతనికిఁ గల్గె శ • తరథుఁడనెడువాఁడతఁడు గాంచె నిళబిళ • వసుమతీశు.

వ॥ ఆతనికి వృద్ధశర్మయు నాతనికి విశ్వసహుండును, నతనికి దిలీపుండును, నతనికి రఘుం
డును, నతనికజుండును, వానికి దశరథుండును, నాతనికి రామ భరత లక్ష్మణ
శత్రుఘ్నులును, గలిగిరి. అందు రామునకుఁ గుశలవులు, నందు గుశునకు నతిథియు,
వానికి నిషధుండును, నాతనికి నళుండును, నాతనికి నభసుండును, వానికిఁ బుండరీ
కుండును, నతనికి క్షేమధన్వుండును, నతనికి దేవానీకుండును, నతని కహీనరుండును,
నతనికి సహస్రాశ్వుండును, వానికిఁ జంద్రావలోకుండును, వానికిఁ దారాపీడుం
డును, వానికిఁ జంద్రగిరియు, వానికి భానుచంద్రుండును, నాతనికి బృహద్బలుం
డనంబరఁగు శ్రుతాయువును, జన్మించిరి. శ్రుతాయువు కులంబున నృపుండగువాఁ
డుదయించి బ్రాహ్మణశాపంబునఁ గృకలాసత్వముం గాంచె. ఆతనికి దృష్టుండును,
దృష్టకేతుండును, యమబాలుండును, రణధృష్టుండును, ననువారు గలిగిరి. శర్యాతి
కానర్తుండును సుకన్యయను పుత్రికయుఁ గలిగిరి. అందానర్తునకు రోచమానుండును
నాతనికి రేవుండును వానికి రైవతుండాదిగ నూర్వురు పుత్రులును గలిగిరి. అందుఁ
గకుద్మియనువాఁడు జ్యేష్ఠుండు ఆతఁడు రేవతియను కూతుఁగని బలరామున కొసఁగె,

— చంద్రవంశ వర్ణనము —

చ॥ ఎవఁడు దిగంబరుండయిన యీశునకాభరణంబునై సమ
స్తవిబుధ సంచయంబునకుఁ దానశనంబు నొసంగువాఁడునై
యవిరళకీర్తిఁ గాంచుఁగమ ♦ లాలయ కెవ్వఁడు తమ్ముఁ డబ్జినీ
కువలయ నాయకుండు ముని ♦ కోటినుతుండలరారు నెంతయున్.

చ॥ అతనికిఁ దారయందుదయ ♦ మయ్యెబుధుండు సమస్తదేవతా
ప్రతతికి నేన లభ్యమగు ♦ బంధుర దివ్యపదంబుఁ గాంచి య
ప్రతిహత తేజుఁడై యుడుప ♦ వంశముఁ బూతమొనర్చినట్టి వాఁ
డతులయశోభిరాముఁ డుగ్ర ♦ హప్రకరంబులలోన శ్రేష్ఠుఁడై.

తే॥ చంద్రవంశకలశ ♦ సాగరసవనీతమైన యాబుధుండు ♦ హరునిఁగూర్చి
ప్రమదవనమునన్ ద ♦ పంబొనర్చెడు తఱిఁ గానఁబడియె నొక్క ♦ కమలవదన,

తే॥ అటులఁగానఁబడిన ♦ యక్కాంతఁ గనుఁగొని ప్రీతచిత్తుఁడగుచు ♦ నాతి పూర్వ
వృత్తమెల్ల దివ్య ♦ దృష్టి నెఱిఁగి బుధుఁ డాత్మఁదలఁచె నిట్టులనుచు నపుడు.

చ॥ ఈసతి సంగమంబొకన ♦ రేశ్వర సంభవకారణంబునై
భాసిలకున్నె స్థైర్యగుణ ♦ బంధురమైన మదీయచిత్తమం
దీసరణిన్ జలించునటు ♦ లెంతయు మోహముఁగూర్చుటన్ సరో
జాసను సృష్టిచిత్రముగ ♦ దా తడవేల యొనర్చుటియ్యెడన్.

క॥ అని నిశ్చయించి బుధుఁడవ్వనజాయతనేత్రకరముఁ ♦ బట్టి యథేష్టం
బుననుండెఁ గొంతకాలంబున కాదంపతుల పూర్వ ♦ పుణ్యము నాఁగన్.

క॥ కలిగెఁ బురూరవుఁడనువాఁ డలఘుపరాక్రముఁడు నిర్జి ♦ తారిచయుఁడు ని
ర్మలచరితుఁడు ధీనిధికీర్తిలతాశ్రయుఁడైనవాఁడు ♦ ఘృథకాయుండై.

ఉ॥ అంతట నొక్కనాఁడు బుధుఁ ♦ డాలలితాంగినిఁ గాంచి పన్కనో
కాంత ఫలించె నీ తపము ♦ కల్గెను పుత్రుఁడు దక్షుఁడైనవాఁ
డెంతయు వంశకర్తయయి ♦ యీతఁడు తల్లికిఁ దండ్రికిన్ మన
శ్శాంతినిఁ గూర్పఁగాఁగలఁడు ♦ సర్వధరాతల నాథుఁడై యిఁకన్.

తే॥ తొలుతఁ గాంతవగుచు ♦ నిలఁబుట్టియును మంత్రశక్తిఁ బుంస్త్వమూని ♦ [ శరవణంబుఁ
జేరుకతన మరల ♦ స్త్రీత్వంబుఁదాల్చితి వితని జననమునకు ♦ హేతువగుచు.

క॥ నీ యడకువ కేమెచ్చితిఁ దోయలి నీవీకుమారుఁ ♦ దోడ్కొని చనుమా
హేయంబగు నీ స్త్రీత్వము బాయుమరల నీదు పుంస్త్వ ♦ శక్తి చెలంగున్.

తే॥ శరవణంబుఁజేరి ♦ జనుఁడెట్టివాఁడును చెలియెయగునటంచు ♦ నలిగిమున్ను
హైమవతి శపించె ♦ నక్కాగణంబునఁ గాంతవైతివీవు ♦ కానఁజేసి.

ఆ సుహాదేవి శాపంబు • నపనయింప నలవికాకుండు నెవ్వరి • కైనఁగాని
యేను నినుమెచ్చి వరమిత్తు • నిదిరయె కొనుము తరుణీ స్త్రీత్వపుంస్త్వంబులు •
[ తుల్యములుగ.

అనిబుధుఁడొసఁగినవరముఁ గొని వంశోద్ధారకుఁడగు • కొమరునితోడన్.
జనియెను స్త్రీత్వంబు విడిచి ఘనమగు పుంస్త్వంబు వెలయఁ • గా కామినియున్.

అటులఁజని యిలాఖ్యాకుఁడై • నట్టిభూమిధవుఁడు సుద్యుమ్నుఁడీజగ • త్రయమునందు
దొరయొకింతయు లేకని • ర్జరులువొగడ నవనిఁబాలించె ధర్మంబు • ననుసరించి.

సుతుఁడు సమర్థుఁడై యఖిల • సూరిజనస్తవనీయకీర్తియై
క్షితితలరాజ్యభారమునుఁ • జేకొన నహుఁడునై యజస్రగ
ర్వితరిపు భూమిపాలక కి • రీట నటత్పద పంకజాతుఁడై
ధృతినిరతుల్యుఁడైనఁగని • ధీనిధితండ్రియు నెమ్మనంబునన్.

పుడమినేలు సమర్థుఁడై • పుత్రుఁడిదియె యలరుచున్నాఁడు వీనికి • యర్హమైన
యఖిల భూభారము నొసంగి • యంధకారి చరణముల నాశ్రయించెద • నిరతభక్తి.

అని తలఁచుచు సుద్యుమ్నుండనఘుఁడగు పురూరవునెడ • నవనీభారం
బునిడి తపోనిరతుండై చనియె వనంబునకు నహీన • సంతతితోడన్.

పితృదత్త సకలరాజ్యనిరతిని బురూరవుఁడు తోడి • రాజులు మెచ్చన్
క్షితిఁ బాలించు తలంపును మతిఁజెంది సమస్తసూరి • మాన్యుండగుచున్.

యమునానదీతటంబున నమరు ప్రయాగమున యందు • నర్థిఁబ్రతిష్ఠా
నము నాఁగ నొప్పు నొకనగరము ముఖ్యపురంబునగుచు • రాణింపంగన్.

పూర్వరాజన్య సత్కీర్తి • పుంజమునకు లసదలంకారములఁగూర్చి • యసదృశ ప్ర
తాపమున భూమిభాగంబు • ధర్మగతిని బాలనముఁజేసె నతఁడు • దేవతలు మెచ్చ.

సంతతము జయప్రదయగు కాంతఁగలిసి యతఁడు ధర్మ • కామార్థములన్
స్వాంతమున గారవించి దిగంతవినుతుఁడై పురూర • వాధిపుఁడలరెన్.

స్వసామ్రాజ్యమొంది రా • జన్యతిలకుఁడగుచు నాతండు తుహినక • రాన్వయంబుఁ
బావనంబుగ నేలెన • ప్పార్థివునకు సాటిలేరని బుధులు ప్ర • శంసఁజేయ.

ఆపురూరవున కాయువు, మాయువు విశ్వాయువు, శ్రుతాయువు, శతాయువు, నమాయువు ననువారు గంధర్వలోకప్రసిద్ధులును భవభక్తులునునగు పుత్రులాఱుగురూర్వశియందుఁ గలిగిరి. అందాయువునకు రాహువు పుత్రియగు ప్రభయను దానియం దైదుగురు సుతు లుదయించిరి. అందు నహుషుం డగ్రేసరుండై తడవుకాలంబు స్వర్గంబుఁ బాలించె నాతనికిఁ బితృదేవతల కన్యయగు విరజయందు యతియు యయాతియు సంయాతియు నాయాతియు నంధకుండును విజాతియు ననువా రాఱుగురు గలిగి రందు.

క॥ యతిసంతతంబున గజాపతి సేవానిరతుఁడై నృ • పాలత్వము స
ద్గతికి విరుద్ధంబనుచున్ మఱిఁదలఁచి తపంబొనర్ప • మౌనులఁగూడెన్.

ఉ॥ తక్కినవార లైదుగురు • దక్షులెయైన ధరిత్రి నేలఁగా
నక్కటికంపు పట్టగుయ • యాతియె యగ్రియుఁడౌటవారలం
దక్కనవాతఁడే నృపతి • యై తనకీర్తి యెల్లదిక్కులన్
జక్కఁగఁ బర్వ నేలె శశి • సంతతి రాజులలోన ముఖ్యుఁడై.

తే॥ అతఁడు వృషపర్వుఁడనియెడు • నసురనాథు తనయయైన శర్మిష్ఠను • దైత్యగురు
సుతయయిన దేవయానియన్ • సుందరాంగిఁ బరిణయంబయ్యె సతతమై • భవముఁగో

— యయాతిచరిత్రము —

క॥ ఆ యిరువురు సాధ్వీమణులేయెడఁ దనకెల్ల యగుచు • నెంతయుభక్తిన్
న్యాయపథంబునఁ గొలువఁగ నాయయి సౌఖ్యముల నొంది • యలరునతండున్.

తే॥ మనసులోన వర్తించుచు • మగువ లిరువు రొకరకన్న నొక్కరు భక్తి • సర్విభా
సేవసేయుచునుండ ల • క్ష్మీకళత్రుఁడైన వైకుంఠుఁడున్ బోలె • నలరెనతఁడు.

వ॥ అతఁడు దేవయానియందు యదుతుర్వసులనువారలను శర్మిష్ఠయందు ద్రుహ్యుఁ
డును, ననుండును, పూరుండును, ననువారలను బుత్రులఁగాంచె.

క॥ అసురగురుఁడు శుక్రుండవ్వసుధాధవునకు మనోజ • చతురంగయుతం
బసదృశమగు నొకయరదం బొసఁగెను కూఁతునిడువేళ • యోగ్యుండనుచున్.

చ॥ అనఘ మణీమయంబయిన • యారథమెక్కి యయాతి దేవదై
త్యనరముఖాదియోధులకు • నైనను భీతిల కెల్లవేళలన్
ఘనరణరంగమందున న • ఖండజయంబు వహించె నెంతయున్
దనసరియైన వాఁడొకఁడు • ధారుణిలేక చరించు నిచ్చలున్.

తే॥ మఱియు నతఁడు శైవ • మండలముల కెల్ల రక్షకుఁడయి యస్వ • రముల దేవ
వితతిఁదనియఁజేయు • చతిలోక తేజుఁడై యలరె వైరిరాజు • లదరునటుల.

తే॥ ఆయయాతి యనంతర • మారథమును వాసవుఁడు చేదిపతికిడె • వాఁడొసఁగె బృ
హద్రథుండనువానికి • నతనిఁజంపి భీముఁడు హరించె దానినిఁ • బ్రీతిఁ జెలఁగి.

వ॥ తదనంతరంబ.

తే॥ శుక్రదత్తమగు న • వక్రమైన రథంబువలెనె ధార్తరాష్ట్రి • వంశమందు
నగ్రగణ్యుఁడైన • యాజనమేజయు పాలనంబు దాఁక • ప్రథితమగుచు.

తే॥ కులము పరిపాటియై తన • కున్ లభించినట్టి రథమెక్కి జనమేజ • యక్షితీశుఁ
డొక్కపుడు గర్గుని కుమారు • యువకు నమలునంత మొందించుటయు బ్రహ్మ •
[ హత్యకలన.

తే॥ ఆరదము నశించె జనమేజ • యావనీశుఁ డపుడు లోహగంధాంగుఁడై • యఘము సోఁకి
వారలెల్లరుఁ దొలఁగింప • బహుళదుఃఖపూరితుండయి కొనకుఁ • జేరటయును.

వ॥ కరుణానిధియగు నాతండు జనమేజయునివలన బ్రహ్మహత్యానివారకంబును యాగంబుఁ జేయించిన నాతని శరీరమందలి లోహగంధంబునుఁ బ్రాహ్మణపుత్ర సంహారజనితంబునగు దోషంబును దొలంగె. ఇదియిట్లుండె నా యయాతి.

క॥ ధారుణిరాజ్యం బెల్లను బూరునకిడి వనముఁ జేరి • పురహరు జగదా
ధారు భజించెద ననుచుం గోరిక వచియించె మంత్రి • కులము వినంగన్.

ఉ॥ ఆన్నృపమౌళి వాక్యముల • కబ్బురముంగని యెల్లవారలి
ట్లౌనె యిదేటి ధర్మము ధ • రాధిపుఁ డింతయెఱుంగఁడే సుతుల్
ధీనిధులగ్రజుల్ గలుగఁ • దేఁకువఁ బూరునకెల్ల రాజ్యమున్
బూనిక నీఁదలంచునె య • పూర్వము కాదె తలంప నిద్దియున్.

— యయాతి పౌరజనసంవాదము —

చ॥ నలుగురు పెద్దవారు ప్రియ • నందనులుండఁగ వారినెల్లరన్
దలఁపక యొక్క పూరునకె • ధారుణినిత్తునటంచుఁ బల్కె నీ
వలఁతి మనంబగోచరము • వారక కన్గొనుటహరమంచు యో
గ్యులయిన యొక్క కొందఱుగు • ణోన్నతులాతనిఁ బల్కిరిట్టులన్.

క॥ జననాథ పూరునకె యియ్యనఘంబగు రాజ్యపదము • నర్పింతునటం
చును బల్కితి విది యేగతి ననుకూలంబగునొ తెల్పు • మా మాకింకన్.

చ॥ జనకుననంతరంబఖిల • సాధునుతంబగు రాజ్యభారమున్
గొనఁదగువాఁడు జ్యేష్ఠుఁడని • కోవిదముఖ్యులు పల్కుచుండఁగా
వినమె యిదేటి యూహ పృథి • వీవర తక్కినవారనర్హులే
గొనకొని తావకీనమగు • క్షోణితలంబు భరింప నీపయిన్.

క॥ అనిన శిరఃకంపనముం బొనరించుచు నృపతి పౌర • ముఖ్యులఁగని యి
ట్లనుమీ చెందిన సంశయమును దీర్చుట నాకు ధర్మ • మగుఁ దోఁచె మదిన్.

క॥ కలరిరువురు పత్నులు నాకలఘుచరిత్రలు పురంధ్రు • లక్కామినులం
దల రెడు శర్మిష్ఠయె నా కెలమిని గూర్చునదియయ్యె • నెంతయుఁ బ్రీతిన్.

క॥ తనయందు నాకుఁ బ్రేముడి జనియింపదటంచుఁ దలఁచి • స్వాంతంబున శు
క్రుని పుత్రి దేవయాని యవినయము శోకార్తఁ జనియెఁ • బితఁ గనుఁగొనఁగన్.

వ॥ అట్లుజని శుక్రుఁ గాంచి దీనయై యోయయ్యా నీజామాత శర్మిష్ఠాలోలుండై నాయెడ ననురాగంబు వీడియున్నవాఁడని పలికిన విని కట్టలుక భార్గవుండు నాదిక్కు వేడి చూపులఁ జూచుచు నిట్లనియె.

తే॥ అగ్నిసాక్షిగఁ బరిణయ • మైన సతుల నిరువురను చేర్మిఁగాంచక • యిటులనొక్క-
తొయ్యలి నధోగతిఁ బడఁ • ద్రోయఁదగునె కపటమూనితే యీ పెద్ద • కాలమునకు.

క॥ ఇది సేసిన తప్పెట్టిది యదయఁడవై యేల తిడుగు • టవనీశ్వర న
న్మదిఁ దలఁపవె తిరములె సంపదలు పొదలు ప్రణయమునకుఁ • బదములె చెప్పుమా.

తే॥ అన్నివిధముల యోగ్యుఁడ • వంచు నీకుఁ గన్నియనొసంగితిని గాదె • నన్ను మఱచి
యసురనాథుని యెడ నిట్టు • లాదరమున సతి నవజ్ఞనొనర్పఁగ • మతిఁ దలఁతువె.

క॥ పతియెడ ననురక్తయయిన సతిపైఁ బ్రణయంబులేక • చరియించెడు దు
ర్మతి కిహపరములు గలవే సతతంబెడ తెగని దుఃఖ • సంతతిఁ గనఁడే.

వ॥ నీయనుగ్రహంబె కోరుచు నిచ్చలుఁ దపించు నాముద్దులపట్టిని ట్టిట్టనక యౌవనగర్వం
బున ననాదరంబుఁ గావించినవాఁడవగుటఁ జేసి నీవింక విపులజరాభారమున్నండవై
కామసుఖంబునకయోగ్యుండవై యుండుమని పలికిన నేనును భయకంపితుండనై.

చ॥ తెలిసినవాఁడవీవు నను • దిట్టుట యోగ్యమె సైఁపవైతె నా
సలిపిన నేగమిఁక సకల • సమ్మతమైన గురుత్వసంపదన్
తెలయుదువీవు సుంతయును • బ్రీతివహింపక నొతుఁగూర్చి యేఁ
గలుషము మాన్చుటర్హమగుఁ • గాదె ప్రజాహితమున్ దలంపవే.

తే॥ ఎఱిఁగియెఱుఁగ కిట్టు • లీనాయొనర్చిన స్వల్పదోషము మెయి • సతతదుఃఖ
హేతువైనయట్టి • పృథులజరాభార మగ్నుఁజేయఁదగునె • మామవయ్య.

తే॥ ఎప్పుడేయవస్థ • యీ దేహికుచితమా నప్పుడాయవస్థ • యగునయేని
చింత లేదు గాని • చెలఁగి సుఖంపడుతటిని కష్టమైన స్థైర్యమున్నే.

చ॥ వనజదళాక్షులన్ గలిసి • వాంఛితసర్వసుఖంబులొందుచున్
దన కెనలేక త్రిమ్మరుచు • దండితశాత్రవుఁడై చరింపఁగా
ననువగునట్టి యౌవనము • నందు జరాదశ కల్గునేని యా
తని బ్రతుకెంతయున్ గన • వృథాయగుఁగాదె ధరిత్రినెల్లెడన్.

తే॥ ఆగ్రహంబున శపియించి • తక్కుతమున నెందఱు వంతగలుగునో • యెఱుఁగవైతి
పకట చుంచుకతంబున • నాలయమున నగ్గిఁబెట్టిన యట్లయ్యె • నయ్యయిపుడు.

క॥ నీయొసఁగిన శాపంబున కీయవనీశ్వరుఁడె గుఱియె • యిద్ధచరిత నా
తొయలి నీపుత్రికయును హేయంబగు దుఃఖమొంద • దేయిఁక మీఁదన్.

క॥ అనివార్యమైన శాపంబున భార్యాయుతుఁడనగుచుఁ • బొందెడికష్టం
బున నీవు సామగొనవే యనఘా కరుణింపుమింక • నైనను నెమ్మిన్.

మ॥ అని ప్రార్థించిన భార్గవుండు కరుణా • యత్తైక చిత్తంబుతోఁ
దన కోపంబును సంహరించుకొని స్వాం • తంబందు నెంతేని దా
ననుతాపంబును జెంది యిట్లనియె నీ • యందాగ్రహంబూని యే
ననివార్యంబగు శాపమిచ్చుట విచా • రార్హంబె యయ్యెన్ నృపా.

తే॥ సూఁతునందునఁ గలిగిన • ప్రీతిఁ జేసి వేగిరంపడి తిట్టితి • విమలతేజ
నీవు శాపార్హుఁడవె చూడ • నిరతగౌరవార్హుఁడవగుదు గాక బు • ధాళికెల్ల.

క॥ లోకానుభవముగల్గియు నాకుఁ గ్రహము చాలకుంట • నరనాయక సు
శ్లోకుఁడవు నీయొనర్చిన యీ కొలఁదియె యాగ్రహంబు • హేతువయ్యెన్.

చ॥ పతియొక కారణంబు మెయిఁ • బత్నియెడన్ బ్రణయంబులేక సం
గతమును వీడియున్ మఱొక • కాలమునన్ గరుణింపకున్నె యా
తతమతి యింతయేనియు మ • దిన్ దలపోయక సూఁతుమాట న
మ్మితిఁ జెడుబుద్ధినై యిటుల • మీ సుఖమెల్ల వృథాయొనర్చితిన్.

తే॥ ఏను శపియింపకుండుదు • నేని యిటుల నొక్కప్పుడు గాకయున్న మఱొకప్పుడైన
నువిద నీమూలమున సుఖ • మొందకున్నె యదియె చెడఁగొట్టుకొనియె నా •
[ యాగ్రహమున.

తే॥ అయిన దానికిఁ జింతింప • నగునె ఫలము పుడమినాయక నాశాప • మువజనించు
వార్ధకంబు నివారింప • ఫలవుపడనిదైన నొకమార్గము వచింతు • నవధరింపు.

సీ॥ అవనీశ నీపుత్రు • లందొక్కరునకు నీ వార్ధకంబు నొసంగి • వానియావ
నముఁగొని యిష్టసౌ • ఖ్యము నొంది పిమ్మట నీకు విరక్తి జ • నించినపుడు
వాని యావనమును • వాని కొసంగి నీ వార్ధకంబును గొన • వలనుపడెడు
గతి వరమొసఁగితిఁ • గౌతుకంబున నీకు యవ్వనమొసఁగిన • యట్టివాఁడె
ముఖ్యుఁడనుచు రాజ్య • మునవాని నభిషిక్తుఁ జేసి కాననమునఁ • జేరి సర్వ
సౌఖ్యదానచతురు • శైలజాతనయేశుఁ గొల్చి ముక్తిఁ గనుము • కొడుకులేక.

క॥ అనిపలికిన నేనాతని వినయంబున మ్రొక్కియపుడ • వీడ్కొని సుతులన్
ఘనమతుల నైదుగురఁ బిల్చిన వారును భక్తితోడఁ • జేరిరి నన్నున్.

తే॥ అటులఁ జేరిన పుత్రులఁ • బటుతరాల సహితులను యావనాఢ్యులఁ • జారుగాత్రు
లనుఁ గనుంగొని వార్ధకం • బును గ్రహించి యవ్వనమునొసఁగుఁడటంచు • నడిగినంత.

వ॥ ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థులగు పుత్రులు స్వార్థపరులైనవారు విపరీతంబగు నుత్తరంబొసంగిన నేనాగ్రహంబును విచారంబును రేకెత్త విఫలమనోరథుండనగుదు నేమోయని తలంచుచున్నెడ.

తే॥ పూరుఁడనెడు సుతుఁడు • పాలుపుగలాఁడు నాచెంతఁ జేరి తండ్రి • చింతయేల
యన్నలందు నీకు • నాగ్రహం బేటికి యావనంబు నిత్తు • నర్థిఁ గొనుము.

ఉ॥ నీకతనన్ జనించి రమ • ణీయతఁ గాంచిన యీ శరీరమున్
బ్రాకటభక్తి నీకిడుట • భావ్యమె కావున యావనంబిదే
కైకొను నీకొసంగెదను • కాయము నిత్యమె నీకుఁ గాని చో
నీకుటిలాంగకంబు లిఁక • యెవ్వరిపాలగునో తలంపఁగన్.

తే॥ కష్టపడి కనిపెంచిన • కన్నతండ్రి వాంఛఁ దీర్పకయుండిన • వానిజన్మ
భూభరంబెయగునుగాని • పుత్రమగునె జనకసంశయ మేటికిఁ • గొనుముకడఁగి.

చ॥ కలుషపదంబు యవ్వనము • కన్నులు గన్పడ వట్టివేళ చే
వెలదిఁకొ సేవకుండయి వి• వేకము లేక చరించుకన్నఁ బ్రాఁ
బలుకులు ముఖ్యధర్మమని • పల్కెడు పల్కుఁదలంచి తండ్రికై
యలజడి మాని యౌవనము • నర్పణసేయుట యోగ్యమౌఁగదా.

చ॥ తనయులఁగాంచి వారల క • తంబున సౌఖ్యమునొందనాఁగదా
యని యనయంబు వారికయి • యయ్యయికష్టము లెన్నియేని క
ల్గినను సహించుచుఁ సుఖము • లేక చరింతురుగాదె ధారుణిన్
జనయితలట్టివారి మది • సంతసముం బొనరింపఁగూడదే.

చ॥ జనకుఁడు కోరునేని మది • సందియమందక యీ శరీరమై
న నొసఁగుటొప్పుమందురు స • నాతనులైన మునీంద్రులింత యౌ
వనమునైన కొగతీవు నిను • వంటి మహాత్మునకుఁ గుతూహలం
బొనరించిఁగదా కలుగు • నున్నతకీర్తి జగంబు మెచ్చఁగన్.

క॥ అనిపలుకు కొడుకుపలుకుల విని సంతోషమున నతని • పెంపెక్కఁన యౌ
వనముఁగొని వార్ధకమాతనికిచ్చి సుఖంబుఁ గంటిఁ • దద్దయురతులన్.

వ॥ ఇప్పుడు నాకిహసౌఖ్యంబునెడ విరక్తి గలిగిన కారణంబునఁ బూరుని యౌవనంబు వానికిచ్చి మదీయ వార్ధకంబుఁ గైకొంటి. పితృాజ్ఞాపరిపాలకుండగు పూరుండె మదీయరాజ్య సర్వస్వంబున కధీశుఁడు కాఁదగినవాఁడయ్యె. కావున నాతనికిఁ బట్టంబుఁగట్టఁదలఁచితినని యయాతి కనిష్ఠుండగు పూరునకు రాజ్యంబొసంగి భృగుతుంగంబున ననేక వత్సరంబులు తపంబుఁగావించి దేహాంతంబున శివసాయుజ్యముఁ గాంచె ఇంక యదువంశాదివర్ణనం బాలింపుఁడు.

## — యదువంశాది వర్ణనము —

తే॥ ధీరుఁడైన యయాతికి • దేవయాని కుదయమైనట్టి ధీనిధి • యదువునాఁగ
నలరు జ్యేష్ఠుఁడు వానికిఁ • గలిగిరిద్ధమతులు సుతులైదుగురు జగ • ద్ధితులు ఘనులు.

వ॥ వారును క్రమంబుగ సహస్రజిత్తును, క్రోష్టువు, నలుండును, నజకుండును, లఘుండును నామంబులఁ బరఁగి రందు సహస్రజిత్తునకు శతజిత్తును వానికి హైహయుండును, హయుండును, వేణుహుండునునను వారు ముగ్వురుగలిగిరందు హైహయునకు ధర్ముండును వానికి ధర్మనేత్రుండును నాతనికిఁ గీర్తియు, వానికి సంజయుండును, నాతనికి మహిష్మంతుండును నతనికి భద్రశ్రేణ్యుండును వానికిదుర్దముండును, వాని కంధకుండును వానికిఁ గృతవీర్యుండును గృతాగ్నియుఁ గృతవర్మయుఁ గృతౌజసుండును ననువారునలుగురు జన్మించిరందుఁ గృతవీర్యునకు.

తే॥ అతులతేజుండు కార్తవీ ♦ ర్యార్జునుఁడనఁగ లిగెను సహస్రబాహు సం ♦ కలితుఁడగుచు
పంక్తివదనుని భీకర ♦ భండనమున నైదుపదిసేయఁగాఁజేసి ♦ నట్టి ఘనుఁడు.

తే॥ ఇరువదొక్కమారు ♦ ధరణీశ్వరులనెల్ల వెదకివెదకి చంపె ♦ నదయుఁడగుచు
భార్గవుండు మున్ను ♦ భయదాహవంబున నన్నృపముగ నొనర్చ ♦ నవనితలము.

క॥ నారాయణాంశ సంభవుఁడారాము నెదిర్చి సంగరాంగణమున దు
ర్వారుఁడగు కార్తవీర్యుఁడు ధీరతఁగోల్పోయి పడియెఁ ♦ దేఁకువచెడఁగన్.

వ॥ అక్కార్తవీర్యునకు నూఱుగురు పుత్రులు గలిగి రందు శూరుఁడును, శూరసేనుం
డును, ధృష్ణుండును, కృష్ణుండును, జయధ్వజుండు ననువా రైదుగురు ముఖ్యులైరి.
అందు జయధ్వజుండనువాఁ డవంతీదేశాధీశ్వరుఁడయ్యె. అతనికిఁ దాలజంఘుండను
వాఁడును వాతనికి నూర్వురు పుత్రులు నుదయించి తాలజంఘులనఁబరఁగిరి. అందు
జ్యేష్ఠుండగు వీతిహోత్రునకు వృషప్రభృతులు సుతులైరి. అందు వృషుండు వంశ
కరుండయ్యె. వానికి మధుండనువాఁడు జనియించి నూర్వురఁ బుత్రులఁగనియె.
అందు వృష్ణియనువాఁడు వంశకర్తయయ్యె. అతనికి జనించినవారు వృష్ణులనియు
మధువునకు జనియించినవారు మాధవులనియుఁ జెప్పఁదగిరి. యదువంశజులందఱును
యాదవులైరి. అనియదువంశంబును సోమవంశంబును నాదిసర్గంబును సంగ్రహం
బునఁ జెప్పి త్రిపురాసురోపాఖ్యానం బిట్లని చెప్పందొడఁగె.

## — త్రిపురాసురోపాఖ్యానము —

మ॥ అమరానీకము వేడి కోలుమెయిఁ గ్రౌం ♦ చారాతి శంభు ప్రసా
దమహత్వంబునఁ దారకాసురు సమి ♦ ద్రంగంబునన్ గూల్చి లో
కము నిర్బాధముగా నొనర్చె మును స్వ ♦ ర్గస్వామియున్ భక్తిమై
రమణీరత్నము దేవసేనను గుమా ♦ రస్వామికిన్ బత్నిగా.

తే॥ ఒసఁగి ధన్యుఁడయ్యె ♦ విసఁపుమేఁతరియును గొడుకు మెచ్చుకొనియెఁ గడమ వేల్పు
లమ్మహాత్మునకు ము ♦ దమ్మున నయ్యయి కానుకలిడిరి రత్న ♦ కనకములును.

వ॥ అంతఁ దారకుని పుత్రులగు విద్యున్మాలియుఁ దారకాక్షుండును గమలాక్షుండును
వారు మువ్వురు దారకాసురమృతికి విచారంబున

తే॥ వేలుపులపాలిమిత్తియై ♦ వీఁగకెల్ల శత్రువులసంహరించుచు ♦ సంగరముల
విజయమున్ గాంచి యలరారు ♦ వీరవరుఁడు తారకుండకట యాయుద్ధ ♦ ధాత్రిఁ దెగనే.

తే॥ తండ్రి బ్రతికియుండఁ ♦ దగనెల్లవారిచే గారవింపఁబడుచు ♦ ధీరులమయి,
యమరవర్యులైన ♦ హాస్యంబొనర్చుచు నుంటి మింక సురల ♦ నోర్చుటెట్టులో.

చ॥ ఇదె సమయంబటంచు నమ ♦ రేంద్రుఁడిదు మాపయి దాడివచ్చినన్
గదనమునందు వానిశిత ♦ కాండము లెవ్విధి నోర్వవచ్చునో.

యదయత శంకరుం డలిగి • యార్యుని మాజనకుఁ వధించి యా
పదనొవగూర్చి నక్కట యుపాయముఁ జెప్పెడు వారలెవ్వరో.

క॥ అమృతాశనులైనకతన నమరులు గర్వించి దాన • వావళిపై గ
ర్వమున నెదిరింపనేర్తురు శమమూనరు వారి నెట్లు • సైఁపఁగవచ్చుఁ.

క॥ ఎదియేనుపాయమున నాత్రిదశులవంచింపఁ దగిన • రీతిఁగనినఁగా
క వితిసుతులకు సుఖంబె ట్లొదవును కీర్తిప్రతిష్ఠ • లెట్లొనఁగూడుఁ.

సీ॥ పదునాల్గుభువనమ్ముల్ • పాలించినాఁడు బాహాశక్తి రక్కసుఁడు • లౌననంగ
బ్రహ్మవిష్ణ్వాదిని • ర్జరులవంచించినాఁ డతుల ప్రతాపాగ్ని • యతిశయింపఁ
దననామవర్ణంబు • ల నెజపింపఁగ జేసి నాఁ• డెల్లవారినానందమునను
శూలినిఁదనకు వ • శ్యునిఁగాఁగసల్పినాఁ డ నవరతసమర్చ • నాభిరతిని
ప్రతినృపతిలోకమునకెల్లఁ • బ్రక్కబల్లె మగుచు దీపించినాఁడు మా • యయ్య తొల్లి
యతనికీర్తికిఁ బుత్రత్రయంబుకతన మెరుఁగువచ్చునొవన్నెయె • తొలఁగుటగునొ.

క॥ లోకోత్తరుఁడగు జనకుని ప్రాకటసత్కీర్తి కాంతఁ • బాలింపనిప
ల్గాకులగు పుత్రులకతనఁ గైకొందురె జనయితలు సు • ఖంబించుకయుఁ.

క॥ కావున ఘోరతపంబుఁ గావించి శశాంకమాళి • కరుణవడసి దే
వావళికిఁ బరాభవముఁ జేవదలిర్పంగ నింకఁ • జేయంగఁదగుఁ.

క॥ అని తారకాత్మజులు శుక్రునికడ నుపదేశమొంది • కుతుకంబున శీ
తనగాగ్ర దేశమున నొక యనఘుంబగు తలముఁజేరి • యతులితభక్తిఁ.

తే॥ భక్తలోకావనక్షముఁ • బార్వతీశు సకలవరదానచతురుఁ బ్ర • శాంతమూర్తి
సిద్ధసేవిత పాదుఁ బ్ర • సిద్ధహరుని హృదయరాజీవముల నిల్పి • యొసఁగుభక్తి.

వ॥ శతసహస్రమహాయుగంబులు భయంకరతపంబుఁ గావించి నిజశరీరంబుల ఛేదించి
యగ్నిని వ్రేల్చుటయు వారిని మెచ్చి శశాంకశేఖరుండు ప్రసన్నుండయ్యెనప్పుడు

—• పరమేశ్వరుఁడు త్రిపురాసురులకు వరములొసఁగుట •—

క॥ కనుఁగొని తారకపుత్రులు వినయనతాంగులును భక్తి • వృద్ధులు విచల
త్తను భాగులగుచు శంకరు వినుతించిరి వేదవిహిత • విమలోక్తులతో.

చ॥ కరుణజనించె నేజగముఁ • గన్నడు నీఁడవు నీకుమాయెడఁ
వరములొసంగవచ్చితివె • పన్నగభూషణ మమ్ము మెచ్చి నీ
చరణము లాశ్రయించితిమి • సాధుజనావన కన్నతండ్రివై
యరయఁగదయ్య మా శుభము • నంతక సంహార నిన్నుఁ గొల్వమే?

క॥ ఎట్టిమహాయోగులకే నిట్టి మహాత్ముఁడవటంచు • నెఱుఁగఁగరాని
బొట్టియలకు నీమహిమం బెట్టుల వర్ణింపశక్య • మీశగిరీశా.

చ॥ కరణతురంగమంబులను • గట్టడసేసి యకార్యకారణ
స్ఫురణవహించి వించునరి • పుంజముగెల్చి విరాగులై వసాం
తరములఁ ద్వద్గతాత్ములయి • తద్దయుఁ ద్రిమ్మరు మానులేని నీ
చరణమహత్వముల్ దెలియఁ • జాలరనన్ మముఁబల్క నేటికిన్.

చ॥ హరగిరిజాసనాథ నిగ • మాంతములేని భవన్మహత్వముల్
గరమెఱుఁగంగనేరవనఁ • గా నొక పామరకోటి నేర్చునే
మురదమనుండు నీచరణ • మూలముం గనఁ గోఁ బెక్కువేల వ
త్సరములు సంచరించి నిజ • శక్తిని గోల్పడలేదె మున్నగిన్.

వ॥ అని యనేకవిధంబుల వినుతించిన వా దైత్యత్రయముం గాంచి కరుణానిధి యీశ్వ
రుఁడిట్లనియె.

ఉ॥ సంతసమయ్యె మీతపము • సన్మని వేద్యము మిమ్మువంటి వా
రెంతయు మాకు ముఖ్యులు మ • దీయ పదార్చకులైనవారికిన్
జెంతనె నిల్చి నిచ్చలును • శ్రేయముఁ గూర్చుట నాకు ధర్మమా
నింతయు సంశయింపక య • భీష్టవరంబులఁగోరుఁడిచ్చెదన్.

తే॥ ఏట్టివాంఛఁ జేసి • యిట్టి ఘోరతపంబు సలుపుచుంటిరిపుడు • సరగఁదెల్పి
కైకొనుండుసకల • కాంక్షితములనిత్తు మీ తపంబు నాకుఁ • బ్రీతిఁగూర్చె.

క॥ అనినవిని ధన్యులమయితిమని యసురత్రయము శైల • జాధీశ్వరుఁగ
న్గొని దైన్యంబును వినయముఁ బెనఁగొన నిట్లని పచించె • వేదహితముగన్.

తే॥ ఈ చరాచర లోకంబు• లెల్ల నీ కృపావశంబున సర్వశు • భంబులొందు
నట్టి నీ దర్శనంబు జే • యంగలట్టి భాగ్యము లభించె నింకొక • వరమదేల?.

క॥ కరుణాసహితుఁడవైమము • వరముంగోరుమని యిట్లు • పల్కినకతనన్
దురితౌఘ నాశ మాకీవర • మొసఁగుము వేఁబునాక • భావమునందున్.

తే॥ కామసంహర నీయను • గ్రహము కతన సకలలోకేశ్వరత్వంబు • సర్వసంప
దాఢ్యతయుశత్రులోక • జయంబమర్త్యభావయుఁ జెందెదునట్లు ము•దంబుగూర్పు.

తే॥ ఎట్టి సురలకేని యెట్టినరులకేని • యెట్టివారికేని • యింతయేని
తేఱిచూడరాని • తేజంబొసంగుము కనికరంబునీవుఁ • గలుగునేని.

తే॥ ముప్పురము మేము • పురముల మూఁడుగూర్చుకొని యజస్రంబుఁ దిరుగుచుఁ •
[ గోరినపుడు
వత్సర సహస్రమునకొక్క • వార మెట్లో కలియుచుండెడిగతివరం•బుల నొసగుము.

చ॥ అనఘ భవత్పదాబ్జభజ • నాభిరతిన్ విడనాడి యెంతయున్
ఘనమగు దర్ప మాని యొడి • కంబున ధర్మవిరుద్ధకార్యముల్
బొనరిచి సంచరించునెడ • మూఁడుపురంబులు నొక్కచోటఁ జే
రునపుడు నీవు మాయెడల • రుద్రుఁడవై వధియింప యోగ్యమా.

తే॥ ఇవ్విధంబున వరము మా ♦ కిత్తువేని వైరిలోకారచిత పరా ♦ భవమునీఁగి
ధన్యులమగుచు నీ పద ♦ ధ్యాన మాత్మ నలుపుచుందుము లోకర ♦ క్షాపటిష్ఠ.

క॥ అని కోరిన పరమేశ్వరుఁడను కంపానిధియగుడు సు ♦ రారులఁగని య
ట్లనె యగుఁగాకయనుచుఁ దా కనుమొఱఁగె సురలును వేడ్క ♦ గడలుకొనఁగ

వ॥ అంత.

చ॥ తారక పుత్త్రులెంతయు ము ♦ దంబును జెంది నిజాలయంబులన్
జేరి మయుండు నాఁబరఁగు ♦ శిల్పకలాకుశలున్ వివేచనా
పారగుఁ బిల్చి దివ్యమణి ♦ భాసితయుల్ త్రిపురంబులన్ సుధా
కారతఁగూర్పుమన్న నతఁ ♦ డట్టులె యయ్యెడునంచుఁ బల్కుచున్.

వ॥ సర్వసమర్థుండగు మయుం డయ్యసురాధిపుల కోరినవిధంబున శతయోజన విస్తా
బులును, గాంచన రాజతాయసమయంబులును, సర్వలక్షణ లక్షితంబులును
మూఁడుపురంబుల నిర్మించి క్రమంబునఁ దారకాక్ష కమలాక్ష విద్యున్మాలి స
ఖ్యులగువారి కొసంగె నా నగరంబులు దివంబునను నంతరిక్షంబునను భూమియం
నొక్కొక్కటిగ వరుసనుండు.

చ॥ ఘనులగు తారకాత్మజు ల ♦ ఖండతపంబొనరించి శంభునిన్
దనియఁగఁజేసి యాతనిక ♦ తంబునఁ బెక్కువరంబులొందినా
రనివిని యెల్లదానవులు ♦ నర్థి మెయిన్ జనుదెంచి రమ్మహా
దనుజుల గొల్వకూటములఁ ♦ దారుపసింపఁదలంచి యెంతయున్.

క॥ ఆ రీతినేగుదెంచినవారికి రక్కసకోలంబు ♦ వారికి స్వకులా
చారము నతిక్రమించక గౌరవములొనర్చి నిల్వఁ ♦ గాఁజేసిరొగిన్.

క॥ ప్రవిమల యశోలలితులై శివపూజానిరతులగుచు ♦ శిక్షితలేఖా
ప్రవరులయి వారు మువ్వురు భువివినుతిన్ గాంచి రఖిల ♦ బుధజనులందున్.

చ॥ శ్రుతులను గారవింతురు వ ♦ సుప్రకరంబులతోడ నర్థి సం
తతికి ముదంబుఁ గూర్తురు ప ♦ దంపడి ధర్మము నాచరింతురు
ద్ధతులయెడన్ విరోధమును ♦ దాల్తురు శైవుల నాదరింతురా
తతమతులై యజస్రమును ♦ తారకపుత్త్రు లుదారభక్తిమై.

తే॥ ఈశ్వరార్పణమొనరింప ♦ కింతయేని కుడువనొల్లరు కుడిచిన ♦ కుటిలమతుల
సైఁపనొల్లరు నిచ్చలు ♦ చంద్రశేఖరుని భజింతురు భక్తియు ♦ వినయమలర.

తే॥ అసురులే వీరు నిఖిల వే ♦ దాంతవేత్తలైన యోగులు గాకంచు ♦ ననవరతము
జూపఱులు తమ్ముఁజేరి సు ♦ శ్లోకులగుచు శిష్యులైయుండ వారలు ♦ చెలఁగి

వ॥ అట్లు త్రిపురాసురులు పరమేశ్వర చరణారవింద సేవానిరతులును, నిరంతర పా
పతివ్రతదీక్షాపరులును, షట్కాల శివపూజా ధురంధరులును, భూతిభూ

గాత్రులును, సహస్ర రుద్రాక్షమాలికా పరిశోభితోరస్కులును, శ్రితజన రక్షకులును, నయ్యు స్వసల పరంపరాగతసుసు వైరంబునఁజేసి యమరుల నవమతిఁ గావించి తదర్థంబుఁ గొల్లగొట్టుటయు వారి సౌఖ్యంబు హరించుటయు ముఖ్యంబు లుగఁ దలంచి

తే॥ జాలిఁబూని శత్రు • జాలంబునడపక యూరకుంట తగదు • శూరులైన
వారి కీర్తివైరి • వారంబు కతమున వృద్ధియగుఁగదా ధ • రిత్రియందు.

చ॥ అమరుల విశ్వసింపఁదగ • దయ్యయి వేళల కహూటమైన వే
షమును వహించి త్రిమ్మరుచు • సాధువులంచు నసాధులంచుఁ జి
త్తమునఁ దలంపకింతయును • ధర్మము మీఱుటకేని సైఁతు ర
క్రమభయ మింతయుం గనరు • కాలమహోరగముల్ గదా సురల్.

తే॥ అవసరంబగునేని దా • స్యంబునైన సలుపఁగా సమ్మతింతురు • బలముగలుగు
పట్లదలపట్టి యీడ్తురు • స్వామినైన క్రతుభుజుల విశ్వసింపఁగ • రాదుమనకు.

తే॥ ఎవనిపేరు విన్న • నీరేడు జగముల గములు నెమ్మనముఁ • గలఁగాంచు
నట్టివానిఁ దంఁడ్రి • నంతంబుఁగావించి రమరులెల్లఁ గ్రూరు • లగుచుమున్ను.

వ॥ కావున

చ॥ కనికరముం వహింపక య • ఖండ మదోద్ధతి సంచరించు న
య్యనిమిష సంచయంబు నీక • నాహవసీమ వధింపఁగాఁదగుం
దనుజులు భీకరాటవుల • దాఁగుటయుం సుధఁ ద్రావి నిర్జరుల్
పనివడి స్వర్గలోకమును • బాలనసేయుటయుం సహింతుమే.

క॥ తనవారలకు ముదము రిపుజనులకు దుఃఖంబుఁగూర్పఁ • జాలని కార్యం
బున నేమి ఫలము గలుగునో దనుజుల సౌఖ్యంబుఁ గోరఁ • దగదా మనకుం.

తే॥ అనుచు ముగు రన్నదమ్ములత్యంత రోషభీషణాస్యులగుచు నెల్ల • వేల్పుగమికి
వంతఁగూర్పు తలంపున • వనజసంభవాండములు భెగ్గడిల్ల ను • ద్దంగులగుచు.

వ॥ జైత్రయాత్రాప్రస్థానంబుఁ గావించి తమతమ పురంబులతోడన నొక్కపరిగ స్వల్ప శిలలఁబడు మహానగంబులట్లు శత్రునగరంబులపైఁబడి వానినెల్ల దుమ్ముసేయుచుండి రంత నా యుపద్రవంబునకోరువక వాసవపురోగములగు నిర్జరు లెల్ల వైకుంఠుని సమీపించి త్రిపురాసురకృతబాధలం దెలిపిన హరియు.

—త్రిపురాసురబాధితులగు వేల్పుల నారాయణుఁ డాదరించుట—

క॥ పరమేశ్వరదత్తమహావర సంతానంబు కలిమి • వారక త్రిపురా
సురులిట్లు మదోద్ధతులై చరియించుచు నుందు రాక • సంబున నెపుడుం.

ఉ॥ వారల నోర్వఁగాఁ దరమె • వాసవమాదృశులైనయట్టి బృం
దారక పాళికింతయును • ధర్మముఁ దప్పక యెల్లవేళలన్
వారు శివార్చనాభిరతి • వర్తిలుచుందురు చంద్రశేఖరుం
డారసి వారిపైఁ బెలుచ • నక్కటికంబు వహించియుండుటన్.

తే॥ హరుఁడు వారికి సేవ్యుఁడై • యలరుకతన నెట్టివారికి వారల • నెదిరిగెలుచు
నేర్పు చాలదు మనయెడ • నియతి తప్పి యిట్టివెతఁగూర్చుచున్న దిం కెట్టులగు

తే॥ ఎంతకాలంబు వారియం • దిట్లు ధర్మవర్తనంబు చెలంగును • వామదేవుఁ
డంతకాలంబు వారిపై • నక్కటికముఁబూని రక్షించుచుండు స•న్మానముమె

తే. వారు ధర్మిష్ఠులగుట పా • పంబొకింత కలుగదా యసురులకు ని • ష్కలుషులై
వారి వధియించు టెట్టు లీ • శ్వరునికప్పుడలుక కలుగు నపుడువారి • నగుజయిం

తే॥ వారిసేయు కలుష • వారంబు సంతత శర్వపూజవలన • సమయుచుండుఁ
గాన నెట్టివారి • కైన నయ్యసురులఁ దేటిచూడరాదు • తేఁకువలర.

వ॥ కావున మదీయ మాయాశక్తిఁ బ్రయోగించి.

—త్రిపురాసురుల ధర్మవిఘ్నంబునకై విష్ణువు మాయాపురుషుని సృష్టించుట—

తే॥ హరునియెడ ద్వేషబుద్ధి ధ•ర్మాచరణమునందు విముఖతయునుగూర్చి•యసురవ
నిమిషమాత్రంబున జయింప • నేర్తునింక దిగులుపడుటేల మీకు నో•త్రిదశులా

మ॥ అనుచున్ బల్కి మురారి యప్డు సురకా • ర్యార్థంబు సృష్టించె ధ
ర్మనిహంతృత్వముఁ బూననేర్చిన మహా మాయామయున్ యోగిరా
డ్జనచిత్తస్థిరతాపహారు నఘుర • క్షాదక్షు దుశ్శాస్త్ర జీ
వనుఁడౌ నొక్కనిఁ గామరూపధరు శుం • భచ్ఛక్తిస్వాంతంబునన్.

తే॥ అటుల సృష్టిఁజేసి • యచ్యుతుఁడతనికి సాయమును బొనర్ప • శాస్త్రచయము
సొరిది నొసఁగె గ్రంథ • షోడశలక్షితమైనదాని సురలు • హర్షమొంద.

వ॥ అట్లు సర్వసమ్మోహనంబును, మాయామయంబును నగు శాస్త్ర సంచయమొ
కేశవుఁ డాతనికిట్లనియె.

చ॥ చతురుఁడవైతివీ కుటిల • శాస్త్రచయంబు గ్రహించి ధర్మసం
గతిఁ జరియించు రాక్షస ని • కాయముఁజేరఁగఁబోయి నీ సమ
ర్థత వెలయంగ వారల క • ధర్మమె రుచ్యముగా నొనర్చి దే
వతలకు మేలుగూర్పుము శు • భంబగు నెల్లెడ నీకు నీపయిన్.

తే॥ చెప్పఁదగినట్టి మాటలఁ జెప్పిచెప్పి చేయవలసిన బోధలఁ జేసిచేసి
నడవఁగూడిన త్రోవల • నడచినడచి యసురసత్వంబు హరియింపు • మయ్యయిః

ఉ॥ తక్కిన రక్కసుల్ వలెను ♦ తారకపుత్రులు దుష్పథంబునన్
జిక్కరయేని యేనొకఁడ ♦ నే వధియింపఁగ నేర్తుఁ గాని వా
రక్కటికంపు టిక్కయగు ♦ నంధకవైరి పదాంబుజాతముల్
మిక్కిలిభక్తిఁ గొల్తురు సు ♦ మీ యెదిరింపఁగరాదు వారలన్.

తే॥ ఈశ్వరద్వేషము వహించి ♦ లేని వారు సులభసాధ్యులై యగుదురు ♦ కలననాదు
హరుఁడొసంగిన వరమున ♦ నగ్నిఁబోలె మండుచున్నారు దరిఁజేర ♦ కుండునటుల.

క॥ కావున నీవీపనికై వేవేగమ పోయిరమ్ము ♦ వికలమతులుగన్,
గావింపుము నీ చాతురిభూవిదితంబగునటులఁ బ్ర ♦ బుద్ధుఁడవగుచున్.

క॥ అనిపలికిన వల్లెయని తనకున్ శిష్యుఁడుగ నారద ♦ మునీంద్రుఁడు రాఁ
జనియెన్ మాయామయుఁడా దనుజులఁగనుఁగొనెడు కోర్కెఁ ♦ దగ నెమ్మదిలో.

తే॥ అవ్విధమున నార ♦ దర్షి యనుసరింపఁ జనియెఁ దాఁ గులాల ♦ చక్రమటులఁ
బుడమిసంచరించు ♦ పురదానవుల ధర్మనిహతి సల్పఁగోరి ♦ నేర్పుమెయిని.

వ॥ అట్లుజని మాయామయుండగు పురుషుఁడు త్రిపురాసురులకు నిజమాయాబలంబునఁ
జేసి యనేకంబులగు ధర్మేతర కార్యంబుల బోధించి శిష్యులఁగావించుకొనినవారును
శివనిందాపరులును వేదవిముఖులును, పాపాచారప్రియులును హరపూజాభ్రష్టులును
పరిత్యక్త పాశుపతవ్రతులునునై సర్వంబును స్వాధీనంబుగఁ దలంచుచుండి రప్పుడు.

సీ॥ పతిదేవతలయందుఁ ♦ బాదుకొనియెఁ బరపురుషాభిరతి నిరంతరము పొదలి
తలిదండ్రులందు ♦ సుంతయు భక్తిలేదయ్యె సుతులకు దుష్టసం ♦ గతము కతన
ధనలుబ్ధులైయుపా ♦ ధ్యాయులు పక్షపాతమువహించిరి శిష్య ♦ తతులయందు
నవసరంబునుబట్టి ♦ యనృతంబె వలుకంగ సాహసించిరి బుధ ♦ జనులు పూనిక-
వంచనామతులై భూమి ♦ పతులు ప్రజల వెతలఁగుడుపుచునుండిరి ♦ వివిధగతులఁ
గులవిహితధర్మసంతతి కొట్టువడియె నీతిబాధలుప్రబలె ధా ♦ త్రీతలమున.

క॥ లింగార్చనాభిరతిని దొలంగిరి తాపసతతులు ఖ ♦ లజనంబులతో
సంగాతముఁబూనిరి కులముం గోత్రముఁ దలఁపరైరి మూఢాత్మకులై.

క॥ మాయామయ పురుషుఁడు తమకేయవి వచియించు దాని ♦ నే భక్తిమెయిన్
జేయుదురు మంచిచెడ్డల నే యాలోచింపఁదలఁప ♦ రింతయు మదిలో.

తే॥ హరియుఁ ద్రిపురాసురులధర్మ ♦ నిరతులగుటఁ గాంచి లోకంబులకు, మేలు ♦ గలుగుననుచుఁ
దలఁచి సంతసమునఁ బుర ♦ త్రయముఁ గూల్పహరుఁడె కుశలియటంచుని ♦ ర్జరులకనియె.

క॥ కనుఁగొంటిరె ధర్మాత్ములు దనుజులు మన్మాయఁజేసి ♦ ధర్మవిముఖులై
గొనకొని యీశ్వరనిందాజనితఫలం బనుభవింపఁ ♦ జాలుదు రింకన్.

— శివుడు త్రిపురాసురుల వధించుట —

చ॥ హరుఁడొకరుండె తక్క త్రిపురా ♦ సురులన్ గలనన్ జయించు నే
ర్పరియగువాఁ డెవండుఁగన ♦ రాఁడు జగంబుల నెందుఁ గాంచినన్
దిరమగు పూన్కినింక నస ♦ దృబ్మహిమాస్పదుఁ జంద్రశేఖరున్
గరము భజింపఁగావలయుఁ ♦ గావె సురావళి కెంతయేనియున్.

తే॥ అనివచించి వెన్నుఁ ♦ డమరావళిన్ గూడి హి మనగంబుఁ జేరి ♦ విమలభక్తి
శివునిఁ గూర్చి తపముఁ ♦ జేసిన భక్తపోషకుఁడు శంకరుఁడు ప్ర ♦ సన్నుఁడయ్యె.

తే॥ అవ్విధిఁ బ్రసన్నుఁడై తుహి ♦ నాంశుమాళి వినయనమితోత్తమాంగులై ♦ [ వినుతిఁ జేయు
క్రతుభుజులఁ గాంచి యనుకంప ♦ కడలుకొనఁగ నాదరంబున నిట్లని ♦ యనియెనపుడు.

చ॥ తెలిసితి మీ మనోరథము ♦ దీనిధులార యవార్య విక్రమో
జ్జ్వలులగు తారకాత్మజులు ♦ పాశుపతవ్రతదీక్షఁ బూని ని
చ్చలుఁ జరియించువారగుచు ♦ సంతత ధర్మపథానుగాములై
యలరుటఁ జేసి వారియెడ ♦ నాగ్రహమున్ గొననైతి నింతయున్.

చ॥ బలమదమత్తులై యెపుడు ♦ పాశుపతవ్రతమున్ ద్యజించి ని
ర్మలమగు మామకార్చనము ♦ మానుదు రప్పుడ యేను వారిపై
నలిగివధించునట్లు దను ♦ జాధిపతుల్ వరమున్ గ్రహించి దా
యలగుట వేల్పులన్ వెతల ♦ నందఁగఁ జేయుచునుండి రింతకున్.

క॥ మాయాపురుషునికతమున న్యాయము విడనాడి మత్తు ♦ లై మత్పూజన్
జేయరు తారకసుతులిపుడీయెడ వారలవధించు ♦ టే సులభమగున్.

వ॥ కావున నిప్పుడ త్రిపురాసురుల వధించి యెల్లలోకంబులకు శ్రేయంబుఁ గూర్తు నని వచించి దక్షిణచక్రంబు సూర్యుండుగను వామచక్రంబు చంద్రుండుఁగను ద్వాదశాదిత్యులు చక్రారంబులుగను షడృతువులు నేములుగను బూర్వపశ్చిమాచలంబులు కూబరంబులుగను వేదంబులు హయంబులుగను వేదాంగంబు లలంకారంబులుగను పురాణ ధర్మశాస్త్రంబులు ధ్వజపటంబులుగను నలరు క్షోణీరథంబు నధిష్ఠించి చతురాస్యుండు సారథిగను సాగరం బమ్ములపొదిగను కాంచనాచలము చాపముగను శేషుండు గుణంబుగను వెన్నుఁడు బాణంబుగను, వెలయ భూతగణంబులఁ గూడి సోమశేఖరుఁడు సహస్రవర్షంబులు త్రిపురసమావేశంబునకై వేచియుండి తారకాత్మజు లొకచోఁ జేరుటఁ గాంచి యొక కోలవారిఁ గూలనేసె నంత నిలింపులు సంతోషదంతురితస్వాంతులై.

— బ్రహ్మాదులు త్రిపురారిని స్తుతించుట —

సీ॥ విద్యాస్వరూపాయ • వేదాంతవేద్యాయ యగ్నివర్ణాయ తు • భ్యంనమోస్తు
సకలలోకేశాయ • శాసితదైత్యాయ పంచముఖాయ తు • భ్యంనమోస్తు
త్రిపురవిదారాయ • త్రిగుణాభిరామాయ యగుణోన్నతాయ తు • భ్యంనమోస్తు
యోగపీఠస్థాయ • రోగవినాశాయ పార్వతీశాయ తు • భ్యంనమోస్తు
ఫాలలోచనాయ • పాలితలోకాయ నందివాహనాయ • యిందుశేఖ
రాయ రజత మంది • రాయ తుభ్యం నమో స్తనుచు నిన్నుఁ గొల్తు • మనవరతము.
తే॥ త్రిపురదుష్టదైత్య • కృతతీవ్రబాధా సహిష్ణులై కృశించు • నీనిలింప
సంచయమును బ్రోచి • సంతసంబునుగూర్చితయ్య నీ మహత్వ • మరయఁదరమే.
వ॥ అంత బ్రహ్మదేవుం డిట్లనియె.
క॥ అనఘభవద్రథంబునకు • నవ్విధి సారథినౌటఁజేసి నా
జనిసఫలత్వమొందె నీక • సంతతమల్లె కృపామయుండవై
నను రథచోదకత్వమున • నందితచిత్తునిగా నొనర్పు మా
మునినుతముల్ భవచ్చరణ • ముల్ నిరతంబు భజింతు భక్తితో.
తే॥ దానవప్రతాప • దహనసంతప్తంబులైనమన్మనోరథాంకురములు
త్వత్కృపాజలదము • వర్షించుటజేసి దేవ పెంపుఁజెందె • దివ్యగతిని.
వ॥ పిమ్మట వెన్నుం డిట్లనియె.
తే॥ అఖిలలోకేశ దేవ కా • ర్యంబు కొఱకు పాశుపతయోగ నిరతులై • పరఁగుధర్మ
మూర్తులగు దానవుల నిట్లు•మోసగించి యఘము నార్జింతిని దానిఁనడఁపఁగదవె.
తే॥ వాసలిపిన యీ కలుషంబె సరణిఁ దొలంగుఁ బార్వ • తీశ్వరయటులఁ
జేసినను సుకృతవంతునిఁగా సలుపఁగదయ్య యింకఁ • గనికరమొప్పఁ.
తే॥ ధర్మనిహతిఁజేసి • తనసఁ బాతకమింత కలిగినను సహించి ఘనులకార్య
మునకుఁ దోడు సూపఁ జనునంద్రు ధర్మజ్ఞులైన బుధులు నిర్మలాత్ములకిల.
తే॥ అసురవరులందు నాసల్పినట్టి యఘముచాయునట్టుల నన్ను నీ • వాహనముగఁ
గైకొనంగదవయ్య • లోకైకనాధ తావకపదాబ్జములమదిఁ • దలఁతునెపుడు.
వ॥ అని ప్రార్థించినఁ జంద్రశేఖరుఁడు దయాంతరంగుండై పరమేష్ఠికినిజరథసారథ్యంబును వెన్నునకు నిజవాహనత్వమును బ్రసాదించి యదృశ్యుండయె. నంత

—బ్రహ్మదేవుండు విష్ణ్వాదులకు లింగార్చనావశ్యకత్వముఁ జెప్పుట—

క॥ సరసిజసంభవుండు సుర • సంచయముఁ గని పల్కె నిట్లు ని
ర్జరవరులార కాంచితిరె • శంభుమహత్వముఁ దారకాత్మజుల్

హరచరణార్చనావిముఖు ♦ లైనకతంబునఁ జేసి ఘోరసం
గరమున యందునొక్క- శిత ♦ కాంశమునన్ హతులైరి మున్నొగిన్.

తే॥ హరునిపూజ మానుసందాక వారలనెట్టివారికైన ♦ నిఁతరయేని
కలనఁ గెలువ శక్తి ♦ గలిగెనె యీశ్వరికరుణ యిట్టిదనుచుఁ ♦ దరమె పలుక.

వ॥ కావున నిశ్చలభక్తిచే మనమెల్లరము.

క॥ పరమేశు లింగమూర్తిన్ గరుణాకరునప్రమేయుఁ ♦ గలుషవినాశున్
నిరతము భజించుటుచితము పరమాత్ముఁడు హరుఁడు లోక ♦ పాలకుఁడగుటన్.

తే॥ లింగమయము జగము ♦ లింగంబునన్ బ్రతిష్ఠింపఁబడియె నెల్ల ♦ సృష్టి యాత్మ
సిద్ధిఁగోరు వారి ♦ శేఖరులకు లింగపూజ ముఖ్యమగుచుఁ ♦ బుడమినొప్పు.

తే॥ పశుచయంబు వారఁగఁ ♦ బడు భూతసంతతి వానికెల్ల హరుఁడు ♦ పాలకుండు
కాన బశుపతియనఁ ♦ గా శంకరుండిల వినుతిఁగాంచుచుండు ♦ ననవరతము.

తే॥ శ్రితజనావనరతిఁ జంద్ర ♦ శేఖరుండు పాశుపతమును సృష్టించి ♦ భక్తజనుల
కొసఁగెనయ్యోగమునఁ జేసి ♦ యొసఁగు సర్వసిద్ధు లతిసులభంబులై ♦ క్షితితలమున

తే॥ అఖిలజంతుజాల ♦ మాలింగమూర్తిని బూజసేయవలయుఁ ♦ బునుకఁదాల్పు
కనికరించునేని ♦ ఘనతరైశ్వర్యముల్ సుకరముగ లభించు ♦ సుకృతికెపుడు.

తే॥ కరతలస్థమైన ♦ ఘనశివలింగంబు భక్తిఁబూజసేయ ♦ భుక్తిముక్తు
లలవడును ధరిత్రి ♦ నాతనికిన్ సాటియైనవారు గలుగ ♦ రరయనెపుడు.

క॥ అనయంబు లింగసంగతిఁ దనువు పవిత్రమగు సకల ♦ తాపత్రయముల్
చను నిఖిల శ్రేయంబులు జనియించున్ మోక్షసిద్ధి ♦ సమకూరునిలన్

చ॥ అనఘుఁడు కేశవుండును స ♦ హస్రసరోజదళంబులన్ శ్రితా
వనమగు నింద్రనీలమణి ♦ భాసితలింగముఁ బూజసేయుటన్
సనకసనందనాది ముని ♦ సన్నుతుఁడై కమలాధవుండునై
యనయము దానవాధముల ♦ నంతమొనర్చు వికుంఠ మేలుచున్.

తే॥ శైలమయమైన లింగంబు ♦ సంతతంబుఁ బూజసేయుచునుండు సం ♦ పూర్ణభక్తి
నట్టికతమున నేను స ♦ ర్గాధిపత్యమూని సత్యలోకము నేలు ♦ చుందునెపుడు.

— లింగభేదములు —

వ॥ అనిపలికి వనజభవుండు విశ్వకర్మను రావించి వారివారికిఁ దగిన లింగంబుల నిర్మిం
మనిన నాతండును స్వాంతంబున నుమాకాంతుని ధ్యానించి.

సీ॥ పాకశాసనునకుఁ ♦ బద్మరాగమయంబు, నలరు విశ్వేదేవ ♦ తలకు, రౌప్య
మారకూటమయంబు ♦ వసులునకును, వసువులకుఁ గాంతికమశ్వి ♦ నులకుఁ

వముసు, స్ఫాటికమును, ♦ వరుణున, కాదిత్యునకు, దామ్రమయము: మౌ ♦
[ క్తికము, శశి,
నలయనంతాది నాగావళికిఁ బ్రవాళమయము, దైత్యుల కయో ♦ మయము, రాక్ష
సులకుఁ దైర్త్రిలోహికము, గుహ్య ♦ సులకు సర్వలోహికము, సప్తమాతృకా ♦ లోకమునకు,
దారుజంబుఁ, గర్పురునకు, ♦ మారకతమః నంతకునకు నొసంగె న ♦ త్యంతభక్తి.

వ॥ నీలాదులగు రుద్రులకు భస్మమయంబును, లక్ష్మికి వృక్షమయంబును, గుహునకు
గోమయాత్మకంబును, మునులకుఁ గుశాగ్రమయంబును, వామాదులకుఁ బుష్పమ
యంబును, మనోన్మనికి గంధమయంబును, నుగ్రునకుఁ బిష్టమయంబును, బిశాచము
లకు సీసమయంబును, నగు లింగంబు నొసంగె నంత.

తే॥ లలితభక్తి నిష్ఠాగరి ♦ ష్ఠులగువారు వారికిఁ దగురీతి న ♦ వారితముగ
స్వీయ లింగపూజారతిఁ ♦ జేసి సకలసంపదలనొందియుండిరి ♦ క్ష్మాతలమున.

తే॥ ద్రవ్యభేదంబునకఁ జేసి ♦ ధరణి నాలు రెయిఁగులఁ దనర్చు లింగంబు ♦ ధీరవినుత
మగుచు మఱియును నాల్గు తె ♦ఱఁగుల వెలయు దత్స్వరూపంబువన్నెంతుఁ ♦ దగవినుండు

వ॥ ప్రథమంబు శైలంబు. అది నాలుగువిధంబులును, ద్వితీయంబు రజతంబు అది యెని
మిది విధంబులును, దురీయంబు దారుజంబు అదిషోడశవిధంబులును మృణ్మయంబై
దవదది రెండువిధంబులును షష్టంబు క్షణికంబది యేడువిధంబులును నైయుండు.

—శక్తిలింగఫలములు—

తే॥ శ్రీపదము రత్నజము, సర్వ ♦ సిద్ధిదంబు, శైలజము, ధనదము ధాతు ♦ జంబు, భోగ
సిద్ధదము దారుజము, సర్వ ♦ సిద్ధికరము, మృణ్మయంబగు లింగంబు ♦ మేదినిపయి.

వ॥ శైలజం బుత్తమంబనియు, ధాతుజంబు మధ్యమంబనియుఁ, జెప్పంబడు. లింగ
భేదంబు లనేకంబులయ్యు సంగ్రహంబుగ నవ విధంబులె గ్రహింపఁదగు. మూలం
బు బ్రహ్మయు, మధ్యమంబు విష్ణుండును, నుపరిభాగంబోంకార స్వరూపుండగు
సదాశివుండును లింగవేది మహాదేవియు నగుటఁజేసి లింగార్చనంబున బ్రహ్మ విష్ణు
మహేశ్వరులును నాదిశక్తియు సంతసింతురని పలికి సూతుండు మఱియు నిట్లనియె

—ఈశ్వరసగుణత్వ కథనము—

తే॥ శ్రుతిశిఖరసంతతులచేతఁ ♦ జూడఁబడుచుఁ బ్రణవరూపియై యలరెడి ♦ పార్వతీశుఁ
డీద తేజుండు విజ్ఞాన ♦ మే యటంచుఁ బరమతత్త్వజ్ఞు లెల్లరుఁ ♦ బలుకుచుంద్రు.

తే॥ అరయ శబ్దాదివిషయమై ♦ నట్టి జ్ఞానమెసఁగు జ్ఞానంబు నానది ♦ వసుధ భ్రాంతి.
రహితమైయుండునని ముని ♦ రాజులెల్లఁ బలుకుచుందురు నిర్మల ♦ స్వాంతులగుచు.

తే॥ నిర్మలంబును శుద్ధంబు ♦ నిర్వికల్పకము నిరాశ్రయము గురు ♦ ప్రకాశకంబు
నైనదియె జ్ఞానమంచు వేదార్థవేత్తలైన మునులమతంబయి ♦ యలరు నెపుడు.

తే॥ జ్ఞానమునను ముక్తి • కలుగు బ్రసాదంబు జ్ఞానసిద్ధి దాయ • కమయి యొప్పు
వీనివలన ముక్తుఁ • డై నరుం డెంతయుఁ బూతచరితుఁడగును • బుధులువొగడ.

వ॥ దివంబు శిరంబుగను, నాకసంబు నాభిగను, జంద్రసూర్యులు నేత్రంబులుగను, దిక్కులు శ్రోత్రంబులుగను, పాతాళాది లోకంబులు చరణంబులుగను, సాగరం బంబరముగను, దేవతలు భుజంబులుగను నక్షత్రంబు లాభరణంబులుగను, బ్రకృతి పత్నిగను వెలయుఁ బురుషోత్తముండగు లింగమూర్తి ప్రకాశించు.

సీ॥ వదనంబునందున • బ్రహ్మయు బ్రాహ్మణుల్, బాహుల వెన్నుండు • వాసవుండు
క్షత్రియ తతియు, ను • త్సంగదేశంబున వైశ్యులు, శూద్రులు • పాదములను
జలదసంచయము కే • శముల, వాయువులు ప్రాణంబుగ, గతినిశ్శ్వా • సంబు [స్మృతియు,
జనియింపఁ బరమేశుఁ • డనఘుఁడై యలరారు జ్ఞానగమ్యుండగుఁ • గామవైరి
ధ్యానమిల జ్ఞానసాధన • మై తనర్చు బ్రహ్మ విష్ణ్వాది నిర్జరుల్ • ప్రవిమలాత్ము
లగుచు ధ్యానంబు కతన నాంమహరునిఁ గొల్చి ముక్తులగుచుందు రెప్పుడు•మోదమలర.

వ॥ కర్మజ్ఞానసహస్రంబునకన్నఁ దపోయజ్ఞం బుత్తమంబు, తత్సహస్రంబునకన్న జప యజ్ఞంబు ముఖ్యంబు, తత్సహస్రంబునకన్న ధ్యానయజ్ఞంబు శ్రేష్ఠంబు. ధ్యానంబునఁ బరమేశ్వరుండు ప్రీతుండగు. కావున నెల్లవారును ధ్యానంబును గావించి గౌరీ రమణుననుగ్రహంబుఁ గాంచుట యవసరంబు.

తే॥ ఘోరపాతకముల నెన్ని • కోట్లు సలిపియును నరుఁడు ముక్తుఁడగు, ధ్యాన • [యోగము మెయి
శ్రితజనావన దక్షుఁడౌ • శివునిఁగొల్వ మాదృశులను ధ్యానంబె స • మ్మాన్యమిలను.

వ॥ అనివచియించి నానావిధ శివమూర్తి ప్రతిష్ఠాఫలంబును, మృదాది రత్నపర్యంత శివాలయ నిర్మాణాది ఫలంబును, వస్త్రపూత జలాది ప్రశంసయు నధికారిభేదం బునఁ గలుగు శివపూజాఫలంబును, పరమేశ్వరోక్త పశుపాశ విమోచక పాశుపత వ్రత మాహాత్మ్యంబును, పశుపాశ విమోచక శివలింగార్చనా వ్రతానుష్ఠాన క్రమం బును, వ్యపోహనస్తవంబును, మాసభేదంబున శివవ్రతానుష్ఠానంబును సంగ్రహం బుగఁ జెప్పి మరల శౌనకాదుల కిట్లనియె.

—ఉమామహేశ్వర వ్రతము—

సీ॥ రజతమయంబో స్వ • ర్ణమయంబో యైన నుమామహేశ ప్రతి • మంబుఁదెచ్చి
వర్షాంతమున యందు • భక్తిఁ బ్రతిష్ఠించి పౌర్ణమయం దమా • వాస్యయందు
నలరు చతుర్దశి • యం దష్టమీతిథియందును బూజింప • నగునుమఱియు
నా తిథులందున • నహర్నామానొక తిథియం దొందెభక్తియు • క్తాత్ముఁడగుచు

శాస్త్రహిత మంత్రపూర్వమ • ర్చనయొనర్చి ద్విజసమారాధనంబుఁ గావించి శక్తి
కొలఁది దక్షిణ లొసఁగి ని • ర్మలమనస్కుఁడగుచు రుద్రాలయంబున • యందుఁ జేర్చి.
తే॥ ఛత్రచామరభూషణ సంచయముల హరునకర్పింపవలయు ది • వ్యాంబరముల
భక్తినీగతి నెవ్వఁడీ • వ్రతముసల్పు వాఁడీశ్వరసాయుజ్య • మందియలరు.
తే॥ కన్యయేని విధవయేని • కలుషరహితచిత్తయై యివ్విధిని శశి • శేఖరునెడ
భక్తికలితయగుచును నీ • వ్రతముసల్పి విపులసౌభాగ్యమును జెంది వెలయుచుండు.
తే॥ ఇమ్మహావ్రతరాజంబు • నెసఁగు భక్తి సల్పి శారదయనెడు వి • శ్వస్త పూర్వ
జన్మమందలి భర్తతో • స్వప్నమందుఁ గలిసి యెనలేని సుఖములఁ • గాంచెమున్ను.

—• శారదా చరిత్రము. •—

సీ॥ ఆనర్త దేశంబు • లందొక్క జనపదమున వేదరథుఁడను • పుడమివేల్పు
సంతత శంకరార్చా పరుండగువాఁడు పుత్రమిత్రకళత్ర • ములు గలాఁడు
సమయజ్ఞుఁ డొకఁడు వా • సము జేయుచుండు నా శ్రితబాంధవుండు నిర్నిద్రవర్త
నుం డాతని తపంబు • పండె నాఁ జనియించె శారదయనుకన్నె • సాధుశీల
కమలపండువు గూర్చుఁ జ • క్కఁదనమునకు నిక్కయైయొడఁకువకుఁ దా • నేనివాస
మగుచు నలరారునది దయా • ధర్మములకు సాధుసేవకు నిక్కమై • సంతతంబు.
తే॥ ఇరుగుపొరుగు వారి • కెల్లనుల్లాసంబుఁ గూర్చునదియు నతిథి • కోటి నాద
రించి భక్తితోడ • మించిన యన్నపా నంబులొసఁగు శార • దాంబయెపుడు.
క॥ ఇతరుల దూషింపదు తన్నితరులు దూషింతురేని • యించుకయైనన్
మఱిఁ గినియదు కినిసిరయేనతి శాంతముఁ బూని వారి • నలరన్ జేయున్.
మ॥ కలనైనన్ బెరవారి నెమ్మనమునన్ • గష్టంబుఁ గల్గింపఁగాఁ
దలఁపన్ బోదు విపత్తుగల్గిన నస • త్యంబింతయున్ బల్క ద
న్యాల నేరంబులఁ బైటవేయదు విప • న్నుల్ జేరినన్ వీడదా
కులశీలంబుల మన్కి శారద యస • త్కోటిన్ విడంబించుచున్.
క॥ తనవారని పెరవారని మనమునఁ జింతింపకయె స • మానంబుగ మ
న్ననసేయు నెల్లవారల ననయంబా విప్రకన్య • యతి వినయమునన్.
తే॥ తల్లిదండ్రుల యాజ్ఞయా • దలధరించి స్వకులమర్యాదలెల్లను • సంతరించి
పిన్నపెద్దలదఁగునట్లు • ప్రీతిమించి గారవించుచు శారద • కరుణబెంచి.
క॥ తనతోడఁ బుట్టువుల కన్నను గృహాకృత్యంబులం ద • నారత మయ్యం
గన జననీజనకులకున్ ఘన సంతోషంబుఁగూర్చు • గౌరవము మెయిన్.
తే॥ ఆవ్విధంబున శారద • యఖిలసుగుణ గణములకు మన్కిపట్టయి • కలుషహరణ
శీలయై సాధుసేవల • జేయుచుండె సహజ విద్యావతియు నయి • యధికకీర్తి.

వ॥ అట్లు శారద కన్యయయ్యు గుణవృద్ధయై విప్రాన్వయంబునకు వన్నె వెట్టుచు సరివారి
లోనఁ దగునని పించుకొనుచుండఁగా గొండొక కాలంబు కడచెనంత నొక్కనాఁడు
వేదరథుండు.

తే॥ సకలసుగుణాలవాలయై • స్వకులముద్ధ రింపఁగలిగిన శారద • పెంపుఁ గాంచి
తనయకుఁ బెండ్లిసేయంగఁ • దగిన యీడువచ్చెనిఁక నాలసింపంగ • వలనుపడదు.

వ॥ సకల విద్యా పారంగతురాలై నిరంతర గురు శుశ్రూషాపరయై యనింద్య సౌందర్య
విరాజితయై మదీయ తపఃఫలంబునా నలరు నీమెకుఁ దగిన వరునికై యెట్లు ప్రయ
త్నంబు గావింపవలయునో గదా.

తే॥ పేదవానికైనఁ • బెద్దవానికొనర్తుఁ బేద గానొనర్తుఁ • బెద్దవాని
నట్టి నాకె తగిన • యల్లుఁడె కఁడవయ్యెఁ బరులఁగూర్చి యెట్లు • బలుకవలయు.

సీ॥ అల్లుండు నిరుపేద • యనితోఁచినఁ గూఁతుఁ వేరొక్కనికిఁగట్టు • క్రూరులకును
నగలఁజేయించి క • న్యకుఁబెట్టెదమటంచు సొమ్ముఁ గైకొను పిశా • చమ్ములకును
పదునైదువందల • పైకంబునకుఁగాక పట్టినీయమనెడి • పాపులకును
పిల్లనంపుఁడటన్న • బెల్లుబ్బిపైఁబడి మోదవచ్చెడి మహా • మూర్ఖులకును
కాసుదగ్గనఁగాని ల • గ్నంబునీయ వలనుపడ దేగడవియెడు • వారలకును
గాక కీర్తిఁ బ్రతిష్ఠలఁ • గాంక్షసేయు వారికల్లుడు దొరకునే • వసుధలోన.

శా॥ ఈడుం జోడునుజూడ వీలుపడ దిం • తేనిం రసజ్ఞత్వముం
గూడం గోఁగరాదు సంపదయు స • ద్గోత్రంబులుం లేవటం
చాడం బోలదు కూఁతులంగనినచో • నాబ్రహ్మకుం గాననౌ
వాఁడే సర్వగుణాఢ్యుఁడంచు సుత ను • ద్వాహంబొనర్పం దగుం,

వ॥ అని యనేకవిధంబులఁ దలంచుచున్నయెడ.

తే॥ అప్పురంబుననుండు వాఁ • డగ్రజుండు ధనముగలవాఁడు రాజమి • త్రమగువాఁడు
పద్మనాభుండనెడువాఁడు • వార్ధకదశ వాఁడు వేదరథునిఁ జేర • వచ్చిపలికె.

చ॥ అనఘ పరోపకారమతి • వై చరియించెడివాఁడవీవు నీ
కనయగునట్టి ధీరుఁడొకఁ • డేని కనంబడఁడుర్వి నాశ్రి
తావనమె యవశ్యకార్యముగ • భాసిలు నీవఁజేరి యెవ్వడుం
డన యభిలాష వ్యగ్రముగఁ • దాను విచారమునొందెనే యిలం,

తే॥ ఎఱుకలేనివాఁడ • వేనీవు ధర్మకార్య మార్గములనుగుఱించి • యన్యుఁడొకఁడు
నీకుఁ జెప్పవలయు • నే యెల్లవారికి నీవకాదె వక్త • వై వెలయుదు.

తే॥ ప్రేమమీఱఁగాంచి • పెంచి పెద్దఁగఁజేసి తనదు ముద్దుసుతల • దయవలంచి
యంతరింపనున్న • యన్యకులంబుల నుద్ధరింపనోసఁగు • టొప్పుఁగాదె.

క॥ దానంబులందుఁ గన్యా దానము శ్రేష్ఠమని బుధ మ ♦ తంబగు భార్యా
హీనుఁడగు వృద్ధు కోరిన మానక సుతనిచ్చి యతని ♦ మన్నింపఁదగున్.

క॥ నీవంటివాని కల్లుండై విమల యశంబుఁ గాంచు ♦ ననదయయిన భూ
దేవాన్వయతిలక యటులఁ గావున నీకర్థి నైతి ♦ గరుణింపుననున్.

తే॥ ఎట్టి చక్రవర్తి ♦ కేని కన్నతనయ నొకర కీయవలసి ♦ యుండుఁగాదె
పాత్రుఁడైనవాఁడు ♦ ధాత్రి నల్లుండౌట యెన్ని జన్మములకు ♦ నేఁగలుగునే.

క॥ శారదను సకలసుగుణ విశారద నర్థింతు నగ్ర ♦ జన్మాన్వయనన్
బేరాసగలాఁడనుచున్ దూరక నీతనయనిడి కు ♦ తుకమున్ గనుమా.

తే॥ అనుచుఁ బల్క విప్రుఁ ♦ డాతని వాంఛిత మునకు విస్మయంబుఁ ♦ గని మనమున
నకట యీతఁడిట్లు ♦ లాడెడు వీనికిఁ బ్రతివచనము నెట్లు ♦ బల్కఁదగునొ.

తే॥ ఇతఁడు వృద్ధుఁడయ్యు ♦ నీగతి యువకుని బోలి పెండ్లికోరెఁ ♦ జాలతడవు
వేచుచున్నవాఁడు ♦ వీనికి సుత నెట్లు లీయవచ్చు నకట ♦ యింకమీఁద.

తే॥ కులధనంబెల్ల నొసఁగి మార్గణ గణంబుఁ దృప్తిఁబడునట్లుజేసి యింద్రియచయంబు
వశ్యముగఁ గానఁ జేరి త ♦ పంబు సల్పఁ దగిన యీతనికేటి కు ♦ ద్వాహ మిపుడు.

క॥ ధరణీసురుఁడు యోగ్యుఁడు సిరిగలవాఁడీతఁడనుచుఁ ♦ జెచ్చెర కన్యన్
ఋణియమొనరింతునో లే కరుచిన్ వలనుపడదరుగు ♦ మందునో వీనిన్.

క॥ శతవృద్ధు వీఁడు సుత యు, ప్రతిమానవయోవిలాస భా ♦ సుర యిపుడే
గతి వీరికి దాంపత్య ముచితమైకీర్తిగను నేమి ♦ సేయుదు నింకన్.

తే॥ వలవ దుడుగుము నీకిట్టి ♦ వాంఛయేల యనుచుఁబల్కుదునాయర్థి ♦ క్రియంబు
సలిపిన యశంబుఁగలుగునే ♦ సరణి నాకు నడవఁ గూడునో తోఁచదిం ♦ తయుమనమున.

వ॥ అని కొండొక చింతించి యెట్టకేలకు కన్యార్థియై వచ్చిన వానిఁ గాదని పంపుట గృహస్థధర్మము గాదనియు, రాజమిత్రంబగు నాతని బాంధవ్యంబు తనకు శ్రేయస్కరంబనియుఁ దలంచి.

ఉ॥ అనఘుండు శారదాజనకుఁ ♦ డాద్విజుఁ గన్గొని నిన్నువంటివాఁ
డనఘుఁడు మాకుఁగోరకయె ♦ యల్లుఁడు కాఁదగియుంటకన్న నా
యొనరిచినట్టి పుణ్యమున ♦ కొక్క ఫలంబు లభింపఁగల్గునే
తనయలకారణంబునఁ గ ♦ దా జనిసార్థకమౌట ధారుణిన్.

క॥ అని పల్కుచు వేదరథుం డనుపమ సుగుణాఢ్యయైన ♦ యాశారద నా
తనికిచ్చి పెండ్లి కావించెను బంధుగు లెల్లవారు ♦ నేమమగుననన్.

తే॥ పద్మనాభుఁడట్లు ♦ వరరూపరేఖా విరాజితాంగ యైన ♦ రమణిఁ బెండ్లి
యైశ్వశుర గృహంబు నందె వసించి సాయంతనమున నొక ప్ర ♦ వంతిదరికి

తే॥ అరిగి నిత్యకృత్యంబుల • నాచరించి మరలి చనుదెంచుచుండఁగ • మార్గమధ్య
మందు నొక కాలసర్పమా • యగ్రజన్ముఁ గఱచుటయు వాఁడు మరణించెఁ • గాలగతిని

వ॥ అంతఁ బద్మనాభుని మరణవృత్తాంత మెఱిఁగి దురదృష్టంబునకు వగచిన బ్రయోజనము లేదని వేదరథుండు పత్నీపుత్రికల నూరార్చి యాతనికి దహనాదిక్రియలు నిర్వర్తించె. పతి మరణంబునకు శారద బిట్టుకుంది తన మనంబున.

ఉ॥ అక్కట నాయెడన్ గఠినుఁడై విధి దుఃఖసముద్రమధ్యమం
దొక్కట ముంచివేయునె య • హో యిఁక నేమయిపోవుదాన సొం
పెక్కిన యీ శరీరమున • కెంతయు భోక్త మనోహరుండు వాఁ
డిక్కరణిన్ మృతిన్ గనిన • నేటికి మేనుధరించి యుండుటల్.

క॥ పతి రహితయయిన యతివకు గతియేటిది సౌఖ్యమెట్లు • గలుగును కలుషా
వృతమైన యీజగంబున బ్రతికియు ఫలమేమి మెచ్చు • వాఁడెవ్వఁడొకో.

తే॥ కలుషవంతురాలి • కరముఁబట్టి చిరంబు బ్రతుకఁగలిగినట్టి • బ్రాహ్మణుండు
వ్రేళ్ళుతెగిన తిరువు • విధమునఁ బడిపోయె నేమనంగవలయు • నింకవిధిని.

తే॥ కనులు తనియునట్లు కాంతునివదనంబుఁ జూడనోఁచనైతి • సోయగంబు
సార్థకముగ విభుని • సన్నిధిఁ జేరలేదపుడెపతివియోగ • మగునెనాకు.

చ॥ వ్రతములఁ జేయ నేమియుప • వాసములన్ బొనరింప నేమి! సం
తతము శివార్చనాభిరతి • స్థైర్యముఁ గాంచిన నేమి సౌఖ్యసం
తతులకు ముఖ్యహేతువయి • తాళి మెడన్ దగఁ గట్టినట్టి వాఁ
డతివకు లేకయున్నఁ గొఱ • యాఁగద పల్వురలోన నెంతయున్.

క॥ పతి శుశ్రూషయొనర్పని సతి జన్మంబేల సాధు • సంచయమునకున్
హితమొనరింపఁదలంపని యతిలోభుని ధనమువోలె • వ్యర్థమగుఁగదా.

వ॥ అని దుఃఖంబు పెంపున నిద్రాహారంబుల విడిచి కృశించుచు శారద కాలక్షేపంబుఁ జేయుచుండె నంత నొక్కనాఁడు.

చ॥ ఘనతప మాచరించి తిగ • కన్నులదేవరఁ గైవసంబు గా
నొనరుచుకొన్నవాఁడు సుగు • ణోన్నతుఁ డంధుఁడు బ్రహ్మనంతవా
నినయినఁ బూరికిన్ గొనఁ డనిందితచిత్తుఁడు నైధ్రువుండు నా
మునివరుఁడేగుదెంచె ద్విజ • పుంగవునింటికి సంతసంబునన్.

తే॥ శిష్యదర్శిత మార్గుఁడై • చేరవచ్చినట్టి మునివరుఁ గన్గొని • యబ్జనయన
భక్తి సంయుక్తి నెదురేగి • ప్రణతయగుచు మందిరాంతరాసనమున • యందునిలిపె.

చ॥ కరములుమోడ్చి యిట్లను న • ఖండ తపోనిధివీవు మాయెడన్
గరము కృపావిశేషమునఁ • గాక వృథా యరుదెంతువే భవ

చ్ఛరణ రజంబు సోఁకుటను • ధన్యతమంబయి యొప్పె మాగృహం
బరయఁగ ధన్యమయ్యెను మ • దన్వయమెల్ల మునీంద్రచంద్రమా.

తే॥ మిమ్ము వంటి మునిజ • నమ్ము దర్శించి పాపంబులెల్లఁ దొలఁగి • భక్తనిచయ
మఖిలశుభములొందు • టబ్బురంబె భాను దర్శనమునఁ దమము • తలఁగకున్నె.

క॥ అని వినయంబునఁబల్కుచు వనితామణి మునికి నఘ్యా • పాద్యాదులఁ బూ
జన మాచరించుటయు నా యనఘుఁడు శారదను గాంచి • యనియెఁగరుణతో.

క॥ అలరితి నీకావించిన యలఘు సపర్యలకుఁ దృప్తి • నందితి సుగుణో
జ్జ్వలవైన నిన్నువంటి సతులు గల్గుదురే ధరిత్రి • తొయ్యలి యెందున్.

చ॥ చిరమనురక్తుఁడైన పతి • సేవయొనర్చుచు సర్వ సంపదో
త్కరములఁజెంది వంశమును • గ్రాలఁగఁ జేయు కుమారుఁ గాంచి బం
ధురమగు కీర్తి మించి పరి • తోష మెలర్ప సుఖింతుగాక యీ
శ్వర కరుణావిశేషమున • వారిజలోచన నీవునీపయిన్.

క॥ జననీ జనకులు గేహంబున లేకుండినను గాని • ముదమున వృద్ధున్
నను నిల్లుసొచ్చుకొని వచ్చినవానినిఁ గాదు నాకు • సేసితి పూజల్.

క॥ అనియాశీర్వాదమొనర్చిన విని యబ్బురము మదిని • జెందుచు మునిఁగ
న్గొని పల్కె విప్రకన్యక యనఘ యమోఘంబులగుఁ గ • దా భవదుక్తుల్.

తే॥ పతి విహీనవై య • భాగ్యదేవతనయి యున్న నాయెడ భవదున్నతమగు
సూక్తి యెవ్విధమున • యుక్తమై యుత్తరోత్తర శుభంబులొసఁగు • ధన్యచరిత.

చ॥ మునికులవార్ధి చంద్రమయ మోఘము తావకసూక్తిజాల మీ
యనదయెడన్ ఫలింపఁగల • దా యిల బీజము సారవంతమ
య్యును విఫలంబు గాక నును • నో చతురుండగువాఁడె శర్కరా
వనినిడినన్ గటాహృదయ • వల్లభుఁ గోల్పడియుంట నీ క్రియన్.

తే॥ అనుడు నైధ్రువమునివర్యుఁ • డనియెనబల కనులఁగానని నాఁడనౌ • కతననిను సు
వాసినఁగనెంచి యిటుల చీ • వెనఁబొసఁగితకట విశ్వస్తవని తెలి • యక మనమున.

వ॥ అయినను.

తే॥ అరయ లౌకికవాక్య సం • హతి భవిష్యదర్థము ననుసరించు మహాత్ములైన
మునిజనుల వాక్యసంచయం • బునకు లొంగి యర్థము చరించుచుండు ని •
[ త్యంబు జగతి.

మ॥ అనుమానింపకుమమ్మ నా పలుకు నీ • యందర్థవంతంబుగా
దనుచున్ నెమ్మదిఁ జంద్రశేఖరపద • ధ్యానప్రియుండైన యి
మ్మునికిన్ సాధ్యముగాని దొండు కలదే • భూతేశు మెప్పించి చ
య్యన మద్వాక్యము సార్థకంబుగను సే • యన్ జాలుదున్ ధాత్రిలో.

తే|| ఇంతివిను ముమామ • హేశ్వరవ్రతముఁ గావించి యఖిలసౌఖ్య • సంచయంబుఁ
గాంచిమించు భక్త • కాండంబు శంకరుఁ డావ్రతాధి దైవ • మగుటఁజేసి.

తే|| అమ్మహావ్రతంబు • నెమ్మితోఁ గావింపు మతివనీకు శస్త • మగుధరిత్రి
నెట్టి పాతకంబు • లేని నశించు నావ్రతము సేయుకతన • భక్తతతికి.

చ|| వ్రతములలోన నుత్తమ మ • పార శుభాస్పద మద్రికన్యకా
హితము సమస్త భక్తనివ • హేష్టదమైన యుమామహేశ్వర
వ్రతమునఁజేసి నీ కఖిల • వాంఛితముల్ సమకూరునింక నా
ప్రతినయు సార్థకంబగుఁ గరంబగు భక్తివ్రతంబు సల్పుమా.

తే|| అనుచుఁ బల్కి మౌని • యతివ కుమామహేశవ్రతంబొనర్పు • సరణిఁదెల్పి
జాగరూకుఁడగుచు • శారదతోడఁ జేయించుచుండె వ్రతము నెలమితోడ.

వ|| అట్లు శారదనియమతత్పరయు నేకవారాశనయునై యొకవత్సరము మునీంద్రోపదిష్టంబగు నుమామహేశ్వర వ్రత మొనర్చి సంవత్సరాంతమున బ్రాహ్మణ సమారాధనపూర్వంబుగ నమ్మహావ్రతంబు నుద్యాపనంబుఁ గావించి మరునాఁడు ప్రదోషకాలంబునఁ బూజామంటపమున నీశ్వరధ్యాన నిమీలితనేత్రయై యుండెనప్పుడు మునిజగదంబయగు పరమేశ్వరిని ధ్యానించె నంత

తే|| మునియొనర్పు ధ్యాన • మునకు విప్రాంగన భక్తికలరి వ్రతము • ఫలమనంగ
నమృతసాంద్రమూర్తి • యై జగదంబప్రత్యక్షమయ్యె నప్పు • డాదరమున.

తే|| అతుల జగదంబ ప్రత్యక్ష • మైన యపుడ యంధమునిలబ్ధలోచనుఁ • డైయఘౌఘ
హరములగు నమ్మహాదేవి • చరణములను వ్రాలె సాష్టాంగముగ నతి • భక్తియలర.

తే|| శారదయు నిశ్చలాత్మయై • శైలరాజకన్యకాచరణాంభోజ కలితహస్త
యగుచు వినుతించె నిగమహి • తానువాక్యసంతతులతోడ దేవిని • స్వాంతమలర.

తే|| అమృతమయములగుచు • నాశ్రితసంతాపహరములైన కరయు • గాగ్రములను
వార లిరువురను గృ • పారసపూర్ణయై గౌరి లేవనెత్తి • కనికరమున.

ఉ|| సంతసమయ్యె మీ పలుకు • సద్వ్రతమెల్ల ఫలించె దేవతా
కాంతునకే నలభ్యముగఁ • గన్వడు నెట్టి వరంబునైన మీ
కింతయు సంశయింపకయె • యిచ్చెదఁ గోరుఁడు మామనోరథం
బెంతయు దివ్యదృష్టి నపు • డే మదిలోన నెఱింగి మెచ్చితిన్.

చ|| మునికులచంద్ర యీపె తొలి పుట్టువునన్ ద్రవిడావనీతలం
బున నొక విప్రవర్యునకు • మోదముగూర్చు కనిష్ట భార్యయై
జననమునొంది నాథుని • వశంబుగఁ గైకొని భామినీసమా
ఖ్యను దనరెన్ సపత్ని నిర • తాపలచిత్తగనుండ నెంతయున్.

అట్లు భామిని నిజనాథుని వశ్యముఁ జేసుకొనినకతంబున జ్యేష్ఠభార్యాపతి సమాగ మంబు గలుగమి దుఃఖంబున మరణించె. మఱియు నీ లలితాంగి నొక బ్రాహ్మ ణుండు మోహించి విఫలమనోరథుండై మృతిఁగాంచె. అప్పుడీమెను కామించిన ద్విజుండే యీ జన్మంబున శారదకుఁ బతియై స్వప్నవిషంబున మరలఁ బంచత్వము నొందె. పతిదేవతయగు జ్యేష్ఠభార్యకు మనోహరుని విరహంబుఁ గలిగించిన కార ణంబున నీమె యీ పుట్టువునందు వైధవ్యంబుఁ గాంచె నయినను

మహితశుభదాయకమగు ను • మామహేశ్వర వ్రతంబుఁ జేసి శా • రదసమస్త కలుషసంచయముఁ బొలంగి • లలితచరిత యయ్యె నేటికి శుభముల • నందు నింక.

ఇక్కామినీధవుఁ • డొక్క విప్రుండయి పాండ్యదేశంబునఁ బరమ సాధ్వి యగు జ్యేష్ఠ సతిఁగూడి • యలరుచునున్న వాఁడిపుడు మత్కరుణచే నీమెయందు భ్రాంతచిత్తుఁడయి స్వ • ప్నమున నిష్టగోష్ఠిఁ దవిలి సుఖించు నెం • తయును బ్రేమ గులముద్ధరించెను • కొమరునిబడసి శారదపతితోడఁ బ • రంబునందు సౌఖ్యంబుఁ జెంది • మామకభక్తజనంబులోన ఘనయ • శంబుఁ గాంచి వాసనముచేఁ బల్కె • యుర్వీధరాత్మజ కనుమలంగె నంతఁ • గౌతుకమున.

తన ప్రతిన నెఱవేఱెనం • చును మునీంద్రుఁ డాత్మనలరుచు నరిగె • శారదతితోడ కాదయుస్వప్నమున భర్తృసంగమంబుఁ గాంచుచునుహాళిఁ గాలంబుఁ • గడపుచుండె.

అంత నుమామహేశ్వరవ్రతప్రభావంబున నా తరుణికొక సుతుండు గలిగిన వాని వాద రంబునఁ బెంచుచు నొకప్పుడు మహాశివరాత్రి పుణ్యకాలంబున బంధువులఁగూడి శారద గోకర్ణ క్షేత్రంబున కరిగి యందు యాదృచ్ఛికంబుగఁ గన్పట్టిన నిజమనో హరు దర్శించి సంతుష్టస్వాంతయై జననీజనకుల యానతిఁ బతిఁగూడి దేహాంతంబునఁ గైలాసంబునకేగెనని తెల్పి సూతుండు వినియోగాది సహిత పంచాక్షరీమంత్ర మాహాత్మ్యంబును ధ్యానయజ్ఞమహిమయు సంగ్రహముగఁ జెల్పి ముని మోహాశమ నంబు వక్కాణించువాఁడై యిట్లనియె.

— మునిమోహాశమనము —

గిరిజాసహితుండై పురహరుఁడు రజతనగము నిష్కు • టాంతరిమునను స్థిరుఁడై విహరించెడు తఱి సురలును మానులును జేరి స్తుతియించి యొగిన్.

పరమేశుఁగని నమ్రులై పలికిరో • వాఙ్మానసాతీత యీ శ్వరయోగీంద్రులకే నగోచరుఁడవై • సర్వంబు శాసించు నీ చరియల్ శాముఁ దట్ల స్వల్పసుఖమం • దాసక్తిచే నివ్విధిన్ జరియింపన్ గనుఁగొన్నవారికెదనా • శ్చర్యంబు గల్గున్ గదా?

క॥ లోకప్రవృత్తికై నీవీకరణిన్ మోహివోలె ♦ యిలఁదిరుగుట మా
కేకరణిఁదెలియనేర్చునమాకమనా తెలియఁజేయు ♦ మా మాకింకన్

తే॥ అనిన దరహసితాననుఁ ♦ డగుచుఁ జంద్రధరుఁడు కరుణాంతరంగుఁడై ♦ సులమునులఁ
గూర్చి వచియించెఁ బార్వతీ కోమలాననమునఁ జూపు నిగిడ్చి సం ♦ తసము వెలయ.

సీ॥ బంధమోక్షముల సం ♦ బంధంబు గలుగదు స్వేచ్ఛాశరీరినై ♦ యొసఁగు నాకు
నజ్ఞుండు కర్తయునై పశువగుచును భోక్తయా జీవుండు ♦ పురుషుఁడరయ
నతఁడు మాయాబద్ధుఁ ♦ డై కర్మములఁగూడి చరియించుచుండును ♦ సంతతంబు
ధ్యానంబు జ్ఞానంబు ♦ తగబంధమోక్షంబు లాత్మకుఁగలుగవం ♦ చనిరి బుధులు
తనరు జ్ఞానక్రియేచ్ఛాభి ♦ ధానములను శక్తి మూఁడువిధంబుల ♦ శక్తి నాకు
స్వతనము వశ్యముగ నుండు ♦ చతురమతుల కీ రహస్యంబు తెలియుట ♦ యేమున...

వ॥ పంచవక్త్రియు, మహాభాగయు, జగదభయప్రదయు, సనాతనయు, నగు నాజ్ఞ మా...
వక్త్రింబునుండి వెడలె. ఆయాజ్ఞను బ్రవేశించి యేను లోకహితంబుఁగూర్చుచుం...
ఏనుక్షణంబు మోహితుండట్లు ప్రాకృతులకుఁ గానవచ్చియు ననిత్యంబులగు సంస్...
క్లేశంబుల నొందకుండునని పరమేశ్వరుం డంతర్హితుండైన నమరులును మ...
లును మోహంబుఁ బెడఁబాసి సంతోషంబున నిజనివాసంబుల కరిగిరని సూతుఁ...
పలికి నంత.

## — అణిమాదిగుణప్రాప్తికథనము —

తే॥ ఎట్టి యోగంబుఁ జేసి యెల్లగుణములలవడును వాని నామధే ♦ యంబులెవ్వి
యోగులణిమాది గుణయు ♦ తులై గరిష్ఠులగుట యెట్లు మాకువచింపు ♦ మయ్య మా...

వ॥ అనిన సూతుండు శౌనకాదుల గాంచి యిట్లనియె. అణిమయు, లఘిమయు, ...
మయు మహిమయుఁ, బ్రాప్తియుఁ బ్రాకామ్యంబును నీశత్వంబును వశిత్వం...
నను నెనిమిదివిధంబుల గుణంబులలరు. అట్టి గుణప్రాప్తియు మోక్షసిద్ధియుఁ బా...
పతయోగంబునఁ గాక వేఱొండు దాన లభింపదని పలికి మఱల నిట్లనియె.

## —శౌచాచారాది లక్షణము—

తే॥ సర్వభూతహితముఁ గోరి ♦ జలజభవుఁడు సకలవేదార్థ సార సం ♦ చయము...
దాని వచియించెఁ దొల్లి స ♦ న్మాన్యవినుతమైన యాచారలక్షణం ♦ బాదరము...

వ॥ ఉదయార్థము శౌచంబులకు ముఖ్యపదము. అద్దానియెడ నప్రమత్తుఁడై చ...
వాఁడుత్తమలోకంబుఁగాంచు. అవమానంబమృతంబనియు సన్మానంబువిషంబని...
దెలియఁదగు.

తే॥ కనులకుఁ బావనంబైన • యనఘమైన పథమునఁ నడవఁదగు • వస్త్రపూత
జలముఁ ద్రావఁగ నొప్పును • సత్యమైన పలుకుఁబలుకంగఁదగు యోగి•వరులకెందు.

తే॥ ఆఱుమాసముల్ మత్స్యగ్ర • హణముకతనఁ గలుగు పాపంబు నొందును •
[ గలుషమైన
జలములఁ ద్రావి నరుఁడు త•చ్ఛాంతి పంచశత మఘోరమంత్ర జపంబు•సలుపనగును.

తే॥ అవని వాఙ్మనః కాయ సం•భవము లైన పాపము త్రివిధమైయుండుఁ•బరఁగ దానిఁ
జెందకుండుటకై మునిశ్రేష్ఠులెల్ల యోగమును ధరియింత్రు స • ద్యోగముమెయి.

— మృతచిహ్నములు —

వ॥ అరుంధతియు ధ్రువుండును సోమచ్ఛాయయు, మహాపథంబును గాంచనివాఁడొక సంవత్సరమునకన్నను, మూత్రపురీషంబులును, సువర్ణ రజతంబులును, ప్రత్యక్షముగ నొండే స్వప్నమున నొండె వమనము జేయువాఁడు పదిమాసములకన్నను, గంధర్వనగరంబులును రుక్మవర్ణ ద్రుమంబులును, ప్రేతపిశాచంబులును, గాంచువాఁడు తొమ్మిది మాసంబులకన్నను, కాక కపోతగృధ్ర క్రవ్యాద ఖగంబులెవనిమస్తకంబున వ్రాలు నాతఁడాఱుమాసంబులకన్నను తన నీడను వికృతంబుగఁ జూచువాఁడు నాలుగైదు నెలలకన్నను, దక్షిణదిశనంతరాళంబున మెఱుఁగుతీఁగఁ గాంచువాఁడును నీటియందింద్రధనుస్సుగాంచువాఁడును రెండుమూఁడు నెలలకన్నను, జలంబునందొండె యద్దంబునందొండె తననీడను గాంచనివాఁడును వానియందు శిరోహీనునిగఁ దన్నుఁగాంచువాఁడును నొకమాసంబునకన్న నెక్కుడు దినంబులు జీవించఁడు. ఎవని శరీరము శవగంధముకలదిగను, వసాగంధిగనునుండువానికిఁ బదునేను దినంబులకన్న నాయుష్యముండదు. ఎవనిశరీరము స్నానమాత్రమున శుష్కించు! శిరంబునుండి ధూమంబు వెడలువాఁడు పదిదినంబులకన్న నెక్కువ జీవించఁడని మృతచిహ్నములు దెలియఁబలుకుటయు.

— ఆశ్వాసాంతము —

చ॥ బలమద గర్విత త్రిపుర • భంజన రంజిత పార్వతీమనో
జలజలసద్విభూతి సిత • చారుశరీర సమస్తదేవతా
లలిత కిరీటసంచయ చ • లచ్చరణద్వయ మామకీన ని
ర్మల కవితాంగనారమణ • రక్షిత నిర్జరలోక సంపదా.

క॥ నిరతసమర్చిత మాహేశ్వరచరణపరాగనిచయ • పావన నందీ
శ్వరహృదయ సారసాహస్కరమీనాక్షీశ భక్త • కళ్యాణకరా.

క॥ పంచాక్షరీ మహామంత్రాంచిత కాండిన్యసదమ • లాన్వయ శుభకృ
త్సంచార సుందరేశ్వర క్రౌంచదమదనజనక విమల కారుణ్యనిధీ.

తే॥ కష్టపడి పెంచియిడితి నా • కవితకన్నె నెవ్విధంబున వలరింతో • యింకమీఁద
గంగవోలెను గయ్యాళి • కాదు బేల సుమ్ము నీతలమీద నా • ట్యమ్మ సలుప.

సీ. ఏ మహామహుఁడు శ్రీ • వేమనారాధ్యవంశాబ్ధికిఁ బూర్ణ శ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి • కనరై బుధుల్ మెచ్చ మహిని పాతివ్రత్య • మహిమఁబూనె
నట్టి నందయకు గా • రమకుద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గోత్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోదరుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మఁపీ • యమగు శ్రీ మదాంధ్ర లింగపురాణపూ • ర్వార్థమందు
నలరు నైదవయాశ్వాస • మయ్యెఁ గరుణ నతము దీనిని రక్షించుఁ • జంద్రమౌళి.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ మీనాక్షైనమః

# శ్రీమదాంధ్ర లింగపురాణము

## పూర్వభాగము.

### — షష్ఠాశ్వాసము —

— అంధక గాణపత్య ప్రదానకథనము —

మకుట మణీకృత నవ్యశశికలా బ్రహ్మాది విబుధ • సేవితవినమ
త్ప్రకరత్రాణపరాయణ సకలేశాసుందరేశ • శర్వాణీశా!

అవధరింపుము నిఖిలపురాణ శ్రవణ విగతకల్మషులగు శౌనకాది మహర్షులు
రోమహర్షణింగాంచి సమంచిత వాక్ప్రపంచంబు మించ నిట్లనిరి.

సూతసమస్తపురాణ వ్రాతజ్ఞవి నిర్మలాత్మ • భవదీరితముల్
ఖ్యాతములు శివకథలు మాచేతము రంజిల్లునట్లు • జేసె కదంకన్.

— అంధక చరిత్రము —

అంధకుండను పేరిటి • యసురవరుఁడు రమ్యకందరమగుమంద • రమునయందు
నెవ్విధిని దమితుండయ్యె నీశుఁడెట్టు లాతనికి గాణపత్యంబు • నర్థినిడియె.

అని ప్రార్థించిన సూతుండనుకంప జనింప నిట్టు • లను మీ ప్రశ్నం
బనఘము సర్వోత్తమమది వినుఁడే నెఱిఁగినవిధంబు • వినుపింతుఁ దగన్

అంధకుఁడు మందరాద్రి ని • హతుఁడగుటయుఁ గాలకంఠుండతనిఁ గృప • [గాఁచుటయును,
నా సురారికి గాణప • త్యంబు సంభవించుటయును ముఖ్యంబులై • వెలయునిందు.

తొల్లి హిరణ్యనేత్రుని సు • తుండు దురాత్మకుఁ డంధకాసురుం
డెల్లజగంబులన్ గలఁచు • టేపనిగాఁగల వాఁడు శారదా
వల్లభునిన్ గురించి బహు • వత్సరముల్ దపమాచరించినన్
జెల్లగు తత్తపంబునకు • మెచ్చివిరించి ప్రసన్నుఁడైయనున్

ఓయసురాధిప నీకిపుడేయర్థము వలసెఁ గోరు • మిచ్చెదమద్భా
వాయత్తము గాకున్నది యేయెడ నేనియునుగలుగ • దింతయుఁ దలఁపన్

ఉ॥ నావుఁడు దైత్యుఁడక్కమల • నాభసుతుఁ గరముల్ మొగిడ్చి రో
దేవజగద్ధితుండ వన • దృఙ్మహిమాస్పదమై చెలంగు నీ
తావకదివ్యమూర్తిఁ గని • ధన్యుఁడనైతి ఫలించె నాతపం
బీవిధి నీమృదూక్తి చయ • మెల్లను వీనుల విందు జేయుటన్

తే॥ జగముతండ్రివీవు • సర్వంబునీకు సంతానమట్లుగాన • తండ్రికొడుకు
నందుఁజూపఁదగున • మందమాకృపఁజూపు టర్హమయ్యె నీకు • నాదిదేవ

క॥ ఈనీనందనునన్ గృప ప్రాదుర్భవమగుటనీకుఁ బంకజభవ నీ
గాదిలిసుతునకు నొక వరమేదియయిన నిడుతలంప • నేనివచింతున్.

తే॥ అబ్జభవ నీ కృపాతిశ•యంబు కతన మున్నె లభియించె నిఖిలార్థ•ములును దలఁచి
కోరఁదగినట్టి వర మొండు•వేర కలదె యిదు మవధ్యత్వ మెపుడు నా•కెల్లయెడల.

తే॥ అనుచు వేడిన నట్లె • యయ్యెడునని వరమొసఁగి యదృశ్యుండయ్యె•వారి
నుఁడుత మోగుణమూని దైత్యుఁడు కడంక సురలబాధింపఁ దొడఁగె న•స్తోకమహిమ

సీ॥ అనిమిషాధీశ్వరు • నంతవానినె బట్టి పలుతెఱంగులఁ గీడు • వడఁగ జేయు
వేలుపు పూఁబోండ్ల • వినకబల్మిని దెచ్చి కారాగృహంబులఁ • గలఁత వెట్టు
యజ్ఞనియతులైన • యట్టి మానులకార్యములకు భంగంబును • గలుగఁజేయు
నిగమముల్ తనయందె • నిఖిలేశ్వరత్వంబు గూర్పవలయు నంచుఁ • గోరుచుండు
స్వర్గమర్త్యపాతాళముల్•సమయఁజేయు పాపపుణ్యంబులను గణిం•పంగబోఁడు
బ్రహ్మదత్త వరోద్భూత • బాహువిక్రమాంధుఁడగుచును జెనఁటి య • య్యంధకుండు

తే॥ కొలఁకునడుమబడ్డ • కుంజరయూథంబు పగిదిరక్కసుండు • ప్రబలుఁడగుచు
లోకసంచయంబుఁ • జీకాకు వడఁజేయు ధర్మహానియనుచుఁ • దలఁపకెదను.

ఉ॥ దారుణవర్తనుండయిన • దానవుబాధల కోర్వలేక బృం
దారకసంచయంబు కొఱ • తల్బడి వేగమ మందరాద్రికిన్
జేరి రక్కసుండు వెను • జేరి కృపాణముఁ దాల్చి వెల్వలన్.
గారము సేయు కోర్కి నొడి • కంబున నగ్గిరి కేచనెన్ వెసన్.

క॥ తమవెంట నరుగుదెంచిన యమరారిన్ గాంచి భీతు • లై నిర్జరు లు
త్తమచరితుండగు శంకరుని మదిన్ బ్రార్థించిరపుడు • నిశ్చలబుద్ధిన్

మ॥ శ్రితలోకైక వరప్రదానచణుఁ డా • శ్రీకంఠుఁడయ్యద్రిపైఁ
గ్రతుభుక్పాలికి దర్శనంబొసఁగి ని • ర్వ్యాజానుకంపన్ జగత్
స్థితిఁ గావించుట యాత్మకృత్యమని నూ • చింపంగ నో నాఁగనం
చిత వాక్యంబుల సంతసంబుఁ గలిగిం • చెన్ వారికప్పట్టునన్.

తే॥ వలవదుడుఁగుఁడు నెమ్మదిఁ•గలఁతఁ జెంద దైత్యుని శమింపఁజేయుదుఁ•దల్ క్షణ
యనెడు కరుణా రసార్ద్రంబు•లైన హరుని పలుకు లమరులదు:ఖంబుఁ•బొలియఁ

తే॥ ఎట్టి విక్రమాఢ్యుఁ • డేని మద్భక్తుల కపకృతినిఁ బొనర్పు • నట్టివాఁడు
గిట్టకుండు టెట్లు • గీర్తనీయులుగదా? నన్నుఁగొల్చువార • లారతంబు,
చ॥ అనివచియించుచుం సురగ • ణావృతుఁడై పరమేశ్వరుండు దై
త్యున కెదురేగి క్రోధరస • మొప్పతిలం రణరంగమందునం
ఘనతరమైన శూలమున • గాడఁగనేసిన యంత దానవుం
డనయము కారణంబయినయట్టి తమంబుఁ దొఱంగి చయ్యనం.
క॥ తన తొలిజేసిన పుణ్యంబున సాత్త్వికభావమూని • బుద్ధీంద్రియముల్
ఘనమగు క్షోభము వాయఁగ ననుకొను నసురుండు మనము హర్షమునొందం.
చ॥ వెనుకటి జన్మమందుఁ బృథి • వీధరజాపతి కంటిమంటచేఁ
దనువునొఱంగి యవ్విభు ప • దద్వయముం శరణంబు గంటి గా
వున నిపు డీశు శూలమున • భూరితమోగుణముం దొఱంగితిం
గనుగొననేర్చితిం బరమ • కారుణికుండగు నిందుశేఖరుం.
క॥ తన జన్మావధిలో నెవ్వనికైన నుమేశునొక్క • వారముదలఁపం
గననగు శివసాయుజ్యం బనవేర వచింపవలయు • నామాదృశులం.
ఉ॥ ఏ పరమేశు నాజ్ఞమెయి • నీవిధి వాసవ ముఖ్యు లెల్ల బా
హ్యాపటిమంబునం జగము • లన్నియుఁ బాలనజేయుచుండు రా
పాపనివారకుండు భగ • వంతుఁడు నాకుఁ బ్రసన్నుఁడయ్యె నా
తాపములెల్లఁ దీఱె జని • ధన్యత నొందె వచింప నేటికిం.
తే॥ అనుచుఁ దలఁచి దైత్యుఁ • డన్నిశాచర హంత వినుతిఁజేసె నిటుల • వేదవిహిత
సూక్తిరత్నముల మహోత్సాహమును భక్తి వినయ సంభ్రమములు • పెనఁగొనంగ.
మ॥ నిగమాంతంబులు నీ మహామహిమ వ • ర్ణింపఁగ లేవయ్యె స
త్వగుణాధారుఁడు కేశవుండును భవ • త్పాదంబులం గాంచలే
క గతాహంకృతి డిల్లవోయె విధియుం • గానందు నీ శీర్షముం
జగదీశా ననువంటి పామరునకుం • శక్యంబె నిన్నెంచగం.
క॥ కమలాసనద త్తవర ప్రమదంబునఁ గన్నుగాన • రామినిటుల ధ
ర్మముఁ దప్పి సంచరించితి నమరేశ్వర విమత సైపు • మా నేరములం
తే॥ ఇంద్రియ ప్రపంచ • మెల్ల జయించిన యట్టివారికైన • నలమటపడఁ
జేయు సిరిధనత్రిఁ • జెనఁటు లౌననువంటి వారిఁగూర్చి చెప్ప • వలయునెయ్యిఁక.
తే॥ కినుకఁగూర్చియైన • నను కంపఁగలిగించియైన విభునిపదము • లాశ్రయింపఁ
గలుగుట ఘనమగును • గావున నీరీతి నిన్నుఁ గొల్వఁగంటి నీలకంఠ.
క॥ కరుణాకర నీ భక్తుల నరయగ నీకన్న నెక్కు • డని యెఱిఁగియు దు
శ్చరితుఁడ వారలయెడ నే జరియించితిఁ బాపబుద్ధి • శత్రుఁడనగుచుం.

మ॥ అని ప్రార్థించిన నంతకాంతకుఁడు దై • త్యస్వామిపై సత్కృపన్
గని నీ భక్తికి సంతసించితిని ర • క్షశ్శ్రేణికిన్ ధర్మమా
పనియాటన్ జగముల్ గలంచితివి నీ • పాపంబులే దియ్యెడన్
జనన క్లేశము నీకు గల్గదిక మ • త్సామీప్యమున్ గాంచుటన్.
క॥ నీయెడ దయఁబూనితి నీఁక నేయది నీకిష్టమగునో • హృదయంబునయం
దాయది కోరుమనన్ హరునా యసురుఁడు పలుకు నయధ • యంబుఁ దెలఁగన్.
శా॥ దేవా వేరొక డేల నాకు వరమింతే జాలు బ్రహ్మాదు లౌ
దేవాధీశ్వరులైనఁ గన్గొనని నీ • దివ్యస్వరూపంబుఁ జే
తోవీధిన్ నిలుపంగ నేర్చితిని • మత్పుణ్యంబునన్ జేసి పా
పావిర్భావకరంబు లౌసిరులపై • నాసక్తి నా కేటికిన్
తే॥ వసుధఁగల్గునెల్ల • వైభవము లనుభవించి తక్కతన జ • యించి తాశ
కామిగాక మోక్ష • గామిఁ గాఁడనియెడు నట్టిపలుకు నిక్క • మయ్యె నిపుడు.
తే॥ ఏది కావించినను మఱి యేది తిన్న నేయజన మొనరించిన • నెద్దియిడిన
నంతయును నీకె యర్పణ • మాచరించు బుద్ధియొక్కటియే యిడు • భూతశరణ.
తే॥ సకలవిభవముల్ నీయంద • సంక్రమించి యుండునట్టి నినున్ జేరి • యొకటిగో
దాన నిడుమల నొందుట • తగునె నాకు నిత్యములె సుఖ దుఃఖముల్ • నీలకంఠ.
చ॥ అని వినయంబు డంబు మెఱ • యన్ నచియించిన నాలకించి శ్రీ
తనగకుమారికాప్రియుఁ డు • దార గుణాఢ్యుఁడు పల్కె నిట్టులో
దనుజవరేణ్య నీ జనిక • తంబున రక్కసవంగడంబు పా
వనమయి యొప్పు ధాత్రి నిను • వంటి విరక్తులఁ గాంతుమే యిఁకన్
ఉ॥ వేలకొలంది వర్షములు • వీఁగక ఘోర వనంబులన్ దప
శ్శ్రీలఁ జెలంగుచుండు ముని • శేఖరులేనియు నిన్నుఁ బోలఁ గాఁ
జాల రొకింత నీ చరిత • సత్కవి కావ్యచయోపతంసమై
వ్రాలెడుఁగాత నిచ్చలు జ • గంబున నాశశితారకంబుగన్.
తే॥ ఇదె యయాచితముగ లభియింపనున్న యది గొనుము గాణపత్యంబు • నర్హమై
పాత్రమును జెంది దానంబు • ప్రబలుధరణి కీర్తిఁబడి ముత్యమగు చిన్క •
[ సాబగు వోటె

వ॥ అని కరుణామేదుగంబులగు నాదరవాక్యంబుల నయ్యంధకుని డెందం బానంద
ప్రవాహమున నోలలాడఁజేయుచు శర్వాణీ మనోహరుం డాతని కక్షయ్యంబ
గాణపత్యంబు నొసంగెనని పలికి సూతుండు వరాహరూపధారియగు విష్ణుండు హి
రణ్యాక్షుని వధించుటయు నవ్వరాహముబు దంష్ట్రింబు శంకరుండవతంసము
దాల్చుటయును విశదంబుగ వక్కాణించువాఁడై యయ్యాశ్రమవాసుల కిట్లనె

—వరాహరూప విష్ణుకృత హిరణ్యాక్ష వధ—

ఉ॥ అక్షయబాహువిక్రమ జి • తామర వైభవపర్గుఁడుఁ సుహృ
ద్రాక్షససంచయావన పరాయణుఁ డుద్ధురవర్తనుండు లో
కక్షయ కారకుండు బల • గర్వితమోంధుఁడు దుష్టుఁడౌ హిర
ణ్యాక్షుఁడనన్ బ్రసిద్ధుఁడమ • రారి యొకండు మురారిశత్రుఁడై.

క॥ ఆతఁడు కనకకశిపుఁడను భ్రాత మొదలఁగాంచి వైరి • రాడన్వయ వి
ఖ్యాతి నడవుళ్ళు సేయు ధరాతలమున నట్టి చెనఁటి • రక్కసికలఁడే.

తే॥ ఏదు పనిజేసి తనకు లో • నై ప్రణామ మాచరించినఁగాని సు • రాళినెల్ల
వెతలఁ గుడుపుచు నుండును•వినకయెపుడు కనికరము వానిమదికెట్లు•గలుగదోకదా?

సీ॥ చేసె నామునికృతా • శేషయజ్ఞాది సత్కార్యముల్ భంగంబు • గాఁగ జేయు
చూచె నాశక్రాది • సురలగుండెలు పటాపంచలైపోయెడి • పగిదిఁజూచు
పలికె నా బ్రహ్మాండ • భాండముల్ కలగుండు వడి బెండులైకూలు • పగిదిఁబలుక
నడచె నా నుడివడి • పుడమియెల్లను గ్రుంగి యారసాతలమంటు • నటులనడచు
కదలె నా చైత్ర యాత్రకా • ఖండలాది దిక్పతులు కుంతితాస్తులై • దీనులగుచుఁ
గదలభయమునఁ బాఱెడి • కరణిఁ గదలు ననుచితాచారుఁడై హిర•ణ్యాక్షుఁ డెపుడు.

తే॥ లోలుతి సామాన్యులగు వేలు • పులఁ గలంచి యటుపయిని సుగ్రపవరుల • [ నాజిమించి
పోరనెదుటింపఁగలిగిన • పోటుబంటు గలుగమికి నంతిపురమున • నిలిచిమదిని.

ఉ॥ ఆ తత నిర్జరాచల మ • హోకులిశంబు మదీయ బాహుకం
డూతితోలంగ దింతయు ప • టుప్రమద ద్విపహస్త మంజుల
ఖ్యాలము నైన యీ గదయు • ఖండితమాయని నాకు నిప్పుడే
భీతుఁడువోలె నిప్పురము • వీధులలోఁ జరియించు టొప్పునే.

సీ॥ కలుగునే యొకడు సం • గ్రామ రంగమున నన్నెదిరించి యోర్చువాఁ • డికమీఁద
వాహూయనము సేయు • నాపోటు బంటయి యెవఁడేని నన్ను సు • రేశుఁడనికి
విసఁజేయునే నాకు • భీకరజ్యానాద మొక్కఁడాహవమున • నుక్కుమిగిలి
వ్యర్థంబుఁ జేయునే • వైరి యొక్కండు మద్బాహు నిర్గతబాణ • పంక్తి నాజి
కొండపిండులనైనను • గులఁజేయు నాదు గ్రుద్దుల సైఁచి ర • ణంబునందు
నాకు శ్రమగల్గఁజేయు లో • కైక వీరుఁ డెన్నటికైన లభియించు • నే తలఁప.

క॥ తగు వాని నెదిరి రణమున మగతనముల్ జూపి లోక • మాన్యుండగుచున్
బొగడఁబడకున్న వీరున కగునే కీర్తిప్రతిష్ఠ • లరయగ నెందున్.

తే॥ లక్ష్యహీనమైన ♦ లక్షణంబుగతిని యహహ శత్రుహీన ♦ మైననాఁడు
కడిమియెల్ల నడవిఁ ♦ గాఁచిన వెన్నెలపోల్కి రిత్తయగుచుఁ ♦ బోవునేమొ.

క॥ సురలన్ గాఱియవెట్టితి నరులను వధియించి నాఁడ ♦ నాగుల ననిలో
నరఁజేసితి విద్యాధర గరుడాదులఁ గలఁచినాఁడఁ ♦ గడిమి మెఱయఁగన్.

వ॥ విరించి ప్రపంచంబునన్ గల సమస్తప్రాణి సంచయంబు నిర్జించి యుత్త...
యంశంబు నార్జించి యెనలేని పరాక్రమంబున మించితి నీకు నాకెదురెవ్వండు...
నని దురహంకారుండై గదాదండంబు భుజాగ్రంబునఁ దాల్చి పెల్లురేఁగి యెల్ల...
బులఁ దిరుగుచు నొక్కనాఁడు.

సీ॥ నిరశన స్థితిగుండు ♦ నిర్జరావళి కమృతాన్న మొసంగిన ♦ యట్టిదాత
కామమోహితుఁడైన ♦ కమలాక్షునకుఁ గన్యనిడి గేస్తుఁ జేసిన ♦ యిద్ధచరితుఁ
డురగభూషున కిందు ♦ ధరతఘటించి యాతనికృపఁ గాంచిన ♦ ధన్యతముఁడు
శరణువేడిన గిరి ♦ స్వామి పుత్రున కర్థిన్ నభయంబొసంగిన ♦ యనఘచిత్తుఁ
డమల సలిలావతంసులై ♦ యలరు నఖిల నిర్ఝరీప్రాణనాథుండు ♦ నిఖిలరత్న
సంచయాకరుఁడైనట్టి ♦ జలధినాథుఁ గాంచి యసదృశ సంతోష ♦ కలనఁ జెలఁగి.

మ॥ చలదుత్తుంగ తరంగ సంగతము భా ♦ స్వద్రత్న సంతాన సం
కలితంబర్థిజనావన క్షమము గం ♦ గానిర్మలాంభ ప్రవా
హ లతావేష్టిత మిమ్మహోదధి మదీ ♦ యానంద సంధానమున్
సలుపన్ నేర్చుఁ బ్రచేతసుం డిచట స్వ ♦ స్థానంబుఁ గల్పించుటన్.

క॥ అనివజ్రివజ్రమున శైలనికరముల్ మోఁదినట్లు ♦ లావలరఁగన
వ్యనిధిఁ గొట్టెఁ బృథుల గదఁ గొని యంతర్భూతసమితి ♦ గోడువడంగన్.

చ॥ ఆటుల మృతాశనారి విపు ♦ లాహవ కాంక్షఁ జెలంగికొట్టినన్
జటుల గదాభిఘాతమున ♦ సంద్రము వాయలుగాగవిచ్చె నం
తట దనుజుండు లోనదిగి ♦ తద్దయు గర్వముతోన నబ్ధిరా
డ్భటులఁ గలంచె వారును హు ♦ టాహుటి దన్నెదిరించి పోరఁగన్.

క॥ వారలనెల్లర ననిఁ బోకారిచి యెదురెందులేక ♦ కడిమి చెలఁగ దే
వారి వరుణాంతికమునకుఁ జేరి పరుషవాక్య సమితిఁ ♦ జెచ్చెర పలుకన్.

చ॥ గెలిచితి నెల్లలోకములఁ ♦ గీడ్వడఁ జేసితి భూతసంతతిన్
గలఁచితి సాగరంబులను ♦ గట్టుల నెల్లను బిట్టుగూల్చితిన్
సలిపితి నాహవంబులను ♦ స్వర్ధునిఁ బంకముగాఁగ జేసితిన్
దలఁచితి నిర్జగాన్వయము ♦ ధాత్రిని శూన్యముగా నొనర్పఁగన్.

చ॥ నెమకితి సర్వలోకముల • నిర్జరుఁ డొక్కరుఁడేని యాజి ధై
ర్యము గలవాఁడు నన్నెదురు • నట్టిడు గన్పడు నేమియంచు నా
శ్రమము ఫలింపదయ్యె రిపు • సంతతి పౌరుషహీనమయ్యె యు
ద్ధము' కఱవయ్యె మద్గదయుఁ దద్దయుగంపమునొందుచుండెడిన్.

తే॥ నా యదృష్టంబునన్ జేసి • నాఁడె మైన నీ సమాగమము లభించె • నేఁడు నాకు.
నర్థినై వచ్చితిని విపులాహవంబుగూర్చి యెనలేని ముదమును • గూర్పుమింక.

ఉ॥ పౌరుషశాలివైన నర • పాలకుఁ డాజి నెదిర్చినట్టి భూ
దారుల విక్రమంబు మెయి • దార్కొని యోటమియో జయంబో చే
కూరెడునట్లు గ్రిమ్మరుట • కూడును గాని యగమ్యమైన యీ
వారిధిమధ్యభాగమున • వర్తిలు టొప్పునె నవ్వరే దొరల్.

తే॥ లెమ్మ మాలస్యమేల ర • ణమ్మునందు గెలుపుఁ గొమ్ము కులముకీర్తి • నిలుపుకొమ్ము
వైరియాహవమునకుఁ బి • ల్వంగనిట్టు లూరకుండుట యేలాటి • పౌరుషంబు.

క॥ అనవిని ప్రచేతసుండను దనుజాధిపుతోడ నీకుఁ దగునే యిటులన్
గనికరములేక పలుకగ ననఘవ్రత నియతులైన • యార్యులతోడన్.

మ॥ తమ సత్వంబుఁ దొలంగె నింద్రియము ల • త్యంతంబు జీర్ణించె గా
యము శుష్కించెను ధాతువుల్ బలము శూ • న్యంబయ్యె స్వాంతంబు క
ష్టము సైరింపఁగలేక కీడ్వడె నుపా • స్యంబై యహింసావ్రతం
బమరన్ నాకిపు డెట్లు సంగరము సే • యంగూడునో చెప్పుమా?

తే॥ చీకు ముదుసలినై యింత • సేయలేక యుదధిమధ్యంబునన్ బడి • యున్నవాఁడఁ
బడుచువాఁడవు నీతోడఁ దొడరి యెట్లు బోరఁగలుగుదు నాహవ • భూమియందు.

క॥ పదునాల్గులోకముల ని • న్నెదిరింపఁగ నేర్చు నాతఁడే లేఁడనుచున్
మదమునఁ బల్కుచు నాపై • నదయత దండెత్తివచ్చు టర్హమె చెపుమా?

చ॥ అని నిను మోహరించి నిశి • తాస్త్రములన్ భవదీయ బాహు సం
జనిత పరాక్రమక్రమము • సర్వము బూదిగొనర్పఁజాలువాఁ
డనఘుఁడు కేశవుండొకరుఁ • డాతనిఁ గాంచగఁ బొమ్ము నాకితం
బున ఫల మించుకేనియును • బొందఁగరాదిఁక దైత్యపుంగవా?

క॥ కలహార్థివగుచు నిట్టుల జలనిధి మధ్యమున కీవు • చనుదెంచితి నా
వలన భవదీయ వాంఛాఫలము లభింపమికి మదిని • వగచెద నింకన్.

తే॥ అతనితోడఁ బోరు • టవసరంబగు నీకు, నీకుఁ దృప్తిఁగూర్ప • నేర్పుఁ గలఁడు
నతఁడు నీవు బోరి • యఖిల లోకములకు ముదముఁ గూర్తురనుచు • నెదఁదలంతు.

చ॥ అనుటయు దండతాడిత మ • హాభుజగంబు క్రమంబునన్ విలో
చనముల నిప్పుకల్ వెలఁగ • స్వాంతము క్రోధరస ప్రపూర్ణమై

తనరఁగ నాస్య మెట్టివడఁ • దాలిమివీడి పయోదగర్జితం
బనఁగ గభీర వాక్స మతి • నధిపతిక్ గని యాతఁ డిట్లనున్.

క॥ ఇదియేటిమాట యిస్సీ కదనంబును గోరి వైరి • కాల్ ద్రవ్వఁగ ని
ట్లదరిపడి యాడుదాని పగిదిఁ బల్కెదు పౌరుషంబు కీర్తియు వలదే.

క॥ కేశవుఁడెవ్వం డాతని కీశత్వంబెట్లుగలిగె • నింతయు నీ వై
త్యేశున కాతం డీడగు నా శూరుండగునె యాతఁ • డారయఁజెపుమా?

ఉ॥ ఆతని వాసమేడ నను • నాహవరంగమునం దెదిర్చి సం
ప్రీతినిఁ గూర్చ నేర్చునె వి • వేకము గల్గిన వాఁడె నీ వలెన్
గాతరుఁడై మఱొక్కరునిఁ • గాంచగఁ బొమ్మని పల్కెదుండు నా
యీ తఱి నాకు మోదమగు • నే వచియింపుము విశ్వసించెదన్.

ఉ॥ ఈ యఖిల ప్రపంచమున • నెందును నన్నెదురంగలాఁడు లేఁ
డేయని యాహవోత్సవము • నెల్లను గోల్పడియుంటి నిప్పుడ
త్యాయత బాహుగర్వ విజి • తారితనంతటివాఁడు గల్గునం
చీయెడ నాకుఁ దెల్పితివి • నే చని యాతని మోహరించెదన్.

తే॥ పురుషుఁడైన వాఁడు • దురమున శాస్త్రవోరః కవాటకోటి • రక్తసిక్త
మగుచుఁ బ్రాణఁజేసి • యశముఁ గైకొననగుఁ గాని యూరకుంట • కడిమియగునే

తే॥ ఇపుడిపుడె పయనమొనర్చి • యేగువాఁడఁ గేశవుని మార్కొనంగ స్వ • ర్గేశముఖ
దేవతాకోటినైనను • దృణముసేయు నా కతఁడు సాటియౌనె ర • ణంబునందు.

చ॥ అని వచియించి నవ్వరుణుఁ • డాశనితోడ వచించు నిట్టులో
దనుజవరేణ్య కేశవుని • దార్కొనుమింక భవత్పరాక్రమం
బును వృథ సేయఁగాఁదగిన • పూరుషుఁ డాతఁ డొకండె యా ఘనుం
డనయము దానవాన్వయము నంతమొనర్చుచు నుండు నాజిలో.

క॥ కేశవు నెఱుఁగవె యతఁడు రమేశుఁడు సకలావనీగ • లేశుండు సమ
స్తాశాంబరుండు సంసృతిపాశచ్ఛేదకుఁడు భక్త • ఫలదుం డరయన్.

తే॥ ఎల్ల జగముల వ్యాపించి • యొసఁగు నాతఁడగుట విష్ణువనాఁబడు • నమ్మహాత్ము
డతఁ డజేయుండు బ్రహ్మేదు • లైనఁగాని వాని నెఱుఁగంగ నేర రిం • తేని యెపుడు

తే॥ కనుగొనెదు నేర్పు గలిగిన • ఘనుల కెందుఁ గాంచినను గానఁబడువాఁడు • కనుగొన
లేని మాహాత్మ్యలకుఁ గాన • రానివాఁడు ఖండితారాతియా కేశ • వుండు సుమ్ము

చ॥ గొనముల ప్రోకలైన ముని • కోటి వినిర్మలభక్తి నే నిరం
జనుని మనంబునన్ నిలిపి • సంతతమున్ భజియించుచుండు రా
యనఘుఁడు నిర్వికల్పుఁడు ని • రామయుఁ డీశుఁడు దానవారి ని
న్నని దెగటార్ప నేర్పుఁ జను • మా? యతఁడుండు పవిత్రభూమికిన్.

ఉ॥ నల్లని మేని ఛాయయును • నాల్గు మొగంబులుఁ బేరురంబునన్
నల్లని పుట్టుమచ్చయును • నాడెఁపు గోఁతియు గల్గి నిచ్చలున్
దెల్లనివారువంబుపయిఁ ద్రిమ్మరుచున్ గనుపట్టు నీ జగం
బెల్లభరించువాఁడు ధర • ణీశుఁడు సుమ్ము లకేశవుండవన్.

తే॥ తనకు సాధురక్ష • యు నసాధుశిక్షయు విహితధర్మములుగ • వెలయునాతఁ
డలవికుంఠపురము • నందువసించు వాఁడతఁడు కేశవుఁడు ద • యాపరుండు.

క॥ అనినవిని కాంచనాక్షుఁడు కనలుచు నిప్పులు సెలంగు • కనుదమ్ములతో
వనజాక్షు నెదురుకొనియెదనని యచ్చోటు వాసి చనియె • నతిరభసమునన్.

వ॥ గిరిక్రేపులం బోనిమూఁపుల గదాదండంబు వెలయ వెన్నుని సన్నజేయుదునని డంబం బులు వలుకుచు నతిభయంకరాకారుండై పుడిమి యద్రువబిరబిరంజనువాఁడు తన మనంబున

చ॥ అరిగెద నే వికుంఠపురి • కచ్చటి యోధులనందఱన్ శరో
త్కరమున నుగ్గుజేసి మొన • కాఁడనటంచును విఱ్ఱవీఁగు నా
హరిని కరంబుఁ బట్టుకొని • యాహవభూమికి బల్మినీడ్చెదన్
దురమున నాతనిన్ దునిమి • తోడనె యప్పురి బూదిసేసెదన్.

క॥ తనయంతవారు లేరని మనమునఁ దలపోసికొనుచు • మాయకుఁడై యెం
దునకుఁ గొఱగాని వేలుపు లనయము శ్రితులై నుతింప • నారిచరియించున్.

తే॥ అలసులైన కొండ • అసురులు తనమాయ జిక్కి యపజయంబుఁ • జెందినంత
దైత్యహంతననుచుఁ • దాఁ జెప్పుకొన సిగ్గులేదె కేశవునకు • లేశమేని.

మ॥ అనిలోనన్నెదిరించి మద్ఘనగదను • జ్యాముక్త తీవ్రాస్త్ర దు
ర్దినమున్ సైచి నిజప్రతాప దహన • శ్రీ నిల్పుకొన్నన్ గదా
తనకున్ దాన వశాత్రవత్వము యథార్థంబైను • లిన్ గాంచుటల్
పనిలే కివ్విధి సాటుకొన్న నగునే • ప్రావీణ్య మింతేనియున్.

క॥ దానవవైరి యతండగునో నే నసురారి నగుదు • నో యెఱుకపడం
గా నగు నిఁకమీఁదట నన్నా నళినాక్షుం డెదిర్ప • నా హవసీమన్.

క॥ అనుచు దురభిమానము పెంపునఁ దనలో నాడికొనుచు • మురవైరిఁ గనుం
గొనియెడి వేడుకఁ జనుచును దనుజుఁడు గనుఁగొనియె నార • దమునిప్రవరున్.

క॥ కనుఁగొని యతఁ డిట్లనునో యనఘా యెచ్చోటనుండి • యరుదెంచెదు నేఁ
జనియెద వికుంఠమున కవ్వనజాక్షునితోడఁ బోరు • వాంఛపొసంగన్.

చ॥ కనఁబడెనేవి•కుంఠమున • గారడినాఁడగువాఁడు వెన్నుఁడా
తని కెవరేని చెప్పిరె ప • దంపడి నేనని సేయవత్తునం

ము నతఁడెటింగి నాకొఱకుఁ • జూచుచునుండెనె లేక పాటిపో
యెనొ నను శత్రుమర్దనుఁ డ • హీన పరాక్రముఁడం చెఱుంగుటన్.

తే॥ మహిత మామక భుజదండ • మండితమగు నీ గదాదండమును హరి • యెన్న నే
స్మరణజేయునే నిజబాహు • జనిత విక్రమంబు వృధ సేయఁగలదు నిజంబటం

చ॥ అనవిని నారదుండనియె • వా కనకాక్షునితోడ సజ్జలో
చనుఁడు విశంత పత్తనము • సౌధమునందున లేఁడు సజ్జనా
వన నిరతుండు గావున న • వారిత మైన వరాహరూపమున్
గొని విలయాబ్ధి మగ్నయగు • కుంభినిఁ బ్రోఁచు తలంపు మీఱఁగన్.

మ॥ చనివాఁ పూర్వమునన్ మునింగి నిజర • క్షాదక్షుఁడో వాఁడెవం
డనుచున్ వందురరత్నగర్భను స్వదం • ష్ట్రాగ్రంబునన్ దాల్చి లో
కనికాయంబు ముదంబుఁ జెందఁగ జగ • త్కల్యాణ సంధాయకుం
డను నామంబు కృతార్థతన్ గనఁగ వా • హ్యాళిన్ జరించున్ వెసన్.

క॥ పాతాళంబునకున్ జని పీతాంబరు గాంచి మదిని • భీతివడక సం
ప్రీతి మెయి నతనిఁ దాఁకుము నీతలఁపు ఫలించునట్లు • నిపుణత వెలయన్.

క॥ దనుజేశ నీ పరాక్రమమున కా జలజాక్షు శౌర్య • ము సరియగునుగా
వున వేగఁబొమ్ము కేశవునని మార్కొనుమీవు నిర్జ • రారివె యైనన్-

ఉ॥ అందరివంటివాఁడె హరి • యంచుఁ దలంచితివేమొ నీవు గో
విందుని నొవ్వఁజేయఁగల • వీరుఁడు లేఁడు జగంబులందు సం
క్రందను పౌరుషంబుఁ గొఱ • గామిగఁజేసిన నీ పరాక్రమం
బెందులకైన నర్హమగు • నే హరి యించుక పాఱఁజూచినన్.

క॥ సోమకుఁడలఁతియె యాహవ భూమిం దెగిపడఁడె విష్ణు • మూర్తి యెదురను
ద్దామపరాక్రముఁడగు బలి యేమగుచూ తలఁపుమించు • కేనియునమునన్.

క॥ అంతంతవారిగతియే యింతింతలుగాగనయ్యె • నిఁక నీగతి యె
ట్లంతము కాగలదో దనుజాంతకు నెదురింపఁగోరు • నట్టికతమునన్!

తే॥ కొండ డీకొనంగఁ • గోరు తగరుమాడ్కి విలయవహ్నికురుకు • శలభమట్లు
తమ్మికంటి గెల్వఁ • దలఁచుటయెల్లను నాత్మనాశమునకె • యసురవర్య!

చ॥ తన సరివారలన్ గలన • దార్కొనుటొప్పును గాక యివ్విధం
బునఁ జేలరేఁగి గర్వమును • పూనికయున్ మితిమీఱ దైత్యహం
తన లఁతిఁగాఁ దలంచి బల • దర్పమునన్ వచియించు టొప్పునే
దనుజవరేణ్య శాత్రవుని • సత్వమెఱుంగక నేఁగిఁ గాంతువే.

తే॥ తెలిసి తెలియక నీవిట్లు • జలజనయనుతోడ వైరంబుఁ బూనుట • దొడ్డకర్జ
మగునె పాద నిదురించు పం•చాస్యముపయి సరగనెత్తిన శునక సం•చయముక

తే॥ ఎవఁడు చెప్పె నీకు ♦ నిందిరారమణునితోడఁ బోరుమనుచు ♦ దొసఁగునాక
యతఁడు గినిసెనేని ♦ యా విరించ్యాదులకైనఁ దెలుపుగలుగ ♦ దనఁగవినవే.

ఉ॥ అంతట దానవుండు కమ ♦ లాసను నూతి వచఃప్రసక్తికిన్
స్వాంతము క్రోధపూరితము ♦ నై తనువెల్ల దహింపనేర్చి దు
ర్దాంత భుజాగ్ర రాజిత గ ♦ దాహతిచే ధరణీతలంబు న
త్యంతము క్రుంగఁజేసి యరు ♦ ణాననుఁడై వచియించు నీ క్రియన్.

చ॥ హరిగలఁడా వికుంఠమున ♦ యందనిపల్కితిఁగాని యంబుజో
దరు నిటు బెద్దఁజేసి యమి ♦ తంబుగ సన్నుతిఁజేయుమంటివే
సరిసరి మెప్పువచ్చె విర ♦ సంబుగ నేటికి బల్కెదో మునీ
శ్వర చనుమింకఁ గాలమును ♦ వ్యర్థముసేయుట కకారణంబుగన్.

తే॥ కాంచనాక్షుఁడనఁగఁ ♦ గాసునకుం గొఱగానివాఁడు వోలెఁ ♦ గానఁబడెనె
యనిమిషాశ్రయంబు ♦ నంతంబు గావించు వేఱుపురువటంచు వెఱపులేక.

చ॥ ఇదె చనెదన్ ముకుందుకడ ♦ కేడ్తెఱ నాతని మద్గదాహతిన్
గదనముఖన్ వధించెదను ♦ గంజదళాక్షుఁడె ప్రోవనేర్చునం
చెదఁ దలపోసి త్రిమ్మరెడి ♦ హీనుల వేల్పులఁ జెండినై చెదన్
బదిలముజేసెదన్ దనుజ ♦ వంశము దిక్కులఁ గీర్తి నిల్పెదన్.

క॥ అని వచియించుచు నిగబిరఁ జనియెన్ గనకాంబరుఁడు ర ♦ సాతలమునకున్
గొనకొని మృత్యుముఖ పతనమున కరిగెడివాఁడు వోలెఁ బుకమియద్రువఁగన్.

వ॥ అట్లుఁజని.

మ॥ కనియెన్ దానవవల్లభుం డమరలో ♦ క త్రాణ పారీణమున్
గన దుర్దండ కరాళ దంష్ట్రివిలస ♦ ష్మా చక్రమున్ గాలమే
ఘనికాయోన్నత దేహమున్ బృథుల వ ♦ క్త్రింబున్ మహాఘుర్ఘుర
ధ్వని సంత్రస్త దిగంతరాళము లల ♦ ద్వార్జాలమున్ గోలమున్.

క॥ కని యివ్వన చరమిప్పుడి వనచరమై తిరుగు దీని ♦ వధియించినఁగా
కనయము మత్కీర్తిలతలు బెనఁగొనవు మహాప్రపంచ ♦ వృక్షచయంబున్.

మ॥ అనుచున్ యజ్ఞవరాహమున్ దరిసి దై ♦ త్యాధీశ్వరుం డాననం
బునఁ గ్రోధాగ్ని కణంబు లొప్ప దశనం ♦ బుల్ గీటుచున్ మూర్తిదా
ల్చిన యవ్వీర రసంబు నాగవి జయ ♦ శ్రీకాంక్షచే భీకర
ధ్వని బల్కున్ భుజదండమండిత గదా ♦ దండంబు సారించుచున్.

క॥ ఇదియేటి బంటుతనమగుఁ గదనంబున నిలిచి పోరఁ ♦ గా నేరక యి
ట్లుదరి యొక కోలమైతివి మఱి సిగ్గించుకయు లేదె ♦ మాధవ! నీకున్.

క॥ బలవంతులరగు రక్కసి కొలమున వారికిఁ దలంకి కొందలమున నీ
ళ్లలఁబడి డాఁగుట తొలి సుత యలవాటగు గాదే నీకు ♦ నచ్యుత చెపుమా?

ఉ॥ ఇట్టి యసత్త్వవర్తనుఁడ ♦ వీవగుటన్ దలపోసియేగదా
కట్టడిజేసె దైవ మొడి ♦ కంబున నీళ్లజరింపుమంచు ని
న్నట్టి కొలంత నెంచక య ♦ హంకృతిఁ గన్నను మిన్నుగానవై
తెట్టివివేక హీనుఁడవొ ♦ యెంచఁగ నీవు ముకుంద చెప్పుమా?

చ॥ దనుజసహాయ సంపద సు ♦ ధన్ సృజియించియు దానభాగమున్
గొనుఁడని దానవాధిపుల ♦ కున్ దగనీయక టక్కులాడివై
యనిమిష కోటికే యిడితి ♦ వక్కటతనన్ గద మాకొలంబు వా
రనఘులు నిన్నుఁ గాంచిన న ♦ నాదరముం బొనరింతు రెంతయున్.

క॥ చతురుఁడవు గావు గర్వంబతిలోకము నీకు సజ్జ ♦ నాపకృతియె నీ
మతికిన్ దగు కార్యం బాక్రతుభుక్చయ మెట్లు నిన్ను ♦ ఘనుఁడనునొకదా?

క॥ అనివార్య పౌరుషంబున దనుజాన్వయ ముద్ధరింపఁ ♦ దలఁచి సురల నె
ల్లను గారించితి నెందును ననుదాఁకెడి బంటొకఁడు గ ♦ నంబడఁడరయన్.

ఉ॥ ఈవొకపోటుబంటవని ♦ యెంతయు వేలుపు జోఁగిలేఁకు సం
భావన నేసి తెల్ప విని ♦ వారకమద్దదతో రణంబునన్
దావకబాహుశక్తిని స్పృ ♦ హాణమొనరింపఁదలంచి వచ్చితే
నీవిధి ఘుర్ఘురించెద వ ♦ దేలఁ గిటీంద్రమవై జలజంబులన్.

క॥ కిటిరూపమూని యిటు క్రిమ్మరుచున్నఁతనె మదీయ ♦ మార్గణగణ వి
స్ఫారణంబు నిన్ను వీడునె బరువడి యాహవతలమున ♦ వధియింప కిటిన్.

క॥ అని బీరంబులు వలికిన విని యజ్ఞవరాహ విభుఁడు ♦ విస్మయచిత్తుం
డును గ్రోధమూర్తియు నగుచు దనుజున కిట్లనియె దెసలు ♦ తల్లడిపడఁగన్.

ఉ॥ ఓరి నిశాచరాధమ ♦ దోర్దతి నూరక యిట్లు ప్రేలుచే
లా రణముం బొనర్పనఁ గ ♦ దా యెఱుఁగంబడునా పరాక్రమం
బారయ నెవ్వఁడేని తన ♦ యట్టిఁడు లేఁడని పల్కుటన్వా మే
శూరులు మెత్తురే రిపులుఁ ♦ జూచి సహింతురె మాట నిల్చునే.

చ॥ కడిమిగలాఁడవేని యొడి ♦ కంబున నన్నెదిరించి శౌర్యమే
ర్పడ విజయంబుఁ గైకొనఁగ ♦ రాదె వృథాపరుషోక్తు లేటికిన్
బెడిదపుఁ బోటుబంటవని ♦ విందు నినున్ జనుదెమ్ము వేగ ని
ప్పుడ వధియించి వేల్పుఁగమిఁ ♦ బ్రోచెద సజ్జనపాళి మెచ్చఁగన్.

ఉ॥ దానవుఁడై జనించి యుచి • తస్థితిఁ ద్రిమ్మరు తెల్విలేక య
జ్ఞాన పరీత చిత్తుఁడయి • గర్వమునన్ మితిమించువాఁ డొకం
డైన మఱియు కోపమును • నగ్నికి నాహుతిగాకయున్నవాఁ
డేనియెఱుంగఁ జెప్పి భవ • మీయవచస్థితి నిల్పుకొమ్మిఁకన్.

తే॥ సాధురక్షణంబ • సాధుశిక్షయు నాకు నిత్యకృత్యములయి • నెగడుచుండు
దనుజుఁడైనఁ గాని • తగనన్ను భజియించువాఁడు ముక్తుఁడగు న • వారితముగ.

తే॥ నాకు భక్తులయి య • వారతమున్ ధర్మ మాచరించు సురల • నఘము నాక
కలఁచుచుండు వట్టి • కారణంబున వధార్హుఁడవైతి విప్పు • డో సురారి!

మ॥ అనినన్ దానవనేత క్రోధమున నా • నా నీ ప్రభావంబు నె
ల్లను నీవే నుతిసేయుచుంటి విదిమే • లా దుష్ట కోలం బక్ర
మ్మన మద్బాహుపరాక్రమానలమునన్ • నాశంబుఁ గావింతు నీ
తను వెల్లన్ గనుఁగొమ్ము రమ్మనికిను • ద్యత్పౌరుషం బేర్పడన్.

క॥ అని పలుకుచు నలుకమెయిన్ గనుఁగవరోషానలంబు • కణములు సెలఁగన్
దనుజుఁడు యజ్ఞకోలంబును మార్గణ వర్షపాత • మున ముంచె వెసన్.

చ॥ హతపరిపంథి వీరుఁడగు • యజ్ఞవరాహ విభుండు దైత్య ము
క్త తతశరప్రకాండమును • దగ్గయి వారణజేసి క్రోధ దీ
పిత సకలాంగుఁడై జగము • బిట్టదురన్ వెస ఘుర్ఘురించుచున్
దితిసుతుఁ దాఁకె దంతరుచి • దిక్కులఁ బిక్కటిలంగ నెంతయున్.

తే॥ అటుల దాఁకి వీఁక • నసురేశ్వరునకను నోరి దుష్ట నీదు పౌరుషంబు
తెలిసివచ్చె నింకఁ • గలన నన్నెదిరించి నిలువఁగలుగునట్టి • నేర్పుఁ గనుము.

తే॥ పోటుబంటు వోలెఁ బోర నరుగుదెంచి మాటమాత్రమున నె • వమ్ముఁ గెలువఁ
దలఁచు నీకు యుక్తి • తలపించె వే న్నిళ్ళఁ గొంపఁ గాల్పఁ జూచు • గుణవిహీన.

క॥ ఇదె కనుఁగొనుమా మామక గదత్వద్వక్షః కవాట • ఖండనమును జే
యుదు ననుచును జలియించెడు నదరిపడెడ వేల దాన • వాధమ యిటులన్.

తే॥ ఇప్పటికినైన నీ పాప • కృత్యములను వీడి శరణార్థి వగుము నీ • తోడివారిఁ
గూడి మనునట్లు జేసెదఁ • గొదువలేక విసవో పో యమ సదనంబు • మనికియగును.

చ॥ అనుటయుఁ గాంచనాక్షుఁడు మ • హాగ్రహమున్ గొని తోఁక ద్రొక్కినం
తనె బుసఁగొట్టి లేచు పెను • త్రాఁచు విధంబున హుంకరించుచున్
ఘనగదఁ ద్రిప్పుకొంచు నొడి • కంబున వెన్నుని దాఁకె నాకసం
బున సురలెల్ల భ్రాంతిపడి • మోములఁ దేజము వీడి చూడఁగన్.

తే॥ అవ్విధంబున దాఁకియ • య్యసురవరుఁడువినిశిత గదాగ్రమున వెన్ను • వేఁడబో
గాడ నేయుటయు నతండు • కాలరుద్రు మాడ్కిఁ జెలఁగుచు ననియెను • మద మెలి

క॥ ఓరీ యీ జగములయం దేరీ నాసములటంచు • నెంతయుఁ గడఁకన్
నోరూరఁబల్కి తినియా నీరణ కౌశలము విన్న • నృపతులు నగరే.

క॥ అనిపలుకుచు నలుక మెయిన్ ఘనుఁడా మఖదంష్ట్రిరాజు • కనకాక్ష విము
క్త నిశితగద కేలన్ గొని దనుజుఁడు కనుచుండఁ ద్రుంచె • దాని నుసుముగన్.

చ॥ అదిగని దానవేశ్వరుఁ డ • హంకృతిఁ జయ్యన యజ్ఞకోలమున్
గదనమునన్ జయించి మొన • కాఁడను సంజ్ఞను సార్థకంబుగా
గఁదనకోలంబు వారలకుఁ • గల్గెడి కష్టము బాపనున్నచో
నదితి సుతారియైన తన • యన్నకుఁ గీర్తి చెలంగునే ధరన్.

క॥ అని నిశ్చయించి కమలాక్షుని డగ్గరి యిట్లు బల్కు • గోవిందసినున్
గనికరముబూన కిపుడే యని ద్రుంచి యశంబుఁ గాంతు • నఖిలజగములన్.

వ॥ అని గోపకసాయితాక్షుఁడై సరోజాక్షుఁ దాఁకిన నాతండును నడ గొండకైన
యా యసురుఁ దలఁపడియె నట్లయ్యిరువురు యోధులు పరస్పర జయాభిరతి
వేదండంబుల వసువుఁ గరాభిఘాగంబుల నొప్పించుకొనుచు, సింహకిశోర
భాతి దిక్కులు బ్రెగ్గల గర్జించుచుఁ బోరుచుండు నెగ.

తే॥ అమ్మహారణశూరుల • యాహవంబుఁ గాంచు కోరిక లుప్పొంగ • గగనవీధి
జేరు హరికి జయంబు చే • కూరునట్లు భవుని ప్రార్థించి పద్మసం • భవుఁడు ప

చ॥ కమలదళాక్ష యేమిటికి • గ్రక్కున ఈఖలుపాత్ము ద్రుంచి లో
కమునకు హాళిఁ గూర్పక • కాలముఁ బుచ్చెదు సంధ్యయైన యీ
యమరవిరోధిఁ జంపఁదర • మౌనె యెఱుంగవె సర్వ జంతుజా
లము సృజియించి ప్రోవఁగల • లావుగలాఁడవు నీవొకింతయున్.

తే॥ చెనఁటియైనవానిఁ • జెచ్చెరవధియించి జగములకు హితంబు • సలుపకున్న
నొక్కవేళ నాతఁ • డోలి తనకె యపకృతిఁ బొనర్చునని • చతురమతులు.

తే॥ దనుజవేళయగుట • మునిమాపు తటిని రక్కసునింద్రుంప నలవి • గాదుగాన
యాలసింప కిపుడె • యమృతాశనారిని సంహరింపుమయ్య • సంగరమున,

చ॥ అని వచియింప నౌననుచు • నాదివరాహవిభుండు భీకరం
బును నిశితంబునై యలరు • భూరిగదన్ జలియింపఁజేయుచున్
దనుజుని ద్రేయఁబోవఁగ న • తండును భీతిల కట్టె దానిఁ గై
కొని జలమధ్యభాగమున • కున్ బడునట్లుగఁ బాఱవైచినన్.

తే॥ ఇందిరాధీశుఁ డాయుధ • హీనుఁడైన రాక్షసేశుండుఁ యుద్ధధ • ర్మంబు నెఱిగి
నట్టివాఁడౌట నూరక • యుఁటనె నిలిచి కాంచుచుండెను దేవతా • గణములదర.
కం॥ అతని పరాక్రమమునకును జతురతకును శౌర్యమునకు • సంగర ధర్మ
జ్ఞతకును సహనంబునకును మతి నాశ్చర్యంబు నొంది • మాధవుఁడంతన్.
మ॥ స్మరియించెన్ బలగర్వితాసురకుల • క్ష్మారుద్ధవాగ్ని ప్రభో
త్కరమున్ బోషితదేవతా ప్రకర భా • గ్యస్థైర్యమున్ గోటిభా
స్కర భానూపమితోజ్జ్వలద్ద్యుతి సహ • ప్రవ్యాప్త దిక్చక్రమున్
నిరతాంభోజదళాక్ష హస్తపదమున్ • నిర్వక్రమున్ జక్రమున్.
కం॥ స్మరియించినంతమాత్రన యరవిందాక్షుని కరంబు • నందునిలిచె భీ
కరమగు చక్రము సురరిపు హరణావక్రంబు దేవ • తాళి నుతింపన్.
తే॥ అటులఁ గరముననిలిచిన • యా సుదర్శనమును గిరగిరఁ ద్రిప్పుచు • నళిననేత్రుఁ
డసురనాథునిపై నిడె • నంబరమున నమరులెల్లరు సంతోష • మందుచుండ.
వ॥ అంత నమ్మహాచక్రంబు నిర్వక్రపరాక్రమాపహృత నిఖిలదేవతాసంపత్సంతానుండగు దైత్యేశ్వరు వక్షంబు ఖండించుటయు నాతఁడు మహాబలతాడనంబున ద్రెళ్లు భూరుహంబు గతి బడియె నంత వరాహరూపధరుండగు వెన్నుండు దైత్యునిపైఁగల కోపంబు దీరక వేగమహోయి యాతని యురంబునుండి స్రవించు కవోష్ణంబగు రుధిరంబుఁ బానంబుఁ జేసి మత్తుఁడై చిత్తవైకల్యంబున

—యజ్ఞవరాహమూర్తి హిరణ్యాక్షరుధిరపానంబున మత్తుండై జగంబుగలంచుట—

మ॥ ధరణీధ్రంబులఁ బెళ్ళగించుచును భూ • తవ్రాతమున్ బట్టి భీ
కరలీలన్ వధియించుచున్ విపులవృ • క్షశ్రేణులన్ గూల్చుచున్
సురసంతానముఁ బాఱఁద్రోలుచు ముని • స్తోమంబు బాధించుచున్
జరియింపంగఁ దొడంగెఁ దద్రుధిరపా • న ప్రాప్త భ్రాంతాత్ముఁడై.
వ॥ అవ్విధంబునఁ బుండరీకాక్షుండు బ్రహ్మాండంబుల నెల్లఁ గలగుండు వడఁజేయుటన్ జేసి.
సీ॥ ద్వాదశాదిత్యుల • దర్పంబడంగ నే • కాదశరుద్రుల • గర్వమడిగె
నలనవబ్రహ్మల • యాయువుల్ కడముట్టె నష్టవసువుల క • నిష్టమయ్యె
సప్తగ్రహంబుల • చక్రముల్ రూపఱె షడృతు ధర్మముల్ • సమసిపోయె
బంచభూతంబులు • బఱచె నద్దెసలఁ జతుర్వేదవర్గ మ • తుష్టినొందె
పట్టె జల్లాటిపోయెఁ ద్రే • తాగ్నిచయము అలుమూఁడయ్యె నప్పుడు • ద్వ్యాయనములును
కాలధర్మంబు విపరీత • గతి వహించె దుశ్శకునములు నెల్లెడఁ • దోఁచె జగతి.
తే॥ అమ్మహోపద్రవము కార • ణమ్ముకతన లోకసంచయమెల్లఁ జీ • కాకు వడుటఁ
గాంచి కమలాసనుఁడు దక్కఁ • గల సురలును దత్ప్రతీకార మొనరించు
[ తలఁపుఁ జేసి.

—॰ యజ్ఞవరాహకృతబాధ కోర్వక సురలువగచుట ॰—

మ॥ నతభక్తావన దక్షుఁడీశ్వరుఁడనం ॰ తప్రాభవోపేతుఁడు
ద్ధత దుష్టాన్వయనాశకుండు హరియే ॰ తద్దైత్యుఁ బోకార్చి లో
కతతిన్ బ్రోచునటంచు నెంచితిమి దు ॰ ష్కాలంబు ప్రాపించి యీ
గతి మాకున్ వెతగూర్చునంచుఁ దెలియం ॰ గా లేకపోకింతేనియున్.

క॥ దనుజకృతబాధ మాన్పఁగ ॰ వనజాక్షుఁడె శక్తుఁడనుచు భావించితిమా
ఘనుఁడె భయంకరుఁడై లోకనికరమున్ గలఁపఁదొడగెఁ ॰ గతియేదింకన్.

తే॥ దానవునువెఱచి తనయండఁ జేరిన మనకె బాధఁగూర్పఁ ॰ జనునె హరికిఁ
బసులు మేయుననుచు ॰ వెసఁగాఁపువెట్టినఁ గంచ చేను మేయు ॰ కరణిగాఁగ.

ఉ॥ ఎవ్వనిదాఁపుఁజేరిమన ॰ మీవెతఁ బాయఁగలార మోకదా?
యెవ్వఁడు బ్రోవనేర్తునని ॰ యియ్యెడ మా కభయం బొసంగునో
యెవ్వని గాంచి యీవనచ ॰ రేంద్రుడు శాంతము దాల్చునో గురుం
డెవ్వఁడో తోఁచదింకగతి ॰ యెవ్వఁడో సౌఖ్య మెవాఁడుగూర్చునో.

తే॥ లోకపాలుర కెపు ॰ రాకృతకర్మంబు దుష్ఫలంబుఁగూర్ప ॰ దోసకార్ల
కెట్టి ఫలమొసంగు ॰ నే యవస్థలభించు నెవ్వఁడెఱుఁగనేర్చు ॰ నింతయేని.

మ॥ అని చింతించుచుఁ దత్కిరీంద్రకృతమా ॰ నార్తిన్ శమింపఁగఁజే
యు నుపాయం బొక యింత దోఁచక రణో ॰ ద్యోగంబునన్ గోలమున్
దునుమాడంగలవాఁడు శంభుఁడనుచున్ ॰ దోడ్తోనఁ దద్దివ్యద
ర్శన మేరీతి లభించునో యని సుర ॰ వ్రాతంబు శంకించుచున్.

—సుర లీశ్వరునితో యజ్ఞవరాహకృత బాధల జెప్పుట—

తే॥ భక్తసులభుఁ డతనిఁ బ్ర ॰ స్తుతించినఁ గరుణించుననుచు నిశ్చ ॰ యించి రజత
గిరి వసించియున్న ॰ కృత్తివాసుఁ గాంచఁబోయి రపుడు సురలు ॰ పూన్కి ద

వ॥ అట్లుబోయి యప్పర్వతరాజంబునందొక దివ్యాలయంబున

మ॥ సురసంతానము సంతసంబు మెయి ॰ నచ్చోఁ గాంచె వ్యాఘ్రాజినాం
బరు నాగాభరణున్ జగత్త్రితయ సా ॰ మ్రాజ్యైక నాథున్, గిరీ
శ్వర కన్యాహృదయాబ్జభాను, శ్రిత ర ॰ క్షాదక్షుఁ గైలాస మం
దిరు నానందమయున్ బురాంతకుని ని ॰ ర్నిద్రప్రతాపున్ ఘనున్.

తే॥ కాంచనిటలఘటిత కర ॰ కమలులగుచు నయభయంబులు బెనఁగొన ॰ నళిన
వాది నిర్జర వరులు కృతాంతవైరి ॰ వినుతిసేయఁబూనిరి వేద ॰ విహితగతిని.

సీ॥ సకల చరాచర • జంతుజాల మెవాని సంకల్పమునఁజేసి • జననమొందు
నే వాని యనుకంప • నీ యెల్లజగముల గములు సుఖస్థితిఁ • గాంచిమించు
ప్రళయకాలమున నే • భగవంతుఁ డుగ్రుఁడై శమియింపఁజేయు నీ జంతువితతి
వారివారికిఁదగు • పాఱపత్తెములిడి యెవ్వాఁడు సాక్షియై • యెసఁగుచుండు
నెవఁడు తృణము నేని • హేమాద్రిగ నొనర్చు నెవనికోపవహ్ని • కింధనమగు
నల కుబేరుఁడైన • యట్టి మహామహు నాశ్రయింతు మయ్య • యనఘ నిన్ను.

క॥ చిరకాలమునుండియు నీ కరుణకలిమిఁజేసి యెట్టి • కడగండ్లైనన్
దరియించి సుఖంబుంటిమి పరమేశ్వర నీవెమాకు • బంధుఁడ వరయన్.

చ॥ అమృతముఁద్రావి సొమ్మసిలి యచ్చరకన్నియలెల్లరున్ వినో
దముగ నటింప నందన ప • దంబుల నిర్మల జాహ్నవీతరం
గమృదుల శీతవాతములు • గమ్మగ వీవ నిరంతరంబు సౌ
ఖ్యముగఁ జరించువేలుపుల • కా? దురవస్థలభించె నేటికిన్.

ఉ॥ దానవుడుద్ధతుండయి మ • దంబున మాకొనరించుబాధలన్
బూనికమాన్పువాఁడు సుర • ముఖ్యుఁడు వెన్నుఁడటంచు నెంచి యా
దానవవైరిఁ గొల్చితిమి • తద్దయు నాతఁడె పెల్లురేగి యా
జ్ఞానియుఁబోలె మమ్ముఁ గడ • గండ్లను బాల్పడఁజేసె నెంతయున్.

మ॥ అకటా యేమని విన్నవింపఁగల మా • ర్యానాథ వెన్నుండు దై
త్యకులేంద్రున్ వధియించి తద్రుధిర ము • ద్యచ్ఛక్తితోఁ ద్రాఁగి లో
కకదంబంబును బాధసేసెడు జగ • త్కళ్యాణ సంఘాత వీ
వెకదా యియ్యెడ రక్షకుండవికఁ వే • రెవ్వార లూహింపఁగన్.

ఉ॥ ఎందఱొ క్రూరదానవు ల • హీనగతిన్ జగముల్ గలంప వా
రందఱ సంహరించి యమ • గాళికి సౌఖ్యముఁగూర్చుచుండు వో
యిందుధరా మునుందుఁడు కి • రీశ్వరుఁడై యొనరించు నార్తి మా
న్పందలఁచియయ్యొ మాయెడఁ గృ • పాసహితుండవుగమ్ము నీవికన్.

ఉ॥ దానవబాధ మానునుగ • దాయని సంతసమందునంతలో
నా నళినాయతాక్షుఁడె ద • యారహితుండయి ఘోరతామసం
బూని వధింపఁగాఁ దొడఁగె • నొప్పరికింపఁగనేల నీకు న
జ్ఞానపరీతమైతిరుగు • యజ్ఞవరాహము సంహరింపుమా?

క॥ ఇది యెచ్చటిధర్మంబో పదపడి మముఁ బ్రోవవచ్చి • బాధింపఁగ సా
గె దితి తన యారిలోకము లదరిపడఁగ నెమ్మదిని ద • యా విరహితుఁడై.

తే॥ ఈ యుపద్రవ సమయమం • దీవుదక్క వేరొకండు గలఁడె దిక్కు • విబుధతతికిఁ
దల్లి కోపించునప్పుడు • తండ్రి గాక భృత్యతతి బ్రోవనేర్చునే • బిడ్డల నిల.

మ॥ అనిశన్ జాలిదలంచి శంకరుఁ డదే • లా వెన్నుఁడా దుష్టదై
త్యుని బోకార్చి జగంబులన్ మనుప కి • ట్లున్మత్తుఁడై పామరుం
డును బోలెన్ జరియించునే సకల బం • ధుం డాతఁడే యిట్లొన
ర్చిన నాటంకముఁ జేయువాఁ డెవఁడొ యి • స్సీనర్మముల్ బూనఁడే?

చ॥ తమతమ పూర్వకర్మ వశ • తన్ జరియించెడు భూతసంతతిన్
గ్రమమునఁ బ్రోచునట్టి యధి • కారమె గాక వధించు పారుప
త్తె మెవఁ డొసంగె వెన్నునకుఁ • దెంపరియై వెనుకంజలేక లో
కముల గలంచునే పరుఁ డొ • కండు తనంతటివాఁడు గల్గఁడే?

చ॥ తన యధికార సంపద మదంబున నెవ్వడయేని ముందుఁ గ
న్గొనక యలంతి మానవుల • కున్ వెతఁ గూర్పఁదలంచుచుండు నా
తనిఁ గలుషంబు నాకయుచి • తస్థితిఁ జేర్పఁగఁ గోరు బుద్ధి శా
సన మొనరించు టర్హమని • సాధుజనుల్ వచియింతు రెల్లెడన్.

సీ॥ భార్గవు నుపదేశ • పటిమచే సురవైరి పెనుకానఁ దపముఁ గావించుటేల?
నతని నుపేక్షింప • కర్హమానని మనమెల్ల వరంబుల • నిచ్చుటేల?
నంత శమించక • యఖిలజగంబుల దితి తనయుండు బా • ధించుటేల?
నవ్వాలిఁ బోకార్చి • హరి యూరకుండక పెలుచ లోకంబులఁ • గలఁచుటేల?
నిన్నియును జూడ నేను లో • కేశ్వరుండనగుట నేయుపాయంబున • నైనఁగాని
భ్రాంతుఁడగు కిరీంద్రునిఁబట్టి • భంగపరచు టుచితమని నెమ్మదికిఁ దోఁచు • చుండెనిప్పు

చ॥ పగతుఁ డెవండొ నెచ్చెలి యె • వండొ యెవానినిఁబట్టి సంహరిం
పగఁదగుఁ బ్రోవఁగాఁ దగిన • వాఁడెవఁ డాహవకాల మెద్ది యే
పగిదిఁ జరించినన్ దనకు • భావిశుభంబొనఁగూడునంచు లో
వగ వక యుద్ధతుండయిన • వాని నుపేక్ష యొనర్పఁ జెల్లునే.

తే॥ ఎంతకాలంబిటుల నెదు • రెందులేక సంచరింపఁగ నేర్చునో • సవనభోల
మద్దిరేతాడి నెక్కుడు • నట్టివాని తలను దన్నెడు నాతఁడు గలుగకున్నే.

చ॥ తనమొనరించు నప్పని • యధర్మవటంచు నెఱుంగకుండినన్
ననుస్మరియించి రైనను మ • నంబున నించుక భీతిఁ జెందఁడ
య్యెను జలజాయతాక్షుఁడని • యెచ్చటి ధైర్యమొ యేటి శౌర్యమో
కనుఁగొనెదన్ దదర్హమగు • కార్యమొనర్చెద లోకశాంతికై.

తే॥ తనకుఁగాని పని న • తఁడు సేయఁగాఁ బూనెఁ గాని నాకుఁ దగిన • కార్యమే
సేయకుండుటెట్లు • నా యధీనము లగు నీ జగత్త్రయంబు • లెల్లఁ దలఁప.

తే॥ ఇంతమాత్రమునకె • చింతింపఁగానేల? జనుఁడు మీకుఁదగిన • స్థానములకు
నిపుడపోయి యాకి • రీంద్రు గర్వమడంచి భువనములకు సౌఖ్య • మును ఘటింతు.

— ఈశ్వరుఁడు యజ్ఞవరాహంబునకు నీతి నుపదేశించుట —

క॥ అనిపలికి చంద్రశేఖరుఁ డనిమిషలోకంబు లెల్ల నవక్షస్థలికిన్
బనిచి సవనకోలంబున్ గనుఁగొనియెడు వేడ్క మదిని గడలుకొనంగన్.

తే॥ త్రిపురదానవవధ సేయు నపుడుబూని నట్టి యట్టహాసంబునె యవధరించి
యజ్ఞకోలంబుచరియించు నాప్రదేశమున కరిగె శూలపాణి సమ్మదముతోడ.

తే॥ అన్వేషణంబునఁ జని శంభుఁ డాత్మలోన నేయుపాయంబుచేనైన నీకిరీంద్రు
నుపశమింపఁగఁజేయుట యుచితమనుచు నెంచి యాతని కిటుల వచించెనపుడు.

మ॥ అమలాచార! యిదేటిధర్మమగు దృశ్యాదృశ్యమౌ నీ ప్రపం
చము రక్షించెడు భారమూని విమల స్వాంతుండవై సంచరిం
చు మహాత్ముండవు నీవెయిట్లు జగముల్ క్షోభింపఁగాఁజేయుట
క్రమమంచున్ దలపోయకున్నయెడ మార్గంబెద్ది లోకాళికిన్.

క॥ తన కధికారము లేదని యనుచిత కర్మములఁ జేయు టనర్థంబగునే
వినవె యసత్కార్యంబున ననయము నరకాధివాస మందునటంచున్.

క॥ తెలిసియొ తెలియకయో నీ సలిపిన దుర్ణయము లోక సంతానంబున్
గలఁచె నికనైన నీయుజ్జ్వలరూపము సంహరించి శాంతుఁడవగుమా?

—యజ్ఞవరాహ మీశ్వరుఁ దిరస్కరించుట—

క॥ అని పలుకుటయును వెన్నుఁడు మనమునఁ గినుకన్ వహించి మండిపడుచు ని
ట్లనియెను ఘుర్ఘురమనియెడు ధ్వని దిక్చక్రంబు లెల్ల బాధింపంగన్.

క॥ ఎవ్వఁడవు సాధ్వసము లేకివ్విధమున నేగుదెంచి యిట నెంతేనిన్
జివ్వకుఁ గాల్ ద్రవ్వెదు దవుదవ్వుల నిల్వఁబడి యధిక దర్పం బలరన్

చ॥ నను సకలావనీశ్వరున నంతగుణాబ్ధి రమేశుఁ బూరికిన్
గొనక యెదోవచింప దొడి కొంటివి నీ చతురత్వమేమనన్
జను నెవఁడైనఁగాని తన శక్తియు నన్యుల శక్తియున్ గనుం
గొనక వృథాప్రసంగములఁ గోల్పడునే నిజగౌరవంబిలన్.

క॥ ఈ రేడు జగంబులయం దేనీ కన్న నితరు లీగతి నాకున్
గోరి హితభోగ చేసెడు వారలు చాల్చాలు మారు వలుకకుమింకన్.

చ॥ కనవె యవక్రవిక్రముఁడు కాంచనలోచనుఁ డెట్టులాహవం
బున నను మోహరించి పోలి వోయెనో యంతటివాఁడె యట్టుల

య్యెను నినువంటి స్వల్పుఁడికి • నేమగునో పరికింపకివ్విధం
బున నిటు లాజ్ఞసేయుటకుఁ • బూనెదు వెఱ్ఱివో యేమొ చూడఁగన్.

వ॥ అని యతిక్రాంత మర్యాదుండై పలుకు వెన్నునిపలుకులకు మనంబునఁ గినుకయు నబ్బురంబును జెంగొన మినుసికవేలుపు ఘనంబగు కోపంబు పెంపున నీతండు దండంబునంగాక సామంబున శాంతింపఁడని నిశ్చయించి త్రిశూలంబునఁ గ్రుచ్చుటయు నవ్వరాహంబున నిజశరీరంబు దొలంగి వెన్నుఁడై నిలిచి

— విష్ణువు శంకరుని ప్రార్థించుట —

చ॥ అనఘ భవన్మహత్త్వ మిసు • మంతయు నైన నెఱుంగ లేక నా
యొనరిచినట్టి దోషముల • నోరిమి సైఁపగదయ్య ధాత్రి దు
ర్జన సహవాసమూలమున • సజ్జనుఁడే చెడునన్న యట్టులీ
దనుజుని రక్తపానమునఁ • దామసమూని యిటుల్ చరించితిన్.

తే॥ ఎన్నియవతారములు లోఁదాల్చియున్న యప్పుడిట్టులనె నా యొనర్చెడి • యెల్లలోక
ములను సవరించితివి జగం • బులకు నీవ పోషకుండవగుటఁ జేసి • పురనిహన!

చ॥ ఇతఁడు జగంబులన్ గలఁచె • నెంతయు దర్పముఁబూని వీని యు
ద్ధతి హరియించుటెల్ల • నుచితంబని యెంచక నాయెడన్ గృపా
మతివయి యాదరింపవె యు • మాధవ భక్తుల సేయు దోష సం
తతి సవరించు కర్జము స • తంబును నీయెడనుండు నేకదా!

తే॥ తెలిసి తెలియక నాచేయు • కలుషమెల్లఁ దొలఁగిపోయెడి విధమున • దుష్టమై
కోలరూపంబుఁ బాపి యీ • లీల నాకు జ్ఞానమున్ గూర్చితీవు స • న్మానివిమల.

క॥ వసుధోద్ధరణంబునకై వెసఁ గిరిరూపంబుఁబూని • విబుధారిని గూ
ల్చ సరగ దంష్ట్రియనెడు నాఖ్య సకలమెఱిఁగెడి విధానఁ • గాంచితివిటులన్.

—• శివుడు యజ్ఞవరాహ దంష్ట్రి దాల్చుట. •—

క॥ లోకార్తిన్ బాపఁగ వహోరా హకారుఁడవైన నాయ • హంకృతి నెల్లన్
బోకార్చితివీ దంష్ట్రిన్ గైకొని దంష్ట్రియను పేరుఁ • గాంచుము నీవున్.

చ॥ కినియఁగఁ జేసియేనియును • గీర్తనఁ జేసియునైనఁ దాడనం
బొనరిచియైనఁ బాదముల • నొత్తుచునైన ధనంబొసంగియై

నను గ్రీయమాచరించియయి • నన్ బ్రతివాదముసల్పియైన నో
మునిజనసేవితాంఘ్రి నిను • బొందుట శ్రేయము భక్తపాళికిన్.

క॥ కిరినైచరించుకతనన్ బురహర నీ దివ్యరూప • ముగ్ గన్గొని దు
స్తరమగు మోహముఁబాసితి నిరతము సంతోషవార్ధి • నెగడుదు నింకన్.

ఉ॥ జ్ఞానమె మోక్షదాయకము • గా బుధులెల్ల వచింతురట్టి సు
జ్ఞానములేక నేనిటుల • గర్వమునన్ జరియింపనే దయన్
బూని మసీయ తామసముఁ • బోనడగించితివట్టి నీదయన్
మానక నాయెడన్ నిలుపు • మా నిరతంబు శశాంకశేఖరా!

క॥ అని పలువిధములఁ బ్రార్థించిన భక్తావనుఁడు చంద్ర • శేఖరుఁడను నో
వనజాక్ష నీవినయమునకును భక్తికి సంతసంబు • కూడె మనమునన్

సీ॥ సకల చరాచర • జంతుజాలంబు నా యెడనె సతము జని • యించుచుండుఁ
గావున వానికిఁ • గావించు నపకార మెదియేనిచెందు నా • కేధరిత్రి
నది యెఱుంగక యెవ్వఁ • డైన స్వాహంకృతిఁ గలుపంబొనర్చుఁబో • కనలివా
దక్షణంబ వధించి • ధర్మువు స్థాపించు టుచితకృత్యంబయి • యొప్పునాకు
నీనియమమువీడి • నిఖిలలోపంబుల కార్తిఁగూర్చుచుంటి • వట్టులగుట
నిటుల నీతమంబు • నెల్లఁ బాపితిఁ జనా నందమనుభవింపు • నళిననేత్ర!

తే॥ ధరణి నుద్ధరింప • దంష్ట్రివైతివి నీవు నీదప్రార్థనమున • నేద్వవీయ
దంష్ట్రిదాల్చి యింక • దంష్ట్రివగుదు నన్ను దంష్ట్రియనుచుఁగొల్వఁ• దగుబుధులక

చ॥ అని కరుణాతరంగిత మ • నోంబుధియై యుడు రాజమౌళి య
వ్వనరుహనేత్రుఁబల్కి పరి • వారయుతుండయి రౌప్యభూధరం
బునకరిగెన్ రమాపతియుఁ • బూతచరిత్రుడనైతినంచు వేఁ
జనియె వికుంఠపత్తనము • సంతసమ్మడిగాఁగ నెమ్మదిన్.

క॥ ఇది యెల్లధర్మువుల కాస్పదము కలుషనాశకంబు • సకలార్థద మిం
పొదలు సవఁకోలచరిత మునితాత్మకులై పఠింప • ముక్తిలభించున్.

వ॥ ఇటియభగవంతుండగు రజతాచలవాసుండు దంష్ట్రియని పిలువఁబడుటకుఁ గారణ
బని సూతుండు పలుకుటయు.

ఉ॥ భానుసహస్రతేజ! పుర • భంజన సద్గుణసాంద్ర నిర్మల
జ్ఞానమయా! సమస్తముని • కాండమనోంబుజ మధ్యవాస స
న్మానిత దివ్యరూప! నిగ • మ ప్రకరార్చిత పాదసంతత
ధ్యానవశీకృతా! సకల • దాన సమర్థ సురాసురేశ్వరా!

క॥ అక్షయమోక్షప్రద! మీనాక్షీహృదయేశ! యాత్రి • తావనదక్షా!
దాక్షాయణీశ మదనవిపక్షా! వాహీకృత ప్ర • బల సుమహోక్షా.

క॥ మత్కృతి కన్యాకృత నుతి సత్కృత! నందీశగోత్ర • సౌఖ్యప్రద ! ధీ
మత్కృతకావ్య సహస్ర చమత్కృతి వినుతామహేశ • మామక సేవ్యా.

తే॥ కష్టపడి పెంచి యిడితి నా • కవితకన్నె నెవిధంబున నలరింతో • యింక నీవు
గంగవోలెను గయ్యాళి • గాదు బేలసుమ్మ నీ తలనెక్కి • నాట్యమ్ము సేయ.

సీ॥ ఏమహామహుఁడు శ్రీ • వేమనారాధ్యవంశాబ్ధికిఁ బూర్ణ శ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి • కేనయై సతుల్ మెచ్చ మహిని బాతివ్రత్య • మహిమఁగాంచె
నట్టి నందయకు గౌ • ర మకుద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోదరుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మహీయ మగు శ్రీమ దాంధ్ర లింగపురాణ పూ • ర్వార్ధమందు
నరయ నాఱవయాశ్వాస • మయ్యెఁగరుణ నతము దీనిని రక్షించుఁ • జంద్రచూళి.



శ్రీ మీనాక్ష్యై నమః

# శ్రీమదాంధ్ర లింగపురాణము

## పూర్వభాగము

### సప్తమాశ్వాసము

లింగపురాణవినుత సర్వాంగా! నృహరీంద్రభంగ! • యాగ్యాహృత వా
మాంగా! సమస్తనిగమ తురంగా! శరభాంగగజత • రంగా! లింగా!.

అవధరింపుమా నైమిశీయులు ప్రహృష్టాంతరంగులై యఘ సంహారకారణంబులగు నెన్నియేని యీశ్వరచరిత్రంబులు వక్కాణించి మాకానందంబుఁ గూర్చిన మహానుభావుండవు నీ కోవిదత్వంబు వర్ణింప నలంతుల కలవియే? నిఖిల పురాణకర్తయగు వ్యాసమునీంద్రున కత్యంత ప్రియుండవగుట నీకుఁదక్క నీ పవిత్రకథావక్తృత్వం బన్యులకు సాధ్యంబుగాదు. మున్నొకప్పుడు ప్రసంగవశంబున హిరణ్యకశిపుఁడను దానవనేతను నారాయణుండు నృసింహరూపంబున సంహరించి యూర సంకక లోకంబు నేఁచఁదొడంగిన హరుండు శరభావతారంబున నృసింహదేవుని నిగ్రహించెనని పలికితి వాకథ యెట్టిదని తెలింగింపుము. నావుఁడు సూతుండు వారల కిట్లనియె.

కలుషహరంబె యీ కనక • కశ్యపుసచ్చరితంబు వీని నే
పలుకఁగ విస్మరించి యొక • పద్ధతి మెట్టితి మీరలెల్లఁ బ్రా
జ్ఞులగుటఁజేసి యిప్పు డిది • గోయని హెచ్చరికన్ ఘటించినా
రలు మిమువంటి శ్రోతలు క • రంబు లభించుట పూర్వపుణ్యమా.

### — దితి సంతానార్థంబు కశ్యపుని వేఁడుట —

దక్షప్రజాపతి • తన యదితి యనెడు వనజాక్షి సంతాన • వాంఛఁ జేసి
తన నాథుఁడగు కశ్య • పునిఁ గాంచి మహాత్మ నాతోడి సవతులం • దఱు ద్వితీయ
కరుణాకటాక్షంబు • కలిమి గర్భంబులఁ దాల్చి యుత్సాహ వ • ర్తనలగుచును
మెలఁగుచు నున్నారు • మిన్నంది వారలకడకుఁ జనుటయున్నఁ • గలుగుసిగ్గు

కాన నాకుఁగూడఁ ♦ గనికరంబున సంతుఁ గలుగఁజేసి నన్నుఁ ♦ గావఁగఁదగు
దీనురాల వేర ♦ దిక్కెది నీకన్న సతికిఁ బతియె కాదె ♦ సర్వమిలను.

క|| దీపంబుకతన వేరొక దీపంబుదయించి భవన ♦ దీపక మైన
ట్లే పడఁతియందుఁ బురుషుఁడు తాపత్రయమును హరించు ♦ తనయుఁడు గనగన్.

చ|| స్మరశర పీడితాత్మ యయి ♦ సత్కులసంభవ సాధ్వియౌ మనో
హరి తన చెంతఁజేరి విన ♦ యంబున సంతతిఁ గూర్పు మన్న న
త్తరుణి మనోరథంబు నుచి ♦ తక్రియఁ దీర్చుట యర్థమౌఁగదా
పురుషునకేల సంశయముఁ ♦ బొందెదు నా ప్రణయంబుఁ దీర్పుమా?

తే|| తమ పితృ పితామహులకు సద్గతులఁ గూర్పఁదలఁచియేగాదె సాధుసం ♦ తతిగన్నతి
సాధ్వులగు కామినులయందు ♦ సంతసమున వరసుతులఁబడయఁగఁగోరు ♦ మను సతంబు.

క|| వినయవతియుఁ బతిదేవత యనురక్తయు నైన కాంత ♦ యందుఁ గలుగు పు
త్రునికతనఁ గాదె వంశం బనఘంబై కీర్తిఁగాంచు ♦ ననవరతంబున్.

క|| పతికరుణకుఁ బాత్రంబగుసతి యిహపరసౌఖ్యములును ♦ శాశ్వతకీర్తిన్
స్తుతచారిత్ర్యముఁ గాంచి విగతదురితయగుచుఁ జెలంగుఁ ♦ గలకాలంబున్.

మ|| ఫలభారానతవృక్ష సంకలితమౌ ♦ భవ్యాయనంబున్ బలెన్
గులమెల్లన్ స్తుతిపాత్రమై బుధశిరః ♦ కోటీరరత్న ప్రభో
జ్జ్వలమై శాశ్వత కీర్తిఁ గాంచునుగదా ♦ చంద్రార్కమున్ బుత్రవ
ల్లల నా సంగతి నీకు సందియమికే ♦ లా? నన్నుఁ గావంగదే.

క|| అని బహువిధముల వేడినఁ దన సతి ప్రణయంబుఁ దీర్పఁ ♦ దగునంచు మనం
బున నిశ్చయించను బతియను ననునయ మొప్పఁగాఁ గృ ♦ పార్ద్రుఁడగుచున్.

చ|| వనజదళాక్షి నిక్కమె ♦ పల్కితి వీవనురక్తయైన కా
మిని తనచెంతఁజేరి మతి ♦ మీఱిన యుత్సుకతన్ సుతార్థమై
వినయమునన్ మెలంగఁగ వి ♦ వేకము గల్గిన యెట్టివానికై
నను సతి నాదరించుటయె ♦ న్యాయమటంచు వచించు శాస్త్రముల్.

వ|| తైలపూరిత పాత్రస్థమగు దీపికాసహాయంబునఁ దత్పదార్థజ్ఞానంబు నొంది యంధ
కార భయంబు వీడునట్లు పురుషుం డుత్తమ కాంతాసంగమంబున వంశదీపకుఁడగు
పుత్రుఁబడసి భవపాశంబులఁ ద్రెంచు.

క|| పడఁతీకులవర్ధనుఁడగు కొడుకున్ బడయంగఁ మదినిఁ ♦ గోరి యించటి కి
ష్టము వచ్చితి నీ ప్రణయంబునుగక దీర్చుటయె నాకు ♦ నుచితంబయ్యెన్.

చ॥ సతియిది సంధ్యయొక్క త్రుటి • నైపుము శంభుఁడు భూతసంచయా
న్వితుఁడయి నందికేశ్వరుని • వేడుక నెక్కి చరించు నెల్లెడన్
ఱతికి నిషిద్ధకాలమిది • రాక్షసకృత్యముగాన నీదు వాం
ఛితము ఫలించునే బుధులు • ఛీ యనరే నినుఁగూడినన్ ననున్.

క॥ సారవిహీనంబగు సంసారంబున భ్రాంతివీడు • చాతుర్యము లే
కూరక చరించు పురుషుని తీరున బ్రిమ్మరుట దగునె • ధీరుల కెందున్.

క॥ అనుచితమగు కాలంబున నొనరించిన కార్య మెట్టి • యుత్తమునకైనను
దుష్ఫలంబుఁ గూర్చును వనితా! శాంతంబుఁ దాల్చి • వర్తిలుమింకన్.

ఆ॥ కల్లజగం బెసమ్మకొని • కాలుని కృత్యముఁగూర్చి యింతయే
నుల్లమునన్ దలంగకిది • యోగ్య మయోగ్యమటన్న తెల్వి లే
కల్లెడ సంచరించు ప్రజ • యేమగునో తుద నీ వెఱుంగుదే
పల్లవపాణి యిట్లు బల • వ్రతము సేయుట నేస్తగా కిటన్.

మ॥ వరభూషాంచిత దేహవల్లరియు ని • ర్వ్యాజానురాగాత్మయున్
బరమోత్సాహపరీతయున్ స్మరకళా • ప్రావీణ్యసంపన్నయౌ
సురసీజానన చెంతఁ జేర నిదియే • సౌఖ్యాకరంబంచు నెం
చి రమింపందగునే యకాలమున • దుశ్శీలంబు శ్రేయంబొకో.

క॥ తనయంత వలచివచ్చిన వనితామణి నాదరించి • వాంఛితమును దీ
ర్చని మగని సౌఖ్యమరపడు • వని యొఱుగుదునైన నేమియసమయమందున్.

తే॥ తన కనర్గమైన • తఱి నెట్టి దాతయే నర్థి వాంఛితంబు • నరపడంగఁ
జేయఁగాని తీర్పఁ • డో యింతి యింతమాత్రమున వగలఁ భోగలఁదగునె జగతి.

ఆ॥ ఎన్నఁడులేని యాత్రమిపు • డేటికిఁ గల్గెనొ నీకు నిట్లు లా
పన్నతనొందదేల యతి • వా యొక మూర్తము నైతు వేని నీ
కెన్నివిధంబులన్ బ్రధితులైన సుతుల్ జనియించి సంతతా
భ్యున్నతిఁ గాంచిమింతు రది • యో వచియించుటగాదు నమ్ముమా?

క॥ అని కశ్యపుడు నిషేధించినఁ గామోద్రేకము నను • జేసి దితియు నా
తనిఁ గౌగలించె నెవఁడైనను మదనశరాళికోర్చు • నా వసుమతిలో.

వ॥ అట్లు దితి దురదృష్టంబు ప్రేరేప మనోనాథుని వాక్యంబులఁ దిరస్కరించి బలాత్కారంబున నాలింగనముఁ గావించుటయుఁ గశ్యపుండును మోహంబు దాఁటనేరక తదధీనుండై కులకాంత నేకాంతంబునఁ జేర్చి యామె యిష్టంబుఁ దీర్చి పశ్చాత్తప్తుండై యిట్లనియె.

మ॥ తరుణీ! నా యుపదేశమున్ వినక చి • త్తస్థైర్యమున్ వీడి పో
మరునిన్ బోలె బలాత్కరించి విలపిం • పన్ జెల్లునే యిట్టి దు
ష్కరకార్యాచరణంబునన్ గలుగు నీ • గర్భంబునన్ లోకభీ
కరులౌ పుత్రులు సంభవించెదరు ని • క్కంబిద్ది ముమ్మాటికిన్.

క॥ తానెఱుఁగకున్న నితరులు జ్ఞానము బోధింప వినక • గర్వించెడు నా
మానవుఁ డజ్ఞానహతుండై నానా బాధ లొందు • నన వినవొక్కో.

క॥ నినుఁగుఱించి యిపుడు నా సల్పిన యుపదేశంబులెల్ల • వెసఁజనిటి కాలం
బున నిడిన విత్తనములట్ల నిరర్థకములై యనుచుఁ ద • లంపఁగ వలసెన్.

వ॥ ఎట్టి మతిమంతులకైనను దుష్కాలంబు ప్రాప్తించినప్పుడు బుద్ధిపూర్వంబుగ నధర్మం
బాచరింపక తప్పదు. ఇందు నీదోషంబు లేదు. పూర్వసంచితంబ యింతకుం
గారణంబై మనకిట్టి దుర్బుద్ధిఁగల్గించె. విచారించిన ఫలంబేమి? ఇపుడు నీ కావించిన
దుష్కృత్యంబునన్ జేసి నీ గర్భంబున లోకకంటకులును హరిభక్తి దూరులును
నగు సుతు లిరువురు జన్మింతురు కామ్మనిన దితి చింతాకుల స్వాంతయై నిజనాధున
కిట్లనియె.

మ॥ అనఘా నీవు మహానుభావుఁడవు పు • త్రార్థంబు నిన్నాశ్రయిం
చిన యర్ధాంగికి సద్వరంబిడుటయే • శ్రేయంబగున్ గాని లో
కనికాయంబును బాధసేయు సుతులన్ • గల్పింపఁగాఁ జెల్లునే.
తనయుల్ దల్లికిఁ దండ్రికొక్కటియగా • దా వేరుగానుందురే?

చ॥ తనయుల కారణంబు మెయి • ధాత్రిని గల్గు సుఖంబు దుఃఖమున్
గనదురు కీర్త్యకీర్తియు న • గౌరవమున్ మఱి గౌరవంబు క
ల్గొనఁ దలిదండ్రు లిర్వురను • గూడును గాని గణింప నొక్క మా
తనె వెసఁజెందియుండదు గ • దా యని యింతఁ దలంపవైతివే?.

తే॥ తక్కఁగల నా సపత్ను లం • దఱును సాధువర్తనులగు సుతులఁగని పఱలుచుండ
నేను లోకకంటకులగు • హీనమతులఁ గాంచి యేవిధంబున సంచరించుదాన.

క॥ కులముద్ధరింపఁగల పుత్రులఁబడయఁగ నేర్తునని య • త్యాశలమున ని
న్నలఘుదయాంబుధిఁ జేరి విఫలలిప్సనయితిని నాదు • బ్రతుకేమిటికిన్.

చ॥ కులమున కప్రతిష్ఠ నొసఁ • గూర్చెడి సంతతిఁ గాంచి లోకనిం
దలఁబడియుంటకన్న వని • తామణి వంధ్యయె యైన మేలగున్
అలితరసాలసాలము ఫ • లంబుల నీనక కుక్కమూతిపిం
డెలఁగని కీర్తిఁగాంచునె ను • తింపను నే సరివారిలోన్ నిలన్.

చ॥ ఘనుఁడు మహానుభావుఁడగు ◆ కశ్యపుఁ డుత్తములైన పుత్రులన్
గను తలఁపూనినట్టి కుల ◆ కామినికిన్ దితి కేల దుష్టులౌ
తనయులఁగూర్చెనంచు వసు ◆ ధన్ గలవారలుబల్కు నెవ్విధిన్
విని మననేర్తునో చెపుమ ◆ విశ్రుతకీర్తి యిదేటి పాపమో?.

వ॥ అని దీనవదనయై పలుగతులఁ పలుకు కులాంగనపలుకు లాలకించి కశ్యపుఁడు దేవీ నీవాక్యంబులు యదార్థంబులెయగు నైనను సంతానంబున కనుచితంబగు సమయంబునఁ గామోద్రేకంబునఁజేసి నా యిష్టంబుఁగోరకయ నను గలిసితి వక్కారణంబుఁజేసి నీ గర్భంబున జన్మించు పుత్రులు జగద్భయంకరులై సాధుహింసకులై హరి విరోధులై చరించి నారాయణునిచే నిహతులుగాక తప్పదు. ఇందుల కేనేమి ప్రతి సేయఁగలవాడనయినను.

మ॥ జలజాతాయత నేత్ర నీ కడుపునన్ ◆ జన్మింపఁగానున్న పు
త్రులు జేజేలఁ గలంచువారయిన నం ◆ దున్ జ్యేష్ఠుఁడౌవానికిన్
గలుగున్ భాగవతోత్తముండు హరిభ ◆ క్తవ్రాత సంతాన ము
జ్వలతేజోనిధి వంశపావనుఁడు ని ◆ ర్వ్యాజప్రసంగుండిఁకన్.

క॥ అనఘుఁడగు నతనిమూలంబున రక్కసివంగడంబు ◆ పూతంబగునో
వనజాయతాక్షి యిఁకఁ జనుమని కశ్యపుఁడరిగె శ్రుతి హి ◆ తాచరణముకై.

— దితిదుష్టసంతానప్రాప్తిఁగూర్చి చింతించుట —

చ॥ దితియుఁ ద్రపానతాస్యయయి ◆ దీనతచేఁ, దనకట్టి దుష్టసం
తతి జనియింప నుంటకు మ ◆ నంబు ఘనంబగు దుఃఖసంచయా
న్వితమయి యేమియున్దెలియ ◆ నేరక స్థాణువువోలె నుంటఁజే
సి తన యకృత్యమున్ గుఱించి ◆ నీ యనుచున్ విలపించు నిట్టులన్.

ఉ॥ నాకు సపత్నులైన లల ◆ నామణులందఱు సాధులోక సౌ
ఖ్యాకరులైన పుత్రుల మ ◆ హామతిమంతులఁ గాంచిమించ నే
నేకగణిన్ భయంకరుల ◆ హీనుల వేల్పుల కెగ్గుసేయు ప
ల్గాకుల పుత్రులన్ గని సు ◆ ఖింపఁదు దాననొ సిగ్గులేకిలన్.

ఉ॥ కంతుని నాడి కోలలకుఁ ◆ గాసిలి తెల్వియొకింత లేక నా
కాంతుఁడు కూడదంచు నొడి ◆ కంబునఁబల్కుచునున్నఁగాని మ
త్స్వాంతము నిల్పలేక రభ ◆ సంబున నాతనిఁగూడి దుష్టమా
సంతతిఁగూర్చు గర్భము వె ◆ సన్ దరియించితి నేమిసేయుదున్.

మ॥ బలవంతంబుగ నాయొనర్చిన మహా ♦ పాపంబు నాయందు నే
ఫలియించెన్ దురపిల్లినన్ దఱుఁగునే ♦ వాల్లభ్య సంప్రాప్తయా
కలుషం బన్యులతోడఁ జెప్పఁదగునే ♦ కాముండు ప్రేరించినన్
దలఁగన్ శక్యమె యెట్టివారికిని ని ♦ త్యస్థైర్యమున్ బూనుచున్.

తే॥ తొలినొనర్చినపున్నెంబు ♦ కలిమిమంచి కొమరుఁబడయఁగ నేరక ♦ కొలలమునిఁగి
వంగసము నగయొనరించు ♦ వనిత బ్రతుకు బ్రతుకె యద్దాని సిరులెల్ల ♦ వితముగాదె.

చ॥ విడువక గొల్చు లెంకలును ♦ వేడుక లేన్గులు దేర్లు మావులున్
దొడుసులు మేడలున్ గలిమి ♦ దొడ్డతనంబును గుందనంబు మే
ల్తొడవులు నెన్నిగల్గియును ♦ తోఁపుహాళినిగూర్చు పట్టి యొ
క్కఁడయిన లేనిచో నడవిఁ ♦ గాఁచిన వెన్నెలగాదె యంతయున్.

సీ॥ కులము పెంపొనరించు ♦ కొడుకుఁ గాంచనిదానియుడివోని సిరులెల్ల ♦ నడవికాలు
కొలలఁబాపెడి కాన్పు ♦ నెలమినొందని పంద చెందిన పుట్టువు ♦ చెడుగుపట్టు
పగతుర వెతఁబెట్టు ♦ పట్టి బెంచని కాళ్ళ వేడుకల్ దరిలేని ♦ గోడుగీము
లిందునందున సౌఖ్య ♦ మందఁజేసెడి చూలిఁబడయని వెత్తి పె ♦ న్గడిమివమ్మ,
తల్లిదండ్రుల ఋణమును ♦ దాఁటిహాళి బొందుపఱచెడి శిశువును ♦ బొందనట్టి
దోసకారి పుటుకకన్న ♦ దొడ్డకాన బ్రామయిన మెకమయినను ♦ మంచిగాదె.

క॥ పితృదివసంబుల సంధ్యలఁ గ్రతుసమయంబులను గ్రహణ ♦ కాలములందున్
పతి కినిసినయట్టితఱిని రతిసల్పిన గాత్మసాళి ♦ రహిఁ జన్మించున్.

వ॥ అని బహువిధములఁ జింతించి తన మనంబున.

క॥ కులనాపకులగు పుత్రులు గలుగుదురను చింతచేతఁ ♦ గాసిలకుండన్
గులదీపకుఁడగు పౌత్రుఁడు గలుగుననుచు వరమొసంగెఁ ♦ గాంతుఁడు నాకున్.

క॥ అని యొక్కగతి మనశ్శాంతిని గల్గించుకొని యట్లు ♦ దితియును బౌత్రా
ర్థిని యగుచు గర్భభారంబున నలసత్వము వహించి ♦ పొరలుచునుండెన్.

వ॥ కశ్యపవీర్య సంభరితంబగు దితి గర్భంబు దినదిన ప్రవర్థమానమగుచు దుస్సహంబై
తిరస్కృతాన్య తేజంబై యుండఁ గ్రమంబున శతవర్షంబులు గడచె నంత.

ఉ॥ ఆ లలితాంగిగర్భకుహ ♦ రాంతర భాగమునుండి విస్ఫుర
ల్లీలఁ గృశానుభాస్కరుల ♦ తేజములెల్లఁ దిరస్కరించుచున్
హాలహల ప్రభాపటల ♦ మట్టుల భీకరమైన యొక్క తే
జోలత యప్డు వెల్వడియెఁ ♦ జూపఱ గుండెలు తల్లడిల్లఁగన్.

చ॥ అదిగని శంకితాత్ములయి ♦ యాదఱు వేల్పులిదేమి సాధ్వసా
స్పదమగుచున్ మహాప్రళయ ♦ భానుసహస్రము వోలెఁ దాపసం

పదవెలయించుచుఁ జగముఁ • బర్వెడు దుస్సహమెుక్క తేజ మి
య్యదను దీని నైంచు టెటు • లక్కట మార్గముఁదోఁచ దింతయున్.

క॥ అని చింతించుచు వనజాసను పాలికిఁ జేరఁబోయి • స్వర్లోకసుల
య్యనఘాత్ముతోడ నివ్విధమునఁ బలికిరి నయభయము • ముప్పిరి గొనఁగన్.

వ॥ దేవా! నీవు సర్వాంతర్యామివి చరాచరంబగు జంతుజాలంబు నీయంద జన్మించు చుండు భూతభవిష్య ద్వర్తమానంబులగు కాలంబులెల్ల నీ యాజ్ఞ మెలంగు నీ యెఱుంగని యర్థంబీ ప్రపంచంబున నొండు గలుగునే. అవాఙ్మానసగోచరుండ వగు నీవు రజోగుణంబూని సృష్టికార్యంబు నిర్వహించుచుందువు. సమస్తవిద్య లును నీయంద యన్వయించి సార్థకంబులగు భౌతికంబగు ప్రపంచము రక్షించుట నీ కృత్యంబుగాదె. అతిలోకంబై దున్నిరీక్ష్యంబైన యిమ్మహాతేజం బెక్కడిది? ఏమికతంబునఁ బ్రభవించెను. ఎట్లు బరిణమించును. ఏతత్తాపంబునకుఁ బదునాలుగు లోకంబు లడరుచున్నయవి. దీని నుపశమింపఁజేయు మార్గంబెఱింగించి మాదృశుల రక్షించుట నీకు ధర్మంబు అల్పజ్ఞులమగు మాకే యిప్పట్లు జీవలోకంబుఁ బ్రోచుట యవసరంబని తోఁచిన నీ విషయం బేమనిచెప్పవలయును? మహానుభావుండవగు నీ వియ్యెడల నుదాసీనుండవైన గతి యెద్ది? నావుఁడు హిరణ్యగర్భుండు వారల కిట్లనియె.

—బ్రహ్మదేవుడు సురలకు హిరణ్యాక్ష హిరణ్యకశ్యపుల జన్మ ప్రకారము జెప్పుట—

చ॥ సురవరులార మీకిటుల • స్రుక్కుచుఁ బల్కఁగనేల యిట్టి దు
ర్భరమగు తేజ మెల్లెడలఁ • బ్రాకుచుఁ దాపముఁగూర్చు కారణం
బరసితి నాలకింపుడు మ • హామతిమంతులు మీకుఁ దెల్ప కే
కరణిని డాఁగురింతును జ • గంబులఁ గాఱియవెట్టు నీ కథన్.

చ॥ సనకసనందనాది ముని • సత్తము లాగమపారగుల్ కృపా
వననిధు లిద్ధతేజు లప • వర్గ నిరూఢమతుల్ జగత్త్రియీ
వినుతచరిత్రు లార్యులు వి • వేక ధురీణులు శర్వపాదప
ద్మ నిరతులై చెలంగుదురు • మత్తనయాగ్రణు లెల్లకాలమున్.

ఉ॥ వారలు వీతరాగులు ప్ర • భాయుతులై పరమేశ పాదసే
వారతులౌచు సంతతమ • వారితరీతి సమస్తలోక సం
చారముఁ జేయుచో నొకప్పుడు • సర్వజగత్పరిపోషణ క్రియా
ధారు రమామనోహరుని • దర్శనముం బొనరించు కోర్కెమై.

చ॥ కనుఁగొనిరొక్కచో నరిగి • కాంచన చిత్రితరత్న తోరణం
బును హరినీలసంకలిత • భూరిశశాంకమణీ మనోజ్ఞ క

ద్యనికరముఁ గవియత్తులిత • హారి సుధాకృత సౌధభాగముఁ
మునిజనవాంఛితంబు హరి • ముఖ్యపదంబు విశుంఠ ధామముఁ.

వ॥ అట్లుగని తద్దివ్యపదంబు మెట్టువారలై,

సీ॥ ఇప్పురంబు ననగా • దే గాధికామనోహారియా మన దితి • జారియుండు
నిచ్చోటనేగదా • యిందిరాసుందరీ మోట్టాయితములకు • మరియు వెన్నుఁ
డియ్యెడలనెకదా • యెల్లభద్రంబుల కాటపట్టగు జల • జాత్ముఁడలరు
నిప్పరమంద కా • దె వైష్ణవాగ్రేసరులు హరిభజనంబు • సలుపుచుందు

రిటనె కాదె సమస్తలో • కేశ్వరుండు నిర్గుణస్వరూపుండు ని • ర్ణిద్ర తేజుఁ
డప్రమేయుండు శాంతుఁడవ్యయుఁడు భ క్తసులభుఁడై కనఁబడుమధు, సూదనుండు.

మ॥ అనఘుల్ కేశవపాదపద్మ మకరం • దాస్వాదన ప్రక్రియా
న్మనులుద్యద్ధరిచిహ్నసంయుతులు చిం • తావర్జితుల్ ఘోరపా
ప నిహంతల్ భవపాశమోచకులు స • ద్వ్యాపార పారీణులౌ
ఘనులిచ్చోట వసింత్రు విష్ణుఁగొలువం • గాఁ గోరుచుఁ నిత్యముఁ.

ఉ॥ భ్రాంతిపరీతచిత్తులయి • పాపభయం బిసుమంత లేక య
శ్రాంతము దుష్టసంచయము • సంగతిఁగోరుచు లోభులై మన
శ్శాంతిని వీడి త్రిమ్మరుచు • సర్వముఁ దా రెభరించు పోల్కి న
త్యంతము పల్కు పామరజ • నావళి కియ్యది దూరమై తగుఁ.

క॥ తన యధికారమదంబున వనదలవంచింపఁ దలఁచునట్టి కలుష చి
త్తున కీ పుణ్యపదం బిలఁ గనఁగొన దూరమయియుండుఁ • సలకాలంబుఁ.

చ॥ తన నివసించు వీడు సుర • ధామముగాఁ దనసేయు సేవ సే
వ నిఖిలభూమిభృన్ముకుట • పాళిమణీకిరణౌఘరంజితం
బున్నగు సురాధిపత్యముగ • మూఢుఁడునై తలపోయుచుండు దు
ర్జనునకు నిప్పురంబు జొర - రాదు నిరస్తతమంబు గావునఁ.

సీ॥ తనసేయు నిత్యకృ • త్యంబు నానా నూరిమండలికి ముకుట • మండనంబు
తన యాచరించు వ్య • ర్థప్రలాపము శిష్యసంతానమునకు శా • స్త్రప్రచయము
తన చూపువట్టి నా • తనమార్గమఖిల ప్రపంచాభివృద్ధికిఁ • బ్రాపకంబు
తన యిచ్చు నర్థ మిం • తయును మార్గణగణ దారిద్ర్యసంహార • కారణంబు

తన పలుకుమాట ధర్మ సం • స్థాపకంబు తన బ్రతుకు సర్వజంతు సం • తతికి బ్రతుక
టంచుఁ దలఁచుచు జనుల వం • చించు ఖలున కిమ్మహావిశుంఠము సుల • భమ్ముగాదు.

వ॥ అట్లు దలంచుచు, కలుషసంహారకారణంబగు వైకుంఠంబు సుఖప్రాప్తంబయ్యెనని సంతసించుచు సకలలోక జేగీయమానుండగు శ్రీహరిం గాంచి లోచనంబులు సార్థకంబులుగాఁ గలవని యుబ్బుచు నగరంబుఁ బ్రవేశించి.

తే॥ భక్తిగోచరుండు • భగవంతుఁడగు రమారమణుఁ గాంచు కోర్కె రాజిలంగఁ
గక్ష్యషట్కమును వెసన్ దాఁటి యేడవ కక్ష్య దాఁటనున్న • కాలమందు.

క॥ కనదూర్ధ్వపుండ్ర కలితా ననులఁ జతుర్భుజుల నిరత • నందితమతులన్
వనమాలికా విరాజద్ఘనవక్షస్థలులఁ బుణ్య • కర్మనిరతులన్.

తే॥ వేత్రహస్తుల నిరుపుర • విమలచరితులైన ద్వారపాలురఁ గాంచి • యమ్మునీంద్రు
లరయ వృద్ధులరయ్యుఁ బం • చాబ్దములు గలట్టి బాలులవలెఁ గను • పట్టుటయును.

వ॥ ఆద్వారపాలకులగు జయవిజయులను వారు వారలఁ గాంచి యిట్టివారి నంతిపురి కరుగ నిచ్చిన మాధవునిచే మాటవచ్చుననియు నిర్భయంబుగ నేతెంచు నబ్బాలకులఁ జన నిచ్చుట తమ గౌరవంబునకు భంగకారియనియుఁ దలచినవారువోలె దారుణాంబకులై.

చ॥ అరుగకుఁడింత నిల్వుఁడు మ • హాత్ముఁడు క్షీరపయోధి కన్యకా
వరుఁడు సమస్తలోక పరి • పాలకుఁడీశుడనంతుఁ డాఢ్యుఁ డా
సరసిజపత్ర నేత్రుఁడు ప్ర • శాంతమనస్కుఁడుగా సువర్ణమం
దిరమున నున్నవాఁడతనిఁ • దేరి కనుంగొనరా దెవారికిన్.

క॥ అని పలికి వారివారించిన నమ్మునివరులు కుపిత • చిత్తులగుచుఁ గ
న్గొనలన్ రోషాశ్రుకణము లనివారితములుగఁ బలికి • రందఱు వినఁగన్.

—సనకాదులు జయవిజయులకు శాపమిచ్చుట—

మ॥ పరమేశాంఘ్రి సమర్చనాభిరతి ని • ష్ఠాపటన్ జగంబెల్లఁ ద్రి
మ్మరుచున్ వచ్చిన మమ్ము మానులను సం • భావించుటే లేక యె
వ్వరినో దుష్టులఁబల్కినట్టులుగ దం • భంబూని మీరిర్వు రీ
శ్వరునిన్ జేరఁగ నీకనిల్పిరిపుడీ • పాపంబుఁ గన్గొంటిరే?

మ॥ కలదే యెచ్చటనైన నివ్విధి నస • త్కార్యంబు తేజోమయుం
డలఘుం డీశ్వరుఁ గొల్వఁగాఁదలఁచు భ • క్తాళిన్ నిషేధింతురే
కలుషంబన్న భయంబుఁ జెందవలదే? • గర్వోద్ధతిన్ మించు భృ
త్యులు పాపంబొనరించినన్ బతులె కా • దో తత్ఫలంబొందుటల్.

చ॥ అరుగమె సత్యలోకమున • కాకమలాసనుభక్తిఁ గొల్వమే?
స్థిరమగు భక్తినయ్యుడుప • శేఖరు మ్రొక్కమె వెండికొండపై

హరిహరి యే ప్రదేశమున ♦ నైన తలంగక యిట్టి దుష్క్రియా
చరణ మొనర్చు సేవకుల ♦ జూడఁ గనుంగొని నామె యెన్నడున్.

చ॥ హరిహరపద్మయోను లస ♦ యంబు మమున్ గనుగొన్నమాత్ర నా
దరమున రండు పొండని ము ♦ దంబునుగూర్పరె తత్పదాబ్జ సం
స్మరణమె నిత్యకృత్యముగ ♦ స్వాంతములన్ దలపోసి యేమిలన్
దిరుగమె యెన్నడేని దుర ♦ దృష్టము మాయెడ నిట్లు గల్గెనే.

తే॥ ఎవఁడయేని బుద్ధి ♦ హీనుండు చెడుత్రోవ మెట్టుచుండువాని ♦ మెలఁకువలఁ
దీర్పవలయుఁగాక ♦ దేవతాసన్నిధి కరుగువారి నిల్పు ♦ టర్హమగునే.

ఉ॥ క్రూరులు పాపచిత్తులగు ♦ కొందఱు భృత్యులు రాజమందిర
ద్వారముఁజేరి యాచకుల ♦ వారణసేయుచు నుందు రిట్టు లా
చారుల కారణంబుమెయి ♦ సాధువులయ్యుఁ దదీయ నాయకుల్
గౌరవమెల్లఁ గోలుపడి ♦ ఖ్యాతిదొఱంగుచు నుందు రెప్పుడున్.

తే॥ వలదువలదటంచు ♦ వారించుటయెదక్కఁ గానిపించఁగలరె ♦ కమలనేత్రు
నింతమాత్రమునకె ♦ యిట్టి దర్పంబేల? వఱలవలయు ద్వార ♦ పాలకులకు.

క॥ ఇది తగు నిది తగదనుచును నెదఁదలఁపక యెట్టి కార్య ♦ మేని సలుపు దు
ర్హృదయుల కమంగళంబగు పదపడి తద్వైభవంబు ♦ పాడగు నెపుడున్.

వ॥ కావున భగవద్దర్శనా నిరతి శ్రమంబు నాఁక నిద్రాహారంబుల నైతము పాటింపక యింతటి దవ్వుఁ జేరి నేఁడుగదా ధన్యులముకాఁగలమను సంతసంబు నొందనున్న మా పరిశ్రమం బంతయు వ్యర్థంబుగా నిట్లున్మత్తులై మా యాశాలత ద్రుంచిన యీ కావలికాండ్రు తామొనర్చిన రాక్షసకృత్యంబున కనురూపంబగు ఫలంబనుభవించుచు భూలోకంబునఁ గామక్రోధాదులగు శత్రువులు బాధింపఁ బుట్టక తీరదని పల్కి యూరకుండి రంత.

మ॥ అనుచున్ జాలియొకింత లేకిటుల వా ♦ రత్యంతరోషంబు పెం
పున శాపంబిడినన్ గనుంగొని మహా ♦ త్ముల్ తత్పవిత్రస్థలం
బున నున్నట్టి మునీంద్రు లెల్లరు భయం ♦ బున్ బొంది యా ఘోరమా
పని వారింపఁదలంపరైరి ముని శా ♦ పంబన్న సామాన్యమే.

క॥ అనుచిత కార్యముఁ గావించినవారల యనుభవించు ♦ చెడుఫలమేనిన్
గనుగొనుచు నూరకుండుట జను వారింపంగరాదు ♦ సాధుల కెందున్.

క॥ హరిమందిర దౌవారికు లిరువురు జయవిజయు లప్పు ♦ డెంతయు భీతిన్
గగమువడంకుచు నమ్మునివరులను గని యిట్లనిరి ♦ వనటఁ జెలంకన్.

కలుషముగల్గునాక యధి • కారబలంబున బెద్దలైనవా
రల హరిదర్శనార్థులఁ ది • రస్కృతిఁ జేసినయట్టి పాపపుం
ఫలమును మే మెగాక పెర • వారు భుజింతురె దీనిఁగూర్చి మా
కలమట మింతయుం గలుగ • దాత్మ సహించుటకాక వేరుగన్.

ఘనులు మహానుభావులు జ • గన్నుతులైన మిముం నివారణం
బొనరిచినట్టి దోషమున • కొప్పిన శాసనమే విధించి నా
రని మిము సన్నుతింతు మన • యంబు మదోద్ధతులై చరించు
దుర్జనులకు నిట్టి శిక్షయె పా • సంగును గాదె జగత్త్రియంబునన్.

హరిచరణారవిందముల • నర్థి భజించుచు నీ పవిత్ర మం
దిరమును గాంచుచుం నిఖిల • దేవగణంబుల మెప్పులొందుచుం
దిరిగెడి మాకు నిట్టి దుర • దృష్టము చేకుఱెనంచు నింతయుం
స్థిరమతులార యెవ్వగను • జెందిన లాభముగల్గునే యికన్.

మా పురాకృతకర్మ మిట్టిఫలంబొసంగెనని మిన్నకుందుముగాని యేతత్ప్రతీకారంబుఁ బ్రయత్నింపము. అయినను పరోపకార జీవనులగు మీరు మా నేరంబుల సైరింపఁ దలంతురేని యిప్పటికైన మీకుమనశ్శాంతి చేకుఱునేని మాయొనర్చు విన్నపమాలించుట శ్రేయంబు.

చిరకాలముండి పరమేశ్వరు చరణములాశ్రయించు • వారలమగుటన్
భగ నజ్ఞానహతులమై తిరుగంగా నేరమొక్క • త్రుటికాలంబున్.

కామక్రోధాదులచే నీ మహిజన్మించువార • మే యైనను సు
త్రామ వినుతుఁడగు శ్రీహరి నామంబు జపించువార మ • నంతంబిడుసీ.

అట్టిసమయంబున

భక్తివృద్ధులయిన • పరమమునీంద్రుల హృదయపదంబుల • నెసఁగువాఁడు
వాఙ్మనసాతీత • వర్తనుండయ్యును పిలిచినంతనె మారు • పలుకువాఁడు
సాత్త్వికగుణ విరా • జత్స్వరూపుండయి యలరుచు గుణశూన్యుఁ • డైనవాఁడు
ఎట్టిసంబంధంబు • నే యెఱుంగక యుండి జగములఁ బోషింపఁ జాలువాఁడు
జ్ఞానగమ్యుఁడయ్యు • ధ్యానగోచరుఁడయ్యు నెట్టి సూక్ష్మమతుల • కేని యింత
గానరానివాఁడు • ఘనుఁడొక్క పురుషుఁ డచటి కేగుదెంచె • నా క్షణంబ.

కరముల శంఖచక్రములు • గన్గొన లగ్గరుణారసంబు పే
రురమునఁ గౌస్తుభంబు జల • దోన్నత దేహమునందుఁ గాంచనాం
బరమొక పార్శ్వభాగమున • మంగళదేవతయుం జెలంగ ని
ద్దరులు మునిప్రకాండము బ • గాబరులన్ బొనరింప నెంతయున్.

గీ॥ శ్రుతి శిరోగోచరుండు సం • స్తూయమాన శుద్ధచరితుండు ధర్మ ప్ర • సిద్ధమూర్తి
భక్తమానస సంచారి • పద్మనయనుఁ డటుల నేతెంచి రా విన • తాంగులగుచు.

క॥ అలఘుమతులు సనక ప్రముఖులు జయవిజయులును మఱియు • గోవిందుఁగనన్
బలు తెఱఁగుల వచ్చినవారలు వినుతియొనర్చిరపుడు • క్రమముదలిర్పన్.

తే॥ వారినందఱ వేశ్వర • వనజనయనుఁ డాదరము సేసి జయవిజ • యాభిధాను
లైన తన ద్వారపాలుర • నర్థిఁజూపు చిట్టులను సనకాది ము • నీశ్వరులకు.

ఉ॥ వీరలు నాకు భృత్యులు వి • వేకమునన్ జరియించుచుండు రో
వారికవర్యు లుత్తములు • భక్తుల గౌరవబుద్ధిఁ గాంచు వా
రూరక క్రేపుఁబోరెటుల • నో దురదృష్టముఁజేసి మిమ్మిటన్.
వారణజేసినారు గ్రహ • బాధ యెవారికైనఁ దప్పనే.

తే॥ ఒడలు మఱచి సేసి • రౌక తప్పిదము దాని కర్హమైనశిక్ష • యనుచు మీరు
ధరణిఁబుట్టునట్లు • దగశపించితి రిట్లు కలుగవలయుఁగాదె • గర్వితులకు.

ఉ॥ స్వామిహితంబుగోరకయు • సాధులెవార లసాధులెవ్వరో.
ధీమహితాత్ము లెవ్వరో య • ధీరులెవారలో యంచు నెంచ కే
తామె ప్రభుత్వమూనినవి • దంబుఁ ద్రిమ్మరుచుండునట్టి వా
రీమహినిట్టి దుర్గతియె • యెందును జెందుచునుందు రెప్పుడున్.

చ॥ అధిపతి మందిరాంగణము • లందు వసించుచుఁ గుశ్చితాత్ములై
ప్రథిత తదీయ కీర్తిలత • వాడఁగఁజేయుచు సంతతంబు దు
ష్పథముల సంచరించు భట • సంతతి నేలెడి భూధవుండు తా
బుధసభలందు గౌరవముఁ • బొందునె చెందునె సత్ప్రతిష్ఠలన్.

తే॥ ఎఱిఁగియెఱుఁగక యే కార్య • మేని సలిపి సాధుమనముల కహితంబుఁ • సలుపుచుండు
రట్టి దుష్టభటుల కాశ్ర • యంబొసఁగి తదపవాదంబు పతియె యా • దలవహించు.

చ॥ ఘనమతులైన మీయెడల • గారవ మించుక లేక వీరొన
ర్చిన యపరాధ మేన యొన • రించినయట్టిదయయ్యెఁ గావునన్
మనముల రోషముజ్ఞ విడిచి • మాన్యుఁడనౌటఁ బ్రసన్నమూర్తులై
నను గరుణింత్రుగాత ముని • నాథులు మీకొక వైరముండునే?

సీ॥ అనలమందునఁ బుట్టి • యగ్నికణంబులయ్యనలమందె శమించు • నట్టి రీతి
నీ దృశ్యమగు జగం • బెల్ల నాలో, జన్మించి నాలో సంక్ర • మించుననుచుఁ
దెలియఁగా నేరక • ధీరులైనాకును బ్రాణికోటికి భేద • మనుచు నెంచి
కామాది శత్రువ • ర్గము జయింపగలేక క్షణభంగురంబగు • సర్వవస్తు

చయము నిత్యమనుచు ♦ శాశ్వతులమటంచుఁ దలఁచి తిరుగుచుండు ♦ కలుషమతుల
కెట్టిశిక్షయేని ♦ యొవఁడు విధించిన నాకు హితమెయగు న ♦ నారతంబు.

తే॥ శాంతులైన మీకు ♦ సనగరోషంబుఁ గల్గించినట్టి యీ వివేకరహితు
లందు మీరోసంగి ♦ నదియ నాకును హితమైన శాసనంబె ♦ యయ్యెనిపుడు.

వ॥ మీయిష్టమట్లు వీరు కామక్రోధాదులు బాధింపఁ బుడమిజన్మింతు రైనను నాయం దలి గౌరవంబున నొండె భక్త్యతిశయంబున నొండె వీరల మన్నించి నాయెడ భక్తిచేఁ గాకున్నను విరోధంబుచే నైన మూఁడుజన్మంబులకు మీఁద నా యంతి కంబుఁ జేరునట్లనుగ్రహింపుఁడని నుడివిన సనకాదులు వినయ నతో త్తమాంగు లయి యిట్లనిరి.

ఉ॥ ఓకమలాయతాక్ష కరు ♦ ణోదధి నీ మహిమంబెఱుంగఁగా
లేక భవత్ప్రియానుచరు ♦ లేయని యెంచక యించుకేనియున్
బ్రాకృతులట్లు నీ భటుల ♦ పట్ల యనర్థక మాచరించు ని
ర్భీకుల మమ్ము సైపఁగద ♦ వే వినుతింతము నిన్ను నిచ్చలున్.

ఉ॥ ఈ యఖిల ప్రపంచమున ♦ కెల్లను నీవ విభుండవౌటచే
మాయెడఁగల్గు నేరముల ♦ మన్ననఁజేసి క్షమింపుమో జగ
ద్దేయ! భవత్పదాబ్జములఁ గీర్తనఁజేయ మమున్ గృతార్థులన్
జేయుటనీకు ధర్మమని ♦ చెప్పెడివారమె మేమొకింతయున్.

వ॥ భగవద్దర్శనంబున కంతరాయంబుఁ గూర్చిరను క్రోధాతిరేకంబున మీ భృత్యుల మారితిమి గాని మాకును నిప్పుడు పశ్చాత్తాపంబు గలుగుచునే యున్నది. పిపీలికాది బ్రహ్మపర్యంతమగు జగంబును నిష్పక్షపాత బుద్ధి రక్షించువాఁడవగుట నీవొక్క రుండవు క్రోధవర్జితుండవు. ఈ జయవిజయులు భూలోకంబునఁ బుట్టియు నీ యిష్ట మటుల వైరంబుచేఁ దుదకు నీ యంతికంబునే చేరుదురుగాక. ఇందేమి దోషము గలదని మేము సమ్మతని జూపుదుమని పలికిన నళినాక్షుఁడు క్రమ్మర నమ్మునుల కిట్లనియె.

ఉ॥ ఉత్తముఁడైన బ్రాహ్మణున ♦ కుండదు కోపమొకప్పుడుండునే
న త్తతినే శమించునటు ♦ లాగ్రహ మొందియు వీరిపైగృపా
యత్త మనస్కులై యిటుల ♦ నస్మదుపాసకులన్ క్షమించి రే
కెత్తిన సంతసంబిడితి ♦ రిప్పుడు మీరలు సజ్జనాగ్రణుల్.

తే॥ సర్వభూతంబులందు ని ♦ ష్పక్షపాతబుద్ధిగలవారలౌట ని ♦ప్పుడుమ నీయ
బుద్ధికి హితంబయినదానిఁ ♦ బూని నాకుఁ గౌతుకముఁగూర్చితిరిమీరు ♦ఘనచరితులు.

ఉ॥ వీరలదూరి నాకుఁ బరి వేదనఁగూర్చితిమంచు నెంచకుం
డారయ వీరికీదశయె ♦ యయ్యెడునంచు లిఖించెఁ బూర్వ మా

సారసగర్భుఁ డాతని వ ◆ శంబున నేకద సంచరించు నీ
ధారుణియెల్ల మిమ్ముఁ గని ◆ ధన్యులనైరి గణింప వీరలున్.

వ|| కారణాంతరమునఁ జేసి యిట్టి కల్లోలంబు జరిగె నైనను మీకు వగచుట తగదని పలికి వెన్నుం డంతఃపురంబున కరిగె నంత నా మునివరులును దమ యుద్దేశంబట్లు ఫలించుటచే విధివిధానంబుఁ గూర్చి యబ్బురంపడుచుఁ గృతార్థులమైతిమని యెంచుచు నెందేనిఁ జనిరి. అట్టి సనకాది శాపకారణంబునఁ జేసి జయవిజయులు ప్రథమజన్మంబునకై దితి గర్భంబునఁ బ్రవేశించిరి.

ఉ|| వారలు లోక కంటకుల ◆ వారిత వర్తనులై జనింప ను
న్నారది కారణంబున ఘ ◆ నంబగు తేజము గల్గె నిప్పుడా
వారిజనేత్రుఁ డయ్యమర ◆ వైరుల బంతమునొందఁ జేసి బృం
దారక పాళి కెల్లను హి ◆ తంబొనరింపఁ గలాఁడు మీఁదటన్.

చ|| అనఘులు పంకజాక్షుని గృ ◆ హాంగణ సేవకులైన వారగలే
యనుచిత కార్యముల్ సలిపి ◆ యిట్టి యవస్థను జెందిరింక నే
మని వచియింపవచ్చు మను ◆ జావళిఁ గూర్చి యసత్పథంబునన్
జనియెడి దోసకాడులకు ◆ సౌఖ్యము గల్గునె యెన్నడేనియున్.

తే|| అసురులై పుట్టి వారన ◆ యంబు దేవతావళికి బాధఁ గూర్చుచు ◆ నంబుజాక్షు
తోడ వైరంబుఁ దాల్చియు ◆ ద్ధురతఁ గలనఁ దెగి చనుదురమ్మహా దేవ ◆ దేవుకడకు.

తే|| అని వచించిన వృత్తాంత ◆ మంత యెఱిఁగి యమరులెల్లరుఁ జనిరి భీ ◆ తాత్ములగుచు
శారదాపతియును జగ ◆ ద్భార మింకఁ గలుగఁగల దనుచును జింత ◆ గలిగియుండె.

— హిరణ్యాక్ష హిరణ్యకశ్యపుల జననము —

వ|| తిదియుఁ శతవర్షంబులు గర్భంబుఁ దాల్చె నంత

తే|| గున్నకొండలమాడ్కి ని ◆ గోత్రయుగము పగిదినున్నత దేహులై ◆ భ్రాజదరుణ
కాంతినిరసించుచు నదితి ◆ గర్భకుహర భాగమునఁ బుట్టి రిరువురు ◆ బాలురపుడు.

చ|| జలధులనీరు వట్టెఁ గుల ◆ శైలములున్ గులలయ్యెఁ దారకల్
జలజల రాలిపోయె గ్రహ ◆ సంతతి స్థానముఁ దప్పె భూతముల్
బలుగతులన్ జలించెదరుఁ ◆ బంక్తి సమూలము గాఁగ గూలె భూ
తలము వడంకెనంబర ప ◆ థంబు పయిన్ బడునట్లుగన్పడెన్

క|| మలమూత్రంబులు గురిసెను జలదము లాకసమునుండి ◆ ఝంఝానిలముల్
నలుదిక్కుల వ్యాపించెను గలుషమతులు దితితనయులు ◆ గలిగిన వేళన్

తే|| సురల గుండియలదరె సం ◆ క్షోభ మెసఁగె నీచములగు గ్రహములకు ◆ నెగడె మైత్రి
శ్వానరోదనములు హెచ్చె ◆ జంతుజాలమున కనూహ్యమౌ సాధ్వసం ◆ బొనరె నపుడు

తే॥ మట్టమధ్యాహ్నమందెత్తమంబుగ్రమ్మెఁ జంద్రసూర్యాగ్ని తేజముల్ చల్లఁబడియె
శాకినీఢాకినీముఖ సకలభూత తతియుఁ జెలరేఁగె భూనభోంతరములందు.

తే॥ యుగవిగమకాలజనితమ హోగ్రవహ్ని నిచయమట్టులదావాగ్ని నెగడెదిశల
మునురువేల్పులసుసనముల పగపొసంగె దుశ్శకునములు జగములం దునుపుదోఁచె.

సీ॥ అయెకఁగశ్యపుండతిభ యంకరరూపులు దుష్టచిత్తుల
ల్యాయతదేహులైనతన యాత్మజులఁగని శంకితాత్ముఁడై
యీయలసుల్ జగంబులకు నేయపకారముఁ గూర్తుగో జగ
ద్దేయుఁడు వెన్నుఁడేవిధి వ ధించునొ వీరల నాహవంబునన్.

తే॥ పూర్వజన్మార్జితంబగు పుణ్యమునసెకాక వలముద్ధరించెడు లోకహితులఁ
బుత్రులఁ బడయుదురె యె ప్పుడు నెవారలైనఁగాని యసత్కర్మ మాచరించి.

వ॥ దురాత్ములగు వీరి జన్మంబునకు నాసేయు పాపం బొక్కటియగాక లోకంబాన
ర్చిన కలుషంబుగూడ కారణంబగు. అయినను దనయులై జన్మించిన వీరియెడ నాకుఁ
గ్రోధమహార్హంబు గాదు. భగవంతుఁ డెట్లు దలఁచిన నట్లయగునని యెంచి
వా రిరువురకుఁ గ్రమంబున హిరణ్యకశ్యప హిరణ్యాక్షు లను నామకరణంబు
లొనర్చె నంత.

సీ॥ అతుల బలోద్ధతుల్ ఘను ల హంకృతి దీపితు లిద్ధతేజుల
ప్రతిహత విక్రమాఢ్యులు ప రాజిత శాత్రవులై చెలంగి రం
చితతను రూపసంపదలఁ జెన్నలరారుచుఁ గశ్యపాత్మజుల్
గ్రతుభుజులెల్ల గోడువడఁ గా నసదృగ్విభవాభి రాములై.

వ॥ అందు జ్యేష్ఠుండగు హిరణ్యకశ్యపుఁడు చతుర్ముఖ ప్రసాదాసాదిత మహాపరాక్ర
మోపేతుండై సునాసీర ప్రముఖ నిఖిలబృందారక సందోహంబు డిందు పడఁజేసి
దృగ్గోచరంబగు ప్రపంచంబునం దెందును దన్నాహవంబున నెదురించు యోధుఁడు
గలుగమికి నిర్భయంబున స్వర్భానువు వోలె సుఖంబుండె నంత నందుఁ గనిష్ఠుండగు
హిరణ్యాక్షుఁడు

సీ॥ అసదృశ విక్రమక్రమ జి తాఖిలవైరి సమూహుఁడైన య
య్యసుర కులాగ్రగణ్యుఁ డఖి లాశల గెల్చి యెసర్చి పోరఁ శూ
ర సముదయంబు గన్గొనఁగ రామిని స్వీయ భుజావతంసమై
యొసఁగుచు నుండునట్టి గద యేగతి సార్థకమౌనొ యీ పయిన్.

వ॥ అని తలంచుచు నొక్కనాఁడుక్కుమిగిలి రక్కస గొంగయగు టక్కరిపక్కి రౌతు
తన బారినుండి ప్రాణంబుల దక్కించుకొన వసుధోద్ధరణ వ్యాజంబునఁజేసి పాతా
ళంబున డాఁగియున్నవాఁడని యూహించి యాతనితోడ దాడిచేసిన నయ్యజ్ఞవ
రాహ విభుండా హిరణ్యాక్షుని వధించె నంత.

— హిరణ్యకశ్యపుడు హిరణ్యాక్షుని మృతికై వగచుట —

క॥ తనకుం జేదోడై యేపనికిన్ ముందంజవేసి • ప్రబల జయంబుల్
గొనియెడు కనకాక్షుని హరి యనిహత మొనరించెననుచు • నాగ్రహయుతుఁడై.

మ॥ అరరే సంగర రంగ నిర్జిత సను • స్తారాతి చక్రుండు ని
ర్జరలోకాతిశయాళు వైభవుఁ డతి • క్రాంతార్క తేజుండు భీ
కర రూపుండగు కాంచనాక్షుఁడని లోఁ • గంజాక్షునిన్ దాఁకి యి
క్కరిణిన్ గూలెనె యిట్టివింగడ మిలన్ • గన్గొంటిమే యెందునన్.

మ॥ కలనన్ నిల్చి పరాక్రమించి గెలువం • గాలేక కోలంబుగా
జలధిన్ డాఁగిన యబ్బుఁడేసనో ద్విష • చ్చక్రంబు వక్రంబుగా
సలుపన్ జాలు సమస్త భూధరణ ద • క్షత్వంబునన్ మించు నీ
యలఘున్ జంపుటయేడ పిల్లినె శుకం • బంతంబుఁ గావించునో?.

సీ॥ చింతామణీ భద్ర • సింహాసనమునుండి పెలుచ దేవేంద్రు నీ • డ్చించునప్పు
డంబుధీశు జయించి • యతనిచేత "జితోస్మి" యంచు దీనముగఁ బ • ల్కించువేళ
వైశ్వానరు నెదిర్చి • వారక తత్ప్రతాపావళి నెల్లఁ జ • ల్లార్చుతఱిని
దక్షిణాధీశ్వరు • దండంబు నుగ్గుగావించి యాతనిని బా • ధించుపట్ల
విహగనాథునిఁ గన్గొని • వెఱచిపాఱు నురగములపోల్కెఁ దక్కిన • సురచయంబు
మచ్చమూసంతతిన్ గాంచి • విచ్చి భీతిపరుగులిడునప్డు లేఁడొకో • హరినెత్రి.

ఉ॥ ఇంచుక ధైర్యమూని • యెపుడేని రణస్థలి భీతిలేక ని
ర్వంచిత విక్రమంబున సు • రప్రకరంబుఁ గలంచునన్ను గ
ర్వించి యెదిర్చునే యిపుడు • శ్రీపతి యట్టి పరాక్రమం బెటుల్
గాంచఁగ నేర్చె మాయియయి • గాసిలఁజేసెను గాక శూరునిన్.

చ॥ జలముల మున్గి డాఁగినను • శైలముక్రింద నడంగినన్ వన
స్థలి మృగరూపమూని పెలు • చన్ జరలాడిన నెందుఁబోయినన్
గలన నెదిర్చి పోరి తిగ • కన్నులదేవర యడ్డమైన నా
జలజదళాక్షునిన్ విడక • చంపెద దైత్యకులంబుఁ బ్రోచెదన్.

మ॥ ప్రళయోద్యద్ధరఘాలమండితశిఖి • జ్వాలాకదంబంబురీ
తి లసన్మామక బాహు నిర్గతగదా • తి క్రూరసంతాడనం
బులకున్ నిల్చునె యుక్తిచే నిటుల మ • మ్మున్ గెల్వఁగాఁజూచుచున్
బలవద్వైరము కూడదంచు నెపుడున్ • భావింపఁ కింతేనియున్.

మ॥ ననువంచింపఁదలంచి క్రోడమయి నం • తన్ దప్పునే మద్భుజా
జనితాభీల పరాక్రమాగ్నిఁబడి భ • స్మంబౌట, ఘోచోచ్చేట దాఁ

గినవేవాఁడు సహాయముఁ జలిపినఁ ♦ విష్ణుఁడు కాలాహికిఁ
గుఱుకఁ గూర్చి మనంగలండె యెవఁడే ♦ నిఁ బ్రాణముల్ దాల్పునే?

క॥ ఖండింతునొ గదఁ గైకొని మండింతునొ స్వర్గమిపుడ ♦ మానుషశక్తిఁ
బెఁడుదవఁ జేయుదునొ బ్రహ్మాండంబుల విష్ణుఁబట్టి ♦ యదలింపంగన్.

క॥ అని క్రోధము ముప్పిరిగొనఁ గనక కశిపుఁ డుగ్రుఁడగుచు ♦ గర్వంబున దై
త్యనికరముఁ గనుఁగొని యిట్లనియెను బరుషోక్తులలర ♦ నందఱితోడన్.

చ॥ అసురుడు దైత్యులార వసు ♦ ధామరులన్ గలుగుండు వెట్టఁ డా
దరమును వీడి యజ్ఞముల ♦ ధ్వంసమొనర్పఁడు పాడు సేయుఁడీ
హరినిలయంబులెల్ల నమ్ర ♦ తాంధసులన్ బలిమిన్ వధించి త
ద్వరసతులన్ గలంచి చెఱఁ ♦ బట్టుఁడు కొట్టుఁడు దిగ్గజంబులన్.

క॥ శ్రుతివిహితంబగు సత్పద్ధతి నడచెడివారినెల్ల ♦ దండించి యస
ద్గతిఁ బడద్రోయుఁడుయుష్మ న్మతికనుకూలమగునట్లు ♦ మన్నింపకొగిన్

క॥ హరియను రెండక్కరముల ధరనెవఁడు స్మరించువాని ♦ దగదవక వెసన్
బరిమార్పుఁడు కలనైనన్ మరలన్ దలపోయకుండు ♦ మాడ్కినిమీరల్

చ॥ తలఁగకమీకెవండును ప ♦ దంపడి యజ్ఞమొనర్చుచుండు నా
తలమునకేగినాకొఱను ♦ దారుహవిస్సునొసంగునట్లుగా
సలుపుడువా రసమ్మతిని ♦ జాటిన గుండము లెల్లబూడ్చి నెం
జిలిఁబడజేసి యద్వరమ ♦ శేషము సన్నమొనర్చిగండికన్

క॥ నాయనుకంపనుఁబాత్రులునై యుంటనుఁగాక యేసి ♦ యైనదలపుచున్
సేయగబూనినవారలఁ బాయకపరిమార్పవలయు ♦ బలుబాధలచే.

క॥ కనకాక్షునాలయంబులె కనులకు గన్పడగవలయు ♦ గానియెచటనే
నినిమిషుల యాలయంబులు కనబడకుండంగ జేయఁ ♦ గాదగుమీరున్

సీ॥ హరినామముజపించు ♦ నట్టినాలుకబట్టి ఖండఖండంబులు ♦ గాఁగఁజీల్చి
గోవిందునర్చించు ♦ ఘనమతిచేతులఁగొని ముక్కముక్కలుగాఁగఁ ♦ జెక్కివైచి
వెన్నునాలించెడి ♦ వెడఁగు వీనులలోన సలసలఁగ్రాగెడి ♦ చమురుబోసి
విష్ణ్వాలయంబులఁ ♦ బేర్మిమెట్టుపదంబు లట్టైబల్లినిబట్టి మట్టుబెట్టి
గృములందు "హిరణ్యక ♦ శ్యప"యనియెడు నది షడక్షరీమంత్ర మ ♦ హాజపంబె
గాకవేరొండుమంత్రింబు ♦ గలుగకుండ నియమమొనరించిరందు ని ♦ ర్ణిద్రులగుచు-

తే॥ తమ్ము గుజ్జతోడఁ ♦ దగనాదు ప్రతిబింబమెల్ల యందు నిల్పుఁ ♦ డెవరయేని
కనక కశిపుఁదక్కఁ ♦ గమలాక్షు నర్చింపరాదటంచుఁ బల్కి ♦ రండు పొండు.

క॥ ఇటియిటియంచు వేర వచి ♦ యింపఁగనేటికి మీరుఁ దోఁచిన
ట్లదయపఁ లోకజాలముల ♦ నన్నిటి నంతమొనర్చగండు గ్రూ

రదనుజ హంతచేఁ దలఁప • రాని మృతిన్ గనినట్టి కాంచ నా
క్షుఁ దలఁచి చింతలన్ బొగలు • సోఁకుడు రాయఁడు శాంతిఁ నొందఁగన్.

వ॥ అని పలికిన దనుజ నికాయము వల్లెయని శిరశ్చాలనముఁ గావించి తడవుసేయక చమూ సంతానముఁ గొని ధరణిన్ బ్రవేశించి,

సీ॥ దేవాలయంబుల • దివిరి పాడొనరించి కొలువుకూటంబులఁ • గూలదన్ని
యుద్యానవనముల • నోలి యున్మూలించి సత్రంబులెల్ల భ • స్మంబొనర్చి
పాఠశాలల గొన్ని • బ్రద్దలు గావించి సౌధసంతానంబుఁ • జదును జేసి
క్షేత్రరాజము లప • విత్రముల్ గాఁజేసి వైద్యాలయంబుల • భంగపఱచి
వివిధ ధర్మవసతు • లవలీలఁ బడఁగొట్టి నూతులన్ని బూడ్చి • ప్రాంతగోపు
రముల మన్ను జేసి • రాక్షసాధములు బాధింపఁదొడఁగి రవని • ధీరులగుచు.

శా॥ ఘోరాకారులు కామరూపధరు లు • గ్రుల్ పాపకర్ముల్ దురా
చారుల్ దానవులెల్ల రుద్ధతులునై • సర్వం సహామండలం
బారీతిన్ వెతసేయుచున్ సురల న • త్యంతంబు బాధించుచున్
వారింపంగఁ దరంబుగాని పని స • ల్పన్ బూని రెంతేనియున్.

చ॥ క్రతువులుమాని రగ్రజులు • కాంతలు భర్తృపరాఙ్ముఖస్థితిన్
వ్రతముల సల్పనైరి బుధ • వర్గ మసద్గతి సంచరించి రు
ద్ధతులయి యర్భకుల్ తమ క • ధర్మమె ధర్మమటంచు నెంచి రా
దితితనయుల్ దురాత్ములయి • త్రిమ్మరుటన్ జగమెల్ల సత్తఱిన్.

క॥ శ్రుతివిహితాచారములకు గతిదప్పెను జగము నాస్తి • కంబయ్యె నధో
గతిఁ గాంచిరి బుధులెల్లరు హితులహితులైరి చెలంగి • రెల్లెడలందున్

శా॥ కన్యావిక్రియ లన్నవిక్రయము లహం • కారావృతు లుద్ధతు
ల్సన్యాసు ల్పరభాగ్యభోక్తలు దురా • లాపప్రియు ల్పండిత
మ్మన్యుల్జారులు నీచవర్తను లసం • భావ్యు ల్జగంబెల్ల స
మ్మాన్యత్వంబు వహించి మించి రసురుల్ • క్ష్మాచక్రమున్ వేఁచగన్

తే॥ వాయువరుసలు దప్పె న • న్యాయవర్తనంబు ప్రబలెను పౌరజ • నంబులందు
నీతిబాధలు మించె న • నీతిబలిసె రాజులందు సురారులె • రాజులగుట.

తే॥ అటుల లోకమెల్ల • నక్రమంబు వహింప దేవతలును దత్ప్ర • తిక్రియకయి
వెదకుచుండి రంత • విబుధారికనకకశ్యపుడు విష్ణువందు • నలుకఁ బూని.

క॥ మృతివాధకములు లేమియు నతిలోకంబైన తేజ • మఖిలేశత్వ
స్థితియును నరివిజయంబును మతిగోరియు తండు చనియె • మందరగిరికిన్

వ॥ అట్లుజని హిరణ్యకశ్యపుండు మందరాచల కందరంబుఁ జేరి నిరశనుండును, కంటక తరుశాఖావలంబిత చరణయుగళుండును నై సహస్రకిరణు నవలోకించుచు బ్రహ్మఁ గూర్చి యనేకదివ్య వర్షంబులు తపము గావించుచుండె నయ్యవసరంబున

క॥ ఆతని తపోగ్ని కడరి దిక్ప్రతతులు తల్లడిపడయె న • భంబుచలించెన్
గ్రతుభుజులది తెలిసి వెసన్ జతురాస్యుని కడకుఁజని వి • చారముదోపన్

ఉ॥ ఈవిటు లూరకుండుట య • దేల యెఱింగి యెఱుంగనట్లు లో
కావన తత్పరుండవు గ • దా దివిజారినిఁ గాంచి వాని కే
దో వరమిచ్చి పొమ్మనక • యుగ్రతరంబగు తత్తపోగ్నికా
హా వెతగుందకుండఁ దర • మా తమ రీవిధి మిన్నకుండినన్.

క॥ అనుటయు వాణీపతి యయ్యనిమిష సంచయముఁగాంచి • యగునగు నిపుడే
చని కనక కశిపుని మనంబునకు హితంబైన వర • సమూహమిడియెదన్.

చ॥ అసురుఁడు నిర్జరావళికి • నంతకభూతుఁడు వానికై వరం
బొసఁగిన కీడెమూడు మఱి • యూరక యుండిన కీడుమూడు నె
ట్లు సఁుంపు టహహా మోయని వి • లంబమొనర్చుచునుంటి గాని లో
క సమితి బాధనొందుటను • గన్గొను చిట్టుల మిన్నకుందునే.

క॥ మీరరుగు డింక నే యమరారి కెదో వరమొసంగి • యరుదెంచెద దు
ర్వార పరాక్రమయుతుఁడా శూరుం డెట్లయినఁ గలఁచు • క్షోణితలంబున్.

వ॥ అని పలికి సురజ్యేష్ఠుండగు కమలాసనుండు నిలింప సమూహంబు నంపి యుచిత పరివారంబుతోడ మందరగిరికరిగి.

చ॥ అనిలము నీరొ పుచ్చుకొని • యాఁకలిదప్పులఁ దీర్చుకొంచు శ
ల్యనికర మొందు దక్కఁ బల • లం బిసుమంతయులేక కార్శ్యమా
తనువు భరించుచున్ బరమ • తత్వము నెమ్మది నిల్పి సత్వమా
ధిని జెలువారు దైత్యు నతి • ధీరు గనుంగొని నిశ్చలాత్ముఁడై.

ఉ॥ ఓ యసురేంద్ర నీ సలుపు • నుగ్రతపంబున కేను మెచ్చితిన్
గాయము వాఁడజేయు నధి • కంబగు నిష్ఠ యిఁకేల యింతటన్
బాయుము నీ సమాధిని శు • భం బొనఁగూడెడు నీకు నాత్మలో
నేయది వాంఛితంబగునొ • యిచ్చెద నయ్యది గోరు మెమ్మెయిన్.

— హిరణ్యకశ్యపుండు బ్రహ్మను స్తుతించుట —

వ॥ అని దయార్ద్రహృదయుండై పలికిన తోయజసంభవు వాక్యంబుల కలరి దితిపుత్రుండు కృతాంజలిపుటుండై యిట్లనియె.

ఉ॥ ఆశ్రితవత్సలుం డభవుఁ • డవ్యయుఁ డీశుఁడు నిర్గుణుండు స
ర్వాశ్రమ సేవితుండు నిఖి • లాగమ గోచరుఁ డెవ్వఁ డట్టి నీ
యాశ్రయ మొందఁగోరితి చు • హాత్మ ననున్ గరుణింతు వేని నా
యాశ్రమ మెల్లఁజేరుగతి • నిమ్ము వరంబుల నింకఁ గోరెదన్.

క॥ నిగమాంతపారగులకే నగుపడనిమహానుభావు • నతిలోకుండౌ
భగవాను గాంచఁగలిగితి జగదీశా! నన్నువంటి • సత్కృతిగలఁడే.

తే॥ పెక్కువత్సరములు • భీకరమగుతపమాచరించె నీతఁ • డనుచునీకుఁ
గనికరంబుగలిగెఁ • గావునసీవు నాయిష్టవరములెల్ల నీయవలయు.

తే॥ ఎవఁడతీంద్రియగోచరుఁ • డిద్ధచరితుఁ డట్టిదేవుండె సన్నిధి • కరుగుదెంచి
కనికరంబునవరముఁ గై • కొనుమటంచుఁ బలుకుటయెచాలదే వేఱ • వరములేల.

వ॥ భక్తమానస సంచారివగు నీవాదరంబు మెయివాంఛితం బడుగుమని యానతిచ్చితివి. నేను నిస్పృహుండనై నను భగవత్సంకల్పితంబులగు వరముల నిరాకరించుటకోపం బని తలంచి వేడెద కావున పంచభూతంబులచేతను దిక్కులవలనను నహోరాత్రం బులను దేజస్తిమిరంబుల మూలంబునను నక్రంబులకతనను రక్షస్సులమూలంబునను నాగాదిత్యమనుష్యాదిజంతుకలహంబువలనను నిఖిలశస్త్రాస్త్ర ప్రహారంబులవలనను మృత్యువు గలుగకుండునట్లును సమస్తదిక్పాలుర జయించు విక్రమంబు చెలగునట్లును జతుర్దశభువనంబుల నతిశయించునట్లును వరంబొసంగుమనిన.

— బ్రహ్మదేవుండు హిరణ్యకశ్యపునకు వరములిచ్చుట —

క॥ సురవైరియవ్విధి భయంకరవరములఁగోరుటే జ • గంబులనెల్లన్
బరిమార్పఁదలఁచియేయని సరసిజభవుఁడెఱిఁగియును వి • చారముదోపన్.

తే॥ క్రూరుఁడతఁడు వాఁడు • కోరినవరములు క్రూరతరము లతని • కోర్కెనెట్లు
దీర్పకుందుఁగాక • దివిజుల పడు బాధ నెట్లు దీర్పనేర్తు • నింకపూఁన.

ఉ॥ ఆతని కీ వరంబిడక • యన్య మొసంగుదుఁ గొమ్మటన్న సం
ప్రీతి గ్రహించునే యతఁడు • భీకరమైన తపంబు మానునే
ధాతరయె యాడితప్పె నను • ధాతలి నింక నెవండు సత్య వి
ఖ్యాతిఁ జరించునంచు బుధు • లాడుట నాకు హితంబుఁ గూర్చునే?.

క॥ అని యించుక తలఁచి యజుండనియె నిలింపారితోడ • నసురేశ్వర నీ
కనుకూలమైన వరమే కొను మొసఁగితిమనుము విబుధ • కోటి నుతింపన్.

వ॥ అని పలికి భగవంతుండగు వాణీమనోహరుండు కనుమొఱఁగె నంత దానవేశ్వ రుండు సంతోషదంతురిత స్వాంతుండై వెన్నుని ఖిన్నునిజేయనున్న మిన్నంది చెన్ను మీఱు తన యశంబునకు వన్నెయు వాసియుఁ గలుగదని తలంచుచు నిజధామ ంబునకరిగి యుద్ధతుండై.

సీ॥ ఇక నెంత కాల మిం • దే యుండెదవటంచు దివినుండి దేవేంద్రు • భువికిలాగు
నెందుల కీ మాట • లింకఁ జల్లాఱుమం చనలుని గాళ్లతో • నట్టె త్రొక్క

ధర్మరాజవు నీవు • దండ మేమిటికంచు యమునాయుధంబుఁ దుం • డెములు సేయు
రక్కసుండవె నిర్జ • ర సహవాసము తగునాయని నిరృతిపై • నలుకఁబూను
వరుణు దండించుఁ బవనుని • పరిభవించు ధనదు తొమ్మిది పాతరల్ • ద్రవ్వివైచు
మూఁడుకన్నులవాఁడ వీ • వోడవాయటంచు నీశానుఁగలన బం • ధించిపట్టు.

చ॥ కనఁబడఁడేల వెన్నుఁ డొడికం • బున దర్పముఁబూని యాజిలోఁ
నను నెదిరింపఁడేల దితి • నందను బారికిఁ దాళలేక కా
ననముల డాఁగు నిర్జర జ • నంబును బ్రోవఁడ యేమి పౌరుషం
బును విడనాడి త్రిమ్మరుటె • పూరుషధర్మ మటంచు నెంచెనో.

వ॥ అని దినదినప్రవర్ధమానహరి విద్వేషుండై హిరణ్యకశ్యపుండు.

## — ప్రహ్లాద చరిత్రము —

సీ॥ సకలంబునకు మూల • సాక్షియౌ ఘనుఁడు పద్మాక్షుఁడేయని మది • నరయువాఁడు
హరిచరణాంబురు • హామృతాస్వాదనాయత్త చిత్తుండయి • యలరువాఁడు
సర్వకాలంబులు • సర్వేశు నర్చించు పనికినై యుపయోగ • పడుచువాఁడు
ముక్తికాంతాసౌధ • మున ప్రవేశింపఁగ హరి ముఖ్యసోపాన • మనెడువాఁడు
నామరూప విరహితుఁ డ • నంత తేజుఁ డాదిమధ్యాంతములు లేని • యట్టివాఁడు
వెన్నుఁడే యమ్మహాత్మ సే • వించుచుంట తనకు భాగ్యంబటంచును • దలఁచువాఁడు

తే॥ మాయగానివాఁడు • మాయకు లోఁబడియుండువారి నవ్వు • చుండువాఁడు
పరమభాగవతుఁడు • ప్రహ్లాదుఁడనియెడు తన యనుంగుపట్టి • గని యతండు.

చ॥ పిలువఁ డెవారి నెవ్వరును • బిల్చిన నుత్తరమీయఁ డింతయున్
నిలువఁదలంపఁ డొక్కెడ • నిల్చియు దిక్కులనే గనుంగొనున్
దల పయికెత్తి యాకసము • దద్దయుఁ జూచుచు నవ్వుచుండు లోఁ
గలఁగఁడు తోడిబాలకులఁ • గొన్గొనినైన నితండిదేమియో.

క॥ ఆఁకలిదప్పుల నెఱుఁగం డేకడ నిలుచుండు నందె • యెల్లపుడుండున్
దేకువచెరఁడు పదార్థస్వీకారముఁ గోరఁడేమి • సేయుదు నితనిన్.

తే॥ వెఱ్ఱివాఁడువోలె • వెఱ్ఱిచూపులఁజూచు గాసపుండువాని • కరణిమందు
పామరుండువలెను • భ్రాంతుఁడౌ నందందు పాపఁ డిట్టి పాటు • బడఁగనేల?.

వ॥ అని ప్రహ్లాదునిగూర్చి తలంచి

ఉ॥ ఎట్టి యమూల్యరత్నమునఁ • కేని యొకించుక సానపట్టకె
ప్పట్టున వన్నెరానిగతి • బాలకుఁ డెట్టి గుణాఢ్యుఁడైనఁ జే

పట్టి గురూపదేశమునఁ ♦ బ్రాజ్ఞునిఁ జేయక యూరకున్న వాఁ
డెట్టులఁ గీర్తిఁ గాంచఁగలఁ ♦ డెవ్విధి యోగ్యుఁడగుఁ దలంపఁగన్.

క॥ సదసద్వివేకముల కాస్పదుఁడై నిష్కపటుఁడగుచు ♦ ఛాత్రులయెడ భూ
రిదయామయుఁడై యన్నిటిఁ జదివిన గురునొద్దఁ గొడుకుఁ ♦ జదివింపఁదగున్.

క॥ తన యాత్మజులందునఁబలెఁ గనికరమున శిష్యవితతిఁ ♦ గాంచుచు గ్రంథం
బును వీడి వీఁడపాత్రుండనకయ బోధించువాఁడె ♦ యాచార్యుఁడగున్.

చ॥ అమలగుణాభిరాముఁడగు ♦ నట్టి ఘనుండు పరార్థ భోక్తృతా
విముఖుఁడు సత్యశీలుఁడు వి ♦ వేకి సదన్వయ సంభవుండు శా
స్త్ర మధురవాగ్మి యాగమ వ ♦ శంవదుఁ డార్జితకీర్తియౌ నతం
డె మహి గురుత్వమూని చరి ♦ యింపఁగ యోగ్యుఁడగుఁ గణింపఁగన్.

క॥ అస్ఖలిత స్వాంతుండు తిరస్కృత సకలేంద్రియుండు ♦ రాగాంధతమో
భాస్కరుఁడగు నాతండె యశస్కరమగు గురుపదమున ♦ సత్కీర్తిఁ గనున్.

క॥ పరహృదయాకర్షణశక్తి రుచిరసంభాషణమున ♦ దృక్పాండితియున్
స్థిరయత్నముగల యాతఁడె యరయ గురుత్వార్హుఁడనుచు ♦ ననిరార్యజనుల్.

క॥ చింతావివర్జితుండున్ సంతుష్టస్వాంత పిశున ♦ సదమల ముఖుఁడున్
భ్రాంతిరహితుఁడగు నాతఁడె చింతింపఁగ గురుపదంబుఁ ♦ జేరంగఁదగున్.

మ॥ ఫలభారానతమై సహస్రకిరణ ♦ భ్రాజిష్ణు సంతాప సం
కలితంబై ప్రతిఘోర కన్వగుల మా ♦ ర్గక్లాంతిఁ బోఁగొట్టు ని
ర్మల భూమీరుహ సంచయంబువలె సమ్మాన్యుండునౌ యొజ్జ శి
ష్యులకున్ జ్ఞానముఁగూర్చుఁ బ్రత్యుపకృతి ♦ స్తోమంబునన్ నిస్పృహన్.

తే॥ ఎట్టి దురవగాహ ♦ మేని విద్యను సులభముగఁ దెలియునట్టి ♦ పద్ధతిఁ గొని
యధ్యసింపఁజేయు ♦ నాతండెగా యుపాధ్యాయపదము నొంద ♦ నర్హుఁడగును.

ఆ॥ ఎవ్వఁ డెద్దానఁ బ్రీతి వ ♦ హించియుండునతని కన్యంబుఁ జెప్పక ♦ యదియసెప్పి
వానిఁ బ్రాజ్ఞునిఁగాఁ జేయు ♦ శక్తిఁ దెలియు నతఁడెపో గురుత్వాధికా ♦
[ రార్హుఁడగును

తే॥ ఇతరకారణంబు ♦ లెన్నేని యుండిన స్థైర్యమును వదలక ♦ సంతతము గ
దేక దృష్టి విద్య ♦ యే గఱపఁదలంచునానికడనె జదువ ♦ వలయు నరుఁడు.

మ॥ ధనలోభంబునఁజేసి యొక్కరుఁడు వి ♦ ద్యాంసుండు వోలెన్ నటిం
చిన మాత్రంబున వాని నమ్మి నిజ ల ♦ క్ష్మీస్థైర్యకృద్ధ్యాన జీ

వన మెల్లన్ వృథఁగోలుపోయి విలపిం • పన్ జెల్లునే యాత్మనం
దనులన్ ముందుగ యోగ్యుఁడైన గురు నొ • ద్దన్ జేర్ప నౌఁగాకిలన్.

వ॥ కావున నిరంతరబోధనాపద్ధతుల నాఁటి తేరిన యుపాధ్యాయు నాహ్వానించి నిజనందను జదివింపవలయును.

తే॥ కన్నులుండియుఁ గానండు కాళ్ళు గలిగియును నడవలేఁడు చదువకుం•డిన నరుండు
కానఁ జతురుఁడౌ గురునొద్ద • కనికరంబుఁ దలపక కుమారుఁ జదివింప • వలయుఁ గాదె.

మ॥ పరివారల్ దగునంచుఁ బల్కఁగ నర • స్వత్కాంచియా నివ్వసుం
ధరఁ జేపట్టఁగనున్నవాఁ డఖిల శా • స్త్రవ్రాతమున్ నేర్చి బం
ధురకీర్తిన్ గణియింపఁగావలసియుం • డున్ గాక యున్నన్ ధరా
వను సామంతులు పూఁరికిన్ గొనక యే • వంచింతు రశ్రాంతరమున్.

చ॥ అసలగురుప్రబోధమున • నాఢ్యుఁడు గాక యసంస్కృతాత్ముఁడై
భ్రమఁగొని సంచరించు నరి • పాలుని గొంతలఁజేరి దుష్టు ల
క్రమమె క్రమంబటంచు నొడి • కంబున నెంతయుఁ జెప్పుచున్ దద
ర్థముఁ గొని పట్టపదంబుల వి • ధంబున వీడుచునుందు రెప్పుడున్.

తే॥ శాస్త్రపూతాత్ముఁడైన రా • జన్యునందె చంచలించుచునుండును • సతము లక్ష్మి
యౌవనోద్ధతుఁడగుచు వి • ద్యార్థి గాక యుండు నాతని కడ స్థైర్య • మూనియున్నె.

తే॥ రాజనీతి విద్యావిశా • రదుఁడు గాక రాజ్యభారంబుఁ దాల్ప నే • రం డెవాఁడు
క్షత్రియాన్వయమందున • జననమొందినంత నే క్షాత్రము నెందు నా ధరిత్రి.

వ॥ ఇంతకాలంబును బ్రియంబు సేయుచుఁ బ్రహ్లాదున కుచితవిద్య నేర్పింపకుండుట నా దోషంబ యగుఁగాని యాతని నేరమి గాదు.

చ॥ తనయుఁడు బుద్ధిమంతుఁడయి • తజ్జ్ఞజనంబులఁ జేరఁగాంచి ధ
ర్మనిరతి సంచరించుచు శ • మంబు దమంబును బూను నేని త
జ్జనయితయైనవానికి బొ • సంగును శాశ్వతసౌఖ్య సంతతుల్
గనుఁగొననట్టి వార లధి • కంబుగఁ గల్గఁగబోరు ధాత్రిపై.

మ॥ ఇమ్మగుఁ బిడ్డఁడు లేఁతప్రాయముగలాఁ • డార్తిన్ బడన్ లేఁడు చె
ప్పిన నింతేని గ్రహింప నేరఁ డిపుడే • విద్యార్థిఁ గాఁ జేయఁగాఁ
బని యేమున్నది కొన్ని నాళ్లు గడవం • బాటించి యాతండె నే
ర్చునటంచున్ జదివింపకుండుట సుత • ద్రోహంబగున్ దండ్రికిన్.

వ॥ అని యనేక విధంబుల విచారించి ప్రహ్లాదు నాహ్వానించి శిరంబు మూర్కొని యంకంబునఁ జేర్చుకొని యిట్లనియె.

ఉ॥ ఉత్తముఁడైన పుత్రుఁ డొకఁ • డుండినఁ జాలదె పల్వురేల దు
ర్వృత్తిగలట్టివారలు ప • విత్రతమంబగు నాత్మవంశముల్
హత్తిన సద్యశంబునకు • నాభరణంబులఁగూర్చుచుల్ నిజా
యత్తులఁ దల్లిదండ్రులను • హర్షపయోనిధి ముంపకుండినల్.

తే॥ ప్రకృతిజన్యమైన • ప్రవిమలబుద్ధియు గురుని శాసనంబు • కొఱఁతవడిన
వన్నెకెక్కి యెందు • వఱలు సుందరతరమైనఁ బాడులేక • యలరులిడునె.

క॥ ఉత్తములగు గురువులకడ నిత్తఱి నినుఁజేర్తుఁ జదువు • మీ చదువుల దు
ర్వృత్తులగువారిఁ జేరక హత్తింపుము నిమలకీర్తి • నన్వయమునకుల్.

క॥ నీ యాధారంబునఁ గాదే యసురేశ్వరుని వంశ • మెల్ల బ్రతిష్ఠల్
బాయక త్రిజగంబులయం దాయతమగు కీర్తిఁ గాంచు ననవరతంబుల్.

వ॥ అనిపలికి గురుపుత్రులగు చండామార్కుల రావించి మఱియుఁ గొడుకుతో నిట్లనియె.

## — ప్రహ్లాదుని విద్యాభ్యాసము —

ఉ॥ వీరలు సద్గుణాఢ్యులు ప • విత్రచరిత్రులు భూనభోంతర
స్ఫార యశోభిరాములు హ • సన్ముఖ నీ దనుజాన్వయంబుఁ బెం
పారగఁజేయువారలు కృ • పార్ద్రమతుల్ మన కన్నిసంపదల్
గూరుచునట్టి యొజ్జలఱి • లోసులు భార్గవనందనుల్ హితుల్.

తే॥ కోవిదగ్రామణులు నీకు • గురువులగుదు రిమ్మహాత్ములకడఁ జేరి • యెల్లవిద్య
లభ్యసింపుము వీరల • కన్న నితరులెఱిఁగ నను కూలురు • గారు మనకు.

క॥ గురువుల కెదురాడఁజనదు నిరతము తద్విమల చరణ • నీరజముల సు
స్థిరమతి ధ్యానింపఁగఁదగు ధరణి గురువకన్న వేరు • దైవముగలదే.

క॥ అతఁ డేమిచెప్పిన సమంచితబుద్ధి నొనర్పవలయుఁ • జెవుగులరీతిల్
శ్రుతిపరుషము లాడఁగఁ జన దతులంబగు భక్తిఁగొల్వ • నగు గురు నెపుడుల్.

ఉ॥ ఆస్తికబుద్ధిఁ ద్రిమ్మరు మ • హా మతిమంతులనైన వారికిల్
నాస్తిగురోః పరమ్మనుచు • నాడెడు ప్రాబలు కావరించి యే
కస్తికి నైన నొప్పి యధి • కంబగు భక్తి గురుల్ భజించుటల్
శస్తముఁగూర్చునంచుఁ బుధ • స ప్రకరంబు భజించు సద్గురుల్.

తే॥ దీపికాసహాయంబునఁ • దిమిరమెల్లఁ బాఱపోలి కనుంగొను • పగిది నెపుడు.
తను ధనంబుల గురునకు • ధారవోసి యతని సాయంబునల్ జ్ఞాన • మందు నరుఁడు.

క॥ తలిదండ్రులయందుఁ బరెల్ గలుషనిహంతయగు గురునిఁ • గాంచిన భక్తిల్
దిలకించు శిష్యునకు సిరి.యలపడుఁ బురుషార్థ చయము • నందు నతండుల్.

వ॥ కావున నీవీ మహాత్ములయొద్దఁ జదివి జనయితలమగు మాకును, నధ్యాపకులగు వీరి
కిని, గీర్తిప్రతిష్ఠలఁ గూర్చి సరివారిలో దొర యనిపించుకొనుమని యుపదేశించి
ప్రహ్లాదుని భార్గవుల కొప్పించినవారును నయభయంబుల సామాద్యుపాయ యుత
మగు రాజనీతియు నర్థశాస్త్రమును ద్రివర్గ పాఠంబును దక్కఁగల యెల్ల శాస్త్రం
బులును సకల కళలును బోధించిన ప్రహ్లాదుండును.

క॥ రాదనఁడే శాస్త్రం బిదిగా దది యను వాదమునకుఁ • గాల్దివ్వఁడు స
మ్మోదంబె జూపు నా ప్రహ్లాద కుమారుండు వినయ • లక్షితుఁడగుచున్.

క॥ గురుఁ డెయ్యది చెప్పిన నాదరమున వినుచుండుఁ గాని • తనకహితమటం
చూసి పెడమోము వెట్టఁడు సురవైరికుమారుఁ డెట్టి • నూరివరుండో.

క॥ కనకకశిపుసుతుఁ డట్టుల మనసుఁ జలింపంగనీక • మర్యాదజ్ఞుం
డును వినయ సమేతుండై యనఘుండై చదువుచుండ • నరిగె దినంబుల్.

తే॥ చదువుచుండెనెగాని యా • సాధువర్తనుని మనంబెల్ల హరిపాద • జలజయుగళ
మునఁనె లగ్నమైయున్న క • తన నతండు ఎఱుఁగఁడేమి పఠించెనో • యింతయేని.

క॥ గురువులు సెప్పినదెల్లన్ బరమార్థప్రదమటంచు • భావింపక దు
స్తర సంసారపయోనిధి నిరతము మగ్నునిగఁ జేయు • నేయనితలఁచున్.

— ప్రహ్లాదుని వైరాగ్యము. —

చ॥ తలపరు నిత్యవస్తువును • దత్త్వముపై మదిఁ జేర్పఁ బోరు కా
సలపయి నాసవీడరు య • శో విభవంబుల జోలిమానరే
కెంపమునన్ భయంపడరు • కన్నులుగల్గియుఁ గానలేరు వీ
రల సహవాసమున్ సలిపి • రాగముఁ జెందుటయేకదా యగున్.

క॥ చదివించెడువాఁ డెవ్వఁడొ చదివెడువాఁ డెవఁడొ చదువు • సారం బెదియో
చదువన నెద్దియొ యెఱుఁగక చదుపకులమటంచుఁ బలుకఁ • జను నే తమకున్.

ఉ॥ కన్నులు గల్గి గ్రుడ్డియయి • కన్పడుదానినె గానలేక యే
మున్నది సర్వశూన్యమని • యూరక ప్రొద్దులఁ బుచ్చుచుండు వాఁ
డెన్ని భవంబులొందియును • నెన్ని తపంబులఁ జేసియున్ మహా
పన్నశరణ్యుఁ డాహరిని • భావమునన్ గననేర్చునే యిలన్.

శా॥ మాయావాగురమందుఁ జిక్కి వెలిగా • మార్గంబుఁ గానంగలే
కాయా దుష్టపథంబులన్ జనుచని • త్యంబైన యీ కాయమే
శ్రేయఃప్రాప్తికి మూలమంచును బర • శ్రేయంబు వాంఛింపక
వ్యాయామత్తసుఖంబెనోరు ఖలులా • యజ్ఞాత్మఁ జింతింతురే.

ఉ॥ కరములమోడ్చి భక్తిమెయిఁ ♦ గంజదళాక్షుని మ్రొక్కుచున్న సు
స్థిరమతి దేవదేవు విను ♦ తింపఁ దలంపదయేని విఘ్న మం
దిరముల మెట్టఁగల్గిన య ♦ దృష్టము చేకుఱదేని దుష్కృతా
కరమగు నీ శరీరము జ ♦ గంబులకే యుపకారకారియా.

సీ॥ కనఁబడకున్నె స ♦ కల మౌనిహృదయ సం గుప్త దివ్యపదార్థ ♦ మాప్తతతికిఁ
జేఁజిక్కకుండునే ♦ శ్రీహృదంభోజాత మత్తద్విరేఫంబు ♦ మాదృశులకు
విక్రయింపఁబడదె ♦ వేదాపణంబులఁ గ్రయ్యమౌ రత్నంబు ♦ ఘనమతులకు
ననుభవింపఁగరాదె ♦ యఖిల భాగవతభోజ్యంబగు నమృతంబు ♦ సాధువులకుఁ
జేరగారాదొ మోక్ష ల ♦ క్ష్మీప్రదాన చతురుఁడగు హరిసన్నిధి ♦ సజ్జనులకు
వ్యర్థముగఁ గాలయాపన ♦ మయ్యెననుచుఁ దలఁపఁగూడదె నిర్మలా ♦ త్ములకు నెందు.

సీ॥ పిలిచెడి చాతుర్య ♦ మలవడదే కాక పిలిచినఁబలుకఁడే ♦ కలుషహరుఁడు
కనుఁగొనియెడు తెల్వి ♦ కలుగ దింతయుఁ గాక కనఁబడకుండునే ♦ వనజనయనుఁ
దర్శించుమార్గంబు ♦ నరయకుంటయెగాక సర్వంబొసంగడే ♦ సర్వసముఁడు
సామీప్యమునుఁ జెందు ♦ సరణిఁ గాంచమి కాక సన్నిధినిడకున్నె ♦ వెన్నుఁడింత
జిహ్వను రుచించదే కాక ♦ శ్రీనివాసుఁ డీయఁడే స్వీయచింతనా ♦ మృతము నిరత
ఘోర సంసారజలధి మ ♦ గ్నులయి యైహికేచ్ఛఁ జరించుచుండెడి ♦ హీనులకిల.

సీ॥ ఏరీతి భజియింప ♦ నిందిరా హృదయారవింద భానుఁడు తన ♦ యందు నిలుచు
నేధర్మముఁ జరింప ♦ రాకేందువక్త్రోజ వాసి తనకు నిత్య ♦ వశ్యుఁడగును
నే త్రోవ నడచిన ♦ నీత్రయీవర్ణిత స్వాంతుండు తనకుఁ బ్రా ♦ పక మెసంగు
నే విద్యఁ జదివిన ♦ నెల్లజగంబుల రక్షించు దేవుండు ♦ రక్షకుఁడగు
నట్టిరీతియెద్ది ♦ యా ధర్మ వేది యా త్రోవ నెవఁడుఁజూపు ♦ దురితహరణ
సాధనమగు విద్యఁ ♦ జదివించు గురుఁడెవఁ డాప్తులైన పామ ♦ రాళికింక.

శా॥ ఆలుఁ బిడ్డలు సర్వసంపద లవి ♦ ద్యామూలముల్ భ్రాంతులై
యేలా త్రిమ్మరుచుండ్రు వీరి కెవరే ♦ నింతేనియుఁ జెప్పరే
కాలాహిన్ దరిఁ జేరనిత్తురె మహా ♦ గ్రాహంబుతో నాటలన్
జాలింపంగఁ దలంపరేమిటికి తు ♦ చ్ఛంబైన సౌఖ్యంబుకై.

ఉ॥ అంగనయే మహాజల చ ♦ యంబు సుతాదులటన్ జనించు ను
త్తుంగతరంగజాతములు ♦ దుఃఖ కరంబులు వాశ్చగంబు లా
భంగముఁ గూర్చు బాంధవు ల ♦ పారము గాదె గృహాంబురాశి స
త్సంగతియన్ ప్లవంబు విడి ♦ దాఁటునె యెంతటి యూఁత కాఁడిలన్.

చ॥ కలుషమహాంబురాశిఁ దరి ♦ గానకయుండెడి పామరాళికిన్
జలజవిలోచనుండనెడి ♦ చక్కని నావికు నాశ్రయించి ని

ర్మలమగు భక్తి నావఁ గొని • రాగతరంగచయంబు దాఁటి య
వ్వలఁ బడకున్నచో సతమ • వారిత దుర్గతియే గదా యగున్.

సీ॥ పద్మాలయాధీశుఁ • బలికింప నేరక పలికింప నేల య • న్యులను గూర్చి
సర్వేశు మంత్రంబు • జపియింప నేయక సేయింపఁగా నేల • చెడుగుపనుల
దానవధర్మంబు • దలపింపఁగాఁ బోక తలపింప నేల నిం • ద్యచరితముల
శార్ఙ్గిసత్కథలను • జదివింప నొల్లక చదివింప నేల దు • శ్శాస్త్రములను
హరినిలయములఁ జేర్పక • యహరహంబుఁ జేర్పఁగా నేల నో యస • త్సీమలందు
సుతులె వీరు ధనలుబ్ధ • కులయి తిరుగు వంచనాత్మకులైన లు • బ్ధకులు గాక.

మ॥ పరమేశాంఘ్రి సరోజయుగ్మముల సం • భావింపఁగా లేక దు
స్తరమై భీకరమై కనంబడెడు సం • సారాంబుధిన్ మున్గి వా
శ్చసంతానము వోలెఁ గొట్టుకొను దు • శ్ఛాత్రులే యొజ్జలై
పరిణింజూపఁ జరించు శిష్యులకు మో • క్షంబెట్లు చేకూరునో.

మ॥ సుమనోభీష్ట ఫలప్రదుండగుచు ద • క్షుండైన విష్ణుండె వే
దములన్ నిండి వెలుంగుచుండునటనిన్ • ధ్యానంబుఁ గావించు మా
ర్గమె మోక్షాప్తికి మూలమం చెఱిఁగి ని • ష్కామంబైన చిత్తంబుతో
మమకారంబుఁ ద్యజించువాఁడె తరియిం • పన్ గల్గు సంసారమున్.

క॥ అని చింతించుచు లోకంబున భ్రాంతి యొకింత లేక • మురమర్దను నా
కనకాంబరు శ్రితలోకావను నిరతు ననంతు హరిని • భావించు దగన్.

సీ॥ దనుజబాలురఁ గూడు • కొని యాడఁగాఁ బోడు హరి నెదనిల్పి తా • నాడుగాని
యావశ్యకము కార్యమునకైన నెవ్వారిఁ బిలువఁడు వెన్నునిఁ • బిలుచుఁగాని
యాఁకలిదైన న • మ్మా పెట్టుమనఁడు కేశవుఁ బెట్టుమనుచుఁ జే • చాపుఁగాని
భయమెద్దిగల్గినఁ • బాఱఁ డంతిపురంబు హరిఁ బ్రోవుమని గుడి • కరుగుఁగాని
కనులు మూసికొనియె యుండుఁ • గదలఁబోడు క్షుత్పిపాసలనైన నో • ర్చుకొనఁగల్గు
నెట్టి భక్తాగ్రగణ్యుఁడో • యెట్టి మునియొ యెట్టి సిద్ధుండొ ప్రహ్లాదుఁ • డెట్టిఘనుఁడొ.

తే॥ అటులఁ గొన్ని దినములేగ • నసురవరుఁడు కనకకశిపుండు తన కుమా • రునకు గురువు
లేమి చెప్పిరో యా బాలుఁ • డేమి చదివి యెట్టి విద్వాంసుఁ డయ్యెనో • యెఱుఁగఁ గోరి.

— హిరణ్యకశ్యపుఁడు ప్రహ్లాదుని బరీక్షించుట —

చ॥ తనయునిఁ జేరఁ బిల్చి ప్రమ • దంబున నంకతలంబుఁ జేర్చి మె
ల్లనఁ జుబుకంబు ముద్దుగొని • లాలనఁ జేయుచు మేను రాయుచున్
దనుజవిభుండు పల్కెఁ శ్రుతి • తర్పణముల్ మధురార్థవంతముల్
జనవినుతంబు లాదరణ • సంపదుపేతములైన పల్కులన్.

తే॥ సకల సౌఖ్యములకు • జనకుండు నిర్మలపుణ్యకర్మములకుఁ • బుట్టునిల్లు
కులము పెంపుఁజేయఁ గల సమర్థుఁడు సద్గుణ సమేతుఁడైన • కొమరుఁడరయ.
తే॥ ఇతరకారణముల జని•యించుచుండు హృదయసంతాపమును మాన్చి•యెల్లయెడఁ
దండ్రికి ముదంబుఁగూర్చుఁ గ•దా ధరిత్రిఁ బ్రాజ్ఞుఁడై కీర్తిని గడించు•పట్టియెపుడు.
మ॥ తనసౌఖ్యంబున యందు వాంఛవిడి ని • త్యం బెట్టికష్టంబులై
నను సైరించుచు నెట్టి దుష్కృతములై • నన్ సల్పుచున్ సర్వశా
సనకర్తృత్వముఁ బుత్రునందె యిడి సంచారించుఁ గావించు నా
జనకుండాత్మజు కారణంబునఁ గదా • సంతోషమున్ జెందుటల్.
తే॥ సుగుణవంతుఁడైన సూనుని కతమునఁ గులము వన్నెకెక్కుఁ • గోవిదుండు
గాకయున్న వాని • కారణంబునఁ జెడునను చుఁ బలుకుచుండు • నాగమములు;
వ॥ అట్లగుటంజేసి యహోరాత్రంబులు నీయందె ప్రాణంబులనిల్పి నీవే లోకంబుగ
భావించియున్న నాకు హితంబుఁ గూర్చుట నీకు ధర్మంబగును.
తే॥ చదువఁ బంపితి గురువుల • సన్నిధానమునకు నా రేమి బోధించి • రఘు ముఖగు
శాస్త్రముల నెవ్విధంబునఁ • జదివి దాన సారముగ్రహించితివో నాకు సరగఁ దెల్పు.
వ॥ అని యడిగిన వినయవినమితదేహుండై ప్రహ్లాదుండు తండ్రికిట్లయె.

— ప్రహ్లాదుడు హిరణ్యకశ్యపునకు విష్ణుప్రభావము జెప్పుట —

క॥ వారలు సమస్త విద్యా పారంగతులైనవారు • భార్గవులు నన్ గూరిమి జదివించిరి నే నేర్చితిని నిఖిలశాస్త్ర • నికరం బధిపా.
తే॥ సకలశాస్త్ర సారంబును • సంగ్రహించి వినఁదలంచెడువారికి • వినుతునను చుఁ
దలఁచుచుంటిని వెసనీవె • ధర్మబుద్ధి నడిగితివి నేను ధన్యుఁడ • నగుదునింక.
చ॥ సకల పురాణముల్ స్మృతులు • శాస్త్రము లెన్నిపఠించినన్ శ్రుతి
ప్రకరములందుఁ జూచిన జ • రాచర లోకనియంతయైనవాఁ
డొకఁడె పరాత్పరుండు సుగు • ణోన్నతుఁ డీశుఁ డనంతుఁ డవ్యయుం
డకుటిల చిత్తుఁ డాద్యుఁడను • నార్యమతంబు గనుంగొనన్ బడున్.
సీ॥ ఏమహామహునియం • దెల్లలోకము లగ్నియందు స్ఫులింగము • లట్లదోఁచు
నే భగవంతునం • దీ భూతజాలంబు తరువునశాఖల • కరణిఁ బెరుఁగు
నే దేవదేవునం • దీ విశ్వమస్మాదృశులయెడఁ గోర్కులు • వలె నశించు
నేవిభు నెల్లరు • భావించి సేవింతు రన్నపూర్ణాదేవి • నఖిల మటుల
నెవ్వఁ డాదిమధ్యాంత ర • హితుఁ డెవానిఁ గొల్చి తరియింత్రు నిఖిల భ•క్తులు సతము
సర్వలోకావనుండైన • సాధుమూర్తి సన్నిధియె కోరుమని పల్కుఁ • జదువులెల్ల.

ఆపన్నివారకుఁ డఖిలతాపత్రయ దుఃఖహరుఁ డు • దారుఁడు విశ్వ
వ్యాపకుఁడగు పరమేశు నిరూపించుచుఁ జదువులెల్ల రూఢంబులగుఁక.
ధాతికమైన యీజగ మ • వారితరీతి సృజించునే ఘనుం
డా తతసౌఖ్యదాన నతు • రాత్మకుఁడై చరియించునే విభుం
డాతని నిర్వికారుని ని • రామయు నీశ్వరుఁగూర్చి చెప్ప వి
ఖ్యాతములైన శాస్త్రనిచ • యంబులు నిత్యము దానవాగ్రణీ!
సంయమీంద్రులె వాని • స్వాంతంబులఁక నిల్పి యమనియమాదుల • నాచరింతు
రెవని నుద్దేశించి • యెల్లయాగంబుల సలుపుచుందురుమాని • సంచయంబు
ఏదేవు ధ్యానింప • కే కవీంద్రులు కావ్యముల రచియింపఁగఁ • దలపరెప్పు
డెచ్చోటఁజూచిన • నచ్చోటఁ దానయై కనుపట్టుచుండెడు • ఘనుఁడెవండు
ని సద్గుణాఢ్యు • ననజాయతాక్షు వర్ణించుచుండు నెపుడు నిఖిల శాస్త్ర
తతి యతనికన్న • వేరొండు గానరా దక్షరప్రపంచ • మందు నెందు.
సకలవేదములకు • సారంబు వెన్నుండు నిఖిలశాస్త్రములకు • నేతవిష్ణుఁ
డతనిఁజేరు మార్గ • మరయుటయే బుధసంచయంబు చదువు • చదువుఫలము.
ఎవ్వఁడెట్టికార్య • మేయొనరించిన హరికిఁదెలియకుండ • దట్టికార్య
మునకుఁ దగినఫలము • మునుకొనిగోవిందుఁ డొసఁగుఁగాని యూరకుండఁడెపుడు.

— హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని నిందించుట. —

అఃవుడుదానవాగ్రణి య • హంకృతిదీపితలోచనుండునై
తనయునిఁ ద్రోఁచిముందఱను • దర్పమెలర్ప వచించునోర మ
త్తనయుఁడవంచుఁబేర్మి మెయిఁ • దగ్గరఁదీసిన నన్నెపూరికిఁక
గొనకవిరోధివర్ణనలఁ • గోరియొనర్చెదె భీతివీడుచుఁక.
నీ చదువునకిదియెఫలం బా చీనోదృమ్మయమెవ్వ • రైనవినినచో
నీచేష్టలనిందింతురు వాచాలుఁడవగుదె దనుజ • వల్లభుప్రోలఁక.
దనుజులపాలి స్వర్ద్రుమము • దర్పితదుష్టసురేంద్రకాననం
బునకు దవానలంబు పరి • పూతయశోద్రవిణార్జనంబు సా
ధనము మదీయ బాహు • జనితంబగు విక్రమమీ వెఱింగెఱుం
గనిగతిఁ బల్కెదేల నిను • గారవబుద్ధివహించి పిల్చినఁక.
కరవాలం బొకట్రేలఁ గైకొని మహో • గ్రంబైన డాలొక్కచే
తనహింపఁక రణరంగమధ్యమున ను • ద్యద్భానుకోటిప్రభా
స్ఫురణఁక మించి వెలుంగు నన్నెదిరితాఁ • బోటూగ్గఁగానేర్చునే
హరియేనిఁక గిరియేని వ్యర్థముగ నే • లా పల్కెదో పుత్రకా.

ఉ॥ వెన్నుఁడు వెన్నుఁడంచుఁ బది ♦ వేల విధంబులఁ బల్కెదేటి కా
వెన్నుఁడు గిన్నుఁ డాజిఁ దొలి ♦ వేలుపుమూఁకలు నిర్జరావళిన్
బన్న మొనర్చుపట్ల దన ♦ బంటుతనంబును జూపనేర్చె నే
సన్నఫువాని నున్నతుల ♦ సన్నిధిఁ జెప్పిన కార్యముండు నే.

చ॥ చిఱుతవునీవె వారెటులఁ ♦ జెప్పిన నట్టులె సేయుచుండు గా
కెఱుఁగఁగ శక్యమానె యసు ♦ రేంద్రుల వృత్తము నీవు రక్కసుల్
చెఱఁగొని వేల్పుకన్నియలఁ ♦ జెచ్చెఱఁ దెచ్చెదు వేళనైనఁ గ్ర
చ్చఱఁ గరివేల్పు వారికయి ♦ యా దితిజావళి మోహరించెనే.

తే॥ నిగ్రహానుగ్రహ సమర్థున్ ♦ నిఖిలలోక పాలు ననుఁ గొల్చి సౌఖ్యంబుఁబడయలే
చెడఁదలంచెద వేటికిఁ ♦ జెరఁటియైన యసురవైరిని గొప్పవా ♦ డనుచుబలికి.

తే॥ పట్టిపొటఁబంచ ♦ వర్షంబులుగ లట్టి బాలకుండవగుట ♦ బ్రతుకఁగంటి
వెన్న డేనియింక ♦ నీరీతిఁ బలుకక మనుముపొమ్మ నీదు ♦ జననికడకు.

వ॥ అని యహంకారంబు పెంపున నొడలెఱుంక క్రోధారుణితలోచనుండై పలుకు ...
కుని పలుకులు చెవులకు ములుకులై బాధించినను గలంగక ప్రహ్లాదుండు మరల ...
విద్వేషి కిట్లనియె.

క. జనకుఁడవు వయోవృద్ధుఁ డవనితరసామాన్య విక్ర ♦ మాఢ్యుఁడవుమనీ
షినికరముఖ్యుఁడవీవిట్లను టుచితమె ♦ సాధువైన యాత్మజుతోడన్.

క. నావంటి పామరావళి కేవిధముగనైన మార్గ ♦ మెఱిఁగించుట లే
కీవిధి నాడుటతగునే నీవెఱుఁగని ధర్మ మేది ♦ నిర్జరవైరీ.

క॥ సర్వజ్ఞుఁడు సర్వేశుఁడు సర్వాత్ముండైనవాఁడు ♦ జలజాక్షుఁడుగా
కుర్వినొక వేల్పుగలఁడే దర్వీకరశయనుదూరఁ ♦ దగునే తండ్రీ!

మ॥ పరయోగీంద్ర మనోవిహారి కరుణా ♦ వాసంబు లక్ష్మీ మనో
హరుఁడార్తావన తత్పరుం డఖిలలో ♦ కైక ప్రదీపంబు శ్రీ
హరి యాదేవు మహత్వమున్ దెలియఁగా ♦ నానే యసన్మార్గ సం
చరులై మాయఁదరింపలేని ఖలు లే ♦ శాస్త్రంబులన్ నేర్చినన్.

ఉ॥ కల్లజగంబెనిత్యమని ♦ కాలునితత్వ మెఱుంగలేక తా
రిల్లని యాలుఁబిడ్డలని ♦ యెంచు చొనర్చినదే యొనర్చుచున్
ద్రెళ్లెడి దుష్టులా సకల ♦ దేవకిరీట మణీమయూఖ సం
పల్లలితాంఘ్రియైన భ॥ ♦ వంతు రమేశు భజింపనేర్తురే.

ఉ॥ వీరలు వారలంచు నొక ♦ భేదముఁ జిత్తమునన్ వహించి దు
ర్వార భవోరుపాశముల ♦ బద్ధులనై చరియించు దుష్టులే
తీరునఁ గాంచనేర్తురు వి ♦ ధి ప్రముఖాఖిల దేవసంచయా
ధారుని యోగిరాడ్హృదయ ♦ తామరసాగ్రవిహారు నీశ్వరున్.

శా॥ కామక్రోధముఖాదివర్గముఁ దిర • స్కారంబుఁ గావింపలే
కేమోచేసితి వెద్దియోసలిపితం • చీమాడ్కి గాగాంధతన్
సామంబున్విడి పల్కెదేల దనుజే • శా? సర్వమున్ నీరద
శ్యాముండైన మురారి ప్రోఁచుననుచున్ • జర్చింప కింతేనియున్.

వ॥ సకల జగన్నియంత మురసం • హరుఁ డీశ్వరుఁ డాదిదేవుఁ డ
య్యకుటిలు నాశ్రయించి పర • మార్థముఁజెంది తరించు త్రోవఁ గా
నక ఖలులై చరించుచు స • నాతనధర్మము వీడునట్టివా
రికిఁ గమలామనోహరు హ • రిన్ గను నేర్పు పొసంగునే యిలన్.

చ॥ తను వనయంబునిల్వదు ని దాఘమరీచికలట్ల సంపదల్
మనుజున కాసఁగూర్చు నభి • మానము చావదు దుష్టసంగతిన్
దినదినమత్తుఁడై యఖిల • దేశములన్ జరియించి వృద్ధుఁడై
యనయముఁబూని మృత్యుముఖ • మందుఁబడున్ గద మానవుండొగిన్.

ఉ॥ ఎందఱు దానవేశ్వరు ల • హీనపరాక్రమ లీసము ద్రకాం
చిం దుదముట్టనేలరొ య • శేషసురప్రకరంబుఁగెచ్చి సం
క్రందను వైభవంబుఁగొని • కంటకులై చరియించుచుండు వా
రందఱ నాజిఁ గూల్పఁడొ మ • హాత్ముఁడు వెన్నుఁడు దానవాగ్రణీ!

వ॥ అని పలుకు కుమారునిపలుకుల కులికి తొలివేల్పువలఁతిబొమలు ముడివెట్టుచు దంతంబులు గీఁటుచు హుంకరించుచు దండతాడిత మహాకాలసర్పంబుమాడ్కి నిట్లనియె.

క॥ ఏమని బోధించితి నపుడేమని పల్కెంగఁగడఁగి • తిప్పుడు కులమున్
నీమంబును బాటింపక ధీమహితులమ్రోల నిట్టి • తేకువ చనునే.

ఉ॥ బాలుఁడవే దురాత్ముఁడవు • పల్కెదవేటికి సిగ్గులేక నా
మ్రోలనెవారలొ చెప్పిరని • మూర్ఖుఁడవై యొకస్వల్పుఁ గూర్చి వా
చాలత మేలొసంగునె ద్వి • షచ్చరితంబులు బల్కఁ గూడునే
శీలము గాలమున్ గణన • సేయకవత్తిలు టహా మేధరన్.

—• హిరణ్యకశ్యపుఁడు ప్రహ్లాదుని దండించుట •—

తే॥ తండ్రిమాటవినక • ధర్మువు విడనాడి పగతుబంటువోలెఁ • బొగడుచుంటి
వెవఁడు నీకుఁజెప్పె • నీసాహసంబేల కలిగెఁ దులువవైతె • తెలివిలేక.

క॥ వెన్నుఁడట మన్నెకాఁడట క్రన్నననాతని భజింపఁ • గానెల్లరకున్
బున్నెము లభించునట తన కన్నివిధంబులను సాయ • మగునట నతఁడున్.

క॥ ఇదియా నీ చదివినచదు వదరక నామ్రోలఁబల్కు • టా వైరి కథల్.
విదితంబయ్యెను నీమతి తుదముట్టెను నీదుబ్రదుకు • దుష్టకుమారా.

చ॥ అదితికుమారులందఱు భ • యంబున సద్దెశలందుఁ బాఱబె
న్గనఁగొని శత్రుసంతతులఁ • గాటియవెట్టుటొ దానవాళికిన్
ముదముచెలంగునట్లు సుర • భోగముఁ గూర్చుటొ లేక తండ్రితో
నెదిరివచింతువేల గుణ • హీనుఁడవై సభలోనఁ బుత్రకా.

క॥ జనకుఁడువిరోధియైనన్ జనని విషంబిడిన నృపతి • శాసింపఁదలం
చిననడ్డుసేయువారెవ రని తలఁపవదేల దుష్టుఁ • డా యించుకయున్.

ఉ॥ అంతకుఁడైన నాయెదుర • నోదలవాల్చి భయంబు పెంపునన్
స్వాంతము తత్తరంపడగఁ బల్కఁగనేరఁ డొకింత దేవతా
కాంత కిరీటకోటిపరి • కంపితపాదుఁడనైన యట్టి నా
చెంతనె సహాసంబున వ • చింపఁగఁ బూనితె వైరివర్ణనల్.

క॥ హరుఁడవొ వైశ్వానరుఁడవొ వరుణుఁడవొ కుబేరుఁడవొ ప • వనుఁడవొ నీవి
ట్లరిదోర్దండ విఖండన గురుఁడగు దనుజేంద్రుమ్రోలఁ • గొనకొనిపలుకన్.

మ॥ దనుజాధీశ్వరుఁ బెద్దసేయకిటులన్ • దర్పంబునన్ బల్కినన్
దనయుండేయని జాలిబూనకయ యే • తద్దానవుల్ గన్గొనన్
విను శిక్షించెద నడ్డువారెవరొ రా • నీవెన్నుఁడో గిన్నుఁడో
ఘనదుండో గినదుండొనై బులితియొ వా • త్సల్యంబు జెన్నారఁగన్

వ॥ అని దానవయోధులం గాంచి దారుణంబుగ నిట్లనియె.

క॥ అనుకంపనీయుఁడీతం డని యెంచక వీని దర్ప • మడఁగించుఁడు శూ
లనికాయంబులఁ గ్రుచ్చుఁడు తన దుర్వాదము విడుచు వి • ధంబుననింకన్.

వ॥ అని యాజ్ఞాపించినఁ గ్రూరులగు నయ్యమరులెల్ల బాలుండని జాలి దలంపకయు, స్వామి పుత్త్రుఁడని భీతిలకయు, శాంతుఁడని సామంబు బూనకయు ధర్మజ్ఞుడని దుష్కర్మంబు మానకయు ప్రహ్లాదు ననేకవిధంబులఁ బీడింపఁదొడఁగి రయ్యవసరంబున నాయర్భకుండు.

## —• ప్రహ్లాదుడు భగవంతుని స్తుతించుట •—

మ॥ హరినారాయణ పుండరీకనయనా • యంబోధికన్యామనో
హరసర్వేశ్వర దానవాంతక మహే • శా భక్తరక్షాకరా
పురవిధ్వంసకలోకపాలక జగ • త్పూజ్యాసురేంద్రప్రియప్రియా
పరమేశాయనిపల్కఁగాని విలపిం • పఁగ బోఁ డొకింతేనియున్.

సీ|| పిలిచినంతనె మాఱు • పలుకుదంచుతలంచితిని నీవు వినిపించుకొనవదేల
చేయెత్తి జోహారు • చేసినప్పుడె నీకు దయగల్గకుండునా • దైత్యహరణ
భక్తులపాలిటి • స్వర్ద్రుమంబవుకదా యేడనున్నాడవో • యీశ యిపుడు
కమలాక్షనీప్రాపు • గాదని యితరుల నాశ్రయింతునె కల • నైనఁ గాని
వెడగురక్కసుండు • వీఁగక నన్నిట్లు బాధసేయఁ దొడఁగెఁ • బనికిమాలి
యింతమాత్రముననె • యీశ్వరనీపాద కమలసేవవిడువఁ • గలనె నేను.

చ|| ఎవని కృపావిశేషమున • నీజగముల్ జనియించుచుండునో
యెవఁడడవిన్ గృశించు బల • హీనులకెల్ల బలంబుఁ గూర్చునో
యెవనిఁ దలంచినంత విష • యేచ్ఛ దొలంగునో యట్టి దేవుఁడే
ప్రవిమలబుద్ధిఁగూర్చి యసు • రక్షణ జేయును నాకు దిక్కగున్.

ఉ|| పాపభయంబులేక తమ • బాహుబలంబునె విశ్వసించి యే
పాపమెఱుంగనట్టి బుధ • వర్గము బల్మినిబట్టికొట్టి సం
తాపముగూర్చు దుష్టులను • దానవధించుచునుండు నెవ్వఁడా
శ్రీపతి నాకు సాయమును • జేయ నుపేక్షవహింపఁ డెన్నడున్

శా|| ఏత స్థావరజంగమాత్మక జగం • బేదేవు సంకల్ప సం
జాతంబై స్థితిఁగాంచి నాశమగునే • సర్వంసహాధీశు సం
ప్రీతిన్ జిత్తములన్ భజింతురు ముని • శ్రేష్ఠుల్ గుణాధారు భా
వాతీతున్ సురవంద్యు నాప్రవిమలున్ • ధ్యానింతు నెల్లప్పుడున్.

సీ|| జలజాక్ష నీకృపా • జలదంబువర్షింప నఘతాపమెల్లఁ జ • ల్లాఱకున్నె
పరమేశనీమంత్ర • పానామృతముగల్గ క్షుత్పిపాసల బాధ • గ్రుక్కకున్నె
దనుజారి నీభక్తి • యనునిధానంబుండ ఘోరదారిద్ర్యంబు బాఱకున్నె
యమరేశ నీ సహా • యమను తేజంబుండఁ గాఱించునే యంధ • కారపీడ
జలధికన్యామనోబ్జ భా • స్కర భవత్ప్రతాపమనియెడు దివ్యమా • తరణియుండ
దానవానీకరచిత బా • ధా ప్రవాహ మిపుడ దాటకయుందునే • యింక నేను.

వ|| అని పరమాత్ముండగు దామోదరు ననేకవిధంబులఁ బ్రార్థించుచు క్రూరరాక్షస
కృతంబులగు హింసాకృత్యంబులకుఁ జలంగకున్న యయ్యర్భకునిఁ గాంచి రోషాతి
రేకంబున గద సారించుచు హిరణ్యకశ్యపుండు.

చ|| ఒకకుల ముద్ధరించుటకు • నొక్కనిజంపుట పాతకంబుగా
దొకపురరక్షణంబు కొఱ • కొక్క గృహంబుఁ ద్యజంపవచ్చునం
చకలుషచిత్తులైన ఘను • లాడుదు రట్లగుటన్ భవాదృశున్
వికటు నధించి పౌరుషము • నిల్పుట యర్హము నాకుఁజూడఁగన్.

తే|| తనయుఁడవటంచు నెంతజె • ప్పినను వినక ప్రేలెదేమిటి కిట్టుల భీతివిడిచి
ప్రాణములయందు నీ వాస • పడుదువేని శరణువేడుము దనుజేంద్రు • చరణములను.

క॥ నావచనము లాలింపక కావరమున హరియె దిక్కు • కాఁగలఁడనుచున్
దేవారిమ్రోలఁబల్కెదవే వెన్నుని జూపవేస్తు • వే యిచ్చోటన్.
వ॥ అని పలుకుచు గదఁ గైకొని యటనున్న యొక్క యుక్కకంబమునఁ గొట్టిన.

—• నృసింహావిర్భావము •—

సీ॥ ప్రళయార్కకోటి ప్ర • భాపటలము వోలెఁ దనుకాంతి పుంజంబు • ధరణివెలుఁగ
బ్రహ్మాండ భాండంబు • బ్రద్దలుగాఁ జేయు నతుల కంఠధ్వని యతిశయింప
సానపట్టిన క్రక • చంబులమాడ్కి భీకరములగుచు నఖా • గ్రములు చెలఁగ
గంభీరపర్వత • కందరంబట్టుల వదనగహ్వరము క • న్పట్టుచుండ
నిడుదకోఱల మెఱుఁగులు • నెగడదిశల దిగ్గజప్రకరంబులు • గ్రుమ్మగిపడగఁ
జూపఱుల గుండియలు నెల్ల•జూఱగొనుచు నిర్గమించె స్థంభమునుండి•నృహరియప్పుడు
క॥ ఆకరణినిర్గమించిన రాకాసులగొంగఁ గని హి • రణ్యకశిపుఁ డు
ద్రేకంబున వచియించెను భీకరవచనముల లోక • భీకరుఁడగుచున్.
క॥ ఈ వెడగువాని బ్రోచుటకై వచ్చితె వెన్నుఁడవె య • హంకారాంధుం
డై వీఁడు పిలుచుటయు నీ వీవిధి వచ్చుటయు నాకు • హెచ్చరికయగున్.
క॥ నరుఁడవొ మృగమవొ నీవీకరణిన్ జనుదెంచుటేల • ఘనదోర్దండ
స్ఫురణ వెలయ దనుజేశ్వరు కరవాలంబునకు నోర్వఁ • గలవే యాజిన్.
ఉ॥ పౌరుషశాలివేని పరి • పంథికులాచల వజ్రమైన మ
ద్భూరి గదాహతిన్ నిలిచి • పోరజయించుట యర్థమానుగా
కోరి సురాధమా యిటుల • నూరక భీకరరూపమూని దు
ర్వార పరాక్రముండు వలె వచ్చినయోధులు నిన్ను మెత్తురే!
ఉ॥ సంకరరూపు దాలుచుట • సాగదునాకడ నెప్పు డిల్లె యే
వంకరవేసమో గొనుచు • వక్రుఁడవై చరియించుచుందు వే,
వంకకుఁ బాటినన్ విడ క • వారితరీతి వధింతు నిన్ను ని
శ్శంక నెదిర్చి యాహవము • సల్పెదవే యొక పోటుబంటవై.
వ॥ అని వచియించుచు.
క॥ గిరగిర ద్రిప్పుచుఁ బెన్గద నరహరి వక్షస్థలంబు • నన్ వ్రాఁకెదు న
ట్లురువడినైచిన నాతఁడు కరమున నద్దానిఁ బట్టి • కనలుచు విఱిచెన్.

—• నృసింహమూర్తి హిరణ్యకశ్యపుని వధించుట •—

వ॥ అట్లు విఱిచి నృసింహదేవుం డుగ్రుండై భుజంగవల్లభు నొడిసి పట్టుకొను పక్షి
స్వామివోలె దురాత్ముండగు హిరణ్యకశ్యపుఁబట్టి యుత్సంగంబునఁ బడవైచి నీ

కృపాణంబులకైవడి తీక్ష్ణధారావంతంబులగు కరరుహంబులచే నాతని వక్షఃకవాట విపాటనంబుఁ గావించి చిమ్మనగ్రోవిచేఁ జిమ్మఁబడునట్లు వెడలు కవోష్ణంబగు రుధిరంబు ద్రావి భయంకరుండై బొమలు ముడివెట్టుచు దంతంబుల గీఁటుచు సటలు విదిలించుచు ప్రళయకాల జలధరంబు భంగి గర్జించుచు నల్దిక్కుల నట్టె చూచుచు హుంకరించుచున్న యమ్మహాదేవు నుగ్రస్వరూపంబుఁ గాంచి కాంచనగర్భాదులు వడంకుచుండి రంతిపరమభాగవతోత్తముండగు ప్రహ్లాదుండు.

మ॥ శ్రుతిసంతానము సంతతంబు నిను ని ♦ ర్దుష్టంబులౌ ఋక్కులన్
వితతంబౌ పరతత్త్వమంచు బలుకున్ ♦ విద్వాంసులెల్లన్ జగ
త్పతినీవంచు భజింతు రాత్మలభవ ♦ త్సాన్నిధ్యమే నాకు ని
త్యతమోఘ్నంబని కొల్తు నెమ్మది నృసిం ♦ హా భక్తకల్పద్రుమా!

క॥ నీవలనఁ బుట్టు పెరుగును నీవలననె లయమునొందు ♦ నిఖిల జగంబుల్
దేవా తావక నిర్మల సేవాకృత్యంబును దయ ♦ సేయంగదవే.

ఉ॥ నీవుసహస్రపాదుఁడవు ♦ నీవపరాత్పరమైన బ్రహ్మమున్
నీవ సహస్రబాహుఁడవు ♦ నీవలనన్ బ్రభవించు లోకముల్
దేవ భవత్కృపాకలన ♦ దివ్యులకున్ విజయంబు గల్గె నీ
పావన దర్శనంబు మెయి ♦ పాపములున్ హరియించె నాయెడన్

వ॥ అని స్తుతించె నంత బ్రహ్మాది నిర్జరులు నొకింత స్థైర్యంబుఁబూని.

## —దేవతలు నృసింహదేవుని స్తుతించుట—

సీ॥ స్థూలంబులందున ♦ స్థూలంబగుదువీవు సూక్ష్మంబులందున ♦ సూక్ష్మమీవు
జ్యోతిస్స్థలంబరం ♦ జ్యోతిస్స్వరూపివి వాగతీతంబగు ♦ బ్రహ్మమీవ
యాలంబరహితుఁడ ♦ వాలంబనము నీవ యజ్ఞభోక్తవు నీవ ♦ యజ్ఞమీవ
సనన ఫలప్రదస్వామి వీవ సమస్త ధర్మంబు లీవవే ♦ దంబు లీవ
దుష్టదానవకల్పితా ♦ నిష్టసకల కష్టసంతతిఁ గుందెడి ♦ క్రతుభుజులకుఁ
ద్రాలైన మీనకూర్మవ ♦ రాహనారసింహరూపంబులన్ గాంచి ♦ చెలఁగితీవ.

వ॥ దేవా ! సమస్తజగదాధారుండవగు నీవు ద్విజశాప చ్ఛలంబున నిట్లవతరించితివి గాని యీ ప్రపంచంబున నీకన్న నన్యంబుగలదే. త్రిమూర్తి స్వరూపుండవగు నీ వీ భయంకర రూపం బుపసంహరించి భూతకోటిని రక్షింపుమని యనేకవిధంబులఁ బ్రార్థించి రైనను.

మ॥ బలగర్వోద్ధత దుష్టదైత్యకుల రా ♦ ద్వక్షస్స్రవ ద్రక్తసం
కలితాంగుండయి భీకరాస్యుఁడగుచున్ ♦ గర్వించి లోకంబులన్

గలఁచుచుఁ గాని నృసింహదేవుఁడు జగ • త్కళ్యాణముఁ గూర్పఁగాఁ
దలఁపండయ్యె నిదేటి పాతక మొచి • త్రంబాగదా చూడఁగన్
చ॥ జలరుహనాభుఁ డవ్విధిని • శాంతముఁ బూనక యుగ్రుఁడై ధరా
వలయము భీతిఁ గొల్పుటయు • వారిజ సంభవముఖ్యులైన వే
ల్పులు భయమొంది యేకరణి లోకముఁ బ్రోవఁగలారమో యటం
చలజడి నొంది శంభుఁడె మ • హాత్ముఁడు గాఁచునటంచు నెంచుచున్.

—• దేవతలు నృసింహార్తి కోర్వక యీశ్వరునితో మొర వెట్టుట •—

మ॥ అనఘా నీవు పరాత్పరుండవగు ద • త్తైశ్వర్యముల్ నీయెడన్
జననంబందుఁ జరాచరంబగు జగ • జ్జాలంబు రక్షింపఁ గ
ల్గిన దేవుండవు నీవ నీ చరణముల్ • గీర్తింపఁగాఁ గల్గు పు
ణ్యానికాయంబున కేము పాత్రులముగా • మా సౌఖ్యసంధాయకా!
క॥ ఏదోసకారియైనన్ నీ దాపునఁజేరునేని • నిఖిలజ్ఞుండై
మోదంబుఁ జెందు నెప్పుడు సాదితరిపులోకయీశ • చంద్రార్ధధరా.
క॥ అనుచున్ భూతగణంబులు వినుతింపఁగ మందరాద్రిఁ • బృథ్వీధర రా
ట్తనయఁ గలిసి విహరించెడి యనఘుని హరుగాంచు కోర్కె • యాత్మలఁజెలఁగన్.
వ॥ భయసంభ్రమంబులు బెనఁగొన నగ్గిరివరశిఖరంబున కరిగి సాష్టాంగ ప్రణామః బాచరించి:
మ॥ పరమేశా నిను నిట్టివాఁడవని చె • ప్పన్ నేర్తుమే యీ చరా
చర భూతంబులు నీ శ్రుతుల్ స్మృతులు శాస్త్రంబుల్ బురాణంబు లీ
శ్వరు వర్ణింపఁ దరంబుగాదని పచిం • పన్ శాశ్వతంబైన నీ
చరణాచార్చావ్రత మొందు దక్క గిరిజే • శాచీన సంరక్షకా.
వ॥ మయస్కరుండును, విశ్వరూపుండును త్రిమూర్త్యాత్మకుండును నంత కాంతకుండును శర్వుండును హిరణ్య బాహుండును, హిరణ్యపతియు నగు నీకు నమస్కారః బని నమకచమకంబుల ధ్యానించి.
చ॥ దితితనయుండు మాయెడలఁ • దీఅని దోషముఁ దాల్చి యుద్ధతుం
డతుల బలాన్వితుండయి య • హర్పతి తేజమునన్ జెలంగి లో
కతతిఁగలంచుచుండగ న • కారణమైన తదీయ తేజమున్
గ్రతుభుజు లోర్వలేక యొడి • కంబున వెన్నుని చెంతకేగినన్
క॥ ఆతఁడు కరుణాన్వితుఁడై తిరహితుఁడై చరించు • నిర్జరవైరిన్
ఖ్యాతపరాక్రముఁ గూల్పఁగ భూతలి నరసింహరూప • మును దాల్చెనోగిన్.

ఆ॥ కలుషవర్తనుఁడగు • కనక కశిపుఁ బట్టి యతని యురముఁ జీల్చి • హతుని జేసి
యును నృసింహదేహ • మును సంహరింపక యురక బాధసేయు • చుండె జగము.

॥ అసుర కృతార్తి వాసెనను • హర్షముఁ జెందెడి నంతలోపలన్
బొసఁగె నృసింహబాధ మము • బ్రోవఁగ నేర్పుగలాఁడెవండొ లో
క సమితి యిట్టి కష్టములఁ గాంచి కృశింప యుపేక్షఁ జేయు టో
యసమ శరారి నీకుఁ దగు • నా జనకుండవు గాదె సృష్టికిన్.

తే॥ తల్లి కూర్మి లేక • తనయుల బాధింపఁ దలఁచునేని జగతిఁ • దండ్రి గాక
పసుల కెట్లు దీర్పఁ • దరమా నృసింహకృతార్తి మాన్ప నీక యర్హమగును.

॥ ఈ యాపత్కాలంబున నేయుపకారం బొనర్తు • వెటు బ్రోచెదవో
పాయని యిడుమలఁ బడియెడి నీ యమరావళికి శరణ • మీవమహేశా.

॥ అని దీనంబుగఁ బల్కిన సానుకంపుండై పరమేశ్వరుఁడా గీర్వాణగణంబుఁ గాంచి యిట్లనియె.

॥ అరుసుడు వేల్పులార భవ • దర్థము నేనిదె యేగుదెంచెదన్
సురరిపురక్తపానమున • సొక్కి జగంబుల నేఁచుచుండు నా
నరహరి సంహరించెదను • నాకులకున్ హితమైన బ్రోవఁ బ్రి
య్మరుటయెగాదె నాకుఁ బర • మంబగు మోదముఁగూర్చు నెప్పుడున్.

॥ అని వచియించి శైలతన • యాపతి యప్పుడ నారసింహరూ
పనికృతిఁ జేయు వాంఛ తన • స్వాంతమునన్ స్మరియించె వీరభ
ద్రుని ప్రళయాకరున్ నిఖిల • దుష్టనిశాటహరున్ మహాబలున్
ఘనతర భైరవాకృతిఁ గ • ఖండలసద్ద్యుతి నిర్జితార్కునిన్.

## — శరభావతార ఘట్టము. —

॥ అట్లు రుద్రుండు స్వీయ భైరవరూపుండగు వీరభద్రుని స్మరించిన నాతండును నృసింహరూపులును నట్టహాసయుతులును నయి నలుదెసలన్ బరుగిడు ప్రమథగణంబులతోడను ముదాన్వితులై యంతంత నృత్యంబు గావించు వీరులతోడను గూడి, కల్పాంతజ్వలనజ్వాలావిలసల్లోచనత్రయుండును గృహీతశస్త్రుండును, బాలేందుమండితశిరోభాగుండును, బాలేందుద్వితయాకారతీక్ష్ణదంష్ట్రాంకురద్వయుండును, ఆఖండలధనుఃఖండసన్నిభభ్రూలతాయుతుండును, మహాప్రచండహుంకారబధిరీకృతదిఙ్ముఖుండును, నీలమేఘాంజనభీకరకేశుండునై యరుదెంచి.

॥ కరములు మోడ్చి మ్రొక్కి సితి • కంఠునకున్ గిరిరాజపుత్రికిన్
గరమునయంబు దోఁపఁ బరి • కంపితగాత్రుఁడునై వచించు నో
పురహరలోకనాథ సుర • పుంగవమద్ధిత దుష్టదైత్యభా
స్కరశశివహ్నినేత్ర ముని • సన్నుత వందనమున్ గొనంగదే

క॥ నీయున్మేషనిమేషము లే యేతల్లోకనిగమ • సృష్టులగును ప్రా
లేయకిరణావతంసా కాయజమదభంగనిర్వి • కల్పమహేశా.

తే॥ ఏమికారణమున • నిత్తఱినన్ను బిల్పించునవసరము జ • నించె నెట్టి
దుష్టచిత్తుఁగూల్చి • తోయజభవభాండములకు ముదముఁగూర్ప • వలయునిప్డు.

చ॥ ప్రళయముగల్గలేదనల • భాస్కరదీప్తి శమింపలేదు దు
ష్కలిజనియింపలే దఖిల • కాననసంతతి దావవహ్నిచే
మలమలమాడలేదు పుర • మర్దనయేమిటి కిప్పుడే ననుఁ
బిలిచితివాజ్ఞసేయఁగదె • భృత్యునకుఁ గరుణాన్వితుండవై

క॥ అనిపలుకు కొడుకుపలుకుల వినినిటలాక్షుఁడువచించె • వీరవినఁగదే
దనుజవధమిషనుగొని యవ్వనజాక్షుఁడు నృహరిరూప • వైభవుఁడగుచుఁ

వ॥ అతిభయంకరంబగు తేజంబుఁదాల్చి లోకంబుల వ్యాకులంబుఁ గావించుచున్నవాఁ
డట్లగుటనీవరిగి నృసింహాగ్నినిజల్లార్చిరా నవసరంబుగల్గె గావున నిటు వినుము,

క॥ సామంబె సర్వమూలము సామముననె సర్వయత్న • సాఫల్యముగుఁ
సామాయుధముగలాతఁడు భూమిపయిఁ సకలజయము • బొందుకుమారా!

వ॥ శత్రువిజయకారణంబగు నుపాయచతుష్టయంబున సామంబు కార్యసాధనంబు గా
భూతదయాపరులగు యోధులు విరోధినిసాధించుటవసరంబగుపట్ల సామంబునే
యుపయోగింతురదిగావున,

తే॥ తొలుత సామవాక్య • ముల నీతిగఱపి నృసింహు నుపశమింప • జేయుమతఁ
వినకయుండునేని • భీకర మామక భైరవాంశజూపి • ప్రతిఘటించు,

తే॥ స్థూలసూక్ష్మతేజంబుల • స్థూలసూక్ష్మ దేజములసంహరించి ని • స్తేజుఁడైన
యతనికృత్తియునటియు నా • స్యంబుఁదెమ్ము పొమ్ము రణమున జయముఁగైకొ • మ్ము రక్ష

తే॥ అని ముదలమొసఁగిపంపిన ఘనుఁడాతఁడు శాంతమూర్తిఁ • గైకొని వేగఁ
జనియె నృసింహునిసన్నిధి కనఘులకాతంక మెందు • నైనఁ గలుగునే.

— వీరభద్రుండు నృసింహమూర్తికి నీతిగఱపుట. —

వ॥ అట్లు జని వీరభద్రుండు నృకేసరింగాంచి శమంబున నాతని నుపసంహరింపఁదలఁ
యిట్లనియె.

మ॥ జలజాక్షా యిదియేటిధర్మము జగ • త్సౌఖ్యంబుఁ గావింపఁగా
వలదే లోకహితంబుఁ గోరి ప్రతిక • ల్పంబందు నవ్యావిధం
బుల నేదో యొకరూపమూని కలుషా • త్ముల్ దుష్టులైనట్టి దై
త్యుల నాశంబొనరింపవే మనుపవే • యుర్వీస్థలిఁ గూర్మిమై.

క॥ నీవంటివాఁడె యివ్విధిఁ గావించిన నెవఁడు బ్రోవఁ • గలుగు సకల మా
నీవిశ్వమెల్లను భవ ప్రాపీణ్యమువలనఁగాదె • బ్రదుకుచునుండున్.
శా॥ మీనాకారముఁదాల్చి సోమకునిఁ జే • ర్మిన్ వీడి చెండాడి వే
దానీకంబును బ్రోవవే జలధిమధ్యంబందు • గూర్మాకృతిన్
నానాదైత్యనిలింపులున్ గొలువ నా • నందంబునన్ మందరం
బూనన్ లేదె హిరణ్యనేత్రుఁడను దై • త్యున్ జంపవే పోత్రివై.
ఉ॥ కాంచనగర్భదత్తవర • గర్వమునన్ వసుధాతలంబు బా
ధించు హిరణ్యకశ్యపు వ • ధించుటకై నరసింహరూపమున్
గాంచుటయొప్పెఁ గాని కల • కాలము భీకరమూర్తిన్ వొంచువం
చించుటయుహర్మ మేజగము • శ్రేయముగల్గునేనీకు నీపయిన్.
తే॥ జగములకుఁ గష్టమెప్పుడు సంభవించు నప్పుడవతారముధరించి • యహర్మమైన
యుపకృతినొనర్చుచుండెద• వోరమేశ యీ వెఱుంగనియర్థము• న్నేఁగరిత్రి.
క॥ కావున నాపలుకుల సంభావింపఁ దలంతువేని • భయదంబగునీ
తావకమూర్తిని సంహృతిఁగావింపుము లోకవితతిఁ • గావుముకరుణన్
తే॥ ఇదియయీశ్వరేచ్ఛ • యీరీతిఁజేయుదువేని నీకునాకు • హితముగలుగు
కాదయేనియనుప • కారివంచునునిన్ను దలఁచి శంభుఁడాత్మ • నలుగునింక

## —• నృసింహమూర్తి వీరభద్రుని దిరస్కరించుట •—

మ॥ అనుచున్ శాంతమునన్ వచించిన నృహ • ర్యత్తుండు రూక్షేక్షణుం
డును బాదాహతకాలపన్నగనిభుం • డున్ గంపిత స్వాంగుఁడున్
గనదుద్దండ భయంకరాస్యుఁడునునై • కాలాంబుదాభీలగ
ర్జనముంబోలె ధ్వనించుచున్ బధిరితా • శాసంచయుండై వెసన్
శా॥ ఓరీ యెవ్వఁడవీవు నీవిటులనే • దోపల్కుచున్నావునో
రూరన్ వచ్చిన త్రోవఁబొమ్మనను • నెట్లూహించిగర్వించితో
లేరేనీసరివారులోకమున నీ • లీలన్ వచింపంగ దు
ర్వారక్రోధవశంసితాంగుఁడునృహ • ర్యక్షుండు సామాన్యుఁడే.
చ॥ ఇదెకనుమోరిదుర్హృదయ • యెల్లజగంబుల సంహరింతు న
న్నెదిరియెవండునిల్వఁగలఁ • డిగ్యుడ లోకహితాహితంబులన్
బొదలఁగఁజేయుకర్జమును • బూనిచరించుచునుండునాకునై
యిదియదియంచుఁ జెన్నదర • మేరికిమాటికిఁ బల్కునేటికిన్
మ॥ ననుశాసించెదు వాఁడుగల్గఁడుజగ • న్నాథుండవమద్బాహుసం
జనితాఖిల పరాక్రమానలమునన్ • సర్వం సహామండలః

బును భస్మంబొనరింప నేర్తును సుఖం ♦ బుగ గూర్పగా నేర్తు లో
కని కాయంబునకేఁ దలంచినటులే ♦ కాదాయగుణ సర్వముగ.

సీ॥ మదనుగ్రహమున స ♦ మర్యాదముగ సమస్తము ప్రవృత్తి ♦ నివృత్తి నమరుచుండు
సర్వశక్తులును మ ♦ చ్ఛాసనంబునఁ జేసి యందందు వర్తించు ♦ నహరహంబు
నెల్లవిభూతుల ♦ కేన యీశ్వరుఁడ మత్తేజోవిజృంభితం ♦ బీ జగంబు
పరమార్థవిదులు దే ♦ వతలు బ్రహ్మాదులు శక్తియుతులు మదం ♦ శప్రభవులు
నలుమొగంబుల ప్రోడమ ♦ న్నాభికమలమున నుదయమయ్యెఁ దత్ఫాల ♦ మునహరుండు
వృషభవాహుండు జనియించె ♦ విశ్వమెల్ల మామకాంశసంభూతమై ♦ మనుసలంబు.

తే॥ వనజభవుఁడు రజోగుణం ♦ బునఁ జెలఁగుఁ దామసంబున రుద్రుండు ♦ ధరణివెలయు.
నేను నియమింతును జగంబు ♦ లెందుఁగనిన లేదు నాకన్న నితరంబు ♦ లేశమైన.

సీ॥ విశ్వాధికుండనై ♦ వెలయుదు నేను స్వతంత్రుండఁ గర్తయుఁ ♦ దలఁపహర్త
యును నేన యిదినాదు ♦ ఘనతర తేజంబు శమియింపఁ జేయంగ ♦ శక్తుఁడెవఁడు
కాలవినాశక ♦ కారణంబగునట్టి కాలంబు నేనలో ♦ కంబులెల్ల
సంహరింపగనిట్లు ♦ సంచరించుచునుందు మృత్యువునకు నేన ♦ మృత్యువగుదు
నాయనుగ్రహము కలిమిఁ ♦ దోయజాండ భాండములు బ్రతుకుచునుండు ♦ బలువిధముల
వేల్పులెల్లరునను గూర్చి ♦ వినుతిసేయు చుండు తెలుఁగవె వీరభ ♦ ద్రుండ నీవు.

క॥ నాయెడ నీవొనరించిన యీయపరాధంబు సైతు నింక నరుగు త్వ
చ్ఛ్రేయస్కరమగు మత్పదతోయజయుగ మాశ్రయించి ♦ దోసము వాయన్

క॥ అని సాహంకారుండై యతనరకేసరి వచోళి ♦ నాలించి క్రమం
బున విస్ఫురితాధరుఁడై ఘనరోషము మిన్నుముట్టఁ ♦ గావీరుండున్

చ॥ తెలియవొ నీవు నీమది వి ♦ ధిప్రముఖాఖిలదేవతార్చితా
మలపద పంకజద్వయును ♦ మాధవు మాధవదుర్వివాదమున్
సలుపుట నీకు లెస్సయె పి ♦ నాకిపినాకము తావకోక్తికిన్
ఫలమొనఁగూర్ప దేకలుష పద్ధతిఁ ద్రిమ్మరు టొప్పు నే ధరన్

తే॥ అప్పుడప్పుడు తాల్చి ♦ నట్టి రూపములు హరింపఁడె హరుఁడింత ♦ తలఁపవలదె
ప్రాకృతుండును బోలె న ♦ భాగ్యవశత పలికినంత నెకలుగు నే ♦ ఫలమొకింత

క॥ ఈలీల భీకరాకృతిఁ దాలుచుటకుఁ గారణంబుఁ ♦ దలఁపక యొజగ
జ్జాలము బాధించుట మే లాలావుగలాఁడననుచు ♦ నంబుజనయనా!

సీ. సంహారరూపుఁడౌ ♦ శశిమౌళికతననాశంబుఁ గాంచెదవు త ♦ త్క్షణమ నీవు
ప్రకృతివి నీవ య ♦ ప్పరమేశ్వరుఁడు పురుషుండా జగద్రక్ష ♦ కుండు మున్ను
తనవీర్యమును నీయె ♦ డను నిల్పఁ ద్వన్నాభి కమలంబునన్ గల్గెఁ ♦ గనకగర్భుఁ
డాతఁడు పంచాస్యుఁ ♦ డై సృష్టికొరకునై ఫాలతలంబున ♦ భవుఁదలంచె

నతనితపము మెచ్చి • యారాధ్యామనోహరుఁ డజునిఫాలభాగమందు వెడలె
నిదియెఱుంగనేర • కీవిట్లుదూషింపఁ దగునెబుధులువిన్న • నగరెనేఁపుమ

వ॥ మహాభైరవరూపుండగు పరమేశ్వరునంగ సంభూతుండనై నయ భయంబుల నిన్ను సంహరింప నరుదెంచితి శక్తికలాయుతుండవగు నీవు రక్షోవిదారణమాత్రంబున శాంతింపక యహంకారావలేపంబున గర్జించుటుచితంబె నీవిధంబుఁగన్న కేవలము సాధుజనోపకారంబెగాక యపకారంబుగూడ సలుపుదువని తోఁచెడిని. నీవు స్రష్టవును స్వతంత్రుండవును గావు,

ఉ॥ కుమ్మరసారెవోలె ముది • గొండ వసించు దునీని ప్రేరణన్
భ్రిమ్మరుచుందువీ వఖిల • దేశములందున నిట్టి పాపప
త్తెమ్మెటనుండి రాఁగలదు • దేనుచఁజేసెదుగాక శంభు నా
నమ్ముఁ దలంచిచూడుము త • మమ్ముతొలంగిచనన్ నృకేసరీ.

సీ॥ కమఠత్వమున నతి • క్రాంతధర్ముండవై భ్రమగొన్న నీ కపా • లము హరుండు
హారలతామధ్య • మందు ధరింపఁడె దంష్ట్రిరూపంబున • ధరణినెల్లఁ
గలఁచు నీదంతంబుఁ • గనలుచుఁ గైకొని దంష్ట్రిగాఁడేముక్కు • తారకారి
దక్షయజ్ఞంబునఁ • దగనీశిరంబు భిన్నంబుగావింపనే • యంబుజాక్షు

గీ॥ పుత్రుఁడుగాడె వా • ణీధవుండు పంచమశిరంబుఁ గోల్పఁడె • భవునికతన
విను దధీచియనెడు ముని • యనిజయించి మనుపడే యినియన్నియు • మఱచినావే.

## — నృసింహుండు శరభ తేజంబున జితుండగుట. —

వ॥ అని వచియించు వీరభద్రుని వచనంబులకుఁ గట్టలుకరెట్టింప.

తే॥ అసదృశక్రోధవివశాంగుఁ•డగుచు నృహరి ప్రళయమేఘంబుగర్జించు•పగిది భూన
భోంతరంబులు బ్రద్దలౌ • నటులనఱచు చట్టె యతనిపై లంఘించె • నంతనపుడు.

మ॥ కనుపట్టెన్ బలగర్వితాఖిల విప • క్షధ్వాంత కాలార్క వీ
ప్తినికాయంబును దండతాడిత కన • చ్ఛేషోగ్ర దంష్ట్రిస్రవ
ద్ఘనకాకోల భయంకరంబునయి దు • ర్ధర్షణంబునై వీరభ
ద్రుని రూపంబుడుమార్గ కీర్ణమగుచున్ • రుద్రాంశసంభూతమై.

వ॥ మఱియు నాదివ్యతేజంబు హిరణ్మయంబును సౌమ్యంబును సౌరంబును నగ్నిసంభవంబును చంద్రసదృశంబునుగాక తక్కుంగలతేజంబులనెల్లఁ దిరస్కరించుచుఁ బారమేశ్వరంబై బాహుసహస్రసదీప్తంబును చంద్రార్ధకృతశేఖరంబును సమృగార్ధశరీరంబును సపక్షంబునుభీకర చంచుసహితంబును నతితీక్ష్ణమహాదంష్ట్రంబును వజ్రసన్నిభనఖాయుధంబును, నీలకంఠంబును మహాబాహువును చతుష్పాత్తును యుగాన్తోద్యత జీమూతభీమగంభీరనిస్వనంబును వ్యావృత్తనయనత్రయంబును విశదదశనకాంతి సంకలితాధరోష్టంబునుహుంకారయుతంబునునై శారభరూపంబునఁగను పట్టుటయు,

క॥ పంచాస్య దర్పనంబున వంచింపంబడినమత్త • వారణమటులన్
గాంచనచేలుఁడుశరభముఁ గాంచివినష్టబలుఁడగుచుఁ • గంపితుఁడయ్యెన్

తే॥ భాస్కరుని చెంతశలభ వి•భ్రమముఁబోలె శరభసన్నిధి నృహరిప్ర•శాంతుఁడయ్యె
నయ్యవసరంబునన్ నిర్జ • రాళియెల్ల గగనభాగంబునందుండి • కాంచుచుండె.

ఉ॥ ఆతతపక్షపాతమున • నద్రులుఖండము లౌచుఁగూలఖ
ద్యోత నిభప్రభన్ దనరి • యుత్కటమైన ప్రడీనరీతిను
ద్ధూతము గాఁ దరువ్రజము • తోడనెయానృహరీంద్రు నాభివి
ఖ్యాతనిజోరుపాదమున. • నల్లనఁబట్టుకొనెన్ మహోరుషన్

వ॥ అట్లుబట్టి పుచ్ఛంబునఁ బాదంబులు మెలియుచు బాహువులచే బాహుమండలము
నొక్కుచునురమున మోదుచుఁగాలోరగంబును నైన తేయుండట్లంతరిక్షంబునకున్గొని
చని కందుకంబునట్లెగురఁగొట్టుచు నూర్ధ్వంబునకెత్తుచుఁ గ్రిందబడవైచుచుఁ దాఁ
తాడనంబు గావించుచు ననేకవిధంబుల హింసించు శరభంబున్ గాంచి భీతుండై
నృహర్యక్షుండు.

చ. వదనము కాంతిహీనమయి • వాడెను చెమ్మగిలెన్ శరీరమా
పదఁగొనిస్వాంతమట్టెయప • వారితమయ్యెను గాలుసేతులున్
గదలవు కన్నులుండియును • గానఁగ లేఁడు ప్రశాంత తేజుఁడ
య్యెఁదనకనూహ్యమైనదుర • దృష్టము శారభమై చెలంగుటన్

వ॥ అట్లు కొండొకతడవుండి పరిమేశ్వరునుద్దేశించి యిట్లనియె.

నృసింహుం డీశ్వరుని స్తుతించుట.

ఉ॥ నీయెడఁబుట్టు లోకములు • నీయెడగిట్టుచునుండు నిత్యమున్
నీయనుకంపలేక మన • నేరరుతోయజ సంభవాదులున్
గాయమెనిక్కమంచు బల • గర్వమునన్ జరియించుచుండునా
యీయపరాధమున్ సయిప • వేకరుణాకర భక్తవత్సలా

ఉ॥ మాయను మాయఁజేసియణు • మాత్రమయేని చలింపకుండునీ
మాయఁదరింపఁగావశమె • మాదృశులైననిలింపకోటికిన్
హేయమనిత్యమైన సుఖ • మేయపవర్గ ఫలప్రదంబటం
చాయతసంసృతిన్ బడెడి • యాశ్రితలోకము నుద్ధరింపవే.

వ॥ రుద్రుండునుశర్వుండును మహోగ్రాసుండును విష్ణుండును నుగ్రుండును భీముండును
క్రోధుండును మన్యుఁడును భవుండును శర్వుండును శంకరుండును శివుండును కాల
కాలుండును మహాకాలుండును మృత్యుంజయుండును, వీరభద్రుండునునగు నీకు నమ
స్కారమని యనేకవిధంబుల ధ్యానంబుగావించి మఱియు నిట్లనియె.

క॥ అల్యహంకారదూషిత ♦ మగుచు నెపుడు నాకు నజ్ఞానముదయించు ♦ నాగభూష
యపుడిట్టులె యజ్ఞాన ♦ మపహరించి జ్ఞానముం గూర్చుచుండుము ♦ కనికరమున.
వ॥ అంత.
చ॥ నమ:తో త్తమాంగులయి ♦ వేలుపులెల్లరు వీరభద్రునిన్
గని నుతియించిరిట్లు పరి ♦ కంపితగాత్రులునై మహేశనీ
ఘనకరుణావశంబున జ ♦ గంబులు సౌఖ్యము గాంచెనంబుదం
బునఁ దరుగాజివోలెసుర ♦ పుంగవులెల్ల ముదంబుఁజెందగన్
చ॥ ఎవనిభయంబుచేననలుఁ ♦ డెంతయు వెల్గుచు నుండునబ్జుడున్
రవియు జరించుచుందురు వి ♦ రామము లేకయె వీచుమారుతుం
డవనియు శాంతమూని వివి ♦ ధౌషధులన్ ఫలియించుచుండు మృ
త్యువు బరుగెత్తునట్టి నిను ♦ నున్నతరూపు భజింతుమీశ్వరా.
వ॥ అవ్యక్తుండును బరుండును వ్యోమకలాతీతుండునునగు సదాశివుండ వీవయని తత్త్వ
జ్ఞులువక్కాణింతురట్టి నిన్నిట్టివాఁడవని ప్రశంసింపనేర్తుమే? ఎల్లయుపసర్గంబు
లందును మాకురక్షకుండవునీవ, ఏకాదశరుద్రస్వరూపంబునఁ జరియించుచు ఘోరా
కృతియు నఘోరాకృతియుఁదాల్చి దుష్టనిగ్రహశిష్టనుగ్రహంబులఁ గావించు నీకు
నమస్కారంబు పిపీలికాది బ్రహ్మపర్యంతమగు జంతుజాలంబున కాధారుండవగు
నీకృపకుఁ బాత్రులమైతిమి, మాకింతియచాలునని వినుతించిన వీరభద్రుండు లోక
భీకరంబగు శాగభ తేజంబు నుపసంహరించి కృపాళుండై యిట్లనియె.
తే॥ నీరమందున నీరంబు ♦ క్షీరమందున క్షీరమును ఘృతమందున ♦ ఘృతమువోలె
సర్వగుండగు విష్ణుండు ♦ శంభునందుగలిసి భేదంబులేకయె ♦ చెలగుచుండు.
తే॥ అనుచు వీరభద్రుఁ ♦ డాన్నకేసరి పక్త్రమును మఱియును గృత్తి ♦ యనుగ్రహించి
వేల్పుసంచయంబు ♦ వినుతిసేయుచునుండ నపుడతా నదృశ్యుఁ ♦ డయ్యె వేడ్క.
తే॥ ఈన్నకేసరి శరభ క ♦ థానకంబు వినుతిజేయుచు నరిగిరి ♦ వేల్పులెల్ల
నిజనివాసంబులకు ధార ♦ జీతలంబు విశదమయ్యెను బ్రేల్చిరి ♦ ద్విజులుహరుని.
చ॥ అఘము సర్వభద్ర నిల ♦ యం బపవర్గఫలప్రదంబు ని
త్య నిరుపమానసంప దుప ♦ యాకరముద్ధృత దుఃఖమూల మా
ర్యనికర సేవితంబయిన ♦ యట్టిద యీ శరభావతార వ
ర్ణనముఁ బఠించినన్ వినిన ♦ వ్రాసిన గల్గు సమస్త సౌఖ్యముల్,
సీ॥ శ్రేయస్కరంబు పు ♦ ష్టిప్రవర్ధకము ధన్యం బరిచక్ర వి ♦ వినాశకంబు
మృత్యుప్రశమన మ ♦ మేయ సౌఖ్యాకర మాయుష్కరంబు స ♦ ర్వాధిహరము
శాంతిదాయకము దు ♦ స్స్వప్న నివారకం బారోగ్యదము సత్కి ♦ యావహంబు
యోగసిద్ధికరంబు ♦ రోగభేషజ్యంబు విఘ్నాంధకార ర ♦ విప్రభంబు
పుత్రపౌత్రకళత్ర స ♦ న్మిత్రబంధు భృత్యవర్గప్రదంబు దు ♦ ర్విషయదూర
నృసింహ శరభకథ ♦ యెల్లజనుల కిష్టఫలదానచతురమై ♦ యెసఁగు నెపుడు.

తే॥ భక్తి సంతోషముల యథా • శక్తి నిమ్మహా పవిత్ర చరిత్రంబు • ననుదినంబుఁ
బాఠమొనరించెనేని య • పార కలుషజలధిని దరించి భక్తుండు • సంతసించు.

వ॥ అని వచియించి సూతుండు తత్కాలోచితకృత్యంబులఁ గావించి మరల ఋషిసభా
మధ్యంబునఁ జేరుటయు,

— ఆశ్వాసాంతము. —

చ॥ సవన వరాహదంష్ట్రి విల • సత్తనుభాగ నృసింహరూప మా
ధవ కృతపావన స్తుతివ • తంసిత యంధక గాణపత్యదా
న విమలకీర్తి తోషిత స • నాతన మౌని మనఃప్రవృత్తి స
త్కవయిత్ర్య కావ్యపోషక సు • ధామయవాచక సుందరేశ్వరా.

క॥ శ్రీకంఠవినుతమూర్తీ నాకధునీతులితకీర్తి • నగజాహృన్నా
ళీకదళమధ్యవర్తి మూకీకృత భీకర త్రిపు • రవిస్ఫూర్తీ.

క॥ సంకల్పవికల్పరహితసంకల్ప ప్రభవదఖిల • జంతుసమూహా
పంకజనాభార్చిత క్షేమంకర మధురావనీశ • మత్కృతిపోషా.

తే॥ కష్టపడి పెంచియిడితినా • కవితకన్నె నెవ్విధంబున నలరింతొ • యింకనీవు
గంగలోఁ ద్రోసెదవొ గయ్యాళి • గాదు బేల సుమ్మ నీతలకెక్కినా • ట్యమ్ము సేయ.

సీ॥ ఏమహామహుఁడు శ్రీ • వేమనాగాఖ్యవంశాబ్ధికిఁ బూర్ణ శ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి • కెనయై బుధుల్ మెచ్చ • నుహీని బాతివ్రత్య • నుహిమఁబూనె
నట్టి నందయకు గౌ • రమకు ద్వితీయపుత్రుండఁ గౌండిన్యగో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోదరుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ

నార్యునకుఁ బౌత్రుఁడను మదీ • యమగు శ్రీమదాంధ్ర లింగపురాణ పూర్వార్థమందు
ప్రవిమలంబైన సప్తమా • శ్వాసమయ్యె సతము దీనినిరక్షించుఁ • జంద్రమౌళి.



శ్రీమీనాక్ష్యైనమః.

# శ్రీమదాంధ్ర లింగపురాణము.

## పూర్వభాగము.

### అష్టమాశ్వాసము.



— దేవేంద్రుడు శివుని పూజింపఁగోరి కైలాసమున కేగుట. —

క॥ శ్రితలోకావనచతురా చతురానన ముఖనిలింప ♦ సన్నుతచరణా
క్రతుహరణా మత్విరచిత కృతిశరణా సుందరేశ ♦ కీర్తినిధానా.

తే॥ అవధరింపుము వ్యాసము ♦ ఖాంబురాశి సముదితసుధనుసకలశా ♦ స్త్రప్రపంచ
వేత్తృతామలపండిత ♦ వితతహృదయ రంజితప్రధ లింగపు ♦ రాణకథను.

చ॥ అపహృత పాపసంచయము ♦ నంధకవైరి కథాప్రపంచమున్
విపులముఁజేసి యెట్లువిని ♦ పించినఁగానియుఁ దృప్తి లేకయా
తపసులు నైమిశీయులు ప ♦ దంపడి సూతమునీంద్రుఁగాంచి వి
న్నపమొనరించిరిట్టి ఘ ♦ నంబగు మోదము ముప్పిరిన్ గొనన్

క॥ అనఘా జలంధరుండను దనుజుండెవ్వాఁడు వాఁడు ♦ దర్పించిమహే
శునితోడ నెట్లుపోరెను వినిపింపన్ గదవె మాకు ♦ వీనులలరఁగన్

ఉ॥ అమ్మునిపాళిఁగాంచి విని ♦ తాఖిలశాస్త్రసమూహుఁడున్ బురా
ణమ్ములపుట్టినిల్లు కరు ♦ ణానిధి వ్యాసమునీంద్రశిష్య ర
త్నమ్ము జగద్ధితుండు పర ♦ తత్వవిదుండగు సూతమౌని మో
దమ్మున నిట్లుపల్కె విశ ♦ దమ్ముగ సూక్తి హితమ్ముఁ గూర్పఁగన్

క॥ మీరడిగిన ప్రశ్నమెమును పారాశరి వినిచె నాకుఁ ♦ బ్రహ్లాదమునన్
ధీరులు మీప్రశ్నంబుల పాఠంబులు విరళసాం ♦ వంతములుగదా?.

క॥ పరమేశ్వరుండు కిల్బిష హరుఁడాతని మహిమలిలన ♦ జాదులకైనన్
గరమెఱుఁగరావన్ బామరులెట్టులఁ దెలియఁగలరు ♦ మాదృశులెపుడున్

వ॥ శ్రద్ధాపరులరై యాలకించుట మీకు ధర్మంబని వచింపనలయునే మీరకడా బుద్ధిపూర్వంబుగఁ బ్రశ్నించితిరి,

మ॥ త్రిజగద్రాజ్యరమావతంసుఁ డఖిలో ♦ ర్వీరక్షణ ప్రోజ్వల
ద్భుజ దండాగ్రవిలంబి కార్ముక సము ♦ ద్భూతాంబరోపాత్త స
ద్విజయుండైన మహానుభావుఁడు మరు ♦ త్వన్నాయకుండౌ పులో
మజకున్ గోరిన ప్రాణనాయకుఁడు సా ♦ మాన్యుండె జిష్ణుండిలన్.

ఉ॥ ఆపురుహూతుఁ డొక్క సమ ♦ యంబున యందు నిజార్హ దేవ సే
నా పరివేష్టితుండయి య ♦ నంతమణీమయహారభూషితుం
డై పటు వజ్రపాణియగు ♦ చభ్రము వల్లభు నెక్కి మానిరా
ట్రాపకు నీశ్వరున్ గొలుచు ♦ వాంఛమనంబునంకురించుటన్.

క॥ చనియె ముముక్షుజనాశ్రయమునకున్ భక్తజనసేవ్య ♦ మునకున్ గిరిరా
ట్తనయాపదయుగచిహ్నితమునకున్ కైలాససంజ్ఞ ♦ భూధరమునకున్.

తే॥ అటులఁ జనివృత్రహంతయు ♦ త్సాహసంభ్రమములు నిగుడింప విశదభా ♦ వనముఁ జే
విస్మృతేతరకార్యుఁడై ♦ విగతకలుషభారుఁడై చేరుకొనియె న ♦ ప్పర్వతంబు.

వ॥ అట్లు చేరుకొని దర్శనమాత్ర భస్మీకృత సకలపాపనిచయంబును యాతాయాత
మునిజనచరణఘట్టన సంజాతరేణు సంతాన పరిచ్ఛన్న గగనభాగంబును నగు తారకా
చలోపత్యకాప్రదేశంబున.

క॥ విడిసెడి రథసంచయముల వడిఁ బేరము వారుచుండు ♦ వార్వంబులఁ ద్రోఁ
పుడు సేయుచు నంతంతట నడచెడు సేవకుల మునిజ ♦ నంబులఁ గనుచున్.

సీ॥ భూతిరుద్రాక్ష వి ♦ భూషితాంగుల నాగయజ్ఞోపవీతులఁ ♦ బ్రాజ్ఞలమల
బాలచంద్రకళా వి ♦ భాసితమకుటుల ఫాలలోచనులఁ ద్రి ♦ శూలధరుల
గంగాతరంగ శీ ♦ కర సంకలిత కేశపాశుల ధాత్రీక ♦ పాలధరుల
కటిబద్ధశార్దూల ♦ ఘనచర్మవసనుల పంచముఖులఖండ ♦ పరశువులను
కాలకంఠులనిర్జిత ♦ కల్మషులను వృషభవాహులఁ బరివృతి ♦ వివిధభూత
సంచయులయిన ప్రమథులఁ ♦ గాంచుచమర నాయకుండు సమీపించె ♦ నగవరంబు

వ॥ అట్లు సమీపించి.

మ॥ ఏతత్పర్వత దర్శనంబున నగా ♦ దే సంసృత్క్లేశ సం
జాతం బెల్లఁ దొలంగి పూరుషునకు ♦ శ్రాంతంబు నిశ్చింతతన్
జేతోవీథి శివార్చనాహర్షమగు సౌ ♦ శీల్యంబు ప్రాపించు సం
ప్రీతిన్ జంద్రకళావతంసు డిడు సా ♦ మీప్యంబు సారూప్యమున్.

తే॥ ఇదియ కాదె సమస్తలో ♦ కైకనాథుఁ డగు భవానీపతికి మోద ♦ మలర జేయ
నున్నతస్థానమిటనె కా ♦ దో జనించు సర్వసుఖములు భక్తసం ♦ చయమునకిల.

మ॥ అమరాధీశ్వరుఁ డవ్విధిన్ దలఁచి బ్ర ♦ హ్మానందమున్ బొందుచున్
రమణీయోన్నత సానువంతము సద ♦ భ్రంలిణ్మహాశృంగమున్

బ్రిమబాధీశ నివాసయోగ్యమున ప • ర్ణాకేశ పాశచ్యుతో
త్తమ నానావిధపుష్పకీర్ణము సమ • ద్యత్తార కాశైలమున్.

వ॥ ప్రవేశించి బహిర్ద్వారంబున నైరావతంబుడిగ్గి సూతునితోఁడ నగ్గజంబు నటడించి యొక్కరుండ కులిశపాణియై మెల్లనఁగతిపయకక్ష్యంబులఁ దాటి నడచువాఁడు తన ముందటి కక్ష్యయందు.

చ॥ కనియెవిభూతిపూతమృదు • గాత్రు ద్రిలోచనుఁజంద్రమఃకలా
ప్రవిభుజగావతంసు హిమ • భూధరసన్నిభదేహు సస్మితా
ననుగజచర్మవాసుఁ బి • నాకధరుఁ మునిలోకవంద్యు నొ
క్కని త్రిజగద్ధితుఁ విగత • కల్మషుఁ ఛీనిధిఁ బూరుషోత్తమున్

— ఇంద్రుడు ప్రమథునిపై గినియుట —

క॥ కనియాతఁ డొక్క ప్రమథుం డని నిర్భీతుండగుచుఁ • నమరేంద్రుడా
తనికేరి సంశయింపక యనియెను పరుసాక్షరముల • నందఱువినఁగన్.

ఉ॥ ఓయిగణేశ యేనుపురు • హూతుఁడ శైలసుతామనోహరున్
ధ్యేయుని గొల్వవచ్చితి న • తీంద్రియగోచరుఁడైన యావిభుం
డేయెడ నున్నవాఁడొ వచి • యింపుము మార్గమునిమ్ము ద్వారమున్
డీయము నీవకాదె యతి • క్షిప్రకరంబును గౌరవింపఁగన్.

తే॥ కాలయాపనమునకిది • వేళగాదు వేగముగ శివపూజఁ గా • వించి తిరిగి
పోవలయు నాకొఱకు వేల్పుఁ • బూవుఁబోండ్లు వేచియుందురు నందన • వీధులందు.

క॥ అని వేగిరించుచుండిన యనిమిషపతి పరుషవాక్కు • లాలించియు న
య్యనఘుండు మాఱుపలుకక విని వినట్లుండె నపుడు • విస్మితుఁడగుచున్.

ఉ॥ అంతట వజ్రపాణి యహ • హా యొక పారిషదుండె మత్తుఁడై
యెంతయు గారవింపక సు • రేశ్వరుసంతతివాని నన్ను దు
ష్పింతఁ దిరస్కరించెఁ బ్రతి • సెప్పక యేమనవచ్చు శైలజా
కాంతునిగూర్చి యాతఁడును • గన్పడుటో కనుపట్టకుండునో.

చ॥ ఎఱుఁగడయేమిలోకముల • కెల్లన ధీశుఁడటంచు నన్ను వీ
డఱపఁజేసి మార్వలుక • కట్టె యచేతనురీతినిల్చెఁ బెం
పఱ నధికార మిట్టిపను • లా యొనరింపఁగఁ జేయు వీని నె
త్తెఱఁగునసైన నిప్పుడ వ • ధించుట యుత్తమ మార్గమయ్యెడున్,

తే॥ లెంకలగువారికే యిట్టి పెంకెబుద్ధియున్న గౌరవమర్యాద • లున్నె జగతి
తనదు ధర్మంబువీడి య • ధర్మవృత్తి సంచరించెడువారికి • స్వర్గ మేది.

తే॥ అధిపతుల యాశ్రయంబున ♦ ననదలైన నధికులై మిన్నుముట్టెద ♦ రధికులైన
నధిపతుల యాశ్రమంబులే ♦ కనదలగుచు నుచితమర్యాదఁగోల్పోవు ♦ చుందురెపుడు.

చ॥ అనుచు దురాగ్రహంబుఁగొని య ♦ య్యమరేంద్రుఁడు ముందు వెన్కలన్
గనక యదృష్టహీనుఁడయి ♦ గర్వితవైరి ధరాధరేంద్ర ప
క్షనికరఖండనక్షమము ♦ స్వస్తరమాస్థితి మూలకారణం
బనఘ మకుంఠితంబు నగు ప్రౌఢిని చే ♦ ఝళిపించు చిట్లనన్.

ఉ॥ తలఁగెదొ లేకయీకులిశ ♦ ధారకుఁ బావక కంఠదేశమున్
బలిగనొనర్చి నీదురభి ♦ మానము వోకడఁ బెట్టుమందువో
తెలియఁగఁబల్కుమంచు వి ♦ నుతింపదగు వజ్రిము చేతఁగొట్టె ని
ర్మల భసితాక్షసూత్రపరి ♦ రక్ష్యము నాగణనాథువక్షమున్.

తే॥ అటులమోహాంధుఁడైయ సు ♦ రాధిపుఁ కులిశమునఁ బ్రమథుఁ గొట్టుటయు నది ♦ మొక్కవోయి
కొండఁదాఁకినయేనుఁగు ♦ కొమ్ము వోలెఁ జిద్రుపలై నేలఁబడియెని ♦ శ్శేషముగను.

వ॥ అంత నా ప్రమథుండు.

మ॥ తలమిన్నంటి యలల్ పొసంగనొక చే ♦ తన్ బుస్కఁగై సేసియ
వ్వలిచే ముమ్మెనవాలుదాల్చి పులితో ♦ ల్పట్టంబుఁగాఁగట్టి దా
పలిచంకన్ బెనుజింకఁబూనియొక మ ♦ వ్యంబైన పూఁబోడిప
న్నెలుసామేనికిన్ రంగులీనహరుఁడై ♦ నిల్చెన్ సముక్షంబునన్.

ఉ॥ ఆవిధినుగ్రుఁడై నిలిచి ♦ యక్కహనా ప్రమథుండు ఘోరరు
ద్రావృతదేహుఁడున్ వికృత ♦ భావుఁడు పాదతరాభిఘాత భ
గ్నావనిభాగుఁడున్ వివలి ♦ తాధరుఁడౌచు యుగాంతకీలికీ
లావళిఁబోలెమంటలెగ ♦ యన్ దనమూఁడవకన్ను విప్పినన్.

—♦ పరమేశ్వరుండింద్రుని పై ఫాలనేత్రము దెఱచుట. ♦—

తే. దావపావకముంబోలెఁ ♦ దక్షకాహిదంష్ట్రిసముదితభీకర ♦ దావదంబు
కదణినుద్దండమగుచు నీ ♦ శ్వరలలాట వహ్నిగన్పట్టుటయును న ♦ వ్వాసవుండు.

క. గడగడ వడకుచునాల్కలు తడఁబడ మేనెల్లఁజెమట ♦ దడియగనశ్రుల్
బుడిబుడిఁ వ్రాలఁగభీతిన్ గుడుచుచుగద్గదికనిట్లు ♦ గొనకొని పలికెన్.

చ. కరములమోడ్చి ప్రమ్మొక్కెదను ♦ కావఁగదే సితికంఠకుంఠితా
మరరిపు విక్రమక్రమయ ♦ మారమణీహృదయారవింద భా
స్కరకరుణాలవాలత్రిజ ♦ గన్నుతనిర్మితసర్వలోకయం
బురహ భవాదినిర్జరస ♦ మూహసమర్చితభక్తరక్షితా

సీ. ఎఱుఁగక తప్పు జేసితి గి • రీశ్వర సైపఁగదయ్య నాయెడన్
గొఱకొఱమాని సర్వమున • కుఁ జనకుండవు నీవు నీకృపన్
దఱుఁగని సంపదల్ వొదలఁ • వద్దయు నిన్నె భజించుచుండు నే
నఱపడితిన్ బ్రమాదమున • నయ్యయ్యొ నకార్యము సాకతంబునన్.

తే॥ జనయితవు సర్వమునకు నీ • చరణయుగమె శరణమై మాకునెల్లెడ • సౌఖ్యజీవ
నంబుఁగూర్చుచునుండు నో • నాగభూష యట్లగుట శంకరుండవై • యలరితీవు,

క॥ మాయొనరించిన దోషము లేయెడ సవరించి మనుచుటే • పనియగు నీ
కీయపరాధము సైపఁగ నోయుగ్రవచింపవలయు • నో యియ్యెడలన్.

ఉ॥ కంటకమైన శాత్రవని • కాయముబూది యొనర్పఁజాలి ని
న్నంటి వెలుంగు నీభయద • మైన తృతీయవిలోచనంబు నా
వంటి యశక్తుపై నిడుట • పాడియె పిచ్చుకపై మహాస్త్రముఁ
గెంటినమాడ్కి మాని జన • గేయపదాంబుజ భక్తవత్సలా.

చ॥ కలుషితచిత్తుఁడైన యొక • గర్వితు మూలమునన్ దదన్వయం
బిలఁ గడగండ్లపాలగుచు • నిర్దయశంబును గోలుపోవు న
ట్లలఘు గుణాఢ్య నాకితన • నంతమునొందునొ యేమొ లోకముల్
దలఁపఁ దృగంబకాగ్నిని ప • తంగచయంబును బోలె నెంతయున్.

ఉ॥ అకటా మంటలు భూనభోంతరములన్ • వ్యాపించుచున్ మించుచున్
గకుబంతంబులఁ గాల్పఁగాఁదొడఁగె ము • క్కంటీ కృపాళుండవై
యిఁకనైనన్ శమియింపఁజేయఁ గదవే • యియ్యుగ్ర తేజంబుఁదా
వక సంతానమె కాదొ భూతచయమా • పన్నార్తి సంహారక.

చ॥ అదె కనుఁగొమ్ము పర్వతచ • యంబులు నుగ్గయిరాలుచున్న వ
ల్లదె తరుపంక్తులున్ ఫెళఫెళ • శార్భటులన్ ధరఁ గూలుచున్నవీ
యదరులఁ గ్రక్కుచున్ వెడలు • నట్టి భయంకర ఫాలవహ్నికిన్
మదనవిరోధి యీయిడుమ • మాన్పుము బ్రోవుము లోకసంతతిన్.

వ. అని పలువిధముల వినుతించిన నించుక శాంతుఁడగుచు • సితికంఠుం డ
య్యనిమిషపతిఁగని యిట్లనుఁ గనికరము కరంబు వెలయఁ • గా నయ్యెడలన్.

ఉ॥ దోసమొనర్చితీవు ప్రమ • థుం డొకపాటి భటుండెయంచు నీ
చేసిన దుష్కృతంబు మొఱఁ • జేసితి నిట్టి యవస్థ యిప్పుడా
యాసము నొందినన్ గలుగు • నాఫలమింతయు దుర్బలాంగులన్
గాసిలఁజేయుప్రాజ్ఞ్కి కొఱ • గాదని యొంచక యుద్ధతుండవై.

తే॥ ఎవఁడయేని నాభక్తున • కింతయైన నపకృతిఁ బొనర్పఁదలఁచిన • నదియ యధిక
మగుచు నా కాగ్రహముఁ గూర్పు • నని యెఱింగి మిన్నకుండఁగ నలయు నా • వెన్ను నసమ

తే॥ సాధుజనులయందు ♦ శైవలోకమునందు ధర్మపథమునఁదు ♦ దగవునాక
యొట్టికలుషబుద్ధి ♦ నేవహించినవాఁడు నాకు వైరి యగున ♦ నారతంబు.

మ॥ సురసామ్రాజ్యము గల్గినంతటనె ద ♦ ర్పుండట్లు గర్వించి యీ
శ్వరసేనాపరతంత్రులౌ ప్రమథులన్ ♦ బాధింపఁగాఁజెల్లునే
యరయన్ దత్కరుణావశంబునన గా ♦ దాయెట్టివారైన మ
ద్వరసందర్శన భాగ్యమున్ గనుట స్వాం ♦ తంబందు నూహింపుమా.

చ॥ నను భజియింపవచ్చితివి ♦ నా కపరాధ మొనర్చి యివ్విధిన్
గనలఁగఁజేసి తక్క తనఁ ♦ గాల్చుచునున్నది లోకజాలమున్
ఘనమగు ఫాలవహ్ని యను ♦ కంపనహించియు నేమి సేయఁగా
జను వృథయౌనె నాకినుక ♦ సర్వము బూదిగొనర్ప కెంతయున్.

వ॥ నీప్రార్థనంబునఁజేసి నాయంతరంగము కరుణార్ద్రంబైనది కావున నీ యపరాధంబు
సైచితి నింక జాగరూకుండవై యరుగుము. ప్రమాదంబుననేని యిఁకమీఁద నా
భక్తులపై నలుగకుండుము. నీకు లగ్గగు నని పల్కి పరమేశ్వరుం డప్పుడు.

క॥ అనఘుంబు భక్తలోకా వనచతురంబైన సవ్య ♦ పాణితలమునన్
దనఫాలనేత్రవహ్నిన్ గొని పశ్చిమ జలధివైచె ♦ కుతుకంబలరన్.

## —♦ శివనేత్రానల పతనంబున జలంధరుం డుదయించుట ♦—

చ॥ అటుల శశాంకశేఖర క ♦ రార్పితమైన నిటాలవహ్ని త
చ్చటులపయోధి మధ్యజల ♦ సంకలితంబగుచున్ భయంకరా
ర్భటి గగనంబుదాఁకెడి త ♦ రంగ పరంపరలందు దూఁగుచున్
పటుతరబాలుఁడౌచుఁ గను ♦ పట్టె వియచ్చరు లబ్బురంపడన్.

తే॥ గగనకల్లోలినీతరం ♦ గములగముల నలరుగాయంచకూనయ ♦ ట్టులగహించు
చుండునయ్యర్భకుండు బ్రహ్మాండభాండములను కలగుండుపడఁజేయ ♦ నిలసతంబు.

క॥ అలలకుఁదలఁగడ్డొకింతన్ జలములమగ్నుండు గాఁడు ♦ శైలములట్లన్
జెలువారు తిమింగిలములఁ దలఁచి భయంపడడు వాఁడు ♦ దైత్యుఁడాయేమో.

క॥ వాని బలము వాని చలము వాని పరాక్రమము తెల్వి ♦ వానికె గాకె
వ్వానికిఁగలుగు నతనిఁ గన దానవుఁ దలపించుననుట ♦ తథ్యంబయ్యెన్.

ఉ॥ ఆపసిపాపసాగరము ♦ నందు భయంబిసుమంత లేక బా
హాపటిమంబుచే నలల ♦ నాడుచు వాశ్చర సంచయంబులన్
బైపయి పట్టి ముంచుచు న ♦ మానుషశక్తివహించి యెట్టి సం
తాపము లేక శైశవముఁ ♦ దాల్చి వెలుంగుచునుండె నయ్యెడన్.

చ|| హరుని భజియింపఁగోరియొ ర • మాధవుఁ గొల్వఁదలంపుగల్గియో
సరసిజయోనియంఘ్రులకు • జాగిలి సేయఁగఁబూని యో సురే
శ్వరుఁగన నెంచియో చనెడు • వాఁడు ప్రచేతసు డర్హ దేవతా
పరివృతుఁడక్కుమారు గని • పంబిన సంబరమూని నెమ్మదిన్.
శా|| ఔరా యీ పసిపాపఁ డెవ్వఁడు సమ • స్తాజాండభాండంబులన్
గారింపంగల భీషణ ధ్వనియు రం • గత్తుంగవీచీ మహా
ఘోరంబైన సముద్రమధ్యమునఁ జీ • కున్ జింతయున్ లేక దు
ర్వారా భీలతిమింగిలాదులకు నో • ర్వన్ గల్గి వర్తించెడున్.
చ|| కెరటములజాఁచి వీచికలఁ • గ్రక్కునఁదాటుచు మోము నెత్తి వే
గిరపడు నొడ్డుఁజేరుటకు • కేకలు వేయు నెవారయేని గాఁ
చి రహినివచ్చి తన్ను దరి • జేర్పుదురంచుఁ దలంచి బాలకుం
డరయఁగ సాహసంబుగల • యాతఁడె యౌ నని యాత్మ నెంచుచున్.

—• వరుణుడు జలంధరుని గొనిపోవుట •—

వ|| మెల్లన నయ్యర్భకు నెత్తుకొని కోలంబునఁ జేర్చి తన మనంబున.
క|| ఈ వెడఁద బొమ్మ బాహువు లీ వదనము వైఖరియు మ • హితచాతుర్యం
బీ వార్ధిఁ బరివృతయగుధ రావలయము నేలుననుచు • రహి సూచించున్.
ఉ. ఈపసిబిడ్డపై కరుణ • యింతయు లేక మహాంబురాశిలోఁ
బాపము నాకఁ ద్రోఁచిన య • భాగ్యు లెవారలో వారలే మన
స్తాపపయోధిమగ్నులయి , తద్దయుఁ జింతిలుచున్నవారలో
పాపుర యిట్టిఘోరమగు • పద్ధతి యెచ్చటనైనఁ గల్గునే.
ఉ|| ఈతఁడదృష్టహీనులగు • నేత్రలిదంద్రుల కెట్టి దుఃఖ సం
ఘాతముఁగూర్చి తానిటుల, • గాసిల కంబుధి మధ్యవీధి సం
ప్రీతిఁ జరించుచుండెనో ని • రించి కదా మొనకాఁడు సృష్టియం
దాతత చిత్రకల్పనల • నారచియించుచునుండు నెప్పుడున్.
క|| చిరము పరమేశపూజా పరిహృతనిఖిలాన్యకార్య • పరుఁడనగుట శం
కరుఁ డీ యర్భకు నాకై శరనిధిఁ గల్పింపఁబోలు • సంతసమయ్యెన్.
వ|| అని తలంచుచు నక్కుమారు నక్కటికంబుమై గొని చని పుత్ర ప్రేమంబునఁ బెంచుచుఁ బూజ్యంబగు తన రాజ్యంబునకెల్ల నాతఁడయధీశుండు కాఁగలఁడని యుబ్బుచుండ నొక కొంత కాలరుగ నంత.
తే|| ఇతఁడు హితచక్రసంహతి • నేలుపూనికౌ నహితకువలయరాజిఁ బో • కార్చి దానఁ
గలుగుకలుషంబు వాయఁగఁ • దలఁచి వోలెజలనిధిమునుంగఁబయనమా • సమయమందు.

చ॥ తరణి సహస్రహస్తములు ◆ ధాత్రిపయిన్ బ్రసరింపఁజేసి బం
గరు నునుపూతఁబూయఁగను ◆ గాడుపుకుఱ్ఱఁడు పూవుతావులన్
నిరతివహించి మెల్లఁగ న ◆ నేక లతాయుతరాజనిష్కుటాం
తరముల సంచరించుచు మ ◆ దంబు పదంబుగ నొప్పుచుండఁగన్.

చ॥ ఎరఁగొని తేఁటిఁబోయి యెది ◆ యే నొక స్వల్పమొ సంగ్రహించి క్ర
మ్మరి తమ పిల్లలన్ గనెడు ◆ మక్కువ పెంపున బార్లుగట్టి యం
బరతలమందునన్ బరగు ◆ వాలుచు వచ్చుచు గూండ్లకై వివి
ష్కిరములు శ్రోత్రకర్ణముల ◆ జెన్నలరారెడునట్లు గూయఁగన్.

తే॥ అరుణుఁడస్తమించె ◆ నగ్నిహోత్రంబులు సలుపరం డటంచు ◆ ధాత్రిపాలి
గురుజనులనుబిల్చు ◆ కొనియజ్ఞశాలల కరుగఁబోవుచుండు ◆ నవసరమున.

— ◆ బ్రహ్మదేవుండు వరుణుని గాంచఁబోవుట ◆ —

చ॥ నలుమొగముల్ గలాఁడు శ్రుతి ◆ నాదములన్ బలికించువాఁడు జీ
వులను సృజించు కర్జము నె ◆ పూనిచరించెడు నేర్పుకాఁడు ని
చ్చలు దెలిదమ్మిగద్దెపయి ◆ శారదఁగూడి వసించువాఁడు ని
ర్మలచరితుండు పద్మజుఁడు ◆ మానులు పార్శ్వములన్ భజింపఁగన్.

తే॥ అంచవార్వమెక్కి ◆ యల్లసత్యలోకంబునుండి వరుణుఁ ◆ గాంచి యతని
తోడఁ గొన్నిమాట ◆ లాడిపోవుదునంచు దలఁచివచ్చెఁగరుణ ◆ చెలఁగుచుండ.

క॥ ఆకరణి నేగుదెంచెడి లోకేశునిఁ గాంచి సలిల ◆ లోకేశ్వరుఁడ
వ్యాకులచిత్తుండై విన యాకరమగు భక్తితోడ ◆ నంజలిఁగొనుచున్.

వ॥ అభిముఖుండై యరిగి యంబుజోద్భవు నింటికిఁ గొనివచ్చి యర్ఘ్యపాద్యాదుల
గావించి యుచితాసన మలంకరించి యున్న చతురాననుఁ గాంచి వరుణుండు వి
యంబున నిట్లనియె.

మ॥ అమరజ్యేష్ఠుఁడ వీవు నీకతన దృ ◆ శ్యాదృశ్యమౌ జంతు జా
లము జన్మించుచునుండు వేదములకె ◆ ల్లన్ నీవె లక్ష్యంబ వౌ
దు మహాత్ముల్ భవపాశదూరులు మునీం ◆ ద్రుల్ నిన్నె ధ్యానింతురో
విమలస్వాంత త్వదీయదర్శనమునన్ ◆ వీతస్పృహు లౌదురుల్.

ఉ॥ ఊరకరారు పామరుల ◆ యున్న పదంబులకున్ మహాత్ము లౌ
నాగలు వారివచ్చుటలు ◆ వారితమై తగు భద్రపాళికిన్
గారణముల్ గదా పరమ ◆ కారుణికోత్తమ నీదురాక మా
కారయ మంగళప్రదము ◆ యయ్యెడు నంచును నిశ్చయించెదన్.

క॥ నీవు జగద్రక్షకుఁడవుగావున మావంటి శ్రితని • కాయముబ్రోవం
గావిశ్వంభరఁ దిరిగెదు నీవలనన్ గాదె గలుగు • నిఖిల శుభంబుల్

మ॥ అనుకంపాపరిపూరితంబు సుకృతా • యత్తంబు చిత్తంబు స
జ్జనలోకప్రియముల్ మృదూక్తులు సమ • స్త ప్రాణికోట్లన్ ముదం
బున జీవింపఁగఁజేయు కృత్యములు మి • మ్మున్ వంటి దేవాళికిన్
వనజాతాసన నీ మహత్వమెటులన్ • వర్ణింపశక్యంబగున్.

క॥ అనవుడు కమలాసను డి ట్లను నో జలధీశ యస్మ • దాదివిభులకున్
నినువంటి భక్తలోకముఁ గనికరమునఁ బ్రోఁచుచుంట • గాదె పనియగున్.

క॥ పరిపాలకులమగుటచే నిరతం బందుండు దైవ • నిష్ఠగలారిన్
బరికించుచు జగమెల్లన్ దిరుగుచునుందుము కడంక • దీనులఁబ్రోవన్.

వ॥ దిక్పాలకులందఱకన్న నీవు మాకెక్కుడు ప్రియంబుఁగూర్చుఁ వాఁడ వగుటచే లోకసంచారంబుఁ గావించుచు నీక్షేమంబు నారసి పో నరుదెంచితి నావుడుప్రచేత సుండు సంతుష్టాంతరంగుండై.

ఉ॥ శ్రీవక దర్శనంబుమెయి • ధన్యుఁడనైతి మదీయవంశమున్
బావనయయ్యె నీ విమల • పాదరజఃకరణ రాజి సోఁకి సం
భావితమయ్యె మద్గృహము • మాన్యుఁడ విట్టు లకారణంబ నేఁ
డీవిధి నేగుదెంచుటయె • యెల్లశుభంబుల కాస్పదంబగున్.

మ॥ అనఘా యీపసిబాలుఁ డబ్ధిఁ బయనం • బైపోవుచో నొక్కనాఁ
ననిల ప్రేరితుఁడై మహోర్మిచయ మ • ధ్యంబందుఁ గన్పట్టెనే
నవపత్యుండనుగాన వీనిఁ గొని ని • త్యం బర్థిఁ బ్రేమించుచుం
డును వీనిన్ గనుగొంటె దిక్పతులయం • దున్ మేటియైయుండునే.

క॥ ఈతఁడు శూరుండగు నే ఖ్యాతిం గను నే జగత్రి • యంబులయందున్
బ్రీతివహించు నె సురలం దాతత వైభవమునొంది • యలరన్ గలఁడే.

క॥ శైవుండో వైష్ణవుండో దేవబ్రాహ్మణులయందు • దీనులయందున్
గావరమున జరియింపక సేవించునె వృద్ధజనుల • సేమముఁగనునే.

మ॥ అనుచున్ గాంచనడోలికన్ బహుళని • ద్రాసక్తుఁడైయున్న నం
దనునిన్ మెల్లన లేపనెత్తి విధిచే • తన్ బెట్టినన్ గావు కా
వనుచున్ బెద్దగ నేడ్చుచున్ జలధిజుం • డాపాళి ఖేతిల్ల నేఁ
పునఁగ్రేఁల్గమ్ముల వేల్పు పెద్దచుబుకం • బున్ బట్టె నప్పట్టునన్.

తే॥ అటులపరుణతనయుఁ • డాత్మచుబుకమును బట్టుకొనిన వాని • గట్టి పట్టు
చెట్టిదంపుటిడుమఁ చెట్టటయును బల్కు వెలఁదిపుగఁడు గినిసి పలికెనిటుల.

—బ్రహ్మదేవుండు వరుణునితో జలంధరుండు రాక్షసుడని చెప్పుట—

మ॥ పసిపాపండయి యున్నవాఁడె యితఁడి ♦ ప్పాటన్ సనున్ బల్మి రా
క్షసకృత్యంబున బాధసేయఁగలిగెన్ ♦ గర్వోద్ధతుండై వయో
వసరంబందున వేల్పు సంతతులతో ♦ వైరంబు నార్జించి లో
కసమూహంబుఁ గలంచకుండునె యస ♦ త్కార్యప్రియుండై యికన్.

ఉ॥ ఈతఁడు దేవదానవుల ♦ కెల్ల భయంకరుఁడై సమస్త లో
కాతిశయాళు శౌర్యమున ♦ నంచితబాహుబలంబు గల్గి దు
శ్చేతసుఁడై చరించుచున ♦ శేషసపత్నజయంబునన్ సుఖో
పేతుఁడునై మనున్ సతత ♦ నీరసహస్రపరీతుఁడై యిలన్.

తే॥ వీఁడు జలములఁ బుట్టిన ♦ వాఁడు గాన వీనికి జలంధరుండను ♦ పేరు సార్థ
కంబు గాఁ గలదనుచును ♦ గమలభవుఁడు పలికి యెందేనిఁ జనియెన ♦ బ్రంబులోఁద.

వ॥ అంత వరుణుండును పరమేశ్వరు సంకల్పము అత్త కాదని తలంచి జలంధరుని వాత్స
ల్యంబునఁ బెంచుచు దినక్రమంబున నాతఁడు బాల్యంబుఁ గడచి యౌవనదశన్
జెందియున్నెడ.

చ॥ తనయుఁడు విక్రమాఢ్యుఁడయి ♦ దర్పిత దుర్వ్రాదురః కవాటపా
టనమొనరించువాఁడును హు ♦ టాహుటి నెల్లజగంబులన్ జరిం
చునడలుఁ గల్గి యహార్యమగు ♦ సోయగమున్ గలవాఁడునయ్యె నీ
తనికిఁ బెండ్లి సేయు టుచితంబయి తోఁచెడు నెమ్మనంబునన్.

వ॥ అనితలంచి కాలనేమికూఁతును బృందయను సుందరి నన్నివిధంబులఁ దగిన దాని
నాతనికిఁ బాణిగ్రహణంబుఁ గావించి ధరణీవతంసముగ జాలంధరంబను నొక్కపురంబు
నిర్మించి యందాతని నభిషేకించి తాను విభావరీపురంబున సుఖంబుండె నంత జలం
ధరుండు.

జలంధరుండు జాలంధరంబు నేలుట.

మ॥ తరుణీరత్నము బృందతోడ నమితో ♦ త్సాహంబునన్ స్వర్గమం
దిరదేశంబుల నిష్కుటాంతరములన్ ♦ దీప్యన్మనోహారిశీ
కరశీతానిల పోతపూరితములౌ ♦ గంగాసరిత్సైకతో
పరిభాగంబుల స్వైరలీలవిహరింపన్ బోవు సాయంబులన్.

సీ॥ ఒకనాఁడు కామినీ ♦ నికరంబులూఁచఁగా టూగుటూయలయం ♦ దూఁగుచుండు
నొకవేళ దేవతా ♦ ప్రకరంబులర్థింప సహర్షసంభావన ♦ మాచరించు

నొకపురాక్షసో • ద్యోగీయులఁ గూడి రాజ్యాంగములను మం • త్రిం బొనర్చు
నొకసమయంబునం • దూడిగంబొనరించు దిక్పాలకులను గ్రో • ధించి పలుకు
నొక్కపుడుజ్యోతిషకులతో • నున్నతమగు నాయతింగూర్చి ప్రశ్నించు •నంబురాశి
పరివృతాఖిలధారుణీ • పాలమకుటకోటిరాజితపాదుఁడై • దీటులేక.

చ॥ వెలదులమానికంబయిన • బృందనుగూడి జలంధరుండు రా
చిలుకలఁ జీరిపద్యములఁ జెప్పుచునుండు నొకొక్కవేళఁగో
యిలగమికూఁతలఁ వినుచు • నెంతయు హర్షమునొందు నొక్కనాఁ
డలరు సువర్ణడోలికల • యందు సుఖంబు వహించు నొక్కెడన్.

చ॥ లలిత పతివ్రతాజన ల • లామ నిజాంగనసేయు సహాయ సే
వలకు ముదంబుఁజెందుఁ బ్రభు • భక్తి పరాయణులౌచుఁ దంత్రవే
త్తలగు నమాత్యవర్యుల కృ • తజ్ఞతఁ దయఁజూపుఁ గన్నుసై
గలఁ జరియించుచుండు నరి • గాఁపుల మెచ్చు జలంధరుండొగిన్.

వ॥ మఱియు నతండష్టాంగంబులును జతురుపాయంబులును ద్రివర్గంబులును తన కధీ
నంబులైయుండఁ జతుర్దశభువనంబుల నద్వితీయ పరాక్రముండును ననంతతేజో
నిధియు నదివ్యమానుషప్రజ్ఞాసహితుండును ననఁబ్రఖ్యాతివహించి యథేచ్ఛన్‌బృందఁ
గూడి కందర్పక్రీడల సుఖంబుండుతఱి గతిసయవత్సరంబులు గడచెనంత.

చ॥ కనుగొనవే జగంబున నఖండమదీయ పరాక్రమాగ్ని కిం
ధనముగఁ గాని వస్తువు క • నంబడదెల్ల సురల్ జలంధరుం
డనియెడి పేరు విన్న నని • లాహతతూలమువోలె భీతులై
నను భజియించుచుండెద ర • నారతముల్ వినయంబుఁ జూపుచున్.

సీ॥ కల్పప్రసూనముల్ • కానుకఁగాఁదెచ్చి యంగణంబున వేచు • నమరవిభుఁడు
నిజపరాక్రమమెల్ల • నీరయిపోనగ్ని సంధి॰గోరుచునుండు • సంతతంబు
దండంబుఁబెట్టి యా • దలవంచి తఱిఁగాంచి కాలుండుమత్కృపఁ గాంక్షసేయు
నీవాడనంచు నెంతే • వినయోక్తులఁ గరగింపజూచు రాక్షసుడునన్ను
పాశియట్లుండఁ బవనుండు • భంగపడఁగ గిన్నరేశుండు ధనరాశు • లెన్నియేని
భక్తిఁగొనివచ్చి యిచ్చు న • శక్తుఁడగుచుఁ దక్కఁగల వేలుపులతోడ॰లెక్కయేమి?

క॥ అడరుచునీరేడు జగము లుడిగిములొనరించుచుండు • నున్నతకీర్తిన్
బడసితి నాకిఁక నెదురె వ్వఁడునేనొక్క•డనకాదె • పరిపాలకుఁడన్.

వ॥ ద్వాత్రింశత్కోటి దేవతాసమూహంబును చతుష్షష్టికోటి రాక్షససమూహంబును
నాయడుగులకు మడుగులిడుచు నాయాశ్రయంబె కోరుచుందురయినను.

చ॥ అమరుల విశ్వసింపదగ • దాశ్రితులుంబలెసంచరించియే
సనుయమునందొప్రమాదులయి • సాహసముం బొనరింపనెంతుర

క్రమమువహించి యొందఱనొ • రాక్షసవీరులఁ జంపిరిట్లు బూ
ర్వమునఁ గృతఘ్నులై మదిని • పాపభయంబువహింపకింతయున్.

చ॥ తఱియగుదాఁక సైఁతురుప • దంపడి సేయదు రెంత లేసియున్
మొఱకులు వా రెదిర్చునెడఁ • బూరికిరారుయశంబుఁ గోరరే
కొఱతయు లెక్కసేయరని • గూఢముగాఁ జరియించుచుందురా
మొఱఁగులనమ్మఁ గంటెమును • మున్నయధార్మ్ మెనర్పమేలగున్.

క॥ నాయాశ్రితులగు రక్కసు లేయన్యాయంబుఁ జేయ • రెఱుఁగరె వారున్
మీయంతవారు లేరన • న్యాయంబొనరింతురెట్టి • శత్రులకైనన్.

క॥ కావునఁ గనికర మెంచక యేవెఱపుమాఁకనెల్ల • హింసించి పరీ
భావంబొనర్చు టుచితంబై వెలయును నాదుకీర్తి • కనవరతంబున్.

సీ॥ కామధేనువుఁ గొల్చి • కామితంబులఁ గాంచ సురలె పాత్రంబులో • దురసలంబు
పారిజాతమరంద • పానంబొనర్పంగ నమరులె యధికారు • లాతలంప
రంభాదులను పరీ • రంభణంబొనరింప నమృతాంధసులె యోగ్యు • లాగణింప
స్వర్ణదీశీతల • సైకతంబుల జేర విబుధులె యుచితులై • వెలయుచుండ్రె
యసురులకు స్వర్గసౌఖ్యమిం • తైనఁగాని యనుభవించెదు నట్టియ • హాళియెడ
దైత్యులకున్ జేరనీక స • తమువసింప నాకమెల్ల వేల్పులకుఁగా • నాచియేమొ.

చ॥ అనిలనకైన రక్కసుల • నందఱఁ జేరి వచించునిట్టులో
దనుజవరేణ్యులార యిఁకఁ • దాలిమిఁబూనక నిర్జరావళిన్
దునిమితదర్కసంతతుల • దోకొనుఁడచ్చట మచ్చికంటులన్
గొనిచెఱవట్టి పెన్వెతలఁ • గూర్చుడు పాపము నాకచెచ్చెఱన్.

క॥ మాయాయుధముల రథముల నాయితములుగాఁగఁ జేయుఁ • డమరులపైనేఁ
డే యుద్ధయాత్రకరుగుట శ్రేయంబగు మనకు బదులు సెప్పకమీరల్.

మ॥ సురలన్ బోకడవెట్టి నిర్జరవధూ • స్తోమంబుఁ గారించి స్వ
ర్గరమాలింగన సంగమాద్యఖిల సౌ • ఖ్యంబుల్ వెసన్ జెందుచున్
బరమానందముతోడ మీ కిపుడె ది • క్పాలత్వమున్ గూర్తుబం
ధురకీర్తిన్ గడియింతు వైరులవధిం • తున్ మించు లోకంబులన్.

మ॥ అనినన్ సోఁకుడు మూఁకలిట్టుల నిర • య్యా వేల్పురా సూడమా
కనియన్నన్ బగమాన్న భోజనము సే • యన్ బూనుకన్నన్ ముదం
బునితాంతంబు జనించు దిక్పతులమై • యీలోకసంతానమున్
బని వెట్టంగల పారుపత్తెము భరిం • పన్ లేమె యింతేనియున్

క॥ యుద్ధంబొనర్పుటకు సం సిద్ధులమై యుంటిమిపుడ • జేజేలనికన్
బద్ధులుగఁ జేయు నేర్చెద మిద్ధయశముఁ గాన్పఁగలమ • హీనప్రౌఢిన్.

వ॥ అంగీకార పిశునంబగు శిరఃకంపంబు మెయిమాకు మొదలయొసగుదురేని మేమచని సకలలోకంబులఁ ద్రుటిమాత్రంబున జయించిరాకుందుమె. ఏలికకిట్టి ప్రయాణ ప్రయాసంబేల కలుగవలయు. త్రిలోచనుండేని మిమ్ముఁ దేఱిచూడఁజాలఁడని మీరయెఱుంగుదురుకాదే. మమ్ముజయించువాఁడున్నగదా మీకాయుధంబు ధరింప వలసిన యవసరంబుగలుగు. జలంధర వాహినీసంతతి నరికట్టువారుందురే. అని ప్రగల్భంబులఁబలుకు సేనాపతుల మాటలకుఁ దలయూఁచుచు మందహాసంబుఁజేయుచు రాక్షసాధీశ్వరుండు.

—♦ జలంధరుండు దిగ్జయంబుగావించుట. ♦—

ఉ॥ అనవుడు మీరుచెప్పినటు ♦ లంతటియోధులెమిమ్మెదిర్పఁగా
భవుఁడును భీతిఁజెందునొక ♦ పాటిపరాక్రమవంతులేగదా
దివుజులు పోటుబంట్లగుచుఁ ♦ దేఁకువఁజూపఁగనేర్తురేమి ముక్
భువనపతుల్ పరాభవముఁ ♦ బొందినులింపరె కప్పమీయరే.

కం॥ ఈరేడు జగములందును దారుణమామక భుజాప్ర ♦ తాపకృశాను
స్ఫారజ్వాలానికరం బేరీతి వెలుంగు నెఱుఁగ ♦ నెంతుమనమునన్.

వ॥ అని పలికి తానును జైత్ర యాత్రోన్ముఖుండై యనేక సహస్రహయబంధురంబును నానావిధమణిగణా లంకృతంబును వివిధశస్త్రాస్త్రభరితంబును, ఛత్రచామరధ్వజ పటాది సుందరంబును నగు దివ్యరథంబధిరోహించి రథగజాశ్వఖరోష్ట్ర వ్యాఘ్ర సింహాది వాహనంబు లధిష్ఠించి చాపబాణగదాశక్తి భిండివాలతోమర ముసల ముసుంఠిముద్గర ప్రాసపరిఘపట్టసాఖ్యాయుధపాణులై దానవయోధులు దోర్దరావి కటాట్టహాసులును విస్ఫాటిత బ్రహ్మాండమండలులై జయశబ్దంబులు పలుకుచుఁ బదాతులు హుంకారంబులు గావించుచు ముందు నడవ భేరీపటహ మురజప్రముఖ వాద్యధ్వనులు దిక్కుంభికుంభ పాటనంబు గావింప సైనిక పదాభిఘాత ధరణీరజం బాకసంబుఁ గప్పి యంధకారంబుగూర్పఁ గోటి త్రయయోజన పరివృతంబైన చమూనికాయంబుతోఁగ వెడలి తొలుదొలుత శతమన్యువిజితుంగావించువాఁడై స్వర్గంబుఁజేరె నంత.

సీ॥ ఖదిరవారణకరా ♦ స్ఫాలనంబునఁజేసి నందనోద్యానంబు ♦ నాశమయ్యె
కఠినశతాంగచ ♦ క్రతతిఘట్టనమునఁ గుట్టిమస్థలములు ♦ క్రుంగిపోయె
భేరీముఖాఖిల ♦ వివిధధ్వనులకల్మి ♦ నుల్లోచవితతి భే ♦ దిల్లిపడియె
క్రూరదానవచమూ ♦ వారంబు క్రీడింప గంగాజలంబు పం ♦ కముగమాఱె

గర్వితానేకశూరుని • కాయకర విధృత కృపాను తేజ స్థిర • స్ఫురితదివాక
రానలప్రభాకలితమై • యమరలోక వైభవంబెల్ల నాఅడి • పడియె నపుడు.

సీ॥ ఐరావతముడాఁగె • నందొక్క గొందియం దుచ్చైశ్రవంబు దా • నూరువిడిచెఁ
గల్పభూమీజంబు • కంపించెనల్లనఁ గామధేనువుకాళ్ళు • కదలవయ్యె
సప్తర్షులకు మన • స్తాపంబు రేకెత్తె దేవయోనులయాస • తీరిపోయె
రంభాదినిర్జర • రామామణులతోడ మాతలి యెచటనో • మాటుమడఁగె
భ్రాంతుఁడగుచు జయంతుండు • పాఱిపోయె దేవసభశూన్యమయ్యెన • తీవ్రశౌ
ర్యదర్పితానేకదుష్టదై • త్యకులవీర పరివృతుండైనయాజలం • ధరునిగాంచి.

క॥ కొందఱు మేడలఁగూల్చిరి కొందఱువీధులనుగాల్చి • గొనకొనిపురినం
దందుఁజరించిరి మఱియుఁ గొందఱమృతభాండపులను • గొనఁబోయిరొగిన్.

సీ॥ కనఁబడఁడేలసం • క్రందనుండనియొక్క కొందఱు వెదకిరం • దందునగరి
నదెపారిపోయెడి • నాయూర్వశినివెంటఁ బడుఁడంచుఁ గొందఱు • పరుగువాఱి
రదియవాసవుని సిం • హాసనంబని కొంద ఱరిగియఁ నిక్రమించి • చిరికదంక
నిదెసుధాపాత్రంబు • పదిలంబుగా తేని కిండంచుఁ గొందఱు • హెచ్చరించి
రివియెరత్నాపణంబులిం • దేవియేని సంశయింపకకొనుఁడంచు సరగబల్కి
రొక్కకొందఱు దానవు • లుద్ధతులయి యతుల సేనాపరంపర • యందునుండి.

తే॥ అటులస్వర్గమెల్ల • నల్లకల్లోలంబు జేయుదైత్యవీర • సేనఁగాంచి
విబుధనాథుఁడుభయ • విహ్వలుండైవైరి మొనయువిక్రమంబు • తనకులేమి.

తే॥ ఆపదుద్ధారకుండగు • నట్టివాని త్ర్యంబకునిజేరి తనకు జ • యంబుఁగూర్ప
వేడుదునటంచునెంచిసా • ధ్వీలలామ యగుపులోమజతోఁగూడి యరిగెనపుడు.

మ॥ ఇఁకెఁజాలింపుడుకొల్లగొట్టకుడు దేవేంద్రుండు వీగెన్ సుర
ప్రకరంబుల్ దలలొగ్గి క్రమ్మెక్కెను ముని వ్రాతంబువీవిం చెమా
నికముల్ మున్నగువానితోఁ ద్రిదివముఁ జేపట్టిరాయోధనో
త్సుకులౌయోధులువేల్పు దాయయుకు • సంతోషంబుపొందెన్ మదిన్.

క॥అనిసేనాపతివాక్కులు వినిపించినవెల్ల దైత్య వీరులుమేల్ వే
లనిపొంగుచు విడిసిరొకట దనుజాధీశ్వరుఁడు మది ము • దంబువహించెన్.

వ॥ పిమ్మట దైత్యేశ్వరుండు మహాయోధుండగు నొక దానవ వీరు నాకంబునఁ బ్రతి
ష్ఠించి యటఁ దరలి విక్రమంబునఁ దక్కిన దిక్పాలుర నెల్ల జయించి యష్ట
దిక్కులకు రక్కసిమొనకాండ్ల ననేకుల నేలికలు గనియమించి దైత్యసంహారకు
డెన్నునితోఁ బోరుకొఱకు వడివడి నడచి.

మ॥ కనియెన్ సైన్యసమేతుఁడై యరిగి ర • క్షస్స్వామి యాపాశినం
దనుఁ డుత్తుంగతరంగమండితము నా • నారత్నసంతాన సం
జనకంబున్ హరిపాదపంకజ రజ • స్థానంబుఁ బుణ్యప్రదం
బును మౌనీశ్వర సేవితంబుఁ గలశాం • భోరాశినల్లంతటన్.

సీ॥ ఆదిభిక్షువునకు • నమృతాంశుసత్కళా భూషణంబొసఁగిన • పుణ్యమూర్తి
మాధవునకు లోక • మాతనొసంగి గృ హస్థాశ్రమం బిడి • నట్టిదాత
శరణంబుఁగోరిన • శైలరాట్సుతునకు నభయంబుఁగూర్చిన యనఘచిత్తుఁ
డన్నార్థులగునిర్జరావళి కమలామృ తాన్నంబువెట్టిన • యలఘుకీర్తి
ఘనుఁడు రత్నాకరుఁడుతరం • గతతిశక్తి ఘోషణంబులఁద్రిజగతీ • భీషణమగు
దనుజసైన్యంబుఁ దరుమఁగ•దలఁచెనాఁగ నలరెమిన్నందుకొనుచున• య్యవసరమున.

మ॥ అసురాధీశ్వరునాజ్ఞఁగైకొని సమ • స్తానీకమాక్షీరవా
ర్ధిన్ సమీపంబునకేగి తజ్జలరుహ • వ్రాతంబులన్ ద్రుంచుచున్
వెసఁదక్షీరములెల్లఁ ద్రావుచుకన • ద్వీచీసమూహంబులన్
లసదుద్దండగదాభిఘాతములలీ • లన్ గొట్టుచున్ మెట్టుచున్.

క॥ జలసత్వంబులఁజెండుచు సలిలానీకంబుఁ బొఱజల్లుచుసికతా
వళిసాగరమునవైచుచుఁ గలుషాత్మకులగుచుదైత్య •గణములు మఱియున్.

క॥ శిలలన్ బువ్వుచు దంతావళములఁద్రోలుచును ఘేర • వారమ్ముల జే
తులతోడ నెగురవైచుచు బలువిధములసాగరమునఁ • బడిదుర్మతులై.

వ॥ సహోదరంబునఁబడ్డ కరియూథంబుచందబునఁ బయోరాశింబడి పుడమి యద్రువ నల్లకల్లోలంబుఁ గావించుచుఁ బెల్లుకేఁగి సంచరించుచుండిరంత.

తే॥ పుడమియీనిరీతినె • ల్లెడలనిండి క్రూరులైసంద్రమునుకల • గుండువెట్టు
దానవాధములన్ గని •తల్లడిలుచుఁ గమలయును ధాత్రియును సాధ్వ•సమునవపుడు.

తే॥ పరమపావనమగువట • పత్రమందు నిర్మలతరంగశీకరా • నీతమలయ
మారుతస్పర్శచే నస • మానబహుళ యోగనిద్రాపరవశుండయి • యున్నవాని.

చ॥ జలజదళాక్షుమేల్కొలిపి • చయ్యనదైత్యులొనర్చుదుండగం
బులనెఱిఁగించిరన్ హరియు • ముష్పిరిగాంచిన కిన్కతోడను
జ్వలదరుణాంబకుండగుచు • బాహువులన్ విదలించిపుంచితం
బులుగ నొనర్చియిట్లనియె • భూమియు నాకసమున్ వడంకగన్.

శా॥ ఔరాదానవుఁడు దధుండయిమహీ • యావాసమానీపయః
పారావారముఁజొచ్చి క్షీరములద్రా • వంబూనుపేగాక దు
ర్వారంబైన తరంగసంతతిఁగలం • పన్ జొచ్చెనే వీనిమ
త్క్రూరాస్త్రక్షతిఁజెండివైచెద మహా • తోకటుల్ నుతింపన్ సనున్.

ఉ॥ వారిని వీరినట్లసుర ♦ వైరిమదోద్ధతుఁడై జగత్త్రయా
ధారవిపక్షలోకవసు ♦ ధాధర పక్షసమూహఖండన
స్ఫారమహాశనిన్ నిగమ ♦ వంద్యుని నన్నుఁ దృణీకరించి యీ
తీరునదాడిసేయు నెప ♦ దంపడి సంగరమందు గెల్చునే.

మ॥ దనుజాధీశు నెదిర్చి మామకభుజో ♦ ద్యద్విక్రమాగ్నిస్ఫులిం
గనికాయంబులఁ దచ్చమూవితతులన్ ♦ గాల్తున్ భయభ్రాంతుఁడై
యని వెన్నిచ్చినఁ గాని వీడకనిలిం ♦ పాగాతి వెన్నంటి యా
తని నేతద్ఘనచంద్రహాసమున వి ♦ ధ్వస్తుంబుఁ గావించెదన్

వ॥ అని భీకరాకారుండై మురాంతకుండు ప్రళయకాలమార్తాండమండల ప్రభాభాసమానుండును, మణిమయకవచధారియు నానావిధదివ్యాస్త్రపాణియు, భుజాలంబిశరపూరితతూణీయుగళుండును. గరుడవాహుండును నై జలంధరచమూవితతిన్ దాఁకి.

—♦ నారాయణుండు జలంధరునితోఁ బోరి విజితుండగుట. ♦—

మ॥ అరవిందాయతనేత్రుఁ డవ్విధిని దై ♦ త్యానీకమున్ దాఁకి భీ
కరకోదండముఁ గేలఁ దాల్చి గుణమా ♦ కర్ణాంతమున్ లాగి దు
స్తరమౌ దానవసేన భీతిలధను ♦ ష్టంకారమున్ జేసి దు
ర్భరఘోరాంబకవర్షమున్ గురిసెసం ♦ ద్రంబెల్లఘూర్ణిల్లఁగన్.

తే॥ సాంగమగు వీరరసమునా ♦ సంగరమున వెన్నుఁ డవ్విధి నంబక ♦ వృష్టిఁ గురియ
దైత్యసేనలు భీతియ ♦ ధాయధలయి నలుదెసల బాఱె దానవ ♦ నాథుఁ డంత.

తే॥ సింహనాదంబుఁ జేయుచుఁ జేతనున్న భీకరంబగు గదఁ జలిం ♦ పించు చపుడు
నిలునిలుము పోకుపోకు ని ♦ క్కిదఱి కేజుఁ డిదె జలంధరుఁ డరుదెంచెఁ ♦ గదనమునకు

మ॥ అనుచున్ బీరములాడుచున్ ఘనఘను ♦ ర్జ్యానాదమున్ జేయుచున్
గను లెఱ్ఱంబడి నిప్పుకల్ గురియగా ♦ గర్వంబ ఖర్వంబుగా
దనుజానీకము రేఁచుచున్ బిరబిరన్ ♦ దాకెన్ యుగాంతార్కభా
నుని భాంగున్ విజితారిసంచయుననం ♦ తున్ క్రోధదీప్తాననున్.

ఉ॥ ఆవిధిఁ దాఁకి దానవుఁడ ♦ హంకృతి హుంకృతిఁ జేయుచున్ గుణా
రావము మిన్నుముట్టనసు ♦ రప్రకరంబులు మేలుమేలనం
గా విశిఖాంబకంబులను ♦ గర్వితుఁడై పెనువింటఁ జేర్చి రా
జీవదళాక్షు నేసె సుర ♦ సేనలు భీతిలి పాఱ దిక్కులన్.

తే॥ క్రూరదానవముక్త • గంభీరశగ నికాయమొకకోలచేఁద్రుంచి • కమలనేత్రుఁ
డతులమార్గణ గణముల • నతనినూతు నొంచుటయు దానవేశ్వరుఁ • డుగ్రుఁడగుచు.

వ॥ మఱియొక సారథినిఁగొని తలంపఁడె నట్లయ్యిరువురు మహాయోధులకు లోకభయంకరంబుగ నిరువదివేలసంవత్సరములు ఘోరంబగుపోరు సాగెనంత.

ఉ॥ జ్యానినదంబున న్దెసల • నంతటనిండి భయంకరప్రతి
ధ్వాన మొనర్పనార్చుచు న • వారితవిక్రముఁడా జలంధరుం
డానలినాక్షుఁగొట్టెఁగఠి • నాంబకయుగ్మముతోడ భూతసం
తానము వంతగుంది విత • తంబయిపాఱఁగ నంతటంతటన్.

తే॥ అట్లుగొట్టిమఱియు • నాఱమ్ములన్గొని మాధవునిమకుటము మహిఁబడంగ
నేసె నేయుటయును • నిందీవిభుండంతఁ గుపితచిత్తుఁడగుచు • నపుడుగడక,

క॥ వేఱొకమకుటము దాలిచి నారసరములుమూటితోడ • నళినాక్షుఁడుదు
ర్వార సురారిరథంబును వారువములఁ గూలనేసెఁ • బటురోషమునన్.

చ॥ అదిగనిరూక్షవీక్షణము • లాహరిపైఁ బరగించుచున్ భయా
స్పదమగు చాపమందుకొని • బాణశతంబునఁ దార్క్ష్య పక్షముల్
ద్రిదిలిచిమార్గణద్వయము • వెన్నునివక్షముగాడ నేసినన్
గొదకొని మాధవుం డపుడ • కుంఠితవిక్రమముల్లసిల్లఁగన్.

శా॥ భూతప్రేతపిశాచరాక్షసగణం • బుల్ భ్రాంతిచే నెంతయున్
భీతిన్ దిక్కులయందుఁబాఱ ధరణీ • భృత్సంతతుల్ గూలఁది
గ్వ్రాతంబుల్ బధిరీకృతంబులుగ సం • గ్రామంబునన్ శత్రుల్
ఖ్యాతిన్ మాపెడుబుద్ధి ఘోరమగుశం • ఖంబూదుచున్ గ్రోధియై.

క॥ భీకరమగు కౌమోదకిఁ • గైకొని విసరుటయు నసుర • గదఁగొని తా ను
ద్రేకంబున ఖండించిన వ్యాకులతన్ బొందిహరి ని • రాయుధుఁడయ్యెన్.

వ॥ అంత నావెన్నుండు విపన్నుండై కృతఘ్నునకుఁ గావించిన యుపకారంబులట్ల దనశస్త్రాస్త్రంబులెల్ల జలంధరునందు వ్యర్థంబులై కుంఠితంబులైనఁ జింతించి కపటోపాయనంబున న్గాక యాతని బారినుండి తలఁగుటవలనుపడదనియెంచి మెల్లన వానిదగ్గఱి యిట్లనియె.

మ॥ కలరే నీకెనయైన జోదులిల ర • క్షశ్శ్రేష్ఠులందున్ భవ
ద్బలసద్బాహు పరాక్రమంబును • ధనుర్విద్యాప్రవీణత్వమున్
గలవైనన్ గననేర్తుమే యితర లో • కంబందునీయందయా
ర్తులరక్షించెడుశక్తియుండుఁ గద స • ద్యోగంబువాటించుచున్.

క॥ అనివీఁగిన యబలులపైఁ గనలవు మొనకాండ్లమనుచు • గర్వించెడువా
రినివిడువవుసత్కీర్తిన్ గననెంతువు నీకుసాటి • గలరే యితరుల్.

క॥ భవుఁడొకఁడు దక్క నీతో బవరంబొనరింప నేర్చు • వారలు గలరే
వివిధాస్త్రశస్త్రవిద్యా ప్రవీణుఁడవు నిన్నెదిర్చి • పలుకఁగలమే.

ఉ॥ తక్కిన దానవావళి విధంబున నీవు • జితుండవౌదువం
చుక్కున నిన్నెదిర్చితిని యోదనుజేశ్వర నా ప్రతాపమున్
జక్కఁ దలంతునంచెఱుఁగఁజాలక నేరమి సైఁచి నన్ను నీ
యక్కటికంబు పాత్రమని • యాత్మఁ దలంచి మనంగఁ జేయుమా.

క॥ అనిపలుకుచు వనజాక్షుఁడు వినయంబున దివ్యశస్త్ర • వితతియు మణికాం
చనమణి భూషణములు నా దనుజునకు నుపాయనముగఁ • దానర్పించెన్.

ఉ॥ అమ్మురశాసనుం గనిద • యాంబుధియై వరుణాత్మజుండు నో
దమ్ము వహించి యిట్లనియెఁ • దామరసాంబక నిన్ను మెచ్చితిన్
సమ్మతిగల్గె నీయెడల • సంతతమీవు వికుంఠపత్తనం
బిమ్మహి నేలుకొంచు సుఖి • యింపు మమామక బాధలేకొగిన్.

క॥ అనిపలికి యతఁడు గోవిందుని వీడ్కొని యఖిలసేన • తో నేగె ముదం
బున జాలంధరమునకున్ దనుజవ్రాతంబు తన్ను • దగునని పలుకన్.

క॥ హరియును దత్సంగరమునఁ బరిభవమయ్యెనని కొలఁత • పడకయును జలం
ధరు వధియించు నుపాయం బరయఁ దలంచి చనియె నీశ్వ • రాంతికమునకున్.

వ॥ అదియట్లుండ నిట జాలంధరంబున జలంధరుఁడు నిర్విచారుండై బృందఁగూడి
వివిధసుఖంబు లనుభవించుచు మహావైభవంబుననుండి యొక్కనాఁడు.

చ॥ వివిధసుగంధయుక్తమగు • వీడెము సేయుచు నొక్కవంకదై
త్యవనితలెల్ల వారును య • థాహన సపర్యల నాచరింపఁగా
నవిరళధూపవాసనల • హర్షము నొందుచు స్వర్ణడోలికన్
బ్రవినుల సాధ్వియౌ సుగుణ • రాశిని బృందను గూడి వేడుకన్.

క॥ తులలేని వైభవంబున నలరారుచు దానవేంద్రుఁ • డబ్జదళాక్షీ
తిలకంబు బృందకిట్లను నలఘుతరాధాన్వితంబు • లగువాక్యములన్.

చ॥ అనిమిషసంతతిన్ గెలిచి • యష్టదిశాపతులన్ గలంచితిన్
వనజదళాక్షునొంచి పరి • వారసమేతుఁడనై తపీయమ
స్వనలను గాంచి మించితి ఘ • నంబగు కీర్తి వహించితిన్ జగం
బున నను సూర్వ నేర్చునొక • పోటరి లేఁడని నిశ్చయించితిన్.

వ॥ చతుర్దశభువనంబుల గాలించి శూరుండనని చెప్పుకొనువానికెల్ల నా ప్రతాపంబు
జవిచూపించితినైనను నింక ముక్కంటి యొక్కండు తక్కియున్నవాఁడాతనిసూ
సంగరంబున భంగంబుఁగావించినగాని యనన్యసామాన్యంబగు మత్తేజంబుసార్థ
కంబుగాదు. అతండు భీముండని విందునట్టి భీమత్వమెట్టిదియో యొకపట్టున

చెలిసికొని లోకంబులకెల్ల జలంధరుండేలికయనిసాటి సమస్తంబు జలంధరమయంబు గావించి వత్తుననిన నప్పురంధ్రీరత్నం బులికి కంపితాంగియై యాతనికిట్లనియె.

—♦ బృంద జలంధరునితో శివమహిమ జెప్పుట. ♦—

క॥ ఇదియేటి విరుద్ధంబో మదనారియె కాదె యిట్టి ♦ మహితంబగు సం
పద నొసఁగె నట్టివాని నె యెదిరింతునటంచుఁ బలికె ♦ దీవసురేశా.

చ॥ హరుఁడు జగన్నియంత నిఖి ♦ లామరవర్గము భక్తియుక్తి ద
చ్చరణము లాశ్రయించిరియె య ♦ సద్గతినొందక సంపదాఢ్యులై
నిరతము సంచరింతురు ము ♦ నిప్రకరంబు కరంబు పార్వతీ
శ్వరునిగదా జపింత్రు భవ ♦ బంధవిమోచనుఁడంచు నెంచుచుక్.

సీ॥ పరమభాగవతు ల ♦ ప్పరమేశ్వరుఁడె భగవంతుఁడనుచు భజి ♦ యింతురెపుడు
యోగిజనంబులయ్యు ద ♦ ధి తూణీరుండె యోగేశ్వరుండంచు ♦ నొగిదలంతు
రాగమవేత్తలా ♦ యాగమాశ్వుఁడె ప్రణ వ స్వరూపియటంచుఁ ♦ బలుకుచుంద్రు
శూరాగ్రగణ్యులా ♦ శూలియె సకలసమిచ్ఛూరుఁడనుచును ♦ మెలఁగుచుందు
సిద్ధులాత్ర్యంబకుఁడె మహా ♦ సిద్ధుడంద్రు కవివితతియా మహా కాల ♦ కంతునొకని
యేతదఖిలప్రపంచ వి ♦ ఖ్యాత నాటకంబు వ్రాసిన సత్కవి ♦ గావచింత్రు.

ఉ॥ ఆపరమేశ్వరుండు కరు ♦ ణాన్వితుడైన సుఖించు లోకముల్
గోపముఁ గాంచినక్ భువన ♦ కోటులు నాశనమొందు నెవ్వరే
నా పురవైరితోడఁ గల ♦ హంబొనరించి మనంగనేర్తురే
కాపురుషోక్తి నమ్మి చెడి ♦ కంబునబల్కెదుగాని యివ్విధిక్.

తే॥ పూజ్యపాదులరగు మన ♦ పూర్వులెల్ల భవుని భజియించియేకదా ♦ వివిధసుఖము
లంది సత్కీర్తిఁ గాంచిరో ♦ యసురనాథ వార లెదిరించిరే శూల ♦ పాణి నాజి.

మ॥ పరమేశా శరణంబొసంగుమనుచుక్ ♦ బ్రార్థించినక్ బ్రోచుఁ దా
నరి సంతానమునైన మార్కొని రణం ♦ బధిగించినక్ ఘోర సం
గర రంగంబునఁ ద్రుంచుఁ గాలునయినక్ ♦ గర్వంబునక్ మించి యీ
శ్వరు సాధింతునటంచుఁ బల్కెదగు నే ♦ ప్రాణేశ నీకిట్టులక్.

చ॥ గెలిచితి వెల్లలోకములఁ ♦ గీడ్పడఁజేసితి శత్రుసంతతిక్
వలచితి కీర్తికాంత సరి ♦ వారల పన్నునలంది తెంతయుక్
సలలిత తేజ నీకు నిఁకఁ ♦ జాలదె యాహవవాంఛ శర్వునిక్
దలఁపగ నెంచు టేల కరు ♦ ణానిధి యాతనిగొల్వ కింతయుక్.

క॥ గురునిందయొనర్చుటయును హరునిఁ ద్వేషించుటయును ♦ నాశ్రితులయెడన్
దురితంబులు పొసగించుట తరుణులఁ బరుషంబులాడఁ ♦ దగదనిరి బుధుల్.

తే॥ ఎదిరిబలమెఱుంగ ♦ కెవఁడేని యేకార్యమైన నాచరించు ♦ నాతఁడగ్గిఁ
బడిన మిడుతవోలెఁ ♦ జెడు వాని రక్షింపఁ దలఁపఁగూడదనిరి ♦ ధర్మవిదులు.

క॥ అని పలికిన దరహాసంబొనరించుచు దానవేంద్రుఁ ♦ డువిదంగని యి
ట్లను నోవనితా యేటికి ననుగుతించి వచించెదిట్లు ♦ లలతులవోలెన్.

చ॥ ఎఱుఁగవె నీవునన్ను దను ♦ జేశ్వరు మద్భుజవిక్రమంబునన్
గొఱతవడంగఁజేసితి న ♦ కుంఠితవిక్రము నాత్రివిక్రమున్
దలుగనివంతఁగూర్చితి ప ♦ దంపడి వాసవునంత వానికే
డ్తెఱనను మోహరింపఁగల ♦ ధీరుఁడె శంభుఁడు గింభుఁడాజిలో.

చ॥ హరుఁడె ననుఁ జయింపఁగల ♦ యట్టి పరాక్రమవంతుఁడేని ని
ర్జరులను మచ్చమూవితతి ♦ చక్కడగించెడుపట్ల వారిపైఁ
గరుణవహించిమార్కొనఁడె ♦ కానినియేటికి నాకడన్ మహే
శ్వరునొకపోటుబంటనుచు ♦ బల్కెదునన్ను తృణీకరించుచున్.

శా॥ త్రైలోక్యప్రథమానకీర్తియగునీ ♦ దైత్యేశ్వరుండింక నా
భీలంబైన మహారణాంతరమునన్ ♦ భీమున్ జయింపండ యే
నేలాసార్థకమానొ నాయెదలనిం ♦ తేనిన్ జగచ్ఛ్వారుఁడన్
వాలాయంబుగలట్టిమేల్ బిరుదు దు ♦ ర్వర్ణంబుగాకుర్వరన్.

ఉ॥ ఏనిదెపార్వతీరమణు ♦ నిప్పుడపోయి జయించివత్తునా
పూనినయత్నమున్ విఫల ♦ మున్ బొనరింపఁదలంపకీవు స
న్మానము సేసి పంపగదె ♦ మానినివల్లభుఁడొందుకీర్తికిన్
దానకమైనవారువని ♦ తామణులేయని నీ వెఱుంగవే.

—♦ జలంధరుండు శివునిపైదండెత్తుట. ♦—

క॥ అనుచు ననేకవిధంబుల వనితకుసన్మతముఁగూర్చి ♦ భయదాకృతియై
దనుజేంద్రుఁ డపారంబగు తనసైన్యము వెంటరాఁగఁ ♦ దరలెఁగడంకన్.

వ॥ అట్లు దరలి నిరంతరప్రయాణంబుల నడచి యనేక సహస్రభూతగణాధిష్ఠితంబును, నిఖిలలోకపాలక సేవితంబును, విమలమునిగణ పవిత్రాశ్రమశోభితంబును బృందారక సందోహకృత స్తోత్రారావ శబ్దాయమాన బహుళగుహాముఖాళీ రామంబును, నభ్యున్నతానేక రత్నశిఖరాలంకృతంబును, నిరంతర వివిధనాట్య వాదిత్రకుశల కుశీలవ కృత విచిత్రశంభు కథాగర్భిత మనోహర నాటక దర్శనాగత నానావిధ భూతసంతానదంతురితంబునునగు కైలాసాచలంబు సమీపించి జయభేరి మ్రోగించె నంత.

ఆననుభాధరంబునకు • నన్నిదెసల్ శతకోటియోజన
ప్రావృతమైన దైత్యనిచ • యంబును గన్గొనిభీతచిత్తులై
దేవతలెల్లఁబర్వలిడి • తేకువలేక యొకింతయున్ మహా
దేవునిఁజేరి యవ్విధముఁ • దెల్పిన నాగజచర్మచేలుఁడున్.
ఆసురనెదిరిపోర • నమరులందేరికిఁ దరముగాదటంచుఁ • దలఁచి తాన
యలతిఁబరిభవింప • నహుఁడండ నగుదునం చరసి భూతగణము • లనుసరింప.
బలమత్తుండగు దానవున్ గదిసి స • ర్వజ్ఞుండు క్రోధంబునన్
బలుకున్ దుష్టనిశాచరాధమ సమి • త్ప్రావీణ్యమేపారఁగన్
గెలువన్ వచ్చితె చాలుచాలు నికనీ • కృత్యంబుఁ జాలించి పో
మ్మలఘున్ శంకరు గెల్వవచ్చునొకో ని • న్నంతంబు గావింపఁడే!.
కడిచికూర్చుండి యేటికిఁ • గొఱతవడెదు భక్తిసాధనమునఁగాక • పౌరుషమున
నెవ్వరికైన నన్నుజయింపఁదరమె యెవరుబోధించినారునీ • కిట్టిబుద్ధి.

—• పరమేశ్వరు వాక్యంబులకు జలంధరుఁడు గినియుట •—

శ్రవణవిదారకంబులగు • శంకరువాక్యములాలకించి దా
నవవిభుఁడుద్ధతుండయి ఘ • నంబగు రోషము చంగలింపఁగా
నవుఁవు మాటకారివె య • హానిను మెచ్చితి నిట్టిపల్కులే
యవనివచింపఁగాఁదగుఁగ • దాసమరంబొనరింపలేనిచో.
ఇవియచంద్రాంశునిభములై • యొసఁగుశస్త్రములుకనుంగొనుమిపుడుని • న్మొనసిరణము
సేయుతలఁపునవచ్చితి • న్యాయబుద్ధి లేకవచియింపఁదగునెయీ • లీలనన్ను
అతనిపలుకులువిని శంభుఁ • డపుడురౌద్ర మాయునంబగునట్టి ర • థాంగమును మ
హాజలంబున నిజచర • ణాగ్రమునను వ్రాసి దానవుఁగనుఁగొని • పలికెనిటుల.
ఏఁబలవంతుఁడననుచు • నిటులఁ జెప్పుకొనెద వేటికి దీనిఁ గై • కొని శిరంబు
నందుఁబెట్టుకొనుము నీ మ•హాబలంబు తెలియఁగలుగును జగములఁ•దేటపడుచు.
వాక్యఁడు దానవ • నాథుఁ డిట్లను బినాకినిగాంచి యిదియొక • పనియెనాకు
గడఁగొని నీతుర • గంబగు నందిని నిన్నుఁ జక్కాడెద • నీలకంఠ
యింద్రాగ్ని శమన వి • త్తేశవాయ్వాదులు గరుడవాసనఁగాంచి • పరచు నురగ
నికరింబువోలె మా • మక పరాక్రమము సహింపలేరైరి తా • రింతయేని
నైఱుంగవొకో జలం • ధరుని నిఖిలశాత్రవా నీక సంహారు • శమితదేవ
ననిపల్కుచు నతండు దీప్యదమల కాంతియుతమగు నారిథాం • గంబుబట్టె.
ఇదె కనుంగొను • మీ చక్రమిపుడతృణము నట్లు బైకెత్తెదనటం చ • హుంకరించి
యమ్మనుచునెత్తి శిరమునం•దుంచుటయును నతనిమూర్ధంబు తునుకలై•యవనిబడియె.

తే॥ పరమపావనమిది జలం • ధరచరిత్ర మమలమతిఁజదివిన విన్న • నఖిలసౌఖ్య
ములను నాయురారోగ్యముల్ •గలుగు నరున కంతమున శివసాయుజ్య•మమరునెపుడు.

వ॥ అవ్విధంబున లోకకంటకుండగు జలంధరుం డీశ్వరపాదాంగుష్ఠ లిఖితమహాచక్ర
ఖండితోత్తమాంగుండై కూలి నంత నొక దివ్యతేజం బాతనిహృదయకుహరంబు
నుండి వెడలి పర మేశ్వరునం దంతర్హితమయ్యె నప్పుడు దానవసైన్యంబులుక్క
దక్కి నల్దెసలఁ బరుగిడె నంత భవానీమనోహరుఁడును సేవకగణముఁ గూడి నిజ
నివాసంబున కరిగెనని పలికి సూతుండు మహర్షులఁ గాంచి వెండియు నిట్లనియె,

క॥ మునులార వినుఁడు శంభుఁడు దనుజవధార్థంబు సృష్టి • సలిపిన చక్రం
బును హరి పరిగ్రహించిన యనఘంబగు కథ వచింతు • నవధారులరై.

—దేవతలు దానవబాధకోర్వక నారాయణుని జేరుట—

ఉ॥ దుర్మతులైన దానవులు • తొల్లి యొకప్పుడు పెల్లురేగి దు
ష్కర్మము లాచరించుచుజ • గంబుల నెల్లను బాధసేయుచున్
గర్మతులై చరింప వసు • గర్భసహింపఁగలేక క్రుంగె స
ద్ధర్మములెల్ల రూపఱె బు • తంబు నశించె జగత్త్రియంబునన్.

చ॥ సరసిజసంభవాది సుర • సత్తము లయ్యసురాళిఁ ద్రుంచి భూ
భరమును మాన్పఁ గోరిక నవారితవిక్రమ ముల్లసిల్లఁగా
బరవసమూని రక్కసుల • పైఁబడినన్ జెలరేగి వారలున్
గరము దురంబొనర్చిరి మ • గంటిమఁ జూపుచుఁ బెద్దకాలమున్.

ఉ॥ ఆవిధి దేవదానవుల • హంకృతిఁ బోరునకున్ గడంగి నా
నావిధ శస్త్రప్రయోగముల • నవ్యతరాయుధతాడనంబులన్
జేవదలిర్పఁగా సమర • సీమజయంబునుఁ గోరుకొంచుఁ గ్రో
ధానిలచిత్తులై యొక స • హస్రయుగంబులు బోరి రుద్ధతిన్.

తే॥ అవ్విధంబున సాగిన • యాహవమున దనుజవిక్రమ స్ఫూర్తికిఁ • దాళలేక
యమర సంతతి పఱచె హా • హా రవములు సేయుచును మధుసూదను•చెంతకపుడు.

తే॥ అటులబాఱివచ్చి • నట్టి వేల్పులఁ గాంచి కమలలోచనుండు • కనికరమున
వెఱచుటేల మీకు • విబుధేంద్రులార యేదానవుండు మిమ్ముఁ • దాఁకె నలిగి.

ఉ॥ ఏయసురాధముండిటుల • నెన్నఁడులేని యవస్థ గూర్చె మీ
కీయెడ వానికింతటి య • హీనపరాక్రమ మేలకల్గె నా
మాయకుఁడైన దానవుని • మానుక తీవ్రగదాభిఘాత దు
ష్కాయుని జేసి యందఱకు • సౌఖ్యముఁగూర్తు నెఱుంగఁబల్కుఁడీ.

క॥ అని యనుకంపవచించిన వనజాక్షునితోడ నమర • వర్గంబు నో
యనఘ భవత్కరుణఁగదా జనియించును మాకు సౌఖ్య • సంతానంబుల్.
సీ॥ దానవుల్ క్రూరులై • తగవు నాకజగంబుఁ గలఁచుచునుండి ర • కారణంబ
యేయాయుధంబున • నెట్టి యస్త్రంబున నేయుపాయంబున • నేని వారు
విజితులుగారు దు • ర్విషయాభిరతులయి చరియించుచుందురు • సంతతంబు
నింద్రపురోగము • లీ నిర్జరులు వారి నెదిరింపఁగాలేక • యివ్విధమున
శరణు వేడిరినిన్ను వి • శ్వ ప్రపంచ రక్షకుఁడవీవు నీవంటి • దక్షుఁడొకఁడు
కలఁడె మమ్మేలు మేటిజ • గానవెందు శ్రితసరోజాతమిత్ర ల • క్ష్మీకళత్ర.
క॥ నీవు కరుణింపకుండిన దేవా వేలుపులకింక • దిక్కెవ్వఁడుచే
తోవీధి నిన్నె నమ్మితి మీా వెతలన్ బాపి ప్రోవు • మీాశ రమేశా.
తే॥ అర్కమండల సంభూత • మైన నీదు చక్రము దధీచికతమున • వక్రమయ్యె
నది సమర్థంబగునె జల • జాక్ష దైత్య నాశనంబొనరింప నిం • తయును దలఁప.
తే॥ నీదు దండంబు శార్ఙ్గంబు • నీ ప్రసాదమున నె కైకొని రసురులు • మున్నువారి
నింకనేమాడ్కి ని జయింతు • వీవు లోకరక్షణము ముఖ్యముగదా వి • పక్షహరణ.
చ॥ కమలదళాక్ష తొల్లియొక • కాలమునందు జలంధరుండు నా
నమరవిరోధియొక్కఁ డన • యంబు వహించి జగత్త్రియం బధ
ర్మమునఁ గలంచునుండఁగ ను • మా పతి వాని వధింపఁగోరి చ
క్రమును సృజించె శాత్రవధ • రాధరఖండనదక్షమై తగన్.
క॥ ఇతరములగు నాయుధ సంతతు లెన్నియు దానిఁ బోలఁ • దగవిల దైత్యో
ద్ధతి మాన్చి మాకు సౌఖ్యస్థితిఁ గూర్పఁగ నదియచాలు • దిటము దలిర్పన్.
తే॥ ఆమ్మహాచక్రముంగొని • యాహవమున దనుజసంతతిఁ గూల్చి ము•దంబుఁగూర్పు
మయ్య లోకంబులకు నీవ యప్పఁడవు తమ్రగచక్రంబుఁ దాల్పఁగ • నోమురారి.
మ॥ అని ప్రార్థించిన వాసవప్రముఖ దే వానీకముల్ మెల్లనన్
గనిదామోదరుఁ డివ్విధంబను నవ • క్రంబైన యా చక్రమే
దనుజవ్రాతముఁ బాఱఁద్రోలఁగ సమ • ర్థంబౌను లోకార్థమై
యనఘుల్ శంకరు నాశ్రయింతునిఁక నుద్యద్భక్తిఁ దత్ప్రాప్తికై.
చ॥ చనుఁడిఁక మీారలేనరిగి • చంద్రకళాధరుఁ గొల్తు నమ్మహా
త్ముని కృపఁ గాంతు వైరిగణ • ముల్ వధియింపఁ దదీయచక్రముల్
గొనియెద లోకసంతతుల • కున్ ముదముం బొనరింతు నాహవం
బున విజయంబుఁ గాంతు ముని • ముఖ్యులకున్ హితమాచరించెదన్.
తే॥ అనుచు వారల నోదార్చి • యనిచియంతఁ జక్రలాభముఁ గోరి కే• శవుఁడు శైల
రాజమగు హిమగిరి శిఖ • రంబుఁజేరి సంతసంబు దైవారఁగ • స్వాంతమందు.

## —నారాయణుఁడు శివారాధనము గావించుట—

సీ॥ అమ్మహాశైల శృం • గమ్మునఁ ద్వారితాఖ్య గలవాఁడయిన విశ్వ • కర్మ యొకఁడు
రచియించె మేరుప • ర్వతసన్నిభంబగు ఘనతరలింగంబు • వనజనయనుఁ
డద్దాని స్థాపించి • యతిభక్తిమై షోడశోపచారంబుల • నొనరఁజేసి
మహితసహస్ర నా • మముల ధ్యానమొనర్చి స్థిరతరబుద్ధిఁ బూ • జించి మఱియు
నాదిమధ్యాంతరహిత లో • కైకనాథ పాపభంజన పురహర • భవ మహేశ
సంతతానంద దాయక • సాధువినుత పాహిమాంపాహి పాహిమాం • పాహి పాహి.

చ॥ అనుచు సహస్రపద్మముల • నర్చనసేయుచు నుండువేళ న
య్యనఘుని భక్తిఁ గన్గొనెడు • నట్టి తలంపునఁ జేసి శంభుఁడ
వ్వనజసమూహమందు నొక • పద్మ మదృశ్యముగా నొనర్చినన్
ఘనుఁడు మురారి యచఱకయి కంబుజమున్ గనలేక ఖిన్నుఁడై

చ॥ జలరుహమెందుఁబోయె నిఁక • శంకరు నెవ్విధిఁ బూజసేయఁగా
వలయు నెవండయేని సుర • వైరి శివార్చన కిట్టి విఘ్నమున్
సలుపఁదలంచి ముచ్చిలెనొ • చారుపయోరుహ మెట్లు లభ్యమా
కలుషము సంభవించె సుర • కార్యము వ్యర్థమె యౌనొ యేమొకో.

క॥ అని పలువిధములఁ దలఁచుచుఁ దన నేత్రంబును బెకల్చి తమ్మికెన యటం
చును శంభుఁ బూజయొనరిచె ననఘులు ప్రారబ్ధకార్య • మఱి సేయుదురే.

వ॥ అట్లు బూజించి ధ్యాననిమీలితనేత్రుండై యున్నెడ.

సీ॥ గంగాతరంగ సం • గత మకుటంబునఁ జంద్రకళాద్యుతుల్ • చాకలింపఁ
గాలకూటచ్ఛవి • కలిత గళంబున భుజగాభరణమణుల్ • పొలుపుమీఱ
భస్మావలిప్త క • వాటోరు వక్షస్థలమున రుద్రాక్ష మా • లలు చెలంగ
శ్రితదేవతావన • చతురమౌ కరమున నబ్జయోనికపాల • మమరుచుండ
వామపార్శ్వంబునన్ గిరి • పట్టివెలయ నాగ చర్మాంబరుఁడయి పి • నాకపాణి
నందికై దండయొసఁగ నా • నందమూర్తియగుచుఁ బ్రత్యక్షమయ్యె నా • నగధరునకు.

తే॥ అటులఁ బ్రత్యక్షమైన పు • రారిఁ గాంచి ముకుళితకరాబ్జుఁడగుచు దా • మోదరుండు
మోదమున భక్తియను మది • ముప్పిరిఁగొన నిగమవిహితార్థసూక్తులఁ • బొగడెనిటుల.

మ॥ నతభక్తావనతే నమోయనుచు నా • నందోజ్జ్వలాకార స
తతభక్త్యాతవ పాదపద్మయుగళం • ధ్యాయామి యంచున్ జగ
ద్ధిత సర్వస్వమిదం గృహాణయని లో • కైకప్రదీపంబులౌ
స్తుతిరత్నంబుల నిన్నుఁగొల్చెద లస • న్మూర్తీ భవానీపతీ.

మ॥ అని ప్రార్థించిన రాజమౌళి కరుణా • యత్తైక చిత్తంబుతో
ననియెన్ గేశవుఁగాంచి నీ ప్రవిమలం • బౌ భక్తికిన్ మెచ్చితిన్

వనజాక్షా యెది యేనొసంగుదు ననుఁ • వాంఛింపు నీవంటి భ
క్తునకుఁ గామ్యమొసంగుచుండుటయె కా • దో నాకుఁ గృత్యంబిలన్.
చ॥ వనజభవుండు సృష్టిసలు • పఁ సచరాచరమైన యీ జగం
బనయముఁ బ్రోచుచుందువు మ • హాత్మ్మ్యదనీవు జగద్ధితార్థమై
నను భజియించితిప్పుడు జ • నార్దన కైకొనుమీ సుదర్శనం
బనియెడి చక్రరాజ మఖి • లారి వినాశకమై చెలంగఁగన్.

— శివుడు నారాయణునకు చక్రమిచ్చుట, —

క॥ నీ విమలమైన భక్తికి సేవక్యుఁడనైతిఁ గోరు • మిఁక నన్నియు సం
భావించి యిత్తుననినన్ గోవిందుండపుడు శివునిఁ • గుఱించి వచించెన్.
చ॥ వరదుఁడవైతివీవు భగ • వానుఁడ నాయెడ నింత చాలదే
వరములు వేయులేల యిఁక • బాప నివారకమైన నీపదాం
బుజహ యుగంబుఁ గొల్వఁగల • బుద్ధినొసంగుమటన్న నావు డా
హరిఁగని యిట్లు బల్కెను ద • యామయుఁడై పరమేశ్వరుండొగిన్.
తే॥ నాకుఁ బ్రియభక్తుఁడవగుచు • నాకలోక పూజ్యుఁడవగుదువీవు మ • ద్భూరికరుణ
నిదియె కైకొనుమీ చక్ర • మిదియనయన మనుచుఁ జక్రంబు నయనంబు•నతనికిడియె.
తే॥ ఇదిమొదలు చక్రినాఁ గమ • లేక్షణుండు నాగవిఖ్యాతిఁగాంచి య • నారతంబు
వినుతిఁగాంతువు జగముల • ననఘ నీదు విమలచరితంబు దిక్కుల • వెలయుచుండు.
సీ॥ దక్షప్రజాపతి • తనయ సులోచనయను సతి తలిదండ్రు • లందనూయుఁ
దాల్చి తుషారభూ • ధరముఁగన్పట్టి హైమవతీత్వంబు • నవధరించు
నపుడు నీసోదరియగు • మాదేవిని కమలాసనుని నియో • గంబుకతనఁ
బత్నినిగా సమ • ర్పణముఁ జేయుదు నాను నదిమొదలేను సౌ • హార్ద మూని
సంచరింతును నీయెడ • సకలలోక పూజ్యుఁడవగుదువీవు స • న్మునులు సురలు
మిమ్ముఁగొల్చుచునుందురో • పన్నగేంద్రశయన యిది నిక్కువంబు ని • స్సంశయంబు.
తే॥ అనిపలికి యదృశ్యుండయ్యె • నంతకారి హరియుఁజక్రంబుఁగైకొని • యఖిలదైత్య
సంచయంబును దునిమి ని • ర్జరులకెల్ల సౌఖ్యముఁగూర్చి మోదంబు • సంఘటించె.

— దేవీ సంభవ కథనము. —

వ॥ అనిపలికి సూతుండు మఱియు దేవీసంభవప్రకారంబు వినుడని యిట్లనియె. భగా
ఖ్యయగు జగద్ధాత్రి లింగమూర్తికిఁ బ్రివేదికయగు లింగంబు ద్వివిధంబు, జగత్సృ
ష్టికిఁ గారణంబు. జ్యోతీరూపుండును లింగమూర్తియు నగు శివుండు తమోపరిస్థి
తుండైయుండు. లింగవేది సమాయోగంబున నర్ధనారీశ్వరుండు వెలసె. అయ్యర

నారీశ్వరుఁడు ప్రథమంబునఁజతుర్ముఖుఁడగు బ్రహ్మను సృష్టించి యాతని ప్రార్థనంబున నిజవామాంగమునుండి యాత్మపత్నియగు దేవిని సృజించె. ఆదేవి పరమేశ్వరునానతి సతీనామంబున దక్షపుత్రికయై యీశ్వరుఁ బాణిగ్రహణంబుఁగావించె. దక్షుండు నారదశాపకారణంబున నవజ్ఞుండును దుర్మదుండునునై యుమామనోహరు నిందించిన సతీదేవి యోగాగ్నిచే నిజశరీరంబు భస్మంబు గావించి పార్వతీత్వంబుఁ గాంచె నంతఁ బరమేశ్వరుండు దక్షప్రారబ్ధంబగు యజ్ఞంబు ధ్వంసంబుఁ గావించె నాకథయు నాలకింపుఁడు.

— దక్షుం డీశ్వరుని ద్వేషించుట. —

ఉ॥ తాను ప్రభుత్వసంపద మ • దంబున దక్షుఁడు కన్నుగానక
జ్ఞానపరీతుఁడై గరళ • కంఠు నవజ్ఞనొనర్పఁబూని య
జ్ఞ్మానినుతుఁ మహేశ్వరు ను • మాపతిఁగొల్వకుఁడంచు నెల్లెడన్
బూనికఁజాటినన్ విబుధ • ముఖ్యులెఱింగి భయంబువోఁపఁగన్.

చ॥ తనను శశాంకమౌళి వర • దానమునన్ లభియించెఁ గాదె యీ
యనఘపదంబుదానిటుల • నజ్ఞుఁడువోలెఁ జరింపఁగూడునే
సనకసనందనాది ముని • సన్నుత పాదసరోజుఁడైన శం
భునకె విరోధియై తిరుగఁ • బూనెనె దక్షుఁడు తెల్విలేకొగిన్.

తే॥ ఎవనికరుణఁజేసి • యీసృష్టికర్తృత్వమును ధరింపఁగల్గె • ననఘుఁడతని
తోడవైరమూనఁ • గూడునె దక్షున కింతయేని యెఱుఁగఁ • డే యతండు.

మ॥ హరుసాధించుతలంపుగల్గునెడఁ దా • న య్యాదిదేవుఁన్ భయం
కరు దండెత్తుట యర్హమానిటుల లో • కంబెల్ల శూలిన్ మహే
శ్వరు సేవింపఁగరాదటంచు నచియిం • పన్ జెల్లునే ప్రాజ్ఞులా
హరునిన్ గొల్చుటమాని దక్షునకె జో • హారుల్ సమర్పింతురే?

క॥ కొనసాగనిపనిఁబూనుట తన యధికారంబుమించి • ధన్యులయందున్
గినుకవహించుటయును నిలఁ దన కపకృతిఁ గూర్చునని • తజ్జ్ఞ జనంబుల్.

వ॥ దక్షుండు తమోపహతుండై పురాంతకునంతవానిఁ గాదని తలంచుచున్నవాఁ డమ్మహాదేవుండు సామాన్యుండే. కాలంబు మించకుండగనే దక్షునిమనంబు ప్రశాంతంబు గావింపకున్న ననిష్టంబు సంభవించునని తలంచి విష్ణ్వాది దేవత లాతనికడకరిగియు విమర్యాదఁ గాంచి యిట్లనిరి.

క॥ నీవెఱుంగని ధర్మువుగలదే విశ్వాధికుఁడవీవ • యెల్లజగంబుల్
తావక కరుణాపాత్రములై వెలయుచు సకలసుఖము • లందు సతంబున్.

క॥ చతురుఁడవు నిఖిల ధర్మస్థితికిఁ బదంబీవు నీకుఁ • జెప్పవలయునే
యితరులొకపనినిగుఱించి యహిత సూదన దక్షశ్రిత జ • నేష్టనిధానా.

తే॥ అయినఁగాని ప్రభువు • లప్పుడప్పుడు కారణాంతరములఁజేసి • స్వాంతములను
ధర్మవిషయములను • ద్వర సేయుదురు దాన భువనములకనిష్ట • ములు ఘటిల్లు.

ఉ॥ అట్టి యనిష్టకాలమున • యందుఁ దమంతనవచ్చి మాదృశుల్
బట్టుఁ దొలంగకింతయు న్వృ • పాలుని చిత్తము నొవ్వఁ జేయ కి
ట్టట్టని తెల్పి యాతని న • హీనతరంబగు ధర్మపద్ధతిన్
బెట్టుట పుణ్యమూలమని • పెద్దలు సెప్పుదురయ్య ధీనిధీ.

చ॥ హరుఁడె యనాదిమధ్యలయుఁ • డంచు నెఱింగియు నీవు కారణాం
తరమునఁ జేసి యివ్విధి న • ధర్మము నాకగిరీశునందు దు
ష్కరమగు వైరమూనితివి • శాసనకర్తవు నీకుఁగూడదం
చొరులు వచింపఁగావలయు • నో నిగమంబుల గారవింపవో.

క॥ కావున నీ దురభిప్రాయావేశముఁ దలఁగఁజేయు • టపసగమనుదుక్
నేవచ్చితి మిప్పుడు దక్షావినుము విమర్శసేయు • మా మాపలుకుల్.

క॥ నావుఁడు దక్షుం డిట్లను దేవావళిఁ గాంచి యిట్టి తేకువ చనునే
యా వామదేవునకు నేఁ గావించిన దోష మింత కలదే చెపుడా.

తే॥ తనకు సర్వజ్ఞుఁడనటంచుఁ • దలఁచి యిట్లు దర్పమూని చరించుట • తగునె పిన్న
పెద్దలనియెడి మర్యాద • విడిచి తిరుగువాని దైవంబటంచును • బలుకుటెట్లు.

ఉ॥ అతఁడధీశ్వరుండె యగు • నైనను మాదృశులైనవారలన్
ఖ్యాతచరిత్రులన్ గనిన • గౌరవముల్ బొనఁగూర్పఁగూడదే
నీతియు జాతిలేక యవ • నిన్ జరలాఁడెడువాఁడు వేల్పె జా
మాతయె యుద్ధతుండయిన మామకుఁ గీర్తిలభించునే యిలన్.

చ॥ అతఁడు దిగంబరుండనుచు • నాత్మ నెఱింగియు ముద్దుకూఁతు ని
చ్చితనకు గార్హ్యపత్యమును • జెందెడునట్టులఁ జేసితిన్ గదా
యతులిత సౌఖ్యసంతతుల • నందుచు నిప్పుడు నా కగౌరవ
స్థితిఁ గలిగింపఁజెల్లునె యి • సీయనరే మిమువంటి సాధువుల్.

క॥ నాయంతవానిఁ దృణముగఁ జేయఁగఁ దలపోసె నట్టి • చెనఁటినె యిచటన్
హేయము నాక వచించెద రా యమరేశ్వరులు మీర • లందఱు వినఁగన్.

ఉ॥ దుష్టుఁడు కష్టజీవియగు • ధూర్జటినే యొక పెద్దఁజేసి మీ
యిష్టమువచ్చినట్లు వచి • యింపఁగ నేమిటి కింకఁ బొందు వాఁ

దష్టవిభూతులన్ వెలుఁగు • నట్టిఁడె యైన భజింపుఁ డాతనిన్
స్పష్టమిదే కనుంగొనుఁడు • శంకరుఁ గాదని సంచరించెదన్.
చ॥ క్రతువొనరింతు నింక నితి • కంతుని బిల్వక మీరలీ జగ
ద్దితమగునట్టి కార్యమున • కెంతయుఁ బ్రీతివహించివచ్చి స
ద్గతిఁగని పొందు నాయెడల • దర్పమునన్ జరియింతురేని మీ
వెతలకు మీరె హేతువయి • పిమ్మట నొందుట యోగరిత్రిపై.

—దక్షుఁడు శివుని గాదని యజ్ఞముఁజేయుట—

వ॥ అని పలికిన వేల్పులెల్లరుఁ గార్యంబు తప్పివచ్చెఁగదాయని విచారించుచు మాఱు వలుకక తలవాలిచికొని నిజవాసంబుల కరిగిరంత దక్షుండు విరూపాపాక్షుఁ దిరస్కరించి యజ్ఞంబుఁజేయువాఁడై విశ్వకర్మని రావించి యజ్ఞశాల నిర్మింపుమని యాజ్ఞ సేసిన నాతండును మందాకినీ సరిత్ప్రాంతంబున ననూపమంబును, స్వర్ణమయంబును, ననేక సహస్రయోజన విస్తారంబును, వాపీకూప తటాకాభిరామంబును, వివిధ యాగోపకరణ సమన్వితంబును నగు నొక యాగశాల నిర్మించిన సంతసించి చారులవలన నందఱ నాహ్వానంబుఁ గావించిన బ్రహ్మేంద్రాది దేవతానీకంబును, మహర్షి సమూహంబును గ్రహంబులును, దైత్యదానవులును నరుదెంచి రంత దక్షుండొక్క శుభముహూర్తంబున యజ్ఞారంభముఁ జేసె నిది యిట్లుండ భవాని నారదుని ముఖంబున నిజజనకుండు సవనంబుఁ గావించుచున్న వాఁడని విని భవుని సన్నిధిఁ జేరి యిట్లనియె.
తే॥ అనఘ మజ్జనకుఁడు యజ్ఞ • మాచరించుచున్న వాఁ డాజ్ఞయొసఁగుమా • జన్మమునకుఁ బోయివత్తును సంతసం • బున మఱియు వాంఛితముఁ దీర్పు టుచితమై • వఱలునీకు.
చ॥ జనయిత యెద్దియేని పని • సల్పఁగబూనె నటంచు విన్నఁ ద
త్తనయల కెందు నేనియును • దానిఁ గనుంగొను కోర్కె గల్గదే
వనితకు భర్తృగేహమున • వైభవముల్ పదివేలు గల్గియున్
జనకునియింటియంబలియె • సంతసముం బొనఁగూర్చుఁ గాదొకో.
మ॥ నినుఁ బూజ్యుండగు వానిఁ బిల్వకయె తా • నే లోకనాథుండ నం
చును మత్తుండయి సంచరించుచున ద • క్షుండున్న వాఁ డట్టులై
నను నాకున్ జనకుండు గావునను స్వాం • తంబందుఁ దద్యజ్ఞమున్
గను నుత్సాహము ముప్పిరిం గొనెడు లో • కత్రాతసంరక్షకా.
ఉ॥ కోమలివాంఛితంబు నొనఁ • గూర్చుట కాంతుని ధర్మమంచు నిం
కేమని చెప్పఁగావలయు • నీశ్వర నీ కెఱుఁగంగరాని దే
దీ మహిలోన సర్వమున • కీవగదా పరిపాలకుండవో
సోమకళాధరా ప్రియము • నూపుము నాయెడ గారవంబునన్.

పతి కరుణఁబడయనేరని సతియు, గురున కహితుఁడైన ♦ ఛాత్రుండును దు
ర్మతియై ప్రజలఁగలఁచు నరపతియును రేకెత్తరనుచుఁ ♦ బల్కిరి ధీరుల్.

కావున నా ప్రణయము సంభావించి యనుజ్ఞనిమ్ము ♦ పరమేశ్వర త్వ
త్సేవారతిఁ జరియించెడి నీ వెలఁదికి నీవకాక ♦ యితరులు గలరే.

అని పలువిధములఁ బ్రార్థించిన సతిఁ గన్గొని శశాంక ♦ శేకరుఁడను నో
వనజానన నీ ప్రణయంబును గాదని పలుక కీయఁ ♦ బోలును నాకున్.

అయినను నేనొక్కటివచియింతు నిశ్చలచిత్తవై యాలింపుము.

ననువంచింపఁ దలంచి దుష్టుఁడయి జ ♦ న్నంబిట్లు సేయంగఁ బూ
నినవాఁ డాతనిఁ జేరుపూనిక్కదగునే ♦ నీ కింతయున్ దోఁచదే
వనితాకాంతునకున్ విరోధియగునే ♦ వాఁడేనియున్ గన్గొనన్
దనకున్ బ్రీతిని గూర్చువాఁడగునె మి ♦ థ్యాప్రేమ నీకేటికే.

పాకారి ప్రముఖసురలఁ గైకొని కనుగానలేక ♦ గర్వించుచుఁ దా
నాకు హవిర్భాగంబిడ కేకరణిన్ జేయఁబూనె ♦ నీ యజనంబున్.

తనకుఁ దెలియకున్నఁ ♦ దగవని పెరవారు సెప్ప వినఁ డతండు ♦ చెనఁటియగుచు
నట్టివానికడకు ♦ నరిగిన నీకెట్లు గౌరవంబు గలుగు ♦ గౌరి చెపుమ.

కూఁతుకతమున ♦ నల్లునిఁ ♦ గోరిపిలిచి పెద్దఁజేయుదు రెల్లరుఁ ♦ బ్రీతితోడ
నిది యెచటి పాపమో కాని♦యింతయేని పిలువఁగఁ దలంపఁడయ్యె నాతులువనన్ను.

తనకుఁ బ్రజాపతిత్వమును ♦ దక్షతయున్ దయసేసినట్టి న
న్ననఘుఁ దిరస్కరించి కలుషాత్ముఁడై యయ్యె నతండు వానికిన్
దనయవటంచు నీయెడలఁ ♦ దద్దయు గౌరవ మెట్లు గల్గునో
వనిత తలంపవైతిగద ♦ వానియెడన్ గల ప్రేమ యెట్టిదో.

జనకుఁడు నాకు గౌరవము ♦ సల్పక యుండునె కూఁతునందు లోఁ
గనలెడివార లుందురె ♦ యొకప్పుడయేని యటంచు నీవటన్
జనిన నతండు నిన్నుఁగని ♦ జన్నమునం దెకసక్కమాడినన్
వనజదళాక్షి యందుఁ గల ♦ వారలు నవ్వరె నిన్ను దక్షునిన్.

ఇది మహాసందిగ్ధసమయం బిప్పు డెట్లు సెప్పినను నీ మదికెక్కదు కావున యుక్తా
యుక్తంబుల విమర్శించి నీకుఁ దోఁచినటులఁ గావింపుమనిన దాక్షాయణి మఱియు
మనోహరున కిట్లనియె.

నిక్కువమే వచించితి ము ♦ నిప్రకరార్చిత యింద్రియోత్కరం
బెక్కుడు లావుగల్గి చరి ♦ యించెడుఁ గావున నాకుఁ దండ్రిపై
మక్కువ హెచ్చువేయ యొక ♦ మాట వచింపక యాజ్ఞ యీయవే
యక్కటికింపు టిక్కవుగ ♦ దా యిదె యజ్ఞముఁ గాంచివచ్చెదన్.

తే॥ పిలువకున్నఁగాని • పేర్మి మై నరుదెంచెఁ దనయయంచు నన్నుఁ • దలచియాదఁ
గారవించుఁగాని కఠినుఁడై పరిభవ మాచరించునట్టి • యధముఁడగునే.

ఉ॥ ఎందఱో మానివర్యులు సు • రేంద్రులు ధీరులు యజ్ఞశాలయం
దుందురు వారలెల్లఁగని • యూరకయుందురె నన్ను దూరఁగా
నిందు కళాధరున్ బిలువ • కేసవనం బొనరించుచుండియున్
నందన వచ్చినంతఁ దగు • నా యిటు సేయఁగ నంచుఁ బల్కరే.

తే॥ అనినఁ బరమేశ్వరుఁడు దర•హసితవదనుఁడగుచు నోదేవి నీ యిష్ట•మట్లుచనుమ
పుట్టునింటికిఁ బయనమై • పోవువారి నడ్డుసేయుటశక్యమా • నా ధరిత్రి.

—• దాక్షాయణి దక్షయజ్ఞంబుఁజూడ నరుగుట •—

వ॥ అని పలుకుచు ననేక సహస్రార్క ప్రభాభాసురంబును, వివిధమణి గణ ఖచితంబు
నగు దివ్యవిమానం బాయత్తంబుఁ గావించిన దాక్షాయణియు నుచిత పరివారంబు
వెంటరా నధిష్ఠించి క్షణమాత్రంబున యజ్ఞశాల సమీపించి విమానంబు డిగ్గి తండ్రి
చెంతకుఁ జని నిలిచిన దుర్మార్గుఁడగు దక్షుండు తిరస్కారంబుఁ గావించుచు నా
కిట్లనియె.

—• దక్షుఁడు శివుని దూరుట •—

మ॥ తరుణీ యేమిటి కేగుదెంచితివె యే • తద్దివ్య యజ్ఞాలయా
జిరదేశంబున కీవు నిన్నెవఁడు పి • ల్చెన్ బిల్వకే వచ్చుటల్
బరిహాసాస్పదమౌ వెఱుంగవోకో స • ర్వజ్ఞుండు నీ నాథుఁడే
కరణిన్ బంపెను శత్రుసన్నిధికిని • న్గళ్యాణినిప్పట్టునన్.

చ॥ హరుఁడు శ్మశాన దేశముల • యందుఁ జరించుచు నుండువాని న
ధ్వరములఁ జేర్పరాదతని • దారవు నీవును నట్టి దానవే
తరుణి తలంగిపొమ్మిఁక వృ • థా యవమానము నొంద నేలకో
బిరబిన నేగుదెంచితివి • ప్రీతిమెయిన్ నినుఁబిల్చినట్టులన్.

తే॥ కష్టజీవియైన • కాంతుఁగూడి చరింతువీవు నిన్నుఁ దనయ • యే యటంచుఁ
దలఁపరాదు పొమ్ము • తగునని వచ్చితి సిగ్గులేదె నీకుఁ • జెనఁటి చెపుమ.

వ॥ అని గర్వోద్రేకంబునఁ జేసి మోమోటములేక దురాలాపంబులాడు దక్షుని గాం
సర్వమంగళనయమ్మున నిట్లనియె.

చ॥ జనకుఁడవీవు నే సుతను • సల్పఁగఁబూనితి విట్టి యధ్వరం
బనఘులు చేరిరీ సభ సు • రారులెల్లరుఁ జూచుచుండ ని

ట్లనుచితమంచు నాక యక • టా వచియింతువె విప్రలాపముల్
తనయలయందుఁ దండ్రులె య • ధర్మముఁ బూనిన నేమనన్ దగున్.

గా॥ నాతోఁబుట్టులఁ దన్మనోహరుల స • న్మానంబునన్ బిల్చి త్వ
త్ప్రీతి స్థానమునైన నన్నిటుల ను • ద్రేకంబునన్ బల్క నా
నే తండ్రీయిది యిట్టిదం చెవరు నీ • కేరీతి బోధించి నీ
చేతంబున్ మరలింప నేర్తురు భవ • చ్ఛ్రేయంబు వాంఛించుచున్.

చ॥ హరుఁడు సహానుభావుఁడని • యాత్మ నెఱింగియు భీతిలేక యి
క్కరణిఁ బురారికప్రియము • గా సవనంబొనరించుచుండియున్
గరుణవహించి నన్నుఁ దిగ • కన్నులదేవర పంపినన్ నిరా
దరణ మొనర్పఁబూనితివి • తండ్రివె నీవు వితండిగాకిలన్.

క॥ యజ్ఞేశ్వరుండయిన సర్వజ్ఞుని నిందించి యధ్వ • రము సేయుదువా
ప్రాజ్ఞ నకీకమావిస్సిఁక యజ్ఞుఁడవై యేకిత్తు • వది మఱిఁగనుమా.

వ॥ నిరంజనుండును, నిర్వికల్పుండును, నిష్కల్మషుండును, సకలచరాచర ప్రపంచనిర్మాతయుఁ దత్వాతీతుండును, సర్వగురుండును, నగు నఖిలేశ్వరు గర్వించి తూలనాడుట నీ వినాశంబునకుఁ గారణంబగు. ఈ సభాసదులెల్ల నీ మహిమంబుఁ బొగడుదురని యహంకారంబుఁ దాల్చియుంటివిగాని ప్రళయకర్తయగు పరమేశ్వరుఁ డొండె యాతని యంశం బొండె యరుదెంచి యేతత్సామాజికవర్గంబు తోడ నీ యజ్ఞంబు ధ్వంసంబుఁ గావించునని యెఱుంగనైతివి. జగన్మాతనగు నన్ను నీవిట్టు బరాధవంబుఁ గావించుచుండఁదగదని వచింపక మూఁగలవలెఁ జూచుచున్న యీ భూత సంతానంబు పడు నవస్థ నిప్పుడేమని చెప్పవలయు. దుష్టుండవగు నీకుఁ బుత్రినై దాక్షాయణి యని పిలువఁబడుట నా కనిష్టంబయ్యె. అని పలుకుచు గౌరీదేవి యోగమార్గంబున శరీరంబు విడిచి సంతాన వాంఛఁ దపంబుఁ గావించు హిమవంతునకుఁ బుత్రికయై పార్వతినాఁబరఁగె నంత నా వృత్తాంతంబు దెలిసి హరుండు క్రోధోద్రేకంబున వీరభద్రుని తలంచినప్పుడు.

## —• వీరభద్రా విర్భావము •—

సీ॥ విలసత్తటిత్సన్ని • గ్రపుల జటాపటలాంచిత మకుట స • మన్వితుండు
తలఖడ్గఖేటగ • దా కార్ముక ప్రముఖాయుధకలిత క • రాంచితుండు
హరివిరించాది ని • ర్జరకపాలాస్థిసం చయ భూషితోరు • వక్షుస్థలుండు
రణదురుమణినూపు • రఘటితకింకిణీ సంయుతవిమల ప • త్సంచయుండు

ప్రళయశిఖిశిఖాభాస్వర ♦ ద్భయదఘోర నాసికారంధ్రనిర్గతా ♦ నంతనిశ్వ
సనసహితుఁడయి యరుదెంచె ♦ చంద్రశేఖరుని కడకు వీరభద్రుఁ డుగ్రుఁడయి యపుడు

క॥ కరమున ఖడ్గ ముసలములు గిరగిరఁ ద్రిప్పుచును నొక్క ♦ గిరిశిఖరంబున్
ధరియించి యట్టహాస స్ఫురితాధరుఁడగుచునుండెఁ ♦ జూపఱులదరన్.

తే॥ చండికాకోపవహ్ని సం ♦ జాతయగుచు భద్రకాళియు నొకవంక ♦ బహుళకోప
రక్తలోచనయగుచు ను ♦ గ్రస్వరూపయై యనుసరింప నలరె రుద్రాత్మజుండు.

మ॥ కనదంబోధగభీకరాంగుఁ డగుచున్ ♦ గర్వోద్ధతారాతి లో
కనికాయంబునకెల్ల మిత్తియయి య ♦ గ్రస్ఫూర్తిఁ దీపించుచున్
బ్రణమద్భూత శతావృతుండగుచుఁ గ ♦ న్పట్టంగ నవ్వీరభ
ద్రునిప్రోద్యద్భుజదండమండితుని రు ♦ ద్రుం డిట్లు బల్కెన్ వెసన్.

మ॥ కలుషాత్ముండగు దక్షుఁ డిప్పుడు మదిన్ ♦ గర్వించి రాగాంధుఁడై
యలఘున్ నన్నుఁ దిరస్కరించుటయె గా ♦ కొనంచుఁ దాయజ్ఞమున్
సలుపన్ బూనియు దేవి యేగిన నసత్సంభాషణన్ జేసి వే
ల్పుల మధ్యంబున నొవ్వఁజేసెను సతిన్ ♦ లోకంబు భీతిల్లఁగన్.

వ॥ అక్కారణంబున మహాదేవి యోగాగ్నిచే శరీరంబు దహించి పార్వతి యయ్యె.

తే॥ తెలివియింతలేక ♦ త్రిపురాంతకుని నన్నుఁ బరిభవింపఁదలఁచె ♦ దురితచిత్తుఁ
డతనిగర్వ మడఁచు ♦ టర్హమయ్యెడు నీఁక నూరకున్న నాతఁడుద్ధతుఁడగు.

చ॥ అతఁడు వినాశసోన్ముఖత ♦ నగ్ని పయింబడు దుష్పతంగ మ
ట్లతుల మహాప్రభావ సము ♦ దంచితు నన్నుఁ దిరస్కరించి యు
ద్ధతుఁడయి సంచరించెడుఁ గ ♦ దాయిఁక వాని నుపేక్షసేయకే
హత మొనరించు టర్హ మని ♦ యాత్మఁ దలంచితి నయ్య పుత్రకా.

చ॥ అరుగుము యజ్ఞశాలకిపు ♦ డాతనితోడ నయంబు పెంపునన్
సురలును మౌనులున్ వినఁగ ♦ శూలియె యజ్ఞవిభుండు గాన న
ధ్వరమున నొక్కభాగముఁ గ ♦ పదిన్ కొసంగుమటంచుఁ బల్కు మా
దరమున నాతఁడున్ వినక ♦ తక్కినయేని వధింపు మాతనిన్.

తే॥ యజ్ఞశాలనెల్ల ♦ నంతంబుఁ గావింపు మచటనున్న వారి ♦ నడఁగఁద్రొక్కు
ముద్ధతుఁడగు దక్షు ♦ నుత్తమాంగంబు ఖండించు మేను సంత ♦ సించునటుల.

తే॥ అనిన వీరభద్రుఁ ♦ డట్లకాకయటంచుఁ బ్రణుతిసేసి వీర ♦ గణము గొలువ
భద్రకాళితోడఁ బయనంబొనర్చి నయ్యజ్ఞశాల కడకు ♦ నతిరయమున.

వ॥ అట్లు బయనంబు సేసి నిజ నిశ్వాసోచ్ఛ్వాసరోమకూప శ్రోత్ర నాసారంధ్రనేత్ర స్వేదబిందు జటాపాణికటి దేశవక్షోనాభి పదస్థానంబుల జన్మించిన యనేక మహా వీరభూతంబులు విమానారూఢులై యనుసరింప గంగాద్వార సమీపస్థమగు యజ్ఞ వాటంబునకుఁ జేరనప్పుడు.

శా॥ శైలవ్రాతము నేలఁగూలె వసుధా ♦ చక్రంబుకంపించె నా
భీలంబై యనిలంబు వీచెఁ జతుర ♦ బ్ధి శ్రేణి యింకెన్ రవి
జ్వాలాజిహ్వ శశాంక కాంతి చయముల్ ♦ చల్లాఱిపోయెన్ దిశా
వ్యాళంబుల్ చలియించెఁ దారక లిలన్ ♦ వ్రాలెన్ సమూలంబుగాన్.

గీ॥ అమ్మహోత్పాతములు గాంచి ♦ యజ్ఞదర్శనాగతులయిన సురలు ♦ మహర్షి చయము
తక్కుఁగలవారలెల్ల సా ♦ ధ్వసముఁ జెంది వినమితాననులగుచు ని ♦ ర్విణ్ణులైరి.

—♦ వీరభద్రుఁడు దక్షయజ్ఞధ్వంసముఁ జేయుట ♦—

మ॥ లలితాకారుఁడు వీరుఁడ య్యజనశాలా ♦ మధ్యమున్ జొచ్చి య
జ్జ్వలదుద్దండ గదాప్రహారమున ది ♦ గ్ద్వారంబు ఘోషిల్లు న
ట్టుల స్తంభంబునఁ గొట్టి హుమ్మనుచు బి ♦ ట్టున్ బెట్టిదంబైన క
ట్టలుకన్ 'హో' యని యెల్లవారదర ను ♦ గ్రారావమున్ సల్పినన్.

చ॥ అదిగని భీతచిత్తులయి ♦ యచ్చటివారలు సంభ్రమింపఁగాఁ
బెదరకుఁ డూరకుండుఁడీక ♦ వీఁగకుఁడంచు వచించుచున్ గ్రుధా
స్పదుఁడయి లేచి నిల్చి రభ ♦ సంబున దక్షుఁడు వీరభద్రునిన్
గొదగొద నొప్పువానిఁ గను ♦ గొంచు వచించె భయంకరోక్తులన్.

ఉ॥ ఓరి యెవండ వీవిటుల ♦ హుమ్మనుచున్ సవనప్రదేశమున్
జేరి యేదో ప్రలాపమును ♦ జేయఁగఁ బూనితి వెవ్వఁ డంపినన్
వారక యిందు వచ్చితివి ♦ వారల వీరల వెంటఁగొంచు నా
శౌరమనీయ విక్రమము ♦ నారయవైతివె యిట్లు సేయుదే.

తే॥ తలఁగిపొమ్ము సర్వ ♦ దక్షుండు పక్షుండు కనలెనేని నీదు ♦ గర్వమడఁచుఁ
గండకావరమున ♦ ఘనమతులున్నచోఁ జేరవచ్చితేల ♦ క్రూరుఁడవయి.

వ॥ అనిన వీరభద్రుండు.

ఉ॥ ఏను జగన్నియంతయగు ♦ నీశ్వరనందనుఁడన్ భవత్కృతం
బైన మఖంబునందు హవి ♦ రంశము శంభున కీయఁబూనవే
లా నిఖిలేశ్వరుండతఁడె ♦ యజ్ఞవిభుండని చెప్పవే శ్రుతుల్
మానిజనంబులైన నిది ♦ మార్గము గాదని మందలింపరే.

మ॥ అపరాధంబుల సైపుమంచు రజతా ♦ హార్యాలయమున్ జేరి నీ
విపుడైనన్ గ్రతుభాగమిమ్మటులఁ గా ♦ దేనిన్ను నీ యజ్ఞమున్

గపటస్వాంతులరైన నీ సఖులన్ • గర్వోద్ధతోద్యద్భుజా
కుపితాక్షుం ద్రగదాభిఘాతములచే • గోడోందఁగాఁజేసెదన్.

క॥ ననువీరభద్రుఁగాదని నినురక్షింపంగఁ గలరె • నిర్జరులైనన్
మునిలోకమైన నధ్వర మున వారికె భాగమీయఁ • బూనితివెదలో.

తే॥ అనినదక్షుండు క్రోధ దీ • ప్తాస్యుఁడగుచు నోరిమారాడకిఁకఁజను • మూరకిటుఁ
బ్రేలినన్ బనిగాదు దు • ర్లీలుఁడవయి వంచనామతి నీకేల • బ్రతుకుఁ గనుము.

వ॥ అనర్హుఁడగు నీరున కిందు లేశమాత్రంబేని హవిర్భాగం బీయఁ దలంచువాఁడను గాను. జగదీశ్వరుండగు నారాయణుం డేతత్సవనంబునకు విభుండైయున్నవాఁడాతఁడె హవిర్భోక్తయగు వృథాలాపంబుల నీకుఁ గలుగులాభంబేమి? పొమ్మనిన వీరుండు దుర్వారాగ్రహంబున యజ్ఞశాలాస్థంభమును గదచేఁగొట్టి.

సీ॥ అమరపాలకు నుత్తమాంగంబు ఖండించి పిత్రుపతి దండంబు • విఱిచివైచి
యనలుని హస్తద్వ • యంబు ఛేదించి నాల్కలు జీల్చివైచి శూ • లమునఁగ్రుచ్చి
భాస్కరుదంతముల్ • భగ్నంబుఁ గావించి శారద నాసికఁ • జక్కడంచి
యదితిశిరంబున • నంఘ్రిప్రహారంబు నొనరించి కశ్యపు • నుక్కడంచి
యజ్ఞశాల దహించి య • ప్రాజ్ఞులైన సురల దైత్యుల మానుల • సొక్కఁజేసి
యగ్నికుండంబులన్ బూడ్చి • హరకుమారుఁడపుడు తాండవమొనరించె • నచట నిలిచి.

—• నారాయణుఁడు వీరభద్రునిచే విజితుఁడగుట •—

తే॥ అది కనుంగొని కేశవుఁ • డాగ్రహమునఁ గనుల నిప్పులుగురియఁ జ • క్రమ్మునెత్తి
వీరభద్రు నెదుర్కొని • విపులరణము సలిపెఁ జెక్కుయుగంబులు సాహసమున.

ఉ॥ అంతట వీరభద్రుని సి • తాంబకపాతమునన్ సుదర్శనం
బెంతయు మొక్కవోయి • చలియింపక యుండినఁ బంకజాక్షుఁడా
వంతయుఁ జంచలింపక ర • ణాంగమునన్ నిజమాయఁజేసి దు
ర్దాంతపరాక్రమాఢ్యులన • తంద్రితులన్ సృజియింపవారలున్.

తే॥ శంఖచక్ర గదాధరుల్ • శార్ఙపాణులుద్ధతాస్యులు భీకరు • లుగ్రతేజు
లతులితాగ్రహారుణిత న • యనులు శత్రు భయదులగుచు నపుడు వీర•భద్రునెదిరి.

ఉ॥ భూతగణంబులెల్ల భయ • మున్గొని పాఱ లసత్ప్రతాపులై
యాతతబాహుదండముల • నట్టె విపక్షచయంబుఁ బట్టుచున్
గాతరచిత్తులౌమని ని • కాయములన్ వెస నాదరించుచున్
ఖ్యాతచరిత్రులై యని మ • గంటిమిఁ జూపుచుఁ బోరి రుద్ధతిన్.

తే॥ అప్పగిదిని నవార్య బ • లాఢ్యులగుచుఁ బోరు వైష్ణవగణముల • ధీరుఁడగుచు
వీరభద్రుండు వధియించి - క్రూరశరపరంపరల విష్ణుఁ గప్పె సంగ్రామమందు.

క॥ మరల నొక వాడికోలన్ బరఁగించి తదీయ మకుట • భాగముఁ ద్రుంచెన్
వరుస గదాప్రహరణమున హరినిన్ మూర్ఛితునిఁజేసె • నందఱు వొగడన్.

వ॥ అట్లు నారాయణుని మూర్ఛితునిఁజేశి ప్రచండంబగు కృపాణంబున దక్షుని కంఠంబు ఛేదించి యగ్ని వ్రేల్చి భయంకరాంగుఁడై యున్నంత.

చ॥ సరసిజ సంభవుండపుడు • సాధ్వసకంపితదేహుఁడై యస
చ్యుతుఁడు దక్షుఁడే యిటుల • జన్నముఁబూని కృతాపరాధుఁడై
హరునకుఁ గిన్కఁ గూర్చెనని • యారసి మెల్లన వీరభద్రు భా
సుర ముఖుఁ జేరి మ్రొక్కి హిత • సూక్తుల నిట్లని పల్కె నమ్రుఁడై.

మ॥ అనఘా దక్షుఁడు గర్వితుండగుచు నా • ర్యానాథు నిందించి చే
సిన కార్యంబునకున్ ఫలంబుఁగనియెన్ • జేజేలు ముక్కంటిఁ గా
దని యేశించి పరాభవంబుఁ గనిరి • యాగంబు విధ్వస్తమ
య్యెను శాంతింపు మికేల యాగ్రహము లో • కేశా భవానీసుతా.

తే॥ నీ యెడనె జనించు • నిఖిల జగంబులు నీకుఁ ద్రుంపఁదగునె • లోకసమితి
తాను బెంచినట్టి • తరువు దుష్టంబైనఁగాని చెండఁగలఁడె • కతినుఁడేని.

తే॥ ఆ సమయమున యందు శ • శాంకమాళి ప్రమథగణములు గొల్వ న • భ్రమునఁజేరి
శాంతవదనుండగుచుఁ గృపా • స్వాంతుఁడగుచుబల్కె నప్పుడు తా వీర • భద్రుఁగాంచి.

ఉ॥ శాంతముఁబూనుమిఁక సుర • సంచయమెల్లను నిన్నెదిర్చి య
క్రాంత నిజప్రతాపముల • నాఁబడి పుచ్చిరి సంగరంబునన్
భ్రాంతుఁడు దక్షుఁడున్ బడియెఁ • బంకజసూతి భవత్పదాబ్జముల్
స్వాంతమునందు నిల్పి నిను • సన్నుతిఁజేసెఁ గృపాన్వితుండవై.

వ॥ అని పల్కిన వీరభద్రుండు రుద్రు నానతి రౌద్రాకారం బుపసంహరించి ప్రసన్నుండై పరమేష్ఠిప్రార్థనంబున వికలాంగులై పడియున్న నిలింప నికరంబు ననుగ్రహించి వారివారికి లుప్తంబులగు నవయవంబు లొసఁగి లక్ష్మీనాథు నాదరించి దక్షునకు వికృతవక్త్రింబుఁ గల్పించె నంత.

॥ కనికరముఁబూని శంకరుఁ డనిమిషనికరంబుఁగాంచి • యాదరమున ద
క్షుని కతన నిట్టి యాపద యనుభవమయ్యెను గదా సు • రావలి కిచటన్.

॥ అవ్విధిని బల్కి దక్షున • కపుడు గాణపత్యము నొసంగి మనుమని • ప్రమథులెల్ల
నుసరింప సదృశ్యుఁడై • యరిగె వేల్పులందఱు నిజాలయంబుల • కరిగిరపుడు.

॥ అని పల్కి సూతుఁడు తదనంతర కథాంశంబు వక్కాణించువాడై యిట్లనియె.

॥ తారకుఁడన్ బ్రసిద్ధుఁడగు • దానవనేత యొకండు మున్ను దు
ర్వారపరాక్రమోద్ధతుఁడు • పంకజసూతి వరంబు పెంపునన్
గ్రూరచమూ నికాయమును • గూడి కలంపఁదొడంగె దేవతా
వారము బీరమున్ విడిచి • పాఱఁగ దిక్కులకున్ వడంకఁగన్.

—॥ ఇంద్రాదులు తారకుని బాధల కోర్వక బృహస్పతికడ కేగుట ॥—

మ॥ బలమత్తుండగు తారకాసురుని సైపఁ లేక బర్హిర్ముఖుల్
సిలుగుల్ జెందుచు నార్తులై హరిహయున్ • జేరంగ నాతండు వా
రలు వోలేక సురవైరికిన్ బెదరి ద • ర్పం బెల్లఁ బోనాడి చిం
తిలువాఁడౌటఁ బ్రతిక్రియన్ సలుపఁగా • నేరం డొకింతేనియున్.

వ॥ అట్లు విపన్నులై యరుదెంచిన దేవతావ్రాతంబుఁ గాంచి బలారి యిట్లనియె.

చ॥ అరికృతనిష్ఠురావమతి • కాత్మ సహింపఁగ లేక యివ్విధిన్
హరిహయుఁ డేయుపాయమున • నైన ముదంబును గూర్చునంచు లో
నరసినను గనుంగొనఁగ • నాసమెయిన్ వెసవచ్చినారలో
సురవరులార యేనెటుల • సోఁకుదు రాయని దాఁక నేర్చెదన్.

చ॥ అమరతరంగిణీ జలచ • యంబుల నేనులతోడఁ ద్రొక్కి పం
కముగ నొనర్చి వేసిరి న • ఖంబులతోడ నె నందనంపు వృ
క్షములఁ బెకల్చి కూల్చిరి స • కంబుగఁ జేసిరి దేమ నీయ వ
జ్రము నను నాహవంబునఁ బ • రాభవముం బొనరించి రారిపుల్.

తే॥ వారు బలవంతులైయున్న • వార లిప్పుడేమి సేయుటకును దోఁప • దింక మనకు
గురుఁడె వైరిహనన కళా • గురుడు తత్పదాబ్జములఁ గొల్చుకొన్న న • న్యంబు లేదు.

క॥ ఈ వెరవున మనకు శుభప్రావిర్భవమగును గాన • వాగక యిపుడా
దేవగురు సన్నిధికిఁ జనఁగావలయును లెండు రండు • క్రతుభుజు లెల్లన్.

క॥ అనుచున్ వారలఁ దోడ్కొని చనియెన్ బలసూదనుండు • సర్వామర లో
కనియంత నఘనిహంతన్ గన దనులస్వాంతు గురునిఁ • గనుఁగొను వేడ్కన్.

వ॥ అట్లు చని సవినయంబునఁ గరములు మోడ్చి.

చ॥ సతత ముదావహంబు రిపు సంచయ నాశకరంబు పాప ప
ర్వతకులిశం బకారణ భ • వత్పరితాపలతాలవిత్ర మా
శ్రిత జనపోషకంబు సుర • సేవిత మేత దఖండ మోక్ష దం
బతులితమైన తావక ప • దాబ్జయుగంబు స్మరింతు మాత్మలో.

ఉ॥ భూరిభుజాబలోద్ధతుఁడు • పూరుషసింహము తారకుండు బృం
దారక వారమున్ గలనఁ • దార్కొని పీఁచమడంచుచుండె నా
శూరుని విక్రమానలము • సోఁకి దహించెడు లోకజాలముల్
సూరివరేణ్య మా యిడుమఁ • జూచిన జాలి జనింప దేమదిన్.

క॥ నీవు సమస్తప్రజ్ఞా ప్రావృతచిత్తుఁడవు • నీదు పలుకులనిన సం
భావించు నబ్జభవుఁడున్ జీవా యొక వెరవు మాకుఁ • జెప్పఁగదవే.

తే॥ అనుచుఁ బ్రార్థింప నాచార్యుఁ • డమరవిభునిఁ గాంచి వచియించె నిట్లు ని • [ర్వాంచితోరు
విక్రమోన్నతుఁడవు నీవు • విగత ధైర్యుఁడవయి చింతింప నేటికో • దివిజనాథ.

వ॥ తొల్లి దుర్మార్గుండై హరునకు హవిర్భాగంబీయనని గర్వించి దక్షుండు కావించిన సవనంబునకుఁ దగుదుమని యరిగిన దోషఫలంబిప్పుడ వీరభద్రుని కతన ననుభూతం బయ్యెను దచ్ఛేషం బిప్పుడు వేల్పులకుఁ దారకుకారణంబున భోజ్యంబయ్యె నైనను.

క॥ అరవిందాసనుఁ డొండెఁ బురసంహరుఁ డొండె నసురఁ • బోకార్చి మిముఁ గరుణింపఁగలఁ డికేటికిఁ బరితాపముఁ జెందెదరు సు • పర్వులు మీరల్.

— బృహస్పతి యింద్రాదుల బ్రహ్మకడకుఁ గొనిపోవుట —

మ॥ త్రిజగత్పావన దక్షుఁ డీశుఁడు జగ • చ్ఛ్రేయోవిధాస్యుండె యా
చతురాస్యుండు కృపాన్వితుండయి ద్విప • త్సంతానముఁ గూల్చి స
ద్గతిఁ గూర్పంగలవాఁడటంచు శ్రుతివ • ర్గంబెల్లఁ జాటించు నేఁ
డతనిఁ జేరక కల్గబోదు హితమ • న్యంబైనమార్గంబునన్.

వ॥ అని వచియించితి వేల్పులఁ దోడుకొని వాచస్పతి విరించి సన్నిధికరిగి ప్రణామంబుఁ గావించి యిట్లనియె.

ఉ॥ కాంచితె నిర్జరేశుఁ ద్రిజ • గత్ప్రభు ధైర్యముఁ గోలుపోయి చిం
తించుచు నున్నవాఁడు రవి • దీప్తిచయంబు శమింప నాదలన్
వంచి వడంకుచుండెను వి • భావసు తేజము చల్లనయ్యె నే
మంచు వచింపనేర్తు నమ • రావళి చెందెడు నీ యవస్థలన్.

క॥ తారకుని సేయు కృత్యము దారుణము భరింపరాదు • తగవనఁడు దురా
చారుఁడు వాని జయించుట యేరికి శక్యంబొ సురల • కెవ్వఁడు గలియో.

చ॥ ఇరువదివేల వత్సరము • లిద్ధపరాక్రమవంతుఁడైన శ్రీ
హరి దనుజేశు దాఁకి విజయంబును గైకొన నేరఁడయ్యె ని
ర్జరరిపుఁ డుగ్రుఁడై తుదకుఁ • జక్రము వక్రముఁ జేసి కాంచనాం
బరుని ససారథిన్ సరథుఁ • బాఱఁగఁజిమ్మె సముద్రమధ్యమున్.

ఉ॥ వెన్నునిమంతవాఁడె యని • వెన్నిడి ఖిన్నత దోసిలొగ్గి యా
పన్ననిబోవుమంచు సుర • వైరి పదంబుల వ్రాలె నట్టి గ
ర్వోన్నతు నోహరించి జయ • మొందఁగలట్టి సమర్థుఁడెవ్వఁడో
యన్న యెఱుంగఁజెప్పి యమృ • తాంధసులన్ గరుణింపనే యిఁకన్.

వ॥ అని పలికినఁ గాంచనగర్భుండు సానుకంపుండై యిట్లనియె.

మ॥ అమరారాతిమదాంధుఁడై సకలలో ♦ కానీకముఁ బెక్కు క
ష్టము లొందించు పెటింగియుంటి నయినన్ ♦ శాసించు మార్గంబు లే
క మదిన్ నుందఁగనయ్యె మద్వరమునన్ ♦ క్ష్మాచక్రముఁ మించు తే
జముఁ గాంచెన్ దనుజుండు రుద్రుఁడయినన్ ♦ సైరింపలేఁ డాతనిన్.

తే॥ ఎట్టిశూరుఁడైన ♦ నెట్టిమాయయునైన నెట్టిచతురుఁడైన ♦ నెవ్వఁడైనఁ
గాని వాని నోర్చి ♦ కలనజయముఁ గాంచు టరిది వాని కట్టి ♦ వరము కలదు.

సీ॥ దక్షునికూఁతురు ♦ దాక్షాయణీదేవి తండ్రిపైఁ గినిసి యెం ♦ తయుఁ గడంకఁ
దద్దేహముఁ ద్యజించి ♦ ధరణీధరశ్రేష్ఠుఁ డగు హిమవంతున ♦ కాత్మజాత
యైపార్వతియనంగ ♦ నలరుచునున్నది సతివియోగమున నీ ♦ శ్వరుఁడు యోగ
నిష్ఠాపరుండయి ♦ నిర్నిద్రతేజుఁడై తనను దాఁ జూచుచుఁ ♦ దగు సమాధి
వెలయుచున్నవాఁడు ♦ విశ్వేశ్వరు మనంబు నగకుమారియందుఁ ♦ దగులునటుల
జేయవలయుఁ దానఁ ♦ జేసి వారికి యోగమగును లోకములకు ♦ నగు శుభంబు.

క॥ వారల సంయోగంబున ధీరుఁడు జనియించు ♦ నా ని తేయా నీకో
ద్ధారుఁడు శక్తిధరుండా తారకుని వధింపఁగలఁడ ♦ తండు రణమునన్.

తే॥ ఆలసింపక మీరేగి ♦ యా ప్రసూనధన్వికతమున నా పూర్వ ♦ దంపతులకు
ఘటనసేయుఁడు దేవతా ♦ కార్యకరణ చతురుఁడగు షణ్ముఖుండింక ♦ జననమగును.

వ॥ అని పలికిన నిలింపులు గుంపులుగూడి మేరుశిఖరంబున నొకచోఁ జేరి సంతుష్ట
స్వాంతులై.

—♦ ఇంద్రాదులు పార్వతీపరమేశ్వర యోగఘటనకై మన్మథు నంపుట ♦—

సీ॥ కలిగింపడాయొక్క ♦ కాండయోగంబున యోగంబుఁ బార్వతీ ♦ భోగిధరుల
నున్మూలనముఁ జేయఁడో ధనుష్టంకృతి హరుని ధైర్యంబెల్ల ♦ నవఘళించి
యంకురింపఁగజేయఁ ♦ డా మోహబీజంబుఁ బరమేశు హృదయ భూ ♦ సురలలామ
మరలింపలేఁడె స ♦ మాధినుండి హరుని తనువెల్ల వైవర్ణ్య ♦ మును ఘటించి
యాశ్రయింపఁగఁ జేయఁడే ♦ యంధకారి నద్రిజాపరిణయ వాంఛ ♦ నఖిలమునుల
నన్నిటన్ విజయంబుఁ ♦ న్నట్టి యాతఁడించు విలుకాఁడు సామాన్యుఁ ♦ డే తలంప

తే॥ యోగనిష్ఠాగరిష్ఠుఁడై ♦ యున్నవాని శంభునిఁ జలింపఁ జేయఁగఁ జతురుఁడగు నె
యించువిల్తుండనుచు సంశ ♦ యించుటేల కమలశరున కసాధ్యమా ♦ కార్యమెట్టి

తే॥ సర్వసన్యాసమొనరించి ♦ శైలశిఖర బ్రహ్మనిష్ఠఁ జరించెడి ♦ పరమయోగి
వరులనైనను గామినీ ♦ చరణములకు దాసులుగఁ జేయు నేరఁడే ♦ దర్పకుండు.

వ॥ అని నిశ్చయించి మన్మథుఁ దలంచిన.

తే॥ కొదమరాచిలుక పైనెక్కి • కోయిలలును గోరువంకలు నంచలుఁ • గొలుచుచుండ
రతియు నామనియును దోడ • రాఁగ నప్పు డలరువిలుకాఁడు వచ్చె • వేల్పులను గాంచ.

వ॥ అటుల వచ్చి సవినయంబుగ సుమనోవితతిఁ గాంచి యాదరంబున నిట్లనియె.

చ॥ పిలిచితి రేల న న్నిపుడు • వేల్పులు మీరలు సానుకంప నా
వలనను మీకుఁ గాదగిన • కార్యము దెట్టిది విక్రమాఢ్యులై
కలన నెదిర్త రేనితిగ • కన్నుల దేవర నైనఁ గెల్వఁగాఁ
గల బలముం జలంబును మ • గంటిమి గల్గిన వారు కాదొకో.

ఉ॥ రక్కసుఁ డెవ్వఁడైన సుర • రాజ్యముఁ జెందెదు వాంఛఁ జేసి తా
నెక్కుడు యోగముం గొని య • హీనతపం బొనరించునో మదం
బెక్కి యెవండయేని మిము • హీనబలాఢ్యులఁ జేసి కాంతలం
జిక్కక సంచరించెడినొ • చెప్పుడు దాఁచకుఁ డింతయేనియుం.

తే॥ ఎట్టియోగియైన • నెట్టిభోగియునైన నెట్టిసిద్ధుఁడైన • నెవ్వఁడైన
నిదియ వాడికోల • నించుక మెఱపించి యతని ధైర్యమెల్ల • నపహరింతు.

మ॥ అనపత్యుండగు నెవ్వఁడేని నిజభా • ర్యాసక్తి లే కింద్రియా
శ్వనికాయంబును గట్టిరెచి విలస • త్సన్న్యాసయోగంబు గై
కొని మోక్షేచ్ఛఁ దపంబు సల్పెడినొ నా • కుం దెల్పుఁడా ధీరునిం
గనదే తత్తనుబాణపాతమున శృం • గారప్రియుం జేయుదుం.

తే॥ కలరు విలుకాండ్ర నేకు లొ • క్కటిని రెండుగాఁ గసలిపెడువారలు • కడిమి మీఱి
రెంటి నొక్కటిగాఁ జేయు • దంటగలఁడె తుంటవిలుకాఁడె తక్క యీ • పంటవలఁతి.

తే॥ మీయనుగ్రహమున • నీయసమాస్త్రుండు సూనశరుఁ డెయయ్యుఁ • బూని స్థాణు
వంతవానినైన • నట్టిధైర్యంబుఁ గోల్పడఁగఁ జేయు నొక్క • బాణమునను.

తే॥ అనిన విని యంతవాఁడవె • యౌదు గాన దేవతా కార్య మొండు సా • ధించు పూన్కి
నిన్నుఁ బిలిచితి మిప్పుడు • నీవు కలుగ మాకు నేమిటఁ గొఱతయౌ • మదన యింక.

తే॥ తారకుండను దనుజుండు • క్రూరుఁడగుచు జగములఁ గలంచు నాతని • సంహరింప
శరవణభవుండె దక్క ని • ర్జరులలోన నొక్కరుండును నేరక • యున్నవాఁడు.

చ॥ హరుఁడు సతీవియోగమున • న వ్వటమూలము నాశ్రయించి దు
ర్భరమగు నిష్ఠఁ గైకొని త • పం బొనరించుచున్నవాఁడు శం
కరుని మనంబునం ధృతి వి • కల్పముఁ గూర్చినఁ గాని పార్వతీ
కరము గ్రహింపఁ డాతఁడు జ • గద్ధిత మియ్యది మీనకేతనా.

చ॥ అమరహితైకకాంక్షివి సు • మాస్త్ర! గిరీంద్రసుతా గిరీశ యో
గమును ఘటింప నీవ యొన • కాఁడవు గాక యొకండు శక్తుఁడే
ప్రవిమలబుద్ధి నీకు సరి • వారలు గల్గుదురే సురేంద్ర కా
ర్యము నికఁ ద్రోసివేయక శి • రంబునఁ దాల్చి ఫలింపఁ జేయుమా.

తే॥ ఎట్టికారణమునఁ జేసి • యేని నీవు దీనిసాధింపకున్న నా • దిత్యులకిల
నాలుబిడ్డలవీడి దే • శాలపాలు గావలసినట్టిగతిబట్టు • గాదె యింక.

తే॥ అనుచు దేవేంద్రుఁ డాడిన • నసమశరుఁడు విసఁపుమేఁటిరి సాధించి • వేల్పుకర్జ
మింకగూర్పఁ గల్గుదునంచు • నెంచి యమరవిభునితో నివ్విధిని బల్కె • వినయమలర.

ఉ॥ వేలుపుటేఁడ యివ్విధిని • వేయువిఘంబులఁ బల్కనేల జే
జేలకు సౌఖ్యముల్ గలుగఁ • జేయుటకన్నను నాకు వేరొకం
డేల రుచించు నీముదల • యే యగునేని వసంతుఁ గూడి యా
బాలశశాంకశేఖరుని • బల్మిని నీరగునట్లు జేయనో.

తే॥ అలరువింటనొక్క • యరవిందబాణంబు సజ్యముగ నొనర్చి • షట్పదములు
ఝుమ్మటంచు మ్రోయ • నమ్మహాదేవుని నగతనయకు దాసు • నిగ నొనర్తు.

మ॥ ఇదె యేనేగెద నిక్షుచాపమున న • య్యీశాను ధైర్యంబిఁకన్
ఛిదులన్ జేయుదు నద్రిజా గిరిశులన్ • బ్రీతిన్ దగన్ గూర్తునే
తదనూనంబగు శింజినీధ్వని కసా • ధ్యంబైన కార్యంబు గ
ల్గదు గాదే త్రిజగంబులన్ హరుఁడె ల • క్ష్యంబయ్యె నిప్పట్టునన్.

సీ॥ మునిపత్నులందును • మోహంబుఁ గూర్పనే వెడవింటిదెబ్బచే • విశ్వపతికి
బృందకై మార్వేస • మొందఁగఁ జేయనే విరికోలతోఁ గ్రుచ్చి • సరసిజాక్షు
గన్నకూఁతు నెబట్టి • కామింపఁ జేయనే కుసుమబాణంబునఁ • బోఁసఁగ నజుని
గురుదారతో మైత్రిఁ • గోరంగ సల్పనే నిశితబాణంబుల • నీరజారి
వారు వీరననేల యే వారలైనఁ గాని మామకబాణమో • గంబుకతన
వాయువరుసలెవిడనాడి . వనజముఖుల కూడిగం బేని సల్పరే • యుర్వియందు.

తే॥ ఏను యుద్ధయాత్ర • కేగెదుతటి సమీపించుచున్నదిపుడు • వేల్పులార
పోయివత్తు నింకఁ • బురహరుసన్నిధి కానతిచ్చి పంపుఁ • డయ్యనన్ను.

వ॥ అనిపలికి సహస్రాక్షునిచే పోయిగమ్మనిపించుకొని పార్వతీ పరమేశ్వర యో
ఘటనకై స్థాణువనంబున కేగువాఁడై.

ఉ॥ చందన మిశ్రితాంబువుల • స్నానమొనర్చి పసిండి జిల్గు వ
ల్వం దగఁ గట్టి కుండలము • లన్ ధరియించి శ్రుతిద్వయంబునం
దిందు శిలామయంబయి ర • హించు కిరీటముఁ బూని ముత్తెఁపుల్
జందెములూని వక్షమునఁ • జారుతరాకృతియై చెలంగుచున్.

## —♦ మన్మథుఁడు శివునిపై దాడివెడలుట ♦—

చిగురు కటారివాఁ • డిగఁ జేసి కన్నె కేతకి బాకు చికిలించి • తమ్మికోలఁ
జెమచంక నిఱికించి • నునుజాజి మూముల్కి మరువంపుపాదిలోన • మాటుబెట్టి
సంపెగయడిదంబు • సొంపునించఁగఁ జేసి పొన్నపూవాలు నిం • పుగ నొనర్చి
మల్లెపూజము దాడి మొల్లముగాఁ జేసి తొగమొగ్గ మెల్లనఁ • దొడిగికూర్చి
…కుసింగిణిఁ బూని రా • చిల్కగమియుఁ గోయిలలుఁ గోరువంకలు • గొనబుఁ జూప
…ల్ల మెల్లన విరహిణు • లెల్ల బెదర దర్పకుండప్డు చైత్రయా • త్రకయి వెడలె.

చిలుకహయమాయి నెక్కి యొక • చే వెడసింగిణి సంతరించి పూ
ములు కులఁ గూర్చి యార్చి బమి • పుర్వులు ఝుమ్మన నల్లెలాగి పూ
విలుతుఁడు హుంకరించి కర • వీరదరంబును నోట నూదెఁ బె
న్వలపుల నొంది కుంది పరు • వంపుఁ జెలుల్ దలక్రిందుగాఁ బడన్.

అటుల మన్మథుఁడు జయేచ్ఛ • యధికముగను విజయశంఖంబుఁ బూరించి • [ వెడలెనపుడు
విమలయోగి జనస్థాన • మమరమాని వినుతమగు హైమవతవనం • బునకు వేడ్క.

చిగిరించెన్ సహకారసంచయము వీ • చెన్ బూదుమారమ్ము లా
శుగముల్ మొగ్గదొడంగెఁ బుండ్రకలతా • శోకంబులున్ బూఁచె సం
పెగలున్ మొల్లలుఁ బండె ద్రాక్షలతికల్ • వీరుత్తతుల్ బంధురం
బుగఁ గన్పట్టె వసంతుడున్ విడిసె న • ప్పుణ్యాశ్రమంబందునన్.

వనకాంతామణి పాణిపీడనము స • ల్పన్ గోరి యమ్మాధవుం
డనురక్తుండయి వల్లరీతరుణ హ • స్తాబ్జంబులన్ బంపు నూ
తన రత్నాంచిత పారిహార్యముల చం • దానన్ రహించెన్ బలా
శనికాయంబు ద్విజప్రకాండమున కు • త్సాహంబుఁ గల్గించుచున్.

తను మధ్యపుష్పవతి కాంచనమాలిక కరము లెత్తి • సహకారవిభున్
మునుకొని గాఢాలింగన మొనరించి చలించెనపుడు • ముదము దలిర్పన్.

…గండుతుమ్మెద పిండు • నిండి ఝుంకృతిఁ జేసెఁ దమ్మిపానకమాని • తనువుమఱచి
…రొదమ రాయంచల • గుంపులు చెలరేగె బిసకిసలయములు • మెసవి మెసవి
…పరభృతములు చూత • పల్లవంబుల మెక్కి కూ కూ యటంచును • గూయసాగె
…గారికాంగనలతో • సల్లాపములఁ బ్రొద్దు జరుపుచుండెను గీర • సంచయంబు
…యనుసరింప మాధవుఁ • డతివినయముదోప వెనువెంట రానాము • తోడ మరుఁడు
…ప్రజొంపమ్ము చాటునఁ • జేరి మేరమీఱి హరుఁడె లక్ష్యంబుగ • మించెనపుడు.

…స్థిరచిత్తుండయి తన్నుఁ దాఁగనుచు ని • శ్చింతన్ మహానిష్ఠ ని
…రయోగంబున నున్నవాని సితికం • ఠున్ బద్మజాతాది ని

జరలోకంబునకేని యింతయు నల • క్ష్యంబైన బ్రహ్మంబుఁ దా
శరలక్ష్యంబుగఁజేసె మన్మథుఁడు త • త్సామర్థ్య మేలాటిదో.

మ॥ ఉరగోన్నద్ధజటావతంసితల స • ద్యోవాహినీ శీతశీ
కరసంతానపవీత గాత్రుఁడయి • మేఘశ్యామకంఠంబుతోఁ
గరినర్మాంబర దీప్తితో నరుల న • క్కాలాంతకుఁ గూటి జే
సి రతీనాథుఁడు వింటఁగోల నమరిం • చెన్ మించె ధీరంబునన్.

తే॥ స్మరుఁడటుల తనధనువు సజ్యంబుఁజేసి గుణములాగుటయున్ సర్వ • గుణినికరము
లొక్క పరిసంచలించె మ • హోగ్రనిష్ఠ నలరు హరుని ధైర్యంబింత • తలఁగెనపుడు.

—• శివఫాలనేత్రానలంబున మన్మథుఁడు దగ్ధుఁడగుట •—

చ॥ పురహరఫాలనేత్రహుత • భుక్చయ మెల్ల నవార్యమై దిగం
తగముల బూదిసేయుచుఁ బ • దంపడి జొంపము చాటునన్ మనో
హరశర మెక్కు బెట్టి యలి • కాక్షుని లక్ష్యముఁజేయుచున్న య
స్మరుని దహించి మించె రతి • మాధవులున్ స్మృతిదప్పి సోలఁగన్.

క॥ పతియవ్విధమున భస్మీ కృతగాత్రుండైనఁ గాంచి • హృతధైర్యయునై
రతిదుఃఖభారమునఁబడి హతకౌతుక యగుచు నేడ్చె • నాసమయమునన్.

వ॥ అట్లు గొండొక చింతించి మారుని దేవేరి మెల్లనఁ బరమేశ్వరుఁజేరి యిట్లని
స్తుతించె.

చ॥ శ్రుతులకునైన నందకవి • శుద్ధగుణుండయి యొప్పచుండు నే
శ్రితజనరక్షకుండు ముని • శేఖరమానసమధ్యవర్తి యా
స్తుతచరణాంబుజుండ వగు • సోమకళాధర మత్కృతాపగా
గతతితిక్షమింపుమయ్య ప్రమ • దంబును గూర్పఁగదయ్య ప్రేమ కెక్కడన్.

క॥ పతి దేవతయైసతతము వ్రతములదానంబులను ద • పంబులఁ బతికిన్
హితముగ నొరెడి సతికిన్ గతియగుపతిలేకయున్నఁ • గామినిమను నే.

తే॥ వాచ్యవాచకములువోలె • వఱలునట్టి నిత్యసంబంధమును జెంది • నెగడుచుండు
దంపతులకు వియోగంబుఁ • దగఘటించుటహర మే మిమ్ము వంటి మ • హాత్ములకు

క॥ పురుషుని ఛాయవిధంబున వరుని విడక సంచరించు • వధువు ధరిత్రిన్
బరమేశ సతీపతులకు సరఁగున నెడబాటుగూర్పఁ • జనునే చెపుమా.

తే॥ నాథు నెడఁబాపి నన్నిట్ల • నాథఁజేయ నేల నన్నునుఁ దావక • ఫాలనయన
వహ్ని భస్మంబొనర్చి య • ప్పరమపురుషు పాదసన్నిధి నంపఁగ • రాదె యిప్పుడు.

క॥ అనుచున్ బ్రార్థించిన రతిఁ గనుగొని శంకరుఁడు సాను • కంపుండై యి
ట్లనునో సతి నీనాథుఁడు ననువంచింపంగ మనము • నన్ దలఁచెఁ జుమీ.

వ॥ అక్కారణంబున మదీయలలాట శిఖిశిఖావళికి లక్ష్యంబై స్వదోషంబు మూలం బుగ భస్మంబయ్యె నైనను.

చ॥ అతుల పతివ్రతాతిలక • మాకరుణించితి నిన్ను నీ మనః
పతి యనివేకియై యిటఁ ద • పంబొనరించెడువాని నన్ను నీ
గతిఁ దన బాణపాతమునఁ • గాసిలఁజేయఁ దలంపుఁ బూనుటన్
వితతమదీయ ఫాలతల • విస్ఫురదగ్నిని బూదియై చనెన్.

మ॥ అతినుండయ్యె నతండు మున్నటుల దే • హంబూని కన్పట్టఁ డీ
క్షితి నెవ్వారికినైన సర్వజన హృ • త్సీమన్ దగన్‌బుట్టుచున్
ఏతికాలంబున నీకె కన్పడి సతీ • రత్నంబ నీ యిష్టమా
గతిసౌఖ్యంబును గూర్పఁగాఁగలఁడు దుః • ఖంబున్ దృజింపన్ గదే.

చ॥ హరిభృగుమౌని శాపమున • యాదవవంశమునన్ జనించి భూ
భరమును మాన్చు గృష్ణుఁడయి • పంకజలోచన యప్డు నీ మనో
హరుఁడుదయించు వెన్నునకు • నాతనికిన్ సతివై వృషాఖ్యచే
ధరణిజనింతువీవిఁక ము • దంబు వహింపుము నన్నుఁ గొల్చుచున్.

వ॥ అని పలికి పరమేశ్వరుం డదృశ్యుండైన రతియు విగతచింతాభారుఁడగు మాధ వుండును సంతోషవంతురితస్వాంతులై యరిగి రని సూతుండు వక్కాణించుటయు

ఆశ్వాసాంతము.

మ॥ ప్రణమద్విష్ణు ముఖామరేంద్ర మకుట • ప్రాంచన్మణిప్రోత కాం
చనవల్లీనికరాంచితామల పదా • బ్జానంద నారాధ్యనం
దన సత్కావ్యనిబద్ధ నిర్మలకథా • నానావిధానూన భూ
తనియంతృత్వ పదాభిరామవిలస • త్పాండ్యావనీనాయకా.

క॥ రతిహృదయగతవిచార ప్రతతిలవిత్రాయమాన • బంధురమూర్తీ
హతశమనా జితమదనా క్రతునాశన సుందరేశ • కాంక్షితఫలదా.

తోటకవృత్తము॥ సురసేవితభా • సురసోమకళా ధర రక్షితధీవర • తారకహా
కరుణాకరమూరిని • కాయనుతా పరమేశ్వరభానుని • భావరదా.

తే॥ కష్టపడిపెంచియిడితినా • కవితకన్నె నెవ్విధంబున నలరింతొ • యింక నీవు
గంగివోలెను గయ్యాళి • గాదు బేల సుమ్ము నీతల నెక్కనా • ట్యమ్ము సేయ.

సీ॥ ఏమహామహుఁడు శ్రీ • వేమనారాధ్యవం • శాబ్ధికిఁబూర్ణశ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి • కెనయైసతుల్ మెచ్చ మహిని పాతివ్రత్య • మహిమఁగాంచె
నట్టినందయకు గా • రమకు ద్వితీయ పుత్రుండఁగౌండిన్య గో • త్రుండదక్షి
ణామూర్తికిని శివా • నందునకు సోదరుండఁ గూఁతమి యగ్ర • జుండ సుబ్బ
వామ్యకుఁ బౌత్రుఁడను మదీ • యమగు శ్రీమదాంధ్ర లింగపురాణ పూర్వార్ధమందుఁ
బ్రవిమలంబైన యష్టమా • శ్వాసమయ్యె సతము దీనిని రక్షించుఁ జంద్రమౌళి.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ మీనాక్ష్యైనమః.

# శ్రీమదాంధ్ర లింగ పురాణము.

## ఉ త్త ర భా గ ము.

## ప్ర థ మా శ్వా స ము.



### —॰ పార్వతీదేవి తపముజేయుట ॰––

క॥ శ్రితభక్త వ్రాతమనోగత నిఖిల ఫలప్రదాన ♦ కారణ సృష్టి
స్థితిలయ సంయుతభువన త్రితయపతీ; సోమనాథ; ♦ త్రిపురవిదారా!

వ॥ అవధరింపుమయ్య నంగాంగన శృంగార రసాధిదేవతయగు కందర్పునిందుధగాను
గ్రహంబునఁ బడసి విగత చింతాభారుండగు వసంతునింగూడి చనిన యనంతరంబు.

ఉ॥ భువనహితంబుఁగోరి హిమ ♦ భూధరకన్యకయైన శాంకరీ
భవుఁడు వివాహమయ్యెనని ♦ పల్కితి వా కథయెట్టులయ్యె సం
భవమరణాది దుఃఖవిని ♦ వారక మార్తజనైక రక్షకం
బవిరళ మోక్షదంబది మ ♦ హాత్మ వచింపఁగదయ్య మాకిఁకన్.

వ॥ అని విదితసత్కథా సందోహులగు శౌనకాదిముని బృందారకులడిగిన నమందానంద
కందలిత చేతోరవిందుఁడై "మహర్షులారా! లీలామేయ విగ్రహుండగు
బాల శశాంకధరుం డాశ్రమధర్మ పరిరక్షణం బత్యంతావశ్యకంబగుడు హైమవతిని
పాణిగ్రహణంబుఁ గావించె మీకాశుభచరిత్రంబు వక్కాణింతు వినుఁడని సూతుం
డిట్లనియె.

మ॥ అనుకంపానిధి యే పరాత్పరుఁడు ని ♦ త్యానంద సంపూర్ణుఁడై
మునిలోకంబు భజింపఁగా వెలుఁగునా ♦ భూతేశ్వరున్ బాణి పీ
డనముగా జేయు దలంపుఁ జేసి గిరి రా ♦ ట్కన్యాలలామంబు మా
తృ నిదేశంబున నిశ్చలాత్మయయి గౌ ♦ రీశృంగ దేశంబునన్.

వ॥ భక్తవంక నా శంకరుండగు శశాంక శేఖరునుద్దేశించి తపంబుఁ గావింపఁజని

సీ॥ పట్టుపుట్టంబులఁ • గట్టుటయున్ మాని పొలుపారు నారచీ • రెలను దాల్చి
సలలిత స్వర్ణభూ • షలఁ బూనుటనుమాని రుదురక్కపూసల • నెదధరించు
నిష్టమృష్టాన్న సం • తృప్తినొందుట మాని యల కందమూలంబు • లారగించుఁ
జిలుకపిల్లలతోడఁ • జెలిమి సేయుటమాని హరిణికన్యలతోడ • మైత్రిసేయు
నలరుఁ జివురులఁబోని యం • గుళుల వీణాతీవియల మీటుటనుమాని • తివిరి యక్ష
మాలఁ ద్రిప్పఁగఁ దొడఁగు నా • శైలతనయ ధర్మవృద్ధయగుచుఁ దపో • ఘనులయందు.

చ॥ తొలినెల వన్యమూలముల • తోఁ జలపానముతోడ క్షుత్పిపా
సల నడగించుకొంచు సర • సంబగు వృత్తిఁ జరించి యందునన్
ఘల నిసుమంతయున్ గలుగు • పద్ధతిలేమి మహోగ్రనిష్ఠ న
వ్వలి నెల నద్రికన్యక త • పంబొనరింపఁగ సాగె నెంతయున్.

సీ॥ పడమరగాలి వీ • చెడు గ్రీష్మదినములయందుఁ బంచాగ్నిమ • ధ్యమునఁ జేరి
యొడలేక వర్షంబు • వడు దుర్దినములలో నాకాశగంగ యం • దధివసించి
తతశీతవాత సం • యుతహిమవద్వాసరముల దుషారదే • శమున నిలిచి
కర ముపధానంబు • గా జీర్ణపర్ణ నిర్మితమగు శయ్యపై • మేను జేర్చి
యితరవిషయంబులం బారు • నింద్రియముల స్థైర్యమను పాశమున బం • ధనముఁ జేసి
యీశ్వరానుగ్రహంబె ము • ఖ్యేచ్ఛయగుడు నద్రితనయ తపస్విని • యై తనర్చె.

మ॥ అరిషడ్వర్గము దూరమయ్యె విషయ • వ్యాసంగశూన్యంబులై
కరణంబుల్ దమ సత్వమున్ విడిచె న • జ్ఞానంబు చిజ్జ్ఞాన భా
స్కరతేజంబున లొంగిపోయె నిరహం • కారంబు చేకూరె నీ
శ్వర సేవాపరతంత్రయై తపము స • ల్పన్ గౌరికప్పట్టునన్.

తే॥ అతులితోత్సాహపూరిత • యై ప్రవర్ధ మానశివ సంగమాపేక్ష • మంజులాంగ
కములు జీర్ణించినను సుంత • శ్రమము నాక పర్ణములఁ గూడ దినక య • [పర్ణయయ్యె.

చ॥ జలనిధులింకిపోయెఁ గుల • శైలములున్ జలియించెఁ దారకల్
జలజలరాలె దిక్కరులు • స్థానముఁ దప్పెను బంచభూతముల్
నిలుకడలేక పాఱె రజ • నీచర భాస్కరవీతిహోత్ర కాం
తులు శమియించె దుర్లభ మ • నోరథ దుర్గతపం బొనర్పఁగన్.

— • బ్రహ్మదేవుఁడు పార్వతీదేవిని దర్శించుట • —

ఉ॥ ఆవిధి నుగ్రనిష్ఠమెయి • నద్రిజ సేయు తపంబు వహ్నిలో
కావళిఁ బీడసల్పుటయు • నద్దిరయెఱింగి విరించి యంబికా

దేవి ప్రశాంతచిత్తయగు • తెన్నునుగాంచి మరీచి ముఖ్యులౌ
పావనులైన మౌను లిరు • ప్రక్కల వచ్చుచునుండ నెంతయున్.

చ॥ పరమముదావహం బఖిల • పాపనివారక మీశ్వరప్రియా
కరము తపస్వి సేవితము • కామ్యఫలప్రద మంబికాపదాం
బురుహ పవిత్రితంబగు త • పోవనమున్ జని యందుఁ బన్నగా
భరణుజపించుచున్న హిమ • వత్సుతఁ గన్గొని విస్మయంబునన్.

క॥ ఔరా శంకరుమహిమం బారయ నెవ్వారితరమె • యాదిమశక్తిన్
ఘోరారణ్యంబుల నీ తీరునఁ దపియింపఁజేసె • దిటము దలిర్పన్.

తే॥ అని తలంచి యొకింత య • య్యబ్జభవుఁడు హైమవతికింత యెదముగా • నరిగినిలిచి
నిటలతటఘటితాంజలి • పుటుఁడగుచును వేదవిహితార్థయుతముగ • వినుతిఁజేసె.

ఉ॥ ఈ యఖిల ప్రపంచమున • కెల్లను గారణమీవ నీ మహా
మాయకుఁ జిక్కి స్రుక్కి యణు • మాత్రము జ్ఞానములేక దుష్టమై
పోయెడు లోకమున్ గరుణఁ • బ్రోచుటకున్ జరియింతు వీవు త
ల్లీ యిది యిట్టిదం చెఱుఁగ • లేముకదా నినుగొల్వకుండినన్.

చ॥ స్థిరమగు భక్తినే జనని • దివ్యకథామృతపాన మత్తులై
పరమ తపోధనుల్ మునులు • పంకజనేత్ర ముఖామరుల్ చరా
చరమగు జంతుజాలమును • సంతతమున్ దిరుగాడునట్టి నీ
చరణము లాశ్రయింతుము ప్ర • సన్నవుగాఁ గదవమ్మ యీశ్వరీ!.

శా॥ నీ సంకల్పమునన్ జరించును భవా • నీ లోకజాలంబు లు
ర్వీసంరక్షణమెల్ల నీకతనఁ బ్రా • ప్తించున్ భవచ్ఛాసనం
బే సర్వంబును సంహరించుఁగద నీ • వే యాదిదైవంబవై
మా సంతాపముఁ దీర్పఁగాఁ దగుదు వ • మ్మా భక్తసంరక్షిణీ!.

ఉ॥ నీవొనరించు నీ తపము • నిష్ఠురమై ప్రళయాగ్నియుంబలెన్
బాయక యెల్లలోకముల • మాపెడు నంతయు జాలిగూడదే
యేయెడఁ దాను బెంచి విష • వృక్షము నే బెఱుకంగ యోగ్యమా
నే యఖిలంబు నీవ సృజి • యించితి కాదె గుణత్రయాత్మికా!.

—• పార్వతీదేవి బ్రహ్మతో సంభాషించుట •—

ఉ॥ నావుడు పద్మయోని వచ • నంబులకున్ మది మెచ్చి పార్వతీ
దేవి వచించునిట్లు గణు • తింపఁగ నీవకదా సమస్తలో

కావలి సృష్టిఁ జేసెడి మ ♦ హా మతిమంతుఁడ వట్టి నీకు మ
మ్మావిధి మానివృత్తిఁ జరి ♦ యించెడివారలఁ బల్కు టొప్పునే.

క॥ ఒక యబలసేయు తపమున కకు బంతర్భాగ సమితి ♦ కాలినచోఁ బూ
నిక మానివరు లానర్చెదు ప్రకటతపస్తాప మెవఁడు ♦ భరియించునొకో.

క॥ తరుణేందుధరుఁడు భక్తామర భూరుహ మీశ్వరుండు ♦ మహనీయ గుణో
త్తరుఁడు జగదేకపూరుషుఁ డరయఁగ నట్టిఁడు మహాత్ముఁ ♦ డన్యుఁడుగలఁడే.

ఉ॥ ఆగమ సంచయాగ్రచరుఁ ♦ డాశ్రిత పోషకుఁ డప్రమేయుఁడా
నాగజరాజ చర్మధరు ♦ నాజ్ఞ మెయిన్ ననకర్హమైన యు
ద్యోగము పూని త్రిమ్మరుచు ♦ నుండెడుఁగాని యెవండయేని స్వే
చ్ఛాగతి సంచరించుటకుఁ ♦ జాలునె మాయఁ దరింప శక్యమే.

క॥ ఏతపముఁ గూర్చి పల్కితి వా తపమొనరింపఁ జేయు ♦ నట్టి ఘనుండా
భూతేశ్వరుండె యగు నిపు డాతఁడు జాలినిదలంప ♦ నగు శుభ మింకన్.

తే॥ తపముఁ జేయుటయును ♦ దపము మానుటయును నా యధీనములగు ♦ నా తలంప
నట్టులైన నిట్టి ♦ యాయాస మేమిటి కిష్టఫలముఁ జెంద ♦ నే స్వయముగ.

మ॥ చిరకాలంబున నుండి శంభుపద రా ♦ జీవంబులన్ స్వాంత మం
దిర దేశంబున నిల్పి తద్విమల మూ ♦ ర్తిన్ గాంచఁగాఁ గోరుచున్
బరమోత్సాహముతోడ నుండు నిపుడీ ♦ వ్యాపారమున్ మాని యే
కరణిన్ ద్రిమ్మరనాజ్ఞ సేయుదువు లో ♦ కత్రాత సంరక్షకా.

చ॥ అనుటయు నాసికాగ్రమున ♦ యందు నఁ దర్జనిఁ జేర్చి యబ్బురం
బున నిది యేమి లోకములఁ బ్రోవఁగ నేర్చినయట్టి తల్లి యి
ట్లని వచియించుఁ గ్రొత్తగ న ♦ హో యిఁక లోకహితంబు గల్గదే
మొ నిరతిఁ బద్మసంభవుని ♦ పూనిక వ్యర్థమయానొ యేమొకో.

క॥ అని తలఁచుచు వనజభవుఁడు తనవచ్చిన కర్జమది వ్య ♦ ర్థా కాఁదగు సూ
చన లెఱిఁగి వెఱఁగుపడి గిరితనయన్ గని పల్కె నిట్లు ♦ దహతహవడుచున్.

తే॥ సర్వమునకు నీవ ♦ సత్వప్రదాత్రివి నీవు నిగ్రహింప ♦ నెవఁడు నెగడు
నీ యనుగ్రహమున ♦ నిఖిలభూతంబు లో తల్లి నిత్యసుఖముఁ ♦ దగిలి మనును.

తే॥ నిత్యురాలవీవు ♦ నిత్యుండు శంభుండు శక్తివీవు పురుష ♦ సత్తముండు
శంకరుండు మీక సరియగు దాంపత్య మమ్మ! యింకఁ బ్రోవు ♦ మమ్మ జగము.

తే॥ శివుని పరిణయంబుఁ ♦ జేసికొనఁగఁ గోరి యుగ్రతపముఁ జేయు ♦ చుంటివీవు
దానఁ జేసి జగము ♦ తల్లడ పడియెడు నెఱుఁగకున్న దాన ♦ వే మదంబ.

తే॥ కొలఁదికాలంబునకె వచ్చి • కూర్మిమీఱ నీకువరమీయఁగలుగునా • నీల లోహి
తుండు తాపకరమగు న • ఖండ తపము మాని జీవసమూహంబు • మనుపుమింక.

వ॥ అని యనేకవిధంబులఁ బ్రోధించి

క॥ వినయ శ్రద్ధాభక్తులు మనమునఁ బెనఁగొనఁగ నజుఁడు • మా దేవికి స
త్యనిరూఢాత్మకు నంజలి నొనరించి యథేచ్ఛఁ జనియె • నురుతరభక్తిన్.

వ॥ అంత

చ॥ హరి వనజాసనాది నిఖి • లామరవర్గ మె వాని యాజ్ఞఁ బ
ల్మరుఁ బలువేసముల్ గొని యి • లన్ జరియించుచునుందు రట్టి యీ
శ్వరుఁడు దయార్ద్రచిత్తుఁడయి • శైలజకున్ వరమీఁదలంచి య
గ్గిరివర శృంగభాగమున • కే జను కోర్కె పొసంగ నాత్మలోన్.

—• శివుఁడు తపముజేయు గౌరిన్ గాంచ ప్రయాణంబు జేయుట •—

సీ॥ అజుని కపాలంబె • యవతంసమగు కేలఁ బంచాంగమును ధరి • యించినాఁడు
పుండరీకాజినం • బు తనర్చు కటి నీరు కావిదోవతి బిగఁ • గట్టినాఁడు
చిలువ సొమ్ములతోడఁ • జెన్నొందు వెడఁదఱొమ్మున మంచి జందెముల్ •
[ బూనినాఁడు
ప్రళయాగ్ని కీలముల్ • గలఫాలతలమున భూతిరేఖలు గాఁగఁ • బూసినాఁడు
అల చరాచర జంతుజా • లాత్మకముల జగములెల్లను సృష్టింపఁ • జాలువాఁడు
శైలజాదర్శనాభిలా • షను జెలంగి చీఁకు ముదుసలి రూపంబుఁ జెందినాఁడు.

తే॥ అటుల ద్విజరూపమూని య • య్యంధకారి సతిఁ గనుంగొను నుత్సాహ • సంభ్రమముల
మెల్లమెల్లన నడవుల • నెల్ల దాఁటి యలరు గౌరీశిఖరమున కరుగుటకయి.

వ॥ ఒక్కరుండ ప్రయాణంబుఁ గావించి యుద్దండ వేదండగండస్థల ప్రస్రవన్మదజల సంవర్ధితానేకవిధ పాదప సమావృతంబును, నిరంతర విహార ద్వనదేవతాచరణాలక్తరస రంజితము వోలె కోమల కిసలయ సమలంకృతంబును, సతతనిపతిత పుష్పపరాగసాంద్రంబులగు లతామంటపములుగలదియు, వనపాలక వివాహసమయ పరికల్పితంబగు చలువపందిరింబోని సూర్యకిరణంబులఁ జొరనీక ఛాయాకరంబైనదియు సమాలింగిత బహుళశాఖి శాఖాసంతానంబైన యూర్ధ్వంబుగలదియుఁ క్షీరవారినిధివలె శ్రీహరి నివాసయోగ్యంబును, కిష్కింధానగరంబుమాడ్కి చపలవానరకుల కలకలంబును, ధృతరాష్ట్రభవనంబుపగిది సంచర ద్ధార్తరాష్ట్రసమూహంబును, చతురపండిత గ్రథిత కృతిరత్నముంబోలె శార్దూల చరణ బంధురంబును నగు హిమనగప్రాంత కాంతారంబు సొచ్చి యంతరంగంబున.

సీ॥ వేణువినా దముల్ • విస్తరిల్లుటఁజేసి కోడెత్రాఁచులుగూడి • యాడుచట
ఫెళఫెళాస్ఫటులచే • విఱిగి కొమ్మలు గూల నెలుఁగులు చెట్లపై • కెక్కు నిచట
కొండలతోఁడ డీకొనఁదలంచియొ యేమొ మదపుటేనికలు త్రి • మ్మరెడు నందు
గండుజీమలరీతి • గా బార్లుగట్టి పేరెమ్ములఁ బారు వ్యా • ఘ్రమ్ములిందు
ప్రళయకాలసముద్భూత • భయద ఘోరకీలికీలాభ సై వృక్ష • జాల జనిత
మగుచు దిక్కుల వ్యాపించి • యల్లనల్ల నదిరొ వచ్చెడు నిటుల ద • వానలంబు.

సీ॥ వాడి దబ్బనములు • వలె నడుగిడినంత గస్సున దిగిరెడి • కంటకములు
నిరుశంకలను దారి • కెడమీక రంపాలకరణి గీఁచుకొనెడి • గచ్చపొదలుఁ
బ్రాఁకులాడినఁగాని • పైనుండి గాలిచే కేశముల్ లాఁగెడి • కీచకములు
చేఁటల పైకెత్తి • చెఱిగెడురీతి దుమారమ్ము జిమ్మెడి • మారుతములు
కొండవాగులతాకున • కణ్ గుభాల్ గుభాలనుచు దొర్లుచుండెడి • ప్రస్తరములు
పట్టపగలైనగాని ని • గ్భయముతోఁడ సంచరించెడి వివిధ పి • శాచ తతులు.

వ॥ అని మెల్లమెల్లన నడచుచు

సీ॥ పరిమళ న్మాలతీ • వల్లీసమాలింగి తామ్రసాంద్రచ్ఛాయ • లందు నిలిచి
మధు రసాస్వాదనో • న్మత్త విహంగమజాల కలధ్వను • లాలకించి
వికసజ్జలజపత్ర • నికరచరద్భృంగ ఝుంకారముల సంత • సంబు జెంది
పొలుపొందు పన్నీటి • పూఁబొదల్ వర్షింప నలరెడి మంచువాఁ • కలను దాటి
యల్లనల్లనఁ బగుగిడు • లేళ్ళగాంచి కంటకప్రదేశంబులఁ • గడచి జీర్ణ
పర్ణభూభాగములఁ ద్రొక్కి • పరమశివుఁడు సరగ హిమగిరివనమునం • దరిగియరిగి.

తే॥ సకలరత్నములకు • జన్మప్రదేశంబు వేల్పుమాఁకనెల్ల • బిలిచి పిలిచి
యామెతలను బెట్టు • నట్టి యుద్యోగియా గట్టుకేని నచటఁ • గాంచెహరుఁడు.

సీ॥ అల్లిబిల్లిగఁ దీవె • లల్లుకొనిన కమ్మగందంపు మ్రాకుల • గములబంతి
చివురు జొంపంబులఁ • జేం ద్యోఁడొండు గూఁకలం వెట్టునట్టి కో • యిలలనూఁఱ
యెలమావి గున్నలో • బ్బలఁజేరి మెడసాచి నలుదెసలక్ జూచు • చిలుకబోద
లలరులతేనె ద్రా • విలలిని మెయిదప్పి ఝుమ్మని మొఱవెట్టు • తుమ్మెదలను
తమ్మికొలఁకుల పజ్జ డెం • దమ్ము హాళిఁ జెందఁ ద్రిమ్మరు రాయంచ • చెలులపిండు
గలిగి తనరారు నెలదోట • లలరనొప్పు గట్టుసంతస మొసఁగె శం • కరునకపుడు.

సీ॥ నిద్దంపుఁ గమ్మ తే • నెలఁ గాఁచుఁ జిల్కపల్కులతోడ మంచి చె • డ్డలను బల్క
గొజ్జంగిపొదరిండ్లఁ గురియు చల్లనిమంచు నీళ్ళచే మునుమున్న • కాళ్లుగడిగి
తెలినిగ్గులీను బా • విలి బాల నెత్తాల • నొప్పునట్లుగఁ గూరు • చుండఁబెట్టి
బాజు గాఁ బండిన • చక్కని యెలమావిపండ్లిడి డెందంబుఁ • బసయొనర్చి

## ప్రథమాశ్వాసము.

పూవుఁదావుల మోయు మం బ్బుపగదాయ సురటిచే వీచి శంబుని తెరవు నిలుగ
నెల్లఁ బోఁద్రోలె మలరాయఁ డెపుడు మంచివారలకు నిత్యసుఖము చే కూరుఁగాదే.

తే॥ కడుపులోపల నిఖిల లో కములగములు గలిగి సర్వసమధుక ఁడై చెలఁగువిభుఁడు
శంభుఁ డారీతి ప్రాలేయ శైలమునకు నరిగి గౌరీశిఖరమున యందుఁజేరి.

చ॥ పురహరుఁడ వ్విధిఁ గుటిల భూమిసురాకృతిఁ బూని శాంతమై
పరగెడి బ్రహ్మతేజమున భాసిలు మోముదయాంబుసంతతిఁ
గురియగ నగ్గిరీంద్రమున కుఁ జనుదెంచుటయుఁ దపస్వి నీ
పరయయి యందుఁ ద్రిమ్మరు న పర్ణ కనుంగొని భక్తియుక్తయై.

—— పార్వతి పరమేశ్వరుని స్తుతించుట ——

చ॥ కనఁబడు నీ చరాచర జ గంబుల నెల్లను సృష్టిజేయు నే
ఘనుఁడు రజోగుణంబున న ఖండముగా నభివృద్ధిఁజేయు నే
యనఘుఁడు సత్వసంపనయు గాంతమునన్ దమమూని సంహరిం
చు నతని నాదిమూర్తి నిదె చూచితి మించితి సంతసంబునన్.

చ॥ నిరతము శాంతచిత్తులయి నిష్ఠమెయిన్ బవనంబు మెక్కి భీ
కరమగు కాననంబున న ఖండతపోనియతాత్ములౌ మునీ
శ్వరులకుఁ గాక తక్కుఁగల వారికిఁ దావక దివ్యదర్శనం
బరయఁగ సంభవించునె మ హాత్మ పురాంతకభక్తవత్సలా!

ఉ॥ అనుమానంబునఁజేసి లోకమిది కా ర్యంబౌట నూహింత్రు ని
న్ననఘుల్ కొందఱు చిన్మయుం డవని మా యామోహితాత్ముల్భవ
త్కానదంఘ్రి ద్వయరేణు దూరులయి మి థ్యాభూతమే తజ్జగం
బని యొక్కింత యెఱుంగలే రౌరలు ని త్యానంద సంధాయకా!

సీ॥ అలయక లోకంబు లన్ని పూనెడు లావుగల గిబ్బవార్వంబు గలిగియుండ
నయవినయంబుల భయధస్తులన్ జూపు నిర్జరుల్ లెంకలై నెగడుచుండ
చెప్పినయది యెల్లఁ జెవియొగ్గి విని "కృతార్థాస్మ్యహన్" సిద్ధసం తానముండ
నడిగినయంతనె మిడుకక యడుగొక్క మెకిమీఁడు మిత్రుఁడై యొసఁగుచుండ

నాసవాశొండయొక చేతఁ గ్రాలుచుండ నన్నిటిని వీడి యొక్కండ వై విభుండ
సమ్మహాద్రికిఁ జనుదెంచు టెల్లఁ జూడ భక్తవాత్సల్యమునఁ గాదె పరమపురుష!

చ॥ నిఖిలదానవకులా నీ కభీకరమగు వదనంబు శాంతప్రభ ను వహింప
నరయ నణోరణీ యనుగు చిద్విగ్రహం బంబక ప్రత్యక్ష మై తనర్ప

తతదుష్ట సంతాన • దాహకంబగునట్టి ఫాలంబు భస్మచేఁ • గ్రాలుచుండ
సకలభక్తావన • క్షణచంచలంబగు కేలఁ బొత్తమొకండు • లీలమెఱయ
భక్తివినమిత దిక్పతి • ప్రకర మకుట కోటిఘటిత మణిప్రభాం • కూరరంజి
తములగు పదాబ్జములం పథ • శ్రమఘునొంద శ్రితజనావన రతి ద్విజా • కృతినిఁబూని.

చ|| అడుగులు నేలపై నిడిన • యంతనె నిల్వక సంభ్రమింపఁగాఁ
బడమరగాలికిన్ గదలు • పల్లవలీల దగదొట్టి యెల్లమేన్
వడకఁగ మోమునన్ ముసరు • బల్లసికల్ సవరించుకొంచు నీ
వడుపునవచ్చు టెల్ల మము • వంటి యశక్తులఁ బ్రోవనేకదా?

— శివుఁడు పార్వతిచేత నాతిథ్యము గొనుట. —

క|| సకలచరాచరలోక ప్రకరము రక్షింపఁజాలు • బరమేశ్వరుఁడొం
డొకయబల కతిథియగుటది సుకృతంబగుఁ గాదె నిఖిల • సూరిస్తుత్యా!

చ|| అనిమదిలోన గుబ్బటిలు • హర్షవశంబునఁజేసి శైలరా
ట్తనయ పదింబదిన్ బలు వి • ధంబుల సన్నుతిఁజేసి మ్రొక్కి చ
ల్లని సురనిమ్న గాజలము • లన్ గడుపీయని ద్రాక్షపండ్లొసం
గినఁగొని వేడ్క శంకరుఁ డొ • గిన్ జెలువొప్పాలయుంగ నిట్లనున్.

తే|| తల్లిదండ్రుల మర్యాద • తెల్లనిలిపి పిన్నపెద్దల కర్హ మౌ • ప్రీతిఁ గూర్చు
టరయ నీయందె తగువమో వరజ నైన క్షితిఁ జెలఁగితి సద్గుణ • జ్యేష్ఠవగుచు.

— శివుఁడు పార్వతితో తపము మానుమని చెప్పుట —

వ|| మఱియును.

మ|| అలరుంబోడియిదేటి ధర్మమగు శు • ద్ధాంతంబులన్ వేల్పుగ
న్నెలు నీవాళు లొసంగఁగా వివిధ మా • ణిక్య ప్రభాజాల సం
కలితంబై తగు తూఁగుటూయెలను వే • డ్కన్ బ్రొద్దులన్ బుచ్చు నీ
యెల ప్రాయంబున కిట్టి నిష్ఠురతపం • బేరీతిగాఁ జెల్లునో.

మ|| అరిషడ్వర్గముఁ గెల్చి సర్వవిషయ • వ్యాసంగముం గోరె త్రి
మ్మరుచున్ గూర్కుడు నింద్రియాశ్వముల ఖం • ధచ్ఛక్తి బంధించి సు
స్థిరులై గాలియె మేయు యోగులును సా • ధింపంగ లేరీతప
శ్చరణం బేడ లతాంగులేడ వృథయా • యాక్లేశమున్ వీడుమా.

ఉ॥ కొండలతోడ డీకొనఁగఁ • గోరి చరించెడు నాము లేనుఁగుం
బిండొకవంక నొక్కయెడ • బిట్టుఱుమూల్ జెలరేఁగి దిక్కులన్
జెండువడంగఁ జేయునన • భీకరసత్వకులారవంబు లు
ద్దండత మిన్నుముట్టు వని • తా చరియింపఁగనౌనె నీ కిటన్.

సీ॥ సెలయేటి చప్పుళ్ళఁ • జెదరి కడలఁబాఱు భీతసారంగ సం • ఘాతములకు
ఘుర్ఘురించుచు వాడి • కొమ్ములతోఁ గొండఁద్రవ్వఁగఁ జూచు భూ • దారములకు
బుసఁగొట్టుకొంచు గు • ప్పునఁ దార్క్ష్యుపై నెనఁబడి చంపఁగల క్రొఁచు •
[ బాములకును
బ్రళయాగ్ని కీలముం • బలె నాల్గుదిక్కుల నలముకొనెడుదవా • నలమునకును
తెకవులం బాదుకొనియున్న•తరుసమూహ మొక్కమొగి కుప్పఁగాఁగూలు• చుండ వీచు
యుగవిగమకాల జనిత మ • హోగ్ర వాయుసంతతికిఁ దాళవచ్చునే • కాంత! నీకు.

శా॥ గంగాతుంగతరంగ సంగత లస • త్కల్హారపత్రంబు నీ
కుం గైసేయుట యొప్పఁగాక చిగుగా • కుంబోని దీపించు నీ
కెంగేలన్ స్ఫటికాక్షమాల నిటులన్ • గీలించు టహ్హా౦బె సా
రంగాంకంబు సహించు పుష్పమిల న • న్యంబోర్చునే యెప్పుడున్.

తే॥ తెలిసి తెలియక నీవిట్లు•సలుపుచుంటఁగాంచి యూఁకొట్టెనే నిన్నుఁ•గన్నతండ్రి
యతఁడు సర్వజ్ఞుఁడని విందు • నాత్మజాత కష్టసుఖములు తనయవి • గాఁదలపడో.

ఉ॥ ఆవిధిఁ గృత్రిమావని సు • రాగ్రసరుండు వచింపఁ బార్వతీ
దేవి భయంబు మైగదుర • దెమ్మరతాఁకునఁ దల్లడిల్లు లేఁ
దీవియ నాఁదనర్చె విను • తింగనుమంజుల కోమలాంగక
శ్రీవిలసిల్లి పల్లవ ప • రీభవ కృచ్ఛతురంబునై తగన్.

వ॥ ఇట్టుల నా గట్టుదొరపట్టి బిట్టదర కొంతవఱ కచేతనంబుఁ బలె లోకంబు మఱచి యెట్టకేలకు ధైర్యంబుఁ జేపట్టి తరణికిరణ విదళితంబగు నరవిందంబునుండి జారు మకరందంబు చినుకుల నెపంబునఁ జేసి భ్రమించి నెమ్మొగంబున ముసరుకొను భసలంబు విసరింబు వివిధకుసుమ రజోభర శ్రాంతగమనంబగు మలయానిలంబుఁ బోని నిశ్వాసపవనంబున విసరుచుఁ గువలయదళ వైభవసమాహరణ చతురంబగు లోచనద్వితయంబున భూసురచ్ఛద్మసమాగతుఁడగు నీశ్వరు నెమ్మేన నింద్రనీలమణి గణాలంకారంబుఁ గావించుచుఁ,జిరకాలకాంక్షితంబగు నిందుమౌళిసందర్శనంబున శేకత్తు నానంద పరంపరా శృంగార తరంగిణీతరంగ డోలికానివహంబునఁ దేలు మనోమరాళంబును నియమించుచు భక్తివినమిత గాత్రయై మెల్లన నిట్లనియె.

—♦ పార్వతి యీశ్వరునితోఁ దన నిజతత్త్వముఁ జెప్పుట ♦—

క॥ చతురుఁడవు సర్వసృష్టి స్థితిలయ కారకుఁడ వాది ♦ దేవుఁడ వీ వ
ద్భుతముగదా నీ చరితము సతభక్తావన ధురీణ! ♦ నాగాభరణా!

ఉ॥ తోయజనాభ పద్మభవ ♦ తోయదవాహ ముఖామరుల్ భవ
న్మాయ నెఱుంగలేక పర ♦ మంబగు నీదయకున్ విదూరులై
కాయమె నిక్కమంచుఁ గల ♦ కాలము ద్రిమ్మరుచుండ నొక్క యి
జ్జాయతనేత్రకున్ దెలియ ♦ నౌనొకొ నీ మహిమం బొకింతయున్.

శా॥ దేవా! దీనులఁ బ్రోచు భారమది నీ ♦ దే కాదో నీకీగతిన్
భావింపన్ దగునా? తపోనియతులై ♦ వర్తించువారిన్ భవ
చ్ఛేవాక్పత్యమె గాక యొండు కలదే ♦ చింతింపఁగా దేహముల్
జీవచ్ఛ్రేణికి శాశ్వతంబులగునే ♦ జీర్ణంబులున్ గాకిలన్.

ఉ॥ స్నానము సంధ్యయున్ జపము ♦ జన్నము సజ్జన పాదసేవయున్
సూనృత వాక్యమున్ నిఖిల ♦ సూరిజన స్తవనీయ పుణ్యకృ
ద్దాన విశేషమున్ మిగులు ♦ ధర్మములెన్నియు నీ పదాంబుజ
ధ్యానము సాటియౌనె త్రిపు ♦ రాంతక సర్వసురాసురార్చితా!

ఉ॥ ఎవ్వని ఱెప్పపాటుననె ♦ యీ జగముల్ జననంబు నొందునో
యెవ్వఁడు కన్నుమూయఁగనె ♦ యెల్లచరాచరముల్ నశించునో
యెవ్వఁడు భక్తివృద్ధుల క ♦ హీనవరంబు లొసంగునట్టి నీ
విర్విధి నాకు దర్శనము ♦ నిచ్చుటయే పదివేల నిచ్చుటల్.

మ॥ భవరోగౌషధమైన నీ విమలరూ ♦ పం బెట్లు దర్శింప గా
నవునోయంచుఁ దపించుచుంటిని మహా ♦ నార్యంబునన్ బూర్వ పు
ణ్య విశేషంబునఁ జేసి నేటి కది సం ♦ ప్రాప్తించెనే ధన్య నై
తి విరించ్యాదులుగూడఁ జెందని సుఖా ♦ ప్తిన్ జెందితిన్ మించితిన్.

మ॥ అనఘా నీపద దర్శనం బిపు డనా ♦ యాసంబుగా సంభవిం
చెను నేఁడాదిగ నెల్లకాలమును ద్వ ♦ త్సేవారతిన్ దాస్యముం
బొనరింతున్ నను రౌప్య శైలశిఖరం ♦ బున్ జేర్చు నీ దివ్యమూ
ర్తిని నాచిత్తపటంబునందు నిదెచి ♦ త్రింతున్ ముదంబొప్పఁగన్.

చ॥ అనుటయు శంకరుండు దర ♦ హాసముమోమునఁ జౌకళింప ని
ట్లను వనితా! యిదేటి ప్రణ ♦ యంబు భవాదృశలైన కన్యకల్
పనివడి తల్లిదండ్రుల కృ ♦ పన్ మనువారలు స్వేచ్ఛఁద్రిమ్మరన్
జనునె యపారమ్ముగదవె ♦ శాస్త్రచయంబు లెఱుంగ శక్యమే.

—• శివుఁడు పార్వతికి వరమిచ్చుట •—

ఉ॥ ఏ యుగమందు నెవ్వరును • నిట్టి మహాతపముం బొనర్పలే
దో యెలనాగ నీసలుపు • నుగ్రతపంబిది యెల్లఁజూడ నీ
ప్రాయము మించినట్లు గను • పట్టెడు నింతకు నోర్చినట్టి నీ
కై యెది కామ్యమయ్యెడినొ • యట్టిద గైకొనుమింక నిచ్చెదన్.

చ॥ తడయక యేగు మింటఁ దలి • దండ్రులు నీకయి వేఁచియుందురో
పడఁతి జగన్నుతంబగు భ • వచ్చరితంబు తపోవ్రతంబునన్
బడలితివీవు నీ యవయ • వంబులు జీర్ణములయ్యె వెట్టచే
దడఁగొని వాడు తీవియ వి • ధంబునఁ దోఁచుచు నుంటి వెంతయున్.

మ॥ పాలఁతీ నా వెనువెంట నిన్నిపుడె గొం • పోవంగ లేదంచు లో
నలుగంబోవకు మెప్పుడెట్టిపని సే • యంగూడునో యప్పుడే
యలసత్వంబు వహింప కట్టిపని సే • యంగూడుఁ దత్కాల సం
కలితావేశముఁ జేసి వేగిరపడం • గాఁ జెల్ల దేవారికిన్.

మ॥ వనజాతాసన ముఖ్యనిర్జర గణ • వ్యాకీర్ణమై మంగళ
ధ్వని మూకీకృతదిక్చయంబునయి భా • స్వద్రత్నసంఘట్టన
ప్రణుతంబైన వివాహవేది ననుకం • పా పూర్ణచిత్తుండనై
నిను బాణిగ్రహణంబొనర్తు నలివే • ణీ నమ్ము ముమ్మాటికిన్.

చ॥ అని కరుణాతరంగిత మ • నోఁబుధియై గిరిశుండు శైల నం
దనకు వరంబొసంగి నిజ • ధామముఁ జేరఁగ బోయెఁ గౌతుకం
బునఁ జరితార్థనైతినని • పొంగుచుఁ గోర్కులు ముమ్మరింపఁగాఁ
జనియె నపర్ణ స్వర్ణమయ • సౌధముఁ గూర్చి రయంబుమీఱఁగన్.

వ॥ అట్లు జని.

—• హిమవంతుఁడు పార్వతీ వియోగంబున విచారమొందుట •—

ఉ॥ రిక్కల తేనిటాల సవ • రించి యొనర్చిన మేలిగోడలున్
జొక్కపుఁ గప్పురాల్మలచి • జోగము జేసిన మీఁది కప్పులున్
జిక్కనిపైడికంబములు • జేఁచి కట్టినమఁదువాలు బల్
రొక్కముగల్గు నుప్పరిగ • లొనొక నెత్తపుటున్కి పట్టునన్.

మ॥ స్ఫుర దిందీవర సుందరంబయిన చ • క్షుశ్శ్రేణి కంపింప ని
బ్బరఁపున్ గుబ్బ మెఱుంగు చన్గవ గగు • ర్పాటొంది దీపింపఁగాఁ

గర పంకేజము చెమ్మగిల్ల నొక రా • కాచంద్రబింబాస్య చా
మరముం గైకొని కమ్మతెమ్మెరలు గ్ర • మ్మఁగ మెల్లఁగా వీవఁగన్.

క॥ నిగనిగమనియెడు నెలతా జిగి కెలఁకులఁ దళుకులీనఁ • జెలఁగు రతనఁపుం
జగతిపయిఁ జేరి యుంచుక మొగమున నొకరీతి చింత • ముప్పిరిగొనఁగన్.

తే॥ కుసుమకోమలగాత్రమా • బిసరుహాక్షి దుర్గమారణ్యమునకేఁగ • దగునె గొల్వ
నతని బ్రహ్మాది నిర్జరు • లైనఁగాని కనుఁగొనఁగ నేరరా సతి • కాంచు టెట్టులొ.

ఉ॥ ఏగతి మానివృత్తి ధరి • యించునొ యెంతయు నిశ్చలాత్మయై
యేగతి నిర్గుణుండు పర • మేశుని మెప్పువడఁగఁ జేయునో
యేగతి వాంఛితంబు ఫలి • యించెడునట్లొనరింపఁగల్గునో
యాగజయాన తోఁచ దిసు • మంతయు నన్నిట సందియంబగున్.

తే॥ అబల మరలివచ్చు • నంతకు నంతరంగము విచార డోలి • కనె వహించి
యూఁగుచుండు నెట్టు • లో స్వాస్థ్యమమరింపఁ గలుగు టింతయేని తెలియ దిపుడు.

చ॥ నును తలిరాకు పానుపున • నో విరిసెజ్జనొ పవ్వళించి మె
ల్లనఁ దనతోడి చేడియలు • లాలనఁ జేయఁగ మేలుకాంచు నీఁ
తును సుకుమారగాత్ర నొక • తోరపుటాస మెయిన్ మహాటవిన్
బనిచి కృశించుచుంటి నను • వంటి యధీరుఁ డొకండు గల్గునే.

సీ॥ పయ్యెరకే సోలి • పడు లేమ యేరీతిఁ బెనుగాడ్పులకు నోర్చు • కొనఁగ నేర్చు
బీరెండకే యోర్వ • దా రామ యేమాడ్కిఁ బంచాగ్నిమధ్యని • ల్వంగ నేర్చు
శుకపికాలాపంబు • లకె భీతిలెడి కొమ్మ పులుల బొబ్బల కెట్లు • నిలువ నేర్చు
మంచుతుంపురులకె • చంచలించు పడంతి గిరినది మున్గ లే • కరణి నేర్చు
ననిశ రాజాన్నభోజనం • బునె భరింప దతివ మిహిరాంశు పవన ప • ర్ణాంబునితతి
ప్రాణధారకముగ దుష్క • ర వ్రతంబు నేకరణి సేయ నేర్చునో • యెటుల మనునో.

మ॥ గడెసేపొక్కయుగంబుగాఁ గడచు నా • కళ్యాణి మాకింతఁ గ
న్పడకున్నన్ గుణవృద్ధులౌ తపసిమి • త్రుల్ గూడ శంకించు కా
అడవిన్ జేరఁ దపంబొనర్ప నది బా • గౌగాని యీ ప్సి రమా
నెడబాపెట్లు సహింతు మేగతిఁ దవీ • యేష్టంబు సిద్ధించునో.

మ॥ నిరతోత్సాహపరీతచిత్తులయి మా • నిశ్శ్రేష్ఠులే దేవతా
వరు దర్శింపఁగఁ గష్టనిష్ఠురములన్ • బాటింప కేవేళ దు
ష్కరమౌనట్టి తపంబుఁ జేయుదురొ యా • గంగాధరుండేడ సుం
దరి యోర్తాతనిఁ గాంచు టేడనొ విచి • త్రంబయ్యెడిన్ జూడఁగన్.

॥ అని మనమునఁ బెనఁగొనియెడి తన విషయంబైన ♦ చింత దగిలి బొగులుచుం
డిన జనకుని సన్నిధికై జనిన యమరన్ గాంచి సంత ♦ సము దైవారన్.

—♦ పార్వతి హిమవంతునికడకుఁ బోవుట ♦—

ఉ॥ కన్నులు భద్రభాష్పములు ♦ గ్రమ్మకొనన్ బ్రతిబంధితంబులై
యున్నను నెప్పలెత్తి యెటు ♦ లో బలిమిన్ గనుగొంచు హర్షసం
పన్నతఁజేసి వాని తడ ♦ బాటువడన్ మెలమెల్లగట్టుఱేఁ
డన్నళినాక్షిఁగాంచి ప్రియ ♦ మారఁగ నీగతి బల్కె నెంతయున్

ఉ॥ వచ్చితివే ప్రియంబుమెఱు ♦ వాంఛితమున్ బ్రతిసెప్పకాఘనుం
డిచ్చెనె నీ ప్రవర్తనము నెంతయుఁ గన్గొని మౌనులెల్లరున్
మెచ్చిరె యాశ్రమంబున స ♦ మృద్ధియె కాఫలవత్తరు వ్రజం
బచ్చటి వింతలెల్లఁ దనయా వచియింపగదే రయంబునన్.

ఉ॥ అలరు గడానిడాలు వెల ♦ యన్ దలిరాకుల పిండువోలెఁ బే
శలమయి క్రొమ్మెఱుంగు నును ♦ చాయను గాదనిపించి మించు మే
వల సత వాడిపోయె మృదు ♦ లాంగకముల్ గృశియించెఁ గేశముల్
మలఁగొనిపోయె నెంతటి శ్ర ♦ మంపడితో గద యా వనంబునన్.

తే॥ కర్కశతపఃపరిశ్రాంతి ♦ గాసిలితివి తనయ శశికాంత మణికల్ప ♦ తమగు నిందు
విశ్రమించి యొకింత ప ♦ థశ్రమంబు సమయఁజేయుఁడమ్మ ♦ నా స్వాంతమలర.

తే॥ అనుచు సర్వమంగ ♦ ళాలోక సముదిత హర్షవర్ధితాఖి ♦ లాంగుఁడగుచు
విస్మృత ప్రపంచ ♦ విజ్ఞానుఁడైయుండె నపుడు భూమి భృత్కు ♦ లాధిపుండు.

ఉ॥ మేనయు మేనఁబుల్కలు స ♦ మేలములై కనుపట్టఁ బట్టి నె
మ్మేనును గౌగలించి సరి ♦ మించిపొసంగెడి కల్వలిందు సొం
పూను మొగంబు ముద్దుఁగొని ♦ యూసుపతోఁ జుబుకంబుఁ బట్టి స
న్మానము తానకంబనుప ♦ చుంబగు దీయని వాని నిట్లనున్.

ఉ॥ కానక గన్నసంతగుటఁ ♦ గన్నుల నద్దుచుఁ బెంచుకొందుమో
మానిని నిన్ను వీడుటన ♦ మాకు జగంబునె వీడినట్టులై
మానసమెల్ల మొద్దువడి ♦ మంచిచెడుంగు లెఱుంగనీయ ద
మ్మా నిముసంబె యొక్క యుగ ♦ మై కడచెన్ నినుజూచునంతకున్.

చ॥ అలసమనోహరంబులు స ♦ మంచిత జంగమవల్లికా ప్రరో
హ లలితముల్ సుధాకణ మ ♦ యంబులు దేవనదీ తరంగ సం
చలిత సరోజపత్త్ర సదృ ♦ శంబులు తావక కోమలాంగకం
బులు కళలన్ దొఱంగెఁ బువు ♦ బోఁడి వనస్థలి సంచరించుటన్.

సీ॥ చిలుకబోదెలు పద్దె ♦ ములఁ జదువుట మానుకొనియె నీ తియ్యపలుకులకుఁ దొఱంగఁ
దెలిపిట్టలెల్ల బు ♦ ద్ధిగఱపినను నడల్ మఱచె నీ నడలిందుఁ ♦ గొఱఁతవడఁగ
నెమ్మిమూనలకాట ♦ నేర్పితివే కాని నినుజూడ కవి డాఁగు ♦ కొనియె నెచటొ
గొరవంక పిల్లలు ♦ కూయ విం తేనియు నినుబోలి మానివ్ర ♦ త్తిని వహించి
హరుని సాధించు కోర్కె నీ ♦ వ చటఁ జేరి యుపవసించుచునుంటి వ ♦ ట్లుగ్రభూమి
నిన్ను బొడఁగానమిని తోడి ♦ కన్నెలెల్ల నుపవసించి కృశించుచు ♦ నుండిరిచట.

చ॥ భుజమున స్వర్ణ నీ సలిల ♦ పూర్ణసువర్ణ ఘటంబుఁ బూని ప్రే
మజల మొసంగెడివు నవ ♦ మాలికయయ్యెదె చూడు నాఁటఁ గో
లెఁ జలముఁ బూని యెంతయుఁ జ ♦ లించుచునుండు నె కాని తాపద
య్యె జలజనేత్ర నీరుభవ ♦ దీయ వియోగముఁ జేసి సుంతయున్.

చ॥ చిరము భవద్వియోగమునఁ ♦ జేసి కృశించుచు మెల్లమెల్లనన్
బరిసర నిష్కుటాంతరము ♦ నన్ వసి మేఁతకునై జనన్ గుశాం
కురమున వాయి గ్రుచ్చుకొని ♦ కోమలమా వదనంబు గాయమై
హరిణము దస్సియున్న దదె ♦ యల్లటు జూడుము జాలిదూలఁగన్.

చ॥ ఇది యది యంచు నేల వచి ♦ యింపదగున్ నినుఁగాన కున్కి యా
పదఁ గొని యెల్లజంతుతతి ♦ ప్రాణములే యఱచేతఁ బూని నీ
వ నముఁ గాంచు టెప్పుడొకొ ♦ వారనిమూర్తి నటించుఁ జింతలన్
బొనలుచునుండుఁ గాదెపురు ♦ బోడికనుం గొను మీ నగంబునన్.

తే॥ ఏది యెటులైన నేమి నీ ♦ హృదయపదము నావరించిన వాంఛా ల ♦ తాంకురంబు
విఘ్నమృగదంశితము గాక ♦ పెరిగి యిట్లు సఫలమగుటయె కౌతుకాస్పదము మాకు.

——♦ పార్వతి మేనకతో శివుని ప్రభావంబుగూర్చి చెప్పుట ♦——

చ॥ అనుటయు శైలబాల రద ♦ నాంశులు నిర్మలినాధరోష్ట కాం
తినివహ సంగతిన్ దళుకు ♦ నిగ్గులదాడిమి బీజసంచయం
బును నిరసించునట్లు నను ♦ మోమునఁ జిన్నగ వంకురింప ని
ట్లనియె నయంబు డంబుగల ♦ యట్టి వచస్సుల మెల్లమెల్లనన్.

ఉ॥ నిక్కమెయౌఁ దలంప జన ♦ నీ తగనీవడి మీకు నాయెడన్
నెక్కొను ప్రేమకన్నను గ ♦ ణింపఁగ నిందలి భూతరాశియం
దెక్కుడు మూర్మియే కలుగు ♦ నెప్పుడు నాకటులయ్యు నెల్లరన్
బక్కున వీడిపోవుటకు ♦ భర్గుఁడె కారణ మేమి సేయుదున్.

మ॥ లయకాలాంబుద సన్నిభంబయి విలో ♦ ల క్రూరదావానల
ప్రియకృద్దారుణ చండరుక్కలిత మూ ♦ ర్తి ప్రాపితాశేష భూ

భయమై యొప్పు హాలాహలంబుఁ బెలుచన్ భక్షించి రక్షించె న
క్షయ సత్వాఢ్యుఁడు దక్షహంతకుఁడు లో • కవ్రాతమున్ బ్రీతిమై.

చ॥ అతఁడు పరాత్పరుండు నిఖి • లామరకోటి కిరీట ఝూటికా
తతమణి కాంతి రంజితప • దద్వయుఁ డా ర్తజనైకపక్షణ
ప్రభుఁడును పాంచభౌతిక చ • రాచరలోక నియంత యా గుణా
న్వితుని భజించుకన్న మతి • వేరొకఁ డేటికినాకు మాటికిన్.

చ॥ తొలకరిమబ్బు కూటువల • తోఁ జరలాడుచు మించుమించు క
ట్వల చెలికాని వీడక మె • లంగుచు సంతసమొందుఁ జంద్రికా
వళి యొడికంబుతోడఁ బెడఁ • బాయదు వహ్నిని ధూమరేఖ ని
చ్చలును మదీయ బుద్ధిహరు • సంగతిఁ గోరుచునుండు నెంతయున్.

క॥ లోకప్రత్యయమునకై సాకారుండయ్యె నా ని • రాకారుఁడు ధా
త్రీకమనార్చితుఁ డా శివుఁ డేకద భూతప్రపంచమెల్ల సృజించున్

మ॥ తన భక్త ప్రణయప్రదానము కృ • తార్థంబై తగన్ సర్వభూ
త నియంతృత్వము తేటతెల్లముగ వా • త్సల్యంబునన్ మత్తపో
జనిత ప్రీతిని జేసి నన్నుగని యు • త్సాహంబు రెకెత్తఁ బ
త్నిగా వేడ్కఁ బరిగ్రహింతునని యర్థిన్ బల్కె నీశుఁడటన్.

క॥ అని చెప్పిన మేనయు మనమున నానందంబు నొంది • భూతేశ్వరుఁడే
తన కల్లుఁడయ్యె నింకేమని మది నుప్పొంగుచుండె • నవియట్లుండెన్ •

—• హిమవంతుండు పార్వతీవివాహ ప్రయత్నంబులు సేయుట •—

వ॥ అంత నా హిమవంతుండు, పురాకృత పుణ్యాపుణ్య భోగార్థ సముద్భూతసకల చరాచర ప్రపంచోద్ధరణ ప్రయోజన జననయు, ధర్మాధర్మ నిర్ణేతృతా కర్మయు, మందారు బృందారక సుందరీసందోహ సుందరవదనారవింద సమలంకృత కుంకుమరంజిత చరణాంబుజయు, ననిశవిన మన్మునిజన మనోజనిత సంకల్ప ఫలకల్పనా నల్పప్రజ్ఞాసమన్వితయుఁ బరిణత సుర మహీరుహ ఫలస్రవదమృత బిందు సదృశామలవచోళీ సమాహృత గిరీశ్వరహృదయ సర్వస్వయు, దరదళిత మల్లికావల్లికామతల్లి కాకోర కోపమరదనసముదిత విశద హిమ శుభ్రదరహాస తిర స్కృత శారద చంద్ర చంద్రికామండలయు, నింద్ర నీలమణి గణగణనా నిపుణ పితేతర కాంతి పుంజీకృత తనుద్యుతియు, సజల జలధరతులితకబరియు, నగు సర్వ మంగళ వచించు సమంచిత వాక్సంచయంబున కంతరంగంబు సంతోష పరంపరా దంతురితంబై క్షణక్షణ ప్రవర్ధమానా నూనోత్సాహ తరంగిణీ తరంగ భంగంబ గుచు, నచేతనంబు భాతికృత్య వస్తుపరిజ్ఞాన శూన్యంబగుడు నించుకేనియు సంచలిం

పక హైమవతీ వివాహక్రియోద్యమంబు సద్యఃకార్యంబని నిశ్చయించి దోషా
ప్రస్థంబు నలంకరించుటయు లోకపాలానీకంబునకు వివాహ వృత్తాంతంబు నెఱిఁ
గించుటయుఁ దత్కాలోచిత కృత్యంబులగుటం జేసి శేముషీమంతులగుఁ గొందఱ
నాంతరంగికుల దిగంతంబులఁ జాటఁబనిచి.

ఉ॥ మారగు సృష్టికర్తయయి • మానితశిల్పకళా విశేష వి
స్తారిత సద్యశోవిలత • సర్వసురాసుర లోకజాలుఁడై
వైరిని శాచరప్రకర • వారణ కారణుఁడైన త్వష్టనుం
భూరి గుణాఢ్యునిం బిలిచి • భూధరరాజు వచించు నీ క్రియన్.

చ॥ సలలిత కీర్తిశాలి విప్ర • శస్త గుణాఢ్యుఁడ వెల్లయందుఁ గౌ
శలమున మించువాఁడవు పో • సంగదు నీకొక సాటి శేముషీ
కలితుఁడ వీవ యిర్వ్యోడలఁ • గల్గెను కజ్జ మొకండు నీవ కా
వలసిన యర్థముల్ సలుపు • వాఁడవు మాదృశులైన వారికిన్.

తే॥ పితృపితామహులకెల్ల స • ద్గతులు గలుగ నస్మదన్వయము పవిత్ర • మై రహింప
హైమవతి నీశ్వరున కిచ్చి • యగ్నిసాక్షి కముగ బరిణయ మొనరింపఁ • గాఁదలఁచితి,

ఉ॥ ఆతిరుణేందు మౌళి యిట • కై యరుదెంచెడులోనఁ దన్మనః
ప్రీతి నెలంగునట్లనగ • రీరమ నింక నలంకరింపు మా
ఖాతరిళాయ మానవిల • సన్నవకీర్తి విశుద్ధదేహ నీ
చాతురి యెల్లఁ దెల్లమగు • చక్కన వక్రముగాగ నిప్పుడున్.

వ॥ అని సబహుమానంబుగా వస్త్రమాల్యానులేపనకనకాభరణాదులగు నుడుగఱ
నిచ్చిన బుచ్చికొని యిచ్చ మెచ్చుచు విశ్వకర్మ యమ్మల దొరపలుకులఁ దలకాల్చి
యట దరలి.

సీ॥ నిగనిగల్ గలమంచి • పగడాల సవరించి కట్టిన కుడ్య భా • గముల గములు
చలువరాల్మలచి ప • చ్చలఁ బొదిగిన మేలి పంచలమించు కం • బములడంబు
ముత్తెంపు చౌకట్ల • హత్తిన యపరంజి తూఁగుటుయ్యాలల • జోగములును
కప్పుమానికములఁ • గరగిపోసి బిగించి దట్టంబుజేసిన • కుట్టిమములు
కమ్మతావి కుమారమ్మ • క్రమ్మనటుల వట్టివేళ్ళ చాపలఁ దెఱఁ • గట్టినట్టి
యలరు తోరణగండ్లును • గలిగి మించఁ ద్వష్ట కైసేసె నోషధి • ప్రస్థమపుడు.

వ॥ మఱియును,

సీ॥ జలనిధివోలె ర • సాతల గంభీర పానీయ పరిఘా వి • భాసితంబు
కైలాసగిరి యట్లు • గగన భాగంబునొ రయు సుధాసితసాల • రంజితంబు

కరకరంబుగ బలె • నిరత చలజ్జల యంత్రసిక్తామలో • ద్యానయుతము
చంద్రలోకము భాతి • సతతసంతాప నివారకలలిత ప్ర • పాళిలితము
మదపదలికుల ఝుంకార • మంజులనుగు మల్లికా వల్లిక కరణి • మంగళస్వ
మోరుతర వేశ్మసంతాన • చారుతరము నైన యుపనగరంబందు • నలవరించె.

వ॥ వెండియు నయ్యోషధిప్రస్థంబునిరంతర హిమజలార్ద్రీకృతంబయ్యుఁ బ్రచండచండ కరకిరణ మండల ప్రకాండఖండిత తమోమండల స్ఫటికశిలా ర చితవిస్తృత వేదికా నిచయంబును, యాతాయాత సురచరణతలాఘ్రాత చూర్ణితహిమకందళంబయ్యు, రాశీభూత ఘనసారసంచయంబును, దిగంత పరివ్యాప్త వివిధశాఖిశాఖా సంతాన వినిక్షుజనభయంకరంబయ్యు, దిదృక్షులోక సమాహరణ నిపుణాగచిత కృత్రిమ పుత్రికా పరిశోభిత జన్యాశ్రయ చత్వర కుడ్యజాలంబును, తుహిన దుష్టంబయ్యు నిఖిలమునిజన కృతయజ్ఞవాటికా పవిత్రంబును, నానావిధచిత్ర శాలాలంకృతంబగుట భవిష్యద్గౌరీ వివాహోత్సవాగత దేవతావ్రాతసమాధ్యాసిత విమానసూచకంబును, కలశాబ్ధిమధన సమయమువలె భూతవితతి మహాఘోషబధిరీకృత దిగంతంబును, చంద్రశేఖరు నర్తన క్రీడకరణి సుధాపాండురాట్టహాసంబునై యొప్పె నంత.

మ॥ ధరణీధృత్కుల శేఖరుం డపుడు మో • దంబొప్పఁ దత్పార్వతీ
శ్వరు కళ్యాణమహోత్సవంబుఁ గను వాం • ఛన్ జేసి రానున్న కి
న్నెర విద్యాధర సిద్ధసాధ్య సుర సం • తానంబుఁ బూజింప సు
స్థిరులన్ గొందఱ నచ్చటచ్చట బ్రతి • ష్ఠించెన్ బ్రతిష్ఠార్థి యై.

—• విష్ణ్వాది దేవత లీశ్వరుని వివాహార్థమై యోషధిప్రస్థమునకు వచ్చుట •—

క॥ దామోదరుఁడును లక్ష్మియు దామరసోద్భవుఁడు శార • దయు దిక్పయముల్
భూమియు నాకాశంబును హైమవతీ పరిణయార్థ • మరుదెంచి రొగిన్.

సీ॥ ఇంద్రాది దిక్పాలు • రెల్ల మంత్రంబులు ద్వాదశాదిత్యులు • దానవులును
అశ్విను ల్వేదంబు • లఖిలపదంబులు స్తోత్రంబులును కుల • గోత్రములును
భాస్కరాదిగ్రహ • పంక్తియుఁ ద్వష్టయు నగ్నిహోత్రాదియా • గావళియును
వలవసిష్ఠుఁడు మొద • లైన మహర్షులు జంద్రుండు భగుఁడును • సంద్రములును
బదియునొక్కండ్రు రుద్రులు • బన్నగములు గరుడగంధర్వ సిద్ధ కి • న్నర పిశాచ
గుహ్యకాప్సరసాసాధ్య ము • ఖ్యులును వేడ్క నరుగుదెంచిరి తద్వివా • హంబుకొఱకు.

—• దేవకాంతలు పార్వతిని పెండ్లికూతుం జేయుట •—

వ॥ అప్పుడు.

మ॥ కరపద్మంబుల స్వర్ణకంకణ ఝుణ • త్కారంబు తోరంబుగా
సురసీమంతినులొక్క కొందఱు మహో • త్సాహంబునన్ దద్గిరీ

శ్వరు నాజ్ఞన్ దలయంటి రప్పుడు మకుర • ద్రాంచన్మణి ప్రోతసుం
దరపాత్ర స్థసుగంధితైలమునను • ద్వాహోక్తులన్ బల్కుచున్.

చ॥ స్ఫురదరవింద నేత్రయగు • సుందరి యొక్కతె లీలఁబచ్చ క
ప్పురఁపురజంబుతోఁ గలిసి • పాల్సెసలాడు హరిద్రచూర్ణమున్
సురుచిర హేమగాత్రయగు • క్షోణిధరాత్మజ మేననల్లు బె
ట్టై రుచిరతత్తనుద్యుతుల • కీవి కెలంకుల సంక్రమింపఁగన్.

మ॥ తళుకుం జెక్కులు చెమ్మగిల్లినవ ము • క్తాజాలముం బోనిచి
స్గలం బన్గొండలమీఁద ప్రాలఁ జివురా • కుం బోడి యొక్కర్తుక శీ
తలపంకేజ మరందమిశ్రిత విశు • ద్ధంగా జలాపూర్ణ ని
ర్మల కుంభంబుల నెత్తి స్నాన మొనరిం • పన్ జేసెఁ గాత్యాయనిన్.

తే॥ ఆస్యలావణ్య విజితమృ • గాక్షి యోర్తుక జిలుగు పావడము చెఱంగు • చేతఁబూని
కప్పుటానిగ్గులీనెడు • గట్లు కేని కూఁతు నెఱకలఁ దడియొత్తె • ప్రీతిఁ జెలఁగి.

సీ॥ తళతళలాడు క్రొ • త్త రంకబు జిలుగుదువ్వలువ నితంబ మం • దల వరించి
నిగనిగలాడు • పెన్నెఱులఁ జిక్కుడలించి చక్కని బాజిపూ • సరముఁ జుట్టి
గమగమ వలచు జొక్కపు జవాజి పొసంగు మలయజ గంధంబు • మైనలంది
చకచక ద్యుతి నధర • చంద్రు తేటహసించు మోమునఁ బెండిలి • బొట్టుఁబెట్టి
తరుణ కిసలయ మృదుల హ • స్తప్రకోష్ఠ దేశములఁ బారి హార్యముల్ • దీటుకొలిపి
లలితపదముల నూపురం • బుల ధరించి పరిణయోచితాలంకార • భరితయగుచు.

క॥ క్రొక్కారు మెఱుఁగుఁ దీవియ చక్కఁదనముఁ గెడఁపఁజాలు సకలవిధ మణీ
రుక్కలితమైన పీఠము నెక్కి కెలంకుల వయస్య • లెసక మెసంగన్.

చ॥ జిలిబిలి పల్కుఁ దేనియలు • చిందపదంబుల గజ్జెలందియల్
ఘులుఘులుమంచు మ్రోయఁ గర • కంకణ నిక్వణముల్ లయానుగా
ములయి తనర్ప వేల్పుఁ బువు • బోండ్లొక కొందఱు నాట్యసత్కళా
కలనమనోజ్ఞ లౌచుఁ గుతు • కంబున నృత్యముఁ జేయుచుండఁగన్.

చ॥ లలితమనోజ్ఞవాణి మహి • ళామణి యొక్కతె బాహుమూలకాం
తులు వలి గబ్బిగుబ్బ చను • దోయిరువాణముఁ బెంపఁ గేలుఁ ద
మ్మ్ల ల లత నూరగిల్ల మణి • పుంజవిమిశ్రితమై శశాంక మం
డలమువలెన్ సవృత్తమగు • నాడెఁపు ఛత్రము బట్టియుండఁగన్.

మ॥ అను కంపానిధి చంద్రశేఖరుఁడు ని • త్యానందపూర్ణాంగుడు
గఁను బాణిగ్రహణంబొనర్చునను హ • ర్షంబుత్కటంబై తన

ర్వ నిజాంతర్గత వాంఛమై కులుకు గు • బ్బల్ చంచలింపన్ సుధా
శన కాంతల్ సుమపేశలంబులగు పాణిం • చ చ్చామరాళ్వీవఁగన్.

తే॥ పద్మరాగమణిప్రభా • భాసమాన మగు కర కిసలయంబునం • దమరతరుజ
సూనమాలికఁ దాల్చి ప్ర • సూన ధన్వి జయ పతాకంబు నాఁగను • జయతనర్చ.

తే॥ ప్రౌఢ కుసుమ పరీమళ • భారజనిత మందగమనంబు గలదియై • మలయపవన
మంతరంగంబునకు నొక్క హాళిఁ గూర్చ విసనకఱ్ఱను గైకొని • విజయవీవ.

సీ॥ మువ్వేలుపులకీవ • మూలంబవగుదువు నీయాన జవదాఁట • నేరరెవరు
నిందిందుఁగలుగుదం • చీక్షింపఁ గలవారి కందందెకన్పట్టు • చుందు వీవు
అణువులలోపల • నణువువై స్థూలంబులందున స్థూలమై • యలరు దీవ
జనియించు నీ చరా • చర లోకజాలంబు నీ తలంచిన మాత్ర • నే తలంగు
వాది శక్తివీవ • యఖిలదాత్రివి నీవ భూతజాలమీవ • పుణ్యమీవ
నిన్నుఁ గన్నవారిఁ • గన్న దానవు నీవ సకల గుణమతల్లి • జగముతల్లి.

తే॥ అనుచు స్తుతిపాఠకులు కొంద • ఱభినుతింప జననియును,జనకుఁడు మది సంతసింప
దాసదాసీజనంబులు • త్సాహవృత్తి గొలువఁ గాత్యాయనీదేవి • తలపులోన.

మ॥ వడచక్కెలికపంగడీఁడు కరుణా • వారాశి రాకాసివం
గడఁ బుంగొంగ విసంబె యోగిరముఁగాఁ • గైకొన్న బల్దిట్ట పె
న్గడలిన్ దూణముగాఁగఁ దాల్చిన దొరన్ • గన్గొంట యింకెప్పు డె
ప్పుడొకో యంచు మదిన్ దగుల్కొనిన స • మ్మోదంబుతోనుండఁగన్.

—• శివుడు బాలుడై పార్వతి తొడలపై నాడుట. •—

సీ॥ పసిఁడిగుబ్బలి చేతఁ • బట్టుకొనెడివాఁడు బిచ్చమెత్తుకొనెడి • పేదవాఁడు
ఎట్టి సంబంధంబు • నేయెఱుంగనివాఁడు సృష్టిస్థితిలయమ్ముల్ • జేయువాఁడు
మునిమానసంబులే • మనికిపట్టగువాఁడు మసనంబులోపల • మసలువాఁడు
భూతసంతతిఁ దృప్తిఁ • బొందించుపనివాఁడు చేదువిషంబె భ • క్షించువాఁడు
నిర్గుణస్వరూపుండయి • నెగడువాఁడు త్రిగుణముల కాటపట్టయి • తిరుగువాఁడు
పెద్దపెద్దలఁ బుట్టించు • పెద్దవాఁడు శిశువగుచు సుమతొడలపై • జెలఁగినాఁడు.

చ॥ తనమాహాత్మ్యము సర్వమున్ సకల భూ • తశ్రేణికిన్ జూపు వాం
ఛ నిజాంతర్గత భూతభౌతిక జగ • జ్జాలుండు సన్మానిగా
జ్ఞన హృత్పంకజ సౌధమధ్యచరుఁడీ • శానుండట్లుల్ శైశవం
బునఁ జెన్నారెడి యర్భకుండగుచు వే • ల్పుల్ సంభ్రమంబందఁగన్.

చ॥ కిలకిల నవ్వు నొక్కపరి • కేకలు వేయు మఱొక్కవేళ బా
హులు బయికెత్తి యెత్తుకొను • డో యని యొక్కతఱిన్ నిజాంగకం
బులఁ గదలించు నొక్కపుడు • పూనిక మీఁదికిఁ బ్రాకుఁ జూపఱుల్
కలఁతవడంగ లోకములఁ • గన్న దునీఁడొక చిన్నిపట్టిఁడై.

క॥ కనుఁగొనఁ గర్మేంద్రియములకును జ్ఞానేంద్రియములకును • గూడ దెలియకుం
డినయట్టి చిత్రమప్పుడు కనుఁగొని భ్రాంతివడి యచటఁ గలవారెల్లన్.

మ॥ కలయో నిక్కవమో మతిభ్రమణమో • కాల స్వభావంబొకో
ప్రళయాభీలలలాటలోచన శిఖి • జ్వాల స్ఫులింగప్రభా
కలితుండై నటియించు రుద్రుని యభిం • గంబైన యంశంబొకో
పలుకన్ రా దిదమిద్ధమంచు నిపుడ • ప్రంబయ్యెడున్ జూడఁగన్.

తే॥ అని యవేన్యమయిన త్రిపు • రారి మాయ నెఱుఁగఁగాలేక భయమున • నెల్లవారు
నిశ్చయ జ్ఞానశూన్యులై • నిండుకొనిన సందియంబున నుండఁ బు • రందరుండు.

చ॥ అదితికుమారు లెప్పు • డమృతాంధసులున్ శితికంఠు నాజ్ఞచేఁ
బొదలెడువారనొట, రణ • భూమిని వారిజయించు నేర్పులే
క దనుజు లెట్టులో సురల • కజ్జము భంగము జేయఁజూతు రి
య్యదియును నట్టిదేయగు య • థార్థము సంశయమేల మీకికన్.

మ॥ అనుచున్ గన్నుల నిప్పుకల్ సెలఁగ దీ • ప్యచ్ఛేషదర్వీకరా
నన సంజాత మహావిషానిలనితాం • తక్రూర నిశ్వాస కృ
ఘ్ననతామ్రాస్యుఁడునై సమస్తగిరి ప • క్షచ్ఛేదకంబైనప్రా
దినిఁ బైకెత్తెను కైతవార్భకుని ఛే • దింపంగ నుంకించుచున్.

— కపట బాలుండగు నీశ్వరుని దండింపఁబోయి వేల్పులు పరిభవింపఁబడుట —

మ॥ చను బాల్యాద్రి వెడు చిన్నపాపఁడనుచున్ • స్వాంతంబు నందించుకై
నను వాత్సల్యము లేక యవ్విధి శచీ • నాథుండు కోపించి పా
పనిపై క్రూరమహీధరప్రకర శుం • భత్పక్ష సంతాన దు
ర్వనదావానలమైన వజ్రగతి సం • భావించు టహంబొకో.

తే॥ క్రోధవిస్మృతదేహుఁడై • గోత్రభేది యటుల నబ్బాలుని వధింప • నరసెఁగాని
కరముతోడన కులిశంబు • కదలదయ్యె హరుని మాయల నెఱుఁగ నెవ్వరికిఁదరమె.

వ॥ అంత నప్పురందరుండు బలవదుద్దండ మదవదరాతి నిశాటోరః కవాట విపాటి
నోద్భవత్కవోష్ణ రుధిర వమథుప్రకరాంకిత సర్వాంగ సుందరంబును, విచలత్కుల
పర్వత గర్వనిర్వాపణాఖర్వ తేజోకుంఠితంబునగు వజ్రాయుధంబుతోడ శాత్రవాప

హృత/స్వర్లక్ష్మీ సముద్ధరణ దక్షంబగు దక్షిణ హస్తంబు స్థంభీ భూతంబగుడు చింతాకుల స్వాంతుండై కర్తవ్యంబుఁ గానక కుందుచుండఁ దక్కటి వేల్పులెల్ల రక్కసిమిగిలి యిమ్మొక్కడి టక్కరి పాపని జక్కడి నీయెదఁ బిక్కటిలు నలుక దలఁగింతుము నిలుమని యాఖండలు నూరడఁ బలికె.

సీ॥ అనలుండు శక్తియు • యముఁడు దండంబును • కౌక్షేయకంబును • రాక్షసుండు వరుణుండు పాశంబు • ధ్వజయష్టి ననిలుండు నిందుండు గదయు య• క్షేశ్వరుండు దండముఁ గంగాధ • రుండు శూల మినుపగుదియల వసువులు • క్రూరములగు ముసలము లాదిత్య • విసరంబు రుద్రులు పాశుపతంబులఁ • బరఁగఁబూని

మారిఁ దాల్చిన క్రోధంబుఁ • బోలె దుర్నిరీక్ష్యమాణాంగులగుచు ని • ర్నిద్ర తేజు లై కపటబాలునపుడట్టు • హాస మొప్పఁ గొట్టఁదలఁచుటయును జేతు • లట్టె నిలిచె.

తే॥ అనికరము మించి కరణాశ్వముల నాఁగఁజాలి పరమతత్వ • సంగతిఁగొని యలరు మునిమనంబు • వలెఁ గదలకయున్న దమకరాస్త్రములను • దలఁచియపుడు.

క॥ సురలు పరితాపమొందిరి ధరణీధర వల్లభుండు • తల్లడపడియెన్ సిరిజాతపలుకదయ్యెను పరమర్షి నికాయ మబ్ర • పడి రవ్వేళన్.

క॥ తనయగ్రియుండు మున్నగు ననిమిషు లెల్లరుఁ బరాజ • యంబుఁగనుటఁ గ న్గొనియును వీఁగక వెన్నుఁడు కనలుచు సింహారవంబు • గతి నిట్లనియెన్.

ఉ॥ వీఁడొక దుశ్చరిత్రుఁడగు • వేంగలి రక్కసియో మరొంటుగా రోడకుఁడెల్ల మీరు చ • టులోగ్ర మదీయ సుదర్శనాహతం బై డయుమాన పక్షి నివ • హంబవ నీతని యుత్తమాంగముఁ జాడుఁడు చెండిపైచెదను • సోకుడు మూఁకవితాకుఁ జెందఁగన్.

వ॥ అని గంభీరంబులగుఁ బౌరుషవాక్యంబులాడుచు వికటాట్టహాస భాసురాస్యుండై.

సీ॥ శిశుపాల కంఠవి • చ్ఛేదనంబుఁ గావించి సార్థకంబయ్యెనే • యాయుధంబు కైటభదానవ • గర్వభంగ మొనర్చి చతురతఁ గాంచెనే • శస్త్రవరము కంసరాక్షస గర్వ • ఖండనంబొనరించి ప్రథను వహించెనే • ప్రహరణంబు మధుమత్త కుంభికుం • భ విదారకంబయి యభినంద్యమయ్యెనే • యస్త్రరాజ

మఖిల సురవైరిగోత్ర సం • హారకారి యనిశవిజయ రమోప గూ • హన పవిత్ర మట్టిచక్రం బవక్రమై • యలరు దానిఁ గపటబాలునిపై బ్రయో • గంబు జేసె.

మ॥ ధరణీచక్రము దిద్దిరం దిరిగె ది • గ్దంతుల్ చలించెన్ ధరా ధరముల్ నేలకు మట్టమై పడియె భూ • త వ్రాతముల్ పాఱిపో యె రహిన్ సంద్రములెల్లఁ గ్రాఁగెఁగుల ల • య్యెన్ దారకల్ భ్రామ్య ద క్షర కల్పాంతకృతాంత తుల్యమగు త • చ్చక్రానల జ్వాలకున్.

వ॥ అట్లు ప్రయోగింపఁబడి సమస్తప్రాణికోటి భయంకరంబును, దర్శనమాత్ర భస్మీ
కృత సకలలోకానీకంబును, నిర్వక్ర పరాక్రమ క్రమవిజిత నిఖిలారాతి చక్రంబగు
విష్ణుచక్రంబు వక్రంబై పంచాస్య దర్శనంబున వంచితంబగు నమాంస జరన్మాతం
గంబు కరణి శిశుచ్ఛద్మ సమాగతుండగు పురహరుని దరియ వెఱచి గిరుక్కునఁ దిరి
హరికరంబుఁజేరి హస్తంబుతోడ నచేతనంబు మాడ్కి స్థిరంబగుడు వెన్నుఁడు
ఖిన్నుండై చెన్నుఁదొఱఁగి తమాలతరు భ్రమావహంబగు శ్యామలతనూవిలాసంబు
పరిహాసావాసంబై భాసురంబుగాక ఝంఝూవాతవిధూతంబగు ధూమరేఖం బోలెఁ
జలించుటయు, గాంచి సురజ్యేష్ఠుండగు నప్పరమేష్ఠిదృష్టి నిగుడించి దుష్టదానవా
నిష్టదాయకుండగు విష్టరశ్రవసుండే నష్టచేతసుండగుటకు విస్మయంబు నొంది.

సీ॥ సోమకుఁ జెండాడి • శ్రుతిచయంబును దెచ్చుతఱిసైనఁ దన చెన్ను • దొఱఁగలేదు
కడలి ద్రుంగెడుతఱి • గట్టుబూనెడుపట్ల గొంతైనఁ దన లావు • గోలుపడదు
పసిఁడి కంటి తులువ • ప్రాణముల్ గొనువేళ • నింతైన మదిని గొ • అంతఁ గనఁడు
కనక కశిపుమేను • ఖండించునపుడైన నలసుఁడైయిట్టు లా • యాసమొందఁ
డెందు నపజయమనుమాట • యెఱుఁగఁబోఁడు భక్తసంతతి నెల్లఁ గాపాడువాఁడి
దేటిచోద్యంబొకో యొక్క • పృథుకనికయు హీనబలుఁడయ్యెఁ బుండరీ • కేక్షణుండు.

—• కపటబాలుం డీశ్వరుండని యెఱిఁగి బ్రహ్మాదులు స్తుతించుట •—

క॥ అని విస్మయ సంభ్రమములు నినుమడిగా మనమున నొక యింత దలఁచి య
వ్వనజజుఁడు దివ్యదృష్టిఁ గని యబ్బాలకుని హరుని • గాఁ దెలిసికొనెన్.

క॥ పెనుగాలి సోఁకి వీడిన ఘనసంచయమటుల దెలివి • గలుగ నవిద్యా
జనిత భ్రాంతి తొలఁగిచన వనజభవుఁడు భక్తివినయ • భావం బెసఁగన్.

తే॥ అష్ట దిగ్గజంబు లట్ల నిఖిలలోక కారణంబులైన • కరము లెనిమి
దపుడు జోళ్లుగాగ • నమరించి ఫాలమందునిచి యవ్విధమున • వినుతిఁజేసె.

సీ॥ బుద్ధిమీవ జగంబుఁ • బుట్టింప రక్షింపఁ గిట్టింపజాలిన • దిట్టవీవ
గుణములీవ నిఖిల • గుణిగణ కృతనుతి మణిమయాభరణ కా • రణుఁడవీవ
శ్రుతులీవ సతత వి • శ్రుతి గని చిచ్ఛక్తి నలరారు యోగిమం • డలము నీవ
భూతంబు లీవ ని • ర్ధూతాత పాతకచయోపేతమా భౌతిక • వ్రాతమీవ
యష్టదిక్కులీవ • యాదిమధ్యావసానంబులీవ కార • ణంబవీవ
కార్యమీవ మమ్ముఁ • గన్నవాఁడవు నీవ యట్టినీకు దండ • మయ్య దేవ!

మ॥ అమరానీక సమర్చితాంఘ్రియుగ ని • త్యం తే నమోయంచు నా
గమ విల్లోకశరణ్య పాహితవ భ • క్తం మామటంచున్ క్షమ

స్వ మనోజాంతక మత్కృతాన్యఖిల పా • పాన్యంచుఁ బ్రార్థించుచున్
సుమనోభీష్టద నిన్నుఁ గొల్తు నెపుడున్ • సోమార్ధ చూడామణీ!

అరయ సవ్యాపసవ్యంబు • లైన నీ కరాబ్జములనుండి నేను నా • రాయణుండు
జననమైతిమి ప్రకృతి నీ • జాయయగుచు రహిఁ జెలంగెడు లోక కా•రణ మహేశ!

నీయనుగ్రహమున • నీ యమరవ్రాతమును సృజించుచుందు • మూఢులగుచు
నీదు మాయఁ దెలియ • నేరక వీరు నీ కపకృతిని బొనర్చి • రఘమునాక.

కదలవు బాహువల్లికలు • కంఠగతంబులె యయ్యెఁ బ్రాణముల్
లొదలదు వన్నె యించుకయు • మోమున నస్త్రములల్లె నిల్చిహో
యెరొజఁగె సత్వమంగముల • నీశ్వర నీ కహితంబొనర్ప నీ
యదితి తనూజులెల్లరు ద • యామతి వీరలఁ బ్రోవుమా యిఁకన్.

తనయులు తెల్విలేక యొక • తప్పిదముం బొనరింపసైపరే
జనయితలైనవార లిది • శాస్త్రవిరుద్ధమె సాపరాధులై
నినుఁబహరింపఁబూనుకొని • నిర్జరు లాత్మవినాశమందిరో
యనఘ యనుగ్రహించి యిఁక • నైన క్షమింపుము మాయకృత్యముల్.

అనుచున్ సన్నుతిఁజేసి మ్రొక్కి హర మా • యాపాశ బద్ధాంగులై
న నిలింపప్రకరంబులన్ గని జగ • న్నాధుండు లీలాకృతిన్
జనుదెంచన్ దెలియంగలేకిటువలెన్ • స్థైర్యంబు వోనాడి చే
సిన నేరంబు సహింపుమంచు వినుతుల్ • జేయుండు లోకేశ్వరున్.

అని వనజాసనుండు, వినయంబునఁ బల్కనఁ గాంచి పాకశా
సన ముఖ నిర్జరుల్ స్వబల • సంతమ సాంధమునైన స్వాంతమున్
వనజభవోక్తి దీపమునఁ • బ్రాజ్ఞము గా నొనరించి కౌతుకం
బున శిశుకైతవాగతుని • భూతపతిన్ వినుతించి రీగతిన్.

జ్ఞానవేద్యాయ కాం • చన శైలచా పాయ నిఖిల స్వరూపాయ • నిర్గుణాయ
కాలకాలాయ మో • క్ష ప్రాప్తి హేతుభూతాయ సర్వాంతర్గతాయ నిరత
వందారు సందోహ • మందారకల్పాయ బృందారకానీక • వందితాయ
చంద్రసూర్యాగ్నిలో • చన దీపితాస్యాయ గంగావిమలభంగ • సంగితాయ
హీనపాండురవర్ణాయ • దుష్టదైత్యమండల విఖండనాయ వే • ధోండజాత
ఖండనాయ శేషోరగ • మండనాయ మారమారాయ తుభ్యం న • మోస్తు భవతే.

అని యనేక విధంబుల సునాశీర ప్రముఖు లప్పినాకిని గుణభూతంబులగు పురాణ వచనంబులచేతను నసంఖ్యాకంబులైన సంఖ్యావద్విహిత సాంఖ్యవాక్యములతోడను నతి గుహ్యంబులగు గుహ్య నామంబులకతనను మఱియుఁ బెక్కురీతులుగను వినుతిఁ జేసి వెండియు.

వందనంబిదె శర • దిందు సుందరకళా • భాజదయణ జటా • పటల నీకు
వందంబిదియె చల • చ్ఛుండా ప్రచండ వేదండ రాక్షసవధో • ద్దండ నీకు

సుతియుగ సతత వి • నుత నతాశ్రితలోక తత మనోరథదాన • చతుర నీవు
జ్యోత్స్నాదియై బస • న్నీహార వదహార్య శైలసంచార వి • లోల నీవు
వినుతియుదియై సనాతన • మునిమనోబ్జ జనిత మధురరసరంగ పా • న నిరత ప్ర
మత్తమధుపాయమాన • సన్మాన్య నీవు శరణిదియె గొను పన్నగా • భరణ నీవు.
తే॥ అనుచు వివిధవిధంబుల • నమరవరగణములు సన్నుతిఁ గావింప • నాత్మ మెచ్చి
యనిమిషులకు యథాపూర్వ • మైన శక్తి నలవరించి త్రిపుర వైరి • యాక్షణంబ.

—• ఈశ్వరుఁడు బ్రహ్మాదులకు విశ్వరూపము జూపుట •—

సీ॥ కమలాప్తకోటి సం • కాశమై దుర్నిరీక్ష్యంబైన దివ్యతే • జంబు మెఱయ
నానాస్త్రపాతిల గగ • నాంతమై వింతదై యంతంబులేక దే • హంబు వెలుఁగ
దశదిక్కుచ్ఛిత్తి వి • దారకంబులగుచు నలవోక బాహుశా • ఖలు రహింపఁ
కాలకాదంబినీ • కల్పంబులై ధూమ పటలంబు నాజటా • భాగమలర
శేషతక్షకసల్ పాదమం • జీరములుగఁ బ్రళయనాయువుటార్పులై • పరిధనిల్ల
గిబ్బవార్వంబుపై నెక్కి • కృత్తివాసుఁడగుచు నిజరూపమూని ప్ర • త్యక్షమయ్యె.
తే॥ అటులఁ బ్రత్యక్షమైన యా • యత్యంధకారి దివ్యరూపంబుఁగని యుమా • దేవియలరె
బ్రాగచల శృంగదేశ వి • భ్రాజదరుణకరనికరసంగతయగు న • క్కమలినివలె.
తే॥ అని వచించి శౌనకాద్యఖిలమౌని చంద్రు లిమ్మడియైన యు • త్సాహము మెయి
వివిధసత్కథావేదియై • వెలయు రౌమహర్షణిని శేషభాగంబు • నడుగుటయును.
మ॥ పురదైత్యత్రితయ ప్రతాపవన సం • పూర్ణాగ్ని దేవాయమా
న, రమానాయక ముఖ్యదేవ మకుటాం • తః ప్రోత నానామణి
ప్రరుచి ప్రాపిత దివ్యకాంతి విలస • త్పాదాబ్జ శోభాయమా
న, రవీంద్వగ్ని విలోచనాశ్రిత సదా • నందాయ మానప్రదా!
క॥ దక్షాధ్వర హారి దైత్య విపక్షా! …గమౌని వినుత! • పన్నగవలయా
సుక్షిస్థాఖిలలోకా • రక్షితబుధ వితతిపాండ్య • • గాఢమహిత్పపతీ.
క॥ అనవరత భక్తలోకావన దీక్షాకలితపాండ్య • పాల సుతాహ్వా
ద్వనజాహస్కర మామక ఘన లింగపురాణ రక్ష • కాసోమేశా.
తే॥ కష్టపడి పెంచియిడితి నా • కవితకన్నె నెన్విగ్రహంబున నలంతో • యింక మీఁద
గంగవోలెను గయ్యాళి గాదు బేలసుమ్ము నీ గలనెక్కి • నాట్యమ్ము సేయ.
సీ॥ ఏ మహామహుఁడు శ్రీ • వేమనారాధ్య వంశాబ్ధికిఁ బూర్ణశ • శాంకుఁడయ్యె
నే తల్లి సావిత్రి • కేనగ్గె సతుల్ మెచ్చ మహిని పాతివ్రత్య • మహిమఁగాంచె
నట్టి నందయను గా • రముకు ద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందు నకు సోదరుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మదీ • యమగు శ్రీమదాంధ్ర లింగపురాణోత్త • మార్థమందు
నలరు తొల్లిటి యాశ్వాసమయ్యెఁ దీని సతము రక్షించుఁగావుతఁ జంద్రమౌళి.

——:(0):——

శ్రీ మీనాక్ష్యైనమః

# శ్రీమదాంధ్ర లింగపురాణము

—:(0):—

## — ఉ త్త ర భా గ ము —

### ద్వి తీ యా శ్వా స ము

క॥ శ్రీ మన్మధురాపురవరధామా! తుహినకరపార • దపటీరల స
ద్ధామా! రజతాద్రిశిఖర ధామా! శ్రీసుందరేశ • తారకనామా!

వ॥ అవధరింపుమా నైమిశీయులకు రోమహర్షణి యిట్లనియె.

తే॥ అఘవినాశకరంబు భ • క్తావన చతురంబు నగు నీకు దివ్యరూపంబుఁగాంచి
పెండ్లికై యరుదెంచిన • పిన్నపెద్దలండఱును సంతసించిర • య్యవసరమున.

శా॥ లీలామానుషవిగ్రహుండు శ్రుతికే • ళీ లోలుఁ డాపన్న స
త్త్వాళీ రక్షకుఁ డంధకాసురభుజా • హంకార నాశక్రియా
శీలుం డిందు కళావతంసుఁడగు నా • శ్రీకంఠుని న్గాంచి య
బ్జాళీక ప్రభవుండు బల్కె నిటు లా • నందంబు వింద్దై తగన్.

—• బ్రహ్మ దేవుఁడు శివునితో గార్హపత్యము గొనుమని వేడుట •—

శా॥ దేవా తావక పాదపద్మముల భ • క్తిన్ గొల్చు భాగ్యంబు మా
కీవేళన్ లభియించె మాదృశులెం లే • రీ రేడులోకంబులన్
దావాగ్నిప్రభవోలెఁ గాల్చెడి మన • స్తాపంబు జల్లారె నీ
యీ వాత్సల్యము సంతతం బిటులె మా • కే వెచ్చపెట్టంగదే.

ఉ॥ సర్వజగంబులన్ బెనుపఁ • జాలిన నేతవు నీవు శక్తియున్
బర్వతరాజపుత్రియయి • భాసిలుచున్నది భూతగత్క్షణం
బుర్వరమీ యధీనమయి • యుండెడుఁగావున నాలసింపకో
శర్వ యుమాకరగ్రహణ • సంగతి లోకహితంబుఁ గూర్చుమా.

చ॥ గొనముల కాటపట్టు సుర • కోటికి విందులఁ బెట్టు బెట్టు, జీ
వనతరురాజికిన్ మనికి • పట్టు, మెఱుంగులమించు రత్నఁపున్

గనులకుఁ బుట్టునట్టు సరి • గట్టులకున్ బెనుచెంప బెట్టు చ
క్కని సుతఁ బెంచి ముచ్చటలఁ • గాంచిన యీవలిగట్టు, మామయా.

సీ|| పసిఁడి మసాలలు విం • పెసఁగఁదాల్చుదు నీఁడు వెనువెంట లెంకయై • పేరిమిఁగ
వెలుచఁ దొమ్మిదిపాత • రల ధనంబుగఁ దాఁడు కెడ దోడునీడయై • క్రీడసల్ప
నిలఁ దాల్చు మొనకాండ్ర • కెల్ల నోజ్జయయి చెన్నలరునాతఁడు కాలి • యందెగాఁగ
నెల్ల వేల్పులకు సం • తృప్తిఁగూర్చెడు దొరతావులీనెడి తల • పూవుగాఁగ
శ్రాంతపల్కులుమించు వాం • ద్యములు గాఁగఁ బూనిక నవ్వెండికొండఁ గాం • పురముఁజేయు
నట్టి మొనకాఁడె తనకొక • యల్లుఁడగుట మలలరాయని పున్నెంబు • ఫలముగాదె.

ఉ|| భూనుతమైన గోత్రమునఁ • బుట్టుకఁ జెంది కరంబు శంకర
ధ్యాన సమాధినొంది సము • దంచిత శీలముగల్గి యుత్తమ
జ్ఞానమె మోక్షసాధనము • గా నుతిఁగన్న సతీమతల్లికిన్
బూనికఁ జెట్టఁబట్టఁగల • పూరుషుఁడేకద పూరుషుఁడిలన్.

సీ|| జనకుఁ డాజీవనా • పదరత్నరాశియై తనరారు భూమి భృ • త్తల్లజుండు
తల్లియా తెలిగంటి • తలిరుబోండ్లను నెల్ల విందులుసేయు సా • ధ్వీమతల్లి
భ్రాతయా కుశల సం • ధాతయై యిందిరానేతయై తగు పురు • హూతుభ్రాత
చెలియా యహితచక్ర శి • క్షాక్రమవిధాన సూరియై యలరు రా • జునకుఁ జెలియ
లాటపట్టులో సకల మహర్షి హృదయ సౌధములు వాహనంబు వృ • గాధిరాజ్య
సమభిషిక్త పంచానన • స్వామియట్టి కన్నె దొరకుట వరుని భా • గ్యంబె కాదొ.

క|| పురుషుండవీవు గిరిజా తరుణీమణిప్రకృతిమీక • తగి దాంపత్యం
బు రహించు మీరలె చరాచరలోకమునకు జననియు • జనకుండరయన్.

క|| అని పలువిధములఁ బల్కినఁ గని యంగీకార సూచ • కముగ శిరశ్చా
లన మొనరించెను శంకరుఁ డనఘులు సమ్మతిని దెల్పు • టట్టులనె కదా?

తే|| అంత నజుఁడు సంతోషితస్వాంతుఁడగుచుఁ బాక శాసనపావక • ప్రముఖ నిఖి
దిక్పతులు వెంటరా వేల్పు • తెఱవ లెల్లఁ జెలువు చెలునార నాటపాటలనొనర్ప.

సీ|| శైలజాపరిణయో • త్సవ మెఱింగించుఁ బాంచాలికల్ గలకుడ్య • పాళి మెఱయ
ముక్కంటికథల ని • మ్మగఁ జూపఱకుఁ జెప్పకయ చెప్పఁ • గలనాటకములు వెలయ
నగరాజు నౌన్నత్య • ము గరిమనలవోక తెలిపెడి ప్రాకార • ములు తనర్పఁ
బరిణయాగతబంధు • వాస యోగ్యమని సూచించు గవాక్షముల్ • చెలఁగుచుండఁ
బలువిధంబులఁ బెండ్లి పె • ద్దలకు నెల్ల హెచ్చరికఁగూర్చు మందిరం • బేర్పరించి
సవతొకించుకలేక యు • త్సాహవృత్తి నిందుశేఖరునఁట విడి • యించెనపుడు.

—॥ శివుని వివాహదర్శనంబునకై నానావిధ దేవతలు వచ్చుట ॥—

సీ॥ వినతయు సురస సా ॥ విత్రి సుకాలిక దితి వేదమాత య ॥ దితి పులోమ
బుద్ధియు బుద్ధియు ॥ వృద్ధి సరస్వతి భరణీసుహాస్వాహా ॥ దక్షిణలును
శాంతియును చేల॥ నారాయణియు రాకయనుమతి శచియు మా॥యయును మతియు
సిద్ధి సినీవాలి ॥ సింహిక రజనిక ధ్రువు దనుస్వాహలు ॥ దుర్గయు సుధ
తలప నిరువుర్వురగు కృత్తి ॥ కలు వసిష్ఠపత్ని మున్నగు వృద్ధసు ॥ వాసినులును
బ్రమథు లష్టవిభూతులు ॥ భవుని పెండ్లిఁ గాంచ నరుదెంచి రాహిమ ॥ క్ష్మాధరంబు.

తే॥ దేవలోకంబునందెల్ల ॥ ద్వీపములను గలుగు నైదువలైన కాం ॥ తలు చెలంగి
యద్రిజా శంకరుల వివా ॥ వాహంబటంచు నరుగుదెంచిరి సంతోష ॥ భరితలగుచు.

తే॥ వటులు హుంకారమును బ్రణ॥వంబు మఱియు సపరిచారికలైన య॥చ్చరలు చరులు
గణపతులు బ్రతీహారులు ॥ తక్కంతమించి వచ్చిరప్పుడవ్యోమపథి ॥ ప్రస్థమునకు.

—॥ ప్రమథగణము లీశ్వరునకు కానుకలు దెచ్చుట ॥—

చ॥ చిలువకొలంబు లొరంగయి ॥ సేసి కటిక్ బులితోలు గట్టి యా
దలశశిరేఖఁ దాలిచి యె ॥ దక్ రుదురక్కలఁబూని ముమ్మొనల్
గల యడిదంబుఁ బట్టి తిగ ॥ కన్నులుగల్గినయట్టి యూర్ధ్వరే
తులయి చెలంగువారు ప్రమ ॥ థుల్ చనుదెంచిరి మంచుకొండకుక్.

సీ॥ జలుగుబంగారు ని ॥ గ్గుల బిసాళించుఁ బట్టంచు దోవతిని ధ ॥ ట్టించికట్టి
నిడుదకేలుంగవ ॥ గుదుగుదైదువు తెలిమురువుగల్గిన వల ॥ ముఱియుఁ దాల్చి
దళమగు నెలతాలి ॥ పలకె నాదగు పేరు రమ్మునఁదులసి పే ॥ ర్లను ధరించి
నెడదదియై కల్వల ॥ విందుగాదను మోముసం దూర్ధ్వపుండ్రంబు ॥ నలవరించి
తూర్పుదోఁటి బువ్వఁగైకొన్న ॥ నేర్పు కానిఁ దత్తడిగనెక్కి కొన్ని ర॥త్నములు సరులు
పసిఁడి దుప్పటములు గొని ॥ యెసకమెసఁగ వైష్ణవోత్తముల్ కొందఱు॥వచ్చిరపుడు.

సీ॥ పదికేక రాక్షసుండు ॥ పారియాత్రికుఁడు తొమ్మిది విద్యుతులు నెనిమి ॥ దివిశాఖుఁ
డఱువదినాలుగు ॥ నభిలాంతకుఁడు వికృతాననుండును నా ఱు ॥ నమలమతిని
సందారకుండాఱు ॥ సమదుండు నేడు నెన్మిది దుందుభుండు నె ॥ నిమిది గణప
విష్టంభులును వేయు ॥ పిప్పలసన్నాదు లావేష్టను లెనిమి ॥ దాగ్నిముఖుఁడు
కోటియాగ్నిసుఁడును నూఱు ॥ కోట్లుకుండి పర్వతకులు పంద్రెండు క॥పాలి రైదు
రత్నములఁగొని శంకరా ॥ రాధనకయి సంతసంబునవచ్చి రా ॥ శైలమునకు.

సీ॥ కాలకాలకమహా • కాలురు నూఱును గుముదుండు కోటియుఁ • గోటికోట్ల
కోకిలుండు సుమంత్ర • కుండమోఘుండును నలరు సంతానకుం • డాఱుపదుల
పింగళుండును మధు • పింగుండు తొమ్మిది యఱువది కాక పా • దాహ్వయుండు
నఱువదియును నాల్గు • నలనిరూపాక్షుండు వీరభద్రుండును • నిమలమతులు
కుంభకుఁడు కండకుండును • గోటికోట్లు కరణుఁ డిరువదిశతమన్యు • కాష్టకూట
మేఘమన్యు పంచాక్షులు • మేలురకమః మణులు నఱువదినాల్గు సం • భ్రమమెసఁగ.

వ॥ మఱియుఁదాళకేతు పంచాస్య షడాస్య సావర్త లకులీశ చైత్ర లోకాన్తకదీప్తాస్య దైత్యాన్తక మృత్యుఘ్నకాలఘ్న మృత్యుంజయ భృంగిరిట్యాదు లఱువదినాల్గు రత్నములును గొనివచ్చిరపుడు.

ఉ॥ పంకజనేత్ర యొత్తుఁగ హిమ • భానుమయూఖ మనోజ్ఞమాపినా
కాంకుని మేనఁ గేలుఁగవ • యర్ జివురాకులు చెమ్మగిల్లఁగాఁ
గుంకుమ పంకిలంబయిన • గోవ జవాదియలంది మంచు నీ
ర్వంకలు బార స్నానము గా • రంబొనరింపఁగఁజేసె జేసినన్.

తే॥ నిగనిగని రంగులఁ బొసంగు నిద్దమైన పాము కుబుసంబు వన్నె దు • ప్పటములోఁ
మెల్లమెల్లనఁ దడియొత్తి • మృత్యుహరుఁడు గొమరుటెలబ్రాయపుం బెండ్లి •
[కొమరుఁడయ్యె

మ॥ సుముహూర్తంబది దగ్గరించుటయు షు • శ్లోకుండు వాణీధవుం
డమరానీకమువంకఁ జూడఁ గని వా • రత్యంత సంతోషసం
భ్రమముల్ మీఱ నిశాత శృంగదళితా • భ్రంబై ధ్వనత్కింకిణీ
సముదంచన్నినదావదారిత దిశా • చక్రంబునై మించుచున్.

—• శివుఁడు వివాహ మంటపము సమీపించుట •—

ఉ॥ శారద చంద్రచంద్రికల • చక్కదనంబుఁ దిరస్కరించి నీ
హారపటీర పారద సి • తాభ్రచయంబు బెడంగుమాపి వి
స్ఫారితమై నిజద్యుతి న • భస్థలిముట్టి వెలుంగు దత్ప్రతీ
హారిని నందికేశ్వరు • దయానిధి వేఁగొని తెచ్చి నిల్పినన్.

చ॥ నిలుపుటయున్ బ్రమోదమున • నిర్జర నిర్ఝరిణీతరంగ సం
కలిత శిరోరుహుండు శితి • కంఠుఁడు తా దరహాస చంద్రికల్
నలుగడలన్ జెలంగఁగఁ గ • నత్కల ధౌతగిరీంద్ర శృంగమున్
దెలిమొయిలట్ల నెక్కిన స • దృగ్విభవుండయి యాక్షణంబునన్.

శా॥ ఆవేళన్ మదిఁ గోర్కు లుప్పతిలఁ గా • న య్యోషధిప్రస్థ కాం
తావారంబు నితాంత వైభవపరీ • తద్వార దేశంబునై
భావింపన్ గనువిందొనర్చెడు గృహ • వ్రాతంబుఁ గైసేసి తా
రావేశంబున రాజవీధి జను చం • ద్రార్ధావతంసున్ గనన్.

—• పౌరకాంతలు శివుని జూచుట •—

చ॥ ఒక పరమాణుమధ్యమ • పయోధరయుగ్మ మలంకరించు పూ
నిక నొక గుబ్బచంటిపయి • నీటుగఁ గస్తురిచుక్క దిద్ది వే
రొక చనుబంతి దిద్దకయ • యువ్విళులూరుచు వచ్చె రాజ వీ
ధికి స్మరగము త్రికచాపము గ • తిన్ శశి మాళిని గాంచు వేడుకన్.

చ॥ చెలియొక కల్కి పూరుప వ • శీకరణౌషధమూనె నాఁగఁ గ
జ్జలమొకకంటఁ బెట్టి యొక • చక్షువునం దిడఁబోయి తోడివా
రలు పరువెత్తి తారె యుడు రా • జధరున్ గొనిరంచు సంభ్రమం
బలరఁగ నేగుదెంచెఁ బరి • హాస మొనర్పఁగ నెల్లవారలున్.

చ॥ అరవిరి మల్లెదండఁ గుటి • లాలక దేశముపై నమర్చి క
స్తురి గళమందుఁబూసికొని • సూనపరాగము మేనఁదాల్చి శం
కరుఁడను నేనె చూడుఁడని • కామినియోర్తునొక పల్కెఁ దన్మనో
హరుఁ డదిగాంచి నే నెవఁడ • నొ దునొకోయని సంశయింపఁగన్.

చ॥ హరుఁడదె క్రొత్తపెండ్లికొడు • కై కనుపండువుజేయు గంటిరే
తరుణులు మీరటంచు వని • తామణి యోర్తుక పల్క దక్క సుం
దరులెటు చూపవేయని య • భా యధలై కనరాని కొనులున్
గురుకుచ కుంభముల్ గదల • గొబ్బునవచ్చిరి రాజవీధికిన్.

చ॥ స్మరశరతాడనక్రియకుఁ • జాలక పల్లవుఁ డొక్కరుండు భా
సుర సుమపేశలాంగయగు • సుందరి నంకతలంబుఁ జేర్చి త
ద్వర మధురాధరోదిత సు • ధారసమానెడు వేళ రాజశే
ఖరునిదె కాంచివత్తుసని • కాంత చనెన్ బతి తత్తరం పడన్.

చ॥ ముగుదయొకర్తున్ నెమ్మొగము • మూఁగిన ముంగురులెత్తి సంతసం
బు గదుర ద్వారమున్ సగము • మూసి కనెన్ హరు మబ్బుపీడిపో
వగ నుదయాద్రి కందరము • పై నలరారెడు చంద్రమండలం
బు గతి మనోజ్ఞమైన ముఖ • మున్ గని పల్లవులెల్ల మెచ్చఁగన్.

ఉ॥ తత్తరపాటుతోడ వని • తామణి యోర్తున్ ప్రసాధికా కరా
యత్తమునైన సవ్య చర • ణాబ్జము లాఁగి పథంబు నెల్లెడన్

లత్తుకపూఁతి బూయుచు ని ◆ లాసగతిన్ గొలఁజేసి పర్వునన్
జిత్తజ భంగుఁ గాఁతునని ◆ చేర గవాక్షతటంబు చెంతకున్.

చ॥ స్ఫురదరవింద సుందర స ◆ ముజ్జ్వల లోచన వేరొకతున్ పం
కరుహ శరాహతాంగయయి ◆ గాసిలి మన్మథహంత మృత్యుసం
హరుఁడె యగున్ గదా యని త ◆ దాశ్రయమున్ బడయంగ గోరె నా
బిగబిగ ద్వారమున్ దెఱచి ◆ వీధికినై జనె శంకరున్ గనన్.

చ॥ మఱియొక కులుకులాడి లస ◆ మాన తనూలత కంపమొందఁ గ్రి
క్కిఱియు కుచద్వయంబు చలి ◆ యింప నితంబమునుండి కాంచి పెం
పఱదిగఁ జారి పాదయుగ ◆ మంటి చనన్ వలదంచు వేడు నా
పఱలగ నాథు ద్రోసి చనె ◆ వాంఛ భుజంగ వతంసుఁ గన్గొనన్.

చ॥ అలరు పసిండి వన్నియ స ◆ నాదరముం బొనరించు మేని రం
గులు పయిపై బయల్వడఁగఁ ◆ గోమలియొక్కతె జిల్గుచీర చెం
గుల నొకచేతఁ బట్టుకొని ◆ గొబ్బున వీధికి వచ్చెఁ జూపరుల్
భళి! యిది క్రొత్తవింతయని ◆ పల్కఁ దెఱుంగ కొకింతయేనియున్.

చ॥ కరము సువర్ణకంకణ ని ◆ కాయము ఘల్లుమటంచు మ్రోవ బ
న్ధుర మృదుగాత్ర వల్లియొక తొయ్యలి తామరసంబు నా మనో
హరిమను మోమునన్ ముసురు ◆ నట్టి మిళిందము నూర్పుగాలిచే
నరపడ ద్రోలుకొంచు భ్రమ ◆ ఘాధిపుఁ గన్గొనవచ్చె వీధికిన్.

చ॥ లలిత సుధాకరాస్య నవ ◆ లా యొక గుబ్బెత పైడిచేర్ల యూ
యలపయి నూగుచుండి తుహి ◆ నాంశుధరున్ గన రమ్మటంచు నె
చ్చెలి వచియింప వత్తునని ◆ చీరచెఱంగులు కాళ్ళకడ్డమై
నిలిపినగాని యించుకయు ◆ నిల్వక పర్వఁబోయె దూలుచున్.

చ॥ మదకల కోకిలప్రకర ◆ మంజులవాణి యొకర్తుక కౌతుకా
స్పదుఁడగు జీవితేశ్వరుఁడు ◆ సన్నిధి వీడుటఁ జేసి రత్నముల్
పొదిగిన యుంగరాల్వలయ ◆ ముల్ సమతంగొని దండ చేత నిం
పొదలెడి భూషలైనను స ◆ ముత్సుకతం జనె శంభుఁ గన్గొనన్.

తే॥ సరసిజాంబకని ద్వేషి సరసిజాంబ కా సరసిజాంబకుండట ◆ కనినఁగాని
మనసు నిలువదు వత్తువే ◆ యనుచు నొక్క పడఁతి నెచ్చెలిపయ్యెదఁ ◆ బట్టిలాగె.

మ॥ ఉడురాజోపల చారుమూర్తిన్ విలస ◆ ద్యోవాహినీ బద్ధకే
శుఁడు భోగీంద్రవతంసుఁ డీశుఁడు సుర ◆ స్తోమంబు సేవింప ని
య్యెడ కేతెంచి గిరీంద్రజా పరిణయం ◆ బీరీతిగావించు టి
క్కడి వారల్ దొలిసేయు పుణ్యమనియో ◆ కళ్యాణియోత్కన్య తో

వ॥ అత్తఱిం గుఱుసోపధిప్రస్థ కాంతావారంబు స్వాంతంబులు నితాంత సంతోషసంతాన దంతురితంబులై యొక్కొక్కపోది నక్కజంబుగఁ గిస్పట్టి మిక్కిలి యుద్రేకంబున మిన్నంది లోలంబులై లీలలకు మెలంగఁ బార్వతీపరిణయవైభవదర్శనాగత నిఖిలోభయ బంధుగంధేభయానలసితేతర తరళ తరదృక్కాంతి పుంజంబు లెల్లెడల నింద్రనీలమణి తోరణాలంకారం బొనర్పఁ దోతెంచు పౌరుల యుత్సాహసూచక వివిధ కోలాహలంబులు తెలిగంటి పూఁబోండ్లు పాడు గౌరీకల్యాణంపు పాటలం గలిసి పిటుకొని దిక్కవాట విపాటనంబుఁ గావింప నేఁడు మేమని ముక్కంటి కెలంకులను జననుంకించు పరివారంబుల బలిసిన యొడళ్లొకటికొకటి యొరసికొనుడు రాలిన మానికంబుల చూర్ణంబులు రేఁగి నభోంతరంబు వ్యాపింప నిందుమౌళి మెల్లమెల్లన వివాహమంటపంబుఁ బ్రవేశించె నప్పుడు.

చ॥ పరగ సువాసినీజనము • పాడెడి పాటల నాలకించుచున్
దయణుల నమ్రగర్భ వచ • నంబులకున్ బ్రతిసెప్పుచున్ నిరం
తర శుభదాత శంభుఁ డలు • తన్ దగసూత్రము గట్టు జెప్పుడం
చరమగనున్న గౌరికడ • కంబుజనేత్రుఁడు వచ్చి యిట్లనున్.

చ॥ జననివినవు లోకముల • సాఁకెడు భారము నీ యధీనమై
కనఁబడు నిన్ను గాదని యొ • కానొకదున్ మననేర్చునే నిరం
జనుఁడు పరాత్పరుండు విల • సచ్ఛుభమూర్తిన్ శివుండు నీకతం
బునన గృహస్థు కాఁగలఁడు • భూతనికాయము సంతసంపఁగన్.

చ॥ అని వచియించి నెమ్మనము • హర్షపరీతముగాఁగ రత్నకాం
చన సమలంకృతాంగయగుఁ • శైలతనూజ వివాహవేదికిన్
గొని చనుదంచుఁ బల్కుటయు • గొబ్బున వేలుపుకాంతలెల్ల న
ట్లొనరిచి రద్రిపత్నియు మ • హోత్సుకతన్ దనరారె నెంతయున్.

— • బ్రహ్మదేవుడు విష్ణువుతో శివుని మహిమ జెప్పుట • —

ఉ॥ అత్తఱి సత్యలోకపతి • యా చతురాస్యుఁడు భక్తమానసా
యత్తుని నీలనీరద స • మంచితగాత్రుని విష్ణుఁ గాంచి రే
కెత్తిన సంతసంబు మెఱు • నిట్లని పల్కె సమస్తగత్తుణో
పాత్తయశః ప్రభాపటల • బంధురమూర్తివి నీవు చూడఁగన్.

మ॥ అమృతోత్పాదన కారణంబయిన కూర్మాకారము న్దాల్చి యి
య్యమరశ్రేణికి నిర్జరత్వము నమ • ర్త్యత్వంబు చేకూర్చి యు
త్తమ సామ్రాజ్యపదంబొసంగితి భవ • ద్వాత్సల్య మెన్నంగ నే
ర్తునె పద్మాహృదయారవింద విలస • ద్యోరత్నలోకాధిపా.

ఉ॥ అంగజ గర్వభంగుఁడగు • నాతుహినాంశు కలావతంసు వా
మాంగమునుండి నిర్జరులు • నంబికయున్ దగనీవు సంభవం
బుంగనినార లప్పరమ • పూతచరిత్రుని దక్షిణాంగమం
దుంగొమ రొప్పఁగల్గితి న• నూనచరాచర లోకసృష్టికై.

చ॥ ప్రవిమల చారుమూర్తిన్ హిమ • వంతుఁడు మామక నిర్మలాంగసం
భవుఁడయి యజ్ఞసంతతికిఁ • బ్రాపయి శంకరు మాయ నాజవం
జవజనితా శుభప్రకర • సర్వధరాధర సాశనక్రియా
పవియగు దేవిఁ గాంచెఁ బిత్రు వర్గమువా రపవర్గ మొందఁగన్.

చ॥ ధరణియు వారియున్ శశియుఁ • దామరసాప్తుఁడు గాలియాత్మ గాఁ
బరగు శశాంకమౌళితను • భాగములన్ జనియించె నీ చరా
చరమగు లోకజాలము వృ • షాకపి యప్పరమాత్మయే నిరీ
శ్వరుఁడు ననాదిమధ్యలయ • భావసమేతుఁడు గాఁడె చూడఁగన్.

క॥ ఆతం డనుకంపమెయిన్ శ్రౌతస్మార్తన్ ప్రవృత్తి • గాజిలుటకునై
యీ తుహినాచలమునకున్ బ్రీతి నరుసుదెంచె గిరిజఁ • బెండ్లియొనర్పన్.

క॥ నాయంశంబునఁ బుట్టిన యీ యచలేంద్రునకు నాకు • నీవ గురుఁడవో
దోయయ్య చెప్ప నేటికి శ్రేయంబగుఁ గాదె గిరిశు • చెలిమియితనికిన్.

తే॥ సకలగోత్రాధినాథుఁ డీ•చారుమూర్తిన్ కాదిమాధ్యాంతరహితుఁడై•యలరువాఁ
మమత జెన్నొందునట్టి జా • మాతయగుట యరయ నెల్లర భాగధే • యంబెకాదొ

క॥ గొనములగని రతవంబుల మనికి కనికరంపుటెంకి • మర్యాదజ్ఞుం
డనఘుఁడు న? పతిసమ్మతమును జూపెడు భవుని నెయ్య • మును సల్పంగన్.

తే॥ అన్యథా తలంప • కాదిశక్తిని లోకజనని హైమవతిని • శంకరునకు
గట్టు కొలఁపు కేని • కారణంబునిచ్చి కువలయాభివృద్ధిఁ • గూర్పు మనఘా.

మ॥ అని ప్రార్థించిన నట్లకాక యని దై • త్యారాతి మోదంబు పెం
పున దై తేయులు నాది తేయ నివహం • బుల్ పార్శ్వముల్గొల్వఁ జ
య్యన లోకస్థితిఁ గోరి పెండ్లికొమరుం • డైయున్న యన్నీలకం
ఠుని వైవాహిక వేదిపై నిలిపి సం • తోషంబు దైవారఁగన్.

—• విష్ణువు శివపాదప్రక్షాళనంబు జేయుట •—

ఆ॥ పచ్చకప్పురఁపు రజంబు • వట్టివేళ్లు మలయజంబును గలిసిన • మంచునీట
సకలపాపనివారణ • చతురములగు మృడుని పదపంకజంబులఁ • గడిగియపుడు.

చ॥ కలుషనివారకంబులు జ ♦ గస్థితి హేతుకముల్ మహర్షి రా
ట్తిలకశిరో జటాపటల ♦ దీపకముల్ చతురబ్ధివేష్టితా
ఖిలభువనాధిపత్య పరి ♦ గీత యశస్కరముల్ శివాంఘ్రి సం
గ లలితపావనంబు లుద ♦ కంబులు హ స్తపుటంబునందునన్.

తే॥ నేకరించి గిరీంద్రుని ♦ శిరముమీఁద నజుని తలపైన తన యుత్తమాంగమందుఁ
జల్లుకొని మెల్లమెల్లన ♦ సరసవచన చాతురిని జంద్రమాళితో ♦ నరగననిరె.

తే॥ ఈపె మాకుఁ జెలియ♦లిలదాల్ప దొరసేయు తపముకతనఁగలిగెఁ♦దగినవరుఁడ
వీవయగుదు తరణి ♦ ఘృణి చయంబేకదా నళినికిలముదంబుఁ ♦ గలుగఁజేయు.

చ॥ అని వచియించి కౌతుక స ♦ మాహిత చేతసుఁడై మురాంతకుం
డనుపమ హేమభూషణ ♦ సమంచితగాత్ర లతామనోజ్ఞయై
మునిజనసేవితాంఘ్రియగు ♦ భూధర రాజకుమారికన్ జగ
జ్జనని నొసెంగె నప్పుడు భు ♦ జంగవతంసునకున్ ముదంబునన్.

మ॥ కరణాశ్వంబులఁ గట్టిపైచి యరివ ♦ గంబున్ గరంబూడ్చి యీ
శ్వర సాలోక్యముఁ గాంచిమించిన భర ♦ ద్వాజాంగి గౌగ స్త్య మా
ఖ్యబుషివ్రాతము భక్తియుక్తముగ హ ♦ స్తాంభోజముల్ మోడ్చి ని
ర్భర సంతోషమునన్ నుతించిరి హరున్ ♦ బాపాఘనాశంకరున్.

గే॥ తెలియ దాతవు నీవ ప్ర ♦ తిగ్రహీతవీవ ద్రవ్యమీవ ఫలంబు ♦ నీవ తక్కు
వస్తుచయమెల్ల ♦ గుణమాత్ర వర్తనముఁ దావకాజ్ఞఁ జెలంగు నో ♦ దేవ దేవ!

ఉ॥ నీ యనుకంప నెంపున న ♦ నేక మహాయుగముల్ ప్రభుత్వమున్
జేయఁగలండు నీచుఁడును ♦ జేడ్పడు నీ వొకయింత యల్గినన్
దోయజనేత్రు నంతటి ఘ ♦ నుండును వేర నుతింపనేల భ
ద్రాయితమూర్తివైన పర ♦ తత్వము నీవకదా గిరీశ్వరా!

తే॥ ఏ చిదానందమూర్తి దా♦నెల్లయందుఁ జూడఁగలవారలకుఁ దన్నుఁ♦జూపుచుండు
నట్టి వాఙ్మానసాతీతుఁడై దేవుఁ డిట్టిదశ నొందుట సహేతు ♦ కేచ్ఛగాదే.

చ॥ అని సుర నిమ్నగతటరు ♦ హాగ్రమ రసాయనమున్ బలెన్ గరం
బనుపమ మాధురీయుతము ♦ లైన మృదూక్తుల వేయురీతులన్
వినుతియొనర్చి హేమ నళి ♦ నీదళ కోమలముల్ తదీయ పా
వన చరణంబులన్ నుదురు ♦ పర్వఁగ జాగిలినేసి రత్తరిన్.

ఉ॥ అంబరమధ్య భాగమున ♦ యందు విమానములెక్కి మెల్లనన్
శంబర వైరిహంతపయి ♦ చారణులున్ మటి సిద్ధులున్ బ్రసూ

నంబులఁ జల్లి రచ్చరలు • నాట్యమొనర్చిరి వేదరాశి రూ
పంబు వహించిమించి బహు • భంగుల సన్నుతిజేసె భక్తితోన్.

వ॥ అప్పుడు.

మ॥ ఘన లజ్జావనతాస్యయైన గిరిరా • ట్కన్యాదృగంభోజముల్
మునుమున్ భర్తృపదాబ్జ సంగతిని బెం • పున్ జెంది యాపై స్వజీ
వన జాతత్వము బాంధవంబు కలిమిన్ • భాస్వత్తదీయాననేం
దుని జేరన్ జని క్రమ్మెరన్ బ్రథమ త • ద్భోపాకరత్వంబుమై.

చ॥ భవుఁడు త్రపానతాస్యయగు పర్వతకన్యకమోము గాంచి తృ
ప్తివడఁ డొకింత యవ్విధిని • బెండిలియాటకు దేవియున్ మనో
భవహరణైక దక్షుఁడగు • భర్తను గన్గొని మోదమంద దా
త్మవిభుని డెందమున్ గలిసి • తాను జరింపఁదలంచె నాయనన్.

—• బ్రహ్మదేవుఁ డీశ్వరునిచేత నగ్నికార్యము జేయించుట •—

ఉ॥ ఆయెడఁ బద్మయోని ముద • మారగ శంకరుగాంచి పల్కెనో
శ్రీయుత లోకరక్షణముఁ • జేసి గృహస్థుఁడవైతివే నుపా
ధ్యాయ పదంబుఁ జేరి ప్రమ • దంబున హోమమొనర్తున్ నాజ్ఞ నీ
వే యఖిలాండకోటి భువ • నేశ్వర యీశ్వర నీలకంధరా!

క॥ అనుటయు నంగీకార పిశునమగుఁ జిఱునవ్వుమోము • సోయగమున కొ
క్క నవీనకాంతిఁ బెనుపఁగ ననిమిషశుభదాత శంభుఁ • డను సంప్రీతిన్.

తే॥ నీ కభీష్టమైన • యేకార్యమైనను నాకు నిష్టమెయగు • నళినజాత!
సంతసింతునటులె • సల్పుము నీవకాదా ప్రధానమంత్రి • వగుదునాకు.

ఉ॥ అంతఁ జతుర్ముఖుండు విన • యంబునమ్రొక్కి మహీధరాత్మజా
కాంతకరాంబుజంబు శితి • కంఠుని హస్తముఁజేర్చి సాక్ర్పతిన్
బ్రాంతమునందు నిల్చియుఁ గృ • తాంజలియై కనుపట్టువహ్ని యం
దెంతయు శ్రౌతమంత్రము ల • హీనగతిన్ బఠియించు చత్తఱిన్.

తే॥ నయము మెఱయఁ బద్మ• నయనుఁడందీయలాజలను గొని యథోక్త•సరణి హోమ
మాచరించి యగ్ని • కాశంకరునిచేఁ బ్రదక్షిణత్రయం బు • దారబుద్ధి.

క॥ ఒనరింపఁజేసియు పురాతనదంపతులగు గిరీంద్ర • తనయేశుల హ
స్తనళినయోగము విడిపించి నితాంతోదారబుద్ధి • జెలఁగుచు నంతన్.

చ॥ సురలును సిద్ధులున్ మునులు • సోకుఁడు మాఁకయుఁ గిన్నరుల్ ధరా
ధరములు మానవోత్తములుఁ • దామర సాక్షుఁడు వెంటనంటి రా
హరునకుఁ బద్మయోని ప్రియ • మారఁ బ్రదక్షిణ మాచరించి చి
ద్భరిత హృదంతరుండగుచు • వందనముం బొనరించి యాపయిన్.

వ॥ లోకరక్షణంబు మెయి నూతనదాంపత్యంబు వహించిన యా పురాణదంపతులకుఁ బాద్యంబొసంగి మఱియు నీశ్వరునకు నాచమనంబును భూదానంబును జేసినప్పుడు.

తే॥ అరుణముఖ్యగ్రహములు భృ • గ్వాదిమునులు నలరుదిలతండులంబులు • నక్షతలును
వినయమిమ్మడిగాఁ గొని • విశ్వనాథుఁ బూజఁజేసిరి సంతోష • పూర్ణులగుచు.

తే॥ హరుఁడు జలజాసనోక్తంబు • నాచరించి యగ్నిదేవుని దనలోన • నడఁచుకొనియు
భువనహిత సమాసక్తిచేఁ • బొదలుకతన ధరణిధరపుత్రితోఁగూడి • కరము మెఱసె.

చ॥ సవమల మంగళావహము • శంభువివాహచరిత్ర మెవ్వఁడే
భావలెడిభక్తి చెన్నలరఁ • బూనికతోడ లిఖించినన్ వినన్
జదివిన వేదవేత్తలగు • సద్విజులన్ వినిపించినన్ మహా
పదలఁ దొలంగి శంకరుని • బాయక మోదముఁ గాంచు నెప్పుడున్.

క॥ ఎందెందీపరిణయకథ పొందై చదువంగఁబడెడు • భూతేశుఁడు తా
నందందు నిలిచి శుభముల నందఱకు నొసంగుచుండు • నధిక ప్రీతిన్.

సీ॥ గతభర్తృకలు పురా • కృతముఁ దొలంగి రాఁగల జన్మములను మాం • గల్యవృద్ధిఁ
గాంతురు పరిణయ • కాంక్షగల్గిన నటువులు సోయగముగల • చెలులఁగూడు
కొందురు కులవృద్ధిఁ • గోరు సాధువులు సత్సంతానవంతులై • సంతసింతు
రైశ్వర్యవాంఛఁ జెం • తాక్రాంతులగువారు సిరిని బొమ్మనఁదాల్చి • చెలగుచుందు
రంబుధి చతుష్టయ పరీత • మైన ధరణి నేలుటయు సంభవించు నే • వేళ భక్తి
తనర గిరిజాగిరీశ్వరో • ద్వాహచరిత మరసి పఠియించువారల • కనవరతము.

క॥ కావున పేరోకవిధమున భావింపక వృద్ధిఁగోరు • వారెల్లరు సం
భావనముఁజేసి గిరిజా వైవాహిక కథను జదువ • వలయు సతంబున్.

వ॥ అని వచియించి మఱియు నక్కథకుం డిట్లనియె.

— శివుఁడు పార్వతీసహితుఁడై కాశి కరుగుట —

చ॥ శ్రితజనకామ్యదుండు శశి • శేఖరుఁ డట్లు గృహస్థుఁడై సము
న్నత విధవాభిగామి వసు • ధాధరనందనఁగూడి నందియున్

గ్రతుభుజులున్ మహాప్రమథ • రాజియుఁ దోనరుదేరఁ గాశికా
క్షితితల భూషణంబునకుఁ • జేరఁ దలంపు వహించె నెంతయున్.

మ॥ భవసంతాప నివారకుండు గిరిజా • ప్రాణేశుఁ డారీతిగా
నవిముక్తంబునకేగునం చపుడ • హార్యస్వామిదేవేరి కూఁ
తు వియోగంబు సహింపనేరమి సము • ద్భూతాశ్రుజాలంబెదన్
ననముక్తాఫలకల్పమై పొసఁగఁ జిం • తన్ గౌరితో నిట్లనున్.

—• మేనక పార్వతీవిరహంబునకై విచారించుట •—

ఉ॥ సిన్నటనాఁటఁ గోలె నినుఁ • బెంచుచు ముద్దుల మాటఁగట్టు నీ
తిన్ననిపల్కులంగలుగు • దీయని పానకమానుచుంట నో
కన్నియ నిన్నువీడి క్షణ • కాలము నిల్వఁగ నేర మేము మా
పున్నెమునన్ లభించితని • పొంగుచునుందుముగాదె నిచ్చలున్.

మ॥ శితికంఠుండు భవత్కర గ్రహణమున్ • జేయంగనౌభాగ్యమే
గలిమాకున్ సమకూరు నొక్కయని యు • త్కంఠన్ నిరీక్షించు దు
గఁతి నీడెన్గద నేటికంచు మదిలోఁ • గౌతూహలంబందలే
దతివా యప్పుడె కాశికిన్ జనెదరా • యత్యుగ్ర శీఘ్రంబుగన్.

చ॥ అనఘులు మీర లిర్వురు వ • యామయులై యొకయింత కాలమున్
బనివడి యున్నగంబుపయి • వారని మైత్రి వసింతురేని నా
కును ధరణీధరేశ్వరున • కున్ నడు సంతసమయ్యెడున్ గదా
యని మది నమ్మియుంటిఁ దన • యా యపుడే చన నిచ్చగింతురే?

చ॥ అరయ మహామునీశ్వరుల • కైనను గానఁగరాని సర్వ భూ
భరణుఁడు నన్నువంటి యొక • పామరకాంతకు నల్లుఁడౌట నీ
కరుణనుగాదె యట్టి యధి • కంబగు నా కరుణన్ దొలంగి యి
క్కరిణి వచింపఁగాఁ దగునె కంజవిలోచన నీకు సుంతయున్.

చ॥ పరమకృపా పయోధి భగ • వంతుఁడు చంద్రకళాధరుండు దు
ర్భర భవపాశమోచనుఁడు • భక్తజనామరభూజమైన శం
కరుని దయావిశేషమునఁ • గల్గితి కన్నులపండువయ్యె నో
తరుణి భవద్వియోగజని • త వ్యథ కెవ్విధి దాళనేర్తునో.

మ॥ చిరకాలం బిటనుండఁగూడదొ జ • గచ్ఛ్రేయంబు సంధించునా
పురవిధ్వంసికిఁ గాశి కాపురమె సం • పూర్ణాభిమానాస్పదం

భో రమానాయక నేయుఁడా శివుఁడు మ ◆ మ్మర్థవంటి భక్తాళి కే
వరమైనన్ బ్రతిసెప్ప కీయఁదగఁడో ◆ పర్వేందు బింబాననా!

మ॥ జగదాధారకుఁడౌట శంకరుఁడు వి ◆ శ్వంబెల్ల నిష్పక్షపా
తగతిన్ బ్రోచుచునుండు నాతఁడు సమ ◆ స్తవ్యాపకుండౌట లో
కగనన్ జాలక పామరుల్ హరుఁడు చెం ◆ తన్ లేఁడటం చెంతయో
వగలన్ బొందుదు రట్టివారిఁ గరుణిం ◆ పన్ గూడదే నేలకున్.

శా॥ నీవే లోకమటంచు నమ్మి యసురుల్ ◆ నీయందె లీనంబుగా
నేవేళన్ జరియించు మమ్ము విడ నీ ◆ కే కోర్కె కల్గెన్ మహా
దేవుండా! యిట నొక్కచో నిలుచు న ◆ థిన్ బ్రాత రక్షావిధా
ప్రావీణ్యంబగుఁ గృత్యమున్ దొఱఁగి ని ◆ ర్వ్యాపారమున్ జెందుచున్.

చ॥ అనవుఁడు గౌరి పిన్ననగ ◆ వాస్యమునన్ గనుపట్ట డెందమం
దున నొకరీతి హర్షము వి ◆ నూతనమై ప్రభవింప మెల్లనన్
జననిని గౌగలించుకొని ◆ చారుమృదూక్తులఁ బల్కు పల్కు ప
ల్కునఁ బులకండ మొల్కఁగ వి ◆ లోల విలోచనముల్ రహింపఁగన్.

—◆ పార్వతి మేనకకు కన్యాధర్మము జెప్పుట ◆—

మ॥ జననీ యేమిటి కిట్లు బల్కెదవు నీ ◆ చందంబుఁ గన్గొన్న నెం
దున మున్గానని భీతిగల్గెడిని చి ◆ ద్రూపుండు విశ్వంభరా
వనదక్షుండగు శంభు డొక్కయెడ ని ◆ ల్వంగూడునే యన్యదే
శ నికాయంబు ననుగ్రహింపఁ దగఁడే ◆ సద్రీతి నూహింపుమా.

చ॥ అది యటులుండనిమ్ము చతు ◆ రాత్మకుఁడైన యెవండయేని నె
మ్మదికి ముదావహంబయిన ◆ మార్గమె చేరెడుఁగాని యేరికిం
జెదరక కామినీవశత ◆ బ్రీతివహించుచు నత్తవారి మ
న్కిఁ దనకు బుట్టునిల్లుగ గ ◆ ణించి వసించునె యింపుకేనియున్.

చ॥ తమ తొలిజేసినట్టి సుకృ ◆ తంబును దుష్కృతమున్ ఫలించి స్వ
ర్గమొ నరకంబొ గూర్పఁగ సు ◆ ఖంబునొ దుఃఖమొ చెందు పూర్వులన్
గ్రమముగ నుద్ధరించుటకుఁ ◆ గాఁ దమ కూఁతుల నర్హమైన లో
కమున కొసంగుచుంట విధి ◆ గాదె గృహస్థులైనవారికిన్.

శా॥ ఆల్లుఁడు సర్వనిజామర స ◆ మర్చిత పాదసరోరుహుండటం
చుల్లమునం దలంచుచు స ◆ ముత్సుకవృత్తి వహింప కిట్లు మే

నెల్ల వివర్ణమై తనర • నెంతయుఁ జింతిలనేల యిట్టు లో
తల్లి సమర్థురాలవుగ • దా మఱి బేలవై నీవుచూడఁగన్.

చ॥ తెలియని మోటుమానిసి గ • తిన్ విలపింపఁగనేల సర్వమున్
దెలిసిన ప్రాజ్ఞవీవు జన • నీ యొక కన్నియ నీకుఁ జెప్పఁగా
వలయునె పెద్దవారలె స్వ • భావము వీడి చలించుచుండఁగా
నిల నమువంటివారికతి • యేమగునో వివరించి చూడుమా?

ఉ॥ ఇందుధరుండు లోకముల • కెల్లను రక్షకుఁడాటచేత నెం
దెందు స్థిరాత్ములై సుకృతు • లెప్పుడు తన్ను భజించుచుందు రం
దందు వసించి వారికి ము • దాప్తి నొసంగఁదగున్గదా చిదా
నందున కొక్కచోటఁ దగు • నా నిలువంగ నహానిశంబిలన్.

చ॥ పలుకులు వేయులేమిటికి • భర్గుఁడు కాశికిఁబోవ కింతయున్
వలఁగఁడు దానఁగ్గిన శ్రీ • తప్రకరంబున యందుఁ బ్రేముడిన్
గలిగిన యాతఁడాట కల • కాలము వేరొకచోట నిల్వఁడీ
తలఁపును మాని నెమ్మదిని • ధైర్యముఁ దాల్పఁగదమ్మ శ్రేయమా.

చ॥ అనఘులు మీరు దంపతుల • హనిశమున్ మదిలోన మాయెడన్
గనికరమూనియుండదగుఁ • గా నివసింపఁగ నీ ప్రదేశమై
నను మఱి యే ప్రదేశమయి • నన్ గొలయా నదియేమితల్లి మా
కనవరతంబుఁ బూజ్యులగు • నట్టి మహాత్ములు మీరె కాదొకో.

క॥ ఒక వారణాసియౌన నేమి కకుమ్మధ్యగత భూమి • మెలఁగెడి భక్త
ప్రకరంబె యాటపట్టు శశికలాభరణునకు వేర • చెప్ప వలయునేని.

తే॥ ఇపుడు వారణాసి • కేగిరేని మరల గారొ యేమొయని ని • చారమేల?
సేవ్యులైన మీరు • చేసిన తప్పేమి హిమనగంబు దోష • మేమి చెపుమా!

ఉ॥ పోయినచోట నే నిలునఁ • బోలునె వెన్కఁ దలంపుకల్కదే
చేయఁగలట్టి కార్యములఁ • జేయకయుండుట లెస్సయౌనె యే
దోయొక కార్యమున్ దలఁచి • యొప్పరికింపనివారి నిల్పినన్
బాయకయుందురే విమలభావులు దేనిని జేయఁజాలరో.

తే॥ అనుచు మేనకయును • నాత్మజాతయును నన్యోన్యముగను మాట • లాడికొనుటఁ
జూచి గట్టుసామి • సారిదివారల నాఁపి కరముమోడ్చి శివునిఁ • గాంచి పలికె.

—• హిమవంతు డీశ్వరుని ప్రార్థించుట •—

చ॥ చనకుఁడు నిల్వుఁడంచనుట • శస్తము గాదరుగన్ దలంచుచో
చనుఁడు యథేష్టమంచనిన • శాసనముం బొనరించుటౌ నికే

మని పలుకంగలాఁడను ద • యామతివీవు జగచ్ఛరణ్యా నీ
యనుమతి మట్లసేయుదని • యారసిపల్కక మిన్నకుండెదన్.

క॥ కరము చరాచరంబగు జ • గద్వలయంబు భరింపఁజాలు వే
కరుణ తలిర్ప నీ హిమ న • గంబునకున్ జనుదెంచి పార్వతీ
కరము గ్రహించినావొ యధి • కంబగు నాకరుణన్ భవత్పదాం
బురుహము లాశ్రయించితిని • పూనిక మాయెడ నిల్పు నిత్యమున్.

క॥ అని ప్రార్థించి ధరాధరేశ్వరుఁ డమూ • ల్యానేక రత్నంబులన్
గన దుత్తుంగ సువర్ణ భూషణములన్ • గల్పద్రుసంజాత నూ
తన మాల్యంబులు వాహనంబులును గం • ధర్వాప్సరశ్శ్రేణియున్
ధనసంఘాత మొసంగె నా కుశల సం • ధానైక సంశీలికిన్.

వ॥ మఱియు గజతురంగస్యందనాందోళికలును, విచిత్ర వస్తునిచయంబును నొసంగినఁ
గైకొని లీలామాత్ర పరికల్పిత నిఖిల జగజ్జాలుండగు కృత్తివాసుండు భక్తత్రాణ
సమర్థుండుగావున హిమవంతు ననుగ్రహించి యిట్లనియె.

—• పరమేశ్వరుండు హిమవంతు నూరడించుట •—

వ॥ మునుమున్న వారణాసికిఁ జని యటఁ గొన్నాళ్లు గడపి • సంతసమున నా
మనికి యగు రజతగిరికిన్ జనియెద సిద్ధులును, మౌని • జనులు నుతింపన్.

ఉ॥ హరుఁడు విశేషదూరమున • యందు వసించెడు నంచు నెమ్మదిన్
గరము విచారమొందకుమ • నారత మిచ్చట నిల్వఁబోలదో
ధరణిధరేంద్ర నీవెపుడె • దన్ ననుగూర్చి జపింతు వప్పుడే
పురుగున నిన్నగంబునకు • వచ్చెదఁ గూర్చెద నీ యభీష్టమున్.

వ॥ అని నెమ్మనమున ముప్పిరిఁ గొను వాత్సల్యమున సుపద • గుంభితమధుర
స్వనమునఁ బల్కి గిరీశుఁడు కనుసన్న యొనర్చినపుడు • కాత్యాయనికిన్.

క॥ అటులఁ గనుసన్న జేయుట•యాత్మ నెఱిఁగి యపుడె పయనంబుఁ జేయుదు•రాయటంచు
ముద్దుగూఁతు నాలింగనం•బునొనరించి మేనకాదేవి యిట్లను • మృదులరీతి.

—• మేనక గౌరికి బుద్ధుల గఱపుట •—

ఉ॥ ప్రోడవుగావు బేలవు స • రోజ విలోచన నీవు నిత్య మి
లేడు జగంబులన్ మనుచు • లేపనిగాఁగను భూతసంతతిన్
గూడి చరించు భర్తన్ ముది • గొండపయిన్ నివసించుటయ్యెడున్
జాడగ నాకు భీతియగు • స్రుక్కక కాఁపుర మెట్లు జేసెదో.

సీ॥ కలనైన మముఁ బాసి • నిలువలే వేరీతి నీ వియోగంబు స హింతువమ్మ
సరసరాజాన్న భో • జనమె భరింపవు భైక్షాన్న మేగతి • వలతువమ్మ
విరసెజ్జనే చేర • విసికెద వేమాడ్కి కొండరా నేలపైఁ • బండెదమ్మ
పికకల ధ్వనుల కే • భీతిఁజెందెద వెట్లు భీకరారవముల • వినియెదమ్మ

కలిగితీవు పెద్ద • కాలంబునకటంచుఁ గనుల కద్దుకొనుచు • గారవమునఁ
బెంచుకతన నిన్ను • విడిచి నిల్వఁగ లేక పలుకుచుంటి నిన్ని • పలుకు లబల.

మ॥ పరు లేకార్య మొనర్చినన్ మది కసం • భావ్యంబుకై తోఁచు నో
తరుణీ యట్టి యకార్యమున్ సలుప కే • తన్మాత్రుఁడేగా మనో
హరుఁడంచున్ దలపంగఁ బోవకుము స్నే • హ ప్రాప్తమానంతయే
వరమానంచు నచంచలంబు నగు వి • శ్వాసంబు సంధిపుమా?

క॥ గురువులయెడ భక్తియు ననుచరులయెడన్ వత్సలతయు • పరివారియెడన్
గరము దగు గౌరవంబున్ బరగించి యంశంబుఁగూర్పు • మా మాకబలా!

చ॥ "హరిహయ పద్మసంభవ ము • ఖామర సేవితుఁడైన చంద్రశే
ఖరుని కరంబుఁ బట్టుకొనఁ • గల్గిన నేర్పరురాల నేన" యం
చరసి యధర్మభీతి విడి • యాశ్రితపాలియెడన్ గరంబ నా
దరమున సంచరింపకుము • తాలిమియే సకలార్థ దంబగున్.

చ॥ తెలియనిదాన వీసనుచుఁ • దెల్పుటగాదిది నీవు సర్వమున్
దెలిసినయట్టిదానవె స • తీ యటులైనను నాకు నీయెడన్
గల యనురాగ మింతకును • గారణమై స్థిరమైన చిత్తమున్
గలఁతవడంగఁజేయు మమ • కారము మించిన దొండుగల్గునే.

చ॥ అనుచు విచార సూచకము • లై తనయా విరహాసహిష్ణుతా
జనకములై పరస్పర వ • శంవద మానస శూచకంబులై
తనరెడి పల్కులన్ బలుకు • తల్లి నోకించుక బుజ్జగించి యి
ట్లను జగదేకమాత యగు • నార్య యనార్య మనోంబుజాతయై.

తే॥ తల్లి యిట్లు బల్కఁ • దగునె నీ వెంతయు నెఱుఁగకున్నదాన • వే వచింపు
మెట్టివార్లైన • నేనాటికైనను ధవుని వెంట జనక • తప్పగలదే.

మ॥ తనయలఁ గాంచినట్టి తలి • దండ్రులు ల వక్రపరాక్రమ క్రమో
పనత సమస్తభూపలయ • పాలకులయ్యు నిరంతరంబు న
ల్లునకుఁ గరంబులొగ్గి • యెటులో యతనిన్ దమయందు గౌరవం
బునఁ జరియించువానిగ • బూని యొనర్చుట ధర్మమాగదా.

మ॥ తొలుతం బుట్టిన ప్రాజ్ఞు లెల్లరు బుధ • స్తోమంబు మెచ్చంగ నిరా
కుల చిత్తంబునఁ గీర్తికాములనునై • క్షోణీస్థితిం గోరి రాఁ
గల్గవా రిట్లొనరింత్రు గాతమని వే • డ్కంగ దాము గన్నట్టి క
న్యల నల్లుండ్రకు భక్తినిం నిడుట మీ • యాచారమే యాగదా?

క॥ నిను గన్న తల్లిదండ్రులు కనికరముగలట్టివారు • గారో వారల్
నిను విడిచి చిరము మనరే జననీ! యటువలెనె నన్ను • సవరింపుమికన్.

వ॥ అని జనని సౌదార్య చిరపరిచితములగు హిమగిరియందలి వివిధవస్తు సంతతిఁగాంచి
యిట్లనియె.

సీ॥ పరమపావనియైన • భాగీరథీ! యత్తవారయింటికిఁ బోయి • వత్తునమ్మ
నను గానకయ మేత • యను ముట్టని శుకంబ! మరలివచ్చెద నన్ను • మఱవకమ్మ
కెడదోడునీకగా • విడనాడక చరించు చెలులార మీ యాజ్ఞఁ • దెలుపరమ్మ
ప్రాణపదంబుగా • భావించి వెంటాడు హరిణమా నాకునై • యడలకమ్మ
యితరు లెవ్వరేని • యేఁదక్క నెర్వోయఁగొనక యుండెడు లత • కూనలార
మగని వెంటఁబోయి • మఱొకప్ప డరుదెంతు సారిది మీ యనుజ్ఞఁ • జూపరమ్మ.

వ॥ అని వచియించి సర్వసమర్థుండగు సర్వజ్ఞున కర్ధాంగియై చనఁదలంచియు
స్త్రీ స్వభావంబగుఁ బ్రేమాతిరేకంబున మేనక కిట్లనియె.

తే॥ కాళ్ళు కదలవు • డెందంబు కలఁతఁబడియె హృదయమున స్థైర్యమింతయుఁ • [బొదలదిపుడు
నిన్ను విడనాడి యెటులఁ బో•నేర్తు నహహ తల్లి! యరుగక తప్పనే•ధవుని వెంట.

తే॥ జనని ఖాసి సుంత • చనలేదు, పతివెంట నరుగకుండ నేర • దచలపుత్రి
జగము తల్లి కట్టి • సంకటమే కల్గె పామరులనుగూర్చి • పలుకు టెట్లు.

తే॥ చిన్నతనమున యందుండి • సిగ్గిలేక కన్నులనె భెట్టికొనుచుఁ దన్గాఁచినట్టి
జనని విడనాడి చన నెట్లొ • సమ్మతించి సర్వమంగళపతితోడఁ • జనఁదలంచె.

వ॥ అంత.

సీ॥ బంగారుమేడలఁ • బౌరకాంతలు మృదుకుసుమవర్షంబును • గోరికురియ
పవమూర్తికాభమై • నాడెమా ఛత్రంబు వాసుదేవుఁడు కేలఁ • బట్టియుండ
సత్యలోకేశుండు • స్వర్గాధిపతియును నిరుకెలంకులను జామరములిడఁగ
నాకాంతరంబుల • యందెల్లెడల నిండి భేరి ముఖ్యధ్వనుల్ • భోరుకొలుప
సకల మానిజనులు • సర్గస్థితిలయాధికారివీవ మమ్ముఁ • గావుమనుచు
పశుపతి సన్నుచుండ • విశ్వేశుఁ డోషధిప్రస్థ పురమునుండి • పయనమయ్యె.

ఉ॥ ఆ సమయంబునన్ నగర ♦ మందలి కన్నియ లొక్క రొక్క రు
ల్లాసము పెంపునన్ శశి ♦ కళాధరు వెంబడి పోయెఁగంటిరే
భాసుర కోమలాంగ హిమ ♦ వంతుని పుత్రికయంచుఁ బల్కుచున్
మీసరమైన గుబ్బగవ ♦ మీఁదటిహారములున్ జలింపఁగన్.

తే॥ సంభ్రమంబున ద్వార దే ♦ శంబు కడకుఁ జేరగావచ్చి మన్మథా ♦ కారుఁడైన
లోకసంరక్షకుని ప్రభా ♦ లోకనమునఁ బ్రతిహతాంబకలై మనో ♦ బ్జములలోన.

సీ॥ ఇతఁడె కాదా జగ ♦ త్త్రితయ సర్గస్థితి సంహారనేతయౌ ♦ జగమగండు
ఇతఁడె కాదా లోక ♦ హితమునకై నాఁడు వెన్నుని వలపించు ♦ వన్నెకాఁడు
ఇతఁడె కాదా హైమ ♦ వతి తపంబును మెచ్చి యర్ధాంగమొసఁగిన ♦ యట్టిదాత
యితఁడె కాదా మన ♦ కెంతయుఁ గన్నులపండువు గూర్చిన ♦ ప్రవిమలుండు

ఇతఁడె కా యోషధిప్రస్థ ♦ మెల్ల పరమపావనంబుగఁ జేసిన ♦ పావనుండు
ఇతనికై కాదె బ్రహ్మాదు ♦ లేని ఘోరతపములఁ గ్రిశించుచుందు ర ♦ త్యంతభక్తి.

సీ॥ ఈ మహాదేవున ♦ కే మామగారయ్యె నే తపంబొనరించె ♦ హిమగిరీశుఁ
డీ యుత్తమశ్లోకు ♦ నే గృహస్థుగఁ జేసె నే దాన మొనరించె ♦ హిమనగంబు
ఈ సర్వశక్తున ♦ కేజన్నిదములయ్యె నేమూర్తమునఁ బుట్టె ♦ నీయురగము
లీ లోకభరిణున ♦ కేవాహనంబయ్యె నేసత్రముం బెట్టె ♦ వృషభనాథుఁ

డనుపమాన తపోవృత్తి ♦ నహరహంబు ధ్యానమున్ జేయు మౌని సం ♦ తతికినైనఁ
గానఁబడని మహాత్ముని ♦ గంటి మెట్టి పుణ్యమొనరించితిమొ తొలి ♦ పుట్టుక మనము.

చ॥ అనుచు ననేకరీతులుగ ♦ నాడుచుఁ బాడుచు శంభుకీర్తనల్
దనివిరొకింత దీరక ల ♦ తాంగులు దేహలు పౌరకాంత ల
య్యనశశి వహ్నిలోచను న ♦ గ్గిరీనవతంసునిఁ గాంచి కాంచి తా
గనిమిషభావమున్ విడిచి ♦ యాదట మర్త్యతనొంది రెంతయున్.

గీ॥ అంత నప్పార్వతీకాంతుఁ ♦ డెంతయేని కాశికాపురలోక వీ ♦ క్షాప్రసక్తి
స్వాంతమున దంతురితమై రయంబుగూర్పఁ దరలె వనజాసనాది నిర్జరులుగొలువ.

వ॥ అట్లు దరలి బహుకాల పరిచిత హిమనగంబు వియోగంబు సహింపక మాటి మాటికి వెనుకజూచుచు నప్పుడే యోషధిప్రస్థంబు దృగగోచరంబయ్యెఁగదా యని యధర దంతకాంతు లీరెండఁగాయింప మెల్లన బల్కుచుఁ జిననాటనుండి పెంచిన బాలరసాలంబుతోడఁ జెప్ప మఱచితిఁగదా యని పశ్చాత్తాపమొందు సర్వమంగళను వీక్షించి తన్మనోభిప్రాయం బెఱింగి శంకరుండు లోకశంకరుండుగావున హైమవతితో నిట్లనియె.

—॥ శివుఁడు మార్గమధ్యమందలి చిత్రంబుల పార్వతికిఁ జెప్పుట ॥—

మ॥ కననానొక్కఁడ క్రూరసత్త్వము లనే • కంబుల్ పథశ్రాంతిలోఁ
గినపాంథ ప్రకరంబుపైఁబడుచుఁ బ • క్షిశ్రేణి యొక్కొక్కచో
మనుముల్ మేతలొసంగుఁ బిల్లలకుఁ దా • ముల్ గోరకే యల్లదే
కనుగొంటే లలితాంగి! యీ సరణి. వీ • క్షాపర్వముల్ గూర్చెడున్.

వ॥ మఱియును.

చ॥ పలుచని తమ్మిపానకముఁ • బంకజపత్రమునందుఁ గ్రోలి యం
దలి నిజభుక్తశేషము • ముదంబునఁ బెంట్లకొసంగు భృంగముల్
వలయితి పద్మనాళచయ • భక్షణముం బొనరించు నంచలున్
జెలఁగ మనోహరంబగుచుఁ • జెన్నలనారు నీడిమతల్లికిన్.

వ॥ అని వచియించుచుఁ గొంత మార్గంబుఁగడచి మఱియు నిట్లనియె.

సీ॥ అనయంబు దేవతా • చారాది సత్క్రియలకుఁ గుసుమముల్ లభియించు • కొనలివియె
మునిబాలకులు త్రవ్వ • కొనిపోవ శేషించి లావైన కందమూ • లంబులివియె
కుతుపవేళలవచ్చు • నతిథుల తపసుల కెదిఁగించు నాశ్రమ • మృగము లివియె
తోఁపాత ములను వ • ల్లె లువేయుచును బ్రహ్మచారు లుండెడి నికుం • జంబులివియె

గీ॥ విరళ మార్గశ్రమోద్భూత • నిజశరీర సంభవస్వేద బాధిత • సకలపాంథ
సంచయానంద హేతుక • చారుమలయ పవన జనకంబులగు తరు • ప్రతతు లవియె.

చ॥ అదె కనుగొమ్ము మోక్షరతు • లైన మహాఋషుల హోమధూమ సం
పద గగనంబుఁ గ్రమ్మ నిర • పాయ పయోదమటంచుఁ బింఛముల్
ద్రిదిలిచి యాడుచుండెడిని • భీతకురంగ సమాననేత్ర య
ప్పదముల సంధ్యవేళల న • పారము పెంపుడు నెమ్మికూటువల్.

వ॥ ఇవి గౌతమాది మహామునుల యాశ్రమంబు లిందుఁ బరస్పర ద్వేషంబు మాని యఖిల సత్వంబులు శాంతభావంబూని యొండొండు వాత్సల్యంబు మెయిఁ బ్రేమించు చుండు.

సీ॥ గంధ సింధురముల • కండూయనముఁబాపు కొదమసింగంబులు • గోళ్లతోడ
మొదవులు వాలాగ్ర • ములతోడ పులులపై వ్రాలిన యీఁగలఁ • బాఱఁద్రోలి
పిల్లికూనలు చుంచు • పిల్లలతోఁగూడి సయ్యాటలన్ • బ్రొద్దుజరుపుచుండు
నాగుబాములు వృద్ధ • నకులంబులకు నీడఁగలుగునట్టులఁ బడ • గలను బట్టు

గీ॥ నఖిలలోక భయంకర • మైన మృత్యుదేవతయుఁ బ్రాణహారక • మై వెలుంగు
శివనౌషధమగుచును • జెలువుగాంచు దంబుమీరెడి నీ యాశ్ర • మంబులందు.

తే॥ అనుచు మార్గమధ్య • మునయందుఁ గననగు నాశ్రమములయును మ•హానదులయు
మహిమ లెల్ల నయ్య • మాసతి కెఱిఁగించు చరిగి యరిగి కొంత • యడవియందు.

చ॥ కనుఁగొనియెన్ త్రిశత్రప్రకర • కావ్యఫలప్రదుఁ డంబికామనో
వనరుహహేళి, శంకరుఁడ • వంధ్యతపస్విజనైకసేవ్యమున్
గనదమల ప్రభాకలిత • కాంచన గోపురమున్ సమస్తలో
క నికర పూర్వపుణ్య పరి • కల్పిత మయ్య విముక్తదేశమున్.

క॥ కని కరము కాశికాపుర జనులపయిన్ గనికరంబు • చాలఁ గలుగుటన్
దన మేను పులకరింపఁగ వనితన్ గని పలుకు హరుఁడు • వాత్సల్యమునన్.

మ॥ అవిముక్తంబదె కాంచితే నిరతవీ • క్షాసక్తి నెవ్వండయే
ని వివేకంబుగలాఁడునై మనమునన్ • గీర్తింపఁగాగల్గు వాఁ
డవనీరాజ్యము నేతు సీతనగ మ • ధ్యంబేలుఁ బంకేజసం
భవ విష్ణుప్రముఖామరుల్ గనని రై • శ్వర్యంబుతో నొప్పుచున్.

తే॥ మూఁడులోకంబులందు నే • జాడఁగనినఁ గానఁబడదింకొకండు మా • కనికరమువ
కాటపట్టయిన యట్టి పు • ణ్యస్థలంబు • కాశికానగరముభక్త • కల్పవల్లి.

క॥ ఆనందకాననంబున నానందకపాణి ముఖ్యు • లైనసురలతో
నానందము సెలఁగఁగ మేనానందన! నిలువఁగా మ • నంబునఁదలఁతున్.

ఉ॥ తాకినయంతమాత్రమునఁ • దారుపవిత్రులరౌదు రెట్టి ప
ల్గాకులలైనఁగాని యొడి • కంబున నయ్యమలాంబుపూర్ణయౌ
నాక నదిన్ గనుంగొనుము • నాతి! తదీయ జలంబులందు ని
ర్వ్యాకులచిత్తులై మునుఁగు • వారికి మోక్షము గల్గకుండునే.

తే॥ అనుచుఁ గొంతకొంత • వినిపించికొనుచు బ్రహ్మాది దేవతలు ప్ర • హృష్టచిత్తు
లగుచుఁ దోనరాఁగ • నగధన్వి యా పుణ్యరాశిఁ గాశి జేరె • రమణితోడ.

—• అగస్త్యుడీశ్వరదర్శనమునకై తహతహపడుట •—

ఉ॥ ఎన్నఁడు పెండ్లికూతుఁగొని • యిచ్చటికై యురుదెంచునో కదా
పన్నగభూషణుండు భవ • బంధ విమోచనుఁ డమ్మహాత్మునిన్
గన్నులఁజూచు భాగ్యమది • కల్గు టికెప్పుడో యంచు నాసమై
యున్న యగస్త్య మౌనివరుఁ • డూర్జిత తేజుఁడు సంకులాత్ముఁడై.

ఉ॥ ఆ నగరాజమౌళి సుత • నంధకవైరి పరిగ్రహించి మే
లూనిన యాతఁడాట తన • యున్కికియోగ్యము మంచుకొండయే

యోనని యందె యుండు నొకో ॥ యాశ్రితభక్తజనంబు బ్రోవగాఁ
బూనిక సేయఁడో కొకో సుర ॥ పుంగవుఁ డాతని కెట్లుదోఁచునో.

సారహీనమైన ॥ సంసారమునయందు సారవంతమండ్రు ॥ శ్వశురగృహము
అట్టి హిమనగంబు ॥ నా? వీడి మాకునై వచ్చు నప్పురారి ॥ వారణాసి.

కరుణాపూరిత చేతస్సరసీరుహుఁ డభవు విడిచి ॥ చనలే దొక వ
త్సరమైన యుగము గడచిన సరణిని బరితాపమొందు ॥ స్వాంతంబహహ.

హరునకు వారణాసియన నాదర మెక్కుడుగల్గుటన్ నిరం
తర మిటనే వసించుచు శ్రితప్రకరంబును బ్రోచునంచు ద
చ్చరణము లాశ్రయించుటకు సన్నిధి ముఖ్యముగాన వచ్చితిన్
గరుణ యొకింత లేక శితికంఠుడు వీడెను కాశికాపురిన్.

అనయము మామకీన హృద ॥ యంబునయందె వసించువాడె యై
నను శశిమౌళి గన్గొనెడు నా ॥ నాడెఁపు దెల్వియొకింత లేమి ని
య్యనఘ పదంబుఁజేరి కసు ॥ లారఁగనుం గొననౌనటంచు వ
చ్చిన నను వీడిపోయి శశి ॥ శేఖరుఁ డింతకు రాఁడ దేమొకో.

అని చింతించుచు నెమ్మనమున, ఛాత్రులవలనఁ దెలిసి ॥ పురహరుఁడట వ
చ్చిన విషయమూ సంతోషంబున మే నుప్పొంగుచుండ మునివరుఁ డంతన్

—॥ అగస్త్యుడీశ్వరుని గాంచుట ॥—

సులలిత శాంతచిత్తులగు ॥ ఛాత్రులు వేదహితానువాకముల్
పలుగతులన్ వచింపు చిరు ॥ ప్రక్కల వచ్చుచునుండఁ గేలు ద
మ్ములను మొగిడ్చిమించిన ప్ర ॥ మోదముచన్ భయభక్తి యుక్తుఁడై
కలశభవుం డెదుర్కొనియెఁ ॥ గామవిదారుని లోకపాలకున్

కనియె నగస్త్యుఁ డల్లెదురు ॥ గాఁ జనియీజనియించు సర్వలో
కనికరమాని యెల్లపుడు ॥ గాఁచెడు దేవుని నీరజాసనా
ద్యనిమిషసేవితున్ దితి సు ॥ తాన్వయ నాశకు శైలజాతపో
జనిత ఫలంబునైన గిరి ॥ చాపుని శంకరు సంతసంబునన్

కని యెనలేని ప్రేముడి న ॥ గస్త్యముని ప్రవరుండు ఫాలలో
చనుని పవిత్ర పాదజల జ ॥ ంబులకున్ బ్రణమిల్లి శైలరా
ట్తనయుకుఁ గేల్మొగిడ్చి మఱి ॥ తక్కినవారి యథార్హన్ గౌరవం
బున మెయి నాదరించి సుర ॥ పుంగవు నంబరకేశు నిట్లనున్.

క॥ కరుణాలవాల నీ కనికరమునఁ గనికిపట్టు • కాశియెగా యి
ప్పురము విడిచి యిన్నాళ్లేసరణి వసించితి తుషార • శైలాగ్రమునన్.

మ॥ జననంబౌ సచరాచరంబగు జగ • జ్జాలంబు నీలోనఁ జ
య్యన నీ సేయు ప్రపంచనాటకమె నిత్యంబంచు మోహంబునన్
ఘనసంసారపయోధిమగ్నమయి నా • నాబాధలం బొందు భ
క్తనికాయంబును నీవ ప్రోచెదవుగా • దా దీనలోకావనా!

తే॥ కాలభైరవునకుఁ • గాశ్యాడ వెటుబోవ గంగనిరత ఘోష • కలిత యయ్యె
మానివర్యులెల్ల • మాటాడ రెవరితో నిన్ను వీడి యిట్టు • లున్నకతన.

తే॥ అని యనేకగతుల • నార్యామనోహరు భక్తవత్సలుని కృ • పాలవాలు
వేదవాక్యతతుల • వినుతించు మునిఁ గని దరహాసన మొనర్చె • దర్పకారి.

వ॥ అంత నప్పరమేశ్వరుండు కుంభసంభవ ప్రార్థనంబుఁ జేసి నిజానుచర సహితుండై
యథోచిత స్థానంబుఁ బ్రవేశించె నంత.

తే॥ పావన క్షేత్రమైన య • వ్వారణాసిఁ జేరి కనకపీఠిని సుఖా • సీనుఁడైన
చంద్రశేఖరుఁ గన్గొని • జగము తల్లి పలుకుఁ బలుకులఁ బులకండ • మొలుకుచుండె.

— • పార్వతి శివుని కాశీపుర మాహాత్మ్యము జెప్పుమని యడుగుట • —

తే॥ నదులలో జాహ్నవియు నెల్ల • నగములందు స్వర్ణశైలంబు క్షేత్రరా •
[ జములలోనఁ
గాశికానగరం బధి • కంబటంచుఁ బలికె తదియెట్లు నాకుఁ జె • ప్పంగదయ్య.

తే॥ వినుతిపాత్రంబులై ధాత్రి • వెలయునట్టి పావనక్షేత్రములు లేవె • తావకీన
కరుణ కిద్దియే యర్హమా • టరయ నాకుఁ దెలిసికొన కోర్క్యగ్గలెడు • త్రిపురహరా.

చ॥ లలితసుధాధునీలవము • లన్ బురడించుచు జీవనౌషధం
బులయి రసాలపల్లవ స • ముత్కరమున్ దిని కూయు గండుకో
యిలగమి కూఁతలై శ్రుతుల • కింపగు గట్టుల తేని పట్టి ప
ల్కుల నెద నాదరించి ముది • గొండ దు నీఁడు వచించు నిట్టులన్.

క॥ నీ యడిగిన యీ యర్థం బేయెడ నేవార లెప్పు • డేని యడుగరో
తోయలి భవనాశకరం బీయర్థము నెఱుఁగ నేర్తు • రే బ్రహ్మాదుల్.

తే॥ కుంభసంభవుండు • గుహుఁడును విష్ణుండు బాదరాయణుండు • పద్మభవుఁడు
నేనుగాక యితరు • లెఱుఁగరు దీని మాహాత్మ్య మింతయనుచు • నబ్జవదన!

అని పలికి వారాణసీమహత్త్వంబు పక్కాణించువాఁడై గిరిశుండు బ్రహ్మాది దేవతానీకంబు యథాస్థానంబునఁజేర్పఁ గుంభసంభవు నిరీక్షించి సర్వమంగళ కిట్లనియె.

## —♦ వారణాశీ మాహాత్మ్యము ♦—

మానవుం డెన్నియేని జ ♦ న్మంబులందుఁ దెలిసితెలియక చేసిన ♦ పలుతెఱంగు
లైన పాతకములఁబాసి ♦ యాత్మశాంతినొందు నిచ్చోట,నొక పుట్టు ♦ వొందెనేని.

ఇతర దేశంబులన్ గణియించినట్టి పాపముల నాశ మొనరించు ♦ వారణాసి
యిచట నొనరించు కిల్బిషం ♦ బింతయేని జనునిపైశాచ్యనరక భా ♦ గునిగఁజేయు.

సురలోకంబున వేయుజన్మములకున్ ♦ సూత్రాముఁడై పుట్టి ని
ర్జర కాంతామణు లూడిగంబు సలుపన్ ♦ రాజిల్లు చింతామణీ
వరసింహాసనమందుఁజేరి సకలై ♦ శ్వర్యంబులన్ జెందియున్
నరుఁడీ కాశిని మెట్టకున్నయెడ ధ ♦ న్యత్వంబు వాటించునే?

అని సంక్షేప ప్రకార మున వారాణసీ మహత్వ ♦ మును పేర్మిని జె
ప్పిన నాలకించి నే ధన్యనయితినని పలికె శైల ♦ నందన వేడ్కన్.

తన కృత్యంబు నిరంతరం బఖిలభూ ♦ తవ్రాత సంతర్పణం
బనుచున్ జాలినదొట లోక వితతిన్ ♦ బోషించు భూతేశ్వరుం
డనుకంపామధురోక్తిజాలమున నా ♦ ర్యన్ దృష్టిఁ గావించి మిం
చిన పేర్మిన్ దన నిష్కుటాంతరముఁ జే ♦ ర్చెన్ గౌతుకంబేర్పడన్.

అనుచున్ శ్రుతి పేయములై యనితర సాధారణంబు ♦ లై నాస్తిక దు
ర్జన గర్వభంజకములుగ ననుపమ గతిఁ బల్కు రోమ ♦ హర్షణి పలుకుల్.

వినికొలంది నాదరము ♦ వేయుమడుంగులుగా వివేకి లో
కనికర వేద్యమై యలరుఁ ♦ గాశి మహత్వము శ్రావ్యమాట నిం
కను విను వేడ్క సూతమునిఁ ♦ గన్గొని పల్కిరి శౌనకాది స
న్మునులు పురారి సత్కథ ల ♦ నూనఫలప్రదముల్గదా ధరన్.

శివుని పవిత్రచరిత్రలు చెవిఁ దవిలినయంతఁ దొల్లి ♦ చేసిన కలుషం
బవలీల నదృశ్యంబగు నవుగాత్ర ప్తివడ నస్మ ♦ దాదుల వశమే.

జగము తల్లియాట ♦ సంగ్రహంబుగ విని తెలియనేర్చె గౌరి తెల్లముగను
తెలియఁజెప్పకున్న ♦ దేటపడునె మాకు నఘ వినాశకమగు ♦ నభవుమహిమ.

కావున విశదంబుగఁ గాశీ మాహాత్మ్యంబు నెఱింగింపుమనిన సూతుండమ్మునిపుంగవుల కిట్లనియె.

చ॥ మరణము లేనివాఁడయి య • మానుషశక్తిఁ జెలంగి, యింద్రియో
త్కరము జయించి మించిన ము • ఖంబులు వేయును గల్గి, కష్టని
ష్ఠురములకైన నోర్వఁగల • శూరివరేణ్యునకేని శంభు స
చ్చరితలు విస్తరించి వెలు • చఁగ వచియింపఁగ రాదొకింతయున్.

వ॥ అందు మఱియు

తే॥ వారణాసి మహిమ • వర్ణింప నలవియె స్వల్పబుద్ధులైన • వారలకిల
నయిన నాయెఱింగి • నంత వచించెద వ్యాసమౌని కరుణ • వాసిమీఱ.

వ॥ అని పలికి మఱియు నిట్లనియె నట్లు జగన్నియంతయగు పరమేశుండు లీలామానుష విగ్రహుండగుచు సర్వమంగళాసహితుండై దేవోద్యానమున కరిగి యందలి యశేషంబులగు విశేషంబులఁ జూపువాఁడై హిమవత్సుత కిట్లనియె.

—• శివుఁడు దేవోద్యానంబునఁ బార్వతీదేవితో విహరించుట •—

సీ॥ గున్నలేమావి జి • గురుజొంపముల మెక్కి నిక్కికూసెడుఁ బికం • బొక్కచోటఁ
దమ్మితేఁకున మరం • దముఁ గ్రోలి ఝుంకార మొనరించు షట్పదం • బొక్కవంక
సిగవిప్పి యాటాడు • మొగులుకూటువఁ గాంచి యువిద మెచ్చఁగ నెమ్మి • [యొక్కయెడను
అలిగిన తమ పెంట్లకల్లనల్లనఁ జిల్క లోఁగిరంబు నొసంగు • నొక్కపజ్జ
ముదురఁబండిన దానిమ్మ • పొదలఁజేరి చదల విహరించు కలరవ • సమితిఁజేరి
మోదమలరంగ డాఁగురు • మాఁటలాడు శారికాసంచయంబొక • చక్కఁగంటె.

చ॥ కనుమదె నీరజాకరము • గట్టున బాలరసాలపంక్తిక్రిం
ద నిబిడచంద్రకాంత రచి • తంబగు వేదిక, దానిపై ముదం
బున వసియించి ఛాత్రులకు • బూనికఁ జెప్పుచునుండ్రు నన్నుగూ
ర్చిన విషయంబులెల్ల పర • సీరుహ సంభవతుల్యులౌ మునుల్.

తే॥ అదె కనుము గోస్తనీలత • యనోకహంబు లలితపల్లవహస్తసం • జ్ఞలను జేసి
నిరత దేశాంతరాగతా • నేకసద్విజావళికి విందుజేయు నిత్యానుభూతి.

తే॥ పుష్పవతి నవమాల సం • ఫుల్లకుసుమగుచ్ఛరాజితదేహయై • గొనబుమీఱఁ
గ్రమసహకారశాఖలఁ • గౌఁగలించె నదె కనుంగొను గొజ్జఁగి • పొదలచెంత.

వ॥ అట్లు శశాంకశేఖరుండు చిత్రప్రకారంబు మనోహరముగఁ బల్కి మఱియు నిట్లను నియ్యుద్యానవనంబు నిర్వికారుండనైనను నాకత్యంతంబుఁ బ్రియంబై యానందకరంబగు గావున దేవోద్యానంబు నాఁబడు నందలి విశేషంబు లశేషంబుగ వక్కాణింప నేనును షణ్ముఖుండును దక్కఁ దక్కటివారు సమర్థులు గారు. ఏతద్దర్శనంబునఁ జేసి యెట్టి కుటిలాత్ముండును నిష్కలంకుఁడై సఫలమనోరథుండగు.

మ] వికసత్పంకజ రేణుభూషితములై • వేల్లత్తరంగాగ్ర డో
లికలం దోఁగుచు దక్షిణానిలసమా • లీఢంబులయ్యుం మ్మ్రణా
ల కదంబంబుల నోటఁబట్టికొని లీ• లం బైటకుం వచ్చు హం
ససులంబుల్ మునిమాపుఁ జూపఱకు నా • శ్చర్యంబుఁ గల్గించుచుం.

మ] ఫలభారానతపాదపావృతమునై • భ్రామ్యద్విహంగాంగనా
కలరావక్షతనిర్ఝరీప్రణయ రు • డ్గర్వోత్కరంబై సుగం
ధిలవాతాంకుర భిన్నకుట్మలగణో • త్కరంబునై మించు నీ
లలితోద్యానము నాకు నిత్యమగు నా • హ్లాదంబుఁ గావించెడుం.

] అనిపలికిన విని గిరిరాట్తనయ కరాబ్జముల మోడ్చి • దానవహగ నీ
యనుకంపకలిమిఁ గాంచితి ననఘంబగు దీని ధన్య • నైతి ముదమునం.

తే] మోక్షదాయకమగు నవి • ముక్తమహిమ వినినకోలఁదిని విను వేడ్క • వృద్ధిగాంచుఁ
గాన కరుణాతరంగిత • మానసుండవై వచింపుము గాశీమ • హత్త్వమింక.

] అనవుఁడు చంద్రశేఖరుఁ డ • హార్యసుతావచనంబులాలకిం
చి నిఖిలశంకరుండగుటఁ • జేసి తదీయ మనోరథంబుఁ గూ
ర్తునని తలంచి మించిన కు • తూహలమొప్పఁగఁబల్కె నిట్టు లో
వనితభవన్మృదూక్తుల క • పార ముదంబు చెలంగె నాత్మలో.

—• అవిముక్త క్షేత్రమహిమ •—

తే] వివిధతరు సమాకీర్ణమై • విహగనికర రాజితంబగు నీ క్షేత్ర • రాజమందు
నుఁగుతీఁచి తపమాచరిం • చిన నరులకుఁ గరతలామలకంబగుఁ • గదవె ముక్తి.

క] అనయంబీ యవిముక్తదేశము మహీ • యావాస యోగ్యంబుగా
న నరుం డెవ్వఁడయేని యిందునగిక • న్యానాథ! భూతేశ భ
క్తినికాయ ప్రియయంచుఁ బల్కుచును స్తో • త్రం బెప్డు గావించు నా
తని కీ దేహముతోనె గల్గెడిని మ • త్సాన్నిధ్యమో యీశ్వరీ.

] ఇది సకలాఘనాశకర • మిందు నివాసముయోగ్యమంచు లో
నఁ దలఁచి దీని వీడక య • నారతమున్ వసియింతుఁగాన యి
య్యది యవిముక్తమన్ బ్రవిమ • లాఖ్య వహించి చెలంగు మానిరా
ట్పదహయి దీని దర్శనము • భక్తజనాళికి సంతసంబగున్.

] ఆనందకపాణిప్రముఖా నిమిషులు గొల్వఁగా మ • హానందముతో
నేనుందు నక్కతన నిది యానంద విపినసమాఖ్య • నలరుచునుండున్.

శా॥ భూతవ్రాతభయంకరాంగక సము • ద్భూతంబులొ నెన్నియో
భూతప్రేత పిశాచ రాక్షసగణం•బుల్ భక్తిమై వేంటరా
ఖ్యాతంబైన స్మశానవాటిఁ దిరుగం • గాఁగోగుదుఁగాన ని
ర్ధూతాఘంబు మహాస్మశానమను పే • రున్ గాంచిమించున్ ధరన్.

చ॥ కలుషమహాతమఃపటల • ఖండనచండ మయూఖ ఘృష్టియై
యలరు తపస్వి లోక విహి • తామర కార్యవిఘాత కృత్ఖలా
వళికి సకాలమృత్యువయి • భాసిలురుద్రపదంబు నాయెడన్
నిలువఁజరింతు గాన రమ • ణీ యిది రుద్రగృహంబు నాఁబడున్.

చ॥ కనఁబడు నీ చరాచర జ • గంబున యందుఁగలట్టి యెల్లయా
ననఘములైన క్షేత్రముల • కన్నఁ బ్రకాశముసై పవిత్రమై
యనయము నాస నహర్ మగు • నట్టి ముదంబును గూర్చుఁ గాన నో
వనరుహనేత్ర యిప్పద మ • వారిత రీతినిఁ గాశినాఁబడున్.

తే॥ వరుణయును నసి యనియెడు • వణ సమితి చేరి యేకవాక్యంబుగా • వారణాసి
యనఁగఁబడు నిమ్మహాక్షేత్ర • మఖిలవేదులైన మునిపుంగవులచేత • నహరహంబు

వ॥ ఇమ్మహాస్థలంబునను బ్రయాగంబునందును నన్ను సేవించువారికి ముక్తికాంతా సౌధ కవాటంబు లప్రయత్నంబుగఁదెఱవఁబడు. అందును దీర్థరాజంబగు బ్రయాగంబునకన్న నీ యవిముక్తంబు శ్రేష్ఠంబు, మఱియు నైమిశంబునను గురుక్షేత్రంబునను గంగాద్వారంబునను బుష్కరంబునను స్నానసంసేవనాదుల దుర్లభంబని తెలుచిన కైవల్యంబు నప్రాయాసంబున మానవుండు చెందును గాన యియ్యది తక్కినవానికన్న నెక్కుడనఁబడు.

చ॥ వనరుహలోచనా విను మ • వారితు మామకబుద్ధిసత్వ రూ
పునిఁ గరుణాలవాలు సుర • పోషకు నిత్యము గాశికాపురం
బును భరియించి లోకములఁ • బ్రోవుమటంచును నాజ్ఞఁజేసి యి
య్యనఘతలంబుఁ జేర్ప నతఁ • డర్థివసించుచునుండు నిచ్చటన్.

—• మణికర్ణికా ప్రభావము •—

చ॥ అనఘుఁడు చక్రపాణి హృద • యంబున హర్షమెసంగ మామకా
జ్ఞను దలఁ దాల్చి యల్లె యెడి • కంబున నియ్యవిముక్తముఁ సనా
తనపథమాని ప్రోచుచుఁ • బదంపడి యెక్కుదినంబునన్ సుద
ర్శనమునఁ ద్రవ్వె నొక్కయెడ • రాజితపల్వలమున్ మహోన్నతిన్!

తే॥ ఖననసమయ ప్రయాస సం • జనిత విపుల ఘర్మజలములఁ బూర్ణంబు • గా నొనర్చెఁ
బంకజాలంబుఁ దమ్మహా • పల్వలంబు వినుతిపాత్రంబునై ధాత్రి • వెలయునటుల.

తే॥ అటుల గాళ్యంతరమున నా • రాయణుండు భువనరక్షాభిరతిఁ జేసి • పూర్ణమైన
పుష్కరిణి ద్రవ్వి తత్తటం • బునను వేయు నెనిమిదేండ్లు దపముఁ జేసె • నను గుఱించి.

చ॥ స్థిరమతి నాహ్రదంబు దరిఁ • జేరి తపం బొనరించు కాంచనాం
బరునకు దర్శనం బిడి స్వ • భావ మనోహరమై చెలంగు నా
సరసిని జూచుచుండ విల • సన్మణికర్ణిక మిట్టి తజ్జలాం
తరమునఁ జేర నందుకత • నన్ మణికర్ణిక నాఁబడున్ ధరన్.

తే॥ నిర్మలాంభః ప్రపూర్ణమై • నెగడునట్టి యమ్మహాతీర్థరాజ మ • త్యంతమహిమ
హరి సుదర్శన నిర్మితం • బైనకతనఁ జక్రపుష్కరిణి యనంగ • జగతిబరగు.

ఉ॥ ధర్మపదంబు వీడక ప • దంపడి మామకలోక కాంక్షచే
నిర్మలినాత్ముఁడై యెవఁ డ • నిందితమా మణికర్ణికాతటం
బర్మిలిఁ జేరి వేదవిహి • తాఖిల సత్క్రియ లాచరించు నా
ధార్మికుఁ డెప్పుడున్ వినఁడు • దండధరానుచరార్భటధ్వనుల్.

వ॥ మఱియు నా తీర్థరాజంబు తటంబున శ్రుతివిహితంబులగు స్నానసంధ్యా జప హోమ స్వాధ్యాయ పితృతర్పణాది నిత్యకృత్యంబులును వ్రతోద్యాపనోపవాసాది నైమిత్తికంబులును లింగప్రతిష్ఠాద్యక్షయ మోక్షదాన చతురంబులగు ధర్మకార్యంబులును గావించునాతనికి మఱియపదంబు సిద్ధంబయగు నిదియుఁగాక యింకొక విశేషంబుగల దాకర్ణింపుము.

మ॥ కృతకృత్యుండు భగీరథుం డనెడు ను • ర్వీనాథుఁ డత్యంత దు
ర్మతులౌటన్ గపిలర్షి కోపమను శుం • భద్వహ్నిచే భస్మసా
త్కృతులై మ్రందినయట్టి సాగరుల ర • క్షింపంగ భాగీరథిన్
క్షితికిన్ దెచ్చెడు వేళ గంగ ప్రవహిం • చెన్ జక్రతీర్థంబుపై.

తే॥ పరమపావని గంగాభ • వాని సోఁకి తావిగల్గిన తప్తకా • ర్తస్వరంబు
కరణి దేవకిరీట సం • గతి వహించి వెలసె నిది యెల్లలోకముల్ • వినుతిసేయ.

చ॥ అనిలదళాంబు భోజనకృ • శాంగులరై గిరిదుర్గసీమలన్
ఘనతరకాననంబులను • గష్టము నాక సహస్రవర్షముల్
మనమది నిల్పి భక్తిగ నొ • నర్చు తపంబున కన్న నిందునన్
మునిగిన తాపసుల్ సుకృత • ముం గొనవచ్చుఁ గరంబు నిత్యమున్.

తే॥ ఇమ్మహాక్షేత్రమునఁ గిన్న ♦ రేశ్వరుండు నను గుఱించి తపమొనరించి ♦ యనఘమైన
గణపతిత్వంబుఁ గొనుటయ ♦ గాక నాకుఁ బ్రాణపదమైన మిత్రమై ♦ పరగె మున్ను.

చ॥ నిరతతపః ప్రభాపహృత ♦ నిష్ఠుర సర్వతపస్సమూహుఁడై
యరితతిఁ గెల్చి వేదనిచ ♦ యంబును దెల్లమొనర్చె నే పరా
శరసుతుఁ డాతపస్వి విల ♦ సన్మతి మామకభక్తుఁడై నిరం
తరము వసించు నిప్పురము ♦ నన్ మునిలోకము సన్నుతింపఁగన్.

చ॥ అరయఁ జరాచరంబగు మ ♦ హావని క్షేత్రములందుఁ గాశికా
పురమె పవిత్రదేశమని ♦ పూన్కి సరోజభవుండుఁ గాచనాం
బరుఁడును దక్కు వేల్పులును ♦ భక్తిమెయిన్ ననుఁగొల్తురో కృశో
దరి యిటఁ జేరి మామక క ♦ థామనన శ్రవణాది వాంఛలన్.

—♦ గోప్రేక్షక క్షేత్ర మహిమ ♦—

తే॥ కనుఁగొను మఱియు గోప్రేక్ష ♦ కంబు నాఁగఁబడెడు క్షేత్రంబు పద్మ సం ♦ భ[వుఁడు తొల్లి
భక్తి స్థాపించెఁ గైలాస ♦ భవనమచట శైవులకుఁ గల్పవల్లి యా ♦ సత్పదంబు.

క॥ రాగాదియుతుం డేనియు నీ గోప్రేక్షకముఁ జేరి ♦ యెవ్వఁడు భక్తిన్
భోగిధరు నను భజించునొ యా గుణనిధికిత్తు వాంఛి ♦ తార్థములెల్లన్.

మ॥ చతురాస్యుండు మదీయ భక్తజన వా ♦ త్సల్యంబునన్ దొల్లి సం
తత పాపఘ్నము నీ హ్రదంబు నతులో ♦ త్సాహంబునన్ గూర్చె నం
చితగోస్తన్యజ నీరపూరమున స్వ ♦ ర్శ్రీదాన దక్షుండ నే
నతిమోదంబున నందు నిండుఁ గపిలా ♦ ఖ్యన్ మించు తీర్థంబునన్.

క॥ ఇది పరమ పవిత్రంబీ హ్రదమున నీరంబుఁ గ్రోలు ♦ టపవర్గదమా
నిది యఖిలసుకృత నిచయాస్పద మొక్కటి లేదు దీని ♦ సరి వసుమతిలో.

క॥ అదె కనుము భద్రతోయము సుదతీ నిర్మించెఁ బద్మసూతి క్షణంబా
హ్రదమున మునిఁగినవారల కిదియని చెప్పంగనేల ♦ యిత్తు నిఖిలమున్.

చ॥ ధరణిధరాన్వయాధిపుఁ డు ♦ దారుఁడు నీ జనకుండు నాయెడన్
దిరమగు భక్తి నన్నదె ప్ర ♦ తిష్ఠితుఁ జేసెను భద్రతోయ పు
ష్కరిణి తటంబు చెంత జల ♦ జప్రభవాది సమస్త నిర్జరుల్
కరమరుదందభాలిక జ ♦ గంబుఁ దరింపఁగఁ జేయు నిష్ఠతో.

తే॥ చెలఁగి శైలేశ్వరప్రతి ♦ ష్ఠితుఁడనగుట నేను శైలేశ్వరాఖ్య వ ♦ హించి మింట
నకుటిలంబగు భక్తి నే ♦ యనదయైనఁ గాంచెఁబోవాఁడు దుర్గతిఁ ♦ గాంచఁ డెప్డు.

## — సంగమ క్షేత్రమహిమ —

మ॥ శ్రితలోకైక వరప్రదానచణ మీ • క్షేత్రంబు నిత్యంబలం
కృతి గావించి యనింద్య నీరయయి కీ • ర్తిగాగన్న యాగంగ సం
గతి స్వచ్ఛంబయి పూతమయ్యె వరుణా • ఖ్యన్ మించు తీర్థంబదే
సతి కన్గొమ్మటఁ దానమాడుటయె మ • త్సాయుజ్యదంబౌ నిలన్.

వ॥ సకలపాప విమోచనయగు వరుణానది శైలేశ్వర క్షేత్రంబున కకృతంబగు నవతంసమై యియున్న యీ సంగతయగు కతన నది సంగమస్థానంబనఁ బ్రసిద్ధివడసె.

తే॥ మహిమ నతిఁగాంచుఁ దత్సంగ • మస్థలమున భువనరక్షాభిరతిఁ జతు • ర్ముఖుడు తొల్లి
కనకమయమగు దివ్యలిం • గంబుఁ దెచ్చి వెసఁ బ్రతిష్ఠించె మునివరుల్ • వినుతిఁ జేయ.

తే॥ అక్కాలతన సంగమేశ్వరా • ఖ్యను వహించి భక్తజన కల్పకంబునై • పరగుచుందు
ననఘ మీసంగమక్షేత్ర • మం దెవండు నన్ను బూజించు నాతని • కున్నెయఘము.

మ॥ స్థిరచిత్తుండగు నెవ్వఁడేని విలస • ద్దివ్యాంబు సంపూర్ణయా
వరుణాపుష్కరిణిన్ మునింగి శ్రితపా • పఘ్నుండు శ్రీ సంగమే
శ్వరుఁడే యంచును విశ్వసించి మది న • వ్యాజంబునౌ భక్తితోఁ
దరుణీ నా కభిషేకమున్ సలుపు నా • తం డెందునన్ బూజ్యుఁడౌ.

తే॥ మహితసంసారవార్ధి ని • ర్మగ్నుఁడయ్యు మానవుఁడు వరుణాతోయ మానెనేని
కోటిజన్మంబులకును జె • న్నారనట్టి ముక్తి కాంతాపరిగ్రహ • ముం బొనర్చు.

తే॥ పరమయోగిజనైక ని • వాసయోగ్యమైన పదమని యీ క్షేత్ర • మందనిశము
మధ్యమేశాఖ్యఁ దాల్చి సమ్మతివసింతు వేల్పు జడదార్లు సతము సే • వింపుచుండ.

## — శుక్రేశ్వర మహిమ —

మ॥ దనుజాచార్యుఁడు భార్గవుం డఖిల త • త్వజ్ఞాన సంపన్నుడౌ
ట నిరీహాత్ముఁడునై సమస్తము నిరా • టన్ంబ్రార్థనన్ జేసి మో
క్షనిధానంబగు నమ్మహాస్థలమునన్ • స్థాపించె లింగంబు భ
క్తిని శుక్రేశ్వరమన్ బ్రసిద్ధివడ నేం • తే స్వాభిధానంబునన్.

క॥ ఆ శుక్రేశ్వరమందు గిరీశుని నను భక్తిఁగొల్చు • నేని నరుం డే
క్లేశంబును జెందక భవపాశంబులఁ ద్రెంచివైచుఁ • బటుతరశక్తిన్.

చ॥ కమలజ దత్తఘోరవర • గర్వితుఁడైమును జంబుకంబు రూ
పమున సురారి యొక్కఁడని • వారితవిక్రముఁడై యధర్మ కృ

త్యముల నొనర్చుచుంట విపు • లాహవరంగమునన్ దదుత్తమాం
గము వెసఁ ద్రుంచితిన్ సుర ని • కాయము ప్రీతమనస్కులై కనన్.

తే॥ జంబుకాసురు నాత్మ వి • క్రాంతిఁ గోరి వరమొసంగితి నాతని • మరణవేళ
సతత మాతఁడు వడిన దే • శమున జంబుకేశ్వరాభిధ నే వసి • యింతు ననుచు.

చ॥ అనిశ సమర్చనానిరతు • లై మునివర్యులు మజ్జటాటవీ
జనిత సురాపగాసలిల • సంతతి నెంతయు భక్తిమజ్జనం
బొనరిచి జంబుకేశు నిగ • మోక్తవిధిన్ భజియింతు రర్కునం
దన కృత శాసన క్రియను • దార్కొనునంతటి శక్తియుక్తులై.

క॥ అని తత్తద్దేశంబులఁ గననగు తీర్థంబులను బ్ర • కాశము తొలిం
గనికరములఁ జూపించుచు ననఘుఁడు శంభుఁడు భవాని • కను నీక్షిలిన్.

ఉ॥ అంచితభక్తి యేర్పడ గ్ర • హంబులు సాధ్యులుఁ గిన్నరుల్ నరుల్
గాంచనగర్భుఁడున్ ముని • నికాయ మొకొక్క విధంబునన్ బ్రతి
ష్ఠించిన లింగమూర్తులవె • చేడియ! కన్గొను మెన్నియేండ్లు వి
న్పించిరిఁ గాని యమ్మహిమ నిందె యొనర్చెడు శ్రోతృపాళికిన్.

తే॥ అనుచు లోకైక శంకరుఁ • డగు శశాంక శేఖరుఁడు గిరి కన్యకా • చిత్తమలర
మమత వారాణసీ మహి • మంబుఁ దెల్పి మెల్ల మెల్లన దిక్కుల • నెల్లఁ జూచె.

వ॥ అట్లు పరమేశ్వరుండు పార్వతీమనోదార్ఢ్యంబు నెఱుంగువాఁడై దిశావలోకనంబు గావించినప్పుడు.

— • శివుడు నిజసాత్వికమూర్తుల సృష్టించుట • —

చ॥ భసితవిభాసితాంగులును • పాశుపతాయుధభారులున్ జటా
ప్రసర విలీనచంద్రులును • పన్నగభూషణులున్ లలాట దే
శ సముచితాంబకుల్ కనక • శైలధనుర్ధరులున్ గృశానురే
తసులును గృత్తివాసులు ను • దారయశస్కులు వచ్చిరయ్యెడన్.

వ॥ మఱియు.

క॥ అతులిత రుద్రాక్షాలంకృత విపులోరస్కుల్ లభ్ర • కేశులు పాండు
ద్యుతిదేహులు శితికంఠులు నతభక్తావనులు వృషభ • నాథారూఢుల్.

క॥ ఆ కరణి నేగుదెంచిన లోకోత్తరులన్ సమస్త • లోకేశ్వరులన్
శ్రీకంఠుఁడు కనుగొని యపు డేకాంతమ ముచ్చటించె • నెంతయుఁ బ్రీతిన్.

సీ॥ ఆవ్విధంబునఁ గొంత మా • టాడి యప్పుడాత్మ సాత్త్విక మూర్తులై • యలరునట్టి
యమ్మహాత్ముల నొక మహా• ర్తమ్ము లోన నైక్య మొసరించె నిజశరీ• రాంతరమున.

చ॥ తరణి సహస్ర తేజమునఁ • దారు కనుంగొనినంత నేత్ర వి
స్ఫురణము నడ్డగించి పరి • పూర్ణ కృపా కలితాంతరంగుఁడౌ
హరుని శరీరభాగమున • యందునఁ జేరిన వారిఁగూర్చి భూ
ధరసుత యబ్బురంపడి సు • ధారకమౌళిని గాంచి యిట్లనున్.

మ॥ అనఘా నీ యనుకంప పెంపున మదీ • యాఘౌఘముల్ వాయ ము
క్తి నిధానంబగు కాశికా మహిమ మెం • తే భక్తి వింటిన్ జగ
జ్జననిత్వంబును గంటినైనను భవ • త్సామీప్యమున్ జేర వ
చ్చినవా రెవ్వ రెఱుంగ నేరనయితిన్ • జెప్పంగదే వారలన్.

తే॥ సకలసృష్టి స్థితిలయంబు • లకును నేతవైన నీ కృపకున్ బాత్ర • మగు భవాని
దృష్టికిన్ గోచరింపక • యొసఁగునదియుఁ గలుగునన నబ్బురంబగుఁ • గాదె జగతి.

ఉ॥ ఇంతటి లోకనాయకున • కే హృదయేశ్వరినై దిగంత వి
శ్రాంత యశోవిశాలుఁడు తు • షార గిరీంద్రుని కూర్మిపట్టినై
యెంతయుభక్తి నీ ప్రభుత • కే పదమైన మదీయబుద్ధికిన్
భ్రాంతి వహింపఁజేయఁగల • వారి మహత్వ మదెట్టిదో కనా!

తే॥ శ్రితజనావనతావకా • శ్రితులలోనఁ గరమునీ కనికరమున • కరయ నేనె
మనికిపట్టంచు మురియుచుం • టిని తలంపఁ గలరె నాకన్న దయనీయు• లిల నితరులు.

చ॥ అని గిరిరాజకన్య విన • యం బెదఁదోపఁగ వేడినన్ స్మితా
ననుఁడయి చంద్రశేఖరుఁ డ • నంత గుణాశ్రయుఁడౌట బార్వతీ
మనమునయందు సంధియము • మాన్పెడుపూన్కి తదీయ పాణి గై
కొని కరుణారసార్ద్రపద • గుంభితసూక్తులఁబల్కె నివ్విధిన్.

మ॥ తరుణీ! ప్రౌఢవె నీవు ముగ్ధవగు దే • తత్క్షేత్ర మాహాత్మ్య మె
వ్వరి కింతేని యెఱుంగ రాదనగ నీ • వా లో నెఱుంగన్ గుణో
త్తరవా దియ్యెడ భక్తియుక్తులయి చి • త్తస్థైర్యమున్ బూని మ
చ్చరణాబ్జంబులఁగొల్చువా రెపుడు న • త్సాయుజ్యమున్ గాంచరే.

తే॥ రమణి యిమ్మహాక్షేత్ర రా • జమున యందుఁ జిరమునను గూర్చి తపముఁ జే • [సిన మహాత్ము
లైననారలు నాలోన • నైక్యభావ మందుదురుకాదె సంధియ • మంద నేల?

తే॥ కడఁగి పంచాగ్నిమధ్యభా • గంబునందుఁజేరి తపమొనరించిన • వారె సుమ్ము
తరుణి నీ దృష్టికిని నిరో • ధంబుఁగూర్చి యలరు దుస్సహతేజులై • నట్టివారు.

తే॥ కార్తికమునందు నుభయ ప • క్షంబులందు నఖిలపర్వదినంబులం • దయనములను
జంద్ర సూర్యోపరాగమా • సమయములను రమణి గంగనుగలయు • తీర్థంబులెల్ల.

వ॥ మఱియు ఋతువులును నదులును సరస్సులును సప్తసముద్రంబులును, సంధ్యయును ప్రతిపర్వంబులందు నుత్తరవాహినియును హిమవత్సంభూతయు నఖిల కల్మష వినాశనియు నగు గంగం బ్రవేశించుచుండునని పలికి తక్కంగల విశేషంబులఁగూడ నెఱిఁగించి సర్వమంగళా సహితుండై వారణాసి బ్రవేశించె నంత లోకమాతయగు భవాని యవిముక్త మహాలింగంబును బయోఘృతంబులచేఁబూజించె. అమ్మహా క్షేత్రంబుననే భగవంతుండగు గజాననుం డుదయించెనని సూతుండు శౌనకాదు లకుఁ జెప్పుటయు

మ॥ విలసచ్చంద్రకళాప్రభాపటల సం • వీతారుణత్విడ్జటా
కలితోత్తుంగ శిరోగ్రభాగ మునిహృ • త్కంజాతకేళీవిలో
ల లసద్బంభర పాండ్యరాజతనయా • లంకార సృష్టిస్థితి
ప్రళయాధీశ సురాసురార్చితపదా • బ్జా! సుందరేశప్రభూ!

క॥ వందారు భక్తజనతా బృందారకలోక కల్ప • వృక్షాయిత మ
ధ్యందిన భాస్కరతేజా! బందీకృత రిపుసమాజ! • ప్రమథాధిపతీ.

తోటక వృత్తం॥

ఉరగాధిప భూషణ • హాత్మమన • స్సరసీరుహ భాస్కర • సచ్చరణా
పురశాసన నిర్మల • మూర్తిధరా • కరుణాకర మామక • కావ్యపతీ!

తే॥ కష్టపడి పెంచి యిడితి నా • కవితకన్నె నెవ్విధంబున నలరింతొ • యింక నీవు
గంగవోలెను గయ్యాళి • గాదు చేలసుమ్ము నీ తలనెక్కి • నాట్యమ్ము సేయ.

సీ॥ ఏ మహామహుఁడు శ్రీ వేమనారాధ్య వంశాబ్ధికిఁ బూర్ణ శ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి • కేనయ్యె సతుల్మెచ్చ మహిని బాతివ్రత్య • మహిమఁ గాంచె
నట్టి నందయకు గా • రమకు ద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోదరుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మచి • యమగు శ్రీమదాంధ్ర లింగపురాణోత్త • రార్థమందు
నలరు రెండవ యాశ్వాస • మయ్యె దీని సతము రక్షించుఁగావుత • చంద్రమౌళి.

---

శ్రీ మీనాక్ష్యై నమః

# శ్రీమదాంధ్ర లింగ పురాణము



## -• ఉత్తరభాగము •-

## —: తృతీయాశ్వాసము :—

క॥ శ్రుతినికరశిఖర గోచర! క్రతుభుక్పతివినుత! దక్ష • గర్వాపహరా!
నతశరణా! స్తుతచరణా! తతవృషవాహన గిరీశ! దానవహరణా!

వ॥ అవధరింపుము నిరంతర చంద్రశేఖరకథాశ్రవణ విగతకల్మషులగు శౌనకాది మహామునులు సూతుం గాంచి యిట్లనిరి.

సీ॥ అనఘములైన శంభుకథ • లన్నియు విన్నకొలంది వీనులన్
దనుపుచునుండు నందు కత • నకు వినఁ గోరికయయ్యె నిప్పుడా
ఘనుఁడు గజాననుం డెటుల • గాఁ జనించె గణాధిపత్యముం
గొనిన విధంబదెట్టి ముని • కుంజర మాకెఱుఁగంగఁ దెల్పుమా?

తే॥ శాంతమూర్తివి నీవు నీ • సహనమునకు నుర్వియును సాటిగా నేర • దో మహాత్మ!
వ్యాసమౌని కృపాసము • దంచ దఖిలశాస్త్రవేత్తవు నీకు సం • శయము కలదె.

వ॥ అని యడిగిన.

### —• సూతుండు నైమిశీయులకు గజాననోత్పత్తి విధం బెఱిఁగించుట •—

క॥ సూతుఁడు సకలపురాణవ్రాతజ్ఞుఁడు నిరతశర్వ • పదసేవా వి
ఖ్యాతమహత్వ విశారదుఁ డా తపసుల కిట్టులనియె • నతిహర్షముతో.

మ॥ దేవోద్యానము వీడి క్రమ్మర మహా • దేవుండు కాత్యాయనీ
దేవిం దోడ్కొని యగ్రసౌధమును శ్రీ • లిం జేరి యున్నంత రా
జీవాక్షుండును బద్మయోనియు సునా • సీరుండు దిక్పాలురున్
దేవుం డాదిగవచ్చి రచ్చటకు స్వ • శ్రీసంస్థాపనార్థంబుగా.

—• బ్రహ్మాదు లీశ్వరుని స్తుతించుట •—

గీ॥ అటుల నరుగుదెంచి • యమృతాంధసులు నతాననులగుచుఁ గరం • బులను మొగిడ్చి
రంధకారి మున్న • హాప్రభాలోకన జనితమైన సాధ్వ • సముసఁబోలె.

వ॥ అవ్విధంబున సకలదేవతా సందోహంబు పరమేశ్వరు భక్తి వినయంబులు వేసఁగొనఁ
బ్రణుతించి యిట్లని స్తుతించిరి.

సీ॥ కాలాగ్ని రూపాయ • కాలకంఠాయ విద్వత్సేవితాయ తు • భ్యంనమోస్తు
వేదాంత వేద్యాయ • విమలస్వరూపాయ ఫాలనేత్రాయ తు • భ్యంనమోస్తు
డిండీరపార ద • పాండురవర్ణాయ ప్రవిమలాభాయ తు • భ్యం నమోస్తు
పన్నగాభరణాయ • పాలితలోకాయ భవ్యగుణాయ తు • భ్యంనమోస్తు
నీలకంఠాయ గిరిశాయ•నిరుపమాయ యసురదమనాయ వ్యాఘ్రాజి•నాంబరాయ
యచల చాపాయ తుభ్యం న • మోస్తటంచు నిను భజింతుము నిరతంబు ని • ఖిలరక్ష.

ఉ॥ దక్షమఖాంతకుండవని • తద్దయు నిన్నె భజింతు మెప్పుడో
యక్షయభద్రదాన నతు • రా! భవదీయ గుణంబు లెన్నగా
దక్షుఁడెవాఁడు గావక ప • దద్వయ మెక్కడె దిక్కుమాకుఁ బ్ర
త్యక్షముగాఁ గదా శ్రితజ • నావనదీక్ష సతంబు నీయెడన్.

మ॥ కరముల్ మోడ్చి నమస్కరించెదము గం • గానిమ్నగాతుంగ శీ
కర సంసిక్త జటాకలాప! తుహిన • క్ష్మాభృత్కుమారీ మనో
హర నిర్ధూత సమస్తకిల్బిష ప్రపం • చాధార వందారు ని
ర్జరలోకైకశరణ్య! భూభరణ ద • క్షా నీకు సద్భక్తితో.

ఉ॥ ఎల్లెడలందు నీవయయి • యెందునఁ గాంచిన నందె యుందు వీ
కల్లజగంబు నమ్మి కొల • గానిపనుల్బచరించి పిమ్మటన్
దల్లడమందు మాయెడ సు • ధామధురంబగు శాంతమైన నీ
చల్లని దృష్టిఁ జేర్పుము ప్ర • సన్నుఁడవై కరుణాపయోనిధీ.

తే॥ పశుపతివి నీవు నీ యాజ్ఞఁ • బడసి తిరుగు పశువులము మేము నీదగు • పశుపతిత్వ
మిపుడు సార్థక మొనరింపు • మీశ యిదియె యంజలి ఘటించి మ్రొక్కెద • [మహరహంబు.

శా॥ ఏరూపంబున నిన్నుఁగొల్చెను మే • లేయయ్యెడుం గాని నీ
వీరూపంబుఁ గలాఁడవం చెఱుఁగఁగా • నేవారికిన్ శక్తిలే
దో గాకాత్మహితాంశు ఖండధర! వి • ద్యుచ్చంచలంబైన సం
సారంబందు నొకింతయేనియును వాం • ఛన్ వీడలేకున్నచో.

మ॥ నీ సంకల్పమునన్ జనించు జగముల్ నీలోన లీనంబులౌ
నీసర్వంబున కీవె యీశ్వరుఁడవౌ • దెవ్వాఁడు నీకన్న లేఁ
డీసర్వం సహాఁ బ్రోచు నేర్పరి భవా • నీశా పరంధామ తే
జోసహ్యుండవు మాకు శాంతుఁడవు గ • మ్మా దీనవాత్సల్యతన్.

శా॥ అనుచున్ భక్తివశాంగులై సురలు ని • త్యానంద సంధాన శీ
లుని నిష్కల్మషు నిర్గుణున్ బురహరున్ • లోకైకనాథున్ శ్రితా
వనుఁ జంద్రార్ధ కిరీటు నర్థ్యగతులన్ • బ్రార్థించినన్ మానిలో
క నుతుం డీశుఁడు వారి కెల్లరకు సా • క్షాత్కారుఁడయ్యెన్ గృపన్.

తే॥ ఆటుల సాక్షాత్కరించి శై•ప్యాద్రినిలయుఁ డఖిలరక్షకుఁడగుట ద•యాంతరంగుఁ
డై శ్రవణమాత్రమున నె యా • హ్లాదకరమైన మృదువచనంబుల • ననియె నిటుల.

—• శివుఁడు బ్రహ్మాదుల కుశలప్రశ్నము జేయుట •—

సీ॥ నేమమేగద మీకు మీ•చేయుపనుల కరయఁ గుశలంబెయగుఁగదా•యఖిల సాధు
కార్యముల కెందు విఘ్నంబు•గలుగదుగద సాగుచుండునె మీ సర్వ•శాసనములు.

తే॥ ఎన్నడును మీర లెల్లరు • నిటుల నొక్కపరిగ గుమిగూడివచ్చియుం•డ రిదియేమి
కారణము మిమ్ముఁజూడ వి • చారసహితమైన యాశ్చర్యమయ్యెడు • నాత్మలోన.

ఉ॥ దండితవైరి విక్రము లు • దారగుణాఢ్యులు మీరొకొక్క బ్ర
హ్మాండములైన నేలఁగల • యట్టి సమర్థులు గారె మిమ్ము ను
ద్దండత రాహవంబున ప • దంపడి రౌద్రవుఁగలట్టి శూరుఁ డొ
క్కఁడును గల్గునే వినుతిఁ • గాంచిన ధీరులు గారొ మీ రిలన్.

చ॥ ఉచిత విభూషణావళుల • నోరిమిదాల్పరదేమి వాహన
ప్రచయమె వీడునంతటి దు • రంతవిచార మదేలగల్గె సం
కుచితములై శరీరములు • కుందును సూచనఁజేయుచుండె నో
సుచరితులార! మీయునికిఁ • జూడఁగ డెందము సంచలించెడున్.

చ॥ సరసిరుహాక్ష యన్యులకు • సన్నయొనర్చెద వేమి కాంచనో
దరప్రతివాక్యమీయక వృ • థా తలపోసెద వేలయో పురం
దర వెనుకంజ వేయఁదగునా? చతురుండవె కా వచింపుమాం
గిరధృతిపిడె దేమిటికిఁ • గిన్నరనాయక యిట్లు నాకడన్.

తే॥ పితృపతివి నీవు నీకును • భీతిగలదె రాక్షసుండవెకా విచా • రంబదేల?
వరుణపాశముల్ గైన్యభా • వంబుఁదెల్పు జాతవేదసు తేజంబు • చల్లఁబడియె.

క॥ మీ యడిగిన యెల్లవరము లే యనుమానంబులేక • యీయనె మీకి
ట్లీయెడ విచారమేమిటి కే యుపకారంబు వలయు • నెఱిఁగింపుడీ కర్.

చ॥ వలసినయట్టి యర్థములు • వారక కోరుట మీకు ధర్మమా
నెలమిని మీ మనోరథము • లెల్లను దీర్చుట నాకు ధర్మమా
వలఘు గుణాఢ్యులార! హృద • యంబున సంశయమంద నేల మీ
తలఁపులలోన నిల్తునుగదా • పెరవారలె మీరుచూడఁగన్.

మ॥ అని లోకైక శుభప్రదాన్వచతురుం • డా శంకరుం డాదరం
బున వీక్షించి కృపాతరంగిత మన • స్స్ఫూర్తిన్ వచింపంగ హె
చ్చిన సంతోషముతోడ నిర్జరులు స్వ • శ్రీస్థాపనంబయ్యెగా
యని యుప్పొంగుచునుండిరట్టియెడఁ బ • ద్మాక్షుండు దా నిట్లనున్.

—• విష్ణుమూర్తి రాక్షసుల దుండగములగూర్చి యీశ్వరునితో జెప్పుట •—

ఉ॥ నీవె జగత్త్రయంబునకు • నేతవు నీవలనన్ జనించు లో
కావళి యెల్లభూతముల • యందున నొక్కగతిన్ జరింతువో
దేవభవద్గుణంబుల ను • తింపఁగ నేరికి నేర్పుగల్గు భ
క్తావన! నీయెఱుంగనిది • యారయ యొక్కటిగల్గునే యిలన్.

తే॥ సాధురక్షయును న • సాధుశిక్షయు నీకు నిత్యవిధులు గావె • నీలకంఠ
మాకుఁ దోఁచినటుల • మనవి జేయుటకునై యిటకు వచ్చినార • మిపుడు మేము.

చ॥ ఖలులు సురాపకారు లతి • గర్వితచిత్తులు దుష్టమార్గ సం
కలితులు మానిలోక కృత • కార్యవిఘాతకు లల్పబుద్ధులా
తులువలు దానవుల్ కడిమి • తో నినుఁగోరి తపంబొనర్చి నీ
వలన వరంబులన్గొని య • వారితులై చరియింతు రెప్పుడున్.

మ॥ తత బాహాబలమత్తులై సతత మా • దైత్యాధముల్ తావకో
న్నత కారుణ్య-వరప్రభావమున న • న్యాయక్రియామార్గసం
గతి మిన్నంది యసాధుసంచయము స • ఖ్యంబూని లోకత్రయీ
స్థితి నాశంబొనరింపఁజూచెదరు దు • శ్చింతాపరీతాత్ములై.

ఉ॥ క్రూరులు దుర్విచారు లతి • కుత్సితు లాదితిజాత్మజుల్ దురా
చారపరాయణత్వమున • సాధ్వస మింతయులేక నిచ్చలున్
వారికిఁ దోఁచినట్లు సలు • పన్ గమకించుచునుందు రట్టి దు
ర్వారపరాక్రమోద్ధతుల • వారికి నోర్వవశంబె యేరికిన్.

క॥ సురలకుఁ బ్రాముఖ్య మొసంగరు శ్రుతుల కపార్థములను • గల్పించెద ర
ధ్వరముల భంగముఁ జేయుదు రరిగాపులనైన మెచ్చ • రనవరతంబున్.

తే॥ ఉక్కు మెరయంగ నొక్కొక • రక్కసుండు దాడివెడలినయపుడెల్ల•గోడుజెంది
వేల్పులడవులలోఁ జేరి • వెతలఁ గుడుచుచుండవలసినదే కదా • యుగ్ర చెపుమా?

చ॥ సురవనితామతల్లుల వి • శుద్ధ చరిత్రలఁ బల్మి దెచ్చి ము
ష్కరులయి శుక్రశిష్యు • లనుకంప దలంపక బాధసేయ నె
క్కరణి సహింపవచ్చుఁ బ్రతి • కారము సేసెడి నేర్పులేని ని
ర్జరులకు నాత్మరక్షణ మె • శక్యముగానియెడన్ గిరీశ్వరా!

మ॥ అరిసంతానమకారణంబ నిజరా • జ్యశ్రీమహావైభవ
స్ఫురణం బెల్లనుగొల్లగొట్టుకొని స • మ్మోదంబుతో నెల్లడన్
జరియింపన్ బ్రతిసేయనేరక మన • స్తాపంబునన్ గానఁ ద్రి
మ్మరునాదిత్యుల కష్టమింకఁ దొలఁగింపన్ దారిలేదక్కటా.

క॥ ఒక్కొక యుగమున రక్కసుఁ డొక్కొకఁడుదయించి త్వద్వ•గోన్నతమహిమన్
శెక్కువెతలఁ గల్గించెదు నక్కట గతియేది సురల • కనఘా చెపుమా.

గీ॥ యజ్ఞకార్యంబులం దమృ•తాంధసులకు హవ్య మొసఁగుదురనియెడి • నట్టికినుక
బలిమిమునివరులనుబట్టి•కలుషమనక కాఱియలఁ బెట్టుచుంద్రు ర•క్కసులుఖలులు.

సీ॥ ప్రాణకంటకుఁడైన • వైరియొక్కఁడు తనం • తటివాఁడు బలమదో•ద్ధతుఁడు గలుగ
నాహారము రుచింప • దాప్తజనంబుతో మెలఁగుటకును బుద్ధి • కలుగ దెపుడు
నిద్రబట్టదు తరు • ణీమణుల్ భూతంబు లట్లగన్పట్టు దు • రాత్మవిధులు
క్లిష్టంబులై తోఁచు • గీతముల్ శ్రుతులకుఁ బరుషంబులై యునా • దరము గాంచు
ననఁగఁ బరమనీచు • లైనరక్కసులట్టి వైభవంబుఁ జెంది • వఱలుచుండ
లోకపూజ్యులైన • నాకులను గుఱించి యెట్లుబలుకవచ్చు • నిద్ధచరిత.

సీ॥ ఏదియో యొకస్వల్ప • హేతువుఁగొని రాక్ష సాళిని సృష్టిసే • యంగ నేల
దనుజులు తక్కిన • జనులట్ల తమతమ కృత్యముల్ సలుపక • త్రిదశులందుఁ
గత్తిగట్టితపంబుఁ • గావింపఁగా వారి మెచ్చినీవు వరంబు • లిచ్చుటేల?
నావరంబులకల్మి • నార్యులఁ బ్రోవక యసురులు జగములు • నడచుటేల?
నడుసుఁ ద్రొక్కి యడుగుఁ • గడిగికొన జలంబు నెమకువారిఁ బోలి • నిఖిలసురల
నుద్ధరించుటకు మ • హోగ్ర సంగ్రామంబుఁ జేయుటేల? దుదకుఁ జిత్తజారి!

తే॥ ఇట్టి సందిగ్ధసమయమం • దేదియేని యొక యుపాయంబుఁ జేసి దైత్య • కుల మింక
నున్నతస్థితిఁ జెందక • యుండునటుల దారిజూపఁగదయ్య పు • రారిమాకు.

తే॥ జ్ఞాతివిద్వేష మందందుఁ ♦ గలదుగాని యిట్టి విపరీతముఁ గంటి ♦ మే ధరిత్రి
నీవు కరుణింపకుండుదు ♦ వేని యింక నిలువ నీడయు లేకుండు ♦ నిర్జరులకు.

చ॥ అనవుఁడు రాజమౌళి హృద ♦ యంబు కరంబు దయారసార్ద్రమై
తనాశ్రితవత్సలత్వమును ♦ దద్దయుఁ గగ్గెడి రోమహర్షణం
బనియెడి కైతవంబు మెయి ♦ నల్లనఁ జూపఁగఁ బద్మపత్ర లో
చనుఁగని పల్కె నివ్విధిని ♦ జాలిఁదలంచి ప్రశాంతభావుఁడై.

ఉ॥ నిక్కువమే వచించితివి ♦ నీరజలోచన నావరంబునన్
రక్కసులుక్కుమీఱి సుర ♦ రాజ్యము నాశనముం బొనర్చి తా
రెక్కడఁ గన్నవారయి ♦ యెల్లజగంబుల బాధసేయుటల్
మిక్కిలిజాలిఁ గూర్చెడు సు ♦ మీ హృదయంబున నాకు నిచ్చలున్.

చ॥ స్థిరమగు భక్తి రక్కసులు ♦ సేయు తపంబును మెచ్చి వారికిన్
వరమిడకుండు టెట్లు గుణ ♦ వంతులుగాక యధర్మమార్గ సం
చరులయి క్రూరకార్యముల ♦ సల్పఁగ వారి వధింపకుండు టె
ట్లరయఁగ రెండుపద్ధతుల ♦ యందును సంశయమే పొసంగెదున్.

వ॥ భీకరారణ్యంబులఁ బవనపర్ణంబుల భక్షించి కఠినతపంబుఁ గావించు దైత్యులకిష్టార్థం బొసంగకుండుటుచితంబుగాదు. మఱియు వారి దురాచారంబులకుఁ గినిసి వధియించుటయు శ్రమంబయగు, రోగహేతువులగు మిథ్యాహారవిహారంబులఁ గావించి పిమ్మట నౌషధంబు సేవించుటకన్న తొలుదొల్త జాగరూకతఁ బూనుట ధర్మంబయండ్రు గావున.

—♦ శివుఁడు సురల నోదార్చుట ♦—

తే॥ సురల సాధించుటకునై య ♦ సురులు సల్పు తపము భంగంబుఁ జేసి దైత్యకులమునకు
హీనదశ గూర్పఁగల్గిన ♦ వాని నొక్క ఘనుని సృష్టింతు దేవతా ♦ కార్యమునకు.

చ॥ అరికృత నిష్ఠురావమతి ♦ యాత్మఁ బెనంగొని శుష్కమౌ శమీ
తరువును వహ్నియట్లు భసి ♦ తంబొనరింపఁగ నిల్వ నీడలే
కరపడి దీనులై తిరుగు ♦ నట్టి యమర్త్యుల బ్రోచుకంటె నా
కరయఁగఁ గజ్జ మొండు కల ♦ దా వివరింప నొకింతయేనియున్.

చ॥ మనసునఁ గుందుమానుఁ డవ ♦ మానము వీడుఁడు శాంతభావమున్
గనుఁడు జగంబు సౌఖ్యమును ♦ గాంచెనటంచును నిశ్చయింపుఁ డా
దనుజుల వంగడంబిఁక వృ ♦ థాయగునంచుఁ దలంపుఁ డల్లదే
కనుఁడు మదంశ సంభవుని ♦ గామ్యఫలప్రదు నిద్ధతేజునిన్.

తే॥ అనుచు మృదువాక్యములఁ బల్కి • యంధకారి యాదరముమీఱ నెల్ల బృం • [దారకులకు
వేలుపుంద్రోవ వంకను • వ్రేలు బెట్టి జూపుటయు వారలెంతయుఁ • జోద్యమంద.

—• గజాననావిర్భావము •—

మ॥ అతిలోకంబయి దుస్సహంబసచుఁ గ • ల్పాంతాగ్ని మాలాసము
ద్ధతి దిక్చక్రము నెల్ల గప్పి పురజి • త్ఫాలానలజ్వాలనా
వితతంబై ప్రచలిష్ణుభానుకరదీ • ప్తిక్రమించి పశ్యజ్జనా
ద్భుతమై యొక్క మహస్సు వెల్వడియె ని • ర్ధూతాంధకారంబునై

తే॥ అవ్విధినదృష్టపూర్వమై • యతులిత ప్రభావిరాజితమైన ది • వ్యమగు తేజ
మునుగనుంగొని నిర్జర • ముఖ్యులెల్ల భ్రాంతులగుచునచేన • త్వమునఁబరఁగి.

తే॥ అటులనొకముహూర్తక • మగునంతవఱకు విభ్రాంతచిత్తులై యు • నంతరంబ
శివునికరుణఁదెలిసి • చేతులజోడించి వినతులగుచుఁ బలికి • రనఘుతోడ.

చ॥ ఇదియనినిశ్చయించి వచి • యింపఁగఁ బోలదువింత తేజునన్
బొదలెడు దృష్టిలోపమును • బొందఁగఁజేసి వెలుంగునాదియున్
దుదియును లేక యల్లదియె • తోఁచెడు నాకసమందదెద్దియో
విదితముఁ జేయవే నిఖిల • వేద్యశుభాకర భక్తవత్సలా!

క॥ అని వేడినదరహాసం బొనరించుచు మెల్లమెల్ల • నుర్వీధర రా
ట్తనయాధిపుఁ డయ్యమరులఁ గనుఁగొని వచియించు నధిక • కరుణాన్వితుఁడై.

మ॥ అది బ్రహ్మాండము నిండి వెల్గెడి మదీ • యాంశం బనిర్వాచ్యమై
చదలన్ దారకవోలె నాయెడ నెనై • శ్చల్యంబుతో నుండు నె
య్యది యిష్టార్థదమంచు సన్మునులు ని • ర్వ్యాజంబు నా భక్తితో
మది సేవించి కృతార్థులౌదురది సు • మ్మా భ్రాంతి మీ కేటికిన్.

తే॥ ఏకొలంతదీర • నిట కేగుదెంచితి రా కొలంత దీర్ప • నదియ చతుర
వటుల మరలఁ జూడుఁ • డమ్మహాతేజ మేపగిదిఁ గాంచనగునొ • భ్రాంతివిడిచి.

తే॥ దీనవత్సలుండు • దేవదేవుఁడు మహాదేవుఁ డటుల విమల • భావుఁడగుచు
వైరి గర్వహరణ • వాంఛ నేతెంచిన యమరులకు వచించు • నట్టితఱిని.

చ॥ కరపవనాహతంబు లయి • క్ష్మాధర సంచయముల్ వెసన్ దృణాం
కురములు వోలె బెంగువడి • కొట్టుకొనన్ జెలరేగి మత్తబం
ధురములు గండభాగమున • వ్రాలుచు ఝంకృతిజేయగా మహో
దరమునఁ బాపజంబెములు • దద్దయు వ్రేలుచునుండ నత్తఱిన్.

తే॥ ఆదిమధ్యాంతరహితుఁడై • యలరువాఁడు శ్రుతిశిఖరగోచరుండగు • శుభ్రచరితుఁ
డొక్కఁడు పురుషోత్తముండు మహోజ్జ్వలాంగుఁ డగుచుఁ గన్పట్టె వేలుపు • లఁ బ్రబరఁగ.

తే॥ ఎలుకగుఱ్ఱంబు నెక్కిడి • బలిమి కాని నిఖిలలోకముల్ పాలించు • నేర్పు కాని
వక్రహస్తంబు వానిన • వక్రవిక్రమునిగనుంగొని కరముల • మోడ్చి సురలు.

— • దేవతలు గజాననుని నుతించుట •—

ఉ॥ ఈజనియించులోకముల • కెవ్వఁడు కర్త యెవాని పాదపం
కేజములాశ్రయించి కృత • కృత్యులరయ్యెద రెల్లమానవుల్
రాజితశూలపాణియును • రాజకళాధరునిన్ను నిచ్చలున్
బూజయొనర్తుమో సకల • పూజితమమ్ముఁ గృపన్ గనన్ గదే.

క॥ కరిరాజవరద తావక కరుణావర్షంబు గురియ • కతమున సచరా
చరలోకవ్రాతంబులు పరితృప్తింగాంచిమించు • బహువిధగతులన్.

వ॥ అని యనేక విధంబుల భయభక్తియుక్తులై వినుతించు నిలింపప్రకరంబుఁ గాంచి
గణేశ్వరుం డిట్లనియె.

చ॥ శ్రితజనవత్సలుండు శశి • శేఖరుఁ డీతఁడె మీకు నాకునున్
గతియగు నిమ్మహాత్ముఁడె జ • గంబులకెల్లను గర్తసృష్టియున్
స్థితియు లయంబు నీఘనుఁడె • సేయుఁ జతుర్దశలోకముల్ మహో
న్నతి నభివృద్ధిఁ గాంచెదు న • నారత మీజగదీశు సత్కృపన్.

చ॥ ఒక జలధిన్ బ్రతిక్షణ మొ • కొక్కవిధంబునఁ గ్రొత్తక్రొత్త వీ
చిక లుదయించి వెంటనె న • శించెడుమాడ్కి సమస్త లోకనా
యకుఁడగు వ్యాఘ్రచర్మధరు • నందుఁ జరాచర లోకజాలముల్
సకలములున్ జనించి యుప • సంహృతినొందెడు నెల్లకాలమున్.

ఉ॥ ఆరయ నే మహాత్ముని ద • యారస మించుక గల్గకున్న సం
సారపయోధి మగ్నులయి • సంతతమున్ దరి గానలేక దు
ర్వార విపత్పరంపరల • పాలయి యెల్లరు గుందుచుందు రా
ధీరుని చెంతఁ జేరి పరి • తృప్తిని గాంచరె యస్మదాదులున్.

క॥ ఆరీతి వినయమున బృందారక తతితోడఁ బల్కి • దర్పక దమనున్
గూరిచి మెల్లన నిట్లను గారుణ్యపయోధియైన • కరిముఖుఁ డంతన్.

## —• గజాననుఁ డీశ్వరుని స్తుతించుట •—

శా॥ దేవా నీకెఱుఁగంగరాని దొకఁ డెం • దేఁ గల్గునే యెప్పుడున్
భావింపంగ సమస్త జీవులకు నీ • ప్రాపే గదా మోక్ష ల
క్ష్మీవాల్లభ్యముఁ గూర్ప నేర్చును జగ • చ్ఛ్రియంబు సంధించు నీ
సేవాసక్తిఁ జరించు మాదృశులకున్ • నేమంబు చేకూరదే.

శా॥ అష్టైశ్వర్య సమేతుఁడై నిరత ని • త్యానంద సంపూర్ణుఁడై
శిష్టానుగ్రహ దుష్టనిగ్రహములన్ • జేయంగలాఁడై జగ
త్సృష్టిస్థిత్యవసాన నేతయయి తా • నే యెల్లెడన్ వెల్గును
త్కృష్టుండైన మహానుభావుఁడవు నీ • వే కాదె దీనావనా!

క॥ నీయాజ్ఞానుచరుండగు నీ యల్లుని సృష్టిసేయ • నేమిటికి జగ
న్నాయక మురరిపు సాయక నాయెడఁ గరుణారసంబు • నన్ దెల్పఁగదే.

మ॥ అనఘా యియ్యెడ నాకు జేయదగు కా • ర్యం బెద్దియే దుష్టదై
త్యుని మత్తీవ్ర పరాక్రమానలమునం • దున్ బూది గావించి లో
కనికాయంబునకున్ సుఖంబు గలుగం • గాఁ జేయ నీయాజ్ఞయా
ననుచున్ బల్కిన విఘ్ననాథునకు • జంద్రార్ధావతంసుం డనున్.

## —• శివుఁడు గజాననునకు గణాధిపత్యంబొసంగుట •—

సీ॥ నిజము నీపల్కులు • నిర్మలంబులు చరా చరలోకముల సృష్టి • సలుపువాఁడ
నేనయైనను మన • ఇంద్రియంబు ప్రధానమై తక్కుఁగల యింద్రి • యములతోడ
నయ్యయి కార్యంబు • లాచరింపఁగఁ జేయు పగిది నింద్రాది • దిక్పాలవరుల
సృజియించి లోకసం • స్థితిఁ గూర్చుచుందును గావున దేవతా • కార్యకరణ
చతురుఁడవటంచు నిన్ను నీ • సమయమందు సృష్టిసేయంగవలసె ని • నిర్జరేంద్ర తేజ
నేఁడు మొదలుగ నీయందు • నిలిచియుండు సాధుకృత్యంబులెల్లను • సంతతంబు.

చ॥ ఖలులగు దుష్టదానవులు • గర్వము పెంపున నెల్లవేల్పులన్
దలఁపడి బాధసేయుదురు • తాపసులన్ వధియించుచుందురా
పలవలు గీటడంచినను • బల్మరుబుట్టుచునుంద్రు వారిదౌ
బలము తపఃప్రభావమున • బ్రాప్తమగున్ నిరతంబు వింటివే.

తే॥ వారుసేయు తపము • వారింపగా నెంత వారికైనఁ గాని • వశము గాదు
తత్తపఃఫలమున • ధర్మబాహ్యులరయి సంచరించుచుంద్రు • సకలదిశల.

చ॥ పలుమరువారొనర్చెడి తె • పంబును విఘ్నముసేయునట్టి కౌ
శల మదినీకె కల్గెడిని • సర్వసమర్థుఁడవీవు దేవతా
వళికి ననిష్టముల్ సలుపు • వాఁడెవ్వఁడేనియు వాని యత్నముల్
గలుష మొనర్చుచుండుము జ • గద్ధితమొం బొనరించు వేడుకన్.

చ॥ స్వమతము దూరి యన్యమత • సంగతి వంశపరంపరాగతో
త్తమమగు ధర్మముల్ విడి య • ధర్మపథంబునఁ గాలుబెట్టి య
క్రమమునకున్ భయంపడక • కంటకులై చరియించుచుండు పా
పమతులొనర్చు కార్యముల • భంగముసేయుము లోకసిద్ధికై.

క॥ ననుఁగాని హరిని గానీ వనజభవునిగాని విమల • భావముతోడన్
వినుతించు వారొనర్చెడు పనులను భంగంబుసేయ • వలదించుకయున్.

చ॥ తొలుత నవిఘ్నమస్తనుచు • దోసిలి యొగ్గి నినున్ భజించు నా
రలకు శుభంబుగూర్చెడి వ • రంబు లొసంగుము యెవ్వడేని నిన్
గొలువక సల్పుయత్నమున • కున్ బలుమారు గొఱంత గూర్పుమో
యలఘుచరిత్ర మాకిదయె • హర్షము గూర్చెడి కార్యమౌ నిలన్.

తే॥ పాదులను నేల తొండ్లను • వైశ్యకులము వారు శూద్రులుం తక్కిన • వారలెట్టి
కార్య మొనరింపబూనిరఁ • గానినిన్ను తొలుత పూజించుచుందురు • పలువిధముల.

తే॥ దేవతానిందకులగు నా • స్తికులం నిన్ను బూజసేయని కతన నెప్పుడును విఘ్న
బాధితులరయి నరకసం • ప్రాప్తి జేసి వెతలగుడుచుచునుందురు • వివిధగతుల.

ఉ॥ ఈసచరాచరంబయిన • యెల్లజగంబున కీవ కర్తవై
వాసవముఖ్యులైన సుర • వర్గము లెల్ల నినున్ భజింపగా
భాసుర వైభవోన్నతుల • భక్తజనామరశాఖివై యనా
యాసమునన్ మెఱంగుము గ • ణాధిపతిత్వము నీకొసంగితిన్.

తే॥ విఘ్నములకు నీవ • విభుడవైన కతన విఘ్న నాథుఁడవన • వినుతిగనుము
ప్రమథగణము నీకు • భటులౌదు రటుగాన గణపతియన జగతి • గణుతిగనుము.

తే॥ కుడుములుండ్రములును • గొబ్బరిపండ్లును పాలుపంచదార • పానకముల
నొసఁగి నీకుఁ దృప్తి • నొనఁగూర్చెదరు నేఁడు మొదలు సకల జనులు • మోదమలర.

క॥ ఇమ్మాడ్కిని గణనాథున కిమ్మాగ జేయదగు కార్య • మెఱిగించి ప్రమో
దమ్మున వాతని కిట్లను గ్రమ్మర నుడురాజమౌళి • కరుణదలిర్పన్.

—• సంధ్యాకాల వర్ణనము •—

చ॥ కనుమదె యుష్ణభాను డొడి • కంబునఁ జక్రచయంబు నేలి చ
య్యన నపరాచలంబు శిఖ • రాగ్రము డిగ్గి క్రమక్రమంబుగా
వననిధి దానమాడి భగ • వంతుని నన్ను భజించు వాంఛమై
జనియెడు బద్మినీ తరుణి • సంగమదోష నివారణార్థమై.

చ॥ అపరిమితానురాగ భరి • తాంగుడు పంకజ బాంధవుండు దా
నపరదిశాంగనా పరిణ • యం బొనరించెడు వేళఁ దద్వివా
హపద మలంకరించెడు ము • దా ప్తిని కాలవిభుండుపట్టురర
క్తపటములో యనఁగ వెలుఁగు • గాంచితె యాదెస సాంధ్యరాగముల్.

చ॥ వారులు గట్టి పక్షులు న • భస్థలి నెల్లెడ నిండి గూండ్లకై
పారెడు నుష్ణభానుకర • పంక్తి ప్రశాంతమునై వెలుంగు నీ
హారకరుండు మెల్లన బ • యల్వెడ జూచుచున్నవాడు సాం
ధ్యారుణ రాగసంతతి ప • రాశల జెందుచు గాంచనయ్యెడిన్.

మ॥ పరమామోదమునన్ మహర్షులు సుప • ర్వ శ్రేణియున్ యక్ష కి
న్నర విద్యాధర సాధ్యకింపురుషగం • ధర్వాదులున్ భక్తి మ
చ్చరణాబ్జంబుల స్వాంతమందునిచి • సంధ్యాకాల మత్తాండవం
బాయన్ గోరుచునున్నవారదె గజా • స్యా కంటివే యియ్యెడన్.

తే॥ పరమసాధ్వియైన • పర్వతకన్యయుఁ దక్కఁగల యచర్య్య • దారలును న
నిఁద్యచిత్తలగుచు • నెమ్మిమైమత్తాండ వంబుగాంచ వేడ్క • పడుదురిపుడు.

వ॥ అని పలికి యప్పుడు.

చ॥ అరుణకరాంగుళీకిసల • యంబుల సంగతి నెబ్బవార బం
ధుర తరపద్మరాగ రుచి • నూతనశోభ వహించి మించి సు
స్వరజనకంబులై మృదుల • పద్ధతి తంత్రులు మ్రోగుచుండ నం
బురుహజురాణివల్లకిని • బూనిముదంబున మీటుచుండగన్.

—• పరమేశుండు తాండవంబుజేయుట •—

సీ॥ భక్తిరసావేశ • పరవశుండైగోత్రభేది పిల్లనగ్రోవి • నూదుచుండ
నెనిమిదిచేతుల • నెసకమెసగ బ్రహ్మ లయతప్పకుండ తా • ళంబువేయ

తనపికవాణిత్వ ◆ మును దెల్పునో వాఁగ నళినాక్షుదేవి గా ◆ నంబుజేయ
లలితస్వనంబు వి ◆ కచ్ఛాలమారుద్రమో యవైకుంఠుండు మార్దంగి ◆ కుండుగాగ
నిఖిలగాంధర్వ విద్యాప్ర ◆ జేతలెల్ల భ్రాంతచిత్తులై చేతన ◆ త్వముదొలంగ
గరిన శిలలును నల్లన ◆ గరగిపోవ బురహరుడు తాండవమొనర్చె ◆ హరువునీర.

ఉ॥ నావిని నైమిశీయులు మ ◆ నంబున హర్షమెసంగ భక్తిసం
భావనజేసి సూతముని ◆ వర్యునిగన్గొని పల్కిరిట్టులో
పావనరూపనీకతన ◆ పాపనివారకమై సమస్తలో
కావనమైన యాకరివ ◆ రాస్యుని పుట్టువు వింటిమెంతయున్.

క॥ సర్వసుపర్వుల నడుమ న ఖర్వపరాక్రముఁడు కాల ◆ కంఠుఁడు సురరా
డ్గర్వాపహారుండగు నాశర్వుడు తాండవము నేల ◆ సలిపెనొ చెపుమా.

చ॥ అనవుడు వ్యాసశిష్యుఁడవు ◆ నౌ సుకృతప్రదమౌ చరిత్రమే
వినఁగ దలంచినారలు వి ◆ వేకము గల్గుటకున్ బ్రయోజనం
బనఘుల సత్కథావళుల ◆ నారయుటే కద నాయెఱింగినం
త నీక వచింతు శంభుకృత ◆ తాండవ కారణమున్ ముదంబునన్.

— ◆ దారుకాసుర చరిత్రము ◆ —

క॥ తొల్లి యొకప్పుడు దానవవల్లభుఁడగు దారుకుఁడను ◆ వాఁ డనిమిష రా
ట్తల్లజులను సాధింపఁగ నుల్లమునందున దలంచె ◆ నుగ్రుండగుచున్.

మ॥ దనుజాచార్యుడు భార్గవుం డసురసం◆తానంబు శ్రేయంబుగో
రినవాడౌటను దారుకాసురునకున్ ◆ మృత్యుంజయోపాసనం
బునకై మంత్రమొసంగ నాతడు తపం ◆ బున్ జేసె వెక్కేండ్లు శం
భుని భక్తావనతత్పరున్ గుఱిచి స ◆ మ్మోదంబు దీపింపగన్.

క॥ ఆకరణి తపముజేసి నిరాకులచిత్తుఁడగు దారు ◆ కాసురుడంతన్
గైకొనియె శివునివలన ననేకములగు వరములను న ◆ హీనప్రౌఢిన్.

వ॥ ఆవరంబు లెవ్వియన.

తే॥ పూన్కిదానెన్ని వత్సరం ◆ బులఁదపంబొనర్చె నన్ని యుగంబు ల ◆ నంతవిభవ
సహితుడై యెల్లజగముల ◆ శాసనంబుఁ జేయగల మహిమంబున ◆ జెలగునటుల.

తే॥ పురుషమాత్రుండెవండేని ◆ పోరనిలిచి గెలువఁగలవాఁడు మాఁడువే ◆ శలమ
కుండునట్టులఁ దనకు నా ◆ ఖండలాది సురలు సేవకులగునట్లు ◆ వరము గొనియె.

వ॥ అట్లు వరములఁ బడసి.

—• దారుకుడు లోకంబుల బాధించుట •—

ఉ॥ దారుణకర్ములై పరమ • దంబుల న్యాయముదప్పి దుష్టసం
చారుఁడు దారుకాసురుఁడు • సర్వచరాచర లోకజాలమం
దేరికినైన భీతిలక • యెంతయు తానె జగామగండునై
కారుణికుండు గాకయె జగంబుల • నెల్ల గలంచు నెమ్మెయిన్.

సీ॥ తొలుత దూరుపు రేని • తో జగడ మొనర్చి యతని సర్వస్వంబు • నపహరించె
నామీఁదఁగడిమిమై • నగ్ని దేవుని గెల్చి యతని తేజంబు జ • ల్లార్చివైచె
పిమ్మట దండెత్తి • పితృపతితోఁబోరి యతనిదండము ద్రుంచి • యడచివైచె
తదనంతరంబ యెం • తయుఁబూన్కి పోరాడి పశ్చిమేశుని బట్టి • భంగపెట్టె

వాయుదేవునకు పరాభ • వంబుగూర్చె గిన్నరాధిపుని జయించె • బన్నగావ
తంసు నిర్జించె లోకముల్ • తల్లడిల్ల దారుకాసురనాథుండు • క్రూరుఁడగుచు.

తే॥ దనుజకులజుండటంచును • దయదలంచి విడక నైఋతికిన్ గూడ • వెతలుగూర్చె
దారుకుఁడు దుష్టమార్గ సం • చారు లిలను స్వకులగౌరవమైనను • సలుపరుగద.

ఉ॥ ఆతఁడవక్రవిక్రమ ని • రంకుశుడై మితిమీఱి నిజర ర
వ్రాతమునంచె గాక ముని • వర్గమునందును జాలిమాలి సం
గాతులు చెప్పినట్లు యొడి • కంబున ద్రిమ్మరు నెల్లభూతముల్
భీతిలి నిల్వనీడయును • లేక విపద్దశ నొంది యుండగన్.

చ॥ అనిమిషవాహినీపటరు • షోగ్రమతరు ప్రకరంబు నీడలం
దున నిరతంబు సంధ్యల గు • తూహలమొప్పగ మేనకాది కా
మినులను గూడి ద్రిమ్మరెడు • మేటిమగండగు వాసవుండు కా
ననముల జేరె నయ్యసుర • నాథుని బారికి దాళకింతయున్.

క॥ పతిశుశ్రూషాపరలై సతతము సుచరిత్రలైన • సాధ్వీమణులన్
మతిపాత్రలఁ జెఱఁబెట్టి యగతికల-గావించు లోక • కంటకుడగుచున్.

సీ॥ ఇసుమంత గానియు • నిందిరతోఁబల్క మనసొప్పదయ్యెను • మాధవునకు
తలవాకిటనెయున్న • తరుణి నంకము జేర్ప స్థైర్యంబు గలుగదా • ధాతకింత
సురలోకమును వీడి • పరుగెత్తునపుడైన శచిని జీరఁడు బల • శాసనుండు
రంభపిల్చినగాని • రాఁడయ్యె నుద్యాన వనికిఁ గుబేరనం • దనుడు భీతి

యకట పదునాల్గు భువనంబు • లైనగాని లీలఁబాలింపగలవార • లే తలంప
పట్టి హీనదశను గాంచ • నన్యులగతి యేమని వచింపవలయునో • యింకమీద.

సీ॥ చింతామణీభద్ర • సింహాసనంబును చెనటిరక్కసు లధి • ష్ఠింపవలసె
కామధేనువు కల్ప • కంబును నీళ్ళోయ వారు లేమిని తపిం • పంగవలసె
భాగీరథియసుర • పాదఘట్టనలచేఁ బంకసంకలితయై • యింకవలసె
నైరావతము దుష్టు • లగు వైరులను మోయ భారంబునకు వంత • బడఁగవలసె
పావనములను వేదముల్ • పాడునోళ్ళ బడికృశింపంగవలసె ని • భాగ్యయగుచు
ధర్మదేవతయొక్క పా • దంబులోనె నడువవలసెను మెల్లగ • నిడుమలబడి.

తే॥ మానులాశ్రమముల వీడి • కాననముల దొంగలవిధాన ప్రొద్దు పు • చ్చంగవలసె
యజ్ఞములు నిత్యకృత్యంబు • లంతరించె దారుకాసురు దుష్ట సం • చారమునను.

సీ॥ అరుణోదయంబున • కన్న ముందుగ లేచి తెమ్మెరముంగిళ్ళఁ • జిమ్మవలయు
నామీఁదబశ్చిమా • శాధీశ్వరుండు గొజ్జఁగి నీటఁ గలయంపి • జల్లవలయుఁ
బిదపనీశానుండు • పదపడి ముత్యాల రంగవల్లులను దీ • ర్పంగవలయు
నంతటఁ జతురాస్యుఁ • దరుదెంచితిథివార వర్జ్యయోగముల జె • ప్పంగవలయు
వేళమించకుండు • విధమునదహనుండు వంటకంబులెల్ల • వండవలయు
గాలివారలట్లు • వేలుపులెల్లరు నుడిగములనుజేయు • చుండవలయు.

చ॥ దనుజులుబుట్టరే సురల • దార్కొనరే జగముల్ గలంచరే
వనజదళాక్షుడో హరుడో • వారక వారల సంహరించి సే
ర్పునఁ బదునాల్గు లోకములఁ • బ్రోవరె యేయుగమందు చండశా
సనుఁడగు నిట్టి రక్కసుని • చెయ్వులగంటిమె యింతయేనియున్

క॥ క్రూరుండగు నయ్యసురుని దారుణ బాధల కోకింత • దాళక వేల్పుల్
సారవిహీనులగుచు నాంగీరసునిన్ జేరబోయి • కీర్తించి రిటుల్.

—• దారుకుని బాధలకోర్వక వేల్పులు బృహస్పతిని జేరుట •—

చ॥ గురుడవు మా శుభంబులను • గోరిచరించెడు వాడవీవు నీ
కరుణనె మాకుగల్గు కడ • గండ్లను దాఁటి సుఖించుచుందుమో
పరమపవిత్ర యిర్వ్యెడల • భార్గవశిష్యు లొనర్చునట్టి దు
ర్భరమగు కష్టసంచయము • బాయ నుపాయ మెఱుంగఁదెల్ప వే.

మ॥ అనఘా యిట్టి మహావిపద్దశకులో • నై యేప్రతీకారమే
నొనరింపంగల శక్తిలేక గతి యే • దో రక్షకుం డెవ్వడో
యనుచున్ జింతలమున్గి యిట్లయిన మాకై నీమనః కౌశలం
బున కహాంబగు మార్గమున్ దెలిపి మమ్మున్ బ్రోవుమా యీపయిన్.

క॥ అని దీనాలాపంబుల మనసు గరఁగునట్లుగా న • మర్త్యులు ప్రార్థింపం
చిన గని యమరాచార్యుం డను నయ మొప్పఁగ వచించు • నాదిత్యులకున్.

ఉ॥ క్రూరుఁడు దారుకాసురుఁ డ • కుంఠిత విక్రముఁడౌట వానితోఁ
బోరిరణంబునన్ జయము • బొందగ నేరపు జాలకుండు నే
వారికి నైనగాని భగ • వంతు డొసంగిన యట్టిశక్తిచే
సారెకు మీఱుచుండు నల • సత్త్వము జెందక యొందు నేనియున్.

తే॥ అతఁడు మీకు గూర్చు • నట్టిబాధల నెల్లఁ జూచుచుంటి మిమ్ము • గాచు తెఱవు
గలుగదయ్యె నిప్పు • డలిగి యాతని మన మేమి సేయనేర్తుమ్ • మిట్టిదశను.

ఉ॥ పౌరుషమెట్టు లెక్కఱకు • వచ్చును దైవబలంబుచెంత దు
ర్వార తపఃప్రభావమున • రాక్షసనాథుఁ డఖండ విక్రమో
దారతమిన్న ముట్టెడు ప • దంపడి యాతని దుష్టమార్గ సం
చారమె వాని నాశనము • సల్పెడు గాక యొకండు నేర్చునే.

క॥ ప్రస్తుత దానవబాధా త్రస్తులమై యున్న మనకుఁ • ద్రాత శివుండా
యస్తోక గుణాస్పదు కృపశ స్తంబగు నింక నేల • సందియ మెదలోన్.

తే॥ సర్వచతురుడైన • చతురాస్యుని బురస్కరించుకొనియు నిపుడె • మృత్యుహరుని
కడకుఁబోయి యిట్టి • కడగండ్ల దొలగించు మనుచు వేడవలయు • నధికభక్తి.

—• బ్రహ్మదేవుఁ డమరుల శివుని కడకుఁ గొనిపోవుట •—

చ॥ అని వచియించి దేవగురుఁ • డంబుజసంభవుఁ జేరి యంతయున్
వినిచిన శారదాపతియు • వేగమ వేల్పుల నెల్ల వెంట దో
డ్కొని చనియెన్ సమస్త సుర • కోటి కిరీట విరాజమాన ర
త్ననిచయరంజితాంఘ్రియగు • దర్పక వైరిని గాంచ వాడటన్.

సీ॥ ఆవిధంబునఁ జతు • రాస్యుఁడు త్రిపురారిఁ జేరి యంతకుమున్న చెనటియైన
దారుకాసురువధా • ర్థంబుగా వచ్చిన నీరజాక్షునితోడ • గారవమున
మాటాడుచున్న య • మ్మానాయకునిగాంచి భక్తినయంబులు • బాదుకొనగ
దండప్రణామముల్ • దగనొనర్చి నతాంగులై తనవెన్క ను • న్నట్టి సురలఁ
కలత పడకుండుడనియోర • గంటిచూపు సన్నచే దెల్పుచును శైల • చాపుఁడెట్టు
లానతి నొసంగునోయని • యెదరుచుండ నజుని గన్గొని • పద్మాక్షుఁడనియె నిట్లు.

క॥ మీ వైఖరి గాంచిన దనుజావిర్భూతార్తి దలగు • నట్టి సరణికై
వేవచ్చియుందురనుచున్ భావంబున దోఁచు నిపుడు • వారని యూహన్.

ఉ॥ ఏనును దేవకార్యమున • కే యరుదెంచితి లోకరక్షకుం
డైన శశాంకమౌళి చర • ణాబ్జములన్ భజియించువారి కెం
దేని యసాధ్యముం గలుగు • నే శ్రిత భక్తచయంబు బ్రోవలేఁ
డా నిగమాంత సేవ్యుఁడగు • నంధకగర్వ నిహంత చూడఁగన్.

వ॥ అని వచియించునెడ సమస్తలోక సంత్రాణపరాయణుండగు త్రిశూలపాణి దుష్ట దానవ సంహారంబు సేయువాఁడై సుధాధునీ శీకరంబులట్ల నాహ్లాదకరంబులైన పల్కుల నిట్లనియె.

—* శివుఁడు దారుకాసుర సంహారంబునకై పార్వతిని నియోగించుట *—

చ॥ అలఘు తపః ప్రభావమున • నాదనుజాధముఁ డెల్లలోకముల్
కలతనడంగఁజేయుచును • కంటకుఁడై తనతోడ నెవ్వడున్
గలన జయింపలేఁడనుచు • గర్వము పెంపున సంచరించు నా
పలవను సంహరించుట కు • పాయము గూర్చెద మీకు నిప్పుడున్.

తే॥ పురుషమాత్రుం డెవండేని • పోరనిలచి తనను గెలువంగ నేరన • ట్లనవరంబుఁ
గైకొనినవాఁడగుట నింత • కాల మిట్లుపేక్ష సేయంగవలసెను • విధియు లేక.

ఉ॥ ఏను సమస్తలోకముల • నేగతి సత్కృప గాచుచుందునో
యీ నగరాజపుత్త్రి యటు • లే కృపగాచుచునుండు గావునన్
దానవబాధ లోర్వక వె • తల్ బడు వేల్పుల బ్రోచు కార్యమం
దీ నళినాక్షి సాయమగు • నేని జయంబగుగాదె యెల్లెడన్.

క॥ పురుషేతర సాధ్యుఁడు నిర్జరవైరి నెదిర్చి విపుల • రణమున విజయ
స్ఫురణ వహించుట యీ యీశ్వరికిన్ దగుగాక • మనసు సాధ్యంబగునే.

వ॥ అని పలికి కాత్యాయనిన్ గాంచి యిట్లనియె.

మ॥ తరుణీ! యీ సచరాచరంబయిన భూతశ్రేణి యెల్లన్ భవ
త్కరుణాలేశము చేత నేగద సమ • స్తశ్రేయముం గాంచి భా
సురమై వర్ధిలుచుండు నిచ్చలును నీ • స్తోత్రంబే చేయన్ గదా
నిరతిన్ శాస్త్రములున్ శ్రుతుల్ స్మృతులు సం • దేహంబు బోకార్చుచున్.

క॥ నీయనుకంపకుఁ బాత్రులవైరె యన్న యమర్త్యకోటి • ననయంబిట్టుల
న్యాయముగ బాధనేసెడు నా యసుర నుపేక్షజేయు • టహాన్యంబగునే.

చ॥ అరయగ్ర పాపయోధియగు • నద్రిపు కూరిమిపట్టివీవు నీ
చరణము లాశ్రయించి నన్ను • శంసునకేనియు మోక్షలక్ష్మియున్

గరము వశంబగున్ గద జగంబులఁ బ్రోవఁగలట్టి ప్రోడ యీ
కరివదనుండు నీ సుతుఁడు • కామిని నన్ను నెఱుంగుదే కదా.

క॥ కావున సర్వవిధంబుల నేవారికిఁ గల్గనట్టి • యీ శత్వముసం
భావింపఁగఁబడు నీయెడ దేవీ దేవతల కీవె • దిక్కగుమింకన్.

క॥ తనయులయెడఁ దండ్రికిఁ గల్గిన వాత్సల్యమునకన్న • గీర్తింపంగా
జననికి గల వాత్సల్యమె ఘనమని చెప్పుదురు గాదె • కరుణాహృదయుల్.

చ॥ అని వచియించినన్ వినిన • గాత్మజ మెల్లన నాస్య పంకజం
బునఁ జిఱునవ్వు వెన్నెలలు • మూఁగి మెఱుంగును గొల్వఁబల్కె నో
యనఘ సమస్తలోకముల • యందును నీకు నసాధ్యమైన దెం
దును గలుగంగ నేర్చునె యి • నూనము గౌగద త్వత్ప్రభావముల్.

ఉ॥ నాయెడ నీకుగల్గు కరు • ణన్ వచియించెదుగాని యొక్క దు
ష్కాయుని దానవాధముని • గర్వమడంపఁగ నేరకుండు నే
న్యాయపథప్రవర్తనుల • రైన యమర్త్యుల శక్తి చాలకు
న్నే యసమానులైన దను • జేశులఁ దొల్లి వధింపవే వెసన్.

తే॥ అయిన నాశ్రేయముం గోరి • యసురవధకు నన్నె నియమించితిరి గాన • పన్నగేంద్ర
భూషనీయానతిని శిర • మున ధరించి దేవతాకార్యమునకు య • త్నింతు నిపుడ.

శా॥ ఆరీతిన్ వినయప్రధానముగ నా • ర్యాదేవి పల్కంగ నా
నీరేజాసన ముఖ్యదేవగణ మెం • తే సంతసంబంది దు
ర్వారాభీల పరాక్రమాంధు నగు నా • రక్షోవిభుం డప్పుడే
ఘోరాజిన్ హతుడయ్యెనంచు మంది సం • క్షోభంబు జల్లారగన్.

మ॥ కరతాళ ధ్వను లుప్పరం బెగయ లో • కత్రాణ పారీణకే
ధరణీ భృత్సుతకున్ జయంబగు తదై • త్యశ్రేణియున్ ఘోర సం
గర భూమిన్ హతమయ్యెదున్ సుజన ర • క్షాదక్షుఁడౌ చంద్రశే
ఖరుఁ డిమ్మాడ్కినె గాఁచుగాతమని ప • ల్కన్ సాగె నప్పట్టునన్.

ఉ॥ ఆ సమయంబునన్ గిరిన • గాత్మజ లోకహితంబుగోరి దు
ష్టాసుర సంహరించుటకు • నై తన సత్త్వగుణంబె చాలినన్
భాసురమౌ తమోగుణము • వశ్యమటంచు నిజాంశమున్ గను
బ్యాసను మేన జేర్చెను సు • పర్వులకున్ దెలియంగ రానటుల్.

క॥ ఆపగిది శైలసుత గిరిచాపుని దేహమునఁ జేర • శంకరకంఠ
వ్యాపనమగు విషభాగము నేపున భక్షించె నెవ్వ • రెఱుఁగని రీతిన్॥

—• పార్వతి కాళికారూపము వహించుట •—

తే॥ నిబిడ నీరదశ్యామమై • నెగడునట్టి హాలహలము గొనుటఁజేసి • యార్యయప్రమ
కాళియై కనుపట్టె నల్లడల దేహకాంతి పుంజంబు నిండి చీ • కటులు గ్రమ్మ.

వ॥ మఱియు

ఉ॥ ఫాలతిలోద్యదంబకయు • భాసుర బాలశశాంక దివ్య రే
ఖా లలితోత్తమాంగయు న • ఖండిత పాశుపతాస్త్రహస్తయుఁ
శూలినియుఁ విషాభ పరి • శోభిత కంఠయు దుష్టనిగ్రహో
ఫీల కరాళ వక్త్రియును • భీకరరూపమునై వెలుంగుచుఁ.

ఉ॥ కాళి వి నీలనీరద ని • కాయము భాతిసితేతర ప్రభా
జాలము లీనుదేహయయి • సర్వచరాచర లోకదాహక
జ్వాలలు నాగనూర్పుల వె • సం బరగించుచు నుంటగాంచి య
ప్వేలుపులెల్ల గప్డ భయ • విహ్వలులై పరుగెత్తి రంతయుఁ.

తే॥ అంత నాదేవి వస్త్రమా • ల్యానులేపనాద్యలంకృతయై పుర • హరునిగాంచి
దేవ నీయాజ్ఞయగునేని • ధృతిసెలంగ నిదియె దాయకారసురుపధి • యింతు జుమ్మ.

ఉ॥ ఆహవమందు నాకును స•హాయ మొనర్పఁగ నీకె పుట్టి రు
ద్బాహు బలోద్ధతుల్ విపుల • వక్షులుఁ వివిధాయుధాఢ్యులు
గ్రాహవ నిర్జితాఖిల సు • రాసురు లుదారులు త్వ • త్పదాబ్జ సే
వాహత కల్బిషుల్ విమల • భావులనైన పిశాచనాయకుల్॥

వ॥ అని పలుకునెడ.

ఉ॥ కొందఱు దీర్ఘబాహులును • కొందఱు వ్యాఘ్రకరాళ జిహ్వలుఁ
గొందఱు సింహవక్త్రిలును • కొందఱు భూమి ధరోత్తమాంగులుఁ
గొందఱు పాశహస్తులయి • గొబ్బున ధారుణి యీనినట్లుగా
నిందు కళావతంసున క • హీనబలుల్ గనుపట్టి రప్పుడుఁ.

క॥ వికటాట్టహాసయుతులును వికృతాకారులును క్రూర • విషతుల్యతనుల్
ప్రకటిత తేజులగు పిశాచకదంబము గని హరుఁడు హసన్ముఖుడగుచుఁ.

క॥ దేవీ వీరలె చాలుదు రావేలుపు పగతుజంప • నాహవమున బో
మ్మా వేగమ నీకు జయంబౌ విబుధులకును హితంబు • నగు రణసీమఁ.

క॥ లోకత్రాతయగు శివుం డాకరణిఁ బలుకుట విని • హర్షము దనరఁ
గా కాసిమూఁక నెదురఁట కై కాళిక చనియె భూత • గణములు పొగడఁ.

—• కాళిక దారుకు నెదిరించుట •—

శా॥ భూతప్రేత పిశాచ సంచయపహో • ద్భూతంబులౌ రేణుసం
ఘాతంబుల్ చెలరేగి బిట్టు నెలగం • గా సుష్ణభానుండు ని
ర్ఘాతత్విట్చయుడౌట దిక్తటములం • దుగ్రొత్తలై చీకటుల్
దోతెంచెన్ గనుగొంటిరో యనుచు దై • త్యుల్ సంభ్రమం బందఁగన్.

శా॥ భేరీ కాహళ శంఖ నిస్వనములా • భీలంబులై సర్వది
గ్వారంబుల్, బ్రిదిలింపగా రణమునన్ • బ్రావీణ్యమున్ జూపి దు
ర్వారుండైన సురారి గర్వమును వి • ధ్వంసంబు గావింతుమన్
శూరోక్తుల్ దివినిండి లోకముల సం • క్షోభంబు గావింపగన్.

ఉ॥ ఓరి నిశాచరాధమ మ • దోద్ధతి పాపము నాక దుష్ట సం
చార పరాయణుండవయి • సర్వచరాచర లోకజాలమున్
దారుణబాధసేయు నిను • తద్దయు వీడక మామకీన దు
ర్వార పరాక్రమాగ్ని నిజ • భస్మమొనర్చెద కీర్తి గాంచెదన్.

మ॥ అనుచున్ పౌరుషవాక్యముల్ పలుకుచ • త్యంతంబు రోషంబునన్
దనుజానీకము దిక్కులన్ బరవ ను • ద్యల్లీఢమున్ బూని చెం
గున లంఘించెను కాళి యప్పుడనికిన్ • గోవ్రాతమున్ వ్యాఘ్రమ
ట్లనిజానీకము బాపురే యనుచు ను • ల్లాసంబునన్ బల్కఁగన్.

తే॥ అట్లు రూపు దాల్చి • నట్టి మృత్యువు మాడ్కి దుస్సహప్రతాప • దునిరీక్ష్య
మాణ రూపయయి య • మాదేవి కన్పట్ట దారుకుండు గాంచి • పౌరుషమున.

—• దారుకుండు కాళితో బీరము లాడుట •—

మ॥ తరుణీ యెవ్వరిదాన వేమిటికి నే • లచ్ఛూర సంభావ్య సం
గరమున్ జేయఁదలంపు గల్గె సురలో • కప్రాప్త గర్వానల
స్ఫురణంబున్ శమియింపజేసి దనుజ • స్తోమంబు రక్షించు నే
ర్పరియౌ దారుకుతోడ బోరుటది భద్రంబౌనె యేవారికిన్.

చ॥ కలన నెదిర్చి నన్నెలువ • గల్గినవారలు ముజ్జగంబులన్
గలుగరటంచెఱుంగవో య • ఖండ మదీయ పరాక్రమాగ్నికిన్
శలభములట్లు బూదియయిఁ • సర్వసుపర్వులు లొంగియుండుటన్
దలపవొ దారుకాసురుని • దార్కొనబోలదటంచెఱుంగవో.

తే॥ ఎట్టి పురుషులకును • నే వేళ నైనను గలన నన్ను • నెదురగలుగునట్టి
పౌరుషంబు గలుగ • దారయ నీవొక యబల వెట్లు గెల్తు • వాహవమున.

ఉ॥ క్రూర పరాక్రమాఢ్యులు న • కుంఠిత బాహుబలోన్నతుల్ జగ
చ్ఛూరులు నైనవారికిని • జూచి సహింప వశంబు గాని యీ
ఘోరరణంబదేడ నవ • కోమల పుష్పసమాన గాత్రలా
సారసనేత్ర లేడ? నని • సల్పుట కూడదు నీకు తొయ్యలీ.

క॥ శూరులు కేశవముఖ బృందారకులైన నెదిరింపఁ • దగకుండగ శృం
గారవతివి నీవా నన్నీరీతిని దార్కొనంగ • నెంచితి వనితా.

చ॥ అనుచు నవజ్ఞుడై తెగడ • నాడెడు రక్కసు కాళిమాటలన్
గనలుచుఁ ద్రోకఁ ద్రొక్కఁగనే • గస్సని పైఁబడు నాఁగుబాము రీ
తిని బుస కొట్టుచున్ గినుక • తీవ్రము లై భయముం బొనర్పగా
దనుజుని గాంచి పల్కె నతి • దర్పమునన్ దిశలెల్ల మ్రోవఁగన్.

— • దారుకు వాక్యంబులకు కాళి కోపించుట • —

చ॥ అనదవు నీవు నన్నెఱుగు • నంతటి వాడవె దానవాన్వయం
బున రణభూమి గూల్చి క్రతు • భుక్పతికిన్ హితముం బొనర్పగా
ఘనమతి నేగుదెంచితిని • కాళిక నాబడు దానమచ్ఛితా
సిని దెగటార్తు నిన్నిదియె • శీఘ్రము నిల్వుము సంగరంబునన్.

చ॥ బలిమిని నీవు తెచ్చి చెఱఁబట్టిన వేల్పులనెల్ల వేల్పుక
న్నెల వదలించి నిర్జరుల • నింద్యులటంచును వారి యానతిన్
మెలగుచునుందువేని విను • మీ నిను బ్రోచెద లేకయున్నచో
గలన నినున్ వధింతు నిదె • కన్గొను మామకశౌర్య మిచ్చటన్.

క॥ అని కోపంబున బల్కిన దనుజేంద్రుడు క్రోధ దీపి • తముఖుఁడగుచు నో
వనితా బీరము లేమిటి కని సేయుము గెలువు మిప్పు • డాహవమందున్.

— • దారుకుడు కాళితో యుద్ధంబు జేయుట • —

మ॥ అనుచున్ గోప భయంకరాంగుడయి దైత్యాధీశ్వరుం డొక్కచే
త నిశాతంబగు వాలు బూని యొక హస్తంబందునన్ డాలు గై

కొని యోహహోయిఁకఁ బారిపోవకుడు మ • ద్ఘోరాసి ధారాహతిఁ
గనుడో భూత పిశాచ సంచయము • నిఁ ఖండింతు నిప్పట్టునన్.

తే॥ అనుచు గరవాలమును ద్రిప్పు • కొనుచు మీఁద కురురుటయు దారుకాసురు • [నుగ్రమూర్తిఁ
గాంచి భీతిని జెందక • కాళికయును చెనటి యెంతటి ధైర్యంబు • జేసితివుడు.

క॥ అని పల్కుచు గోపంబున నెనిమిది బాణముల రాక్ష • సేశ్వరు ఖడ్గం
బును రెండమ్ముల నాతని ఘనతరమగు డాలునపుడు • ఖండించెదగన్.

ఉ॥ అంతట దానవేశుఁ డ • హాహా యిది యేటి విరుద్ధకార్యమ
య్యంతకుఁడేని నన్నెదుర • నాహమందు భయంబుఁ జెందగాఁ
గాంతయొకర్తుఁ మన్నిశిత • ఖడ్గము నే క్షణమాత్రఁ ద్రుంచె న
త్యంతము నాడులేడియె మృగా • ధిపు మార్కొనినట్టి రీతిగాన్

క॥ అని దర్పంబున వేరొక ఘనతర చాపంబు బూని • కాళికమీదన్
సునిసిత సప్తాంబకముల ననువుగ నాటంగనేసె • నందఱు వొగడన్.

క॥ అందులకు దేవి యప్పు డమంద క్రోధమున • నగ్నిమాడ్కి వెలుగుచున్
బృందారకారి యేసిన తుందిలబాణముల నెల్ల • ద్రుంచెఁ గడంకన్.

తే॥ అంతఁ బోనీక క్రోధపూ•ర్ణాస్యయగుచు మూఁడు వాడి కోలల వాని•గాడనేయ
గఱు రక్కసి యోర్చి యఖండబాణ వృష్టి గురిపించె దేవిపై • విబుధులదర.

ఉ॥ అప్పుడు దత్ప్రియుక్త విపు • లాంబక సంతతి పెల్లురేగి వే
నిప్పుక వాన రీతిగ ననేకము నెల్ల దహింప భూతముల్
గుప్పలువోలెఁ గూలి రరి • గోత్రవినాశకమైన దేవిచే
నొప్పెడు చాపమున్ విరిగె • నుగ్రరణంబున దానవార్భటిన్.

మ॥ అరరే మూర్ఖుఁడ క్రూరకర్ముఁడ శఠుం • డా దుష్టుడా ఘోరసం
గర రంగంబున శౌర్య ముప్పతిల ర • క్షశ్శ్రేణి బోకార్చి ని
ర్జర సామ్రాజ్యము బాదుకొల్పుటకునై • స్వాంతంబునన్ బూని సు
స్థిరతన్ నిల్చిన నన్నలంతిగ దలం • తే యింతమాత్రంబునన్.

వ॥ అనుచు నా జగద్ధాత్రి ప్రళయకాల సముజ్జ్వలిత మహామృత్యువుంబలె మండిపడుచు గరాళఁబులగు దంతంబుల ఘట్టనంబొనర్చుచు బ్రహ్మాండ కర్పరంబు బ్రద్దలై చరాచర జంతుజాలంబుల గుండె లవియ మహారావంబున నిట్లనియె.

గీ॥ పరమ పవిత్రులౌసురల • బల్మినిబట్టి వధించు దోషమున్
గరము పతివ్రతామణుల • గాసిలజేయు నకృత్యమున్ మునీ

శ్వరు లొనరించు జన్నముల ♦ బాడొనరించెదు పాపమాకృతిఁ
బొరసి నినుఁ వధించు నిదె ♦ పూన్కిని నన్గొను మోరి దుర్మతీ.

సీ॥ వేల్పుల దొరకింత ♦ వెతగూర్చినంత నే నిఖిల శూరుల గెల్వ ♦ నేర్పుటగునె
దిక్పాలకుల రణ ♦ స్థిర జయించినయంత జగదేక శౌర్యంబు ♦ సంభవించునె
గోవిందుచక్రంబు ♦ కుంఠితంబయి నంత నమరుల మహిమ చ ♦ ల్లారుటగునె
గుణవృద్ధులౌ మాని ♦ కోటి యూకొన్నంత నీ ప్రభుత్వంబె రా ♦ జింపగలదె
బలవదుద్దండ దానవ ♦ ప్రకర నాశకంబగు మదీయ చాప మొ ♦ కప్పు డింత
మొక్కవోయిన మాత్రన ♦ మోటురక్కసులకు సంతత మభివృద్ధి ♦ గలుగుటగునే.

వ॥ అని పలుకుచు.

## —♦ కాళిక రాక్షస సైన్యంబు దునుముట ♦—

సీ॥ ప్రళయకాలాన లో ♦ జ్వలమైన నిట్టూర్పు గాడ్పుదిక్కులనెల్ల ♦ గాల్చుచుండ
నాకొన్నయట్టి పం ♦ చాస్యంబు రొదవోలె భీకరా రావంబు ♦ విన్నుముట్ట
విస్ఫులింగంబుల ♦ వెదజల్లు తీవ్రాసి చారుహస్తంబునఁ ♦ జౌకళింప
వితత మహాక్రుధా ♦ విర్భూత రక్తారుణంబులై కనులు భ♦యంబు గొల్ప
గొఱియమందలపైఁబడి ♦ కొల్లగొనెడి వృకము పోల్కి నిర్క్రోధప ♦ రీతయగుచు
కాళికాదేవి యపుడు రా ♦ క్షస సమూహమందుఁబడి నాశనమొనర్చె ♦ నసురవసుల.

వ॥ అంత నాచారుకుండు పెనుగాలి తాకున జెదరిన మేఘపటలం బట్ల దేవీ కరవా
ఘాటికి స్వసైన్యంబు రూపుమాయుటం గాంచి సముద్భూతక్రోధుండును వికటాట్ట
హాసుండును విస్తృత దేహుండునునై బాహుయుద్ధంబునకుఁ దలపడిన బిఱుతిరి
యక దేవి యప్పుడు.

స్రగ్ధర॥ బలగర్వోద్రిక్తరక్షః పటలజలద సం ♦ వర్త సంభూత ఝంఝా
నిల మస్మద్బాహుశక్తిఁ ♦ నిఖిల రిపుచమూ ♦ నిష్ఠురోర్వీజ శాఖా
వళులఁ గూల్పంగ నేర్తుఁ ♦ బ్రబల రణజయ ♦ ప్రాభవోపేత నన్నుఁ
గలనఁ గెల్వంగనీకుఁ ♦ గడిమి కలదె మూ ♦ ఖ్ఖాయిదేచూడు మింకన్.

క॥ అని పలుకుచు రెట్టించిన కినుక నసుర బాహువు లొక ♦ కేల నపుడు బ
ట్టి నిబిడమగు కర ఘాతంబున బడునట్టులను గొట్టె ♦ పుడమి యద్రువగన్.

తే॥ అసురు లెల్ల భీతి ♦ నాశల బరుగిడ కాళి విపుల ముష్టి ♦ ఘాతము మెయి
మూలనుట్టముగను ♦ గూలిన పెనుగొండ యటులబడియె దారు ♦ కాసురుండు.

తే॥ కడిమిఁ దొలఁగి కలన • గట్టునొరఁగ బడిన చెనటి పేరురంబుఁ • జీల్చివైచి
తొలఁగు వేడి నల్ల • దోసిళ్ళతోఁ ద్రాఁగె నపుడు దేవి యెల్ల • రదరిపడఁగ.

ఉ॥ ఆనిధి వేలుపుం బగతు • నంత మొనర్చి తదీయ రక్తముం
ద్రావి తమఃపరీతమయి • దారుకు గర్వనిహంత్రియైన యా
దేవి సురారి సేనల వధించుటె గాక • సమస్త భౌతిక
ప్రావృతలోకజాలముల • నంత మొనర్పఁగఁ బూనె నెంతయున్.

—• కాళిక లోకముల బాధించుట •—

తే॥ వీరు తనవారు పెరవారు • వారటంచు మది నొకించుక దలపక • బెదరిపారు
ప్రాణికోటులపైబడి • బల్మిబట్టి సంహరించుచునుండె నా • శక్తియపుడు.

తే॥ తలవని తలంపుగా నట్లు • గలిగినట్టి జగదుపద్రవమునకునై • దిగులు జెంది
వనజలోచన ముఖసుర • ప్రకరమపుడు భ్రాంతులై భర్గునిం జేరి • పల్కిరిట్టుల.

తే॥ దారుణంబులైన • దారుకు బాధలు తొలఁగెననుచు సం • తసిలఁగలేదు
కటకటా యనిష్ట • కార్యంబు గలిగె నింకేమి సేయవలయు • నీశ చెపుమా.

తే॥ ధరణి మూల్కొడి నక్కపై • తాటికాయ పడినచందాన దారుక • బాధితులయి
యలసియుండిన నిర్జరా•వళికినిట్టి యిడుమ లుదయించె నిపుడు ది• క్కేదిమాకు.

చ॥ అనుచు ననేకరీతుల న • తాంగులరై వినుతించు వేల్పులన్
గని కరుణాంతరంగుఁడయి • కాముని దారుఁడు బల్కె నిట్టులో
యనిమిషులార చింతిలకుఁ • డాదనుజాధము రక్తపానముం
బొనరిచియుండుటన్ దమముఁ • బూనెను కాళిమహోన్నతిన్ దగన్.

క॥ అక్కతన వీరు వారని లెక్కింపక యుక్కు మిగిలి • లీల జగములన్
జక్కాడఁ సాగె మనమిపు డొక్కటి తలపంగ జరిగె • నొండు విధమునన్.

తే॥ తత్ప్రతీకార మొనరింపఁ • దగినవాఁడు భైరవుండు మదంశ సం • భవుఁడితండె
యీయుపద్రవమును మాన్పి • యెల్లలోకములకు శ్రేయంబుఁగూర్పంగ • గలఁడు కలిమి.

—• శివుడు కాళికాదేవిని శాంతింపజేయ భైరవు నంపుట •—

క॥ అని పలికి భైరవున కాజ్ఞనొసంగిన నతఁడామాళి • కంపముతో న
ట్లనయని స్మశానదేశంబునకుఁ జనియె దేవి కోప • మును మాన్పంగన్.

తే॥ అటులఁ జని క్షేత్రపాలకుఁ • డైన భైరవుఁ డొక చిఱుతపాపఁడయి యెల్లెడలవారు
ఘనతరాశ్చర్యమొంద రో • దన మొనర్చె నెత్తుకొనుడో యనుచుఁ జేతు • లెత్తి చపుడు.

తే॥ గోముగారు మోము • గొనగ బారు చెక్కు-ళ్ళు చిన్నచిన్న కాళ్ళు • చిఱుతనగవు
కావుమనెడు మనసు • గరగించు నేడ్పును గాంచి దేవి మదిని • గనికరమున.

ఉ॥ ఆఁకొని నాఁ డింతం డెవరి • యర్భకుఁడో మననంబునం దిటుల్
వాఁకొన నేమి కారణమొ • బాలునకున్ దలిదండ్రు లెవ్వరో
చేకొని యేన పెంచెదను • చెచ్చెర నంచు దలంచి శర్వమా
యా కలితాత్మయై దనుజ • హంత్రి యదార్థ మెఱుంగ కింతయున్.

తే॥ ఆ కపటబాలు నెత్తి ము • ద్దాడి యపుడు స్తన్యమొసగెను జేర్చి నా • శక్తియంత
భైరవుండును వేజను • బాలుఁ ద్రావు వ్యాజమున విషమును బీల్చి • వైచెబూన్కి-

వ॥ దారుకాసుర దుష్టరక్త పానంబునఁ జేసి తమః ప్రధానంబగుటఁ గ్రోధావేశంబున వెలుంగు నద్దేవి యట్లు భైరవుండు స్తన్యపాన వ్యాజంబున దుష్టరక్తంబెల్ల బీల్చుకతన శక్తి దొఱంగి మూర్ఛాక్రాంతయయ్యె నాసహనాబాలకుండును విషరక్తపానోద్రేకంబున నొడలు మఱచి కోపావిష్టుండగుచు మహాస్మశానంబున సంచరించుటఁ గాంచి జగదుపప్లవంబగునను సంశయంబున శంభుండు దేవికిని భైరవునకు శాంతిగూర్పఁదలంచి మహాతాండవంబొనర్చె. అది మొదలు నేటికిఁ బరమేశ్వరుండు సాయంసమయంబుల నాట్యంబు సలుపుచుండు నిదియ చంద్రశేఖరుడు నృత్యంబొనర్చుటకు ప్రథమ కారణంబని సూతుండు శౌనకాది మహామునులకుఁ దెల్పి మఱియు నిట్లనియె.

చ॥ మునికులశేఖరుం డమల • మూర్తి తపోనిధి శిష్యవత్సలుం
డనఘుఁ డుదారకీర్తి ప్రమ • థాగ్రసరుం డుపమన్యుఁ డన్ మహా
త్ముని చరితంబు వీనులకు • మోదముగూర్చెడు గాన దెల్పెదన్
వినుఁడని సూతు డిట్లను వి • వేకి జనైక ముదావహంబుగన్.

—◆ ఉపమన్యు చరిత్రము ◆—

చ॥ కలఁడు మహాతపోనిధి జగ • త్త్రయ పూజ్యుఁ డనంత సద్గుణా
కలితుఁడు వేదపారగుఁ డఖండ యశస్కుఁడు శర్వభక్తుఁడై
చెలగుచునుండువాఁ డగు వ • సిష్ఠుఁడు నాఁబడు మౌనిశేఖరుం
డలఘుచరిత్రుఁడా ముని మ • హాత్మ్యమగణ్యము కాదె ధారుణిన్.

తే॥ ఆతని జామాత యుపమన్యు • డనెడునాడు జననియును దాను సమ్మని•సదనమందె
మేనమామయు దనయందు • బ్రేముజూప నిరతము వసించు నాహార•నిరతుడగుచు.

తే॥ ఆరుణుఁ డుదయించినది మొద • లస్తమించువఱకు నాతడు గోక్షీర • పానమునను
బ్రొద్దుపుచ్చుచు నుండు నే • పూట యింత కొఱతపడిన సహింపక • గోణగికొనుచు.

క॥ గురువులయొద్దజేరి తన • కుఁగ విహితంబులునైన విద్యలన్
నిరతము నేర్చు టొండె ధర • ణీసుర పూజలొనర్చు టొండెగా
కరిమరలేక నిచ్చలు బ • యోభిగతిన్ జరియించుచుండు ము
మ్మరమగు కూర్మి చేత నుప • మన్యుడు మాతులు నుందిరంబునన్.

తే॥ అవ్విధంబున నుపమన్యుఁ • డాత్మలోన నితరచింతనము న్మాని • యెల్లయెడల
దనకు గోక్షీరములె ప్రాణ • ధారకముగ నధిగ కాలంబు గడపుచు • న్నంతలోన.

తే॥ ఆతని మాతుల సుతు • డదిగాంచి యిదియేమి వింగడంబో యెల్ల • వేళలందు
బనియుబాట లేక • పాలెల్ల ద్రావుచు నున్నవాఁ డితండె • యొక్కరుండు.

తే॥ దేవతాభిషేక • మేవిధి గావింపవలయు బాలులేక • వానికింతఁ
దోఁచదేల తల్లి • తో చెప్పి వారింతుననిన నాపెయు నిడు • నహరహంబు.

తే॥ కావున ను • పమన్యుడు పాల్ ద్రావక పూర్వంబ నేను • ద్రావుదు నతఁ డిం
కేవిధమున ద్రావగలఁడో గోవుల నెచ్చోటనుండి • కొనిరాగలడో.

చ॥ అనుచు వసిష్ఠపుత్రుఁ డన • యంబును వేకువజామునంద న
య్యందన నెవ్వరుం గనని • యట్టుల మేల్కని పాలకుండ గై
కొని యుచితప్రవేశమున • కుఁగ జని క్షీరములెల్ల ద్రాగుటన్
మనమున గాంచలేక యుప • మన్యుడు చింత మునింగ మెల్లనన్.

తే॥ జనని జేరఁబోయి • జాలిదోఁపగ నిట్లు బలుకునతడు దీన • భావమునను
తల్లి వేడిపాలు • దయతోడ గొనితెమ్ము వలవదనక ద్రాగ • వలయు నాకు.

క॥ అన విని తన మేనల్లుండను దినమును ద్రావు పెటిఁగినది గావున పా
లను గొనితెచ్చెడి నేర్పుకగనజాలక జనని దుఃఖ • కలితయు నగుచున్.

మ॥ జననీ క్షీరము లిమ్మటంచు నను నా • సఁగ జేసి ప్రార్థింపఁ బు
త్రున కిం తేనియు దృప్తిదీర నిడు చా • తుర్యంబు లేకుంటచే
ఘనచింతాబ్ధి మునుంగనయ్యెను మ • హా కష్టంబు దారిద్ర్య జీ
వన మెవ్వారికినైన దప్పగలదే • ప్రారబ్ధకర్మం బిలన్.

ఉ॥ ఎక్కడనుండి తేగలనో • యిప్పుడు క్షీరము లెవ్విధంబునన్
జక్కనొనర్తు బుత్రుని వి • చారము బాపి యితండు పాలకై

యొక్కఁడు ప్రేమ జూపెడిని • హీనదశఁ బడియున్న నాకు నిం
దక్కట యే యుపాయమున • నయ్యెడు శ్రేయము తోఁచదింతకున్.

తే॥ అనుచు నెట్టకేల • కా సాధ్వి తానుంఛ వృత్తి దెచ్చినట్టి • బీజములను
సుతుఁ డెఱుంగకుండు • గతిఁ బిండిగాఁ జేసి జలములంద గలపి • సరగనపుడు.

చ॥ తనయుని జేరబిల్చి పరి • తాపము జెందకుమయ్య క్షీరముల్
గనుమిదె వీని నేనిపుడె • కాచితి వేడిగనుండు నేమొ కా
వున మెలమెల్లఁ గ్రోలుమని • పుత్రున కా కలశం బొసంగ నం
దనుడు పరిగ్రహించి యవి • త్రాగి రుచింపమి దుఃఖితాత్ముడై.

క॥ క్షీరము లిడుమని వేడిన నీరము లొసగు టిదియేమి • నీకు సుతునిపై
కారుణ్య మింతయే యని సారెకు రోదనమొనర్ప • సాగె నతండున్.

చ॥ తనయుని బీదపల్కులకుఁ • దల్లి ప్రతిక్రియ సేయలేకయి
ట్లను నిటులేల చింతిలెద • వయ్య పురాకృత కర్మ మేరికై
న ననుభవింపకుండఁ దగు • నా మన చేసిన పాపకృత్య మీ
జని ఫలియించి యీగతి వి • చార సముద్రమునందు ద్రోసెడున్.

చ॥ అకుటిల భక్తిసంతతము • నంధకవైరి పదాబ్జముల్ భజిం
చి కలుషదూరులై తపము • జేసెడువారికిఁ గాక తక్కువా
రికి లభియించునే సిరులు • శ్రీకరుఁడా శశిమౌళి భక్తర
క్షకుఁడగు నాతనిన్ గొలువ • గల్గిన జేకుఱు నెల్లసంపదల్.

ఉ॥ ఎంతటి నిశ్చలాత్ములకు • నేనిమునీంద్రుల కేని యద్రిజా
కాంతుని సేవజేయక య • ఖండ మనోరథ సిద్ధి గాదు ము
న్నెంతయుఁ బాపకృత్యముల • నే యొనరించుటఁ జేసి యీ జనిన్
జింతయె ప్రాప్తమయ్యె సిరి • చేకుఱునే మన కట్టివారికిన్.

క॥ అనుటయు నుపమన్యుఁడు తన జనని పలుకులకు నొకింత • సంతాపముఁ బా
సి నిజాభివృద్ధికై మనమున దెనగొనియెడి విచార • మున నిట్లనియెన్.

ఉ॥ ఏమిటి కిట్టి హీనదశ • యెల్లజగంబులఁ బ్రోచువాఁడు స
ర్వామర సేవితుండు త్రిపు • రాంతకుఁడే మనపాలనున్న వాఁ
డా మహనీయు పాదయుగ • మాత్మను నిల్పి తపంబొనర్తు న
మ్మాముని వృత్తి బూని యిఁక • నాజ్ఞ యొసంగుము నాకు బేర్మితో.

తే॥ దీనదశకు లొంగి • దేబెరించుచు మేనమామ గారియింట • మనికి కన్న
సర్వచతురుడైన • చంద్రశేఖరు నమ్మి మౌనివృత్తినుంట • మంచిగాదె.

క॥ దురదృష్టవంతుఁడనగుచు సరివారలలోన నెట్లు • చౌకఁదనమునన్
దిరుగంగఁ జాలువాఁడను హరుఁడే దిక్కనుచు నటవి • కరుగక యింకన్.

చ॥ తనయెడ భక్తిగల్గిన శ్రి • త ప్రకరంబును బ్రోచు భారముం
గొని నిఖిల ప్రపంచమున • కుఱ జనకుండగునట్టి దేవునిన్
గనుగొని యిష్టకామ్యములఁ • గాంచెద నిత్యము పాయసాన్న భో
జనమె లభించునట్లు వర•సంగతి మించెద నాజ్ఞ నీఁగదే.

తే॥ అని తపము సేయు నుత్సాహ•మునఁ గడంకఁ బలుకు తనయునిపలుకుల • కలరి జనని
చిన్నవాఁడవు ధైర్యంబుఁ•జెంది యిప్పు డెటులఁ దపమొనరించెదో•యీశుగూర్చి.

ఉ॥ పూనికతోడ నెన్ని యుగ • ముల్ తపముం బొనరించినన్ మహా
మానులకేని గన్పడని • మారవిదారుని గాంచునట్టి చిద్
జ్ఞానము నీకు నేపగిది • గల్గెడినోకద చిన్నవాఁడ వ
క్కాననమందు నేవిధము • గన్ జరియింపగ నేర్తువోకదా.

సీ॥ సాటివారిలోన • సకలవిధంబులఁ బేదరాలనగుటఁ • బ్రియసుతుండ
నీవు నోరుజాచి యిన్నిపాల్దెమ్మనఁ దెచ్చిపెట్టలేక • దీననైతి.

తే॥ ఎట్టిభాగ్యంబు లేకున్న • నేమికొఱఁత కలిగెగద మమ్ము రక్షింపఁ • గలిగినట్టి
పుత్రరత్నమటంచు నె • ప్పుడును నిన్నుఁ గనులఁ బెట్టుకొనుచునుండుఁ •
[ గాదె తనయ.

తే॥ కఠినతపము నెట్లు • గావింప నేర్తువో యెంత కాలమునకు • నీశ్వరుండు
నీకు గానవచ్చి • నీకోరిన వరంబు లిచ్చునోగదయ్య • యేగుమింక.

— • ఉపమన్యుడు తపముచేయుట • —

వ॥ అని మఱియు నాపురంధ్రీ రత్నం బుపమన్యు వాశీర్వదించి శ్రేయంబుఁ గొనిరమ్మని పనిచిన నతండును నీశ్వరానుగ్రహ సంపాదనోత్కంఠ మెయి నొక్కరుండ వెడలి హిమనగంబు కంధరంబున నాశ్రమంబు గల్పించుకొని వాయుమాత్రాశనుండై యుగ్రతపంబు జేయుచుండ నప్పుడు

చ॥ జలధుల నీరు గ్రాగె కుల • శైలములెల్ల దహించె దారకల్
జలజల నేలవ్రాలె బరు • షంబుగ వెచ్చని గాడ్పు లాశలన్
మలమల మాడ్పసాగె గఠినంబుగ భానుఁడు వెల్గుచుండె ని
ర్మలచరితాఢ్యుఁడైన యుప • మన్యుడు ఘోరతపం బొనర్పగన్.

ఉ॥ ఆవిధి విప్రపుత్త్రుని త • పోగ్ని యకాలలయంబువోలె లో
కావళిఁ గాల్చుచుండుటయు • నార్తులసై క్రతుభుక్కు లెల్ల నిం
ద్రావరజుఁ ద్రివిక్రము ద • యానిధి విష్ణువు జేరఁబోయి గా
హో విబుధాళి కెప్పుడు మ • హాపదలే గలుగుఁ గదా యిలన్.

తే॥ అటులఁ జేరఁబోయి • యనిమిష సంతాన మేమి కారణంబొ • యిట్లకాల
విలయ ముద్భవించె • విశ్వంబు దీనిచే సమయునేమొ యను వి • చార మొదవ.

సీ॥ సజల పయోధర • సంకాశ విగ్రహు నాజానుబాహు నం • భోజనేత్రు
శ్రీవత్సలాంఛను • శ్రీ సమాశ్లిష్ట మహోరస్కు సింహగం • భీర ఘోషు
తులసిమాలాలంకృ • తు విదారితాసురు సకల లోకాధారు • సర్వచతురుఁ
గనకోత్తరచ్ఛద • కలితు ఖగధ్వజు శంఖచక్ర గదాస్త్ర • శస్త్ర హస్తు
నిర్మలాంతఃకరణు సర్వ • నిగమవేద్యు భక్తసంత్రాణ శీలు న • వక్రవిక్ర
ముని హరిని గాంచె నప్పుడా • యనిమిష వ్రజంబు పెన్నిధి గాంచిన • జనుఁడు వోలె.

తే॥ కని మనంబునఁ బేఁగొను • కౌతుకమునఁ గరములన్ మోడ్చి భక్తి సం • కలితులగుచు
వినయనత దేహులై మహా • విష్ణుఁ గాంచి పలికి రిట్టుల నాదితే • యులు కడంక.

క॥ నీకెఱుఁగరాని దొక్కటి లోకంబున గలుగునే త్రి • లోకజ్ఞ సురా
నీకమును నీవ కాదా సాఁకుచు నుందువు సతంబు • సదయుఁడవగుచున్.

తే॥ కారణం బెఱుంగఁ • గారాదు లోకసంచయములెల్ల బ్రళయ • సమయమందు
వలెను గాలుచుండెఁ • బంచభూతంబులు నున్కి వీడి • పారుచుండె ననఘ.

తే॥ నిలువనీడ లేదు • నిఖిలంబు శర్వఫాలాగ్ని దగ్ధమట్లు • లయ్యె నకట
సర్వవేదివీవు • జలజాక్ష దీనికి హేతువెద్ది తెలుపు • మిపుడు మాకు.

క॥ నావిని కనకాంబరుఁడా నావిశదంబయ్యె నీ మ • హాప్రళయము దు
ర్భావ నిధానము ధరణీ దేవకుమారుం డొకండు • ధృతి ధైర్యుండై.

ఉ॥ వారనికొక్క మంచుమల • పైనను జేరి మహోగ్రనిష్ఠతోఁ
క్షీరము లాత్మ గోరి శశి శే • ఖరు సర్వజగచ్ఛరణ్యుడౌ
పూరుషు శర్వు గూర్చి తపముం బొనరించుచునున్న వాఁడు దు
ర్వార తపోగ్ని దిక్కుల నిరంతముసై వెసగాల్చునట్లుగా.

తే॥ తత్తపోగ్ని ప్రబలి • దావానలంబట్ల గాల్చుచుండె వేరు • గాదు విప్ర
సుతుని వాంఛదీర్ప • శూలికి దక్క వేరెవ్వరికి శక్య • మే తలంప.

తే॥ ఈ యుపద్రవమును మాన్ప • నిపుడు నేను భగుణకడకేగి ప్రార్థింతు • భక్తరక్ష
కుండతఁడు విప్రపుత్త్రుని • ఘోరతపము మాన్పి జగములఁ బ్రోచు సమ్మదమునిజ.

క॥ మీరడుగుడనుచు వెన్నుం డా రజతాచలము జేర • నరిగి యచట గం
భీరస్వాంతు ననంతు నపారగుణోపేతు గాంచి • ప్రవిమలభక్తిన్.

వ॥ నమస్కరించి దేవా! నీవు సర్వజ్ఞుండవు నీ యెఱుంగని దొక్కండునుం గలుగునే సర్వసమర్థుండవగు నీకు మదీయాగమన కారణంబు దెలిసియే యున్నయది. భక్తవత్సలుండవగు నీవింత కాలంబా యుపమన్యు ననుగ్రహింపకుంటజేసి యాతండు గావించు తపంబు దారుణంబై పంచభూతంబుల వంచించుచుండెడిని. జగద్రక్షకుండవగు నీవిట్లుపేక్షించిన లోకంబు నెవ్వండు బ్రోవగలండు. అని యనేకనుతుల వినుతించిన శంకరుండు ప్రసన్నుండై గోవిందున కిట్లనియె.

క॥ ఏనెఱుంగకున్నవాఁడను గానీ లోకంబు బ్రోచు • కార్యము నాయం
దే నిలిచియున్నయది ప్రజ్ఞానిధి నుపమన్యు నిపుడ • కాంచ నరుగుదున్.

తే॥ భక్తుఁడైనవాని • భక్తి పరీక్షించి వరమొసంగవలయు • వాని కెలమి
నట్లు గాన యిట్టి • యాలస్యమయ్యెను వగవకుండు మురా • వ్య యింక.

—• శివు డుపమన్యుని బరీక్షింప దేవేంద్రుడై ప్రత్యక్షమగుట •—

వ॥ అని పలికి.

సీ॥ సర్వసంరక్షణ • క్షమమైన తనర్చు నూఱంచులవాలు చే • మించుచుండఁ
దప్తకార్తస్వరో • ద్యద్భానువగు మేన రమ్యసహస్రనే • త్రములు దనర
బ్రహ్మాది నిర్జర • వ్రాతంబు లెంకలై యిరు గెలంకుల బరా • బరులొనర్ప
సనకాదిమౌని సం • చయము ముందుగ నిల్చి శ్రుతివిహితముగ సం • స్తుతు లొనర్ప
గరుడ గంధర్వ యక్షగా • క్షసగణంబు బలిసి కొలువంగ నిల వేల్పు • పట్టిగాంచు
కోర్కు లిగురొత్త ముక్కంటి • గోత్రభేది వేషమున హిమగిరికిసై • వెడలెనపుడు.

తే॥ అట్లు నెడలి మౌని • యైన తపంబొనరించు విప్రపుత్రు గాంచి • విస్మయమునఁ
దపము సేయుటకును • దగిన ప్రాయము లేనివాఁడు చూడ చిన్న • వాఁడితండు.

గీ॥ సంతతము తల్లిదండ్రుల • చెంతఁజేరి యాదరింపఁగదగిన ప్రా • యంబువాఁడు
పట్టుదలచేత నిట్లు ద • పస్వియయ్యె విషయరతియెట్టివారిని • వేరుపరచు.

చ॥ అనుచు దలంచుచున్ మది ద • యారసముం బ్రకటించుమోముతో
ననఘము నైన లోచన స • హస్రముతో సుర సంచయంబుతోఁ
దనకడనున్న కైతవ శ • తక్రాదపాణిని గాంచి భక్తియున్
వినయము చౌకళింపఁగ వి • వేక ధురంధరుడాతఁ డిట్లనున్.

## —• ఉపమన్యుడు కుహనాదేవేంద్రుని నుతించుట •—

ఉ॥ పావనమయ్యె నాజనిస్వ • భావ ముదాకర మీ నగంబు సం
భావితమయ్యె మానులు శు • భప్రద వృత్తి వహించి రెంతయున్.
దేవ యకారణంబుగ సు • ధీవినుతంబులు తావకాంఘ్రి రా
జీవములన్ గనుగొనుటఁ జేసి • ఫలించెను మా తపంబులున్.

తే॥ కారణంబులేక • దారు మహాత్ములు దీనులుండు నట్టి • దెసకు నెపుడు
గొప్పవారికెందుఁ • గొద్దివారలతోడ నవసరంబు గలుగ • దండ్రు బుధులు.

క॥ కావున ద్వదాగమనమున కీ విప్రకుమారునందు హెచ్చిన కృపయే
భావింప గారణంబగు దేవా త్రైలోక్య పూజ్య • త్రిదశాధీశా.

తే॥ అని సయుక్తికముగ • నాడి యంజలిగూర్చి వినతుడగుచు నున్న • విప్రుగాంచి
యతని దీక్ష దెలియు • టవసరంబని కుహనామరేంద్రుఁ డిట్టు • లనియె నపుడు.

ఉ॥ బాడబవర్య నీ విమల • భక్తికి మెచ్చితిఁ జిన్నవాఁడవీ
వేడ మహామునీశ్వరుల • కేని యొనర్పఁగరాని యీ తపం
బేడ నెవారు జెప్పిరిది • యెయ్యది నీ యభిలాష పూనికన్
వీడుము నీకొసంగెదను • వేడుము నీదగు కోర్కె యెద్దియో

చ॥ తెలియవె న్నవు నన్నఖిల • దేవ నమస్కృతపాదపద్ముఁడై
యలరెడువాని నింద్రుని గ • రామరపుత్ర జగంబులెల్ల నా
వలనన బుట్టె గిట్టుముని • వర్యులు నన్నె పరాత్పరుండుగా
దలఁతురు యజ్ఞసంతతులఁ • దద్దయు నాకె హవిస్సొసంగుచున్.

తే॥ నిర్గుణుండైన రుద్రుపై • నీకు భక్తి యేలఁ గల్గెనో యతఁడు నీ • కేమియొసఁగు
నిష్కపటమగు భక్తి న • న్నే దలంపవలయు వరమ లొసంగెద • వారకిపుడు.

చ॥ సతతము భూతరాశులు పి • శాచములున్ భజియింపగా శ్మశా
న తలమునందు ద్రిమ్మరుచు • నాఁడెపు సొమ్ములు లేక క్రూర స
ర్పతతులు బుస్కపేర్లను క • రంబు ధరించిన యా దిగంబరున్
మతి దలపంగ నేమిటికి • మానుము వెట్టి తలంపు నీపయిన్.

చ॥ అనుటయు నమ్మునిప్రవరుఁ • డాజ్యము వోసిన యంతమందు న
య్యనలము పోల్కి నాగ్రహ స • మావృతుడై కపటామరేంద్రునిన్
గని యిటులాడఁబోలునె జగ • ద్ధితముం బొనరించు నీవె యి
ట్లని పరమేశుదూర భవ • దన్యుల వారణసేయు టెట్లొకో.

—: ఉపమన్యుఁడు కుహనాదేవేంద్రునకు శివప్రభావంబుఁ జెప్పుట :—

చ॥ వనజభవుండు వెన్నుఁడును • వాని శిరంబును బాదయుగ్మముఁ
గనుఁగొన నేర్తుమంచు జిర • కాలమా యత్నముజేసి యే ప్రయో
ప్రయోజనమును గాంచలేక తమ • సర్వసమర్థతఁ గోలుపోయి రా
ఘనుఁడు గిరీశుఁ డల్పుఁడుగఁ • గన్పడెనే నినువంటివానికిన్.

చ॥ ఎవని స్మరించుమాత్రమున • నెల్లజగంబు జనించుచుండునో
యెవఁడు పరాత్పరుం డనుచు • నెల్ల శ్రుతుల్ మొఱవెట్టుచుండు నా
శివుని కృపారసంబుననె • చెందితి వింద్రపదంబు నీవు వా
సవగతవృత్తముఁ మఱచి • శంభుని దూఱుట నీకు లెస్సయే.

మ॥ శివనిందాపరులైనవారలను శి • క్షింపంగ నర్హుండ వీ
వె నిధిన్ దాఁచెదు నేర్పులేక హరునిన్ • విశ్వాత్మునిన్ దూఱుచుం
టివి నీ సాహస మేమనన్ వలయు నిం • తే కాదొ యైశ్వర్య సం
భవమౌ గర్వ మదెట్టివారికి నధ • ర్మప్రాప్తి గావించుటల్.

ఉ॥ ఈవు సురేశ్వరుండవగు • దేని యధర్మము నాక యూరొడన్
భావజవైరి నీ గతి ఎ • వాచ్యములన్ బలుకంగ నేర్తువే
యా విబుధేంద్రు రూపమున • నాశ్రమ ధర్మములన్ హరించి మా
కీవెత గూర్పనెంచు దను • జేంద్రుఁడవయ్యెదు గాక చూడగన్.

వ॥ తొల్లి సకలలోక ప్రాజాపత్యంబుఁ గాంచినంత దేహంబు మఱచి యహంకారంబున నీశ్వర దూషణంబు గావించిన దక్షుని పడుపాట్లు విస్మృతంబులయ్యెనే భగవంతుఁడగు దేవ సేనాపతి మ్రోలఁ బ్రణవంబు దనయం దన్వయించునని గర్వంబు పెంపునఁ బలికిన విరించి గాంచిన దుర్దశ నేటికేని విశ్రుతంబకదా. నీవమృతాంధసుండవగుదేని కణఁక కఠోరంబుగ మాటాడుదువే. శివశివా నేఁడెట్టి దుర్దినంబు. సాధులోక హృదయ విదారకంబులగు నీదుర్భాషలకు మాకెట్టి సంతాపంబు గలుగుచున్నదో నీ కెట్లు దెలియనగునని కోపంబున వెండియు నిట్లనియె.

తే॥ కలుషమనిన భీతిఁ • గనక స్వాహంకృతి నతిశయించి మాట • లాడువాని
నాల్కఁబట్టి వేయు • చీల్కలుగాఁ ద్రుంచి న్యాయపథముఁ ద్రొక్కు • మనిరి బుధులు.

చ॥ దనుజుఁడవైన నేమి వసు • ధాధరపక్ష విభేత్తవైన నే
మి నిఖిలలోక శంకరుని • మృత్యునిహంతను శంభు నిందఁజే

సినకతనఁ భవచ్ఛిరముఁ • జీల్చుట ధర్మపథంబె యైన నా
మనసు సహింప దన్యులను • మానక హింసయొనర్చు కార్యముల్.

తే॥ పూజ్యురాలైన మాతల్లి• పూర్వమొక్కతఱిని వచియించె నెవఁడేని • ధర్మము విడి
సాధునింద యొనర్చు నాఁజనుని గుఱిచి తత్క్షణము దేహముల్ వీడఁ • దగునటంచు.

క॥ కావున నీ కారణమున జీవంబుల విడిచి శంభుఁజేరి • సుఖింతుఁ
భూవిదితమయ్యెడును నీ కావించిన కార్య మెల్ల • కాలం బింకన్.

వ॥ అని నిజశరీర త్యాగంబు గావించు తలంపున సహస్రవారంబు పంచాక్షరీమంత్ర
పఠనంబుజేసి యథర్వాస్త్రంబు ప్రయోగించె నంత కపటాఖండలుఁడా యస్త్రంబు
నుపసంహరించి కరుణాళుండై యప్పుడు.

—• ఉపమన్యున కీశ్వరుడు ప్రత్యక్షమగుట •—

సీ॥ బాలచంద్ర ప్రభా • భాసురంబగు జటాపటలంబునఁ గంగఁ • బాదుకొల్పి
నీలపయోధర • నిభమైన గళసీమ సర్పహారంబులు • సంతరించి
కర్పూర పాండుర • కాంతి రాజిలు మేన నలరు విభూతిరే•ఖలుఁగఁ దీర్చి
నువ్వంపునడుమున • మువ్వన్నె మొకముతోల్ గుదురుగా ధట్టంచి • కూర్చి కట్టె
ముమ్మొనలవాలు నొకచేత • మురువుజూప ముద్దుపల్కుల గిరి పట్టి • యొద్దనుండ
గిబ్బతిత్తడిపైనెక్కి • కృత్తివాసుఁ డపుడు ప్రత్యక్షమయ్యె న • య్యర్భకునకు.

చ॥ అటులఁ బ్రసన్నుఁడైన గిరి • జాధిపుఁ గాంచి కరాంబుజాతము
ల్నిటలమునందు జేర్చి వి • నీతుడునై పెనుగాలితాకునన్
దటుకున సంచలించెడి ల • తంబలె మేనువడంకఁగా నవి
స్ఫుటమగునూక్తి నిట్లనుచు • భూసురపుత్రుఁడు పల్కె మెల్లనన్.

—• ఉపమన్యుఁడు శివుని నుతించుట •—

ఉ॥ నీ మహిమంబెఱుంగఁగల • నేరుపుజాలమిజేసి నిన్ను సు
త్రామమిషాగతుండయన • దైత్యునిగాఁ దలపోసి దూఱితిన్
సోమకళాధరా శరణు• జొచ్చితి నేరమి సైపుమింక నే
పామరుఁడన్ మదోద్ధతుఁడఁ • బాపుఁడ క్రూరుఁడ దుష్టచిత్తుఁడన్.

క॥ తెలియక నాచేసిన తప్పుల మన్నింపంగదయ్య•పురహర యజ్ఞా
న లతాబద్ధుఁడ దుష్టుఁడఁ బలికితి దుర్భాష లిపుడు • పలుమరు నిన్నున్.

తే॥ హరి విరించాది నిర్జరు • లైనగాని నీ ప్రభావంబు నెఱుఁగంగ • నేరరనిన
నర్భకుండ నజ్ఞానుఁడ • నైననాకుఁ దెలి యవశమానె నిఖిల భూతలశరణ్య.

వ॥ బ్రహ్మాదులేని నీవు పరీక్షింపఁ జాలకుండు రట్టియెడ నీయల్పుండు సమర్థుండగునే యేనించుకముని సాంగత్యంబు లభించెఁగదా యను నహంకారంబున నీ తత్త్వం బెఱుంగక దూషించినను దోషప్రాదుర్భావంబొకప్పు డాహ్లాదజనకంబగునని యనుభవజ్ఞులు నుడివినట్లు నా దోషంబు కలుషహరంబగు తావకదర్శనంబు గూర్చుట సంతోషహేతువయ్యెనని యుపమన్యుండు వినయంబునఁబల్కిన గిరీశుండాతనిభక్తికి మెచ్చి సృష్టిస్థితి సంహార సమర్థంబులగు కరంబుల నాతని నెత్తి మూర్ధం బాఘ్రాణించి యిట్లనియె.

చ॥ తెలియనివాఁడవయ్యు నను • ధీవరులుంబలె సర్వ విద్యలుం
దెలిసినయట్లు బల్కితివి • తృప్తుడనైతిని నీయెడన్ మునీం
ద్రులకును గోచరింపని న • నున్ గనుగొంటివి నీకు నింకఁ గా
వలసిన కోర్కె యెద్దియొ యవారితరీతి వచింపుదీర్చెదన్.

— శివు డుపమన్యునకు గాణపత్యం బొసఁగుట —

మ॥ అనుమానింపకు క్షీరమే వలయు నా • యన్యంబు వాంఛింతువా
ధనధాన్యాదులయందుఁ గాంక్ష కలదా! తథ్యంబు నీ కెద్దికో
రిన నద్దాని నొసంగుదున్ సకల ధా • త్రీ నాయకత్వంబొ స్వ
ర్గ నివాసాధిపతిత్వమో విమలమా • కైలాసమో తెల్పుమీ.

సీ॥ అదె క్షీరసాగర • మదె దధిసింధు వల్లదె ఘృతోదధి కను • మదె ఫలార్ణ
వంబదె భక్ష్యప • ర్వత మద్దియె యపూప శైలంబదియె బంధు • సమితి యదియె
యిన్నిటిలోన నీ • కెద్ది హితంబగు దాని గైకొను మను • మానము విడి
యుపమన్యుఁడా! కోరి • నపగిది సర్వంబు నీ కొసంగితి కరు • ణించి యిపుడు

జగము తల్లియైన • సర్వమంగళ నీకు దల్లియయ్యె నేను • దండ్రి నైతి
ననఘ దేవదాత్వ • మును గాణపత్యంబు గొని యశంబు గాంచు • జననితోడ.

తే॥ అని యనేకవరము • ల నొసంగి యాచంద్రతారకంబు తరుణ • తనువహించి
సతత శైవభక్తి • సామ్రాజ్యమున మింతుగాక యనుచుఁ బలికి • కనుమొఱంగె.

ఉ॥ అంతట విప్రనూనుఁడు కృ • తార్థుఁడనైతినటంచు కౌతుక
స్వాంతుఁడునై ప్రవృద్ధశివ • భక్తిలతాంకుర మెల్ల దిక్కులన్

దంతురమై చెలంగ నిర • తంబు మునిప్రకరంబుగూడి ని
శ్చింత హిమాలయంబు దరి • జేరి హరార్చన జేయుచుండగన్.

ఉ॥ సర్వసధర్మడార్యజన • సంస్తవనీయుఁడు కంస దానవా
దర్వనిహంత పాండవ ని • కాయము ప్రాపు సమస్తయోగి రా
డ్గూర్వహుఁడాదిమూర్తి యవ • ధూత సురారి బలుండు సంతతా
ఖర్వపరాక్రమోన్నతుఁడ • ఖండ యశోనిధి కృష్ణుఁడాత్మలో.

సీ॥ కారణాంతరమునఁ • గలుగుచుండెడు మనస్తాపంబు మాన్పి సం • తసముఁగూర్పఁ
దండ్రి సౌఖ్యముల కెం • తయుఁ దానె బీజమై కులమునకున్ గీర్తి • గలుగఁజేయఁ
బ్రాకృతంబులగు పా • పముల నధోగతిఁబడు పితరుల నూర్ధ్వ • పదముఁజేర్ప
సారంబులేని సం • సారంబునకు ముక్తికి నంత మేడను మెట్లు • సంతరించు

యమభటులు పాశములఁ గ్రంత • మందుఁ జుట్టి బలిమిచే నీడ్చుకొనిపోవు•పట్ల మృత్యు
కడ్డమగు వైతరణి దాఁటు • నట్లు జేయఁ గల్పవృక్షంబెయగుఁగదా • కన్నకొడుకు.

వ॥ కావున నింకమీఁద మదన్వయం బభివృద్ధి గాంచుటకై యీశ్వరుగూర్చి తపంబుఁ గావింతుగాకయని యమ్మాధవుం డుపమన్యుముని యాశ్రమంబునకున్ జనుదెంచినఁ ద్రికాలజ్ఞుండగు నయ్యోగీంద్రుఁడును కృష్ణాగమనకారణం బెఱింగి కరుణాళుండై గోపాలునకు శైవదీక్షారాజంబగు పాశుపతవ్రతం బుపదేశించినంతఁ గృష్ణుండు పుత్రవంతుండయ్యె నదిమొదలెల్లవారును నితాంతభక్తిఁ బాశుపతవ్రతం బనుష్ఠించుచు నిజకామ్య సంసిద్ధిఁ గాంచుచుండిరని సూతుండు శౌనకాదులకుఁ జెప్పుటయు.

క॥ శ్రితలోక శరణ గర్వోద్ధత దానవనిహననతుహిన • ధామా భరణా
సతతమహాయోగికులస్తుతిచరణా పాండ్యరాజ • దుహితృహృదీశా.

చ॥ సకల సురాసురప్రకర • సన్నుత పాదపయోజ క్రూర దై
త్యకులవినాశనక్షమ త్రి • శావనదక్ష సమస్తయోగిరాట్
నికరమనోనివాస ధర • ణీధరరాజసుతాకళత్ర మా
మకకృతిపోషణా రజత • మందిర సుందరసుందరేశ్వరా.

పంచచామరము—

చరాచర ప్రపంచజాల • శాసనక్రియా చణా
ధరాధరేంద్ర కన్యకావ • తంసితాంగ భాసురా
పురాసుర ప్రకాండగర్వ • పుంజనాశ నక్షమా
సరోజలోచనాదిదేవ • సన్నతాంఘ్రి పంకజా

తే॥ కష్టపడి పెంచి యిడితి నా • కవితకన్నె నెవ్విధంబున నలరింతొ • యింక నీవు
గంగవోలెను గయ్యాళి • గాదు బేలసుమ్ము నీ తలనెక్కి • నాట్యమ్ము సేయ.

సీ॥ ఏ మహామహుఁడు శ్రీ • వేమనాగాధ్య వంశాబ్ధికిఁ బూర్ణ శ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి • కెనయై సతుల్మెచ్చ మహిని బాతివ్రత్య • మహిమఁ గాంచె
నట్టి నందయకు గా • రమకు ద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోదరుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ

వార్యునకుఁ బౌత్రుఁడను మఱి • యమగు శ్రీమదాంధ్ర లింగపురాణోత్త • రార్ధ మందు
నయ మూఁడవ యాశ్వాస • మయ్యె దీని సతము రక్షించుఁగావుత • చంద్రమౌళి.

---

శ్రీ మీనాక్ష్యైనమః

# శ్రీమదాంధ్ర లింగ పురాణము



-◆ ఉత్తరభాగము ◆-

## —: చతుర్థాశ్వాసము :—

క॥ శారద నీరద నారద పారద నిభదేహ మోక్ష ◆ పాదాశ్రిత బృం
దారకతారక సురరిపుమారక మధురాపురీశ, మాదృగ్భరణా!

వ॥ అవధరింపుము కథకుండు వెండియు నిట్లనియె.

చ॥ ఘనుఁడు జగత్ప్రసిద్ధుఁడు మృ ◆ కండసుతుండు దురాజనాళి భ
క్తనికరశేఖరుండు జిత ◆ కల్మషుఁ డంతకగర్వభంజనుం
డనఘుఁడు తొల్లి యొక్క దివ ◆ సాంతమునన్ దన శిష్యవర్యులే
పునఁ బరిచర్యసేయ స్థిర ◆ బుద్ధి నిజాశ్రమమందు నుండఁగన్.

—◆ అంబరీషుఁడు మార్కండేయాశ్రమమున కేగుట ◆—

చ॥ హరిపదసేవకుండు సక ◆ లాగమ తత్త్వవిదుండు సద్గుణా
భరణుఁడు సాధుపూజకుఁడ ◆ వక్రపరాక్రముఁ డంబరీషుఁడన్
నరవరశేఖరుండు కరు ◆ ణానిధి యా సరసీరుహాక్షు స
చ్చరితము లెన్నియో వినియు ◆ స్వాంతమునన్ బరితృప్తిగల్గమిన్.

క॥ అకొన్న లేగపసికద కేకరణి బిరానఁ బరుగు ◆ లెత్తునొ యట్లా
మూకీకృతాంతకుని సుశ్లోకుని మునిఁ జేరఁబోయె ◆ సురుచిరభక్తిన్.

తే॥ అట్లు భక్తిపూర్ణుఁ ◆ డై చనుదెంచెడు నవనినాథుఁగని యు ◆ ద్భాస్వగార
వమునఁ దోడ తెచ్చి ◆ యమ్మునితల్లజుఁ డాతిథేయ మొసఁగె ◆ నంత నతఁడు.

క॥ మునిదర్శనంబు గలుగుటఁ దన వాంఛ ఫలించినట్లె • తలఁచుచు మోదం
బుగ వినయము దనరఁగ నాతనిఁ గనుఁగొని పలికె ని • ట్లు తంద్రిత బుద్ధిన్.

ఉ॥ ఈయఖిల ప్రపంచమున • నెందును నీకెఱుఁగంగరాని దొం
డేయెడనైనఁ గల్గునెయ • హీనచరిత్ర ధభాదృశుల్ గదా
యాయత భక్తివృద్ధులగు • నట్టిమహాత్ములు మమ్ము వంటి దు
ష్కాల నుద్ధరింపఁగల • కౌశలమున్ గలయట్టి ధీనిధుల్

తే॥ అమృత కల్పంబులైన శ్రీ • హరి చరిత్ర లెన్నియోవింటినైనను • దృప్తిలేదు
సగ వినిపించు వారియా • దరము కల్మి వినవలయునని యెదునట్టి • పేర్మిదక్క

—• మార్కండేయుఁడు అంబరీషునకు కౌశికోపాఖ్యానముఁ జెప్పుట. •—

సీ॥ అనుడు మార్కండేయుఁ • డను నాదరంబునఁ బృథ్వీశ వినుము వి • న్పింతునీక
నీవు సర్వజ్ఞుండ • వెల్లశ్రుత్యర్థముల్ నీవెఱుంగవెచూడ • నిపుణమతివి
శివభక్తులందున • శ్రీవత్సలాంఛనుం డెట్లగ్ర గణ్యుండో • యట్ల విష్ణు
భక్తులందున నగ్ర • పదముఁగై కొనినాఁడు కౌశికుండనియెడు • ఘనుఁడొకండు
హరిని మెప్పించి తలఁచిన • యప్పుడెల్లఁ గరుణతోఁ బల్కునట్టుల • వరముఁగొనియె
నఘవినాశకరంబు భ • క్తౌఘ సమ్మతంబు కౌశికద్విజ చరి • తంబు దలప.

తే॥ అశ్వమేధ సహస్రంబు • నాచరించునట్టి ఫలము లభించు న • య్యగ్రజన్ము
పుణ్యచరితంబు వినఁగోరు • పూరుషులకు నిశ్చలాత్ముండవై విను • నృపవరేణ్య.

చ॥ ఖలజనతా వినాశన ము • ఖంబున శిష్టజన ప్రమోదమున్
సలిపి సమస్త భూధరణ • సంగతి ధర్మపథంబు ధాత్రిపై
నిలుపుట దేవదేవునకు • నిత్యహితంబగుగాన నేశవుం
డెలమి నిద్రేతయందుఁ జని • యించె రఘూద్వహుఁడైముదంబునన్.

క॥ ఆయుగమున కవతంసంబై యనిశ సమర్చితాంబు • జాక్షుండై భ
ద్రాయితుఁడు కౌశికుఁడను మహాయోగి యొకండు వెలసె నగ్రకులమునన్.

చ॥ పలికిన విష్ణునామములె • పల్కుజపం బొనరించెనేని ని
ర్మలమగు భక్తి మాధవుని • మంత్రములే జపియించు మెట్టినన్
జలజదళాక్షు స్థానములే • చయ్యన మెట్టుఁ దలంచినన్ నిరా
కుల మతి నాశ్రిత ప్రకర • గోప్తఁ దలంచునతండు నిత్యమున్.

సీ॥ వేకువజామున ♦ విష్ణునామ స్తుతి పరత మెల్లన లేచుఁ • బాన్పునుండి
యామీఁదఁ బూతంబు • లగు తులసీజలంబుల స్నానమొనరించి • తులసి
దామరపూసలఁ ♦ దగ గళమునఁబూని పట్టెవర్ధనములఁ ♦ బరగఁదాల్చి
నంతటఁ దాంబుర • హస్తమందునఁజేర్చి కాళ్ళ గజ్జెలు ఘల్లు ♦ ఘల్లు మనఁగ

నున్ముఖుండయి మదిని ప • యోజనేత్రు భక్తవత్సలు నిందిరా • ప్రాణవిభుని
నిల్పి జనరంజకంబుగ • నిరతిసామగాన మొనరించు విష్ణుభ ♦ క్త ప్రవరుఁడు.

—• కౌశికుఁడు విష్ణుభక్తిఁ బ్రసిద్ధుఁడగుట •—

తే॥ నడచు తఱి భోజనముఁజేయు • నెడను శయ్యఁజేరియుండినవేళను ♦ నీరుద్రావు
చున్నెడను గులకాంతతో • నున్నపుడును హరినె కీర్తించుచుండు నయ్యగ్రజుండు.

సీ॥ తనగారు పట్టెవ ♦ ర్ధనము లెవ్వని నుదుటను గన్న నతని వి • ష్ణునిగఁ దలఁచుఁ
దులసిమాల లెవాని ♦ గళమునఁజూచిన నతఁడె నారాయణుం ♦ డనుచు నెంచు
హరినామ మెవ్వని ♦ యాననంబున విన్న వాఁడె కేశవుఁడంచుఁ బలుకుచుండు
జక్రాంకణంబులే • జనుని భుజంబులయందున్న నతఁడె గో • విందుఁడనును

దాంబురనుబూని కృష్ణ గా ♦ నంబుఁజేయువాని దర్శించి యిందిరా ♦ ప్రాణవల్ల
భుం డితండె యనుచుఁ జెప్పు • చుండు నతఁడు భాగవతలోకవర్యుఁ డా •
[ బ్రాహ్మణుండు.

సీ॥ ఒకవేళ యని నియా • మకములేకయ యతం డెల్లవేళల హరి • నే తలంచు
నొక దేశమనక మా • నక యెల్లదేశంబులన్ విష్ణుపద్యంబు • లనె పఠించు
నొకరతోనని తలం ♦ పక యెల్లవారితో మురహరుకథలనె • ముచ్చటించు
నొకవారమనక పూ • నిక నెల్లవారంబు లబ్జాక్షునే గూర్చి • యాడుచుండు

నొక్కగతినె గాక ♦ పెక్కుగతులఁ గనకాంబరుని ప్రభావ • మరసి యరసి
యుబ్బి యెగురుచుండు • నుర్వీసురుండన్య కార్యములను మఱచి ♦ కలినిగెలిచి.

క॥ ముట్టఁడు తనయింటిపనులఁ బట్టఁడు కొనుమనియె యెవారు ♦ పైడినొసఁగినన్
దిట్టఁడు దూఱినవారలఁ గొట్టఁడు పెనుఱాల రువ్వ • కూళల సైనన్.

క॥ మానఁడు హరిసంకీర్తన మానఁడు విషయాభిలాష • నురుతరభక్తిన్
గానఁడు భవపాశయుతుల నానిష్ఠాపరుఁడు జితమ • హోఘుండగుచున్.

క॥ పలుకఁడ వైష్ణవతతితోఁ దలఁపఁడు వైకుంఠుఁ దక్కఁ • దక్కన సురలన్
నిలువఁ డవిష్ణుపదంబుల నలయఁడు హరిదాసులందు • నగ్రసరుండై.

ఉ॥ ఎచ్చట విష్ణుభక్తజన ♦ మెల్ల వసించి తదేక నిష్ఠమై
తచ్చరితంబులన్ బలువి ♦ ధంబుల ముచ్చటలాడుచుందురా
సచ్చరితుండు నచ్చటికిఁ ♦ జయ్యనఁబోయి తదర్థసంతతిన్
హెచ్చిన భక్తితోడ నుగ్ర ♦ హించుచునుండు నవారితుండునై.

తే॥ అటుల దినదినవర్ధమా ♦ నాంబుజాక్షు భక్తిపరశుఁడగుచు నా ♦ బ్రాహ్మణుండు
విష్ణుగానంబు దిక్కుల ♦ వెలయునటులఁ ద్రిమ్మరుచునుండె ధరణీ తలమ్మునెల్ల.

ఉ॥ కొందరు నాస్తికుల్ కలుష ♦ కుంఠిత చిత్తులరై ద్విజాన్వవా
యుందత భక్తిమార్గమున ♦ నుండి వెసన్ మరలింపఁజూతురా
నందమయుం డితండని ♦ జనంబులు కొందఱు మెచ్చుచుందు రా
రందఱతోడ నేమియని ♦ యాతఁడు శ్రీపతిఁ గొల్చు నిచ్చలున్.

ఉ॥ ఆవిధి కౌశికుం డహర ♦ హంబు జగత్త్రయపూజ్యుఁడైన ల
క్ష్మీవిభు మాధవున్ హృదయ ♦ సీమను జేర్చి కరంబు విష్ణుభ
క్తావళిఁ గూడి త్రిమ్మరుచు ♦ నార్యజన స్తవనీయయుఁడై కళ
త్రావనమైన సెంచక గృ ♦ హంబును వీడి చరించుచుండఁగన్.

మ॥ హరిభక్తాగ్రసరుం డితం డఖిలదై ♦ త్య వ్రాత సంహారుఁడౌ
సురలోకావనుఁ డిందిరా విభుఁడు వ ♦ శ్యుండయ్యె నీ భూమి ని
ర్జర వంశేంద్రున కిమ్మహామహుని నె ♦ ర్యంబున్ గణింపగ నె
వ్వరికిన్ నేరుపు చాలదంచు వచియిం ♦ పన్ బూని రుర్వీసురుల్.

కం॥ అనుచు ననేకవిధంబులఁ గొనియాడుచునుండి రగ్ర ♦ కులజు లతని నం
దు నొకఁడు పద్మాక్షుండను ఘనుఁ డాతనిఁజేరి వినయ ♦ గతి వచియించున్.

ఉ॥ ధీనిధివీవు నిన్ను విను ♦ తింపఁగ నేర్తునె పామరుండన
జ్ఞానపరీవృతుండ ధన ♦ గర్వితుఁడన్ శ్రితలోక పాలకుం
డా నలినాక్షు నిర్మల ప ♦ దాంబుజ భక్తిలభించు టెట్టులో
పూనియెఱుంగఁ జెప్పఁగదె ♦ భూసుర శిష్యుని గాఁ దలంచుచున్.

కం॥ కరుణానిధియగు నమ్మురహరుఁ డెవ్విధి గోచరించు ♦ నాతని చరణాం
బురుహములఁ గొలుచు టెట్లో పరమపురుష తెలుపఁగదవె ♦ ప్రార్థింతు నినున్.

తే॥ గానలోలుండు శ్రీహరి ♦ కనికరంబు మనికియని వింటి నీ ముఖం ♦ బున నె యతనిఁ
గొలుచు మార్గంబదెద్దియో ♦ కలుషపూరితమగు సంసారముఁ దరించు ♦ క్రమమదెద్ది.

తే|| అనుచు వేడి కౌశి • కుని యుపదేశంబు సేకరించి యతనిఁ • జేరి యెపుడు
సామగానములను • జలజాక్షుఁ గీర్తించు చతని నీడకుండె • నాద్విజుండు.

చ|| తనధన మెల్లఁ గౌశికుని • దారసుతాదుల పోషణార్థ మా
ఘనుఁడు వ్రయంబుఁజేయు చధి • కంబగు గౌరవమూని యుండుటన్
గనుఁగొని విప్రులెల్ల రొడి • కంబునఁ దారునుగూడ నమ్మహా
త్మునకును శిష్యులై యతని • తోఁ జగలాడుచు నుండి రెప్పుడున్.

తే|| కౌశికుండు హరిని • గానంబుఁజేయఁగ ఛాత్రులెల్ల వినుచు • సంతసింత్రు
హరిభజనమటన్న • నాదరింపనివారు కలరె మూఁడులోక • ములను గనిన.

వ|| అవ్విధంబున భాగవతాగ్రేసరుండగు కౌశికుండు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర కులజులగు నంతేవాసులు దోడరా నాదినారాయణు గానంబుఁజేయుచు విష్ణు క్షేత్రంబుల దర్శించుచుఁ జని చని కళింగదేశంబుఁజేరె నందు

క|| గోవిందనామకీర్తన గావించుచు నర్థిజనులఁ • గనికరమున సం
భావించు మాళవుండనఁగా వైశ్యుఁడొకండు విగత • కల్మషుఁడగుచున్.

క|| తన మనసులోన వర్తించి నిరంతర విష్ణుపాద • సేవారతయై
తనరెడు మాళవినాఁబడు వనితఁ గలిసి చెలఁగు వైష్ణ • వ ప్రియుఁడగుచున్.

క|| ఆ వణిజుఁడు కరి వేలుపు కోవెల కరిగి యొకనాఁడు • కోమలియును దా
నావేళఁ గాంచె నచ్చట గోవింద ప్రతిభుఁ గౌశి • కుని ననఘాత్మున్.

వ|| కనుంగొని భయ వినయంబులు బెనంగొన మాళవుండు లీలామానుష విగ్రహుండగు గోపాలుం డీ లీల నరుదెంచెఁగాఁబోలునని ప్రీతిస్నిగ్ధంబులగు నయనంబుల భక్త బాష్పంబులు గురియ నిశ్చలుండై కాంచుచు.

ఉ|| తేనియనవాలో సురన • దీ జలజాతమరంద బిందు స
న్మానిత బంభరప్రకర • మంజుల ఝుంకృతులో యనన్ హరిన్
గానము జేయు కౌశికుని • కమ్మని పల్కులు మెల్లమెల్లనన్
వీనులవిందొనర్పఁగ ప్ర • వృద్ధ కుతూహలుఁడయ్యె నయ్యెడన్.

తే|| ఆటకు మున్నుకు శస్థల • మందునుండి యరుగుదెంచిన భూసురు లైదుపదులు
విష్ణు సేవించుచుండిన • విమలమతులు వినిరి కౌశికు గానంబు వీనులలర.

ఉ|| మాళవియున్ దదన్యులును • మాన్యుని గౌశికు గారవించు చే
వేళఁ దదీయ గానమును • వీనుల విందుగ నాలకించుచున్

శ్రీ లలనామనోహరుని • సేవ నొనర్చుచు నుండి రంత భూ
పాలుఁ డధర్మవర్తనుఁడు • కాశికుఁ జేరగనచ్చి యిట్లనున్.

చ|| ఎఱుఁగవె నీవు నన్ను వసు • ధేశుఁ గళింగ విభుండటంచుఁ జె
చ్చెర నకలంకభక్తి ననుఁ • జేరి భజింపుచు నెల్ల భూసురల్
దలఁగని రొక్కమున్ గొని ము • దంబున సౌఖ్యమునొందుచుందు రే
త్తెఱహరిసేవ వీడి వినుతింపుము నన్ను నిరంతరం బికన్.

తే|| శ్రుతి మనోహరముగ మనస్ఫూర్తిన్ నన్ను గానమొనరింపవలయును • గానియిట్లు
చెడుతలంపున నెవ్వరో • చెప్పిరనుచుఁ గనఁబడనివానిఁ గీర్తింపఁ • గలదె ఫలము.

ఉ|| ఏమిటికిట్టి వెఱ్ఱితలఁపెందునఁ గన్పడు దేవుఁడైనవాఁ
డీమహి నెల్ల సౌఖ్యముల • నెమ్మెయి నొందుచు శాంతి నొందలే
కేమొ తలంచి యెవ్వనినొ • యెందులకో భజియింతు వేల యో
భూమిసురేంద్ర యిట్టి తలఁ • పున్ విడి నాయెడ భక్తినుంచుమా?

చ|| హరియన నెవ్వఁ డేకులము • నం దుదయించెనొ తల్లిదండ్రు లె
వ్వ రతనికింతకాలముఁ బ్రవాసమునన్ బడి యెల్ల దేశముల్
దిరుగుచు నాతనిన్ మది ను • తింపుచు నుంటివి లాభమేమి క
ల్గె రహిని దెల్పనేర్తువె క • ళింగపతిన్ భజియింపకున్నచో.

తే|| తెలిసితెలియనివారలు పలికినట్టి పలుకులను విశ్వసించి యి • ప్పగిదినెల్ల
సౌఖ్యములఁ గోలుపోనేల • శాశ్వతమగు సౌఖ్యము లభించు మార్గంబు • సంభవింప.

చ|| అనుచుఁ గళింగ భూపతి య • హంకృతి ధర్మముఁ దప్పి కిల్బిషం
బనక జగంబులెల్లఁ దన • యందె జనించెదునట్లు గర్వబం
ధనమును వీడనేరక ప • దంపడి నిష్ఠురవృత్తిఁ బల్కుటన్
విని మదినోర్వలేక పృథి • వీసురవర్యుఁడు వానికిట్లనున్.

చ|| హరిహరి యెంతమాట నిపు • డాడితివయ్య మహీశ యెట్టి ము
ష్కరుఁడగు నాతఁ డేని జన • కంటకవాక్యములాడ నేర్చునే
యరయగ వేల్పులందును ధ • రామరులందును భక్తిలేక త్రి
మ్మరు మనుజుండు దుస్తరత • మంబును జెంది నశింపఁడే ధరన్.

ఉ|| దేవుఁ డెవాఁడు నన్నె విను • తింపుడు శ్రేయముగల్గునంచు నో
భూవరపల్కఁగా,దగునె • పూరుషుఁ డెందులకే సమర్థుఁడే
స్థావరజంగమంబయిన • ధారుణినెల్ల సృజింపనేర్చువాఁ
డా వనజాక్షుఁ డొక్కఁడె క • దా విభుఁ డీడ్యుఁడతం డలంతియే.

చ॥ శ్రుతులు స్మృతుల్పురాణములు • సూరివరేణ్యులు శాస్త్రముల్మహా
మతులగు యోగిపుంగవులు • మాధవుఁడే జగదేకకర్త యా
శ్రిత జనరక్షకుండనుచుఁ • జెప్పరె యాతని సేవఁ జేయరే
యతులితభక్తి నీకిటుల • నాడుట దోషము కాదె భూవరా.

సీ॥ కుమ్మరి మృత్తికఁ • గొని తెచ్చి తనకుఁ జక్రమును దండము సహా • యముగఁ జేఁగ
నొకయెడనుండి చే • యకయున్నచో నెట్లు గలుగ నేర్చును ఘటం • బులు ధరిత్రి
నవ్విధి సర్వని • యంతయా వెన్నుండు పంచభూతంబుల • భాగములను
జేర్చి యొక్కటిగాఁగ • సృష్టింపనేర్పడు నఖిలచరాచర • మైన జగము

వెన్నుఁడే సమస్త • విశ్వేశ్వరుండని నిర్గుణుండటంచు • నిఖిలమునులు
పలుకుచుందురట్టి • భగవంతు నవ్యయుఁ జెడుతలంపుఁబూని • నుడువఁజనునె.

క॥ హరిమాయా పరివృతుఁడై పురుషుండు యథార్థ విషయ • ము నెఱుంగక క్రి
మ్మరి గర్వము పెంపున దుస్తరమగు నరకంబునఁబడి • తాపమునొందుఁ

తే॥ వలఁతియైనవాఁడు • వాల్లభ్యమున మించి తన గృహంబు వారిఁ • దగినరీతిఁ
బాలనం బొనర్చు • పగిదిఁ గేశవుఁడెల్ల జీవకోటిఁ గరుణఁ • జేసి ప్రోచు.

వ॥ నీ వించుక రాజ్యపాలనంబుఁ జేయగలిగినంతనె ‟సర్వంబు నాయధీనంబ” యని
తలంచి నిరామయుండును నిరహంకారుండును, నిర్గుణుండును సమస్తైశ్వర్యసంప
న్నుండును ననాదిమధ్యలయుండు నగు గోవిందుని దృణంబుగఁ జూచుచుంటివి నీకిది
ధర్మంబుగాదు. సార్వభౌమునివలన నియమింపఁబడి యతని శాసనంబు జవదాఁ
టక యుచితరీతిఁ జరించు నుద్యోగు లెట్లా మహీపాలుని సేవించుచుందురట్లు ప
మేశ్వరునివలన నయ్యైకార్యంబులందు నియమింపఁబడిన యస్వతంత్రుఁడగు క్షితి
యుండును భగవంతు నానతి నతిక్రమించక తనకు ధర్మంబగు కార్యంబుల నాచ
రించుచుండవలయును. అట్లుగాక స్వాతంత్ర్యమవలంబించునేని రాజాజ్ఞ మీఱి
తిరుగు ఖలుని రాజభటులట్లు యమకింకరులాతని దండింతురు. భగవన్నిందాపరుఁ
డవైన నీతోడ నింతప్రొద్దు సంభాషించుట దోషంబయ్యు నైన నజ్ఞానసాగరంబునఁ
బడి మునుంగు నిన్నువంటి పామరుల నుద్ధరింపకుంట ధర్మాతిక్రమణంబగుఁగా
నిందాక చెప్పవలసె. ఇట్టి కంఠశోష జెందుటకు నిన్నెవరేని రమ్మని ప్రార్థిం
చిరా యని యందువేని యాకర్ణింపుము.

తే॥ ఎవ్వఁడేని ధర్మ • మెఱుఁగక యనుచితసరణిఁ దిరుగఁబూను • సరగ నతని
బలిమినైన నన్మార్గ • పద్ధతిఁ జేర్చుట సాధుకృత్యమనిరి • సకల బుధులు.

తే॥ ఎఱిఁగి చెప్పకున్న • నెంతయొ దోషంబు గలుగుఁ దెలిసినట్టి • ఘనుని పలుకు
లాదరింపకున్న • నాతని నప్పుడ విడిచి చనుట యర్థ • వృత్తమనిరి.

క॥ నీయెడ నాకావించెడి నీ యుపదేశము రుచించు • నేని సమస్త
శ్రేయములు గలుగు నీ కనపాయుఁడవగుదువు కరంబు • ప్రాజ్ఞులు మెచ్చన్.

సీ॥ పురుషమాత్రుండె సం • పూర్ణస్వతంత్రుఁడై యెల్లలోకముల సంహీనశక్తి
సృష్టిస్థితి లయముల్ • సేయనేర్చునయేని యతఁడు చిరాయుష్యుఁ • డగుచుఁ జంద్ర
తారకలున్నంత • తడవుండవలయుఁ గాదా యట్టులైన మ • హాత్ములరగు
నీ కులంబున వారు • నిఖిలజ్ఞులే వారలేరి కానంగరా • రేల చెపుమ

యిట్టి మాధ్యమేల • నీశుండు తామరపాకు నీటివలెఁ జ • రాచర ప్ర
పంచమెల్ల నిండి • పరఁగనంటియునంటకున్నవాఁడు వాని • సన్నుతింపు.

క॥ ఈవిప్రుని పలుకుల సంభావింపఁదలంప నేని • పార్థివ మాకున్
బోవునది లేదు నీవ తమోవృతుఁడవగుదువు దాన • మహిమఁ దొఱఁగుచున్.

ఉ॥ ఏను సమస్తలోక విభు • నీద్యుని వెన్నునిదక్క నన్యులన్
గానముఁజేయ నొల్లను జ • గత్పతి యాతఁడు నాయెడన్ గృపన్
బూని నిరంతరంబునను • బ్రోవఁగఁ గంకణమూని యున్నవాఁ
డా నళినాక్షుఁ డొక్కఁడె సు • రాసుర లోకనియంతయౌ జుమీ!

సీ॥ అఖిలలోకంబుల • కాధారుఁడగువాఁడు చిద్రూపుఁడగుచును • జెలఁగువాఁడు
ఏరూపమునఁ గొల్వ • నారూపమె వహించి యెల్లవరంబుల • నిచ్చువాఁడు
ఇచ్చోటఁ గలఁడని • యెంచు సుజ్ఞానుల కచ్చోట నేగాన • వచ్చువాఁడు
కనుఁగొననేరని • కలుషాత్ములకెపుడు కడల నెచ్చోటను • గానరాఁడు

జగముఁ గన్నవాఁడు • సకల నిగమముల శిఖరములవసించి • చెన్నుమీఱు
వాఁడొకండు గలుగ • వాని విడిచి నరమాత్రుఁ గొల్వ ఫలము • మాకుఁ గలదే.

తే॥ పరమపావనుఁడైన శ్రీ • హరినిదక్క నింద్రు నంతటి ఘనునైన • నించుకేని
చెప్ప నోపదు నా జిహ్వ • క్షితితలేశ వినవుపీనులు తక్కిన • జనులఁ గుఱిచి.

—• కళింగాధిపతి కాశికాదుల నవమానించుట •—

చ॥ అనుఁడు కళింగరాజు ప్రతి • ఘారుణితోగ్రముఖుండునై విలో
చనముల నుష్ణబాష్పములు • సాంద్రములై కురియంగఁబల్కె నీ
జనపతిఁ గూర్చి పల్కుటకు స • మ్మతమింతయు లేకయుండినన్
వినియు సహింపవే శ్రుతులు • విప్రులకిట్లు వచించుటర్హమే.

తే॥ నన్నుఁగూర్చి యొరులు • సన్నుతింపఁగ నెట్లు వినరో చూతునిపుడు • జనవరేణ్యు
శక్తినిపుడ కాంచి • భక్తిమై గానంబుఁ జేయునట్లు మిమ్ముఁ • జేయువాఁడ.

చ॥ అని వచియించి భూపతి భ • టావళి కాజ్ఞనొసంగ వారలున్
జనపతి యుబ్బునట్టులుగఁ • జారుమృదూక్తిఁ "గళింగనాథుఁడే
ఘనుఁడు సమస్తలోకములఁ • గావఁగలండు తదీయ పాదసే
వన మొనరించినన్ వివిధ • వైభవముల్ లభియించు నెంతయున్.

తే॥ ఇతనితో సమానుఁ • డే జంగబుననైన గానరాఁ డొకఁడును • గలికమునకు
రాజభక్తిగలన • రశ్రేష్ఠునకుఁ జూడ లోపమగునె యెట్టి • లోకమనను."

తే॥ అవ్విధంబున వారల • య్యవనినాథు సర్వలోకేశ్వరుండంచు • సన్నుతింప
విని సహింపఁగ నేరక • విప్రులెల్లఁ గర్ణముల మూసికొనిరప్డు • కరయుగముల.

తే॥ అంత భూమికాంతుఁ • డాగ్రహ మెసఁగ వీక్షించి ద్విజులఁబట్టి • చెనఁటియగుచు
వెతలఁ గుడిపి వారి • విత్తంబుఁ గైకొని తనపురంబునుండి • తరిమివైచె.

శా॥ ఆరీతిన్ బలగర్వితుండగు కళిం • గాధీశ్వరుం డప్పుడు
ర్వారుండై కలుషంబునాక వెత స • ల్పన్ శాంతులై వారలో
నీరేజాక్ష జితాసురప్రకర • యిందీ ప్రాణనాథాసురే
శా రక్షింపవె రాజబాధితుల వా • త్సల్యంబునన్ బ్రోవవే

తే॥ అనుచు నిశ్చలచిత్తులై • యంబుజాక్షు వినుతి సేయుదు రేకాని • విప్రులపుడు
ధరణినాథునిఁ గన్గొని • పరుషముగను బలుక నించుక రైనను • దలఁపరైరి

వ॥ ఇట్లా కౌశికుండును, బద్మాక్షుండును మాళవుండును మాళవియుఁ దక్కుంగల కుశ
స్థలావాసులును గళింగభూపాలు సేయు బాధల నోర్చికొని యతండు దేశంబునుండి
వెడలింపఁజని యందందుఁ జరియించి కాలయోగంబున నూర్ధ్వలోకోన్ముఖులై
యరుగుచుండునంత నంతకుండు దెలిసి కర్తవ్యంబు నూహించుచుండె నప్పుడు భగ
వంతుండగు వాణీమనోహరుండు దివ్యదృష్టి నెఱింగి సత్యలోకావాసులరగు నమ
ర్త్యగణంబులతో నిట్లనియె.

—• బ్రహ్మదేవుండు కౌశికాదుల గౌరవించుట •—

చ॥ హరిచరణారవింద భజ • నాభిరతిన్ నిరతంబు విస్మృతే
తరవిషయప్రసక్తిమెయి • దారుగత శ్రములై ధరిత్రిఁ ద్రి
మ్మరుచు నుపేంద్రుదునంద యభి • మానము పెంపున నెల్ల కష్ట ని
ష్ఠురముల నోర్చువారెవరో • సూరివరేణ్యుల వారిఁ చెందికన్

వ॥ అనియానతిచ్చిన నప్పుడ దేవతాగణంబులెల్ల సంరంభంబున బయలు వెడలి

క॥ కొందఱు కౌశికుఁడనుచుఁ గొందఱు బ్రహ్మర్షుఁడనుచు • గురుయత్నమునన్
గొందఱు మాళవుఁడనుచుఁ గొందఱుమాళవియటంచుఁ • గూర్మిదలిర్పన్.

క॥ అనుచుఁ జని వారలఁ దోడ్కొనివచ్చిన వనజభవుఁడు • కుతుకంబున న
య్యనఘుల కభిముఖుఁడై చని తన పరిషత్తులముఁ జేర్చెఁ • దగుబహుమతితో.

క॥ వనజభవుఁడట్ల కౌశిక మునివరునిన్ శిష్యులను బ్ర • మోదంబెసఁగన్
గొనితెచ్చి యుచితసింహాసనములఁ గూర్చుండఁజేసి • పరఁగవచించున్.

చ॥ అనఘులు మీరు మీ పలుకు • లా హరికీర్తనమందె గాక యెం
దున రుచిజెందకుండు నొక • దుష్టుఁడు మీయెడ నెట్టి వింగడం
బునఁ జరియించినన్ గలుగఁ • బో దిసుమంతయు మీకు హాని మీ
మనసు చలింపకుండుటయె • మాన్యులఁ జేసెడు మిమ్ము నిచ్చలున్.

తే॥ ఎంతకాలంబు కేశవుం • డెల్లలోకసమితిఁ బాలించు నధిక • వాత్సల్యము మెయి
నంతకాలంబు మీరు ని • శ్చింతతోడ నలరు వైకుంఠమునఁ జేరి • చెలఁగుఁడింక.

తే॥ అనుచు వేల్పుల నందఱ • నటనె విడిచి కౌశికాదులఁ దోడ్కొని • కమలయోని
యరిగెను నిఖిలయోగి జ • నాశ్రయమ్ము కుంఠితాఘప్రకరము వి • కుంఠ పురము.

వ॥ అట్టి సమయయమున.

సీ॥ ఒకనంక వైష్ణవు • ల కలంకమతిఁ జేరి నళినాక్షుఁగూర్చి గా • నంబుఁజేయ
నొక చక్కి సప్తర్షి • నికరంబు హరిదృష్టి యెటుబారునో యని • యెంచుచుండ
నొకచాయ నిర్జర • శుక వాణు లభినయవిద్యాకుశలతఁ గా • న్పించుచుండ
నొక యోరదిక్పాల • క కదంబ ముడివోనియడుగరల్ భక్తిమై • నొసఁగుచుండ

నొక్కయెడ సిద్ధసంతాన • మొగి సమస్త వేదశిఖర గోచరుఁడు శ్రీ • విష్ణువెయని
పల్క స్వర్ణరచితమైన • భద్రపీఠి నధివసించె రమా మనో • హరుఁడు ఘనుఁడు.

వ॥ మఱియు జ్ఞానయోగేశ్వరులును, సిద్ధులును, చతుర్బాహువులును విష్ణుచిహ్నవిరాజితాంగులును, నిర్ధూత సమస్తపాపాఘులగు హరిదాసు లష్టాసీతి సహస్రంబులు సేవింప సహస్రయోజనా యామంబును విచిత్రాలంకార శోభితంబును నానావిధ మణిగణ ఘృణినిచయ తిరస్కృత తరణి కరసంతానంబును నగు మంటపమధ్యంబున సుఖాసీనుండై లోక కార్య ప్రసక్తుండై నారాయణుండు సుఖం బున్నంతఁ జతుర్ముఖుండరుదెంచి నమస్కరించి భక్తివినమితాంగుఁడై యిట్లనియె.

చ॥ ఆకుటిలచిత్తు లీ ఘను ల • హర్నిశ గానకపాద పంకజా
ర్చకులు వశీకృతేంద్రియ ప • రంపరు లిద్ధచరిత్రు లీ ద్విజ
ప్రకరము సంతతంబు బెడఁ • బాయక నిన్నె భజించుఁగాన పూ
నికధవదంతికంబున నె • నిల్వఁగఁ గోరు నను గ్రహింపవే.

ఉ॥ ఆ పరమేష్ఠి పల్కులకు • నట్టులె యయ్యెడుఁ గాతమంచు ల
క్ష్మీపరిరంభణోత్సుకతఁ • జెన్నలరారెడు వారిజాక్షుఁడా
భూపతిసత్కృతుండయిన • భూసురవర్య సశిష్యుఁ గాంచి సం
తాప నివారకంబులు ను • దారవచస్సులఁ బల్కి నివ్విధిన్.

— శ్రీ విష్ణువు కౌశికాదులకు యథోచితవరము లిచ్చుట —

తే॥ పరమభాగవతేంద్ర నీ • భక్తిభావమునకు సంతసమయ్యె నె • ప్పుడు మదీయ
చరణములె యాశ్రయింతువు • స్థైర్యము మెయి నెట్టి కష్టముల్ గలిగిన • యేని విడక.

క॥ ఇతర సురార్చన మొల్లక సతతము మామకపదాంబుజద్వయము నెస
మ్మతి నాశ్రయింతు వీవద్భుతముగదా నీదు చరిత భూసురముఖ్యా!

ఉ॥ ధాత్రులఁ గూడి భూమిసుర • సత్తమ నిల్వుము మామకీన నా
క్షేత్రము దీని యందమల • చిత్తుఁడవై యనయంబు ధాత్రి న
క్షత్రములున్ గ్రహంబులును • జంద్రుఁడు నుండెడు నంతకాలమున్
బాత్రుఁడవీవు త్వాదృశులు • భక్తులుగల్గరు నాకుఁ జూడఁగన్.

క॥ హరిదాసులందుఁ గల భక్తిరసావేశంబు కల్మిఁ • దివురక యీ తం
దనయుచు నీ కన్నమిడిన సరసుఁడు పద్మాక్షుఁ డిందు • సతము వసించున్.

వ॥ మఱియు నీ పద్మాక్షుండు మదీయ భక్తరక్షణార్థంబు స్వధనంబెల్ల వినియోగించిన
కతన ధనేశ్వరుండై యనేక దివ్యయుగంబు లిప్పుణ్యస్థలంబున నుండు.

తే॥ మాళవియు మాళవుఁడును మా • మక పదంబు నెపుడు బరిమార్జన మొనర్చి • యిష్టసిద్ధు
లందుచును దీపమాలా స • హస్రమునను సంతసముఁ గూర్చుచుంద్రు నా • స్వాంతమునకు.

తే॥ ఈ కుశస్థలవాసు లెంతేని భక్తి నీ యొనర్చెడి గానంబు • నిశ్చలాత్మ
లగుచు వినుచుందురిట ననయంబు నీకువలయుఁ బరిచర్య సేయుచు వైభవమున.

సీ॥ అని కరుణాన్వితుం • డై యంబుజాక్షుఁడు వారివారికిఁ దగు • వరములొసఁగి
కౌశికు సల్పెడు • గానంబు వినుచు నత్యంతహర్షోన్నత • స్వాంతుఁడగుచు
నున్నంత వివిధవే • షోజ్వలాంగయగుచు గానవిద్యావిచ • క్షణులు ఘనులు
నిరుప్రక్కలను గొల్వ • సురకాంతలెల్లరుఁ బరిచర్య లొనరించు • వారలగుచు

వెంటవచ్చుచునుండఁగ • విమలరత్నఖచితమగు నందలం బెక్కి • కంబుజాక్షు
దర్శనముఁ జేయఁదునటంచుఁ • దరలివచ్చెఁ జందమామ సైదోడు గోవిందు జోడు.

కం॥ అమ్మాడ్కి నేగుదెంచెడి కమ్మని విలుకాని తల్లిఁ • గన్గొని సంతో
షమ్మున నభిముఖుఁడై చనె నమ్మధుకైటభ విరోధి • హర్షాన్వితుఁడై.

సీ॥ నెమ్మోముఁ గ్రమ్మిన • నీలంపుముంగురుల్ నిశ్వాసహతిని రా • ణించుచుండఁ
జిఱునవ్వు వెన్నెలల్ • చెలఁగు వాతెఱ రంగుఁ గలిసి క్రొత్తరకంపు • కాంతిఁ బెనుప
లజ్జావనతయాట • లలితతులాకోటి రమణీయ యగు నన్య • రమనుజాప
తిఘకాఱువాలుక • న్నుల చూపులవనిపై నింద్రనీలప్రభ • నెసగఁ జేయ

మెల్లమెల్లన మెడనున్న మేలురకఁపు రతనఁపుఁ బేర్ల సవరించు • రమణిచిగురు
గేలు, భక్తజనావన • క్రియనుఁ జాలు కేలఁగొనియెను వైకుంఠ • పాలుఁడపుడు.

సీ॥ భూనభోంతరములు • భోరుకొనఁగ దేవదుందుభుల్ మొరసె ను • త్సుకతదనరి
సుర లభ్రమునఁ జేరి • విరివాన గురియించి రచ్చరలెల్ల నృ • త్యంబు సలిపి
రనఘమతులు తపో • ధనులు శ్రేయంబయ్యె జగముల కంచును • సంతసించి
రెల్ల భూవ్రాత • మెలమిని గావించు జయజయ ధ్వనులాక • సంబు నిండె

నిఖిలలోకైకరక్షణ • నిరతిఁ జేసి చెలఁగి యొక్కొక్కరూపంబుఁ • జెందువాఁడు
వెన్నుఁ డాత్మను హర్షసం • పన్నుఁడగుచు నంబుజాల యాపాణిగ్ర • హణముఁ జేయ.

వ॥ అట్టి లోకానందకరంబగు నుత్సాహ సమయంబున

—•తుంబురుండు వైకుంఠమునకు వచ్చుట •—

తే॥ గానవిద్యావిశారదుఁ • డైన వాఁడు సంతతాంబుజలోచనా • ర్చాపరుండు
తుంబురుం డరుదెంచె ని • ర్ధూత పాపసంచయంబగు విష్ణు • దర్శనముఁ గోరి.

ఉ॥ తుంబురుఁ డేగుదెంచి పరి • తోషమెలర్పఁ గళావతీ నినా
దంబున శ్రావక శ్రవణ • తర్పణము బొనరించు నాత్మ గా
త్రంబును మేళగించి మధురంబుగఁ గాంచనచేలుఁ గూర్చి గా
నం బొనరించె వెన్నుని మ • నంబు కరంబు కరంగి పోవఁగన్

కం॥ ఆ గానము వీనులవిందై గోవిందునకుఁ గరము • హర్షముఁ గూర్పం
గా గారవంబు పెంపున నాగరుఁడధ్వజుఁడు పల్కె • నాతనితోడన్.

కం॥ గానకళాకుశలివి సుజ్ఞాననిధివి నీదు జంత్ర • గాంత్రబులు మ
న్మానసమునకు నపూర్వం బౌ నానఁదంబుఁ గూర్చె • నద్భుతములుగన్

క॥ మును పెన్నఁడు గనివినియెఱుఁగనిసంగతులెఱుఁగనయ్యె • గ్రమువిపంచీ
నినదమున నీదు గాత్రంబనుపమగతిలీనమైన • యప్పుడు పేర్మిన్

చ॥ మురదనుజాంతకుండటుల • మోదము సెంపు వహించిపల్కి తుం
బురునకుహారిఁగూరఁజెడి • పూన్కి ననుపాయన మిచ్చెఁగాంచనాం
బరములురత్నభూషలును • మానితదివ్యదుకూలముల్ సుర
ద్రురుచిరపుష్పమాలలును • దోజభవాదులు సన్నుతింపఁగన్

క॥ అదిగని నారదుఁడప్పుడు హృదయంబునఁగలఁతఁజెంది • యిదియేమికటా
మదనజనకుండితనిపై సదయుండైగౌరవంబె • సలిపెగదంకన్

క॥ నాయెఱిఁగినంతవఱకెపు డీయంబుజనేత్రుఁడెవని • కేనిసలుపఁడి
ట్లాయతమగుగౌరవమహహాయెన్నడులేనివింత • యయ్యెనుజూడన్

చ॥ శ్రితులగువారలేరహరి • సేవయొనర్పరె నిశ్చలాత్ములై
సతతముగర్గపేయముగఁ • జారువిపంచినిబూనిచేతన
స్థితికినచేతనత్వమున • చేతనరీతికి జేతనత్వమున్
జతురతఁగూర్పజాలరెభ్భ • శంబుయశంబు వహింపరేమహిన్,

తే॥ అరయఁదుంబురుఁడే శ్రేష్ఠుఁ • డాధరిత్రినతనిమించినవారులే • రైగయహాహ
ప్రభువులకు మనంబులొక్కొక్క • పట్లవెనుక మరచునను మాట నిజమయ్యె • మాధవెన

తే॥ తుంబురుండేడ వెన్నుండు • సంబరమున గౌరవముజేయుటెడని • క్కారణిబాడ
మూఁడులోకంబులందునే • జాడనైన బూజ్యుఁడగువాఁడులేఁడేమో • మురహరునకు.

చ॥ చిరము తదీయ పాద సర • సీరుహముల్ మదిలోన నిల్పి సు
స్థిరమగు భక్తిఁ దత్స్మరణ • జేయుచు నెప్పటికెట్లు నాయెడన్
గరుణ జనించునో యనుచుఁ • గంబుజమిత్రుని గోరుచాతక
స్ఫురణఁ జరించు నన్నును వి • శుద్ధమతిన్ గరుణింప డిన్విధిన్.

వ॥ అది యట్లుండ

చ॥ జగములు గన్నవాఁడుహరి • సర్వసమర్థుఁడు భక్తరక్షకుం
డగుటదయాంతరంగుఁడయి • యాదటగౌరవముం బొనర్పగా
దగుదునొలేదొ నేననియె • దన్ దలపోయక తుంబురుండుదే
వగణము మ్రోలనేగొనియె • బాపురె యాతనిధైర్యమెట్టిదో.

క॥ హరి గౌరవించుటయుఁ దుంబురుఁడు వహించుటయు • జిష్ణుముఖనిర్జరులున్
నిరతిఁ గనుగొనుటయును మద్గురుకీర్తికి భంగమనుచుఁ • దోఁచెదు మదిలోన్.

క॥ హరునంతటివాఁడు చరాచరలోకములను సృజింపఁ • జాలు ఘనుండౌ
దరము మెయి గౌరవింపఁగ బరఁగెడు నాకిది పరాభ • వంబుగఁ దోఁచున్.

క॥ పదునాల్గులోకముల నారదునంతటివాఁడు గాన • రాఁడనుచు జగ
ద్విదిత యశముఁ గాంచిన నాకెదురాతుంబురుఁడు స్వల్పుఁ డి • ట్టితలమునన్.

ఉ॥ అంబుజసంభవుండు నఖి • లామరసేవితుఁడైన దేవుఁ డ
య్యంబుజ పాణివాణి జగ • దంబ యఖండ తదీయ దంపతీ
త్వంబునకున్ ఫలంబయిన • వాఁడ మనోహరలీల విష్ణుగా
నం బొనరించు నాకుఁ దగు • నా యరిమేలు సహించు టివ్విధిన్.

చ॥ తన యభిమాన శాస్త్రమునఁ • దార్కికుని యన్యుఁడొకండు ప్రాజ్ఞుఁడౌ
ఘనుని సభాప్రదేశమున • గౌరవమొందుటఁజూడ నెట్టి స్వ
ల్పునకును సైపరాదనఁగ • భూనుతకీర్తిన్ వహించినట్టి యీ
వనజభవాత్మజుండు సరి • వారు హసింప సహింపఁనేర్చునే.

ఉ॥ ఈ యపమానసాగరము • నే గతి నీఁదగలాఁడ నీయెడన్
నాయెడ గారవంబు మెయి • నాకు నుపాయ మెవండు దెల్పు నా
హా యెదురెందు లే కహర • హంబుఁ జరించెడి దేవమాని కే
పాయనివంతఁ గూర్చె భగ • వంతుఁడు నిర్దయుఁడౌచు నివ్విధిన్.

తే॥ జగముఁగన్నవాఁడు • జలజాక్షుఁడే యిట్టి పరిభవంబుఁగూర్పఁ • గరుణలేక
యెవఁడుప్రోవ నేర్చు• నెవ్వాఁడు దిక్కగు హృదయమునకు స్థైర్య• మెటులఁగలుగు.

తే॥ తల్లి విషముఁబెట్టఁ • దలఁచిన రక్షింపఁజాలువాఁడు లేఁడు • జగతిలోన
మాధవుండె కీర్తి • మాయింపఁబూనిన నడ్డువాఁడు గలుగు • నాతలంప.

చ॥ హృదయ విదారకంబయిన • యిట్టి పరాభవమున్ సహించి కో
విదులు హసించుచుండఁ బృథి • విన్ దగునంచుఁ జరించు నీచమై
నదశగలట్టి జీవనము • నన్ దమిఁజూపుటకన్న దుష్కృతా
స్పదమగు దేహ మొక్కపరి • వహ్ని దహించుట మేలుగాదొకో.

వ॥ కావున మదీయమనోగతి చింతాశల్యంబు నుత్తరించుట యవశ్యకర్తవ్యంబు గాన

తే॥ తుంబురుఁడు సేయు స్వల్పగా•నంబునకె ప్రహర్షమును జెందు మురదను•జాంతకునకు
గాన విద్యాధి దేవత • కరుణఁబడసి హర్ష మొనఁగూర్తు నతిలోక •మగు విపంచి.

## —• గానమహిమ •—

క॥ పరహృదయాహ్లాదకరము నిరతానందావహంబు • నిర్గుణతత్త్వ
స్థిరమగు బ్రహ్మముఁ గనుంగొను సరణి నెఱింగించుఁగాదె • సద్గానమిలన్.

తే॥ ఎట్టి కఠినచిత్తుఁ • డేని నిప్పుకసోఁకి కరఁగు నేయివోలెఁ గరఁగకున్నె
కమ్మఁదనముఁ గూర్పు • గానంబు వినినంత గౌరవాస్పదంబు గానవిద్య.

క॥ తనసంతసంబు నొకపరి గనఁబడియెడి చందమునను • గాల్సేతుల న
ల్లన నాడించుచు గానము వినకుండునె బాలుఁడేని • పేర్మిదలిర్పన్.

చ॥ పరమపవిత్రమై యలరు • స్వర్ణదితీరముఁ జేరి కేలఁ దాం
బురయొ విపంచియోగొని ప్ర • మోదమునన్ స్థిరబుద్ధితోడ రాల్
గరఁగెడునట్లు శాంతముగ • గానమొనర్పఁదొడంగినంతి నీ
శ్వరుఁడు తనంతఁదానె యిల • వశ్యుఁడుగాఁడె పరంబొసంగఁడే.

ఉ॥ గానము చిత్తశాంతి జ • నకంబు సురాసుర గౌరవాస్పదం
బై నుతిఁగాంచిమించు పర • మార్థవిచారము కారణంబు సు
జ్ఞానులకున్ ముదావహ మ • ఖండ యశస్కరమాట నెప్పుడా
గానముతోడ సాటి యిలఁ • గానమటంచు వచింత్రు ధీనిధుల్.

తే॥ తడవుసేయక యిప్పుడ • యడవికేగి తపముఁజేయుదు గానవి • ద్యాప్రదాత్రి
యైన భారతిఁగుఱిచి య • య్యంబ కరుణ నాదరించకపోదు న • న్నాత్మమెచ్చి.

తే॥ అవ్విధంబునఁ దలఁచి యు • య్యమగమౌని గానవిద్యాధిదేవతి • యైన వాణి
గుఱించి తప మొనరించె నొ•క్కమ్మడిగను దివ్యవర్షసహస్రంబు•ధీయుతుఁడయి.

వ॥ అవ్విధంబున దేవమౌని నిరుచ్ఛ్వాసుండును, నిరాహారుండును, నిర్గతాన్యవిషయుం
డును, నై యనేక దివ్యవర్షములం తపంబుజేయుచున్నంత నొక్కనాఁడు.

చ॥ మునికులచంద్ర యిట్టితప • మం బొనరించెడి ఘోరనిష్ఠ యే
ఘను నెడనైన నించుకయుఁ • గానము గానమె మోక్షసాధనం
బనుచుఁ దలంచు నీదు హృద • యంబు పవిత్రము సర్వ మౌనిరా
డ్జనసుతమైన నిర్మలయ • శంబికఁ జేకుఱు నీకు హెచ్చుగన్.

తే॥ క్రమమైన మధుర • గానంబె నీకుఁ గావలయు నేని వేరు • తలఁపువీడి
యేను పలుకునట్లు • యిప్పుడ నడచుకొనంగదయ్య మౌనినాథ యిలక.

తే॥ మానసోత్తర శైలంబు • మందిరముగ గానబంధువు నాఁగవిఖ్యాతిఁ గాంచి
యలరు నొక్కయులూకేంద్రుఁ • డతనిఁజేరి గానవేత్తవుగమ్ము స • న్మాని చంద్ర.

చ॥ అని యశరీరవాణి విన • నౌటయు దేవముసేంద్రుఁ డాదరం
బున నిది సత్యమేయగును • పోయెద నిప్పుడ గానబంధు ద
ర్శన మొనరించెదన్ సుకృతి • సాధ్యము గానమొనర్చెదన్ సరో
జ నయనుఁ దద్దిరేయనుచు • స్వాంతమునన్ బరితోషమందగన్.

తే॥ తనకు సాటిలేదు • ధరణీతలంబున ననుచు విఱ్ఱవీగు • నట్టి తుంబు
రుండు వింతపడుచు • నుండునట్లుగ గీర్తిగాంతు వేల్పులెల్ల • గారవింప.

—• నారదుడు గానబంధువను నులూకమును దర్శించుట •—

తే॥ అనుచు మానసోత్తర శైల • మందు నిలిచి యెందుమ్రాఁకుల గమి ఫల•యించురీతి
శిష్యపాళికిఁ గానంబుఁ • జెప్పునట్టి గానబంధువుఁ గనఁబోయె • గాన వాంఛ.

చ॥ సరగున నట్లుబోయి ముని • చంద్రుఁడు గన్గొనె వేడ్కమానసో
త్తర ధరణీధరాగ్రమునఁ • దద్దయ భక్తిని సిద్ధసాధ్య ఖే
చరగరుడోరగాదులగు • ఛాత్రులు గొల్వఁగ రూపమూని సు
స్థిరమగు గానవిద్యవలెఁ • జెన్నలరారెడు గానబంధునిన్.

తే॥ అప్సరోగణ పరివృతుఁ • డగుచుదీర్ఘ పక్ష శోభితుఁడైన య • పక్షిరాజు
నప్పగిదిఁ గాంచి దేవర్షి • యాత్మలోనఁ దన మనోరథ మీడేఱె • ననుచుఁ దలఁచె.

ఉ॥ ఆనిది నేగుదెంచెడి మ • హర్షిఁ గనుంగొని భక్తియుక్తుఁడై
యావిహగాధినాథుఁడు య • థార్హగతిన్ గొనివచ్చి పల్కెనో
దేవముని ప్రకాండ భవ • దీయసమాగమ మాటఁజేసి సం
భావితమయ్యె నాజనికృ • పానిధివీవకదా గణింపఁగన్.

చ॥ ఘనుఁడవు నీవు కేశవుని • గానముఁజేయుచు సంతతంబు ప
ద్మనయ పద్మజాత వసు • ధాధర చాపుల దర్శనంబు క
ల్మని కృతకృత్యతన్ బరగి • మేదినిఁ ద్రిమ్మరుచుందువట్టి ని
న్గనుఁగొను భాగ్య మారకయె • గల్గుట నా తొలిపుణ్యమే యగున్.

తే॥ జ్ఞానహీనుఁడనైన నా • కతన నేఁడు కావలసినట్టి పని యెద్ది కలిగ నీకు
నా కడకువచ్చుటీవు ర • త్నాకరంబె స్వల్పనదము కడకు వచ్చు • సరిణి యయ్యె.

చ॥ అనవిని నారదుం డనియె ♦ నార్య మదీయచరిత్ర మిట్టిదం
చును వచియింపరాదు విన ♦ జోద్యము నయ్యెడు నెట్టివారికై
నను వనజాక్షుఁ డొక్కపుడ ♦ నంతశయానుఁడునై సమస్త దే
వనికరమెల్ల భక్తిఁ గొలు ♦ వన్ సుఖమొందెడి వికుంఠమందునన్.

సీ॥ కర కంకణంబులు ♦ ఘల్లుఘల్లని మ్రోయ బాపచేడియలు వీ ♦ వనలనిడఁగఁ
గాళ్ల గజ్జెలు తాళ ♦ గతిధ్వనింపఁగ మేనకాదికా మినులు నృ ♦ త్యంబుసలుపఁ
బది దిక్కులను బ్రతి ♦ ధ్వనులీన వైష్ణవుల్ పంబినభక్తిగా ♦ నంబుఁ జేయ
భయవినయంబులు ♦ పొదు కొనఁగ మహా మునివర్యు లిరుపార్శ్వ ♦ ములఁ జెలంగ

నిగమ వినుతాయ దానవ ♦ నికర గర్వనాశకాయ లక్ష్మీ మనో ♦ నాయకాయ
మారజనకాయ వైకుంఠ ♦ మందిరాయ యని బరాబరు లొనరింప ♦ నమరవరులు.

సీ॥ చల్లని చూపుల ♦ సరగ వేల్పులవంకఁ గనువారు సంతసం ♦ బును వహింప
జిఱునవ్వుతోఁ గూడి ♦ చెలఁగు పల్కులఁ బల్కరించు మానులును హ ♦ ర్షించునటుల
నిఖిల భూభరణ ని ♦ ర్నిద్ర మాకరసంజ్ఞ సనకాదులకుఁ బ్రవే ♦ శంబు నొసఁగు
మణి మయ మకుటసం ♦ భావ్యమా శిరమున గ్రహగణంబుల నమ ♦ స్కారముఁ గొను

నాదరించు సుకృతవంతు ♦ లైనవారిఁ గోపమునఁ గాంచు దుష్టులొ ♦ క్రూరమతుల
సకల లోకైక రక్షణ ♦ క్షముఁ గాంచనాంబరుఁడు స్వధర్మ స్థాప ♦ నంబుఁ గోరి.

ఉ॥ అత్తఱి నమ్మహాత్ముని ద ♦ యామయుఁ గన్గొనునట్టి కోర్కె రే
కెత్తి ఫలాఢ్యమై యలర ♦ నించుక మన్మహతీ స్వరంబునన్
జిత్తము లీనమౌనటులఁ ♦ జేసి జనార్దను నిన్ భజించుచున్
జిత్తజుఁగన్నవాని దరిఁ ♦ జేరితి మిూఱిన సంతసంబునన్.

తే॥ అటులఁ జేరఁబోయి ♦ యచట దక్కినవారువోలె నొక్కమూలఁ ♦ గేలుమోడ్చి
నిలిచియుంటిఁగాని ♦ నీరజనేత్రుండు పిలిచి గౌరవింపఁ ♦ దలఁపఁ డయ్యె.

తే॥ అరుగు దెంచితి గొండంత ♦ యాశతోడఁ గృష్ణుఁ డించుకయును బల్క ♦ రింపఁడయ్యెఁ
గారణం బేమొ తెలియదు ♦ గానలోలుఁడైన హరివిముఖుండౌట ♦ కక్కటకట.

క॥ ఆరీతి నతిశయించు విచారము మెయి నాత్మగుందు ♦ సమయంబున గం
ధీరుఁడు తుంబురుఁ డచటికిఁ జేరంగావచ్చె హరిని ♦ సేవించుటకై

ఉ॥ ఆవిధి నేగుదెంచిన మ ♦ హాత్ముని తుంబురుఁ గాంచి సర్వ సం
భావితుఁడైనవాఁడు భగ ♦ వంతుఁడు వెన్నుఁడు గారవంబునన్
దేవతతుల్ సురారులును ♦ దివ్యమునుల్ వెఱగంది చూడఁగా
బావనమైనయట్టి తన ♦ పజ్జకుఁ జేరఁగఁ బిల్చె నాతనిన్.

తే॥ అటులఁ జేరఁబిల్చి • యాతని గానంబు నెంతయేని మెచ్చి • యెట్టి ఘనున
కేని యెప్పుడిడని • మానికములు గాణపత్యమిడియె నతఁడె • ఘనుఁడటంచు.

ఉ॥ వారిజనేత్రుఁ డట్లు సలు • పన్ గని యెల్ల రిదేటివింతయో
నారదగానలోలుఁడు జ•నార్దనుఁడంచు వచింత్రు గాదె యే
లా ఋషిపుంగవుండగు సు • రర్షిఁ గనుంగొనుచుండఁ దుంబురున్
జేరి యుపాయనంబిడిరొ • శ్రీపతియంచును సంభ్రమంబునన్.

క॥ నారదునకన్న నాతండారయ గానంబునందు • నధికుండగుటన్
గౌరవముఁ జేసె జగదాధారుఁడు తుంబురునకంచుఁ • దలచు నొకండున్.

తే॥ అవ్విధంబున నచ్చటి • యమరులెల్ల వారివారికిఁ దోఁచిన • పగిదిఁ బలుక
చుంట విని సైపఁగాలేక • యొక్కరీతి నిశ్చయించితి మదిలోన • నెనరుదగిలి.

ఉ॥ గానవిశారదుండనను • గర్వమునన్ జరియింతుఁ గాని నా
కానిఖిలేశ్వరుండగు ర • మాధిపునిన్ బరితృప్తుఁ జేయ వి
జ్ఞానము లేదుగాన హరి • గానధురంధరుఁడైన తుంబురున్
బూనిక గౌరవించెఁ బరి • పూర్ణ కుతూహలచిత్తుఁడై యిటన్.

క॥ కావున శ్రీహరి నను సంభావించెడునట్లు లోక • మాతయయిన వా
గ్దేవినిఁగూర్చి తపంబున్ గావింతు నుపేక్ష విడిచి • గానాపేక్షన్.

తే॥ అని తపముఁ జేయుచున్నెడ • నాకసంబునుండి విననయ్యె నొక వాక్య•మోమునీంద్ర
గానమునుగోరు దేనివే • గమ యులూకనాథుఁడగు గానబంధు చెంతకును జనుము.

క॥ ఆపలుకుల విని మది సంతాపమడిగెననుచు నిన్ను • దర్శించితి నా
ప్రాపైనను నీ శిష్యులలోపల నొక్కనిగఁ గను ము • లూకాధిపతీ!

చ॥ అనుటయు గానబంధువను • నార్యభవచ్చరితంబె మేలుగాఁ
గనబడు నాచరిత్రమున • కన్న నొకించుక గాలయాపనం
బునకు సహింతు వేని నఖిలమున్ దెలియంగ వచింతు శ్రద్ధతో
వినుము భవాదృశుల్ వినిన • వృత్తము పాపహరంబగున్ గదా.

క॥ అవనీశకులమునకుఁ దానవతంసంబొక నృపాలుఁ • డలరు ధరిత్రిన్
భువనేశుఁడనఁగఁ బ్రఖ్యాతివహించి సమస్తభూమి • దేవాశ్రయుఁడై.

తే॥ అనయమాతఁడు ధర్మప • థానుగామియగుచు దుష్టసమూహసం • హారరూప
మునన శిష్టులఁ బ్రోచుచుఁ • బుడమినాథులెల్ల రబ్బురపడఁ బ్రజ • నేలుచుండె.

తే॥ దుష్టులైనఁ గాని • శిష్టులైనను గాని తప్పుఁ జేసి రేని • తాల్మిఁ బూని
శాంత మైన శిక్ష • సల్పు నాతఁడు వాసవాది దిక్పతులును • నమ్రపడఁగ.

సీ॥ అశ్వమేధ సహస్ర • మాచరించి యొరుల నాచరింపఁగఁ జేయు • ననవరతము
సాంగవేద చతుష్ట • యంబుఁ బఠించియుఁ బరుల చేతను బఠిం • పంగఁ జేయుఁ
గోటి సహస్రముల్ • గోదానములొనర్చి యన్యులొనర్చెదు • నట్లు జేయు
వైద్యశాలలు ధర్మ • వసతులేర్పరచియు నితరు లేర్పరచెడి • గతి యొనర్చు

నిదియది యనంగ నేల పృ • థ్వీశ మౌళి యెలమిఁ జేయకున్న వియుఁ జే • యింపకున్న
యవియు నగు ధర్మకార్యంబు • లవనిఁ గలవె యనుచు వచియింత్రు కోవిదు • లైనవారు.

క॥ భూతదయ సత్యవాక్త్వము రాతి జయోత్సాహమును ని • రంతర ధర్మ
ప్రీతియు లేని మనుజు లెట నేతటి లేకుండునట్లు • యేలు ధరిత్రిన్.

క॥ అడిగినవారికి లేదన కిడు నడుగక యున్నవార • నెల్లగతులఁ దా
నడుగునటులఁ జేయును మఱి యడుగని వారలకు దోష • మని సాటించున్.

క॥ తనకీర్తి నాల్గుదిక్కుల ననుపమమై యలర భూను • రానీకంబున్
దనియించు స్వర్ణదానం బొనరించి నృపాలముఖ్యుఁ • డురుతరమతితో.

ఉ॥ ఆ నరనాథమౌళి తన • యాశ్రితలోకమునందు నాదరం
బూని చరించు చెప్పుడు ని • జోచితకృత్యము లాచరించుచున్
గానరతుండునై సకల • గాయక సంతతి తన్నుఁ గూర్చియే
గానము, జేయుఁడంచు నొడి • కంబునఁ గట్టడఁ జేసె దిక్కులన్.

చ॥ అనిశము చంద్రశేఖర ప • దాబ్జములన్ భజియించువాఁడె య
య్యును ధరణీశ్వరుం డటుల ను • ర్విపయిన్ భువనేశు గానమే
పనివడి సేయఁ గాఁ దగును • ప్రాఁబలుకుం గమితోడ శంకరున్
వినుతియొనర్పఁ బోలునని • విస్మయమయ్యెడునట్లు సాటినన్.

క॥ ఇదియేమి పాపమో నృపుఁ డదయత సాటించె నంత • కాంతవునైనన్
ముదమున గానముఁ జేయం గఁ దగదనుచు నిదియె ప్రళయ • కాలంబగునా?

మ॥ నరమాత్రుండగు నొక్క క్షత్రియుని గా • నంబుం బొనర్పంగనే
కరణిన్ జిత్తము సమ్మతించు శ్రితలో • కత్రాణ పారీణుఁడౌ
హరు గానం బొనరింపకుండు టెటు లా • హా యెన్నడున్ లేని దు
ష్కర కార్యంబు శిరంబుపైఁ బడియె భ • గ్నంబుల్ గదా ధర్మముల్.

తే॥ మనుజుఁ డెవ్వఁడేని • తన గానమొనరింపకున్న వధ్యుఁడగునె • పన్నగావ
తంసునైన శేష • తల్పునైనను గూర్చి గేయమునొనరింపఁ • గిల్బిషం బే.

తే॥ దేవతాభక్తిఁ గల్గి భూ • దేవవితతి కాశ్రయుండయి ధర్మకా • ర్యానురక్తి
శ్రేయముం గోరు నృపుఁడెదు • ష్కృత్యములకుఁ బాల్పడఁగ నడ్డుపడఁగల •
[వాఁడెవండొ.

సీ॥ అనుచుఁ దలంచుచు • హరిమిత్రుఁడనువాఁడు చంద్రశేఖర పదా • బ్జాతయుగళ
భజనాభిరతుఁడు వి • ప్రశ్రేష్ఠుఁ డొక్కండు హరుఁగూర్చి గానంబు • నాచరింప
కట్టి యాహారంబు • నే గ్రహింపనివాఁడు భువనేశు శాసనం • బునకు వెఱచి
తన నిత్యకృత్యమై • తనరెడి శివపూజ విడువనేరక భూమి • విభుఁడు తెలియ

కుండుగతి రహస్యముగ గ్రా • మోపకంఠమందుఁ గల యొకనదిఁ జేరి • యచటనలరు
చంద్రవటతరుమూలదే • శంబునందు శంభు గానంబుఁ జేయుచు • సంతసించు.

క॥ ఆ సరణి రహస్యంబుగ భూసురవర్యుండు • శివునిఁ • బూజించుచు ను
ల్లాసము మెయి హరుగానము జేసి కుతూహలపరీత • చిత్తుండగుచున్.

క॥ ఇదియే బ్రహ్మానందం బిదియే మోక్షాప్తిహేతు • విదె సర్వ శుభ
ప్రదమిదియె సర్వమయమని మది నెంచుచు నచ్చటనె యు • మాధవుఁ గొలుచున్.

వ॥ హరిమిత్రుఁడట్లు రహస్యంబుగ నీశ్వరగానంబుఁ జేయుచు లోకంబు మఱచియుండఁ
గొంతకాలంబు సనియెనంత.

సీ॥ తనశాసనంబున • కనుసాధ్వసముఁ జెంది మనుజుఁ డెవ్వండేని • తనను గూర్చి
గానంబుఁ జేయుట • మాని వేలుపులను గీర్తించునోయని • క్షితితలేశుఁ
డనుమానము వహించి • యాత్మీయులగు వారిఁ గనుఁగొనఁ డనుచును • బనుచుటయును
రాజపురుషులును • రాజ్యంబునందెల్ల వెదకుచు నొకనాఁడు • విప్రుఁడటుల

నదితటంబుఁ జేరి • నాగవిభూషణు నిఖిలలోకవంద్యు • నీలకంఠు
మార హరు సమస్త • మంగళాకరు శివు నుగ్రుఁ బూజ సేయుచుంటఁ గాంచి.

— • రాజపురుషులు హరిమిత్రుని బంధించుట • —

మ॥ నరనాథోత్తముఁ గూర్చి భక్తిమెయి గా • నంబుం బొనర్పంపంగలే
కరకే యెవ్వఁడొ పీఁడు దుష్టుఁడయి స • ర్వానర్థమూలంబుగా
హరుగానం బొనరించుచుండె నిఁక నే • లా యాలసింపంగ ము
ష్కరుఁ బంధింపుఁడు కొంచుఁ బొండు విడ క • క్ష్మానాథు సాన్నిధ్యమున్.

మ॥ అనుచుఁ బాపభయంబు వీడి భటు లా • హాకారముల్ సల్పుచున్
ఘనరోషారుణితాక్షులౌచు ద్విజ లో•కగ్రామణిన్ బల్మిఁ బా
శనిబద్ధాంగునిఁ గా నొనర్చి శివపూ•జావస్తువుల్ గాలఁ ద
న్ని నిరుత్సాహునిఁ గాఁగఁ జేసి రహహా • నీచాత్ములై యెల్లరున్

క॥ ఆరీతిని హరిమిత్రుని గారుణ్యము లేక కట్టి • క్ష్మాపతి కడకున్.
జేర్చిరి రాజపురుషులు క్రూరాత్ముల కెట్టిపనియుఁ • గూడదె చేయన్.

తే॥ అంత భూమినాథుఁ • డాగ్రహోపేతుఁడై యవనిసురుని గాంచి • యనియె నిటుల
నోరి దుష్టచిత్త • యుర్వీశు నానతిఁ బరిభవించి తిరుగఁ బాడియగునె,

—• భువనేశ్వరుఁడు హరిమిత్రుని దండించుట •—

చ॥ అరయఁగ నెట్టి నేర్పరికి • నైన నవక్ర పరాక్రమాఢ్యుఁడౌ
ధరణిపు వాజ్ఞ నౌదలను • దాల్చి చరించుట తప్పునే జగ
ద్భరణ సమర్థుఁడైన నర • పాలు నలంతిగఁ జూచునట్టి దు
శ్చరితుని సర్వసంపదలు • స్థైర్యముఁ జెందునె యింతయేనియున్.

చ॥ ఎఱుఁగవె నన్నుఁ గూర్చి యెవఁ • డేనియు గాన మొనర్ప నొప్పకే
డ్తెఱ సురలందు భక్తి నెఱిఁ • దేవర గానముఁ జేయువాఁ డగ
చ్చుఅవధియింప నర్హుఁడని • చాటుట ప్రాణముకన్న నీవు ని
త్తఱి హరుఁ గూర్చి గానము ప • దంపడి సేయుటయందె ప్రీతియే?

క॥ నాయానతి మీఱితివి నిన్నీయెడ • వధియించు టుచిత • మేయగు నైనన్
న్యాయముఁ దలంచి విడిచితి నీ యరుగుము మాఱుమాటఁ • జెప్పక యికన్.

తే॥ అనుచు నాతని సర్వస్వ • మపహరించి నిముసమే నిల్వకన్యదే • శమున కేగు
మని వచియించుటయు నవిప్రుఁ•డతనిఁ గాంచి యబ్బురంబునఁ బల్కె ధ•ర్మానుగతిని.

—• హరిమిత్రుఁడు భువనేశ్వరునకుఁ బరమేశ్వరు నాధిక్యము గూర్చి చెప్పుట •—

క॥ జననాథముఖ్య నీ వెఱుఁగని ధర్మం బొండుగలదె • ఘనమతులగు వా
రిని సేవించుచు నాస్తికులను శాసింపవె కడింది • లావు వెలయఁగన్.

శా॥ దేవబ్రాహ్మణభక్తిగల్గిన ధరి ♦ శ్రీనాథుఁ డీరీతిగా
భావింపన్ జను నే మనుష్యునకు స ♦ ర్వవ్యాపకుండౌ మహా
దేవుంగూర్చి యెఱుంగ శక్యమగునా? ♦ దీనావనుండాహరుం
డీ విశ్వంబునకెల్లఁ గర్తయగుఁగా ♦ దే భూమిపాలాగ్రణీ!

మ॥ ఎపుడో యెవ్వనిచేతనో యెటులనో ♦ యేరీతినో చూచుచు
న్నపుడే యంగడినున్న మాంసముటుల ♦ న్యాయంబుగాఁ బ్రాణముల్
విపులంబైన శరీరముల్ విడుచు నీ ♦ లీలన్ గదా లోక మె
ల్లపుడున్ బుట్టుచుఁ జచ్చుచుంట మదికే ♦ లా తోఁచదో భూవరా.

తే॥ ఉత్తరక్షణమున ♦ కెత్తెఱఁగున మార్పుగలుగునో యెఱుంగఁ ♦ గలఁడె నరుఁడు
కలిమిగలుగుకొలఁది ♦ గర్వంబు పెంపున నోడలు మఱచి తిరుగు ♦ చుండుఁగాని.

సీ॥ జనియించినది మొదల్ ♦ సంసారసాగరో త్తరణంబొనర్చెడు ♦ సరణిఁగాంచు
తెలివిలేకిడుమల ♦ నలజడి నొందుచు నగ్నిపై లంఘించు ♦ నట్టి శలభ
మట్టుల భ్రాంతిపై ♦ నాత్మ వినాశకరములగు నెల్ల క ♦ ర్జములయందుఁ
బాల్గొని తిరుగుచు ♦ బరిభవంబును జెంది బలగర్వమున లాఁతి ♦ వారి నొవ్వఁ

జేయుచును గాలభటులు చే ♦ చ్చెర నడంపఁదారొనర్చిన కృత్యముల్ ♦ తలఁచి తలఁచి
యెదలెగని చింతలన్ బడి ♦ యేడ్చు మనుజు లెట్టుల స్వతంత్రులగుదురు ♦ర్వీశ చెపుమ.

తే॥ పూర్వజన్మార్జితంబైన ♦ పుణ్యపాప ఫల మనుభవించుటకునై ప్ర ♦ పంచమందు
జననము వహించి మనుజుండు ♦ సకలకార్యములను సంబంధమును దాల్పఁ ♦
[ గలుగుఁగాదే.

క॥ సృష్టిస్థితిలయములకున్ భర్గుండె సమర్థుఁడతని ♦ భజియించుచుఁ దా
దుర్గతికి వెఱచు నరుఁ డపవర్గంబును జెందు సాధు ♦ భావము కలిమిన్.

ఉ॥ ఏయుగమందు నెచ్చటను ♦ నెవ్వఁడు నిట్టు లహంకరించి దు
ష్కాయమునందు గౌరవము ♦ గల్గి చరించుచు సర్వదేవతా
ధ్యేయుని బాలచంద్రధరు ♦ నీశ్వరు శంకరుఁగూర్చి గానముల్
జేయఁగరాదటంచును వ ♦ చించునె పాపము నాక సుంతయున్.

క॥ "శివ ఏకోధ్యేయ" యటం చవిరళగతిఁ దెలుపు శ్రుతుల ♦ నఁటఁ ద్రోసి బళా
యవనీశుఁగొల్వుమనుటిది యవినయమగుఁగాదె సైచు ♦ నా యముఁడింకన్.

సీ॥ తలఁచునే చంద్రార్ధ ♦ ధరుఁ దలంపక యన్యుఁ బరమభక్తుండైన ♦ వానిఁయాత్మ
కీర్తించునే యష్టమూర్తి మాహాత్మ్యంబు వీడి విప్రుని వాక్కు ♦ వేరొకరుని

గానంబుఁజేయునే • కాలకంఠుని గీతి కలమాని గాయకు • గాత్ర మితరు
లిఖియించునే సర్వ • లేఖాసమర్చితు హరుఁగాక యొరులఁ గై • సరుని కలము

కరములను మోడ్చునే చరా • చర సమస్తలోక రక్షాకరుఁడగు బి • నాకిఁగూర్చి
కాకమాయాపరీతుఁడౌ • గర్వితునకుఁ జతురుఁడగువాఁడెనం డేని • సాధ్వసమున.

తే॥ హరి విరించాది నిఖిల ని • ర్జర నికాయమే పరాత్పరుఁగొల్చు న • హీనభక్తి
నతని గానంబుఁ జేయక యధముఁడైన యొక్క మనుజుని గీర్తించు • టుచితమగునే.

చ॥ కరుణ వహించునేని తృణ • ఖండము నైన సమస్త ధారుణీ
శ్వర మకుటాగ్రరత్న ఘృణి • సంగతి మించెడునట్లుజేయుఁ గి
న్నరపతియంతవాని నయి • నన్ దృణమట్టుల హీనుఁజేయు నీ
శ్వరుఁ డొకయింత యల్గిన న • పాల యెఱుంగుదె శంభుతత్వమున్.

తే॥ అట్టివానితోడ • నాఁబ్రతిస్పర్ధికై నిలువఁదలఁతు వీవు • నిఖిలమునకు
జనకుఁడైనవాఁడు • శర్వుని బూజించిమనుము ధర్మపథము • గనుము నృపతీ!

క॥ కావున నీపూనిక విడి పావక చంద్రార్కనేత్రు • భవ్యగుణాఢ్యున్
భావమునఁ గొల్వుమీ వసుధావర శ్రేయమగు నీ, క • తని కృపవలనన్.

తే॥ శివుని లీలలగుచుఁ • జెన్నొందు లోకంబు లతని సేవయే సు • ఖాస్పదంబ
యెఱిఁగియును సమస్త • మెఱుఁగని నరుమాడ్కి నేల చెడఁదలంతు • వీవు చెప్పుమ.

క॥ ఓంకార రూపుఁడును నిరహంకారుఁడు శాంతమూర్తి • యాశ్రితనికరా
తంక నివారకుఁడగునా శంకరు సేవింపు మఖిల • శస్త్రము లమరున్.

క॥ తమమూని రుద్రుఁడగు సత్వమునన్ వెన్నుఁడు నాఁగఁ • దగును రజోరూ
పమునన్ విరించినాఁబడు నమరేశుం డంధకారి • యతిలోకుండై.

వ॥ నీవును సర్వసమర్థుండవు నీయెఱుంగని ధర్మాధర్మంబులుగలవే నిరంతరశర్వసేవా
పరుండవును భూతదయా సహితుండవును గీర్తికాముఁడవును నగు నీకీయసన్మార్గం
బెట్లు ద్రొక్కనయ్యె నీయంతటిరాజన్య తల్లజుండు సర్వజనుల కుపదేశంబు సేయుట.
వీడి నన్నుదక్క తక్కినవారి వేల్పులనేని గానంబుఁ జేయరాదనుట యాశ్చర్యజన
కంబును జింతాకరంబునునై మనంబుఁ దల్లడిల్లజేసెడు సహస్రకరంబుల లోకంబుఁ
గాఁచుచు నెల్లకర్జంబులకు సాక్షియై యలరు భగవంతుండగు మార్తాండుండును దన
యాధిక్యంబుఁ బ్రకటింప సాహసంబూనఁడన నితరాధీనుండును కామాదివికారో
పేతుండును నగు మనుష్య మాత్రుండు నమ్రుండై సంచరింపక స్వోత్కర్షన్ నెల్ల
దిక్కుల సాటు టుచితంబె శమదమాది సద్గుణోపేతుండవగు నీవిట్టి యకార్యంబుఁ

నకుఁ జోరఁబడుట నీ స్వభావగుణంబుగాక యితరప్రోత్సాహ సంభవంబని యేనె ఱుంగుదు. ఎవ్వఁడు సంపన్నుండైయుండు నాతనికడకు బంధుత్వంబునను మిత్ర త్వంబునను మఱియు నన్యోన్య సంబంధంబులు గల్పించుకొనియు ధనలుబ్ధులును బర శ్రేయోఽసహిష్ణులునునగు దుష్టు లరుదెంచి యాతని సర్వస్వంబు హరింతురు. ఇంతియగాక వెండియుఁ బరులదుర్భోధలకు లోనగువాఁడు విశాలంబులగు కన్నులు గల్గియు నంధుండును, జరణంబులు గల్గియుఁ బంగుండునై యెందునకును బనికిరా కుండునని పలికి పిమ్మట నిట్లనియె.

క॥ నీయెడ నాయొనరించిన యీ యుపదేశంబు హితమ • యేని శుభంబౌ
నౌా యవనీశ్వర యటుగాదా యెవ్వనిగతికి వాఁడ • యర్హుఁడగు నిలన్.

మ॥ శివనిందాపరుఁడైన క్షత్రియునకున్ • శ్రేయంబు చేకూరద
య్యవనీ నాథుని దేశమున్ విడుచు ట • య్యాం బట్లుగాకున్న ధ
ర్మవిరోధంబగుఁగాన వేగమ భవ • ద్రాజ్యంబునున్ వీడి శాం
భవ గానం బొనరంచుచున్ జనియెదన్ • వారాణసీ భూమికిన్.

తే॥ అనుచు హరిమిత్రుఁడేగ న•య్యవనినాథుఁ డట్లు కొన్నాళ్ళు గడపిదే•హాంతమందు
దండధరులోకమునకేగి • ధర్మమూర్తియైన కాలునితోడ ని • ట్లనుచుఁ బలికె.

—• భువనేశుం డంతకునితో సంభాషించుట •—

ఉ॥ ఈవు జగన్నియంతవు త్వ • దీయ కృపావశతన్ సమస్త లో
కావళి యెల్లసౌఖ్యముల • నందు నిరాకులుఁడై యెవండు త్వ
త్పావన పాదపద్మముల • భక్తిమెయిన్ భజియించువాఁడు స
ర్వావని నేలఁగాఁగలఁ డ • నర్థములన్ బెకళాసి నిత్యమున్.

తే॥ ధర్మమూర్తివి నీవు నీ • దర్శనమున నెల్ల కలుషముల్ దలఁగుగా • దే మహాత్మ
నాయొనర్చిన పాపపు • ణ్యంబు లెట్టి వేమికతమున నాకిట్టి • తృష్ణ గలిగె.

క॥ దావానలఁబుఁబలె నన్నీవిధి జఠ రాగ్ని కాల్చు • నేమిటి కిఁక నే
నేవిధి దీని జయింతునొ దేవా యెఱిఁగింపు మీవ • దిక్కయ్యెడలన్.

వ॥ భయంకరంబులై దుస్సహంబులగు క్షుత్పిపాసలు నాకుసంభవించుటకుఁ గారణం బెయ్యది వీనినుండి తరించు నుపాయంబెద్ది. నా కావించిన ఘోరపాపం బెట్టి దానతిమ్మని యడిగిన నాతనికి శమనుం డిట్లనియె.

చ॥ తెలియనివాఁడవోలె నతి • వేషముగా నడుగంగ నేల నీ
సలిపిన యెల్లకర్మములు • శాశ్వతపుణ్యఫలప్రదంబులే
కలిమిగలట్టివాఁడనను • గర్వముతో నెదురెందు లేక ని
చ్చలు జరియింపవే సకల • సాధుమనంబుల హింసఁగూర్చుచున్.

క॥ శివుగానమె జీవనముగ నవనిన్ జరియించు సుకృతి • యైన ద్విజునకు
నవమానంబును గూర్పవె భవపాశ నిబద్ధుఁడవయి • పాపాభిరతిన్.

క॥ హరుగానముఁ జేయక పురహరునిన్ గీర్తించువారి • ననుచితమనకు
వురుగతి శాశింపవె యది దురితంబని నీకు మదికినిఁ • దోఁచెనె చెపుమా?

సీ॥ ననుగూర్చి గానంబు • నొనరింపు డెల్లరు వేల్పుల గానంబు • విడిచి యింక
నటు సేయకున్న వా • రాజ్ఞాతిరస్కార దోషంబు కల్మి వ • ధ్యు లగుదురని
సాటింపవే మున్ను • సార్వభౌమ పదంబునందుఁ జేరిన మాత్ర • నతిశయించి
భవభక్తు లెల్లరు • భయమునఁ దమతమ నిత్యకృత్యముల నే • నియమఁ దొంఁగి
నిన్ను గానంబుఁ జేయరే•నిపుణుఁడైన బ్రాహ్మణుఁడు హరిమిత్రుఁడన్•భక్తుఁడొకఁడు
నీ కతంబునఁ గాచెచిం • తాకలితుఁడునై స్వదేశంబు విడువఁగ • నయ్యెఁ దొల్లి.

తే॥ ఎన్నియో పుణ్యకార్యంబు • లీవు చేసి ఘనుఁడవైతివి గాని శ్రీకంఠు గాన
మాసకు విముఖుఁడవైనక • తనను నిష్ప్రయోజనములయ్యె నవి యెల్ల•నుర్వినాథ.

వ॥ చరాచర ప్రపంచకర్తయగు నీశ్వరు నలంతిగ నెంచి గర్వంబునఁ గన్నుగానక భగవ
ద్గానం బనర్థకంబనియు రాజగానంబు శ్రేయోదాయకంబనియు సాటించి శ్రుతుల
నగతికంబులఁ జేసితివందు కతన నీకి యనివార్యంబులగు క్షుత్పిపాసలు సంభవించె.

చ॥ మనుజుఁడవయ్యు నీవు నభి • మానము పెంపున నప్పమాని రా
జ్జనహృదయాబ్జ హేళియగు • చంద్రకళాధరునిన్ దిరస్కరిం
చిన కలుషంబు కారణము • జేసి యనేక మహాయుగంబులం
దున జనియించి పక్షివయి • దోషము తీరెడుదాక నిల్వుమా.

—• భువనేశ్వరుండు యమాజ్ఞ నులూకయోని బుట్టుట •—

తే॥ పూర్వవర్జితమైన నీ • పురుషదేహమును భుజించుచుఁ గోటరం • బున వసించి
కడపు మొక్క మన్వంతర • కాలమీవు పిమ్మట మనుష్యజని గల్గు పృథ్వి నీకు.

వ॥ పరమేశ్వర గాన వైముఖ్యంబుఁ గాంచినకతన నీ వవశ్యం బులూకయోనిఁ బుట్టక
తప్పదు. అట్లయ్యును నీ కావించిన ధర్మకార్యంబులఁ జేసి గానవిశారదుండవై కీర్తి

గాంతువు. జ్ఞానశూన్యంబగు శకునంబుగదాయని నిన్నుఁ దిరస్కరింపక సిద్ధవిద్యాధరాదులు నీకు శిష్యులై సేవింతురు. ఇంతయు నీ యవివేకమూలంబు చింతింపక యనుభవింపుము పొమ్మని పలికి భగవంతుఁడగు నంతకుండు కనుమొఱఁగె నంత.

తే॥ ప్రమథగణ పరివృతుఁడయి బ్రాహ్మణాగ్రసరుఁడు హరిమిత్రుఁడరిగె నాఁ • చంద్రశేఖ
రుని స్మరించుచుఁ గైలాస • మునకు సాధుశిక్ష జేసినకతన నే • చెవటినైతి.

చ॥ తమ కెదు రెందు లేరను మ • దంబున శిష్టుల హింససేయు దో
షము వృథ పోవునే మరొక • జన్మమునన్ ఫలియింపకున్నె రా
జ్యము కలుషాకరంబనెడు • నార్యుల వాక్యము ఱిత్తయౌనె ధ
ర్మమునకు హానిఁ గూర్చిన • మానవుఁ డుత్తమలోక మొందునే.

వ॥ ఐశ్వర్యమత్తుండనై కన్నుగానక యీశ్వరాతిక్రమణంబును నాత్మస్తుతియు సజ్జననిందయు, గావించిన నేరంబునఁజేసి యాత్మశరీరంబు భుజించుచు నీ కోటరంబున నులూకంబనై యుంటిని. నేన భగవత్తిరస్కారంబు గావించిన భువనేశ్వరుండ. నాచేసిన స్వల్పపుణ్యంబున గానప్రాప్తియు నీ దర్శనంబును గలిగెను. అఱువదివేల వత్సరంబులు గానయోగంబున మదీయంబు రసనేంద్రియంబు నిర్మలంబయ్యె. నేను కోటరంబునఁ బ్రవేశించి పదిమన్వంతరంబులు గడచె.

క॥ కనుఁగొనుము వీరె కిన్నరు లనఘులు మత్సన్నిధాన • మందున గానం
బును నేర్వ నరుగుదెంచిరి చనియెను బహువత్సరములు • చదువఁగ వీరల్.

క॥ గానాచార్యుఁడ నైతిని మానీశ్వర యేను నాకు • మర్త్యత్వంబున్
బూనెడుతఱి యయ్యెను నీ మానసమున సంశయంబు • మానికదంకన్.

వ॥ పరమేశ్వర సాయుజ్యప్రాప్తికి గానంబు ముఖ్యసాధనంబు. ఆక్కతన నీశ్వరుండు గానప్రియుండై యక్షరంబును బ్రహ్మానంద జనకంబునునగు గేయంబును గారవించుచుండు అట్టి గానంబున నీవంటి సద్బుద్ధి కభిమానంబు గలుగుట పసిడికిఁ దావి చేకుఱినట్లు మన్నింపఁబడు. నిర్మలాంతఃకరణుండవై యాలింపుము. స్త్రీసంగమంబునను గీతంబునను ద్యూతంబునను వ్యాఖ్యాన సంగమంబునను వ్యవహారంబునను నాహార స్వీకారంబునను నర్థార్జనంబునను నాదాయ వ్యయంబులందును లజ్జాత్యాగంబు కర్తవ్యంబని యార్యులంద్రు. కరంబులఁ జాచియు నోరు దెఱచియు నాలుక వెడలించియు నూర్ధ్వబాహుం డయ్యును నూర్ధ్వదృష్టి గలిగియు నితరులఁ గాంచుచును స్వశరీరంబు దిలకించుచును గానంబుఁ జేయఁదగదు. సంఘట్టనంబునను నుత్థానంబునను గేయంబు త్యాజ్యంబు హాసంబును ఘోషంబును నితర స్మృతియు గానంబునకు మంగళకరంబులు గావు. క్షుధార్తుండును, భయార్తుండును, తృష్ణా

ర్తుండును గానా ర్హుండును గాఁడు. అంధకారసమయంబఘకారణంబగునని వచి యించి గానబంధువు నారదునకు గానార్హంబగు కాలంబును లజ్జాపరిత్యాగ సమయంబును, ముప్పదియాఱువేల యయుతంబులగు స్వరభేదంబులును దెలిపిన సహస్ర దివ్యవర్షంబులు వినయంబున దేవముని యెఱింగి యవ్విహగముఖ్యున కిట్లనియె.

తే॥ అనఘమగు గానవిద్య మ • దర్థమింత దాఁచక యెఱుంగఁజేసితి • త్వత్ప్రసాద మున జయింతును తుంబురు•వనజనయనుఁ డధిక్షనను గారవింపఁడా•యహరహంబు.

తే॥ గురుఁడవైతివీవు • కోరు మొసంగెద నెద్దియైన నీ క • హీనశక్తి గురుఁడు తృప్తివడక • ధర నెంతవారలకైన విద్యవలన • నగునె ఫలము.

చ॥ అనుటయు గానబంధువెద • నబ్బురమొందుచుఁ బల్కె నిట్టులో యనిమిష మానివర్య వినుమా • గురుదక్షిణ నిత్తునంచు నీ వనుట సమంజసంబె యగు • నైనను నాకొక వాంఛ యేల యీ తను వనిశంబు నిల్వఁగల • దా యుపకారము మేలుగూర్పదే.

తే॥ తాను నేర్చిన విద్య యెం • తయును బ్రీతి నాశ్రయించిన వారికీ • యండయేని యతఁడు రాక్షసుఁడైపుట్టి•యఘముసోకి విలయమును జెందుననుచును•సరసులఁద్రు.

వ॥ మరియును గౌటిల్యంబువీడి ఛాత్రునకు జ్ఞానముబోధించుట, పండిత లక్షణమగు. గాని వాని తనధనంబు లపహరింపఁబూనుట దౌర్భాగ్యంబుగాదు. అయినను నియ్యర్థంబున వేరొండు సందిగ్ధంబుగలదాకర్ణింపుము.

తే॥ ఈదలంపఁడేని • యిమ్మనగాఁబోల దిత్తునన్నవాని • చిత్తవృత్తి కనుగుణముగ నడచు • టరయ నాలుగు పురుషార్థములకు మూల • మనిరి బుధులు.

వ॥ నాయదృష్టంబుఁజేసి నీవంటి ప్రాజ్ఞుండు శిష్యుండయ్యె నింతియచాలకున్నే. అయినను నీవు మననూర్తిగ నడుగుమని యంటివిగాన నాకొక బ్రహ్మకల్పం బాయుష్యంబు గురుదక్షిణగ నొసంగుమనిన దేవమునియు నాతనిగాంచి యాగలకల్ప సంయోగంబున నీవు గరుత్మంతుండవై జనింతు వప్పుడు నీ కోరినట్ల యాయువు గలుగ గలదని పలికి సంతోషంబున శ్వేతద్వీపవాసియగు నారాయణుని మెప్పించి తుంబురునకన్న నాధిక్యంబు వహింతునని యుబ్బుచు నరిగి వెన్న నాతని గానంబుఁ జేసిన నాలించి శ్రీహరి యాతని కిట్లనియె.

—• శ్రీహరి నారదుని గానంబున కసంతృప్తిఁజూపుట •—

క॥ మతి దగిలిన పూనికనీ వతిశయమగు శ్రమమొనర్చి • యయుతాబ్దములా పతగ కులేంద్రునికడ శిక్షితుఁడ వగుచు నేర్చితెల్ల • శ్రేయంబనఘా.

మ॥ శ్రుతిపేయంబగు కౌతుకంబుఁ గలిగిం • చుక్ దావకంబౌ సమం
చిత గాతంబటులయ్యెఁ దుంబురు జయ• శ్రీశోభితుక్ మించు సం
గతి నీ గానమునందుఁ గానఁబడ దిం • కక్ దజ్జులక్ జేరి యా
తత శుశ్రూషల నేర్వఁగావలయు ఛా • త్రత్వంబు వాటించుచుక్.

సీ॥ మహిని వైవస్వత • మన్వంతరమున నిర్వదియెనిమిదియు నై • వఱలునట్టి
యుగములు గడచన • నున్నతంబగు ద్వాపరాంతంబున నసాధు • హననమునకు
యదుకులోద్వహుఁడనై • యిల వసుదేవునకును దేవకీదేవి • కిని జనించి
కృష్ణాహ్వయుండనై • వైష్ణవ సంతతిఁ గాపాడుచుందు నా • కడకు జేరి
లలితమహతీ స్వరముఁగ • శారదతీ స్వరార్జిత యశోన్నతుండయి • యలరువానిఁ
దుంబురుని మించు మధురగా • నంబు పెంపుఁ జెందఁగలవు విచారంబుఁ • జెందకింక.

తే॥ అట్టి సమయ మేతెంచెడి • నంతవఱకు నిశ్చలాత్ముఁడవై నన్ను • నీలకంఠుఁ
గూర్చి గానంబుఁ జేయుచుఁ • గొదువలేక సంచరించుచునుండుము • జగములెల్ల.

క॥ అని యంతర్ధానముఁ జెందిన వెన్నుని వాక్యములకుఁ • దృప్తింగని య
మ్మునికులతిలకుఁడు గానంబు నొనర్చు నెల్లలోక • ములఁ జరియించుక్.

ఉ॥ ఆ ఋషివర్యుఁడట్లు విన • యంబునఁ గేల విపంచి బూని బృం
దారకవందితాంఘ్రియగు • నాగవిభూషణు నీలకంధరుక్
గూరిచిగానముక్ సలుపు • కొంచుఁ బదంపడి యూర్ధ్వలోక సం
చారముఁ జేయఁగోరి విల • సద్ద్యుతియౌ నమరావతీపురిక్.

ఉ॥ అరిగి సురాసురప్రకర • మంజులులక్ ఘటియించి మ్రొక్క స
ప్తఋషి గణంబు వేదవిహి • తంబుగ దీవనలక్ బొనర్ప ని
ర్జర సతులెల్ల నాట్యమును • సల్ప ముదంబున నున్న వృత్రసం
హరు ననివార్య ధైర్యు నమ • రాధిపుఁ జేరిన గోత్రభేదియుక్.

తే॥ భక్తిసంయుక్తుఁడై యర్ఘ్య • పాద్యములిడి సముచితంబగు సింహాస • నమునఁజేర్చి
నిటలతట సంఘటితహస్త • నీరజుండు నగుచు వినుతించు బలవైరి • కనియెనతఁడు.

సీ॥ సాధుసంరక్షణా • సక్తి దుష్టులఁగూల్చి భూభారమును దీర్చు • పూనికనింకఁ
బద్మనాభుండు వై • వస్వత మన్వంతరమున నిర్వదియె • నిమిదియునగు
యుగములు చనినంత • నొక్క ద్వాపరయుగాంతమున యాదవులవం• శమునయందుఁ
గృష్ణుఁడై జనియించి • క్షితితలంబున ధర్మ సంస్థాపన మొనర్చు • సంతసమున
నపుడ యేనేగి శిష్యుండ • నగుచు నతని చెంత గానశాస్త్రంబు నేర్చెదను మంచి
సమయ మరుదెంచువఱకును • జంద్రధరుని చరణముల భజియించుచు • దిరుగవలయు.

క॥ అనినవిని దేవమానిఁ గనుగొని దేవపతి పల్కెఁ • గ్రమనిపంచీ
జనితస్వనంబె నీ యశమును జాటెడుఁగాదె సకల • మునికుల ముఖ్యా!

క॥ హరుగానముఁ జేయుటె భవహర మడియన్ గాక నీవు • హరి గైకొని బం
ధురగాన మొనర్చుట మునివర సుకృతాస్పదము నగుచు • వఱలు ధరిత్రిన్.

క॥ అనుచు ననేకవిధంబుల ననిమిష వర్యుండు పలుక • నమరర్షి ముదం
బునమహతిని మ్రోయించుచుఁ జనియె వరుణలోకమునకు • జలనాథుండున్.

వ॥ నారదునకుఁ బ్రత్యుద్ధానాభివందనములఁ గావించి యాతని సంచారకారణం బెఱిఁగి సంతుష్టుండై యనేకోపాయనంబు లొసంగినఁ గొని మునితిలకుండటఁ దరలి తక్కుంగల దిక్పతుల లోకంబులకుఁ గ్రమంబునఁజని వారిచేఁ బూజలంది సత్యలోకంబున విరించివలన నాశీర్వాదంబుఁ జెంది వైకుంఠుండు ధర్మసంస్థాపనార్థంబుగ యాదవకులంబున నవతరించు టెఱింగి వేగము ద్వారకాపురంబున కరిగి యందొక సౌధరాజంబున.

చ॥ ఖల జన తాలతా ప్రకర • ఖండనదక్ష పవిత్రమూర్య హృ
జ్జలరుహ మత్త బంభరము • సర్వ చరాచర లోక నేత్రతో
జ్వలము రమాకుచోపరి వి • హారి సుగంధ పరీవృతంబు ని
ర్మల మఖిలాఘ సంహరము • మాధవ రూపము గాంచి భక్తిమై

క॥ కనిముప్పిరి గొనికౌతుకమున భక్తినయంబులొప్ప • మునివర్యుం డా
వనజాక్షున కెఱిఁగిన నాతనిఁగని కృష్ణుండు పలికె • దరహాసమునన్.

చ॥ సురముని ముఖ్యవచ్చితివె • చూచితివే భువనంబు లెల్ల భా
సుర మృదు గేయ మాధురికిఁ • జొక్కుకుతూహల వృత్తినుంట బం
ధురమగు గానశాస్త్రమునఁ • దోషితుఁ జేసెద నోపికొన్ని వ
త్సరములిటన్ వసియింపుము ప • దంపడిచిత్తము స్థైర్యమొందఁగన్.

క॥ అనిపలికి జాంబవతిఁ గన్గొని దేవీ యిమ్మహర్షి • కోరెడు గానం
బును గావున నుపదేశంబొనరింపుము సంశయంబు • నొందక మదిలో.

చ॥ అనుటయు నామెపల్కె దర • హాసము భాసురమై చెలంగనో
యనఘ యిదేటిమాటయొ మ • హర్షిన్ కెఱుంగగ దాని శాస్త్ర మీ
వనిత యెఱుంగనేర్చునొకో • ప్రాజ్ఞుఁడ వీవుసమస్త గాన శా
స్త్రనిధులు రుక్మిణీసతియు • సత్యయు వానికి శక్తిచాలదే.

ఆయిన నందజులోన నా • యందె నీకుఁ గరుణ యెక్కుడు గాన యీ • ఘనునిపట్ల
శ్రద్ధ బూనుమటంచు ని • స్సంశయముగఁ బలికి తదె చాలు నావంటి • చెలియకిలను.

అనుచు వచించి జాంబవతి • యమ్మునిపుంగవు గానవేత్త గా
నొనరుపఁబూని తోల్త నిగ • మోక్తవిధిన్ సరిగాది సుస్వర
ధ్వనులును దాళవర్ణలయ • పద్ధతులున్ దెలియంగఁజేసె నా
ఘనుఁడు నఖండ సాధనము • కల్మినెఱింగె సమస్తమాధటన్.

ఆవ్విధిని జాంబవతిచెంత • నబ్జయోని తనయుఁ డొక పూర్ణమైన వ • త్సరము వినయ
వినమితుండగుచును గాన • విద్య నేర్పెఁ జూపఱులు విస్మయమునొంది • చూచుచుండ.

అంతట నొక్కనాఁడు కమ • లాక్షుఁడు రాధయు సత్య రుక్మిణీ
కాంతయు నాదియైన కుల • కాంతలఁగూడి విలాసరీతి శు
ద్ధాంతమునందు స్వర్ణరచి • తంబగు నూయెల నూఁగుచుండ నా
చెంతకుఁ జేరవచ్చె ముని • శేఖరుఁ డెంతయు సంతసంబునన్.

ఆవిధి నేగుదెంచిన మ • హర్షినిఁ గాంచి యథార్హరీతి సం
భావనజేసి రత్నఘృణి • భాసితమై తగు నాసనంబునన్
శ్రీ విలసిల్లఁజేర్చి సర • సీజదళాక్షుఁడు పల్కె నిట్టు లో
దేవమునీంద్ర వర్షము గ • తించెను నేర్చితె గానశాస్త్రమున్.

—• శ్రీకృష్ణుఁడు నారదుని గానము పరీక్షించుట •—

గానసర్వస్వమున నింత • యేనిఁ దనకు సాటిలేదని వచియించు • జాంబవతికి
ఛాత్రుఁడవయితివీవు నీ • గాత్ర మెట్టు లనుసరించెడినో స్వరం • బును గణింప.

ఈ రుక్మిణి యీ సత్యయు నీ రాధయు నుత్సుకలయి • యెన్నడు విననౌ
నో ఋషి గానంబనుచును గోరిక నున్నారు మౌని • కుంజరవింటే.

ఇంచుక శ్రమమనుకొనక విపంచిని శ్రుతిఁజేసి ఖండ • పరశుఁ గుఱిచి రా
ణించెడు నీ గానము విన్పించి ముదముఁగూర్పుమయ్య • వెలఁదుల కింకన్.

అనుటయు తడవుగ • నమ్మునివర్యుండు ముప్పిరిగొను మోద • మునఁ జెలంగి
తన విపంచిని గేలఁ • గొని సప్తతంత్రుల షడ్జాది శ్రుతులతో • సంతరించి
తాళలయానుగ • తంబుగ మునుమున్న చరణయుతంబగుస్వరముఁ గూర్చి
సామగానప్రియుం • డౌ మహాదేవుని గీర్తించె మృదుల సం • గీతమునను

వింటిమే యిట్లు వీనుల • విందుగూర్చు మధుర గానంబటంచు ర • మాపతియును
రాధయును దక్కఁగలయట్టి • రమణులెల్లఁ బలుకుచుండుటఁగని సత్య • భామ యనియె.

చ॥ శ్రమపడి పెక్కుమాసములు • జాంబవతిన్ దన యొజ్జగాఁ దలం
చి మమతోడ నేర్చె ముని • శేఖరుఁడార్యులు మెచ్చగాన శా
స్త్రము శ్రుతి పేయమానటులఁ • జక్కఁగఁ బాడఁగలందుగాని గా
త్రమున నపస్వరంబు విశ • దంబుగనే కనుపట్టు నెంతయున్.

క॥ కవనంబును సంగీతం బవని స్వభావజములైన • యట్టి గుణములో
ట విమర్శింపఁగ నేరికి నవిరళగతి సాధ్యములగు నా యత్నమునన్.

తే॥ అయిన నేపయ్యె దేవమ • హర్షిన్ కుశలియాట సాధించె శాస్త్రంబు • నంత నొక్క
వత్సరంబున నే యప • స్వర మొకింతె గల్గినను నే కొఱంతయుఁ • గలుగఁబోదు.

చ॥ అనిన నిదేటిమాట జల • జాయతలోచను నాజ్ఞ చేగదా
చని ముదమార జాంబవతి • సన్నిధి నేర్చితి నెల్ల నామెయున్
గనికరమూని నాకు నొడి • కంబునఁ జెప్పె నపస్వరంబె యిం
కను గలదంచు నీమెయనుఁ • గారణమేమొ నిజంబదెట్టిదో.

చ॥ అనుచుఁ దలంచి కేశవున • కంజలిమోడ్చి వచించు నిట్టులో
యనఘ దయాంబురాశివి న • తావన దక్షుఁడవంచుఁ బ్రత్యయం
బున భవదాజ్ఞ శీర్షమునఁ • బూని ముదంబునఁ ద్వత్పురంధ్రి చెం
తను బదిరెండుమాసములు • దద్దయ నేర్చితిఁ గాదె గానమున్.

సీ॥ సామగానప్రియా • సన్నుతించెద నిన్నుఁ గనికరింపవె నన్ను • గానలోలు
నిందిరానందకృ • త్సుందరాకార నన్ దరిఁజేర్పవే నీవె శరణమంటి
భక్త శుభంకరా! • ప్రణుతిఁ గావింతు విద్యార్థిఁ బ్రోవవె ప్రణ • యంబుఁదీర్ప
సర్వసమర్థ నీ • సన్నిధిఁ జొచ్చితి నఘములఁ దొలఁగింపు • మయ్య యింక
వేణుగానవిశారద విపులతేజ యభయదానంబొసంగవే • యాశ్రితునకు
నిరుపమాన నిరంజన • నిర్గుణాఢ్య! జయము నొనగూర్పవే నిన్నె సన్నుతింతు.

క॥ అని ప్రార్థించెడు వాణీతనయునిఁ గనికనికరమున • దామోదరుఁ డి
ట్లను నింతమాత్రమునకే మనమునఁ జింతింపదగునె • మానిప్రవరా!

క॥ నీయట్టివాఁడు ఘనానిన నే యర్థంబును ఫలింప • దే యెల్లెడలన్
శ్రేయంబు జయము సౌఖ్యంబాయతమగు కీర్తిగల్గ • దా వివరింపన్.

## —• శ్రీకృష్ణుఁడు నారదుని గానవిద్యావిశారదుని జేయుట— •—

క॥ నిన్నుఁ దుంబురుకన్నను మించిన నేర్పుగలానిగాఁగఁ • జేయుదు గానం
బున నీకఁ జింతిలకుమనుచు వనజాక్షుఁడు దేవమౌని • వరుఁ బల్కె వెసన్.

వ॥ ప్రాఙ్ముఖుండును శుచియు, దర్భాసనోపవిష్టుండును, నిర్వృత్తనిత్యకృత్యుండును, స్థిర
మనస్కుండును నగు నారదునకు సరహస్యంబగు సంగీతశాస్త్రోపదేశంబుఁ గావించిన
నతండును సుగంధ సంగతంబగు జాంబూనదంబు భాతి వెలుంగుచు శ్రీకృష్ణు ననేక
విధంబుల వినుతించెనంత రుక్మిణీకాంతుం డిట్లనియె.

క॥ గాయక వర్యుఁడ వైతివి తోయజభవపుత్ర నీకు • దుంబురుఁడే కా
దా యబ్జాసనురాణియు నేయెడలను సాటిగార • హీనచరిత్రా.

చ॥ సకలజగన్నియంత యగు • శంభునిఁ గూర్చియు నన్నుఁగూర్చి గా
యక మణులబ్బురంప డెదు • నట్టుల గానముఁ జేయుమింకఁ దా
వక మృదుగాన పద్ధతి ప్రపంచము నెల్లెడ నిండి చంద్రతా
రకలు నభంబు సూర్యుఁడును • రాజిలునంతటి కాల మొప్పగన్.

చ॥ అనుటయు నారదుండను జ • నార్దన నీ కరుణారసంబు పెం
పున ననువంటి పామరుఁడు • భూవిదితంబగు సద్యశంబునన్
జననుతుఁడయ్యె నీకతన • సర్వజగంబులు పుట్టి గిట్టునం
చనియెదుపల్కె చిత్తయగు నాశ్రితలోకశరణ్య మీవకా.

తే॥ మాదృశులరైనయట్టిపా • మరజనంబు నుద్ధరించు తలంపు గా • కుండు నేని
శ్రుతిశిఖర గోచరుండు నా • స్తుతినిఁ గాంచు నీ వవతరింతువె యిట్లు • నీరజాక్ష.

క॥ పురుషులు పురుషోత్తముఁడని సురలు సురోత్తముఁడటంచు • సూరిజనంబుల్
ధర సూరివరేణ్యుండని నిరత మెవనిఁ గొల్తు రతఁడు నీవ మహాత్మా!

క॥ కరుణాశాలి శివుఁడు భవహరుఁడు జగద్భర్త సంత • తాశ్రితరక్షా
కరుఁడవు మీ యిర్వురఁ గా కొరులను గానంబుఁ జేయ • నోర్తునె చెపుమా?

వ॥ అనినఁ గృష్ణుఁ డిట్లనియె.

క॥ గానము సర్వజనప్రియ మానగజాపతికి నాకు • నానందకరం
బై నుతిఁ గాంచును గావున గానమె సర్వార్థసిద్ధి • కరమగు నెపుడున్.

చ॥ అమలినభక్తి నెవ్వఁడ న • యంబు నచంచలచిత్తుఁడౌచు దా
నమరనదీతరంగ కలి • తామల శీర్షుని గాని నన్ను గా

ని మృదులరీతి గానమును • నెమ్మి నొనర్చు నతండు నిత్యసౌ
ఖ్యమునఁ జెలంగి దుస్తర భవాబ్ధిని దాటక యున్నె చూడఁగన్.

తే॥ ఇదిమొదలు నీకు గంధర్వు • లెల్ల శిష్యులయ్యెదరు వారలకు సర • హస్యమైన
గాన ముపదేశ మొనరించి • కామవైరి కరుణవడయుము ధర్మాను చరణము మెయి.

క॥ అని పంచినఁ గౌతుకమునఁ జనియెను నారదమహర్షి • సకలజగములన్
గను లొక్కు ముప్పిరిగొన నసఘుఁడు కృష్ణుండు చనియె • నవాధ్ స్థలికిన్.

వ॥ అని పలికిన ననంతంబగు బ్రహ్మానందంబునొంది యంబరీషుండు మార్కండేయుని
మహాభాగా నీకరుణావశంబున ధన్యుండ నైతి భక్తుండన నెట్టివాఁడు భక్తియన
నెట్టిది తత్ఫలం బెయ్యది నివరింపుమని యడిగెనని సూతుండు మహర్షులతో
వచించుటయు.

ఉ॥ వ్యాసవసిష్ఠ గౌతమ ము • ఖ్యాఖిలమౌని తపోగ్ర దేశ సం
వాస సురాసురప్రకర • వందితపాద సరోజయుగ్మ ది
గ్వాస నిరస్త దైత్యకుల • వైభవసంతత చారుకౌముదీ
హాస నిరీశ శైలతన • యామలమానసపక్ష్యతోహగా!

క॥ నిరలంకార! వతంసిత మరుదశనా! నిస్సపత్న • మర్దిత దైత్యా!
స్మరహర! గిరితనయా హృత్స రసిజమద భృంగ సకల • సంకల్పపతీ!

ఆలసగతి వృత్తము—

జలరుహ భవాది సుర • సన్నుత పదాబ్జా
కలుషదమనా! సకలకామ్యద శుభాంగా!
జలజహిత నేత్ర! పు • రశాసన గిరీశా!
ప్రళయ రవి తేజ! మధు • రాపుర నివాసా!

తే॥ కష్టపడి పెంచి యిడితి నా • కవితకన్నె నెవ్విధంబున నలరింతొ • యింక నీవు
గంగవోలెను గయ్యాళి • గాదు పేలసుమ్మ నీ తలనెక్కి నా • ట్యమ్ము సేయ.

సీ॥ ఏ మహామహుఁడు శ్రీ • వేమనారాధ్య వంశాబ్ధికిఁ బూర్ణశ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి • కెనయై సతుల్మెచ్చ మహిని పాతివ్రత్య • మహిమఁ గాంచె
నట్టి నందయకు గా • రమకు ద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోదరుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మనీ • యమగు శ్రీమదాంధ్ర లింగపురాణోక్త • రార్థ మందు
నరయ నాల్గవ యాశ్వాస • మయ్యె దీని సతము రక్షించుఁగావుత • చంద్రమౌళి.

శ్రీ మీనాక్ష్యై నమః

# శ్రీమదాంధ్ర లింగ పురాణము

## ఉత్తరభాగము

## —: పంచమాశ్వాసము :—

క॥ సకలసుకవి సద్గ్రంథ ప్రకటిత పరిపాలనాది • బహువిషయలస
త్కసుబంబర! పురదానవనికరహరణ సుందరేశ • నిర్మలమూర్తీ.

వ॥ అనఘరింపుము నిఖిలపురాణసారజ్ఞుండగు సూతుండు నైమిశీయులం గాంచి మార్కండేయుండు భక్తిజ్ఞాన సంపూర్ణుండగు నంబరీషునకుఁ జెప్పినప్రకారంబున భక్తియోగంబుఁ గూర్చి చెప్పవాఁడై యిట్లనియె.

### —• భక్తిస్వరూపము •—

క॥ తనకన్న నన్నివిధముల ఘనులగువారియెడఁ గల్గు • గాఢంబగు న
య్యనురాగమె భక్తియనన్ దనరును సూరిమతమై బు • ధప్రీతి దగన్.

ఉ॥ అయ్యది మూఁడురీతులగు • నార్యజనంబులు సన్నుతింపఁగా
నెయ్యది హేతుగర్భము స • హేతుకభక్తియనన్ బ్రసిద్ధమా
నయ్యది హేతుశూన్యమగు • నట్టి దహేతుకభక్తి నాఁబడున్
న్యాయ్యము మాధ్వయుక్తమగు • నట్టిది ధారుణి మాధభక్తియా.

చ॥ హర గిరిజా మనోహర చ • రాచరలోకశరణ్య శిక్షితా
సురసముదాయ కాయ జయ • శోహరచంద్రకళాధరా భవ
చ్చరణము లాశ్రయించితిని • స్వర్గసుఖం బొనఁగూర్పవే దిగం
బరయని కొల్చు మానవుని • భక్తి సహేతుకభక్తి నాఁబడున్.

చ॥ వసుధ సహేతుకంబమున • భక్తిగలాతఁడు దేనిఁగోరి స
ర్వసముఁ ద్రిలోకవందితునిఁ బన్నగభూషు సమస్త దేవతా
గ్రసరు నిరంజనున్ గొలుచుఁ • గా మవిదారుఁడు వాని కద్దియే
యొసఁగుఁ దదన్యమైనది మ • రొక్కటి యీయఁడు వాని కెప్పుడున్.

ఉ॥ సేవసఁ డెవ్వఁడేని నెల • జీతముఁగోరి నృపుల్ భజింప నా
భూవరుఁడట్టి యాతనికిఁ • బూనిక రొక్కమొసంగుఁ గాని వాఁ
డేవిధి నెల్లరీతుల న • హీనుఁడు నయ్యెడు నో యటంచు సం
భావనఁ జేయునే మృదుల • భావమునన్ గనునే యొకింతయున్.

చ॥ దనుజుఁ డొకొక్కఁ డొక్కొక వి • ధంబున నొక్కొక కాలమందు శం
భుని నిగమాళ్యుఁగూర్చి తప • ముం బొనరించి యెదో వరంబుఁ గై
కొని జగమెల్లనేఁచుటయుఁ • గ్రోధమునన్ బురవైరి యాతనిన్
దునుముటయున్ గనుంగొనమె • దుష్టనివారణ దక్షుఁడై వెసన్

తే॥ ఈ సహేతుకభక్తి య • హేతుకంబునకు విరుద్ధంబునగుచుఁ గన్పడును దీని
కన్న నయ్యదియే శ్రేష్ఠ • మనుచు నెల్లమునిజనంబులు దానినే • బూనుచుంద్రు.

చ॥ క్రతుభుజాలందున్ దమకు • గల్గిన వైరముఁ దీర్చు పూన్కి నా
దితిసుతులెల్ల శుక్రుఁడు వి • ధించినరీతి గిరీంద్ర కన్యకా
హితుఁడగు నీలకంఠుని స • హేతుకభక్తి యజింత్రు గాని సం
తతగిరిశార్చనాభిరతిఁ • దారిది పూనరు యోగులింతయున్.

తే॥ ఏవరంబుఁగోరి • యెవఁ డీశుని భజించు నావరం బెవాని • కతఁ డొసంగుఁ
గాని యితర మెద్ది • యేని యీయఁదలంపఁ డెట్టి శాంతచిత్తుఁ • డేని నరుఁడు.

మ॥ అరివర్గంబుఁ దిరస్కరించి విషయ • వ్యాసంగమున్ మాని దు
స్తర సంసార పయోధి దాఁటి శిశిర • క్ష్మావక్షుఁ గైలాస మం
దిరు నార్యారమణున్ గుమారజనకున్ • నిష్కాములై సంతత
స్థిరబుద్ధిన్ భజియించు ధీనిధుల భ • క్తిస్ఫూర్తిన్ నిర్హేతువౌ.

చ॥ వలదు ధనంబు కీర్తియును • వైభవముల్ సురలోక సౌఖ్యముల్
వలదు చిరాయురున్నతియు • వాసవు దివ్యపదంబుగూడ నో
జలరుహలోచనాది సుర • సన్నుత పాదపయోజ నాకుఁ ద్వ
త్కలుషనివారకంబయిన • తారకమంత్రమె దక్క వేరుగా.

మ॥ అని యెవ్వాఁడు నిరంతరం బఖిలలో • కాధీశు వందారు భ
క్తనికాయావన తత్పరున్ సురసప • త్న వ్రాత నాశంకరున్
ఘనజీమూత సమాన కంధరు నిని • ష్కాముండునై కొల్చు న
య్యనఘుం డాగ్రహతారకంబును శివై • క్యంబందు నిశ్చింతతో.

క॥ నిరతమహేతుకభక్తి స్ఫురణ నెవండేని నిఖిల • సూరివినుతు శం
కరుఁగొల్చు నమ్మహాత్మున కరయఁగ నేకొఱఁత గలుగ • దా హరుకరుణన్.

తే॥ ఈయహేతుకభక్తి స • హేతుకమగు భక్తికన్నను శ్రేష్ఠమై • పరగుఁగాన
దీని నేసాధనంబు గా • ధీరవరులు చంద్రధరుఁ గొల్చుచుందురు • సంతతంబు.

క॥ నగజాపతి నీవిధిఁ గొల్వఁగఁదగునను తెల్విలేక • భక్తియె ముఖ్యం
బుగ నెంచువాని భక్తియె యగణితమగు మూఢభక్తి • నాఁబడు నవనిన్.

సీ॥ జపమేల తపమేల • స్నానంబదేటికి సంధ్యయెందులకు శా • స్త్రంబదేల!
శ్రుతులేల ధర్మసం • హితలేల స్మృతులేల తక్కిననిద్యలఁ దలఁపనేల
పురహరుఁడొక్కండె • పురుషోత్తముఁడు సర్వలోకరక్షకుఁడు కృపాకలితుఁడు
అగనికన్న లేఁ డధికుఁడౌ దేవుండు సృష్టిస్థితిలయముల్ • జేయనతఁడు
నీరజాసనాది • నిఖిల నిర్జరులకు రక్షకుండతండు • దక్షుఁడతనిఁ
గొలువ నేకొ అంత • గలుగదటంచును దలఁప మూఢభక్తి • వెలయు జగతి.

క॥ జయమె యౌనుగాక • సంపదలె పొసంగుఁగాక యపజయంబె • కలుగుఁగాక
యెట్టి కష్టమేని • యిల సంభవించెడుగాక యీశ్వరుండె • కర్తమాకు.

వ॥ అని యచంచలుండై, దేశాదేశ విచారంబును, సమయాసమయ పరిగణనంబును సేయక సంతతచంద్రశేఖర ధ్యానపరాయణుండై కష్టనిష్ఠురంబులఁ దలంపక దేహాభిమానంబు నొల్లక “శివఏకోధ్యేయ” యను వాక్యంబు మఱవక భక్తుల సంభావనంబుఁ జేయువాఁడు మూఢభక్తుండనఁబరగు. అట్టివానికి మృత్యుంజయుండు స్మృతిపథంబున నిల్చి సర్వకాల సర్వావస్థలయందును దోడునీడయై మెలగుచుండు గావున తక్కిన భక్తియుగంబునకన్న నిద్దియ శ్రేష్ఠతరంబని తజ్ఞులు వక్కాణింతు రిదియ భక్తిస్వరూపం బింక భక్తస్వరూపంబును తద్భేదంబును వినుమని మార్కండేయుండు నిశ్చలుండై యంబరీషున కిట్లనియె.

—• శివభక్త లక్షణము •—

తే॥ చిత్తచాంచల్యమును బొందఁ • జేయునట్టి శోకమోహాదు లెన్నియ • స్తోకగతిని
గలిగినను గాని స్థైర్యభం • గంబుఁ జెందనతఁడు భక్తుండునాఁబడు • నవనిలోన.

ఉ॥ ఇంతటి విస్తృతంబగు మ • హీతల మెల్లను సృష్టిఁజేసి క
ల్పాంతమునందుఁ గ్రమ్మర ల • యంబొనరించుచు నెట్టిచింతయున్
స్వాంతమునన్ వహింపక య • థార్థగతిన్ జరియించు దేవుఁ డే
కాంతసుఖం బొసంగఁగలఁ • డంచుభజించెడువాఁడు భక్తుఁడౌ.

చ॥ తెలియక పూర్వజన్మమున • దీనుఁడనై యొనరించినట్టి నా
కలుషము నేటికీవిధము • గా ఫలియించుటఁ జూచుచుండియున్

సలుపుదునే యకార్యమును • సత్యదయానిధి నీదు సేవకున్
దొలగుదు నేయటంచు విన • తుండగు నాతఁడె భక్తుడౌ నిలన్.

చ॥ జలములయందు భూమి ధర • సంచయమందును నెల్ల కాననం
బులను దిశాష్టకంబునను • భూమి పయిన్ గగనంబునందు రా
త్రులను నహస్సులన్ నిఖిల • దుష్టవినాశన నీ స్వరూపమే
చెలఁగెడు నిన్ను నేపగిదిఁ • జింతనసేయుదు లోకకారణా!

తే॥ అని యహర్నిశముల • నన్యచింతన మానిభ క్తియుక్తుఁడగుచుఁ • బలువిధముల
నెవఁడు దేవుఁగొల్చు • నెసఁగు భక్తుండన నతఁడు సకలశుభము • లందుచుండు.

చ॥ శివుఁడె జగంబు కర్త పర • నీరుహ సంభవ ముఖ్యులేని యా
భవుని మహత్వమున్ దెలియ • ప్రాజ్ఞులుగా రిపుమంతరమైన సం
భవమరణాది దుఃఖములఁ • బాపు సమర్థుఁడతం డొకండె త
త్త్వవిమల పాదపద్మముల • భక్తిభజించుట యుర్వ్రమా నిలన్.

తే॥ హరునికన్న దైవ • మన్యంబులేదు తచ్చరణ సేవకన్న • పరములేదు
హరుఁడె విశ్వకర్త • యనుచు భజించెడువాఁడు శైవుఁడనగ • బరగు నెపుడు.

సీ॥ భూతి త్రిపుండ్రమే • పురుషునుదుటఁగన్న నతని శంకరునిగ • నభినుతించు
రుద్రాక్షమాలలే • భద్రాత్ము నెదఁగన్నవాఁడె హరుఁడనిభా • వమునఁదలచు
హరుకీర్తనమె వాని • యాస్యంబునన్ విన్న నాతండె వ్యాఘ్రాజి • నాంబరుఁడను
పంచాక్షరీమంత్ర • పారాయణ మొనర్చు ధీరుండె త్రిపుర సం • హారియనుచు

సర్వకాలములను • సర్వదేశంబుల సర్వదశలయందు • శర్వుఁ డొకఁడె
తనకు దిక్కటంచుఁ • దలపోయుచుండెడువాఁడె శైవుఁడైన • వాఁడు జగతి.

ఉ॥ తన తను ధనముల గిరిజేశునకు సమర్పణముఁజేసి • నూరివినుత నా
కును నీ పద దాస్యంబె యనయ మొసఁగుమనుచుఁ బల్కు • నగు శైవునకున్.

క॥ హరునకు భక్తప్రియునకు ధరణీధర కన్యకా వ్రా • దయ పంకజ భా
స్కరునకుఁ దన సర్వస్వము నిరత మొసంగుదునటంచు • నిరతి వచించున్.

తే॥ "ఓంనమశ్శివాయ • యోంకార రూపాయ శంకరాయ రిపు భ • యంకరాయ
పార్వతీశ్వరాయ • పాపవినాశాయ" యనుచు శైవుఁడైన • యతఁడు బలుకు.

మ॥ శివపూజారతులన్ మహామతుల స్వ • శ్రీభోక్తలన్ ముక్తులన్
భవభక్తి ప్రథనిష్ఠులన్ విమత వి • ద్వజ్జేతలన్ నేతలన్

భవనాశ ప్రతిబద్ధ కంకణుల శ • శ్వద్భక్తిఁ బూజించుచుఁ
శివభక్తుండు చరింపఁగావలయు దు • శ్చింతాపనోదార్థియై.

తే॥ ఇదియ శివభక్తలక్షణ • మెట్టి క్రూరకర్ముఁడేనియుఁ జంద్రశే • ఖరునియందు
గాఢమగు భక్తిగల్గి భ • క్తప్రవరుల నాదరించునతండేగు • హరుపదంబు.

తే॥ కనకమయమొ రత్న • ఖచితంబొ స్ఫటికంబొ బాణమైనఁదాల్ప • వలయు శైవుఁ
డైనవాఁడు వక్ష • మందున లింగంబు జగము లింగరూప • మగుట సత్యము.

—• విష్ణుభక్త లక్షణము •—

క॥ అనిపలికి మఱియు నిట్లను మునివరుఁడు మృకండు సూతి • భూనాధమణీ
వినుమీఁక వైష్ణవలక్షణమును వచియించెదను భక్తిపూర్ణాత్ముఁడనై.

చ॥ హరియె పరాత్పరుండు నిఖి • లామర గోచరుఁ డిందిరామనో
హరుఁడు సమస్తకామ్యదుఁ డ • నంతుఁడు తచ్చరణాంబుజద్వయ
స్మరణమె మోక్షదాయకము • సర్వచరాచరలోక కారణం
బరయఁగ నట్టివేల్పు కలఁ • డాయని పల్కును వైష్ణవుం డిలన్.

చ॥ పలికిన విష్ణునామములె • పల్కుఁదలంచిన శార్ఙ్గిఁగూర్చియే
తలఁచు స్మరించినన్ సకల • దానవలోక హరున్ స్మరించు ని
ర్మలమగు భక్తిఁ గొల్చినర • మాధవుఁగొల్చు నిరంతరం బచం
చలమతి వైష్ణవుండయిన • సాధువు నూఱిజనంబు మెచ్చఁగన్.

క॥ హరిదాసులతోడఁ గలిసి తిరుగుచు సుక్షేత్రములును దీర్థంబులు బ
ల్మరు దర్శించుచు నిరతిన్ స్థిరుఁడగు వైష్ణవుఁడు ధాత్రి • తెలివి గడించున్.

మ॥ సరసీజాంబకు సత్కథామృతము నా • స్వాదింపలేకున్న దు
స్తర సంసారపయోధి దాఁటఁగలఁడే • సామాన్యులౌ వేల్పులన్
నిరతంబున్ భజియించువాఁడనుచుఁ దా • నిష్ఠాగరిష్ఠాత్ముఁడై
హరిసేవా రతుఁడౌను వైష్ణవుఁడు • నిత్యంబుత్సుకుండై యిలన్.

సీ॥ హరిదాసు లెవరేని • యరుదెంచిరని విన్న నెదురేగి యాతిథ్య • మిచ్చుచుండుఁ
గేశవునామ సం • కీర్తనం బెటవిన్న జెవులొగ్గి విననటఁ • జేరుచుండుఁ
బద్మాక్షు నెచ్చోట • భజియించుటన్ గన్నఁ దక్కిన కార్యముల్ • దలప మఱచు
హరికథాకథకుల • యానవా లెటఁజూడ నుత్సాహమున నంచె • యుండు నెపుడు

విష్ణుశబ్దంబు చెవిఁబడ • వీనులలర దేహమే మఱచి చరించు • ధీరుఁడగుచు
వైష్ణవుండగువాఁడు దు • ర్వారకలుష భంజకుండగుచును లోక • రంజకుఁడయి.

క॥ హరిని భజించుటకన్నను హరిభక్తుల గారవించు • టధికప్రియమా
మురవైరికట్లుగావున నరయఁగ వైష్ణవునిఁ గొల్వ • నగు నెల్లరకున్.

క॥ అని విష్ణుభక్త లక్షణమును భూపాలునకుఁ దెల్పె మునిపుంగవుఁ డం
చును సూతుఁడు వినిపించిన ననఘులు శ్రావకులు బల్కి • రాతని కిటులన్.

సీ॥ భక్తసంరక్షణ • పరతంత్రుఁడైన శ్రీహరి భక్తలక్షణం • బర్థి వినుట
సంభవించుట తొల్లి • సలిపిన పుణ్యంబు ఫలమంచు మదిలోనఁ • దలఁతు మేము
పౌరాణిక శ్రేష్ఠ • వైష్ణవాగ్రసరులం దెవ్వాఁడు ముఖ్యుఁడై • యెసఁగు జగతి
నంబరీషుం డెవ్వఁ • డతని పవిత్రచరిత్ర మెట్టి దతండు • శ్రీధవునకు
ముఖ్యభక్తుఁడటంచును • మున్ను వింటి మది వినెడుకోర్కి హెచ్చు • నెమ్మదినిమాకుఁ
దెలియఁబలుకుము నిర్ధూత కలుషులైనయట్టివారి చరిత్ర యో • గ్యమగు వినఁగ.

—• అంబరీషోపాఖ్యానము •—

సీ॥ అన విని సూతుఁ • డిట్లను మౌనివరులార వినుపింతు శ్రద్ధతో • వినుఁడు తొల్లి
యిక్ష్వాకు కులమున • కెల్ల వతంసమై సంతతకీర్తి వి • శాలుఁడగుచు
సకల భూనాయక • మకుట కిరీట సంఘటిత రత్నసమూహ • కాంతికలిత
పాదపద్ముండయి • ప్రాజ్ఞ లోకైకశరణ్యుఁడై ధర్మని • ర్ణయ సమర్థుఁ
డఖిలరాజవర్యు • లరిగాఁపులై కొల్వ శిష్టరక్షణయును • దుష్టశిక్ష
యును బొనర్చుచుండి • యుర్విఁ బాలించుఁ ద్రిశంకుఁడనెడు నృపతి • చతురుఁడగుచు.

శా॥ త్రైలోక్య ప్రథమానకీర్తియగు నా • ధాత్రీశ్వరుండుర్వరన్
బాలింపన్ నెల మూఁడు వానలు బడెన్ • భద్రాత్ములై యెల్ల భూ
పాల శ్రేష్ఠులు ధర్మపద్ధతిఁ జరిం • పన్ బూని రుర్వీజనుల్
లీలన్ సౌఖ్యము నొందుచుండిరి విప • ల్లేశంబు నేజెందకే.

క॥ ఆ మహితాత్ముని కులకాంతామణి పద్మావతియను • తరుణి నిరతమున్
రామాధవ సేవాపరయై మహిళామణులలోన • నగ్రేసరయై.

చ॥ సలలితభక్తి విష్ణుపద • సారసముల్ మదిలోన నిల్పి ని
చ్చలు హరిభక్తలోకమును • సాఁకుచు శ్రీధవు కీర్తనంబులన్

సలుపుచు భూసురార్చనయు • సాధుసపర్యయు నిత్యకృత్యమై
యలరఁ జరించు నా సతి మ • హత్త్వము నెల్లరు సన్నుతింపఁగన్.

క॥ హరిసేవయు సంతత భూసురలోక సమర్చనయు య • శోధనులౌ న
మ్మురహరభక్తుల గోష్ఠియు సరసిజలోచనకు నెపుడు • సంతసమొసఁగున్.

మ॥ హరిఁ గీర్తించుటయున్నఁ దక్కఁగల కా • ర్యంబుల్ సహస్రంబులై
నరహిన్ వీడు జనార్దనార్చనమట • న్నన్ సంతసంబొందు నా
తరుణీరత్నము వైష్ణవోత్తముల చెం • తన్ జేరి గోవిందు స
చ్చరితంబుల్ వినుచుండు నెల్లపుడు స్వాం • తంబుత్సుకంబై తగన్.

సీ॥ అనయంబు విష్ణ్వాల • యంబునకేగి మోదమున విష్ణుఁ బ్రదక్షి • ణము లొనర్చు
నంతట శ్రీహరి • కరిఁ బంచామృత స్నానంబుఁగావించు • శాస్త్రవిధినిఁ
దరువాత వేదవే • త్తలగు విప్రులు మంత్రములు జెప్ప భగవంతుఁ • బూజసేయు
నటుమీఁద రత్నమ • యంబగు తాంబూలము నొసంగు నంబుజా • క్షునకుఁ బ్రీతి
రమణ నానంద నీరాజ • నము నొసంగు ధ్యాన మొనరించు వేదమం • త్రములతోడ
మంత్రపుష్పంబు నొసఁగు ని • ర్మలినభక్తి సతులు మెచ్చంగ నారాజ•సతి యనయము.

క॥ పతి శుశ్రూషాపరయై ప్రతిదిన సంవృద్ధ కేశ • వధ్యానసమా
హిత కలుషయగుచుఁ బద్మావతి ప్రఖ్యాతవహించె విష్ట • పత్రయమందున్.

చ॥ అనిశము వైష్ణవార్చనయు • నార్యుల గోష్ఠియు విష్ణునామ కీ
ర్తనయును నన్నదానమును • దాపసపూజయు లేక యింతయై
నను జలమో ఫలంబొ జన•నాథుని పత్ని స్పృశింప నొల్లదా
వనరుహనేత్ర భక్తజన • స్వర్ధుని మహానని యెల్లవారనన్.

మ॥ తనయందున్ బలె సర్వభూతముల న • త్యంతంబు ప్రేమన్ గనుం
గొనుచున్ నిచ్చలు ధర్మసంకలితయై • గోవింద నామామృతం
బున సంతృప్తి వహించుచున్ హరి పదం • బుల్ నెమ్మదిన్ నిల్పి యు
వ్వనితారత్నము కాలమున్ గడపు వి • ప్రశ్రేణి కీర్తింపఁగన్

ఉ॥ ఇంతటి భక్తియుక్తులయి • యెవ్వరు నే యుగమందునైన దై
త్యాంతకు నంబుజాక్షు నఖి • లాశ్రితలోకశరణ్యు నిర్మల
స్వాంతులనై భజింపరని • సర్వజనంబులు మెచ్చుచుండ భూ
కాంతుని ధర్మపత్ని యధి • కంబగు విష్ణుపదార్చ సేయుచున్.

క॥ ఏ వాక్యముఁ బల్కినఁ దా నేవారల కిడిన నెద్ది • యేని మెసవినన్
భావమున సర్వ మారాజీవాక్షున కర్పితమని • చెప్పుచునుండున్.

క॥ అమ్మాడిక్కి దశసహస్రాబ్దమ్ములు రాజీవనేత్రు • భక్తివివశయై
యమ్మగువ గడపె భక్తజనమ్ము తగునటంచుఁ బలుక • నమలిన భక్తిన్.

ఉ॥ అంతట నొక్కనాఁడు జల • జాక్షుఁడు భక్తజనావనుండు భూ
కాంతునిపత్ని భక్తి కను • కంపజనింప వరంబొసంగఁగా
స్వాంతమునన్ దలంచి సతి • స్వప్నమునన్ గనుపట్టె దుష్టదై
త్యాంత కృదున్నతాస్యమున • యందుఁ గృపారస ముప్పతిల్లఁగన్.

తే॥ అటులఁ గానవచ్చి • యాదరంబున నిట్లు బలుక్కె నో పురంధ్రి • ప్రవిమలమగు
నీదుభక్తి కాత్మ • మోదంబు గల్గె నీవంటివారు గలరె • భక్తు లిలను.

చ॥ నిను మదిమెత్తు నేవరము • నీకు హితంబగుఁ గోరు మావరం
బు నిడెద నిన్నువంటి పరి•పూర్ణ దయావతులైన సాధ్వు లు
ర్విని గలరే మహాత్ములగు • వేదవిదుల్ నినుఁ బోలనేర రెం
దును గనుగొన్న సుంతయును • తొయ్యలి సందియమంద కియ్యెడన్.

తే॥ అనుచు వచియించి యొక ఫలం • బాపురంధ్రి కరకమలమున నుంచి యా • [ గరుడగమనుఁ
డపుడు కను మొఱఁగుటయు నే•ణాంకవదన నయ్యెనన్ మేలుకాంచి దె•సలనుజూచి.

చ॥ కనఁబడఁడేల భక్తజన • కామ్యఫలప్రదుఁ డిందిరామనో
వనరుహహేళియైన నవ•వారిజలోచనుఁ డెందుఁబోయె న
య్యనిమిషవందితాంఘ్రియగు • నచ్యుతుఁ డొక్కఁడ కాదె యాశ్రితా
వన చతురుండు నాయెడఁ గృ • పాసహితుండగు దేవుఁ డిద్ధరన్.

చ॥ ఫలము నొసంగి మార్వలుక • భావమునందుఁ దలంచునంతలో
పలనె యదృశ్యుఁడయ్యె భగ • వంతుఁడు యోగిజనైక గోచరుం
డలఘు యశోవిశాలుఁడు జ • నార్దనుఁ డమ్మహనీయు పావనం
బులగు పదాబ్జముల్ శ్రిత • తమోహరణంబు లికెప్డు గాంతునో.

చ॥ కలుష లతాలవిత్ర నను • గాఁచెడి భారము నీదెకాదె భూ
వలయపతీ భవచ్చరణ • వారిరుహంబులఁ గొల్చునట్టి భ
క్తులఁ గరుణింపరాదె సుర • కుంజర నాజని సార్థకంబుగా
నిలువకపోయితేల నను • నీ కృపకున్కిగఁ జేయరాదొకో.

ఉ॥ నారద గానలోల కరు•ణారసజాల వినీతపాల దు
ర్వార సురారి గర్వవిని • వారణశీల మునీంద్రమానసాం

భోరుహ సంచరద్భ్రమర • ప్రాంత వికుంఠపురీ నివాస శృం
గార శరీర భక్తజన • కల్ప రమాహృదయేశ కేశవా !

క॥ అనుచు ననేకవిధంబుల వనితారత్నంబు భక్త • వత్సలుఁడగు వె
న్ననిఁగూర్చి పలుకుచుండఁగ విని యచ్చటివారలెల్ల • విస్మితలగుచున్.

క॥ ఇదియేమి నడికి రేయిన్ సుదతీరత్నంబ వింత • చూపులతోఁ జూ
చెద వాశ్రిత వత్సలుఁడగు నదితిసుతుం డిందుఁ గలఁడె • యహ్వాంబగునే.

క॥ కలఁగంటివే లతాంగీ తలఁపఁగ జగదేకనేత • దైత్యారి మునీం
ద్రులకేని గోచరింపం డలఘుఁ డతఁడు నీకుఁ గాన • నయ్యెనె యిందున్.

చ॥ అని తుహినాంశుబింబముఖు • లంద ఱొకొక్క రొకొక్కరీతిగా
ననియెడు పల్కులన్ విని ధ • రాధిపుఁ డల్లన మేలుకాంచి యి
ట్లను నిదియేటి వింగడ మ • హా యొకరిద్దరుగాదు కాంత లె
ల్ల నడికి రేయి యేకళవ • రింపడుచుండిరి హేతు వెద్దియో.

—• పద్మావతి భర్తతో స్వప్నవృత్తాంతముఁ జెప్పుట •—

క॥ అనుటయు నటఁ బద్మావతి వినయము గదురంగఁ బల్కెఁ • బృథ్వీశున కో
జననాథ యిప్పుడిప్పుడె ఘననిద్రావశతనున్నఁ • గలలోన నొగిన్.

ఉ॥ కాలపయోదతుల్యమగు • కాంతి దనర్చెడి మేన జాళువా
సాలువ వల్లెవాటుగఁ బొ • సంగనమర్చినయట్టివాఁడు కెం
గేల సుదర్శనం బఖిల • కిల్బిష నాశకమైన శంఖమున్
దాలిచినట్టివాఁడు వసు • ధావరుఁ డొక్కఁడు దర్శనం బిడెన్.

ఉ॥ ఆవిధి దర్శనంబిడిన • యాతని లోకశరణ్యుఁడైన ప
ద్మావిభుఁడంచు నెంచితి న • తండును నాయెడ సత్కృపాయుతుం
డై వచియించె "నో వికచ • వారిరుహాంబక నీదు భక్తికిన్.
భావమునందు మెచ్చితి శు • భంబగు నీకిఁక నెల్లయందునన్"

క॥ అని పలికి మఱియు నిట్లను వనజాక్షుఁడు భక్తలోక • వాత్సల్యమునన్
దనరెడి చల్లనిచూపులఁ గనుఁగొని యాదరము మెఱసి • కదలుకొనంగన్.

మ॥ "తరుణీరత్నమ నీదు భక్తికిఁ బ్రమో • దంబయ్యె నీకిట్లు మ
చ్చరణాబ్జంబులఁ గోర నేమిఫలమున్ • స్వాంతంబునన్ గోర దో

వరమీయంగఁదలంచి వచ్చితిని న • న్వాంఛింపుమా దేవతా
వరసాంమ్రాజ్యము సత్యలోక సుఖమో • వైకుంఠ సంవాసమో.

చ॥ అని వచియించి వాహృదయ • మందలి వాంఛ నెఱిఁగి యీ ఫ
లంబును భుజియింపుమో తరుణి • భూనుత సత్యయశోధనుండు దు
ర్జనహరణైక దక్షుఁడు ప్ర • చండమయూఖ సమాన తేజుఁడౌ
తనయుఁడు వైష్ణవోత్తముఁడు • దార చరిత్రుఁడు గల్గు నీకిఁకన్.

తే॥ అనుచుఁ బల్కి వెన్నుఁ • డంతర్హితుండైన భ్రాంతచిత్తనగుచుఁ • బంకజాక్షుఁ
డెందుఁబోయెననుచు • నెల్లెడఁ జూచుచునుంటినంచుఁ బల్కె • నుర్వీపతియు.

మ॥ కరుణాశాలి భుజంగశాయిశ్రితలో • కత్రాత వందారు ని
ర్జర సంతానము పట్టుగొమ్మ దనుజ • వ్రాతంబు శిక్షించు వాఁ
డరయన్ నేటికి సత్కృపావివశుఁడై • యస్మత్కులంబుర్వి భా
సురమానట్లొనరింపఁబూను టిదియే • చూడంగ నర్థంబగున్.

తే॥ అనుచు సంతోషితస్వాంతుఁ • డగుచు నవనినాథుఁ డారాత్రి బుచ్చి యం •
[దఱను మంత్రి
సత్తములఁ బిల్చి తనసతి • స్వప్నవృత్త మెల్ల నెఱిఁగించె విను వార • లెదను మెచ్చ.

తే॥ అంత రాజపురుషు • లవనీశు నాఁతి శిరమునందుఁ దాల్చి • పురవరంబు
నపు డలంకరింప • నమరావతినిబోలి పట్టణము దనర్చె • వైభవముల.

చ॥ వితరణశాలియైన పృథి • వీపతి స్వాంతమునందు నెంతయున్
గుతుకముతోడ భూసురు • లకున్ నిరుపేదలకున్ యథాక్రమా
గతి మణిభూషణంబులును • గాంచన ఖండములున్ దుకూలముల్
హితమగు భోజ్యసంచయము • నిచ్చె జగంబున వారు మెచ్చఁగన్.

తే॥ మఱియు నా భూమినేత సం • భావ్యులైన యగ్రజ శ్రేష్ఠులకు గోస • హస్రదాన
ములును భూదానము లొసంగి • జలజనయను భక్తిగొల్చుచు నిరతంబు • భావమందు.

చ॥ హరిభజనానురక్తియు శ్రి • తావన శక్తియు సర్వభూమి ని
ర్జరుల యెడన్ గురుత్వమును • శాత్రవసంతతిపై లఘుత్వమున్
బరిచరులందునన్ దయయు • బంధుసమూహమునందు నాదర
స్ఫురణయుఁ గల్గి యొప్పెడి సు • పుత్రునిఁ గన్గొను టెన్నడో కదా.

క॥ శత్రునిబర్హణమైన సుపుత్రముఖాలోక సౌఖ్య • మును బొందని యా
ధాత్రీశు సర్వసంపద • ధాత్రవిహీనుఁడగు నొజ్జ • చదువుంబోలున్.

క॥ అని పరిపరివిధముల నెమ్మనమునఁ దలఁచుచు నృపాల • మౌళి యలరఁ న
వ్వనజాక్షు కరుణ నాతని వనితారత్నంబు గర్భవతియై మదిలో.

చ॥ తనకు జనించు పుత్త్రుఁడు సతంబును శ్రీహరిపాదసేవకుం
డనుపమకీర్తిశాలియును • నాశ్రిత రక్షకుఁడున్ సమస్తలో
క నికరపాలకుండు నయి • గౌరవమందఁగలాఁడయేని భ
క్తిని నిను బూజసేయుదుఁగ • దేయని యంబకు మ్రొక్కె నెంతయున్.

సీ॥ పుడివోనిబత్తిని • పుడమి జేజేలకుఁ దడయక రొక్కంబు • నిడుచునుండుఁ
బెలుచగారామునఁ • బిన్నవాండ్రను బిల్చి పసిఁడి తొడవుల నిం • పెసఁగ నిచ్చు
గుడుసు కైదువు దాల్పుఁ • గోరి నెమ్మదిపీఁకలరెడిపూఁపూజ • సలుపుచుండుఁ
జెలువంపుటాకదుపులఁ జేరగాఁదీసి సరిలేనిపచ్చి క • సవును మేపు.

నెపుడు హరియాఁడినట్టి ప • ల్కొఁతలంచి యట్టి పున్నెంపు తలఁ యెప్పు • డౌనటంచు
నెలమి వేల్పులకును ముడు • పులను గట్టు మానినీరత్నమైన య • మ్మహిపు పత్ని.

తే॥ తల్లిదండ్రుల యాఁనతి • దాఁటకెపుడు కన్నులకు హాళిఁ గలిగించు • కందు వేగఁ
గలిగెనేని పసిఁడిపూలఁ గరమునీకుఁ బూజసేయుదుగదె దుర్గపూన్కితోడ

తే॥ తేనియలు గారు చిన్నారి తేటపలుకు లలరఁ దప్పటడుగుల గ • జ్జెలు గదలఁగఁ
గనులముందర నాడెడి • కందుగల్గెనేని వెనకయ్య! యుండ్రాళ్ళ • నిత్తునీకు.

తే॥ మెల్లమెల్లనవచ్చి సం • ఫుల్లపంకజాతరుచి నలరారు నా • స్యంబునెత్తి
ముద్దుబెట్టెడి పుత్త్రుండు • బుట్టెనేని వేడ్క మెడ గంటఁగట్టెద • వృషభరాజ!

వ॥ అని యెల్లవేల్పులకు మ్రొక్కుచు వ్రతంబులచే దానంబులచే బుడమి జేజేలఁ దని
యించుచుండె నంత.

తే॥ కలదొ లేదొ యనఁగ నొప్పు • కౌను బలిసి తరులలోఁ జేసికొనియెఁ బేదరికమునను
గొఱఁతవడునట్టి యాతండు • గొప్పయైన సాధులకు గౌరవంబెట్లు • జరుగు ధరణి.

తే॥ కూళపగరాచ సిరులెల్లఁ గొఱఁతవడుట యిటులనేయని తెల్పెదు • నటులఁదెలివ
నిద్దఁపుం జెక్కుటద్దముల్ • దద్ద పలుచనయ్యెరొక్కంబునకు నిల్క • డరయఁగలదే.

తే॥ కడుపులోపలఁ బెరిగెడి • బుడుతయెల్ల శత్రువర్గంబు నోడించి • జగములందుఁ
గడిమి మెఱయంగ శ్రేయంబుఁ • గాంచుననుచు దెలుపునాఁగనిట్టూర్పులు • జెలఁగెసతికి.

తే॥ కూడు నిద్దురయును • గొఱయయ్యె వాతెఱ నలుపురంగుఁ జెందె • నడయుఁ దిన్న
నయ్యెఁ బాలుమాలి • కయ్యె దేవేరికి నంతరాయఁ డెదను • సంతసమున.

తే॥ మఱియుఁ బెద్దలకును బేద • మానుసులకుఁ గైసరులకును బట్లకు • గాణలకును
దపసులకును యథేష్టార్థ • తతి నొసఁగుచు నెలమిఁబట్టి గలుగుతఱి • నెంచుచుండె.

తే॥ అంత బందుగులెల్లరు • హాళినొందిరి రెల్లదిక్కుల నేలెడి • యేలిక లెద
భీతిఁ జెందిరి జేజేలు • పేర్మిగనిరి నెలలు తొమ్మిది తెలవకు • నిండుటయును.

—• అంబరీషుని జననము •—

తే॥ వెలిపులుగు రౌతు దొరపంటి • కలరు తేజో దివ్యగాఁగ నయిదుగాము•లవ్వేళుఁగుల
ఉనిఁజేరెడితఱి దొర • సాని కనియె పూపజాబిలి దొరయైన • బుడుత నెలమి.

తే॥ ఆటులఁ దనకుఁ గల్గి • నట్టి పట్టినిఁ గాంచి యిబ్బడియగు హాళి • నెసఁగి నేల
ఉఁడు పుడమివేల్పు • ఉండ్లకుఁ దనివిదీర నిడుచు బదిదినము • లను గడిపియు.

చ॥ విలసిత విష్ణుచిహ్నములు • వీర రసాస్పదమైన తేజమున్
సలలితశాంతదృష్టియును • స్వర్ణ నిభంబగు దేహవల్లియున్
గలుఁగఁ గులాభివృద్ధి నధి • కంబుగఁ గూర్పఁగలాఁడటంచు లోఁ
దలఁచి మహీశ్వరుం డతిము • దంబున ధన్యుఁడనంచు నెంతయున్.

తే॥ కౌతుకంబుఁ జెందె • ఘనులు వసిష్ఠాది మునివరేణ్యు లెల్ల ననఘుఁ డీతఁ
డంబరీషుఁడనఁగ • నాహ్వాయంబును జెంది చెలఁగుననుచు దీవె • నల నొసఁగిరి.

చ॥ మునిజనముల్ పురోధసులు • పూతచరిత్రులు వైష్ణవోత్తముల్
ఘనులగు వైదికాగ్రణులు • గౌరవనీయులు సాధుపుంగవుల్
జనపతులున్ బురంధ్రులును • జక్కఁగ దీవెనలం బొనర్పఁగా
దినదిన వర్ధమానుఁడయి • దీప్తివహించెను బాలుఁ డెంతయున్.

తే॥ షోడశకళాప్రపూర్ణుఁడౌ • సోముఁడట్ల కనులపండువుఁగూర్చ నం • దనుని ముద్దు
మురిపెములతోడఁ బెంచుచు • భూధవుండు వడుగుఁ గావించె నైదవ • వత్సరమున.

చ॥ నిరుపమకీర్తిశాలి యుప • నీతుఁడు విష్ణుపదాంబుజార్చనా
పరుఁడుఁ గుశాగ్రబుద్ధియయి • బాలుఁడు నోజున కొక్కరీతిగా
బెరుగుటఁ గాంచి సంతసము • పెంపున భూతలనాథుఁ డర్హులౌ
గురువులమొద్దఁ జేర్చెఁ దన • కూరిమి బిడ్డని విద్య నేర్పఁగన్

మ॥ జననాథోత్తముఁ డవ్విధంబున సుతున్ • శాస్త్రజ్ఞులౌవారి చెం
తను విద్యార్థిగఁ జేర్పఁ బుత్రుఁడును • నిత్యం బొజ్జలేరీతిఁ జె

ప్పిన నారీతిని భక్తియుక్తుఁడయి పృ • ధ్వీనాయకాగ్రాంబులై
వినుతింగాంచిన యెల్లవిద్యలను దా • వేర్వేర నేర్చెఁ దగన్.

చ॥ శ్రుతులు స్మృతుల్ పురాణములు • సూరిజన స్తవనీయ ధర్మసం
హితలు సమస్త శాస్త్రము ల • నేకవిధంబులునైన శిల్పముల్
చతురత నేర్చి యొజ్జలకె • సర్వముఁ దావచియించునట్టి యు
న్నతమతియై చెలంగె జన • నాథకుమారుఁడు బాల్యమందునన్.

తే॥ అటుల నంబరీషుఁ • డాచార్యు లెల్లరు నబ్బురంబుఁ జెందు • నట్టి పగిదిఁ
గొలఁదికాలమున స • కలవిద్యలను నేర్చి యలరె నుష్ణరశ్మి • వలెఁ గరంబు.

చ॥ అమలినమైన దర్పణము • నందుఁబలెన్ సుతునందు నెల్ల శా
స్త్రములును సంక్రమించుటయు • క్ష్మాపతి యెంతయు నాత్మలోన మో
దమును వహించి యాత్మజు ను • దారగుణాఢ్యు నియుక్తుఁజేసె రా
జ్యమున నితండు యర్హుఁడని • యార్యజనుల్ వినుతిం బొనర్పఁగన్.

ఉ॥ అంతట నంబరీషుఁ డమలాత్ముఁడునై జనకాజ్ఞఁబూని సా
మంతు లమాత్యపుంగవులు • మంత్రివరుల్ దన ధర్మయుక్తికిన్
స్వాంతమునందు మెచ్చఁగ ని • జార్హగతిన్ బ్రజ నేలుచుండె ని
శ్చింతి రమేశుపాదములఁ • జిత్తమునందున నిల్పి యెంతయున్.

సీ॥ తలిదండ్రులందునఁ • బలె సాధువులయెడ సద్భక్తియుక్తుఁడై • సంచరించుఁ
దనవారియెడలవో • లె నితాంత గౌరవంబుననుండు నితరులో • జనులయందు
బాహ్యశత్రులనట్లు • బలిమినంతశ్శత్రుసమితి నిర్జించి య • శంబుఁగాంచు
హరిచరణధ్యాన • మందున గతి వైష్ణవార్చనయందును • నాత్మనిల్పుఁ

జతురుదధివేష్టితాఖర్వ • సర్వభూతలాధికార ప్రభాభాసి • తాంగుఁడగుచు
నంబరీషుండు భూపతు • లదరిపడఁగఁ బృథివి బాలించుచుండె దో • ర్వీర్యము మెయి.

క॥ గురుజనమునందు గౌరవమరివర్గమునందుఁ గ్రోధ • మాశ్రితులందున్
గరము కనికరము మురసంహరునెడ భక్తియును గలిగి • యతఁడు చెలంగున్.

క॥ హరిదాసుల సంగతి భూవరతనయుఁడు దినదిన ప్ర • వర్ధితమురజి
చ్చరణ స్మరణుండగుచున్ జిరకాలము బ్రజల నేలు • స్థిరమతి దనరన్.

వ॥ మఱియు నయ్యంబరీషుండు.

సీ॥ అదుగైనఁ గదలమి • నచలాభిధాన యోగ్యమగు శైలమును జి • త్తమున రోసి
యుక్తంబెటులంగ కా • సక్తిమై జంబాలమున వసించెడి కోల • మును హసించి

కడుపులోపలఁ దల • నిడుకొని జలముల మెలఁగెడి తామేటి • మేటి నెంచి
వైనతేయ మహో భ • యానతుఁ డగుచును జిలుపుట్టలన్ దూఱు • శేషు నవ్వి
విశ్వ విశ్వంభరాకాంత • శాశ్వతముగఁ దన్నె చేపట్టివలపునఁ • దనరుచుండ
రాజ్యమేలుచునుండె వి • రాజమాన కీర్తి కాంతాయుతుం డయి క్షితివరుండు.

సీ॥ తనయాపవిలేవడి • తనమున వెతఁగుందు తొలిజాతివారికి • వెలిమొదవుగఁ
దన విక్రమము సప • త్న నికరాచలతతుఁ బదిపదులంచుల • బాకుగాఁగఁ
దన సోయగంబు క్రొ • న్ననవిల్తు సతికేని యెదఁ గడు దమకంబు • నెసఁగఁ జేయఁ
దన నిర్మలాభిఖ్య • దశ దిశాధిపులకుఁ బంచాక్షరీమంత్ర • ఫక్కిఁ దనర
ప్రబలు నిక్ష్వాకు కుల కల • శాబ్ధి కరయఁ బూర్ణిమాచంద్రుఁ డగుచు నా • భూవరుండు
ధర్మసంస్థాపనాసక్తి • ధరణి నెల్లఁ బాలనముఁ జేయుచుండెను • బహువిధముల.

చ॥ నలువపటాణులన్ దెగడి • నాడెపు వేలుపు గిడ్డి నెంచి వె
న్నెల నలిజేసియున్ బలుకు • నెచ్చెలి కీల్జెడఁ బట్టి లాఁగి పె
న్జిలువలఱేని డాసి తెలి • చెట్టుల గుట్టును బైటఁ బెట్టి యా
వలఁతి యశంబు జెన్నలరెఁ • బంటవెలందుక దాల్చు సొమ్మనన్.

సీ॥ ప్రాఁబల్కులను జదు • వని నేల వేల్పులు గలవ భీతిలెడి లెం • కల గమియును
లాతివారలకీయ • బీతుగుడుచు బేరులెలమి దుక్కి విడుచు బలిజకొలము
అంతిపురముఁ బాసి • యరుదెంచు కాంతలు నానఁ జెందెడి వెల • నాతిమూఁక
తులసిమాలల నెద • నలరఁ దాల్పని జోగులలరు దెల్పని జెంద • నట్టివారు
వెలిచవి నొనర్చు వడుగులు • కొలఁపు విద్దె నబ్బెపించని చదువరుల్ • దబ్బరగను
బలుకువారలు గలనైనఁ • గలుగనట్లు నవని బాలించు నంబరీ • షాధిపుండు.

క॥ దురమందు గెలుపుజెందని దొరలెల్లనుఁ దనుకు నితఁడె • దొరయనుచును దా
దరిగాఁపులై భజింపఁగ నిరవగు వేడుకల ధాత్రి నేలుచునుండెన్.

చ॥ నిరత వియోగ ఖిన్నరమ • ణీజన సంగతిఁ గౌతుకాత్ముఁడై
పరఁగె భుజంగరాజనిజ • పంకజనేత్రలఁ గూడి కచ్ఛపే
శ్వరుఁడు రసప్రవాహమున స్వైరగతిన్ జరలాడె ధారుణీ
భరము నృపుండు బూనుటయుఁ • బ్రాజ్ఞులు కర్తలుగాఁ గొలంతయే.

సీ॥ లోకబాంధవుఁ డయ్యె • నా కమలాప్తుండు భూపతి నిజగోత్ర • మున జనింప
నరయ జగత్ప్రాణుఁ • డయ్యె సమీరుండు భూనాయకుఁడు న్యాయ • ముగఁ జరింప
ద్విజరాజనఁ దనర్చె • దివిరి శశాంకుండు జనపతి శిష్టర • క్షణముఁ జేయ
క్షమత వహించె వి • శ్వంభరాదేవి నాయకుఁడు శమోపేతుఁ • డై పాసంగ

పీరు వారనసేల యు • ప్పీరుఁ డీశుఁడనుచు జనులెల్ల శంకరులై చెలంగి
రహహ "రాజానమనుసర్వం • తిహ్రజా యు" నియెడు వాక్యంబన్వృతమగు • నే ధరిత్రి.

—• అంబరీషుఁడు తపము జేయుట •—

వ॥ ఇట్లు నిస్సపత్నముగఁ బ్రజారంజకంబుగ సకలధరాచక్రంబేకచ్ఛత్రముగఁ బరిపాలించి యంబరీషుండు జగద్రక్షకుండగు నారాయణుఁగురించి తపముఁజేయు వాంఛమెయి నమాత్యులందు రాజ్యభారము నియోగించి యరణ్యంబునకరిగి.

క॥ నిద్రాహారముల విడిచి భద్రాత్మకుఁడై సహస్ర • వర్షంబుల న
క్షుద్రముగఁ దపమొనర్చె జగద్రక్షకు హరిఁగురించి • క్ష్మాకాంతుఁ డొగిన్.

సీ॥ ప్రళయకాలమునందు • వలెఁ బ్రజ్వరిలు దవానలమునకైనను • దలఁకఁడింత
ఫెళఫెళాన్ఫటులచే • వృక్షసంతతిగూల వీఁచు గాడ్పులకైన • వెఱఁగుపడఁడు
వెలుచదిక్కులు దల్ల • డిలునట్లు రొదజేయు జంతుసంతతిఁగాంచి • వంతగొనఁడు
గస్సని లేచుచుఁ • గాలసర్పంబులు పైఁబడినను గాని • భ్రాంతి వడఁడు

మిన్ను విరిగి నెత్తి • మీఁద నె పడినను చంచలింపఁడాత్మ • సాధ్వసమునఁ
గుంభినీధవుండు • గోవిందునిగురించి తపముఁజేయుచుండెను • దగ్ర వనిని.

ఉ॥ పుట్టిననాటఁగోలె హరి • పూజయె జేయుచు నెల్లకాల మీ
నట్టడవిన్ వసించి కర • ణంబుల గెల్చియు ముక్తికాంతఁ జేఁ
బట్టియుఁ బట్టనున్న మము • వంటిమునీంద్రులకైన నద్దిరే
యిట్టి తపంబుఁజేయఁగల • రేయని యెల్లరు బల్కుచుండఁగన్.

చ॥ ఘోరతపంబుఁజేయు నృప • కుంజరుభక్తికి సంతసించి దు
ర్వార మహాఘ భూమిధర • వజ్రము దేవహితుండు యోగి హృ
త్సారస లోకబాంధవుఁడు • శార్ఙ్గి కృపాకలితాంతరంగుఁడై
ధారుణినాథ ముఖ్యుని కృ • తజ్ఞునిగా నొనరింప నెంచుచున్.

—• శ్రీవిష్ణువంబరీషుని బరీక్షించుటకై యింద్రరూపమున నరుదెంచుట •—

సీ॥ గుడుసుకైదువుబట్టు • కొనవజ్రమగుకేల హత్తించినాఁడు వ • జ్రాయుధంబు
పసిఁడి దుప్పటముఁ దా • ల్పక దగు నెమ్మేన వెలయింపఁగాఁజేసె • వేయుఁగనులు
పక్కిబాబా మిన్న • నెక్కెడు పనిమాని రహి నధిష్టించెనై • రావతంబు
తులసిమాలల నెద • నలరించుటకుమారు ధరియించినాఁడు ము • త్యాలసరుల

వైష్ణవాగ్రేసరులు వెంట • బలిసి కొలువ సంచరించెడి మునకాఁడు • సాధ్యసిద్ధ
చారణులు గొల్వ వెనువెంట • ధారుణీశుకడకు నరుదెంచె వెన్నుఁడా • ఖండలుఁడయి.

ఉ॥ ఆవిధి నేగుదెంచి వసు • ధాధిప సత్కృతుఁడై సమస్తలో
కావనదక్షుఁడైన కుహ • నామరవల్లభుఁ డంబరీషునిన్
బావనమూర్తిఁ గన్గొని కృ • పాసహితుండయి పల్కె నిట్లయో
ధ్యావర యేను వాసవుఁడ • నాశ్రితపోషకుఁడన్ మహేంద్రుఁడన్.

క॥ నీయెడఁ గరుణించితి భవదీయ మనోరథ మదెట్టి • దెలిగింపు జగ
ద్గేయమయి చెలఁగుఁగాదె నీ యొనరించెడి తపంబు • నృపకుల చంద్రా!

చ॥ అనుటయు నంబరీషుఁడను • నాకు హనామరవల్లభున్ గనుం
గొని సురనాథ యేను నిను • గూర్చి తపంబొనరింపఁ బూనలే
దనయము నీ ప్రసాదమున • నయ్యెడు కార్యము లేదు నాకు నీ
వనఘుఁడవౌటఁ బూజఁగొని • యాగ్రహ మొందక యేగు మిచ్చటన్.

తే॥ ఎన్ని వేల యుగము • లేని తపముఁ జేయఁ గానరాని నీవ • కారణముగ
నన్నుఁగూర్చి వచ్చుటన్న నబ్బురమగు నమరదేవ నుత మహాప్రభావ.

ఉ॥ ఏను సురాధిపత్యము వ • హించెడు కోర్కె జనింప నివ్విధిన్
మానిసమర్చితాంఘ్రియగు • మాధవుఁగూర్చి తపంబుఁ జేయఁగాఁ
బూనితినంచు సంశయము • బొందితి వేమొ సురేంద్ర యట్టి య
జ్ఞానపథంబు ద్రొక్కుటకు • క్ష్మాపతి సైపఁడటంచు నెంచుమా.

మ॥ అఃపాయంబయి మాని లభ్యమగు బ్ర • హ్మానంద సౌఖ్యంబుఁగూ
ర్చి ననున్ దృప్తుని గాఁగఁ జేయఁగలఁడా • శ్రీనాథుఁ డెల్లప్పుడా
తని పాదంబులె దక్క వేరొకటి చి • త్తంబందు ధ్యానింప నో
యనఘా యేటికిఁ గాలయాపనముఁ జే • యన్ భూనె దిప్పట్టునన్.

క॥ నాకు రుచింపవు నిర్జరలోకసుఖంబైన సత్య • లోకమయిన నా
ళీకాక్షుని సాన్నిధ్యమె ప్రాకటసౌఖ్యం బొసంగు • బహువిధగతులన్.

— • శ్రీవిష్ణు వంబరీషునకుఁ బ్రత్యక్షమగుట • —

క॥ అని యంబరీషుఁ డనుటయు విని సరసిజలోచనుండు • విస్మితుఁడగుచున్
దనరూపం బా నృపతికిఁ గనుపింపఁగఁ జేసెఁ గరము • కనికరమెసఁగన్.

చ॥ కనుఁగొని భూమినేత పరికంపితచిత్తుఁడునై యయత్నసం
జనిత శుభాశ్రుపూరిత వి • శాల విలోచనుఁడుగ బ్రహృష్టరో
మనికర భాసితాంగుఁడయి • మాధవుఁ బంకజపత్రనేత్రుఁ గాం
చనమృదుచేలు నిట్లనుచు • సన్నుతిఁ జేసె నయంబు పెంపునన్.

చ॥ తెలియక తప్పు జేసితిని • దీనుఁడ నాయెడఁ గిన్కఁ జెందకో
జలరుహనేత్ర నీ మహిమ • శక్రముఖామరబృందమేనియున్.
దెలియఁగనేరదన్న నొక • నీచుఁ డెఱుంగునె సృష్టికర్తయా
నలువను గన్నవాఁడవు జ • నార్దనమర్దిత దైత్యసంచయా!

ఉ॥ స్థావరజంగమంబయిన • సర్వజగంబు జనించు నీయెడన్
నీవు సురామరప్రకర • నేతవు నీ కృపచేతఁ గాదె కా
జీవ భవాదినిర్జరులు • సేమమునన్ జరియించుచుందురో
దేవ! రమేశ యాశ్రితుఁడ • దీనుఁడ నేరమి సైఁపుమా యికన్.

మ॥ అరివర్గంబును గెల్వలేక కలిమా • యన్ జిక్కి సంసార సా
గర నిర్మగ్నుఁడనైన నాయెడల సా • కల్యంబుగా నీ కృపన్
బరగింపన్ జనుదెంచినాఁడవని సం • భావింపలేనట్టి దు
శ్చరితుండన్ ననుబ్రోవ వేరు గలరే • సర్వసహామండలిన్.

సీ॥ అనుచుఁ బ్రార్థించిన • నంబరీషునితోడ ననుకంప జనియింప నంబుజాక్షుఁ
డనియె నో జననాథ • యమలమౌ నీభక్తి కెద సంతసంబయ్యె • నెవ్వరేని
నిష్ఠాగరిష్ఠులై • నీవలెఁ దపముఁ జేయరు విఘ్నములనోర్చి • యమరులందుఁ
గూడను నినువంటి • వాఁడు భక్తుఁడు లేఁడు హరిదాసులం దగ్ర • సరుఁడవైతి
వెట్టివాంఛతోడ • నీరీతిగఁ దపంబు నాచరించుచుంటి • వదియొసంగ
నేగుదెంచినాఁడ • నిపుడు కోరుమనుఁడు జనవిభుండు సంత • సమునఁ బలుకు.

మ॥ శ్రితలోకైకశరణ్య నీ చరణముల్ • సేవించు కార్యంబె సం
తతమోదావహమై చెలంగఁగ విప • త్సంతాన బీజంబులౌ
నితరంబుల్ నను భ్రాంతుఁ జేయఁగలవే • హీనాత్ముఁడే నిన్ జగ
త్స్థితు నిన్నున్ గని కాంచునే ధర నెవం • డేనిన్ గలి వ్యాపృతిన్.

క॥ నాకిట్టి వరము వలవదు నీ కరుణ యొకండె దక్క • నీరజనయనా!
పాకారిప్రముఖుల సుశ్లోకులఁ జూచు గతి నన్నుఁ • జూడుము కృపతో.

క॥ హరిదాసులైనవారల గురుతరమగు భక్తితోడఁ • గొలుతు మనమునన్
బరమకృపానిధివగు నీ వరయఁ దదంతర్గతుండ • వై యుండుటచే.

సీ॥ మినువాకతఱగల • మెలఁగెడి రాయంచ రొంపిగుంటల సంచ • రింపగలదె
తొలి నీరదాల్పు చి • న్కులఁద్రాఁగు వానకోయిల యెండమావుల • కేగి మను నె
పొందమ్మి పానకం • బును గ్రోల నుంకించు భసలంబు తుమ్మకం • పల మెలఁగు నె
లలితరసాల ప • ల్లవభక్షణ మొనర్పు పరభృతికోఁ బుకు నె • పచ్చి కసవు

సంతతము తావక పదాంజ • జాతయుగ సమర్చనాభిరతి జరించు • నట్టి నాదు
హృదయ మేరీతి కిల్బిష • హేతుకంబులైన విషయంబులను గోరు • నయ్యదేవ.

చ॥ పరమతబోధనాధ్యులగు • వారలకైనను గోచరింప వీ
శ్వరపద వాచ్యతన్ బరగు • సర్వసమర్థుఁడవీవు నాయెడన్
గరుణ దలిర్ప నివ్విధిని • గన్పడుటే పదివేలు వేరుగా
వరమదియేల నాకు నవ • వారిజలోచన భక్తపోషణా!

క॥ ఐనన్ గరుణాసహితుఁడవైనను గోరుమనిపలికె • తదిగావున నో
దానవహర నీచరణధ్యానపరాయణత నొసఁగు • మా? నిరతంబున్ •

చ॥ నిరతము నీ పదాబ్జముల • నే స్మరియించుచు నెల్ల వైష్ణవో
త్కరము భజించుచున్ శ్రుతి హి • తంబగు పద్ధతి సంచరించుచున్
స్థిరమతి నిన్నుఁగొల్చెడి గ • తిన్, వరమీయఁగదయ్య లోక బం
ధుర మురదానవాంతక ని • నూతన నీరదకల్ప సుందరా!

ఉ॥ తోయజనేత్ర నీవెటుల • నుష్టనివారణదక్షుఁడైన కా
త్యాయని వల్లభున్ గొలుతు • వట్టుల నిన్ను భజింతువాఙ్మనః
కాయములన్ నిరంతర మ • ఖండ కృపామతి నాయెడన్ జగ
ద్గేయుఁడవై వసించి కృత • కృత్యునిగా నొనరింపు సన్నుఁకన్.

క॥ అనుటయు గోవిందుఁడు మనమునఁ గనికర ముప్పతిల్ల • భూపతిఁగని యో
జనపాలచంద్ర నీ కోరిన విధమున నింక నేఁ • జరింతుఁ గడంకన్.

చ॥ దనుజులపాలి మృత్యువు శ్రితప్రకరావనదక్షు మీ సుద
ర్శనము మహానుభావుఁడగు • చంద్రధరుండు కృపాంతరంగుఁడై
నను గొనుమంచు నిచ్చె జన • నాయకభక్తుఁడవీవు నాకుఁ గై
కొనుము శుభాకరంబు రిపు • కుంజర కేసరి దీని నిచ్చెదన్.

సీ॥ ఎట్టి మహారోగ • లేని యీ చక్రము తత్త్వం బెఱుంగ రిం • తయును మనిని
మునిశాపములనైన • వెనుకబడఁగఁజేయు మేఘసంతతిని స • మీరమటుల

దురితజనకృతములైనట్టి మహాపదల్ చెంతఁజేరఁగరావు • సుంతయేని
యఖిలలోకభయంక • రాకారము గలట్టి దారిద్ర్యదేవత • తలఁగిపోవు
సకలవిధరోగబాధల • సమయజేయు ఘోరపాతకములనైనఁ • గూలదన్ను
ధరణినాయక యిది నీక • తెసును దీనిఁ గైకొనుము ఛిద్రములు నీకుఁ • గలుగు నెపుడు.

తే॥ అనుచుఁ జక్రాయుధ మొసంగి • హరి యదృశ్యుఁడైన జననాయకుండు హృ • [ ష్టాత్ముఁడగుచు
భక్తిమీఱఁగ గోవిందు • పాదపద్మముల భజించుచు నిజపురం • బునకుఁ జనియె.

తే॥ మిత్రవర్గంబునందైన • శత్రుసముదయంబునందైనఁగాని య • య్యంబరీషుఁ
డింతయు నధర్మము చెలంగ • నేని వారిఁ దనకు ధర్మంబటంచు దం•డనము జేయు.

వ॥ ఎవఁడు స్వధర్మముల్ విడువ • కెల్లెడలన్ జరియించువాఁడై భూ
ధవునకుఁ బ్రాణతుల్యుఁడుఁ బ్ర • ధానుఁడునౌ నిరతంబు దుష్టుఁడై
యెవఁడు నిజోచిత క్రియల • నేమరుపాటున నేని వీడువాఁ
డవనిపు క్రోధవహ్ని విష • యంబయి నాశమునొందు నెప్పుడున్.

ఉ॥ ఆ నరనాథ ముఖ్యుఁ డఖి • లాశల గెల్చి దిగీశతుల్య ద
న్యూన పరాక్రముండును మ • హోన్నత తేజుఁడునై చెలంగఁగా
మానవులెల్ల నిత్యమును • మాధవగాన విలోలచిత్తులై
శ్రీనిధులై స్వధర్మములఁ • జేయుచు నుండిరి ధర్మబుద్ధితో.

తే॥ ధర్మదేవత నాల్గు పా • దముల నడవ శాంతభావంబు నెలకొల్పి • జగమునందు
న్యాయముగఁ బ్రజ నేలుచు • నంబరీషుఁ డొక్కనాఁ డంతిపురమున•నుండినపుడు.

చ॥ సలలితవాగ్విభూతి నల • శారదఁబోలి వెలుంగుదాని ను
జ్జ్వలతను కాంతిఁ బంకరుహ • నాయకు దేవిని గాదటంచుఁ జె
న్నలరెడు కూఁతుఁగాంచి వసు • ధాధిపుఁ డీమెకుఁ బెండ్లిసేయఁగా
వలనగునీడు వచ్చెనని • భావమునన్ దలపోసె నివ్విధిన్.

తే॥ అన్నివిధముల శ్రీమతి కర్హుఁడైనవాఁడు శ్రీహరి పాదసే • వాపరుండు
వైష్ణవాగ్రసరుండైనవాఁడు ధీరుఁ డెవ్విధిని సంభవించునో • యెఱుఁగరాదు.

చ॥ చతురుఁడు వైష్ణవోత్తముఁడు • సాధిత శాత్రవ లోక వైభవుం
డతుల పరాక్రమాన్వితుఁ డ • హర్పతితేజుఁ డుదాత్తచిత్తుఁ డు
న్నతచరితుండు వందిత జ • నార్దనుఁడై యలరారు నల్లుఁ డే
గతిఁగ లభించు నవ్వయము • గౌరవ మెట్లభివృద్ధియౌ నికన్.

చ॥ తమ తొలిజేసినట్టి సుకృ • తంబును దుష్కృతముల్ ఫలించి స్వ
ర్గమొ నరకంబొ గూర్పగల • కాలము భ్రాంతులునై తపించు ను
త్తములగు తల్లిదండ్రులఁ బ • దంపడి సద్గతి నొందఁజేయ న
ర్హమయగుఁగాదె యెల్లరకు • నాత్మజులన్ దగువారి కిచ్చుటల్.

చ॥ కులముగలట్టివాఁడును న • కుంఠితశౌర్యమువాఁడు ప్రాయముల్
గలిగినవాఁడు చూడఁదగు • కాయముగల్గినవాఁడు విష్ణు భ
క్తులఁ గనుగొన్న గౌరవము • తోడ మెలంగెడువాఁడు శ్రీమతీ
తిలకముఁ బెట్టబట్టగల • ధీరుఁడు నాకు లభించు టెట్లొకో.

తే॥ సోయగమునకుఁ దగినట్టి • శ్రుతము వలయు వానికిన్ దగు కులమును • వర్తన
లేకయుండినఁ గింశుక • లీలనతఁడు గౌరవమునకుఁ బాత్రుండు • గాఁడు జగతి.

—• అంబరీషునికడకు నారదుఁ డరుదెంచుట •—

చ॥ అనుచు ననేకరీతులుగ • నాత్మదలంచుచునున్న యంబరీ
షునికడ కేగుదెంచెఁ బరి • శుభ్ర యశోనిధి నారదుండు మి
ల్లన మహతీస్వరంబున వి • లాసగతిన్ దనకంఠ నాదముల్
జొనిపి మురారిగీతములఁ • జొక్కుచు సోలుచు సంతసంబునన్.

తే॥ అవ్విధంబున నరుదెంచు • నమరమౌని పుంగవునిఁ గాంచి భక్తిసం • పూర్ణుఁడగు
భూధవుం డర్ఘ్యపాద్యాది • పూజనముల నర్హసింహాసనంబున • యందునిలిపి.

క॥ మునిలోకచంద్ర నీదర్శనమున ధన్యుండనైతి • సర్వజ్ఞుఁడ వెం
దునవైన నీ సమానునిఁ గనుగొందునె సకలసుగుణ • గణముల కలిమిన్.

తే॥ కారణములేక మీవంటి • వార లస్మదాదులగృహంబులకు వత్తు • రామహాత్మ!
యినుఁడు తానుదయించుట • యెల్లలోక సౌఖ్యమును గోరుటనుగాదె • సంతతంబు

చ॥ అనుటయు దేవమౌని వసు • ధాధిపుఁ గన్గొని పల్కె నిట్టులో
జనవర యాలకింపు మెక • సక్కెముగాదిది యేను నీకు న
గ్గినగుచు వచ్చినాఁడ భవ • దీయ గృహంబునకీవు దాతవై
నను గృతకృత్యుఁజేసి జన • నాయక ధర్మము నిల్పుమా యికన్.

సీ॥ కామంబు మున్నుగాఁ • గలుగు నంత శ్శత్రువుల కునికిపట్టయి • చెలగుననుచు
తాపత్రయాభీల • దావాగ్నికీలలఁ బరివృతంబగుచును • బరగుననుచు

దరిలేని కలుషసా • గరమునఁ బడఁద్రోఁచి ఘోరమనోవ్యథఁ • గూర్చుననుచు
ననయం బధర్మకా • ర్యనిరతిఁ గల్గించి ప్రవిమలజ్ఞానంబుఁ • బాపుననుచుఁ
బడుచుదనమున దేహంబు • బలము కలిమి రాగమునకుఁ జోటీక వి • రాగినగుచుఁ
బరిణయంబాడఁదగదని • హరిచరణము లాత్మఁగొల్చుచుఁ దిరిగితి • నఖిలదిశల.

వ॥ మఱియు నిల్లాలు కల్లలకుఁ బుట్టినిల్లనియుఁ బుత్రుం డనుకూల శత్రుండనియు, బంధుసంతానంబు కృతాంతాంతేవాసి సందోహంబనియు, మిత్రంబులు సత్ప్రతిష్ట లలితావిత్రంబులనియు, నాలయంబు మహా నరకాలయంబనియు, బాహ్యసౌఖ్యంబులు పరలోకసుఖ నిరాకరణ ముఖ్యంబులనియు సంసారంబసారంబనియుఁ దలంచి గృహస్థాశ్రమ ప్రవేశంబు నిరాకరించి సర్వసన్యాసంబుఁ గావించి కాలీచఁబడ దేశద్రిమ్మరినై.

చ॥ తిరిగితి నెల్లలోకముల • ధీనిధులైన గృహస్థులన్ గరం
బరసితి బ్రహ్మచారుల య • థార్థగతిన్ గనుగొంటి ధారుణీ
శ్వరులను జేరఁబోయితిని • వైష్ణవముఖ్యులఁ గాంచితిన్ జగ
ద్భరణ సమర్థులైన శివ • భక్తుల గన్గొని యాత్మ మెచ్చితిన్.

—• నారదుం డంబరీషునితో గార్హస్థ్య ప్రాముఖ్యంబుగూర్చి చెప్పుట •—

సీ॥ కులవృద్ధులను వయోవృద్ధుల గుణవృద్ధులను గర్వి • తుల శాంతుల దు
ష్టుల శిష్టుల యువకుల రోగుల జోగుల రాగులఁగను • గొంటి మహీశా!
తే॥ ఎవనితో మాటలాడిన • నెవనిపల్కు లాలకించిన నెవ్వాని • గోలఁగనిన
నెవని నడవడిఁజూచిన • నెల్లజగము శక్తిమయమంచు దోఁచెను స్వాంతమందు.

సీ॥ అనుకూలవతియైన • యంగన లేకున్న నంతయు వ్యర్థమా • నను నొకండు
గుణవంతుడగు వాఁడు • కొమరుండు గలుగని యాతండు ఖలుఁడని • యాడు నొకరుఁ
డతిథి సత్కారంబు నాచరింపనివాని తను వేలయని పల్కు • జనుఁ డొకండు
ఇల్లువాకిలి లేక • యెల్లెడఁ దిరుగుట పాపఫలంబని • పల్కు నొకఁడు
ఆశ్రమంబులలో గృహ • స్థాశ్రమంబె ముఖ్యమనుచును వాదించుఁ • బురుషుఁ డొకఁడు
ద్విజనులందు గృహపతి • సాటివాఁడు కలుగునాయని వచియించు ఘనుఁ డొకండు.
తే॥ ఎల్లవారును గార్హస్థ్య • మే ప్రధానమనుచు వాదించు వాక్యంబు • లాలకింప
నా తలంచిన యదియ య • న్యాయమనుచు నిశ్చయంబయ్యె నప్పుడు • నృపలలామ.

ఉ॥ అతిథుల నాదరించుటయు • నాశ్రితవర్గముఁ గావగల్గుటల్
సతతము దేవతార్చనల • సల్పుటయున్ బుధకోటి గౌరవ

స్థితిఁ గనుఁగొంటయున్ వ్రతముఁ • జేయుటయున్ గణియింపఁగ గేహ సం
స్థితునకె యర్హమంచును మ • దిన్ దలపోసితి ధారుణీశ్వరా !

వ॥ మఱియు బ్రహ్మచారియగువానికి స్వీయాశ్రమ ధర్మంబులగు గురుశుశ్రూషయు వేదాధ్యయనాదులును దక్కఁ దక్కిన కృత్యంబు లనర్హంబులనియు, వానప్రస్థునకు స్నానసంధ్యాద్యనుష్ఠానంబులచేతను శివపూజాపరికర సంపాదనంబుచేతను గాలంబు చాలకుంటచే లోకోపకారం బొనర్ప వలనుపడదనియు సన్యాసికిఁ గరతలభిక్షయు గ్రామైక దినవాసిత్వము గాక గృహపతికిన్‌బలె సకలసత్కార్యాచరణ సామర్థ్యంబు చాలదనియుఁ దలంచి నామున్ను చెందిన యభిప్రాయంబు హేయంబుఁగ నిశ్చయించి కుటుంబినై నిరంతర గురుజన శుశ్రూషాదులచేతను భాగవత సాంగత్యంబుచేతను పరోపకార కరణంబుచేతను బధిరాద్యనాథ రక్షణంబుచేతను గాలక్షేపంబు జేయుట యుచితంబని తలంపున నుత్సుకుండనై.

తే॥ కడచె నాకుఁ బెద్ద • కాల మీవయసున నెట్టిదాత కూఁతు • నిచ్చి పెండ్లిఁ
జేయఁగలుగు నెట్టి • చెలియ నా కహహా యనుచుఁ బలువిధముల • నాత్మలోన.

సీ॥ యాచించినను గాని • యలవడ దన్నంబు కాషాయవస్త్రముల్ • గట్టవలయు
నొక యింత చీఁకటి • గిసరించె నేని కానఁగలేవు కనులు సుం • తయును నొరుల
మెల మెల్లగా నడు • గుల నిడుటయె దక్కఁ బరువెత్తఁగలయట్టి • బలములేదు
ఇంతదూరమునుండి • యెంత పిల్చినఁగాని విననేర చెవుడువ • చ్చినకతంబ
చరణములు మొదలుకొని మ • స్తకమువఱకు నొడలు ముడుతలువడి వ్రేలు • చుండె నిట్టి
మూఁడుకాళ్ల ముదుసలికే • పూరుషుండు తనయనిడ నేర్చు సాహసం • బునఁ దలంగి.

తే॥ వృద్ధుఁ డఖిలగుణ వి • శుద్ధుండు కన్యార్థి యనుచు నెవ్వఁడేని • కనికరమునఁ
దనయ నీఁదలంచి • నను వరింతురె కన్య లిట్టివయసు చెల్లి • నట్టివాని.

చ॥ పడుచుదనంబు సత్త్వమును • బ్రజ్ఞయు భాగ్యము గల్గి సాటివా
రడఁగఁగ నెల్లయందునయు • గాంతకృతాంతుఁడునై చరించు నా
తఁడయినఁగాని ప్రౌఢలగు • తామరసాక్షుల క్రూర దృష్టికిన్
వడకుననంగ నింక నను • వంటి తపస్విని జెప్ప నేటికిన్.

తే॥ సత్కుల ప్రసూత • సద్గుణభూయిష్ఠ చారుశీల భర్తృ • చరణలోల
సాధ్వియైనఁగాని • సతతంబు నాతోడఁ జెలఁగి కాపురంబుఁ • జేయదుగద.

తే॥ నా స్థితికిఁదగినట్టి కాం • తాలలామ యెందు దొరకునోకో యని • యెల్లజగము
లను వెదకిచూచితిని కాని • యనఘ యన్నివిధములన్ దగు కన్నెల • భింపదయ్యె.

చ॥ అరయఁగ సత్కులప్రభవ • యైనతలోదరియందు సద్గుణ
స్ఫురణము గానరాదదియుఁ • జొప్పడినన్ శతవృద్ధుఁ డెట్లు మా

తనయకు నెవ్వఁడౌననుచు తల్లియు దండ్రియు కూఁతునీయ నొ—
ప్పరదియుఁగూడినన్ యువతి • భావము నాయెడ నిల్వ దింతయున్.

క॥ నిరుపేదవాఁడు మలినాంబరుఁడున్ జీర్ణాంగుఁ డితఁడు • మన కూఁతున కే
కరణిఁ దగుననుచుఁ గొందఱు నరవర నిరసించిరాత్మ • నా కొక్కి వినన్.

మ॥ అతి వృద్ధుండగువానికిచ్చి మనక • న్యారత్నమున్ బల్మి దు
స్థితి పాల్సేయఁగ నేమి పుట్టె మునిఁగేహ • ధీరుండు వేరొక్కఁడం
చితలావణ్యవయోభిరాముఁడగు ల • క్ష్మీపుత్రుఁ డెందేని యీ
క్షితిలోనన్ గలవయ్యెనే యనుచుఁ గ • ల్కిన్ గూర్చి యొక్కండనున్.

తే॥ మిమ్ము వంటి సుకృతి • యిమ్మెయి జామాత యగుట భాగధేయ • మగును గాని
చిన్నికన్నె పెండ్లి • సేయఁగ నీడు లేదనుచుఁ బల్కె నొక్కఁ • డను నయమున.

సీ॥ ఆత్మజుని వివాహ • మగునంతలోపలఁ దనయకుఁ బెండ్లిసే • యనను నొకరుఁ
డిపుడిప్పుడే యొక్కఁ • డీకన్నె దనకనియనిపించుకొనెనని • యను నొకండు
కన్నెకు మేనరి • కంబున్న దెట్లు నిన్ గౌరవింతునని యొ • క్కరుఁడు పలుకఁ
బెండ్లిసేయునపుడు • పిలిపింతు నిన్నిప్పుడూరకుండుమని • వేరొక్కఁడాడు
వృద్ధునకు నీకుఁ • బరిణయం • బేలయనుచుఁ బలుకు వేగాని యొకఁడును • పట్టినొసఁగు
వాఁడనని గారవించెడి • వాఁడు లేఁడు ధరణి నెచ్చోటనైనా త • లఁపు నెఱిఁగి.

తే॥ వార్ధకంబున నాకిట్టి • వాంఛ గలుగుటయును జగమునయందుఁ గన్నియలు నాకుఁ
దగినవారు లభింపమిఁ • దలఁచి తలఁచి స్వాంతమున ముప్పిరిఁగొను • వంతతోడ.

తే॥ చిన్ననాఁడె పెండ్లిఁజేసికొనిన నిట్టి కష్టములకు లోను • గాకయుందు
వాఁడనే విరక్త • భావంబె యింతటి యిడుమఁగూర్చె నింక • నేమనందు.

చ॥ అనుచుఁ దలంచుచున్నయెడ • నగ్రజుఁడొక్కఁడు గానవచ్చి యో
మునివర యేటికిట్లడరు • పొందెదవాత్మ నయోధ్య నేలువాఁ
డనఘుఁ డుదారచిత్తుఁడు • ధరామర పోషకుఁ డంబరీషుఁ డ
జ్జనపతి నాశ్రయింపుము పొ • సంగెడు పెండ్లియటంచుఁ బల్కినన్.

మ॥ విని శేకెత్తిన సంతసంబు మెయిఁ బృ • థ్వీనాథు నర్చించి మ
ద్ఘనవాంఛన్ దెలియంగఁజేసి పెలుచన్ • క్ష్మానాథు జామాతనౌ
దునటంచున్ దలపోసివచ్చితిని వృ • ద్ధున్ నన్ను ధన్యాత్ముఁగా
నొనరింపన్ గదవయ్య నీకు శుభమౌ • నుర్వీశ నిక్కంబుగన్.

క॥ రామాలలామయగు నా శ్రీమతి నాకొసఁగి పెండ్లి • సేయుము సుగుణ
స్తోమ భవాదృశులేకద ధీమహితులు మమ్మువంటి • దీనులఁ బ్రోవన్.

— పర్వతుఁడను ముని యంబరీషునికడ కరుదెంచుట —

క॥ అనునెడఁ బర్వతుఁడనియెడి మునివరుఁ డొక్కఁడు వచ్చి • భూనాథ కృతా
సనగౌరవంబులకు నెమ్మనమున సంతసమునొంది • మఱి యిట్లనియెన్.

చ॥ జనవర యేను వృద్ధుఁడను • సంతతమున్ హరిపూజ సేయుచే
పనియగువాఁడ నాకు నొక • బాంధవుఁడున్ గనరాఁడు సత్వమా
తనువున జీర్ణమయ్యెను ప • దంబులు తొట్రిలు భూమిపై నిఁకన్
గనులును జూడలేవు కొఱ • గాని మనుష్యుఁడనైతి నక్కటా.

తే॥ పలుకరించిన నోయను • వారు లేరు వలయు నర్థము లొసఁగెడు • వారు లేరు
సర్వమున్ శూన్యమయ్యె నీ • సమయమందు ద్వాదశులుగాక దిక్కేది • మాదృశులకు.

తే॥ యౌవనంబునందు • నన్యుల సాయంబు లేక యున్నఁగాని • లేదు కొఱత
యిట్టి వార్ధకమున • నెట్టిలావరికైనఁ గోరవలయు నింత • వారియండ.

సీ॥ తన కన్నవారయం • దున కన్నఁ బ్రేమచే సతతంబు శుశ్రూష • సలుపుచుండు
నకుటిలాత్మయగుచు • నన్యచింతనవీడి ధవుని దైవంబుగాఁ • దలఁచుచుండుఁ
బిలిచినయపుడెల్ల • బిరబిరఁ జనుదెంచి చేతులు జోడించి • చెంతనిలుచు
తన సౌఖ్యమును వీడి • యును బతిచిత్తంబు స్థిరమగునట్టులఁ • జేయఁబూను
సకలసుగుణాలవాలయౌ • సాధ్వియట్టి కాంత యిట్టి వార్ధకమును • గాంచి చింత
నలజడిన్ జెందువానికిఁ • గలిగెనేని యితరవైభవములు శతం • బేనియేల?

తే॥ అనుచు సాధ్వియైన • యబలాలలామంబుఁ బెండ్లియాడఁ గోరి • పేర్మితోడ
నెవఁడు నాకు గన్నె • నీయగలఁడని యెల్లగేస్తులకడ • కేగియిపుడు.

క॥ కులదీపయైన శ్రీమతి లలిత గుణవతంసమనుచు • లావణ్యమునన్
జెలఁగెడినదియని మదిలోఁ దలఁచుచు నరుదెంచినాఁడ • ధరణీనాథా!

క॥ హరిభక్తుఁడఁ బరమతపస్స్ఫురణన్ బ్రహ్మాది నిఖిల • సురలైనఁ గరం
బరుదంద మెలఁగువాఁడను నరవర నీ కన్నకూఁతు • నాకీయఁగదే.

చ॥ అన విని భీతచిత్తుఁడయి • యన్నరనాథుఁ డిదేమి వింతయౌ
మునిజనమేడ నంతిపుర • మున్ విడనాడక సంతతంబు కాం
చనమణి డోలికాతతుల • సౌఖ్యము నొందెడు రాచకన్నెలన్
మునుకొని పెండ్లియాడు తలఁ • పున్ గొనుటేడ యెఱుంగరాదహో.

మ॥ చతురంబోధిపరీతమై యలరు నీ • సర్వంసహామండల
స్థితికిన్ గారకుఁడై యవార్య జయల • క్ష్మీశోభితాంగుండునై

సతత శ్రీధవ పాదపంకజ సమ • ర్చాలోలుఁడైనట్టి భూ
పతికేయఁగాఁదగు రాచకన్నె ముని కె • వ్వండేని యీనొప్పునే.

సీ॥ స్వచ్ఛమౌదర్పణ • ప్రతిబింబ మేరీతి నవసరింబగునో జా • త్యంధున కిల
నాహ్లాదకరమగు • నట్టి వీణాధ్వని చరితార్థమగునె బ • ధిరునియందు
దుర్గమారణ్యమం • దున ఫలించెడి చూతఫలమున కింతయుఁ • గలదె ఘనత
పరునకు భీతిలి • దురమున నిలువనివాని కేటికి ధను • ర్బాణము లిల

బుట్టగోఁచులసామిగ్రై • పుడమి నెల్లఁ దిరుగుచిలువాకిలియు లేక • దీనుఁడైన
జోగి కేటికి సంతతి • భోగభాగ్యసంతతుల నలరారెడి • సరసిజాక్షి.

సీ॥ గోఁచిగుడ్డయె లేక • గొణగు సన్యాసికిఁ గోలి యయ్యోనె యెక్క • కోమలాంగి
తిన నన్నమే లేక • దీనతఁ జరలాడు ముసలికి వలయునే • బిసరుహాక్షి
తనువెల్ల నెరసి యెం • తయుఁ గృశించెడి పేద కిందులకో యర • విందనయన
యీషణత్రయము జ • యించి మోక్షముఁ గోరఁదగువాని కేటికో • మగువమిన్న

తివిరి యింద్రియములను బం • ధింపలేక పరులబిడ్డ గదా యంచు • బలిమిఁ గొనఁగఁ
దలఁచుట యెగాక సౌఖ్యంబు • గలుగఁగలదె వార్ధకంబున బరిణయ • వాంఛవలన.

తే॥ పరులసుతయటంచు • భావించి బిరబిర నరుగుదెంచి యిట్టు • లడుగ సాహ
సించినారెకాని • శ్రీమతి కహుళాలమా యటంచుఁ దలఁప • వైరి వీరు.

తే॥ ఎవ్వరేని యిట్టు • లే యసర్వాలు పుత్రి నిమ్మటంచు నడిగి • రేని యెట్టి
వంత గుందువారో • పర్వతుండును నారదుండుఁ దలఁపరేల • చండులగుచు.

వ॥ దేశకాల పాత్రంబులరసి తమకూఁతుల నితరుల కొసంగుట గృహస్థధర్మంబుగదా యని తలంచి వృద్ధులని వెనుకాడక శ్రీమతిని వీరికొసంగ నిశ్చయింతునేని యీ యిరువురయం దెవ్వరికిచ్చు టుచితంబగునో యెఱుంగరాదు ఒక్కకాంత నిరువురు పురుషులు పరిణయంబగుట ధర్మదూష్యంబుగదా! ఇట్టి సందిగ్ధసమయంబున నిది కర్తవ్యంబని నాశ్రేయంబుఁ గోరి యుపదేశంబు గావించు నుపకారమతు లెవరు? లోకంబునఁ గూఁతులు గన్నవారి పడు నవస్థ దుర్భరంబని నేఁడు నా కనుభవంబయ్యె నని విచారంపడు నవసరంబున నారదుఁడు పర్వతునిఁ గాంచి యిట్లనియె.

ఉ॥ నీవు జగత్ప్రసిద్ధుఁడవు • నిష్ఠమెయిన్ హరి పాదపద్మముల్
సేవ యొనర్చువాఁడవు వి • శిష్టగుణుండవు నీకుఁ జెల్లునే
యీవిధి నొక్క మానివరుఁ • డెంతయు నుత్సుక వృత్తిఁ గోరరా
జీవదళాక్షి నిమ్మనుట • శ్రేయమె దాతకునైన నిచ్చుటల్.

తే॥ ఒకఁడు కామించినట్టి ప • యోజనేత్రఁ గోరుటయుఁ బరకాంతను గోరుటయును
గలుష కారణములటంచుఁ • దెలిసియిటుల నా మనోహారిఁ గోరుట • న్యాయమగునే.

తే॥ నీకు వలయునన్న • లోకంబునం దనివాహితలయినట్టి • వారులేరె
నియతయైన సాధ్వి నే చెట్టబట్టెదు ఘనక్రియేల నీకు • బుధవరేణ్య!

శా॥ కైలాసాచలమో వికుంఠపురమో • కాకున్న గంగాసరి
త్కూలంబో తగ నాశ్రయించి మదిలో • గోవిందు నర్చించుచున్
సాలోక్యంబగు ముక్తిఁ గైకొనక సంసారంబునే గోరుచున్
స్త్రీలోలత్వముఁ జెందెదేమిటికి దు • శ్శీలంబె పాటించుచున్.

చ॥ అనుటయుఁ బర్వతుండను ధ • రాధిప వింటివె యీతఁ డెవ్విధం
బున వచియింపసాగెడినో • ముందుగఁ దా నరుదెంచినంతమా
త్రన భవదీయపుత్రి తన • దాగయె యౌనట నేను దానిఁ గో
రినఁ గలుషంబు గల్గునట • శ్రేయము గాదట నీకు నిచ్చుటల్.

తే॥ తానుగోరినంతఁ • దన పత్ని యగునేని దేశదిమ్మరి యయి • తివుర కెల్ల
వారి సుతల నితఁడు • గోరెఁగదా వారలెల్ల రితని కాంత • లే యగుదురే.

శా॥ స్త్రీలోలత్వముఁ జెందెనేలయని యా • క్షేపింపఁగా నేర్చువాఁ
డేలా నీసుత నిమ్మటంచడుగఁగా • నిచ్చోటికేతెంచె భూ
పాలా యెవ్వఁడయేని ధర్మమును జె • ప్పంబూను నాతండుఁ దా
చ్ఛీలుండై చరియింపఁగావలదె త • చ్ఛ్రేయంబె ధర్మంబొకో.

తే॥ నీకు వలయునన్న లోకంబునం దనివాహితలుగలరని • పల్కినాఁడు
తనకుఁ గనికరమునఁ • దనయనిచ్చెదువాఁడు గలుగఁడే మొ యేమి • కారణంబో.

తే॥ ఇతనితో నాకుఁ బనియేమి • క్షితితలేశ యేను కన్యార్థినై యాశ్రయించితి నిను
నీకు దయగల్గునేని లో • కైకదీపరయైన శ్రీమతినిడుము కా • దేని చనెద.

చ॥ అనవిని యంబరీషుఁడను • నాగమ వేత్తలు సద్గుణాఢ్యులౌ
ఘనులగు మీర లిట్టుల న • కారణముల్ గలహించుటేల యెం
దునయినఁ గాని ధాత్రి నొక • తొయ్యలి నిర్వురు బెండ్లియాడుటల్
ననుగొనినారమే కలుష • కారణమాపని సేయు ట్వర మే.

క॥ ఇరువురు కన్యార్థుల కొక తరుణీజనకుండు తాను • దాతయగుటయె
క్కరణి సమకూరునో లోనరసిన మీ కెఱుఁగరాదె • యార్యులు మీరల్.

చ॥ అతుల తపోధనాఢ్యులు మ • హాత్ము లగణ్యులు సర్వలోక స
మ్మతచరితుల్ ప్రశాంతులు ర • మాధవు భక్తులు మీర లిర్వురున్
మతిఁ దలఁపంగ నాకును స • మానులె కావున నేరికిత్తు నం
చిత సుగుణాభిరామయగు • చేడియ నొక్కతెఁ దోఁచ దింతయున్.

తే॥ మీకు సమ్మతమగునేని • మీరు గేస్తులయ్యెడి నుపాయమెఱిఁగింతు • నాలకింపు
డొక్కనికి సుతనిచ్చి వే • రొకని కర్థమిత్తు నెందేని చనుఁ డింక • నింతికొఱకు

ఉ॥ ఈ మరియాదమీకు హిత • మేని సరోజదళాక్షిరైన మా
శ్రీమతి నిశ్చలంబయిన చి • త్తమునన్ మిముఁగాంచి యెవ్వనిన్
దా నుదిఁగోరు వానికిఁ • దథ్యము నా సుతనిత్తు నెల్లిరం
డో మహనీయులార తమ • కున్నతమై తగునట్టిరీతిగన్.

తే॥ అనినసట్లకాక • యనుచు నుత్కంఠమై నరిగిర మ్మునీంద్రు • లపుడు దేవ
మునియు విష్ణులోక • మునకేగి హరిఁగాంచి వినమితాంగుఁడగుచు • ననియెనిటుల.

సీ॥ జలజాయతాక్ష నీ • శరణుఁజొచ్చితి నిదె రక్షింపు మాశ్రిత • త్రాత రక్ష
యిందిరానాథ • నీయందె భారమిడితి వభయంబొసంగుమా • యారిశమన
శ్రీవత్సలాంఛన • చేరితి నీయందఁ గరుణింపుమా దైత్య • గర్వహరణ
పాలితలోక నీ • పాలఁబడితి భక్తు సైరింపుమా బల • వైరివినుత
యాదిమధ్యాంతరహిత వే • దాంతవేద్య సత్యశమదమాద్యఖిల • సద్గుణాఢ్య
నిర్వికల్ప నిరంజన • నిఖిలలోకరక్షకా దుష్టశిక్షకా • దక్షకృష్ణ.

క॥ అని ప్రార్థించి మఱియు నిట్లను నోజగదీశ వైష్ణ • వాగ్రేసరుఁడున్
ఘనుఁ డంబరీషుఁడనియెడి జనపాలుఁ డయోధ్యనేలు • సజ్జనుతుఁడై.

క॥ ఆ మానవేంద్రు పుత్రిక శ్రీమతి నాఁబరఁగు సతి య • శేషగుణగణో
ద్దామ లలనాలలామ నిరామయ విని మోహపరవ • శాంగుఁడ నగుచున్.

చ॥ జనపతిచెంతకున్ జని ప్ర • శాంతమనస్కుఁడునైన యంబరీ
షునిఁగని వేడ్కతోడను య • శోధన శ్రీమతి నాకొసంగవే
యని వచియించుచుండఁగ మ • హాత్ముఁడు పర్వతుఁ డేగుదెంచి వ
చ్చినపనిఁ దెల్పుచుం ననిన • శ్రీమతినిమ్ము నిపల్కె నాతఁడున్.

చ॥ అదివిని భూమినాథుఁడను • నార్యులు ధర్మమెఱింగినట్టి మీ
కద యతనిట్లు గోరఁదగు • నా సుతయొక్కతె నాకు నిర్వురన్
బడపడి గారవింపఁదగు • పద్ధతి యెద్దియొ తోఁచదిర్వురన్
మదవతి యొత్తున్ గైకొనుట • మానుషధర్మమె యెంచి చూడఁగన్.

క॥ కావున మీ యిరువురయందే వానిని నాదు పుత్రి • హృదయంబున సం
భావించువాని కిచ్చెద నో విప్రకులార యంచు • నుర్వీశుఁడనున్.

తే॥ అందులకు సమ్మతించితి • మతఁడు నేను బర్వతుండు నాకన్న లా • వణ్యయుక్తఁ
దేను వికృతాంగుఁడను గాన • నీసుతనయ నన్నుఁ జేపట్టునో లేదో నాగశయన.

చ॥ సతతము నీ పదాబ్జముల • సన్నుతిఁ జేసెడి నాయెడన్ గృపా
యుతుఁడవె యౌదు వేని సుగు • ణోజ్జ్వల యా లలితాంగి నన్నె స
మ్మతమునఁ గోరునట్లు యస • మాన కళాన్వితుఁడైనవాఁడు ప
ర్వతుఁడు వలీముఖాకృతిని • భామినికిన్ గనుపట్టునట్లుగాన్.

క॥ చేయుదు వేని యతనిఁగని తోయలి వికృతాంగుఁడనుచు • దూషించి మదిన్
నాయెడనె ప్రీతిగను నాప్యాయనమగు నాదు నేగృ • హస్థుఁడనగుదున్.

క॥ గోపీకంఠాశ్లేష వ్యాపారపరాయణా ద • యాన్వితుఁడవు నా
కీపాటి సాయమైనన్ దాపము చల్లారు నేను • ధన్యుడనగుదున్.

తే॥ అనిన దరహసితాననుం • డగుచు వెన్నుఁ డితని కేటికిఁ బరిణయ • మేల యాతఁ
డలఘుఁ బర్వతువంచింపఁ • దలచినాఁడు భళిర కాలంబు వక్రతఁ • బలుకఁదగునె

చ॥ ఇదియొక యబ్బురంబె యగు • నేల మహర్షికి మనోరథంబు మా
న్పదలఁచు టట్లుకాక యని • పల్కెదఁగాక యటంచు నెంచి నా
రదుఁ దరుణీగతాత్మ నను • రక్తవిలోలునిఁ గాంచిపల్కె నీ
మదిని దలంచినట్లె యగు • మానికులాగ్రణియంచు నవ్వుచున్.

వ॥ పిమ్మట నారదుండు తన్ను ధన్యునిగా నెంచి శ్రీమతీసమాలింగనసౌఖ్యంబు నేటికిఁ గదా సంభవించెనని యుప్పొంగుచు నయోధ్యాపురంబున కరిగె. పర్వతుండును శ్రీమతీ పాణిగ్రహణంబు సంశయగ్రస్తంబగుడు గోవిందునికడకరిగి జరిగినయుదంతంబు వక్కాణించి నారదుండు గోలాంగూల ముఖుండగునట్లు యొనరింపుమని ప్రార్థించిన నారాయణుండు సమ్మతించె. అంతఁ బర్వతుండు శ్రీమతీదేవి తన యర్థాంగంబె యగునని యుబ్బుచు భూనాథునికడకరిగె నంత.

సీ॥ తెల్లగా నుడికిన • నల్లంచుదోవతి బిరబిక నడుమున • బిగియగట్టి
చాలకాలమునుండి • సంతరించిన చిన్ని వలిపెదుప్పటి వల్లె • వాటువేసి
యోగపట్టంబుతో • జోగంబయిన బ్రహ్మచారి జందెములు వ • క్షమునఁదాల్చి
యిరువంకలందుఁ జె • దరిపడ్డ గడ్డంబు నుదురుగా సవరించి • కూర్చికట్టి

బొమల నడుమను గుంకుమ • బొట్టుబెట్టి శ్రీమతీదేవి నన్నె వ • రించుననుచు
నొక్కరొక్కరుఁ దలఁచుచు • నుచితరీతిఁ బరిణయోచిత వేష • సంభరితులైన
పర్వతుని నారదునిఁ గాంచి పార్థివుండు.

క॥ మీరలు పెండ్లికొమరులు సుదారులుసదసద్వివేక • ధౌరేయులు మీ
కారయే నేదాతనగుట ధారుణినావంగడంబు • ధన్యంబయ్యెన్.

తే॥ అనియె శ్రీమతీదేవి మి • మ్మర్థిఁగోరి వచ్చుచున్నది పరిణయ • వాంఛఁజేసి
నిశ్చలాత్ములగై యుండు • నిలుఁడు మీర లెవనిఁగోరిన వారల • కిత్తు సుతను.

క॥ అనునంతలోన దాసీజన మిరువంకలను గొల్వ • సర్వాభరణ
ప్రణతాంగయగుచు శ్రీమతి చనుదెంచెను భూమినాథు • సన్నిధి కపుడున్.

చ॥ కనుగొని యంబరీషుఁ డొడి • కంబున శ్రీమతితోడఁ బల్కె నో
తనయ సురర్షిగా పుంగవులు • తథ్యము వీరలు కౌతుకంబునన్
నినువరియింపవచ్చిరి మ • నీష నెవానినిఁ గోరుకొందు వా
యనఘుని చేయిఁబట్టుకొను • మమ్మ సలంబుపవిత్రమై తగన్.

ఉ॥ ఆ సమయంబునన్ నరవ • రాత్మజ కమ్మనితావులీను మే
ల్పూసర మొండు కేలఁగొని • బుద్ధివికాస మెలర్ప నాత్మ ను
ల్లాసముతోడ..నీమెనను • లాలితరూపుని గారవింపఁ గై
సేసిన''దంచు నెంచు ముని • శేఖరులన్ గని సాధ్వసంబునన్

చ॥ మునివరు లిద్ధతేజులు న • మోఘచరిత్రులు వీర లిర్వురన్
గనుగొని నీకు యోగ్యుఁడగు • గౌరవపాత్రుని చెట్టబట్టు మం
చనియెను దండ్రి వీరిఁగన • నద్భుతమయ్యెడు వీరు మానులు లే
నను బరిహాసపాత్రఁగ నొ • నర్పఁగవచ్చినవారు గాకిటన్.

తే॥ మాను లిరువురంచు • మాతండ్రి చెప్పె వానరులఁ బోలియున్న • యిరువురికును
నడుమ నొక్కరుండు•పడుచువాఁడగపడు నహహ యిదియుఁ గపట•మగునొయేమొ.

చ॥ అని వికృతాంగులై తగు మ • హర్షులఁ గన్గొని భీతచిత్తయై
యనిలము సోఁకి తల్లడిలు • నట్టి లతంబలె చంచలాంగయై
కనుగొనలందు నశ్రువులు • గాఱఁగఁ నూరకయున్న పుత్రికన్
గనుగొని భూమినాథుఁ డను • కంపను దగ్గరఁజేరి యిట్లనున్.

ఉ॥ ఏమిటికిట్లు భీతిలెద • నీ మునివర్యులయం దెవానినే
నీమది కిష్టుఁడైన ఘను • నిన్ వరియింపుము వీరుగాక వే
శేమహితాత్ములైనను గ్ర • హించుట నోపముగల్గదే గుణో
ద్ధాములు వీరలందొకఁడు • తప్పక నీకు మనోహరుండగున్.

క॥ జనపతిపల్కుల విని యవ్వనితామణి చంచలించి • పలుకు నిటుల నో
జనక యిదియేమి వీరలు వనచరుల విధంబు గాన • వత్తురు చూడన్.

క॥ వీరిరువురకును నడుమను ధీరోదాత్తుండు విమల • ధీయుతుఁడు మహో
దారుఁడు కనుపట్టెడు శృంగార శరీరుం డదేమి • కారణమొకొ గదా?

తే॥ ఒకఁడు వానరాంగుఁ • డొకఁడు గోలాంగూలవదనుఁ డిట్టివారి • పరిణయంబుఁ
జేయుటెట్లొ మాని • శేఖరులని నన్ను పిలిచినావు కాదె • పెండ్లికొఱకు.

తే॥ మానివరుల యేని • మానక వీరల గోరవచ్చుఁగాని • క్రోఁతులట్ల
గానఁబడుచునుండఁ • గానెట్లు వీరల గౌరవింపఁగలను • కరముబట్టి.

సీ॥ నీలజీమూత స • న్నిభశరీరమువాఁడు తతపద్మపత్ర నేత్ర • ములవాఁడు
విపులవక్షమువాఁడు • వివిధరత్నప్రభాకలితాభరణ సముజ్జ్వలశరీరుఁ
డాజానుబాహుఁ డ • వ్యక్తమధ్యమువాఁడు నమచాపభ్రూయు • గాంచియుండు
జాంబూనదాంబర • చ్ఛన్నదేహమువాఁడు కమనీయకుంద దం • తములవాఁడు

ఊనషోడశ వార్షికుం • డున్నతుండు చూడఁదగువాఁడు భువనైక • సుందరుండు
వీరలిరువురనడుమను • జేరినాఁడు వానిపై నాదు చిత్తంబు • బారునిపుడు.

చ॥ అనినృపపుత్రిపల్కవిని • యచ్చెరువంది మునీంద్రులో వరా
నన యిదియేటిమాట మము • నమ్మవె మానులమేము గామెఱై
ననుమతి వేఱొకండిటఁ న • నర్చెడునంచు వచించుచుంటి వా
తనికిఁ గరంబులెన్నియొ యె • దఁగ గలదెద్దివచింపు నావుడున్

చ॥ తరుణివచించెనివ్విధి స్మి • తప్రభచే నలరారు మోమునన్
సురమునులార మీనడుమఁ • జూడఁగనౌ పురుషుండు హస్తపం
కరుహములందు బాణములుఁ • గార్ముకమున్ ధరియించినాఁడు భా
సురమగు వక్షమందునఁ బ్ర • సూనఁపుమాలికఁ బూనినాఁడొగిన్.

తే॥ బాహుయుగముగ లాఁడు శు • భ్రభుజలదాభ మైనదేహమువాఁడు స్మి • తాననుండు
పొగడఁదగువాఁడు తగినట్టి • పొలుపువాఁడు నిర్మలాకారుఁడగువాఁడు • నిర్జరుండు

క॥ అదివిని పర్వత నారదు లదరిపడి యిదేమివింత • యబ్జనయనుఁడీ
యదనున మముపంచింపఁగ నెదఁ దలఁచినవాఁడెయయ్యొ • నేమనవలయున్.

క॥ మాయెడలనె యివ్విధి నన్యాయముఁగావింపఁబూనె • నామాధవునిన్
మాయావియనెడు మాటయె న్యాయంబని తోఁచెనిప్పడాత్మఁ దలంపన్.

చ॥ పరసతులన్ దలంచుటయె • పాపమటంచుఁ దలంపకింతయున్
స్మరశరతాడనంబులకు • స్వాంతము కంపమునొందఁ గోపసుం
దరులనుగూడి త్రిమ్మరు చ • నారతమున్ జలకేగి వారికాఁ
పురములఁదీయు తస్కరుని • బుద్ధి కధర్మ మొకండుగల్గునే.

తే॥ నిర్మలాంగులమగుమాకు • నీచమైన వికృతరూపంబుఁగల్గించి • వెలఁదికాత్మ
మాయెడ ననూయగలిగెడి • మాడ్కిఁజేసె విశ్వసింపంగదగునొకో • వెన్నునింక.

తే॥ అనుచుఁదలచుచుండ • నంబరీషుఁడువారిఁ గాంచి మీకుఁదగునె • ఘనులుమీర
లిట్టిమాయఁదాల్ప • నేమికతముమిమ్ము నమ్మియున్నయట్టి • నాయెడలను.

వ॥ అనిపలికిన నారదపర్వతకులాగ్రహంబున నంబరీషుని గాంచి యిట్లనిరి.

తే॥ దేశద్రిమ్మరులయి • తిప్పకాయలయిన యిట్టివారికేల • యింతినిడుట
యనుచుఁదలఁచినావె • యాదరంబేలేక మాయఁబూనినావు • మాయెడలను.

తే॥ ఔరకన్యార్థులైవచ్చి • నట్టివారి గౌరవించుటమాని యి • క్కఱణిమదిని
బరిభవింపఁగ దలఁచుట • పాడియగునె తప్పునేమాకు సుతనీక • ధరణినాథ.

—• శ్రీమతి విష్ణువు పాణిగ్రహణము జేయుట. •—

ఉ॥ శ్రీమతియట్లు వారలు వ • చించుటఁ గన్గొని దీర్ఘబాహుఁడు
ద్దామపరాక్రమాన్వితుఁడు • దారుఁడు పంకజపత్రలోచనుం
డామునిమధ్య సంగతు మ • హాత్మునిగాఁ దలపోసి యాతనిన్
బ్రేమ పురస్సరంబుగ వ • రించి కరంబుగ్రహించె వేడుకన్.

ఉ॥ అంతట భక్తపోషకుఁడ • హాస్వతితేజుఁడతండు శ్రీమతీ
కాంత కరాంబుజాతమును • గైకొనియేగ నదృశ్యుఁడై వెసన్
భ్రాంతివహించె భూపతియుఁ • బట్టినిగానక యప్పుడొక్కఁడు
ర్దాంతనినాద ముప్పతిలెఁ • దద్దయు లోకములెల్ల భీతిలన్.

వ॥ అదియుగాక యానినదంబుతోడన నిట్లు విననయ్యె.

తే॥ పూర్వజన్మంబునన్ రాజ • పుత్రి యోర్తున్ హరినిగూర్చి తపముజేసి • నంబరీషు
పట్టియైపుట్టి యిప్పుడ • ప్పద్మనయను పత్నియైయేగె జగములు • ప్రస్తుతింప.

చ॥ అపరిచితుం డొకండు వసుధాధిపుపుత్రి పరిగ్రహించుటన్
గుపితమనస్కులై యపుడ • కుంఠిత విక్రముఁగాంచి పల్కిరో
నృపసుత నిత్తునంచు మము • నేర్పునబల్కి పరాభవించితే
కపటముఁబూని తత్ఫలముఁ • గాంచెదుగాక యటంచు నుగ్రులై.

తే॥ అనుభవింపఁగఁ దప్పద • య్యాజనకైన మౌనిశాపంబు సామాన్య • మౌనె నీదు
కండకావరమడఁగెడు • కరణిఁదమము నిను బరాభూతుఁగావించు • నిక్కమిదియె.

తే॥ అనుచు మానులు శపియింప • నంబరీషుఁ డక్కటా యిట్టియన్యాయ • మవనిఁగలదె
యీతజని నీవుగాక ది • క్కెవ్వరనుచు విష్ణుస్మరియించె దుర్జన • జిష్ణుఁగృష్ణు

వ॥ అట్లు మునిశాపభీతి నంబరీషుఁడు స్వాంతంబున గోవిందు ధ్యానంబు గావించినంత.

చ॥ ప్రళయ కృశానుకీలముల • భాతిదిగంతములన్ దహించు ని
ప్పులఁ గురియించుచున్ గుటిల • భూధర పక్షవిభేదనక్రియో
జ్జ్వలమగు వజ్రమందుఁబలె • వాడిమయూఖము లుప్పరంబుగ
ప్పలలిబయల్వెడెన్ సకల • వైరివినాశక చక్రమయ్యెడన్.

తే॥ అటులబయలు వెడలి • యవ్విష్ణుచక్రంబు తమము తోడరాఁగ • నమరమునుల
వెంబడించిచనియె భీతులైవారెల్ల దెసలఁబారఁబ్రోచు • దిక్కెలేమి?

మ॥ బలగర్వోద్ధతుఁడొక్క భూధవుఁడు కా • పట్యంబునన్ మాయెడన్
గలుషాత్ముండయి కూఁతునీయకరియె చ • క్రంబున్ బ్రయోగించి సా
ధుల హింసించుచునున్నవాఁడు దయలే • దో దిక్పతుల్ మీకిఁకన్
గలరో లేరో త్రిమూర్తులార్తజనర • క్షాదక్షులో వారలన్.

చ॥ పెలుచదవానలంబుఁ బలె • వెంటనెవచ్చు సుదర్శనంబుజ్వా
లల కినుమంతసైఁపఁగల • లావునులేక మునీంద్రులున్ గరం
బలజడినొంది యవ్విధి సు • రాసురలోకములెల్లఁబారి చం
చంచలమతులై జనార్దనుని • సన్నిధికిన్ జనిరెట్టకేలకున్.

వ॥ అట్లుజని సుదర్శనబాధా కంపితాంగులును వినమితోత్తమాంగులునునై.

తే॥ "దేవదేవ మహాదేవ • దీనపోష భక్తమందార పాహిమాం • పాహి" యనుచు
బిట్టుమొఱగుచు గోవిందు • విమలపాద జలజయుగము పయింబడి • సన్నుతింప.

చ॥ కనుగొని భక్తవత్సలుఁడు • కైటభవైరి యిదేమి యెన్నడున్
గనుగొన నాగదీనులయి • కన్పడుచుంటిరి మిమ్ము నిప్పు డి
ట్లొనరిచినట్టి వాఁడెవఁడు • యోగులు భోగపరాఙ్ముఖుల్ మహా
మునులరు మీరు పామరులు • వోలె విచారము నొందుటొప్పునే.

తే॥ రక్కసుండో కల్లు • ద్రావి యొడలెఱుఁగ కుండువాఁడో యిట్టి • దుండగంబు
లాచరించినట్టి • యాతండు తెలుపుఁడు సాధ్వసంబువీడి • స్వాంతమందు

చ॥ జలజదళాక్షుఁడవ్విధిని • శాంతవచస్సుల నాదరింప ను
మ్మలికము కొంతవీడి సుర • మానులు పల్కిరి దీనరక్షకా
కలఁడొకఁ డంబరీషుఁడను • క్ష్మాపతి యాతఁడు నీకుభక్తుఁడై
యలరుచు నుండియున్ గలుష • మన్న భయంబును జెందఁ డింతయున్.

తే॥ అతనిపుత్రిక శ్రీమతి • యనెడుదాని మాకొసంగుమంచుఁ బలికిన • మాయయగుచు
మమ్ము వధియించు కొఱకుఁజ • క్రమ్ము వైఁచె వచ్చుచున్నదదియె యని • వార్యమగుచు

క॥ ఈయాపత్సమయంబున మాయెడఁ గరుణింపవేని • మాధవ మాక
న్యాయంబు సంభవించుఁ ద్వదీయులమయిన భక్తులకు సు • ధీ జనవినుతా!

తే॥ ఒక్కప్రక్కఁ జక్ర • మొకవంకఁ దమము సైఁపంగ నేరమయ్య • వాసుదేవ
వైష్ణవుండె మునుల • పాలిటి మిత్త్రయై • యతిశయింపనెవ్వ • రయ్యదిక్కు

మ॥ అనుచున్ దైన్యము వోఁపఁ బల్కువిని దై • త్యారాతి లేనవ్వు మో
ము నలంకారము జేయఁగాఁ బలుకు మి • మ్మున్ గూర్చి యైక్ష్వాకుఁడా
జననాథుండిక లేదు చక్రమును మీ • కాంపదె మీకీ సుద
ర్శన బాధ గలిగించె దీనికొఱకై • క్ష్మానాథుదూషింతురే?

తే॥ తొల్లి యొకనాఁడు ధారుణీ • వల్లభునకు నేను వరము నొసంగితి • నెవ్వరేని
నిను శపించిన యప్పుడు • నను స్మరింపు చక్రమరుదెంచి శాపంబు సమయఁజేయు.

తే॥ "అదియుఁగాక వదాన్యుఁడ • వైన నీకు శాపమిదువారి వెనువెంటఁ జనుచు వారి
కిడుములన్ గూర్చునని" యంటి నిందుకతన మిమ్ము బాధింపవచ్చెఁ జ • క్రమ్ము నిజము.

చ॥ ఘనుల మము మేమటంచుఁ గను • గానక గర్వముతోడ నాచరిం
చిన ఫలమెట్లు దప్పుఁ దమ • చేసిన దానికిఁ దారుగాక క
న్గొనఁ బెరవారు భోక్తలె యు • కుంఠిత విక్రముఁడైన భూధవున్
గనలిన మీకు సౌఖ్యమెటు • గల్గు మిమున్ గరుణింప శక్యమే.

తే॥ ఐన నను రక్షకుని గాఁగ • నాత్మఁదలఁచి వచ్చితిరి గాన మీవంటి • వారిఁ బ్రోఁచు
టవ్రతమయ్యెడుఁ గాని యి • య్యదను నందుఁ గనికరింపఁగనేరని • క్కట్లు బాపి.

సీ॥ ఇక్ష్వాకువంశమం దగ్రగణ్యుండైన యంబరీషుని కుల • మందు నింక
జనియింపఁగలఁడు రా • జన్యవతంసుండు దశరథుండనెడు వ • దాన్యుఁడొకరుఁ
డతనికి గారాబు • సుతుఁడవై జనియింతు భరతుండు నాఁగమ • ద్వామభుజము
జనియించు శత్రుఘ్నుఁ • డనసవ్య బాహువు గలుగు శేషుండు ల • క్ష్మణుఁడనంగ

నొప్పు నందాఁక మీరిది • యోర్చియపుడు రండు నాకడకీ సుద • ర్శనము బాధఁ
దొలఁగఁ జేయుదు మీకని • పలుకుటయును మానులిట్లని నుడివిరి • మ్మాధవునకు.

మ॥ ఘనుఁడా పంక్తిరథుం డికెన్నటికినై • క్ష్వాక్వన్వయంబందున్
జనియింపన్ గలఁ డెంత కాలమునకున్ • సర్వంసహామండలం
బును రక్షింపఁగలట్టి నీవు జననం • బున్ చెందెదందాఁక యో
యనఘా యోపెను బాధకోర్వఁగల మా • యర్తార్తినా శంకరా!

తే॥ ఈవు రక్షకుండ • వీవుండవని నమ్మి వచ్చినట్టివారి • బాధఁ దొలఁగఁ
చేయ కిట్లుబల్కఁ • జెల్లునె పక్షపాతంబు తగునె నీకు • దానవారి.

తే॥ అంబరీషుఁడు నీ భక్తుఁ • డైనకతన మమ్ము బాధించుచున్నను • మనసునందుఁ
గరుణ సుంతయు లేక చ • క్రమును సంహరింపలేనని పల్కెదు • కృష్ణనీవు.

తే॥ తెలిసె నీ రక్షకత్వంబు • దీనులైనవారలను బ్రోవకుండెడు • వాఁడు ఘనుఁడె
చనియెదము పురహరుని ప • జ్జకు నతండు మమ్ము రక్షింపఁడే గిరి • మందిరుండు.

వ॥ శతవృద్ధులగు మేమిట్టి పశ్చిమవయసున వివాహంబుఁ జేసికొనఁదలంచినందులకు ఫలంబు లేకపోవుటయెగాక మీదుమిక్కిలి యిట్టి పరిభావంబునకుఁ బాత్రులమైతి మింకఁజాలు నిదిమొదలు కన్యాపరిగ్రహమనుమాటయే తలంపము మాకు సర్వమంగళాసహితుండగు చంద్రశేఖరుండె రక్షకుండు కాఁగలండు దయామయుండగు వానిని విశ్వసించినవారు సర్వసంపద లందుదురు. త్రిమూర్తులలో నొక్కండవనియు, నీయందఁ జేరిన మాకుఁ జక్రాయుధబాధ నుపసంహరింతువనియుఁ బేరాసనిట కరుదెంచితిమి కాని నీవిట్లాడుదువని యెఱుంగమైతిమని పలికి రజతశైలంబునకరిగి భూతార్థంబు నివేదించిన భవానీమనోహరుండు సుదర్శనంబు నుపసంహరించెనది మొదలు పర్వతనారదు లేకమనస్కులరై శైవులై ప్రసిద్ధిఁగాంచిరని సూతుండు శౌనకాదుల కెఱింగించుటయు నద్దాన నాశ్రమవాసులు సంతుష్టాంతరంగులగుటయు.

మ॥ జగదారాధ్య పదారవింద సుమన • స్స్వాంతాంబుజాటీక స
ర్వగణాధ్యక్ష సనందనాది మునివ • ర్గ ధ్యానసంగోచరా!
నిగమాంతస్తుత భక్తవత్సల సమి • న్నిర్ఛిద్ర సృష్ట్యాదికా
ర్య గరిష్ఠత్రిగుణాత్మకా మధుర మీ • నాక్షీ మనోవల్లభా!

క॥ మునినికరహృదయవికసద్వనజాగ్రచరద్విరేఫ • వందారు మహా
జనకల్ప కల్పవాసవవినుతా సకలావనీశ • వేదాగ్రచరా!

తరళవృత్తము॥

హరివిరించి ముఖామరేంద్ర గ • ణార్చితాంఘ్రిసరోజ భా
స్వర సువర్ణమహీధ్రచాపల • సచ్ఛశాంక కళాధరా!
పురవినాశన భూరిశాసన భోగిరాజ విభూషణా!
గిరిసుతావర సుందరేశ్వర • కృత్తివాస మదీశ్వరా!

తే॥ కష్టపడి పెంచి యిడితి నా • కవితకన్నె నెవ్విధంబున నలరింతొ • యింక నీవు
గంగవోలెను గయ్యాళి • గాదు బేలసుమ్ము నీ తలనెక్కినా • ట్యమ్ము సేయ.

సీ॥ ఏ మహామహుఁడు శ్రీ • వేమనాగాధ్య వంశాబ్ధికిఁ బూర్ణశ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి • కెనయై సతుల్మెచ్చ మహిని బాతివ్రత్య • మహిమఁ గాంచె
నట్టి నందయకు గౌ • రమకు ద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోదరుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మఱి • యమగు శ్రీమదాంధ్రలింగపురాణోత్త • రార్థమందు
నమలమగు పంచమాశ్వాస • మయ్యె దీని సతము రక్షించుఁగావుత • చంద్రమౌళి.

—:o:—

శ్రీ మీనాక్ష్యై నమః

# శ్రీమదాంధ్ర లింగ పురాణము

— • ఉత్తరభాగము • —

## —: షష్ఠాశ్వాసము :—

క॥ కలిమిపడఁతి చెలికానిఁ గలిసి కొడుకుఁగన్న ప్రోడ • కలువలఱేనిఁ
దలపూవుగాఁగఁదాల్చిన వలఁతీతిగ ప్రోళ్ళఁగూల్చు • బలిమికలాఁడా !

తే॥ ఆలకింపుము తపసిఱేం • డ్లందఱెల్ల కతల విన్పించు మొనకానిఁ • గాంచి సంత
సంబు మున్పిరిఁగొనఁగ మె • చ్చఁదగునట్టి పలుకుఁబలికిరి తేనియల్ • జిలుకునటుల.

క॥ పరమపురుషుండు కనకాంబరుఁడు రమావల్లభుండు • మాయకుఁడనుచుఁ
గరమెలుఁగనౌనటుల నన్నరపతి చరితంబుఁ దెల్పి • నావు మహాత్మా!

క॥ పురుషోత్తముడగు నా శ్రీహరి జ్యేష్ఠాదేవి నెట్టు • లవని సృజించెఁ
గరమరుదైయలరెడు నీ చరితము వినిపింపుమయ్య • సౌందర్యగుణాఢ్యా!

### — • జ్యేష్ఠాదేవి చరిత్రము • —

చ॥ అనవిని సూతుఁ డిట్లనియె • నాశ్రమవాసులతోడఁ బద్మలో
చనుఁడు చరాచరంబయిన • జంతుసమూహముఁ బ్రోచు నేర్పువాఁ
డనఘుఁడు నిర్వికల్పుఁడు మ • హాత్ముఁడు వెన్నుఁడు సృష్టిఁజేసె నీ
కనఁబడు లోకసంతతుల • ఖండములై యభివృద్ధి నొందఁగన్.

ఉ॥ ఆవిధి ద్వైధమైన జగ • మంతయు సృష్టియొనర్చి తాను భూ
దేవుల ధర్మసంతతి ను • తిఁదగు వేదములన్ గుణాఢ్యులన్

భావనులైన ధీరులను ◆ బ్రాహ్మణుల లక్ష్మిని బుణ్యమూర్తులన్
గోవిదులైనవారి నొక ◆ కూటముగా నొనరించి పిమ్మటన్.

తే॥ నాస్తికుల వేదబాహ్యుల ◆ న్యాయమార్గ గర్హితుల గర్వితుల నమం◆గళకరయగు
జ్యేష్ఠనొకభాగముగఁజేసి ◆ చెలఁగితాను మధ్యవర్తిగ నుండు ర ◆ మాధవుండు.

తే॥ ధరణి నందఱకన్న ముం ◆ దఱ జనించినదియగుకతన జ్యేష్ఠ పె ◆ ద్దమ్మనాఁగఁ
బరఁగు లక్ష్మియు జ్యేష్ఠక ◆ వరజయగుట నలరుఁ జిన్నమ్మనాఁదగు ◆ నట్టివేర.

ఏవాఁడ ధర్మపద్ధతి భావించి చరించువానిఁ ◆ బాయక జ్యేష్ఠా
దేవి వసియించునాతని కైవసమై సంతతంబు ఘనులు హసింపన్.

అమరులు దానవావళియు ◆ నల్లన వార్నిధిఁ ద్రచ్చువేళ న
య్యమృతముకన్న ముందుగ భ ◆ యంకరమైన హాలాహలంబు సం
భ్రమున జనించెఁ బిమ్మట య ◆ ఘాయధలై సురలెల్లబాగ నీ
యవ యుదయించి జ్యేష్ఠయను ◆ నాఖ్య వహించి చెలంగె దిక్కులన్.

ఆయమ పుట్టిమీఁదన్ శ్రీ యుద్భవమాటయున్ హృ ◆ షీకేశుండా
త్రోయశిని బెట్టబట్టెను జాయఁగ మౌనీంద్రులెల్ల ◆ సంతసమొందన్.

అవనీసురుఁడు దుస్సహాఖ్యుం డొకండు జ్యేష్ఠాదేవిఁగాంచి దు ◆ స్సహ మనోజ
శరబాధితుండయి ◆ సరగ నామెను బెండ్లియాడి స్వాతంత్ర్యంబు ◆ నంతఁ గోలు
పోయి పెద్దమ్మయె ◆ ప్పు డెటులఁజెప్పిన నప్పు డటులఁజేయు ◆ చనుదినంబు
సుంతయేనియు నొక్క ◆ చో నిల్చుభాగ్యంబుగలుగమి మనసులోఁ ◆ గలవరపడి

లలోకములును ◆ సర్వవనంబులు నదులు బర్వతములు ◆ నాక యెల్ల
డెల సంచరించు ◆ చెప్పుడామెకు దాసుఁడగుచునుండె బ్రాహ్మ ◆ ణర్షి వరుఁడు.

హరిఁగూర్చియో పుర ◆ హరుఁగూర్చియో గానమొనరించు భక్తుల ◆ యున్నచోటు
పట్టెవర్ధనములో ◆ భసిత త్రిపుండ్రమో నుదుటఁదాల్చినవారు ◆ మెదలుచోటు
సజ్జనపూజయో ◆ సతతాన్నదానమో సలుపు మహాత్ములు ◆ మెలఁగుచోటు
వేదపారాయణం ◆ బో దేవతాధ్యానమో యొనరించువా ◆ రుండుచోటుఁ

యేని భీతిఁ ◆ గాంచి నేత్రంబులు చెవులుమూసికొనుచు ◆ జ్యేష్ఠముందు
ఁ బరుగులెత్తుఁ ◆ బుడమిసురుండు స్త్రీలోలుఁడైనకతన ◆ లుబ్ధుఁడగుచు.

ఆవిధి నాతఁడు జ్యేష్ఠాదేవిఁగలిసి యెల్లయెడలఁ ◆ దిరుగుచు నొకనాఁ
డావిలమానసుఁడైవని బావనుని మృకండు పుత్రు ◆ బ్రాజ్ఞునిఁగనియెన్.

—◆ మార్కండేయుడు దుస్సహునకు శుభాశుభప్రదేశంబుల జెప్పుట ◆—

చ॥ కనుఁగొని తత్ప్రభావ పరి◆కంపితగాత్రుఁడునయ్యె బల్మి నె
మ్మనముఁ దిరంబుఁజేసి యభి◆మానము వీడి వినీతుఁడై మునీం
ద్రునకు యథాశ్రుతంబుగను◆దోసిలిఁజేసి వచించునిట్టులో
యనఘ తరించె నాజనికృ◆తార్థుఁడనైతిని నిన్ను గాంచుటన్.

తే॥ పుణ్యకార్యములకుఁ◆బుట్టినిల్లును శ్రుతిచయ మునికిపట్టు◆సాధులోక
పూర్వపుణ్యఫలము◆పూతంబు భవదీయదర్శనంబు జగతిఁ◆దపసిఱేఁడ!

ఉ॥ ఈయెల నాగ నాకు సతి◆యీమెను బెండ్లియైనదాదిగా
నేయెడనైన నే నిలువ,◆నీయక యెల్లెడఁ ద్రిప్పుచుండు న
బ్జాయతనేత్ర కింత యెదు◆రాడెడు నేరుపు చాలకుంటచే
నాయయిచోట్ల ద్రిమ్మరుదు◆నహర్మనహర్మము నాకనిచ్చలున్.

తే॥ తెలివిలేనివాఁడ◆దీనుండ నా బుద్ధి నిలువదొక్కచోట◆నిముసమేని
జగతి నెవ్వరెద్ది◆సలిపిన నద్దియే శ్రేయమంచుఁ దోఁచుఁ◆జిత్తమందు.

ఉ॥ నీవు జగత్ప్రసిద్ధుఁడవు◆నిర్మలమూర్తివి వేదవేత్తవున్
శైవజనంబుపాలిటికి◆స్వర్ద్రుమమై యలరారుచుందువో
ధీవిభవాభిరామ నను◆దీనుని మూఢుని ధర్మమార్గమం
దేవిధిసంచరించునటు◆లింకనొనర్చెదొ సత్కృపామతిన్.

క॥ ఎచ్చోటఁజరింపందగు నెచ్చోటఁ జరింపఁగూడ◆దెఱిఁగింపఁగదే
సచ్చరితనాకు నావుఁడు జెచ్చెరవచియించె మౌని◆శేఖరుఁ డెలమిన్.

తే॥ నెలవేల్ప వినుమ◆నీ సతి యశుభసంధానచతురయగుచు◆ధరనకీర్తిఁ
గూర్చుచుండుఁగాన◆కోవిదులెల్లరు జ్యేష్ఠయని వచింపఁ◆జెలఁగుచుండు.

వ॥ వాయిదెఱచి యడిగితివి కాన నీ చరించుట కర్హానర్హంబులగుఁ బ్రదేశంబుల వక్కాణింతు వినుము.

సీ॥ రుద్రునానతి జగ◆ద్భద్రంకరుండు రాజీవనేత్రుఁడు మున్ను◆సృష్టిఁజేయు
వేళజగంబు ద్వి◆విధముగఁ గల్పించె సత్సంచయంబొక్క◆సరణి దుష్ట
సంతతి వేరొక◆సరణి నారెంటిలో నీవు నీ సతియును◆నిఖిలమునకు
నశుభంబుఁగూర్చుడు◆నట్టుల నియమించె నదిగాన నీవన◆యంబు జ్యేష్ఠ

గలిసి సంచరింప◆వలసె నెచ్చటఁ బుణ్యపురుషులుంద్రు వారి◆పొందుదక్క
కలుషచిత్తులైన◆ఖలులుండుచోట్లెల్ల నీ నివాసములయి◆నెగడుచుండు.

సీ॥ కైలాసవాసాయ • గజచర్మవసనాయ యమవిదారాయ తు • భ్యంనమోస్తు
వైకుంఠనిలయాయ • స్వర్ణోత్తరీయాయ యఖిలేశ్వరాయ తు • భ్యంనమోస్తు
కనకాద్రిచాపాయ • గౌరీహృదీశాయ యఘవినాశాయ తు • భ్యంనమోస్తు
పంకజనేత్రాయ • పాలితలోకాయ యమరప్రియాయ తు • భ్యంనమోస్తు

భక్తసంరక్షణాయ తు • భ్యం నమోస్తటంచు హరహరిధ్యానంబు • మించిచేయు
శైవవైష్ణవసంతతి • సంచరించు సత్త్వదేశంబులకు నీవు • చనఁగవలదు.

చ॥ హరిహరచిహ్నధారులయి • యంతకవైరినో కైటభారినో
నిరతము సంస్మరించుచును • నిష్ఠమెయిన్ భవరోగదూరులై
కరణములన్ జయించిన య • ఖండులు వైష్ణవశైవులున్నచో
నరుగకుమందు పాశుపత • మైన సుదర్శనమైన యుండెడిన్.

సీ॥ స్నానసంధ్యాన్యను • ష్ఠానంబు లొనరించువారున్న దేశంబుఁ • జేరఁబోకు
శివలింగధారులై • శివపూజలొనరించు ఘనుల నివాసంబుఁ • జనఁగరాదు
భూతిరుద్రాక్షలఁ • బూని శివోహమంచును బల్కు నసఘుల • మనికివిడుము
సతత సదాచార • సంపన్నులగువారు నిలిచిన దేశముల్ • దలఁపవలదు

హరిహరకథాభిరతులైన • యట్టివారి స్మరణమునుగూడఁ జేయకు • నిరతసాధు
పూజలొనరించు వారల • పొందువిడిచి సంచరింపుము తక్కిన • స్థలములందు.

క॥ అరయన్ దేవబ్రాహ్మణ గురుపూజా నిరతులైన • కోవిదులకడన్
నిరతాన్నదానపరులౌ పురుషులకడ సంచరింపఁ • బోకు మొకింతన్.

క॥ గురుజన సేవాసక్తియుఁ బరనారీవిముఖతయును • బాపభయంబున్
శరణాగతరక్షణమును గరముగలుగువానిఁ జేరఁ • గారాదుసుమీ?

తే॥ స్వజనమందు దాక్షిణ్యంబుఁ బరిజనంబునందుఁ గృపయును భూతద • యయునుగల్గి
"యాత్మవత్సర్వభూతాని" యనెడు పల్కు నాదరించెడువారల • నంటవలదు.

క॥ ధనలుబ్ధుఁడు గాక క్రమంబున పూర్వాచారమందుఁ బూనికగలాఁడై
యనిశంబు సంచరించెడి మనుజుని స్పృశియింపఁబోకు • మా యించుకయున్.

చ॥ తనుధనముల్ పురత్రయవి • దారునకున్ దుహినాంశుధారియౌ
ఘనునకొసంగి నిత్యమొడి • కంబున భక్తుల నాదరించుచున్
దననియమంబుఁ దప్పక స • దా శివపూజ యొనర్చుచుండు స
జ్జనుఁడువసించు దేశము పా • సంగను నీకొకయింత నిల్వఁగన్.

మ॥ పతిసేవాపరతంత్ర జీవయయి దే • వబ్రాహ్మణారాధన
వ్రతముంబూని వినీతయౌచుఁ గరణా • శ్వవ్రాతమున్ గట్టిపై

చితిరంబైన మనంబుతో దిరుగు రా • జీవాక్షినిఁ జేరఁరా
దతిలోకంబగు తత్ప్రభావ మిల ని • న్నంతంబుఁ గావించెదన్.

సీ॥ కామంబుచేనైనఁ • గాంతున కెదురాడనొల్లని సతి నంట • నొల్లకెపుడు
క్రోధంబుతోనైన • గురుతిరస్కారంబుఁజేయని సాధ్వినిఁ • జేరవలదు
లోభంబుచేనైన • లోకదూషణములఁ గావింపని పురంధ్రిఁ • గాంచరాదు
మోహంబుచేనైన మూఢయై పరపురుషులఁ దలంపని కాంతఁ • జూడకింత
మదముచేనైన శివపూజ • మాననట్టి జలజలోచనను స్మరింప • సాహసింప
కెపుడు మాత్సర్యమునఁ జేసి • యేని సాధునిందఁజేయని చెలిచెంత • నిలువరాదు.

చ॥ అనుచు దయార్ద్రచిత్తుఁడయి • యమ్మునినాథుఁడు పెక్కురీతులన్
దనసఁజరింపఁగూడని ప • దంబులఁ దెల్పిన దుస్సహుండు నె
మ్మనమునఁ గౌతుకంబలర • మానివరేణ్యునిఁగాంచి పల్కె నో
యనఘ ప్రశంసనీయము గ • దా భవదీయ చరిత్ర మెన్నఁగన్.

ఉ॥ నీయనుకంప పెంపున మ • నీషి జనావళికైనఁగాని దు
ర్జ్ఞేయములైన ధర్మముల • రీతి సమస్తమెఱుంగనయ్యె దు
ష్కాయము పూతమయ్యె భవ • కల్పితమైన జగంబునందు నా
కేయెడ సంచరింపఁదగు • నేర్పడఁ జెప్పుమటన్న నావుఁడున్.

—• అలక్ష్మీస్థానంబులు •—

మ॥ తన ధర్మంబుఁ బరిత్యజించి గురుసం • తానంబు నిందించి దు
ష్టనికాయంబును జేరదీసికొని స్వే • చ్ఛన్ మద్యమాంసాదులం
దున లోభంబునఁజేసి సత్వముల నెం • తో బల్మిహింసించుచుం
డిన పాపాత్ములు నిల్చు దేశములయం • దే సంచరింపన్ దగున్.

సీ॥ కుతుపవేళలవచ్చు • నతిథుల నింటేని యాదరింపక తినునట్టి వార
లాకొన్న దీనుల • కహారాన్నమిడక యిష్టాపూర్తిగా మెక్కు • నట్టివారు
పంక్తిభేదంబును • బాటింప కనయంబుఁ • దారెమృష్టాన్నంబుఁ • గోరువారు
పరుల యుచ్ఛిష్టమం • చరయక దొరకినదేచాలునని భుజి • యించువారు
నిరుకెలంకుల వారల • నెఱుఁగనీక మంచివస్తువులను నేక • రించి తినెడు
చ్ఛానటులుండెడి తలముల • జ్యేష్ఠతోడఁగూడి చరియింపదగును నీ • కునుసతంబు.

చ॥ పలువురు భోజనంబు సలు • పన్ దగు సత్రములందుఁ జేరి కా
వలయు పదార్థముల్ తొలుత బాంధవసంతతికే యొసంగి ని

చ్చులు పెరవారికీక పెలు • చన్ జరియించెడు దుష్టులైనవా
రలు వసియించు గేహములు • రమ్యములైతగునీకు నిల్వఁగన్.

సీ॥ యాత్రికులకు నన్న • సత్రముల్ గట్టింపఁబూనినారమటంచు • బొంకి బొంకి
నిరుపేదలగువారి • కిరవులఁ గల్పింపఁదలఁచినారమటంచుఁ • దెలిపి తెలిపి
నిర్జలస్థలముల • నీటివసతుల నేర్పరపింతుమనుచును • బలికిపలికి
దేవాలయములఁ బ్ర • తిష్ఠించుటకు నిందుఁ జేరినారమటంచుఁ • జెప్పిచెప్పి

మంచియిది చెడ్డయిది • యంచు నెంచకెప్పు డధములైనను యాచించి • యతిశయముగ
ధనము నార్జించు కుటిలుల • మనికిపట్టు లవనివసియింప నీకు న • ర్హంబులగును.

మ॥ హరిగానంబొనరించుటో కరము బ్ర • హ్మానందమున్ గూర్చు శం
కరుఁ గీర్తించుటొ లేక సంతతము రా • గద్వేషమూలంబులౌ
కరణంబుల్ చెలరేగి త్రిమ్మర నస • త్కార్యంబులన్ జేయు పా
పరతుల్ నిల్చెడు నెల్లదేశములు త్వ • ద్వాసార్హముల్ నిచ్చలున్.

చ॥ హర గిరిజామనోహర సు • రాసురవందిత పాదపద్మ భా
స్కర శశివహ్ని నేత్ర శితి • కంఠ గజాసురచర్మచేల శం
కర వృషవాహనా గిరిశ • కావఁగ దేయని నిశ్చలాత్ములై
నిరతము ధ్యానమున్ సలుప • నేరని దుష్టుల చెంతఁ జేరుమా?

క॥ తన శక్తికొలఁది దీనులఁ గనికరమునఁ బ్రోవకుండు • కఠినాత్ములఁ బా
పనిరతులగువారల దుర్జనులను నిడనాడకెపుడు • చరియింపుమిలన్.

సీ॥ అవసరంబగునేని • యాబ్దికంబులనైన మానుకొనఁదలంచు • హీనులకడఁ
దన లాభమునకునై • తగువారి గౌరవంబునకు భంగముఁగూర్చు • చెనటులకడ
నున్నతపదవియం • చూడిగంబునకైనఁ జొరఁబడఁజూచెడి • క్షుద్రులకడ
నధికారి తనకు లో • నయ్యెఁగదాయంచు దుర్బోధ లొనరించు • దుష్టులకడ

పెత్తనముగల్గెనని పాప • భీతి విడిచి దొడ్డవారల దండించు దోసకార్ల
మందిరంబుల సంతతా • నందకరములనుచు వసియింపు జ్యేష్ఠతో • నహరహంబు.

సీ॥ పదునాల్గుతరములఁ • బావనంబుగఁజేయఁగల సూఁతు నమ్మెదు • ఖలులయందు
ధనలోభమునఁ జేసి • ధరణీశ్వరులచెంత ననృతంబులాడెడి • యధములందుఁ
బరులు మెత్తురటంచు • బలహీనులందునఁ బౌరుషంబును జూపు • పాపులందు
బలగర్వమునఁ గన్నుఁ • దెలియక తల్లిదండ్రుల హింసగావించు • పలువలందు

గురుతిరస్కార మొనరించు • కుటిలులందు విప్రవంచనమును జేయు • వికటులందు
నిలిచి జ్యేష్ఠతోఁగూడి ని • ర్నిద్రతేజుఁడవయి చరియింపుమా ధాత్రి • ననవరతము.

సీ॥ ఏవాని గృహసీమ • నేప్రొద్దు గనుఁగొన్న నేదియో కలహంబె • యెసఁగుచుండు
నేవాఁడు తనయింటి • కేతెంచు నతిథులఁ బూజింపఁ డాదరం • బున దొలంగి
యేవానిపల్కులు • హీనంబులై శివస్మరణ వర్జితములై • ధరణి బరగు
నేవానికృత్యంబు • లెల్ల దుష్కృత్యంబులై ధర్మబాహ్యంబు • లగుచునుండు

నెవఁడు భూతహింస • యే ప్రధానంబుగ సలుపుచుండునట్టి • కలుషచిత్తు
నాలయంబు విడక యనయంబు నివసింపఁదగును నీకు నీచు • తరుణికిలను.

ఉ॥ స్నానము సంధ్యయుఁ జపము • సాధుసపర్యయు నిష్టదేవతా
ధ్యానము నగ్నిహోత్రము శివార్చయు లేక క్షుధార్తుఁడై యెవం
డేని యనుక్షణం బొరుల • కీయక తానె భుజించుచుండు నా
హీనుని జేరి స్వేచ్ఛ జరియించుచునుండుఁడు నీవు జ్యేష్ఠయుఁ

శా॥ దేవుం డెవ్వఁడు భక్తుడెవ్వఁడు ధరి • త్రీదేవుఁడు డెవ్వఁడు సం
భావింపందగువాఁ డెవండు సకలై • శ్వర్యంబులుఁ నుద్భుజా
ప్రావీణ్యంబుననే లభించెననుచుఁ • బాపాత్ముఁడై సంతతం
బేవాఁ డెల్లెడ సాటు నాతని గృహం • బే నీకు వాసార్హమా.

తే॥ ఆదిమధ్యాంతములు లేక • యలరువాని నిర్వికల్పుండగుచు • ధ్యాతి నెగడువాని
శర్వు నిందించునట్టి దు • ష్టప్రకరము నిలుచు మందిరముల నీవు • నిలువు మెప్పుడు.

సీ॥ తమపని తీరినం • తనె ప్రాజ్ఞులను గౌరవము లేక హసియించు • కుమతులకును
దమ కులాచారంబు క్రమమును విడి నీచపద్ధతిఁ జరయించు • పాపులకును
తమ పెత్తనంబె యందఱు బ్రోచు ననుచు సజ్జనుల హింసించెడి • చెనటులకును
దమయంతవారు లే • రు మహిం నటంచుఁ బైమెఱుఁగులఁ బూనెడు • కుజనులకును

తమ సుఖంబునకై నిరం • తరము నితివారి కిడుములఁ గూర్చెడి • క్రూరులకును
బరుల తేజంబుఁ గని సహిం • పని ఖలులకు వెతలఁ గల్గించుచుండు సం • తతము నీవు.

సీ॥ శివపాద తీర్థంబు • సేకరించుటమాని మద్యపానముఁ జేయు • మందమతుల
నీశార్పితద్రవ్య • మెలమిఁ గైకొనక మాంసాహార మొనరించు • నట్టిఖలుల
నతిథులఁ బూజింప • కనయంబుఁ దృప్తిగఁ దారతినెడి దురా • చార రతుల
నాశ్రయించినవారి • నాదరింపక నిజోదరపోషణమునకై • దిరుగు కలుష

మతులసతత దురభి • మానంబు పెంపునఁ జిన్నపెద్దల నెడి • భీతి లేక
సంచరించునట్టి • సాధుదూషకులను గలిసియుండు మెల్ల • కాలమీవు.

సీ॥ కులకాంతయొక చెంత • గోడు జెందుచునుండ నన్యకాంతలఁ గూడు • నట్టివారు
తన యర్థమెల్ల వ్య • ర్థమయిపోవుచునుండ నితర ధనముఁ గొన • నెంచువారు

తల్లిదండ్రులఁ గూటి • కల్లాడుచుండఁగఁ జెలులకు విందులఁ జేయువారు
కులవిద్యలెల్ల నన్యులపాలగుచునుండ వితరవిద్యలకునై • వెదకువారు
స్వజనమం దభిమానంబు • సమయుచుండ వింతవారలనే గార • వించువారు
బ్రతుకుదెరువునకై కుల • భ్రష్టులైనవారు నీ కాశ్రయులగుచు • వఱలుచుంద్రు.

క॥ వదనమున భూతి రేఖలు నెద రుద్రాక్షలును దాల్ప • కెప్పుడు కలుషా
స్పదములగు నలంకృతులను మదిగోరెదు పాపరతుల • మనికి విడకుమా?

తే॥ అగ్రజుఁడు బ్రహ్మచర్యంబు • నధివసింపఁ బరిణయముఁ జేసికొనినట్టి • వాఁడు దుష్టుఁ
డతఁడు పంక్తిబాహ్యుఁడు వాని • ననవరతము విడక చరియించుచుండు మెప్ప
[ డును చెలఁగి.

చ॥ పరులొనంచుచు నెద్ది తమ • ప్రజ్ఞ కనిష్టముఁ గూర్చుచుండు దు
ష్కరమగునట్టి కార్య మొడి • కంబునఁ జేయుచుఁ బాపభీతియుఁ
గురుజనభక్తియుఁ విడిచి • కోవిదులన్ లఘువృత్తి గాంచుచున్
నిరతము ధాత్రిఁ ద్రిమ్మరెడి • నీచుల వీడక సంచరింపుమా.

క॥ తన తెలిసినట్టి విషయంబును బ్రాజ్ఞులగోష్ఠి సమయ • మునను పయోగిం
పనివానిని బ్రాణులయెడఁ గనికరముఁ దొఱంగువానిఁ • గలిసి తిరుగుమా?

మ॥ తరుణీ శాతకటాక్ష సాయకములన్ • దర్పంబు జెన్నారఁగా
స్మరుఁ డుద్రేకముఁ గూర్పఁ బంకజముఖీ • సాంగత్యమే యీ చరా
చరలోకంబునకెల్ల ముఖ్యమనుచున్ • సత్కార్యముల్ వీడి త్రి
మ్మరు దుర్మార్గులతోడఁ గూడి చరియిం • పన్ యోగ్యమౌ నీకిలన్

సీ॥ బ్రహ్మవృక్షంబును • బంధుజీవకమును కరవీరతరువున • గస్త్యవృక్ష
మర్కభూరుహమున • న్నావర్తమును తింత్రి కదళిశాసంతతి • ఖాదిరంబు
భల్లాతకియును న • శ్వత్థంబున్యగ్రోధమును పనసయు కుంద • మును కదంబ
మును దుంబరము తాళ • ములు తమాలంబులు మఱియు సకంటక • మహీరుహములు
కాకవాసములయి • కన్పడు నింబము లెవనిదొడ్డిలోన • నెసగుచుండు
నట్టివానియాల • యము విడనాడక నిలిచియుండు మెపుడు • నీవు సతియు.

తే॥ తలఁపనైదుమహిష • ములు గోత్రయంబును నాలు గుఱ్ఱములును • నరయు నేడు
గజములొక్క దాసి • కలవానిగృహమున దిరుగుచుండు మెపుడ • దృశ్యుండవయి.

తే॥ భిక్షుకుని చిత్రపటమును • భీకరయగు కాళికావిగ్రహంబును • క్షపణకుఁడును
దండినియు ముండినియును బ్రే • తస్వరూపమైన ఢాకిని గల గేహ • మధివసింపు.

చ॥ శ్రితజనరక్షకుండు శశి • శేఖరుఁ డాఢ్యుఁడు యోగిరాట్సను
ర్పిత పదపంకజుండయిన • మృత్యుహరుండరయంగ నెల్ల దే

వతలకు సాటివాఁడు భగ • వంతుఁడెయైనను వారికన్న నీ
క్షితి నధికుండుగాఁడనుచు • జెప్పెడు దుష్టులఁజేరి నిల్వమా?

క॥ హరియు విరించియు నిర్జరవరుఁడును మొదలైన యాసు • పర్వులు శ్రితశం
కరుఁడగు శంకరుననుమతిఁ దిరుగుదురని పల్కకుండు • చీను విడకుమా?

వ॥ అని సయుక్తికంబుగ ప్రవేశార్హానర్హ స్థలంబులన్ జెప్పి మార్కండేయుండు దుష్ట
స్త్రీస్వరూపంబు వక్కాణించువాఁడై మఱియు నిట్లనియె.

—* దుష్ట స్త్రీలక్షణము *—

చ॥ కలుషపథంబు నాక కుల • కాంతల ధర్మముఁ గోలుపుచ్చియున్
అలితమనోజ్ఞరూపులయి • లాలనసేసెడి పూరుషాంతరా
వళిగలయంగఁజూచు చిరు • వంగసముల్ నశియింపఁజేయు చం
చలలగువారె దుష్టులని • సజ్జనులెల్ల వచింతురెమ్మెయిన్.

సీ॥ అరుణోదయంబున • కన్న ముందుగ లేచి తనకృత్యములను జే • య నిల తొంగి
యత్తమామలయాజ్ఞ • నౌదలదాల్పక స్వేచ్ఛగాఁ జరియించు • చెనటిపడఁతి
తినవారియందు నెంతయుఁ బ్రేమచేఁ బతిసేవఁజేయుని సరి • సీరహాక్షి
యనయంబుఁ బతి రహ • స్యంబులఁ బెరవారి కెఱిఁగించుచుండెడి • హీనచరిత
స్వల్పకారణమునఁజేసి • స్వజనమందుఁ గోపమున సంచరించెడి • కుటిలచిత్త
నరకకూపమునఁబడి య • నంతములగు కల్పములయందు నిడుమలఁ • గాంచికుందు.

తే॥ చెఱఁగు మాసినపుడు • చెప్పక సిగ్గరితనముపీడి ప్రాణ • ధవునితోడఁ
గలిసి సంచరించు • నెలనాగ దుష్టనాఁబరఁగు నధములోక • భాజనయగు.

క॥ ధృతమలినాంబరయును స:తతశౌచ విహీనయును వృ • థాభాషిణియున్
శ్రితజనబాధాకరయయి న తెరవ వసుమతిని దుష్ట•నాఁబడునెపుడున్.

చ॥ వ్రతసమయంబులందునను • బర్వదినంబులయం దశుద్ధయై
నతఱిని దేవతార్చనమొ • నర్చెడి చోగ్రహణంబులందునన్
బిత్పదినసంబులందునను • బెన్మిటితోడ మెలంగు కాంత దు
ర్గతిఁబడి పెక్కుకల్పములు • కాలుని బాధల నొందు నెంతయున్.

క॥ పొరుగింటి పెత్తనంబుల మరగిన కామినియు న • త్త •మామల నెపుడున్
బరిభవముఁజేయు చేడెయు నరయ నధోలోక కష్టమ • మందుదురవనిన్.

క॥ గురువుల బాంధవసంతతిఁ బరిజనముల నహార్హమైన • పద్ధతితోడన్
నిరతముఁ గాంచక మెలఁగెడు తరుణియధమకాంత నాఁగఁ • దగు నెల్లెడలన్.

మ॥ ధనహీనుండయినన్ గురూపియయినన్ • దర్పాంధుఁడైనన్ బరాం
గనలన్ గూడి చరించువాఁడయిన లో • కజ్ఞానశూన్యుండె యై
నను గ్రోధంబుగలట్టివాఁడయిన స్వాం • తంబందుఁ బ్రాణేశు దే
వునిగా నెంచనిదుష్టకాంత నరకం • బున్ జెందు నెల్లప్పుడున్.

వ॥ తన కులదేవతావళిని • దద్దయు బూజయొనర్ప కెప్పుడున్
దినియెడి కాంత యఘన్ లకుఁ • దృష్టిగఁ బెట్టనినీరజాక్షి స
జ్జనులఁ దిరస్కరించుచుఁ బ్ర • సంగ మొనర్చెడి కొమ్మ యున్ గ్రమం
బునను భయాన్వయంబుల స • మూలవినాశ మొనర్తు రిద్దరన్.

తే॥ వేయు లేలవినుము • వేద నిషిద్ధంబులైన కార్యములనె యాచరించు
పాపనిరతలైన • పడఁతులు దుష్ట స్వభావలనుచుఁ జెప్పఁ • బడుదురిలను.

తే॥ అనివచించి మాని • యంతహితుండయ్యె నపుడు దుస్సహుండు • నతివఁగూడి
మాని చెప్పినట్లు • మహినెల్లెడల సంచరించి యొక్కపుడు వ • చించెనిటుల.

తే॥ అతివనీపీ తటాకాశ్ర • మాలయమున నిలువు మే నేగి యిదె గసా • తలమునందు
మనకు వసియింపఁ దగినట్టి • మందిరములు కలవొ లేవొ విచారించి • క్రమ్మరెదను.

ఉ॥ నావుడుఁ జ్యేష్ఠయిట్లనియె • నాతనితోడ మహానుభావ యే
నేవిధి నిందు నిల్చి భవ • దీయ నియోగము సైఁపనేర్తు సం
భావనజేసి నా కెవఁడు • భర్త్యమొసంగఁగలాఁడొ నిర్దయన్
నీవె త్యజింపఁ గాంత కవ • నిన్ ధవుఁడేకద రక్షకుండగున్.

తే॥ అచటి కేగివచ్చు నందాక యే నిందు నొంటి ననదనగుచు • నుందు నేని
కనినవారు చుల్కఁ • దనము సేయరె నన్ను మగనిడిచినట్టి • మగువయనుచు.

మ॥ నను బాణిగ్రహణంబుఁ జేయునెడ స్వ • ప్నంబందునైనన్ స్ఫుర
ద్వనజాతాయతనేత్ర నీసతి ననిం • ద్యన్ వీడనంచున్ వచిం
చిన నీ కిర్విధిఁ బాయు పూన్కి తగునా • చిత్తంబు నీయందె ని
ల్పిన నాకెవ్వరు వేఱదిక్కు గలరో • పృథ్వీసురగ్రామణీ!

తే॥ ఎట్టి సాధ్వికేని • హృదయేశు విడనాడి నిముసమైనఁ గాని • నిలువఁదగదు
నిలిచెనేని జగము • నిందించును యథార్థ మెఱుఁగునట్టి నేర్పు • కొఱఁతయగుదు

తే॥ ప్రాణములకెల్ల • నీశుఁడై పరఁగుకతన మగఁడు ప్రాణేశ్వరుండు నా • మహిదనర్చు
నట్టియాతని విడనాడి • యతివ యొంటి నిలుచుకంటెను పాపంబు కలదె చూడ.

చ॥ పతి విడనాడి యహర్నిశని పల్కుచుఁ ద్రిమ్మరు కాంతజీవనం
బతి కలుషాస్పదంబనుచు • నార్యులు బల్కుదురట్లు గాన దు

గఁటిఁ బడయంగఁద్రోయ కను • కంప మనుఁగ గొనుమా రసాతల
క్షితికని వేడ దుస్సహుఁడు • జ్యేష్ఠఁ గనుంగొని పల్కె నీగతిన్.

చ|| తరుణి యివేటిపల్కులు ల • తామ్రదులాంగవు నిన్నువీడి నే
నిరతము సంచరింపఁగల • నే హృదయేశ్వరి వీవుగావొకో
సరగున నా రసాతలము • సంగతిఁ గన్గొని రాకయుండు నే
స్థిరమతి నిం దు నిల్వుము ప్ర • సిద్ధము లైతగ నీ గుణంబులున్.

తే|| అమలభక్తి నిన్ను • నర్చించు సత్కులజాత లైనయట్టి • సాధ్వుల కిలను
శ్రేయమొసఁగి వారి • చెంతనుఁ జనకుండు మేనువురలివత్తు నేగి యింక.

వ|| అని వచియించి మార్కండేయోపదేశంబుకతన జితేంద్రియుండును పరిత్యక్త వ్యామోహుండును, నిగర్వుండును నగు దుస్సహుండు రసాతలంబుఁ జేరె యిప్పటికిని జలసంస్తరణ నిమగ్నుండై యుండె జ్యేష్టయు భర్త్రాజ్ఞాపరిపాలనంబుఁ జేయుచు గ్రామంబులందును బర్వతబాహ్య ప్రదేశంబులందును సంచరించుచు నొక్క యవసరంబున,

చ|| కమలదళాయతాక్షుఁడు జగ • త్త్రియ పూజ్యుఁడు కాంచనాంబరుం
డమలినచిత్తుఁ డాఢ్యుఁడు మ • హాముని మానస సంచరుండు నా
గమ శిఖరాగ్ర మందిరుఁడు • కాలపయోద వినీల దేహుఁ డా
యమరవరానుజుండు కమ • లాలయయున్ గననైన జ్యేష్ఠయున్.

తే|| దండితాఖిలదైత్యత్వ • ద్పాదపద్మ దర్శనంబునఁజేసి నే • ధన్యనైతి
నాథులకు నాథుఁడవు నీ వ • నాథలోక రక్షకుండవు గావె భ • ద్రస్వరూప.

మ|| తన ప్రాణంబుల నాయెడన్ నిలిపి ని • త్యం బెంతయో ప్రేమచే
ననుగూలుండయి సంచరించుపతి నా • యం దీర్ష్యచే వీడిపో
యినవాఁ డింతకు రాఁడదేమికతమో • యెందెందు నే సంచరిం
చిన నాధార మొకింత కన్పడదు రా • జీవాక్ష ప్రోవంగదే

క|| అనిప్రార్థించిన జ్యేష్ఠన్ గనుగొని చిఱునవ్వు మోముఁ • గైసేయ జనా
ర్దనుఁ డిట్లుబల్కెఁ బల్కుల ననుకంపా బిందుజాల మల్లనఁ గురియన్.

తే|| చింతయేలనీకు • జ్యేష్ఠ వినుము దుస్సహుండు నిన్ను వీడి • యుండెననుచు
సర్వరక్షకుండు • శర్వుండు సకలలోకైక నాథుఁ గొలిచి • యవని మనుము.

తే|| నీలలోహితుండు • నిగమాంత వేద్యుండు శంభుఁడేయటంచు • సంతతంబు
భక్తి గొలువలేని • వాని సర్వస్వంబు నీ యధీనమగుచు • నెగడు ధరణి.

చ|| మనుజుఁ డెవాఁడు సంతతము • మాధవు లోకశరణ్యు శర్వుఁ గాం
చనగిరిచాపునిన్ దుహిన • శైలసుతన్ మది నిందజేయు నా

తని ధనధాన్యముల్ గొని ప • దంపడి స్వేచ్ఛజరించుచుండుమో
వనరుహనేత్ర దుస్సహుని • భాసిన దుఃఖమువీడి యెంతయున్.

చ॥ కలుపమహాద్రివజ్రమగు • కాయజవైరి పదాబ్జయుగ్మమున్
గొలువక ధర్మహీనుఁడు ను • కుంఠితచిత్తుఁడునై గిరీశ్వరున్
జులుకనజేసి నన్నె మధు • సూదనుగొల్చు నెవండు వానిఁ జిం
తలఁ బడద్రోసి తద్ధనము • తద్దయుఁ గైకొని సంచరింపుమా.

తే॥ అనివచించి వెన్నుండు ప • ద్మాలయాసమేతుఁడై జ్యేష్ఠవీడి సం • ప్రీతితోడ
నిజపురంబునకేగి ని • ర్నిద్రుఁడగుచు నీళు బూజించె ఇళుధ వినాశమునకు.

తే॥ అనుటిలాత్ముఁడగుచు • నవని నెవ్వండు శుభాస్పదమగు నీ మ • హాచరిత్ర
మవధరించు నాతఁ • డా చంద్రతారకమలరు సకల విభవ • ముల వహించి.

వ॥ అనిపలికిన వినిమునీంద్రులానందంబునొంది వెండియు వ్యాసశిష్యున కిట్లనిరి.

సీ॥ పౌరాణికోత్తమ • పరఁగనీకతన సకలపురాణము లెఱుఁ • గంగనయ్యె
భక్తుఁడే మంత్ర జ • పం బొనరించి ముక్తుండగు బాపంపుఁ • బిందువలన
నెద్దాని మహిమచే • నెల్లలోకంబుల గములు సుఖావాప్తిఁ • గాంచిమించు
నెయ్యది సకలలోకేశ్వరుండగు హరి బోధించునదియునై • పొసఁగుచుండు

నట్టి మంత్రమును గృ • పాన్వితుఁడవయి మా • కెఱుఁగఁబలుకు మనుచు • నెంతయేని
వినయమలరుచుండ • వేడినవారలకనిరియె వ్యాసశిష్యుఁ • డాదరమున.

## —• అష్టాక్షరీమంత్ర మహిమ •—

క॥ ఆదియుగంబునఁ గమలజుఁ డాదరమొప్పఁగ వసిష్ఠుఁ • డను మౌనికి స
మ్మోదమునఁ జెప్పె మంత్రము శ్రీదయితుండన కిష్టమగుచుఁ • జెలఁగెడుదానిన్.

క॥ అది యష్టాక్షరినాఁబడునది సకల మునీంద్ర సేవ్య • మైనది ధర్మా
స్పదమైనది యద్దానిన్ వివితము సేయుదును మీకు • వినుఁడు కడంకన్.

తే॥ బ్రహ్మవాదులైన • పరమపుణ్యులకు నదిము క్తిదాయకంబు మూఁడుగతుల
నగ్రజన్ముఁ డెవ్వఁ • డష్టాక్షరీమంత్రపఠనజేసి పుణ్య • భాక్కుఁ గాఁడొ.

చ॥ త్రికరణశుద్ధిగల్గి వసు • దేవతనూజుని భక్తవత్సలున్
వికచ సరోజనేత్రుఁడగు • వెన్నుని తజ్జప పూర్వకంబుగాఁ
బ్రకటితభక్తినే నరుఁ డు • పాస్తియొనర్చు నతండు దేవతా
ప్రకర కిరీటకోటి మణి • భాసితపాదసరోజుఁడౌ నిలన్.

ఉ॥ నిద్దురఁబోవువేళ నవ • నీసురగోష్ఠిఁ జరించువేళ సం
పద్దశ నొందువేళను వి • పత్తులఁగాంచినయట్టివేళ నే
యద్దమకేయి యైనను శ్రీ • తావను విష్ణుని తజ్జపంబుగన్
విద్దెగలాఁడు కొల్చి పృథి • విన్ బ్రథితామలకీర్తియుక్తుఁడౌ.

సీ॥ జగతి నెవ్వాఁడు భో • జ్యంబైన పేయంబునైన లేహ్యపదార్థ • మైనఁగాని
నతుఁడగుచోం నమో • నారాయణాయయంచనెడు మంత్రంబున • నారగించు
నమ్మహాత్ముండు జ• నాదరంను సన్నిధి ననయంబు వసియింప నహుఁడగును
నాతనిఁగాంచిన • నశుభయా జ్యేష్ఠయు భయమున దిక్కులఁ • బారుచుండు

జగము తల్లియైన సాగరకన్యయు నతనియింటనుండు • ననుదినంబు
వేయులేల యింకఁ • బృథ్వి నామంత్రంబు జపముఁజేయువాఁడె • జగముగురుఁడు.

—• ద్వాదశాక్షరీప్రభావము •—

వ॥ మఱియు ద్వాదశాక్షరయుక్తంబై ద్వాదశాత్మయనంబడు బురాతనంబగు మంత్రం
బొందుగల దద్దానిమాహాత్మ్యంబు సంగ్రహంబుగ వక్కాణింతు నవధరింపుఁడు.

ఉ॥ తొల్లియొకప్పు డొక్కఁడ వ • ధూతమహోఘుఁడు భూమిదేవతా
వల్లభుఁ డంబుజాక్షుని కృ • పామయు గొల్చియు విష్ణుభక్తి సం
పల్లలితాంగుఁడైన సుతు • మాన్యచరిత్రునిగాంచి యెంతయే
నుల్లమునందు సంతసము • నొందెఁ గులంబున వారు మెచ్చఁగన్.

తే॥ అతులితోత్సాహమున విప్రుఁ•డాత్మజునకు జాతసంస్కారముల నెల్ల•సలిపి యర్హ
సమయమున నుపనయంబు • శాస్త్రవిహిత ముగ నొనర్చి వేదాభ్యాస • మొనరింప.

తే॥ తలఁచి యెన్నిగతుల • బలికించినను గాని పలుకఁడయ్యె నన్య • భాషణముల
నర్భకుండు ద్వాద • శాత్మయా ద్వాదశాక్షరినిదక్క యొట్టి • కష్టమైన.

తే॥ మిన్ను విఱిగి నెత్తిమీఁదనె పడినను బ్రళయమైనఁగాని • బాలకుండు
వింతచింత మాని • విష్ణునామజపంబె సలుపుచుంటఁగాంచి • జనకుఁడపుడు.

చ॥ అకట యిదేటిపాతకమొ •యర్భకుఁ డొక్కఁడెయైనఁగాని మా
మక కులముద్ధరించునని • మానసమం దలరారుచుంటి వీఁ
డొక హరిపూజదక్క మఱే • యొక్కటి పల్కఁదలంపఁడయ్యె వి
ప్రకులమువారికిన్ శ్రుతుల • పాఠమెగాదె యశంబుఁ గూర్పగన్.

క॥ వనజాక్షుని సేవించుట యనఘమెయగు నైనఁగాని యగ్రజధర్మం
బును వేదపాఠము నొనర్పని పని శ్రేయంబె సాధు • పద్ధతియగునే

క॥ హరిభక్తుఁడైన నేమియొ హరభక్తుండైన నేమి • యగ్రజధర్మ
స్ఫురణముఁ బరిపాలింపని పురుషుఁడు శత్రుండు గాక • పుత్రుండగునే.

చ॥ శ్రుతులు స్మృతుల్ బురాణములు • నూరిజనస్తుతమైన శాస్త్రసం
తతియును శ్రద్ధతోడ విధి • తంబగునట్లు బఠించుటో కుల
స్థితి గలిగించు కర్మలను • జేయుటొ లేక యుపేంద్రునామ మే
మతిని దలంచుచుండెడి కు • మారునితోడ ఫలంబు గల్గునే

క॥ పితృకులధర్మముఁ బూనని సుతుఁడు సుతుండగునె యట్టి • సుతునికతమునన్
బితరులకు గతులుగల్గునె పితయును నవపత్యుడట్ల • భీతిలకున్నే.

తే॥ అనుచు నైతరేయ • నందనూయ జనింప నా ద్విజోత్తముఁడు కు • లార్హుఁడైన
తనయుఁ గాంతుననుచుఁ • దలఁచి వేరొక సాధ్విఁ బెండ్లిచేసికొనియెఁ • బ్రియముగుదుర.

వ॥ అట్లు బరిణయమై యవ్విప్రుం డామెయందు వేదాధ్యయన సంపన్నులను, సకల శాస్త్ర పారంగతులును వంశదీపకులును నగు పుత్రులఁ గాంచి సంతసంబున జిన్న భార్యయందుఁ గూరిమికలాఁడై యుండె. నంతఁ బెద్దభార్య తన నాథుం డనూయాపరుండగుటకు వగచి పుత్రుండగు నైతరేయునితోడ నిట్లనియె.

చ॥ తనయుల కెందునైనఁ దలి • దండ్రులకున్ హితమైనరీతిగా
ననయము సంచరింపఁదగు • నంద్రు సమర్థులరైనవారు నీ
జనకుఁడు చెప్పినట్టులుగ • సమ్మతిసేయవదేల నిన్ను నే
మని యనుదాననయ్యొ కొడు • కా విపరీతములయ్యె నీ పనుల్

తే॥ సర్వవిద్యలందుఁ • జతురులై నీ పినతల్లికొడుకులెట్లు • దండ్రిమనసు
సంతసించుపగిది • సంచరించుచున్నవారొ కాంచి మది వి • చారపడవె.

క॥ నాసలిపినట్టి దోషమె యీసరణిన్ నిన్ను • బుద్ధి హీనుని సుతుగాఁ
జేసి పాసఁగించె దుఃఖమహా సైపఁగనేర్తునే మ • హాపదకింకన్.

మ॥ సరివారెల్లరు నీ సుతుండరయ శా • స్త్రజ్ఞానహీనుండు భా
సురమౌ భూసురవంశమున్ జెఱుచునం • చున్ నవ్వురంగాంచగన్
బరిహాసంబొనరింప నేమనుచు నే • మార్వ్యాల్కుదానన్ హరి
స్మరణంబే పరమార్థదంబనెడు నీ • చందంబు గన్గొంచిలన్.

తే॥ సవతికొడుకులు బుధులయి • సంచరింపఁ జ్ఞానహీనుండవగు నీకుఁ • గన్నతల్లి
నైన యే నెట్లు దలనెత్తి • యవనిదిరుగుదాన నీమేనుతోడ నం • దనవచింపు.

తే॥ అనుచుఁ దఱుగని వంతచే • ననెడుజనని పలుకులకు దరహాసంబు • సలుపుకొనుచు
నైతరేయుండు స్వజనంబు • నాదరించు తలఁపునన్ దల్లితో నిట్లు • బలికెనపుడు.

మ॥ జననీ యేమిటికిట్లు జింతిలెద వీ • సర్వం సహామండలం
బును బాలించెడు నేర్పువాఁడరయ నం • భోజాత నేత్రుండె గా
క నిలింపేశుఁడు పేరొకండు గలఁడే • కళ్యాణసంధాయకుం
డని యా దేవుని గొల్వఁగూడదె యఘంబా చెప్పుమమ్మా టికిన్.

తే॥ సర్వలోకవిభుండైన • జలజనయను స్మరణజేయుటకన్నను • జగతియందు
నవసరం బొందు కలుగునే • యగ్రజులకుఁ దెలియగారాదె నీకు సా • ధ్వీలలామ.

తే॥ తమకుఁదోఁచినట్లు • దగవనిపలుకగ నేర్పువారె కాని • నిష్ఠజేసి
విష్ణుభక్తితోడ • వినుతింపఁగల్గు ఫలంబుఁ దెలియఁగలరె • యంబ చెపుమ.

చ॥ సతతము కేశవార్చనరయె • సల్పెడు బుద్ధిగలట్టివారి కీ
శ్రుతులఁ బఠించుటేమిటికి • సూరివరేణ్యుల గోష్ఠి యేటి క
ద్భుతచరితుండు శ్రీధవుఁడు • పూరుషమాత్రుఁడె తద్పదాంబుజ
ద్వితయముఁగొల్చుకన్నఁ గల • దే పరియొక్కటి మానవాళికిన్.

తే॥ యజ్ఞవాటంబునకుఁ జని • యహరీతి డెందము చలింపకుండ గో • విందనామ
కీర్తనముఁజేసి యిప్పు డకృతినగుదు తదన్యచింతన మేమిటి • కమ్మ నాకు.

తే॥ అనుచు యజ్ఞవాట • మున కైతరేయుండు చనియె నంత నచటి • యనఘులైన
విప్రులెల్ల వేద • వేత్తలయ్యును వేదమంత్రములఁ బఠింప • మఱచిరపుడు.

తే॥ ఐతరేయుఁ డట్లు • యజ్ఞవాటంబున కరుగుటయును వాని • యాననమున
వెడలెబుక్కులెల్ల • విధిముఖంబుఁ దొల్లి వేదసంచయంబు • వెడలినటుల.

ఉ॥ ఆ సమయంబునన్ ద్విజకు • లాగ్రణులెల్లరు నైతరేయునిన్
భాసురతేజుఁగాంచి యొక • పాటి మనుష్యుని గాఁదలంచినా
మో సుగుణాఢ్య నిన్ను మది • నూర్వక సైపఁగదయ్య నమ్ముఁ గై
నేసితి విప్రవంశమును • శ్రీధవునిన్ భజియించు నెంతయున్.

వ॥ మేము నీకన్న వయోజ్యేష్ఠులమైనను నీవు గుణజ్యేష్ఠుండవగుకతన మాకుఁ బూజ్యుం డవు మహాయోగులంబోలి నిశ్చలచిత్తుండవైన నీసామర్థ్యంబు నెఱుంగ మాదృశుల కున్ దరంబగునే నీ యుపాస్యంబగు ద్వాదశాక్షరం బక్షరంబగు మంత్రరాజంబని తెలియలేక నిన్ను నింధించితిమి భగవంతునకన్న భగవద్భక్తుండు ప్రథమసేవ్యుండని యెఱుకగలవారు వచింతురుగాన శ్రీమన్నారాయణునకన్న నీవుమాకు ప్రథమ పూజ్యుండవైతివని యనేకవిధంబుల వినుతించి యాతనివలన ద్వాదశాక్షరి నుప దేశంబు నొందిరంత నైతరేయుండును దలిదండ్రులకుఁ బ్రణామంబొనరించిన వారును పుత్రుని ప్రభావంబున కద్భుతమొందిరి. ఐతరేయుండును చిరకాలంబు ద్వాదశాక్షరి జపించి తత్ప్రభావంబున దేహంబుతోడ వైకుంఠంబున కరిగెనని సూతుండు వచియించుటయును

మ॥ శ్రితలోకైకవరప్రదానచణ గా • రీహృత్సరోజాలయ
స్థిత! దర్వీకరరాజభూషక్రతుభుక్ • శ్రేయస్కరా కాంచన
క్షితిభృత్కార్ముక! కృత్తివాస దనుజశ్రేణీ వినాశక్షమా
హత పాపౌఘ దయానిధీ మధుర మీ • నాక్షీ మనోవల్లభా.

క॥ తలపుల మెలగెడు వేల్పా•తొలిపలుకుల కొనలఁ దిరుగు తోరపు టేడా
తెలిపురుగు నెక్కి త్రిమ్మరు • వలఁతి తలక్ ద్రుంచినట్టి బలిమికలాఁడా.

స్వాగతవృత్తము॥

దారుకాసుర వి • దారకలోకోద్ధార మంగళ ని • ధాన గిరీశా
హారహీరశర • దాభశరీరా సూరిలోకనుత • సుందరనామా.

తే॥ కష్టపడి పెంచియిడితి నా • కవితకన్నె నెవ్విధంబున నలరింతొ • యింకనీవు
గంగవోలెను గయ్యాళి • గాదు బేల సుమ్ము నీతల నెక్కి నా • ట్యమ్ము సేయ.

సీ॥ ఏ మహామహుఁడు శ్రీ • వేమనారాధ్య వంశాబ్ధికిఁ బూర్ణశ • శాంకుఁడయ్యె
నే తల్లి సావిత్రి • కెనయైన సతుల్ మెచ్చ మహిని బాతివ్రత్య • మహిమఁగాంచె
నట్టి నందయకు గా • రవమునద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోదరుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మడి • యమగు శ్రీమదాంధ్ర లింగపురాణోత్త • రార్ధమందు
నలరు నాఱవయాశ్వాస • మయ్యెఁ గరుణసతము దీనిని రక్షించుఁ • జంద్రమౌళి.

---

# శ్రీ మదాంధ్ర లింగపురాణము

———:o:———

## ఉ త్త ర భా గ ము.

## స ప్త మా శ్వా స ము.

———

క॥ గట్టునిసుగు మెడఁదాలిక్ గట్టినమొనకాఁడ కట్టె • కానపడతులక్
గట్టడిపెట్టిన దిట్టా యిట్టాడఁగరాని వేల్ప • యెఱుకగలాఁడా.

తే॥ ఆలకింపుము వెండియు • వ్యాసశిష్యుఁ • డమ్మునీంద్రులకిట్లని • యనియె నష్ట
దరయనష్టాక్షరియుద్వాదశాక్షరియునుమంత్రరాజంబులగుచు ని • మ్మహిఁబొసంగు.

తే॥ హరి నుపాసించుటకు ముఖ్య • మైనదిదియ మంత్రయుగము దీనిజపించి•మానులెల్ల
రహర్షపదమును జెందుదు • రధికనిష్ఠ నివియగాక వేరొక మంత్ర•మెసఁగు జగతి.

వ. అమ్మహామంత్రంబు పరమేశ్వర ప్రీతికరంబై పంచాక్షరి నాఁబడు అదియష్టాక్షరీ ద్వాదశాక్షరులకన్న శతకోటి గుణితంబై యలరారు అద్దాని పారాయణంబునఁజేసి నారాయణుండు వైకుంఠంబును, చతుర్ముఖుండు సత్యలోకంబును సునాసీరుండు స్వర్లోక పట్టాభిషేకంబును గాంచి మించిరి. మహాయోగులును మోక్షప్రాప్తిఁ బంచాక్షరి మహానందంబు నకా[illegible]ణింతురు. అమ్మహామంత్రం బోంకార[illegible]ష్టంబై షడక్షరి నాఁబడు. అమ్మంత్రంబువర్ణింప బ్రహ్మాదులును సమర్థులుగారు. అయినను నీమంత్రంబునుగూర్చి పరమేశ్వరుండు తొల్లి సర్వమంగళ కుపదేశించె నద్దాని వచియింతు నాకర్ణింపుఁడు.

చ॥ ప్రమథగణంబులెల్ల రిరు • పార్శ్వములక్ భజియింపఁగా న జా
ద్యమరులు నిశ్చలాత్మలయి • యాగమసూక్తుల సన్నుతింపఁగా
హిమనగజాసమేతుఁడయి • యీశ్వరుఁ డుత్సుకవృత్తి రౌప్యశై
లము శిఖరంబునక్ బ్రవిమ • లంబగు రత్నమయాసనంబునక్.

క॥ వినుతించెడి మునిజనముల ననుకంపాదృష్టి గనుచు • నంతికమునకుక్
జనుదెంచెడి సనకాదులఁ గనుసన్నల రమ్మటంచుఁ • గౌతుకమలరక్.

క. ఒకయుత్సకగంబున గణపకుమారులు నొక్క యంక • భాగంబున శై
లకుమారియు నలరారక్ బ్రకటిత వైభవుఁడగుచును • భవుఁడుండంగక్.

క॥ కరయుగము మోడ్చి శైలజ పరమేశ్వరుఁ గాంచి విమల • భావయగుచు బం
ధురవాక్యమిటివచించెన్ బురహరు నెమ్మనము హర్ష • పూర్ణముగాఁగన్.

తే॥ అనఘ యేమంత్రమును జపిం • చిన నరుండు సంసృతిక్లేశములఁ బాసి • సంతతంబు
తావకోరుకృపాపాత్రుఁ • డై విశుద్ధ వర్తనుండును సుకృతియై • వసుధఁ జెలఁగు.

తే॥ ఏమహామంత్రరాజంబు • నెలమిజపముఁ జేసి భక్తుఁడిష్టార్థముల్ • నెందినిఖిల
మునిజనాగ్రసరుండయి • యనఘకీర్తి నొందు నెద్దాన మోక్షంబుఁ • జెందునిలను.

మ॥ అనినన్ జంద్రకళాధరుండనియె నా • ర్యం గాంచి దేవీ ముదం
బున నేవారును బ్రశ్న సేయరిటులన్ • ధన్యాత్మ వైతీవు మం
త్రనికాయంబునకెల్ల నొజ్జయయి మ • త్సాయుజ్యమున్ గూర్చు సా
ధనమై యొప్పెడి మంత్ర మొండుగల ద • ద్దానిన్ వినన్ గోరదే.

తే॥ తరుణి సురలందు నేనును • దగ జపింప నర్హములగు మంత్రములఁ బం • చాక్షరియును
వినుతిఁ గాంతుమటంచును • వేదవేత్తలైన విబుధులు వచియింతు • రనవరతము.

తే॥ మహితపంచాక్షరీమంత్ర • మహిమ మరయ నబ్దకోటిశతంబైన • నలవి కాదు
తజ్జపంబునఁ జేసి భ • క్తప్రపంచ మలరు మత్సమీపమున యం • దనవరతము.

సీ॥ ప్రళయకాలంబు సం • భవమైనయప్పుడ స్థావరజంగ మా • త్మకములైన
జగములెల్ల నశించు • శక్తియుతుండనై యేనొక్కరుండ న • హింతునపుడు
వేదముల్ శాస్త్రముల్ • వివిధవిద్యలును బంచాక్షరిఁ జేరియు • నలరుచుండుఁ
బ్రకృతిస్వరూపుఁడా • పంకజాక్షుఁడు యోగ పర్యంకగతుఁడయి • వనధిమధ్య
భాగమున శయనించు నా • భోగిశయను నాభికమలంబునన్ జన • నంబునొందెఁ
బంచముఖములతోడ ని • రించి యతఁడు సృష్టి సేయుతలంపునఁ • ద్రిభువనముల.

తే॥ తొలుదొలుత దశమానసం • బుల సృజించి వానికిన్ శక్తిఁ గూర్పంగ • భక్తివినతు
డగుచు నను వేడుటయును బం • చాక్షరములఁ బంచముఖములయందు ని • ర్వాంచితముగ

తే॥ పలికితినపుడజుఁడు • పంచముఖంబులయందు వానిఁ దాల్చి • యర్థినొసఁగె
మానసములకవియుఁ • బూనికవాచ్యవాచకవిధంబు నెఱిఁగి • సంతసమున.

వ॥ ముంజవన్నగంబునఁ జేరి పరమేశుండ నగు నన్నా మంత్రరాజంబున నారాధించిన నేనును వానికిఁ బ్రసన్నుండనై పంచాక్షరీ మంత్ర జపవిధానంబు సమస్తంబును వ్యాసపూర్వకంబుగ నుపదేశించితినని శంకరుఁడు శాంకరికానతిచ్చె నిమ్మంత్రంబును గూర్చిన ప్రసిద్ధంబులగు నితిహాసంబు లనేకములు గలవందు వ్యాసప్రోక్తంబగు నొక చరిత్రం బుపన్యసింతు నాలకింపుఁడని సూతుం డిట్లనియె.

—• పంచాక్షరీమహిమ. •—

క॥ మనువునకుఁ దృతీయాంతరమునఁ ద్రేతాయుగమునందుఁ • బుడమశ్రేష్ఠుం
దనఘుండు దుంధుమూకసం డనియెడివాఁ డొకఁడు జనన • మయ్యె ధరిత్రిన్.

సీ॥ పరమాత్ముఁడగు పద్మ • భవు మేఘవాహన కల్పంబునందున • నల్పశక్తి
యుతుఁడగు వెన్నుండు • చతురత దీపింప రుద్రునిగూర్చి ని • ర్నిద్రతేజుఁ
డగుచుఁ దపముఁ జేసె • నయుతాబ్దములు పెక్కు పంచాక్షరీమంత్ర • పఠనపూర్వ
కముగ నాతనిభక్తి • కమరలోకాధ్యుడౌ హరుఁడు సంతసమొంది • హరికి వలయు
నర్థములనొసంగె • నంబుజాక్షుఁడు మేఘరూపమూని శైల • చాపుఁ గొల్చు
కతనకల్పమద్ది • గణుతింప మేఘవాహము నాఁగఁ దనరు • నవనియందు.

తే॥ అమలమై మేఘవాహనా • ఖ్యందనర్చు నట్టి కల్పంబునందున • నగ్రజుండు
దుంధుమూకుండు నాసము • ద్భూతుఁడయ్యె నొక్క మునిశాపమునఁ జేసి • యుర్వియందు

చ॥ అతఁడు విశల్యనాఁబడువ • రాంగననొత్తుకఁ జెట్టఁబట్టి త
ద్గతహృదయుండునౌచు నిర • తంబు తదాజ్ఞవహించి కామ మో
హితుఁడు ననన్యకార్య కర • లౌకసమర్థుఁడునై చరించుచున్
గతిపయ వత్సరంబుల న • ఖండ సుఖంబునఁ బుచ్చె నంతయున్.

క॥ ఆవిప్రదంపతులు నిత్యావిర్భూతానురాగ • హర్షాన్వితులై
భావజకేళీలోలురునై విభవమెలర్ప సౌఖ్య • మందుచునుండన్.

తే॥ కొంతకాలమరిగి • నంతసవ్వారి దాంపత్యమునకు ఫలము • వఱలె నాఁగ
సాధుశీలయౌ వి • శల్యయంతర్వత్నియయ్యె దైవయోగ • మమరియుంట.

చ॥ అటుల విశల్యగర్భవతి • యౌటను గన్గొని దుంధుమూకుఁ డు
త్కటమగు కౌతుకంబున న • తంద్రితుఁడై తన ప్రాణమట్లనా
చటులవిలోచనన్ గనుచు • స్వాంతమునన్ దనయాననంబు గాం
చుట యెపుడో యటంచు దతి • చూచుచునుండె ననన్యచింతనన్.

వ॥ మఱియు విశల్య దినక్రమంబునను నుచితదోహదంబు కతనను సంపూర్ణగర్భభరా
లసయై యొక్కనాఁ డమావాస్యయందు రుద్రదేవతాకమగు ముహూర్తమున
మందగ్రహంబు వీక్షించుచుండ భోజనానంతరమున నొక్క కుమారుంగనియెనంత.

క॥ అనఘులు మిత్రావరుణులు ననియెడు మునివర్యులాద్వి • జాత్మజుఁగని యా
తనయుండు తల్లిదండ్రుల కనయ మనిష్టంబుఁ గూర్చు • నని పల్కిరొగిన్.

— దౌంధుమారోపాఖ్యానము. —

తే॥ నీసుతుఁడు దౌంధుమారుండు • నీచుఁడనుచు భయమువలదాంగిరసుని ప్ర•భావమునను
సుకృతియై పాపములనెల్లఁ • జారఁగొనునటంచును వసిష్ఠుఁడనియె న•య్యగ్రజునకు.

ఉ॥ అచ్చటివారలెల్ల హృద • యంబునదోఁచినయట్లు బల్కఁగా
హెచ్చినచింతతోడ ద్విజుఁ • డేమియుఁ జేయఁగలేక దైవమే
పొచ్చముగూర్పఁగాఁదలపఁ • బూరుషుఁడే ప్రతిజేయనేర్చు వి
ద్వచ్చయమాడినట్ల దల • వాంచి చరించుటగాక ధాత్రిపై.

క॥ తొలిజేయు సుకృతదుష్కృతములఫల మెవ్వారికైన • భోజ్యముగాకే
తొలఁగునె యద్దానికినై యలజడినొందంగఁదగునె • యార్యుల కెందున్.

తే॥ చేయునప్పుడెవరు • చెప్పినగానియు వినుతలంపులేక • యనుభవించు
తఱివిచారమొందఁ • దగునె తాఁజేసిన కర్మఫలముతప్పఁ • గలదె జగతి.

చ॥ అనియొకరీతి చిత్తమున • యందుఁ దలంచుచు బ్రాహ్మణుండు
నందనునకు జాతకర్మము నొ • నర్చి యథోచితమైన యౌవనం
బున నుపనీతుఁజేసి ద్విజ • ముఖ్యులయొద్దఁ బఠింపఁబంపినన్
దనయుఁడుఁ దుర్మదాంధుఁడయి • ధర్మముఁదప్పి చరించుచెప్పుడున్.

చ॥ గురునకు బంగనామములు • గూర్పగనెంచునెకాని యెన్నడున్
దిరమగుభక్తి నాతడు స • తీర్థులు వోలె వినీతుఁడౌచు ద్రి
మ్మరఁగఁదలంపఁ డించుకయు • మానముఁ బూనునెకాని పాఠ
ముల్ నిరతిఁ బఠింపనొల్లఁడవ • నీసురపుత్రుఁడు దుష్టసంగతిన్.

తే॥ తానుజదువఁడొరులు • చదువుచునుండుటఁ గాంచియోర్వలేక • కలకలంబుఁ
జేయుగురువులెంతఁ • జెప్పినవినఁడు విప్రాత్మజుండు చంచ • లాత్ముడగుచు.

మ॥ కలమాన్నంబు భుజించి కేశముల సం • స్కారంబుఁ గావించి మే
ల్జిలుఁగున్ బావడగట్టికంకణములన్ • జేదోయి సంధించి యం
గుళులన్ మేలుపసిండి యుంగరములన్ • గోర్కెన్ దగన్బూని సా
నులవీధిన్ జరియించు దుర్జనులు సం • తోషంబునన్ జూడఁగన్.

క॥ అవ్విధిని దౌంధుమారుం డెవ్వరిభయమింతలేక • యేత్రిమ్మరుచున్
యవ్వనగర్వితయగునొక జవ్వనిఁబొడఁగాంచి మోహ • సంగతుడగుచున్.

సీ॥ తనపురోవృద్ధి నెం • తయుఁ గోరుటన్ మాని కోమలిచెలిమియే • కోరుచుండుఁ
బితరులసేయునా • నతిఁబూనుటనుమాని పొలఁతి సాంగత్యంబె • పూనఁదలఁచు

గిరిజామనోహరు • స్మరియించుటనుమాని నిరతంబు వెలకాంత • స్మరణఁ జేయు
శ్రవణపేయంబు లౌ • శంభుకథలమాని యంగనచరితమే • యాలకించు
నీశ్వరాలయముల కేగు • టెల్లమాని నిరతిఁ గాంతాలయమునకై • దిరుగుచుండు
పురహరునితోడ నైక్యమా • పూన్కి మాని చెలియతో నైక్యమొందఁ గాం • క్షించుచుండు.

క॥ ఆగతి వేశ్యాలంపటుఁడై గౌరవమింతయులేని • యరయక తాఁడు దు
ర్యోగమునఁ జేసి నిరతము రాగద్వేషాదులకుఁ గ • రంబు వశుండై.

సీ॥ కాసంత జలజాక్షి • కన్పడెనా ముక్తికాంత దర్శనమైన • కరణి నుబ్బు
నిసుమంత తరళాక్షి • యీక్షించెనా సర్వసామ్రాజ్యము లభించు • సరణిఁ దలఁచు
నించుకంతయు జల • జేక్షణ మాటాడ నమృతపానమె చేసి • నట్లు నెంచు
నొక్కింత పూఁబోడి • యక్కుఁ జేర్చిన నధీశత్వంబు గాంచిన • చక్కి నలరు
నొక్కనిముసమేని • యక్కాంతతోఁ బొందు గలిగెనేని ముక్తి • గలిగినట్లు
సంతసంబుఁ జెందు • భ్రాంతుఁడై దౌంధుమూకుండు లాతిపనులు • కొఱఁతపడఁగ.

చ॥ కులమునకున్ గళంకమును • గూర్చి స్వధర్మముఁ గోలుపుచ్చి మి
త్రుల హితవాక్యముల్ దొలఁగఁ • ద్రోసి పదంపడి యెల్లబాంధవా
వళికి భరింపరాని తల • వంపులఁ గల్గఁ జేసి తల్లిదం
డ్రులు గృశియించుచుండ టక • టొంకయి త్రిమ్మరుచుండె నెంతయున్.

క॥ తననడవడిఁ గన్గొనినన్ జనకుడు కోపించునని యెడు • సాధ్వసమున నా
తనికంటఁ బడక నిరతము జననికడకె వచ్చిపోవు • సానిమనికికిన్.

సీ॥ ఎందుంటివని తండ్రి • యెప్పుడేనడిగిన జదువఁ బోయితినంచు • సరగఁ బల్కు
గనఁబడవిదియేల • యని యొజ్జపల్కిన జనకుండు పనిపెట్టె • ననివచించు
జదువుమానితెయంచు • సహపాఠులడుగఁ దీరికగల్గదని వార • లకును జెప్పు
నిదియేటిధర్మమం • చెవరేని ప్రశ్నింప దైవయోగమని యు • త్తరమొసంగు
పల్లవులఁ గూడి చరియింప • భావ్యమెయని బంధుగులు పల్కనిదియె యైశ్వర్య మహిమ
దౌంధుమూకుండు వారకాం • తానిరతిని నప్రతిష్ఠను లోనయి • యనుదినంబు.

తే॥ తండ్రికెఱుఁగనీక • తల్లికడకుఁ బోయి నయభయములనామె • నగలనెల్ల
నపహరించి వేశ్య • కై యొసగుచు దాని కరుణబడయఁ జూచుఁ • గామియగుచు.

సీ॥ తండ్రియార్జించిన • ధనరాశులెల్లను గుంటెనకత్తియ • కొంపఁ జేర్చి
తనయిల్లువాకిలి • ధనకామినికినయి వెలితిరొక్కమునకు • విక్రయించి
పూర్వార్జితంబైన • సర్వార్థసంతతి పల్లవాధరికినై • కొల్లబెట్టి
తల్లిదండ్రులనగ • లెల్లమెల్లనఁ దీసి కడమరూకలకు తా • కట్టుబెట్టి

సర్వమున్ శూన్యమున్ జేసి, సానితోడి సంగమమె ముఖ్యమనియెంచి ♦ సంతతంబు
దొరికినదియెల్ల నవ్వేశ్య ♦ దరికిఁ జేర్చు కామమోహితుఁడగుచు నా ♦ క్ష్మాసురుండు.

శా॥ ఈరీతిన్ ద్విజపుత్రుఁ డెల్లరును గ ♦ ర్హింపంగ మోహాంధుఁడై
వారస్త్రీ నిరతుండునై తనదు స ♦ ర్వంబాపెకొప్పించి దు
శ్చారిత్రుండును దుర్విచారుఁడును దు ♦ స్సంచారియై నిత్యమే
వారేమన్నను సిగ్గులేక చరియిం ♦ పన్ దల్లియున్ దండ్రియున్.

మ॥ పరివారల్ బరిహాసమున్ సలుప దు ♦ స్సాంగత్యమున్ జేసి ధ
ర్మరతిన్ వీడి యశోభిరామమగు గో ♦ త్రంబెల్ల దుష్కృతిన్ మం
దిరమై కాశక్యతనొందఁగా బుధులు నిం ♦ దింపంగఁ బుత్రుండు ద్రి
మ్మరుచున్నాఁ డిదియేమిపాపమొ యధ ♦ ర్మంబద్ది నాకెప్పుడున్.

సీ॥ వెలకాంతతోఁగూడి ♦ కలుషంబునాక మద్యము ద్రాగుచుండు ని ♦ త్యముకడంగి
కూర్మిఁ జూపుదువేని ♦ కోటియౌనని దానియెంగిలిమాంసంబు ♦ నే భుజించు
తృణమైన నక్కాంత ♦ సన్నిధిలేకున్న ప్రళయంబె కల్గిన పక్కిగుండు
నీదేహమునతోడి ♦ నీదాస్యమొనరించు పుణ్యమబ్బెనటంచుఁ ♦ బొంగిపొరలు

నేదియెట్లులైన ♦ నెవ్వరేమనియన్న గాని యించుకేని ♦ మానసమునఁ
దలఁపఁడయ్యె సుతుఁడ ♦ ధార్మికసంగతి సంచరించువాఁడు ♦ సంతతంబు.

క॥ ఇదిమంచి యిదియె చెడుఁగని మదినివిచారింపఁ డెపుడు ♦ మరియాదకు నా
స్పదమైన కులముకీర్తిన్ బొదలించుచున్నవాఁడు ♦ పుత్రుండకటా ?

తే॥ ఈశ్వరానుగ్రహంబున ♦ నీసుతుండు కలిగెనని నెమ్మనంబున ♦ నలరుచుంటి
మక్కటాయిట్టి దుర్మార్గుఁ ♦ డగునటంచుఁ దెలిసికొనఁగఁదగినయట్టి ♦ తెలివిలేక?

తే॥ అనియహోరాత్రములు నంద ♦ ననిగుణించి పగలబొగలుచు సమయి ♦ వార్ధకమున
బలముఁ లేకున్న తల్లిదం ♦ డ్రులనుగాంచి కనికరము జెందఁడయ్యె నా ♦ తనయుఁ డాత్మ.

సీ॥ అవ్విధంబున విప్రుఁ ♦ డా వెలతరుణికై తనుధనంబుల నెల్ల ♦ ధారవోసి
కులమున కపకీర్తి ♦ గలిగించి భ్రష్టుఁడై పరివారలందఱు ♦ బరిహసింప
గాసునకును గొఱ ♦ గాక జీర్ణించిన వసనంబులన్ దాల్చి ♦ వ్యసనబాధి
తాత్ముండగుచు నన ♦ యంబు వేశ్యకు దాసుఁడై చరించుచు విక్రీ ♦ తాత్ముఁడైన

వానిఁ బరిహరించి ♦ వారకామినియొక్క లాతివానియందుఁ ♦ బ్రీతిదగిలి
తాఁ జరించుచుంట ♦ దౌంధుమూకుడుకాంచి డెందమందుగరము ♦ కుందు జెందె.

—• దుంధుమూకుండు వేశ్యఁ దూరుట. •—

మ॥ తలిదండ్రుల్ దరిలేనిదుఃఖజలధిన్ • దాటంగ లేకెంతయో
విలపింపన్ గులధర్మమున్ విడిచి నీ • వేలోకమంచాత్మలో
పలవిశ్వాసముఁ జెంది నీయెడనె నా • ప్రాణంబులన్ జేర్చి నిం
దలపాలైతినిగాదె నీకొఱకు గాం • తా గోముఖవ్యాఘ్రమా.

శా॥ ఈవే ప్రాణము నీవె నావ్రతఫలం • బీవే సుఖంబంచు న
న్నే వేళన్ వలపింపఁజేసి త్రిదివా • ధీశత్వమున్గూర్చు న
ట్లే వాలుంగను త్రాళ్ళఁగట్టి తుదకీ • హీనత్వమున్ గూర్చి నా
కే వైరాగ్యము గల్గఁజేసితివె యిం • తీ గోముఖవ్యాఘ్రమా.

మ॥ పరులేరీతిని నిందఁజేసినను ద్ర • వ్యంబెల్ల పాడైన భూ
సురవంశం బపకీర్తిపాలయిన దు • ష్టుండంచు దాయాదులు
ద్ధురతన్ నన్వెలిబెట్టినన్ వినక నీ • తో మైత్రియే గోరి త్రి
మ్మరునన్నన్ విడనాడుటహా మె తలం • పన్ గోముఖవ్యాఘ్రమా.

మ॥ తొలుతన్ మెల్లనఁ జేరఁగాఁబిలిచి యెం • తో ప్రేమయున్నట్లుగా
వలపున్ జూపి సితాంబకంబులను నా • పైజేర్చి నీకన్న న
న్యుల కీదేహము చెందదంచు వెస న • న్నున్ మోసమున్ జేసి యీ
సిలుగున్ గూర్చి త్యజించితే నను పిశా • చీ గోముఖవ్యాఘ్రమా.

శా॥ నీలావణ్యము నీయొయారము హొయల్ • నీచెక్కుటద్దంబులున్
నీలంపుం గురులున్ సుధామధురముల్ • నీసూక్తులున్ నాకు నే
వేళన్ భోజ్యములయ్యెనే నఖిల పృ • థ్వీపాలనం బబ్బిన
ట్లేలా కాదనియంచు నమ్మితిని గా • దే గోముఖవ్యాఘ్రమా.

శా॥ పాపంబన్న భయంబులేకిటుల నే • భ్రష్టుండనై యేను స
ద్వ్యాపారంబుఁ బరిత్యజించితి ధన • ప్రాణాలి గోల్పోయితిన్
గాపట్యంబు వహింతువీవను చెలుం • గన్ లేక దుష్కీర్తియున్
బాపంబున్ మెడఁగట్టివీడితె • తలం • పన్ గోముఖవ్యాఘ్రమా.

సీ॥ కులమున కపకీర్తి • గలుగునెడిభీతి విడనాడితినినిన్ను • విడువలేక
తలిదండ్రు లెంతేని • విలపించినను వారిఁ జేరనైతినినిన్ను • జేరుకతన
నిది యకార్యంబంచు • నెఱిగించుమిత్రులఁ దలఁపనైతిని నిన్నుఁ • గొలుచుకతన
పితృదినంబులనైనఁ • బిడికెడన్నమునింటఁ దిననైతి నీయింటఁ • దినుచునుంటఁ
దనుధనంబులు నీకర్పి • తములుగాగ దాసుఁడనయితి నీ చక్కఁ • దనము కిటు
లహహ విశ్వాసమింతయు • నైనలేక విడిచి యితరుని జేరితే • పడతి నీవు.

మ॥ కులహీనుండను కొంకుజెందరు మహా • క్రూరుండటం చెంతయుక్
దలఁపక బోరు నిరక్షరుండను నిషే • ధం బింతయుక లేదు ని
చ్చలు రొక్కంబిడువాఁడె భర్తయగుచుక్ • స్వాంతంబునందెంత్రు వే
శ్యలు వారిక మదినమ్మినక జెడును గా • దా గోముఖవ్యాఘ్రమా.

క॥ రసికాగ్రేసరుఁడైనక బసగల పురుషుండెయైనఁ • బండితుఁడైనక
వసుమతిఁ జంపకముల నళివిసరమువలె ద్రవ్యహీను • విడుతురు వేశ్యల్.

మ॥ ధనహీనుండయినక దరిద్రుఁడయినక • దత్వజ్ఞుఁడైనక నృపా
సన విభ్రాజితుఁడైన సర్వజగముల్ • శాసించువాఁడైన లో
కనికాయంబును బ్రోఁచువాఁడయిన రో • క్కంబీయకున్నట్టి యా
తని నిశ్చేతను గాద్యజింత్రు ధనకాం • తల్ గోముఖవ్యాఘ్రమా ?

తే॥ పలువిధంబుల మాయమా • టలనుబల్కి సర్వసన్యాసిగాఁజేసి • సరగనన్నుఁ
గాదనుచు వేరొకని మైత్రిఁ • గాంచినావె చెడిపె నీకులమర్యాద • విడువలేక ?

మ॥ కులటా నీకులవృత్తి బోవిడక నీ • కుక రక్షకుండైన యా
చెలికానిక విడనాడి వేరొకరునిక • జేపట్టితే నీకునై
తలిదండ్రుల్ విలపించినక గురువు ల • త్యంతంబు దూషించినక
వెలినై త్రిమ్మరినాఁడగాదె నిను నే • వేళక మదిక గోరుచుక.

తే॥ అపయశంబుగల్గె • నార్యులగోష్ఠిలో ధనముగోలుపడితిఁ • దల్లిదండ్రు
లైనఁ జేరనీయ • రైరి యాశ్రయమైన నీవువిడిచితెందుఁ • బోవువాఁడ.

వ॥ అని యనేక విధంబుల డౌంఢుమూకుండు వేశ్యక గుఱించి దూషించియు విలపించియు నద్దాని కృత్యంబునకుఁ బ్రతీకారంబు జేయక యూరకుండుట పౌరుషంబు గాదని స్త్రీవధ కలుషకారణమని యైనఁదలంప కొక్క నిశీధంబున నెప్పటి యట్ల సానియింటి కరిగి మైమఱచి నిద్రించు వెలకాంతక బలవంతంబున వధించి తద్గత మానసుండై సంచరించుచు నొక్కనాఁ డరణ్యంబున.

—• డౌంఢుమూకుం డంగిరోమునీంద్రునితో నిజవృత్తాంతము జెప్పుట. •—

సీ॥ మహిత పంచాక్షరీ • మంత్రజపమెదక్క నన్యకృత్యమెఱుంగ • నట్టివాని
సతతంబు శితికంఠు • స్మరియించుటేగాక యన్యచింతనము లే • నట్టివాని
నాహారమైన లే • కనయంబు గిరిచాపు నారాధనమొనర్చు • నట్టివాని
శివభక్తులక గన్న • శివభావమూని నిత్యమగుభక్తినిఁగొల్చు • నట్టివాని
నుదుటభూతిరేఖ • లెదను రుద్రాక్షలు కేలుగవను స్ఫటిక • మాలికలును
దాల్చి వెలుగువాని • దండితాఘుండునై యెసగు నంగిరో ము • నీంద్రుగనియె.

క॥ కనుఁగొని తద్దర్శన సంజనితజ్ఞానుండు విగత • సకలాఘుండున్
గనదుత్తమతేజుండై మునివరునకు వినతుఁడగుచు • భూసురుఁడనియెన్

మ॥ అనఘా యేను కృతాపరాధుఁడను దు • ర్వ్యాపారశీలుండ బం
ధు నికాయంబుఁ దిరస్కరించి తలిదం • డ్రులన్ వృద్ధు లేరీతిఁ జె
ప్పిన నిర్లక్ష్యముఁ జేసియే వినక ని • ర్భీతుండనై యెప్పుడున్
ధనకాంతారతిఁ గోరి ద్రిమ్మరితి గో • త్రంబెల్ల వ్యర్థంబుగాన్.

తే॥ తనుధనంబులు క్షీణించి • యనియె కులమువారు వెలిబెట్టి విడిచిరి • చేరనీక
యైహికాముష్మికంబుల • యందు నేను వ్యర్థుఁడనయితి వెలకాంత • వలననకటా.

క॥ చేతన్ రొక్కముగల వఱకా తలిరుంబోడి నిశ్చ • లాత్మయగుచు న
న్నే తనదైవముగా సంప్రీతిఁదలఁచి కపటమైత్రి • నెఱపించె వెసన్.

క॥ తనమూలంబున నిరుపేదనయితినను కనికరంబు • దలఁపక నన్నా
వనజాక్షి విడిచి వేరొక ధనవంతునిఁ దగులుకొనియెఁ • దద్దయుఁ బ్రేమన్.

తే॥ కులమునందుఁ జెడితి • వెలకాంతకుఁ జెడితి సాటివారిలోనఁ • బోకనయితి
దేశద్రిమ్మరినయి • తిరుగుచుంటిని నిన్నుఁ గాంచి సుకృతినైతిఁ • గావఁగదవె.

చ॥ అనితనవృత్తమెల్ల విశ • దంబుగఁ దెల్పిన దౌంధుమూకునిన్
గనుగొనియప్డు జోగి తల • కట్టను నేటికి నీకుఁ జింత పా
వనచరితుండు శంకరుఁడు • భక్తజనాశ్రయుఁ డెవ్విధిన్ దలం
చిన నటులౌనుగాని నరు • చిత్తము వచ్చినయట్లు యౌనొకో.

తే॥ ఎట్టి దుస్సాధ్యమను కార్య • మేని సేయఁ దలఁచుఁ దలఁచిన యంత నె • తాను జేయు
సర్వచతురుండు శంకరుఁ • డుర్వి నతని యానతియు లేక యేపని • యైనఁ గాదు.

తే॥ చేయునట్టివాఁడు • జేయించువాఁడును ననుభవించువాఁడు • నాతఁడెయగు
నెఱిఁగియెఱుఁగకిట్టు • లేలఁగర్తృత్వంబుఁ బూనవలయు ధాత్రి • పురుషులకును.

చ॥ మనుజు డచంచలుండయియు • మాధవుపాద సరోజయుగ్మమున్
ఘనతరభక్తిఁ గొల్చు చొడి • కంబున కాలుని దర్శనంబులే
కనయము సౌఖ్యమొందెడు ప్ర • యత్నముఁ జేయఁదగున్ ధరన్ మహా
మునులు వచించినట్లు దప • మున్ జపమున్ సుకృతం బొనర్చుచున్.

వ॥ కావున గతజలసేతుబంధనముఁ గావించినట్లు వ్యర్థంబుగఁ గడచినదానికై విచారింపక సర్వలోకైక రక్షకుండును నిర్గుణుండును నిరంజనుండును నిర్వికారుఁడు నగు పార్వతీనాథుని సేవించి సకల కలుషంబుల దొలఁగుమనిన నంగిరోమునికా దౌంధుమూకుం డిట్లనియె.

ఉ॥ ఏను దురాత్ముఁడన్ సుగుణ • హీనుఁడ మూఢుఁడ దుర్మదాంధుఁడన్
జ్ఞానము లేనివాఁడఁ గొఱఁ • గాని మనుష్యుఁడ నెవ్విధంబునన్
మానిజనార్చితుండగు న • మాధవుఁ గొల్వఁగ నేర్చువాఁడనే
పూనికఁ జంద్రశేఖరుని • భూతపతిన్ భజియించువాఁడనో.

తే॥ నిన్నె యాశ్రయించి • యున్నవాఁడను నాకుఁ గనికరమున నీలకం • ఠునందు
భక్తిగలుగునట్టి • పద్ధతి నెఱిఁగించి యుద్ధరింపుమయ్య • యోగివర్య.

ఆ॥వె॥ అనినఁ గనికరమున • నయ్యోగివర్యుండు ధరణిదేవుఁ గాంచి • సరగ ననియె
వినఁగదయ్య హరుఁడు • విశ్వేశ్వరుఁడతని నెటులనైనఁ గొల్వ • నేమి కొఱఁత.

చ॥ అతుల తపోధనాఢ్యులగు • నట్టి మహామునివర్యులెల్ల సం
తతము ననేకరీతులఁ బ • దంపడి శంభుని గొల్చుచుందు రా
శ్రుతిశిఖరాగ్రవాసియగు • సోమకళాధరుఁ గొల్చునట్టి ప
ద్ధతి నెఱిఁగింతు నీకు విది • తంబగునట్టుల నాలకింపుమా.

వ॥ అనంతగుణ సంపన్నుండగు నయ్యుమాకాంతుని శ్రుతిస్మృతి పురాణేతిహాసంబుల
మూలంబునను సంతత జపతపస్స్వాధ్యాయంబుల కతనను మహాయోగులు ధ్యానింతురు.
భక్తరక్షణదక్షుండగు విరూపాక్షుని వశ్యంబు గావించునది పంచాక్షరీ మహామంత్రం
బని బ్రహ్మాదిసురలు వక్కాణింతురు. కావున నీ కావించిన దోషంబులెల్ల
బాయునట్లు పంచాక్షరీమంత్రం బుపదేశింతు శ్రద్ధధానుండవై యుండుము.

తే॥ సకలనిర్జరులందున • శర్వుపగిది బర్వతములందుఁ గాంచన • పర్వతంబు
నట్ల మంత్రంబులందుఁ బం • చాక్షరియను మంత్ర మలరారు నధికమా • మహిమ గలిగి.

క॥ పంచాక్షరీప్రభావము నెంచఁగ శక్యంబె యింది • శేషునకైనన్
గాంచనగర్భునకైనను బంచాస్యునకైనఁ గాని • బహువిధగతులన్.

సీ॥ అజ్ఞాన తిమిర స • హస్రభానూదయం బరివర్గ భూమిధ • రాశి వజ్ర
మాపత్పరంపరా • కూపారకోలంబు కలుషాటవీ దవా • నలచయంబు
మోహాలతాంకూర • ములకు లవిత్రంబు సంసారరోగ సం • చయహరణము
తాపత్రయాభీల • దావపావకవర్షణ మన్యచింతాపయో • దాశుగంబు

మోక్షలక్ష్మీకరగ్రహం • బునకు సుళువు సకలసౌభాగ్యసంపద • లకు నిలయము
మహిని పంచాక్షరీమహా • మంత్రమరయ దత్ప్రభావంబు నెంచంగఁ • దరమె మనకు.

తే॥ ఎట్టి పాపిష్ఠుఁడైన • నేమి పంచాక్షరిస్మరణఁ జేయునేని • సకలకలుష
ములను దొఱఁగి మోక్ష • మును జెంది శాశ్వత శంభులోక సుఖము • సరగనొందు.

తే॥ ఇమ్మహామంత్రరాజంబు • నీవు భక్తిజపముఁజేయుదు వేని నీ • సలిపినట్టి
యెల్లపాపంబులను బాసి • యీశ్వరాంఘ్రిసన్నిధి వసింపఁగలుగుదు • సంతతంబు.

క॥ పంచమహాపాతకహరం మంచితతత్త్వావరణము • నై యలరెడు నీ
పంచాక్షరిదేశికముఖ సంచితమగు నేని సకల • సంపదలమరుణ్.

వ॥ పురాణపురుషుండును నారాయణీ మనోహరుండునగు శశాంకశేఖరు వక్కాణిం
చునవియు సార్థకంబులగునవియు నైన నామంబులనేకంబులు గలవు. అవి
యెల్లయేనియు నందొక్కటియేనియు స్థిరమతి స్మరించిన నపవర్గంబు ప్రాప్తించు
ననఁ బరమేశ్వరసాన్నిధ్యదాయకంబును పరశివ స్వరూపంబునగుఁ బంచాక్షఁ
గుఱించి వేరుగ జెప్పనేల. ఐనను విషయాభిరతి జరించిన నీ హృదయంబున
కానందంబు గలిగించుట నాకవసరంబగు గావున నిద్దాని ప్రభావంబుసాటు నొక
యితిహాసంబుఁ జెప్పెద నాకర్ణింపుముని మునీంద్రుఁ డిట్లనియె.

—• కళావత్యుపాఖ్యానము •—

ఉ॥ పాపలతాలవిత్ర మప • వర్గ ఫలామరభూరుహంబు సం
తాపసుధామయౌషధ మ • నారతసంస్మృతి నాశకంబు స
ద్వ్యాప్తి మూలకారణ మ • ఘౌఘనివారణమై చెలంగు కా
శీపుర మొప్పు ధాత్రిఁగల • క్షేత్రములందున క్షేత్రరాజమై.

తే॥ ఆ పురము నూత్మమగు నల • కాపురంబు కలిమి పూఁబోడి కర్మిలి • కాపురంబు
భూపురంధ్రి ధరించిన • నూపురంబు బాపురే దానిసాటి రా • దేపురంబు.

క॥ వందారు మానిజనతా బృందారక భూరుహంబు • వినమత్క్రతుభు
క్సందోహాశ్రయ దేశం బిందుధరున కున్కి యప్పు • రీంద్రంబరయన్.

శా॥ శ్రీకళ్యాణగుణావహంబగుచు సు • క్షేత్రావతంసంబునై
పాకారి ప్రముఖామరప్రకర సం • భావ్యంబునై మోక్షల
క్ష్మీకాంతాధృత భూషణంబయిన కా • శిన్ వజ్రబాహుండు నా
భూకాంతాన్వయమాళి యేలుకొను సం • పూర్ణ ప్రతాపంబునన్.

క॥ ఆ రాజశేఖరుఁడు దుర్వారపరాక్రముఁ డరాతి • రాజద్విపకం
ఠీరవమై సతతసదాచారపరాయణుఁడునగుచు • సాధుప్రియుఁడై.

త॥ శివభక్తావనపరుఁడై శివపూజారతుఁడగుచు న • శేషబుధజన
స్తవనీయుండై నిరతము భవభక్తాగ్రేసరుఁడయి • ప్రథితుండయ్యెన్.

చ॥ అతులిత సద్గుణాఢ్యుఁడగు , నమ్మహి నాథుని కూర్మిపట్టి భా
సిత నవయౌవనాఢ్య శశి • శేఖర పాదపయోజ భక్తయై
యతుల కళాభిరామయగు • టారసియార్య లజ్జప్రముఖ గళా
వతియని పిల్వఁ జెన్నలరె • బంధురరూప విలాసరేఖలన్.

సీ॥ పంచాక్షరీమంత్ర • పారాయణమెదక్క తలఁపబో దితరమం • త్రముల నెపుడు
నిరతంబు చంద్రశే • ఖరు స్మరించుటెదక్క స్మరియింపనొల్ల ది • తరసురలను
శ్రవణపేయంబుగా • శంభుచరిత్రముల్ వినుటెగా కొరకతల్ • వినదాకిలత
గిరిశు.పూజాపరి•కరముల నెమకుఁగా కితరకృత్యంబుల • నెఱుఁగదింత

శైవజనముతోడి • సంభాషణమెదక్క లాతివారితోడ • నేతతీయును
మాటలాడఁజనదు • మానవనాయకు ప్రియకుమారి భక్తి • వృద్ధయగుచు.

ఉ॥ ఆవిధి జ్ఞానవృద్ధయయి•యాశ్రిత శైవజనంబుపాలి క
ల్పావనిజాతమై యహర • హంబు శివార్చనయే యొనర్చుచున్
బావనసచ్చరిత్రయగు • పట్టిఁ గనుంగొని భూమిపాలకుం
డావనజాక్షికిన్ బరిణ • యంబొనరింతునిటంచు నెంచుచున్.

చ॥ చతురుఁ డుదారచిత్తుఁడు ప్ర • శస్తయశస్కుఁడు సాధులోక ర
క్షిత, నవయౌవనాఢ్యుఁడు వ • శీకృత సర్వధరాతలుండు సం
స్తుతచరితుండునా దళర • థుండను పాండ్యనృపాలునిన్ గళా
వతి కుచితుండటంచును వి • వాహ మొనర్చెను సంతసంబునన్.

తే॥ అటులఁ బెండ్లిజేసి • యల్లునకును గూఁతునకును వజ్రబాహుఁ • డకుటిలమతి
పర్వరీతిఁ గాంచ • నాంబరములు వాహనములు రత్నభూష • ణములొసంగె.

వ॥ అవ్విధంబున వజ్రబాహుండు ముద్దుకూఁతునకుఁ బెండ్లిగావించి గాణలకును బట్ల
కును గైసరులకును దక్కుఁగల చుట్టంబులకును దగినరీతి సత్కారంబులఁ గావించి
పంపె నంత.

—• సంధ్యాకాలవర్ణనము •—

సీ॥ హరిపద సౌధసం • చర దమరాంగనా హ స్తవిన్యస్తారు • ణాబ్జములన
చరమధాత్రీధర • స్థవిపిన సంభూత లలితరసాల ప • ల్లవములనఁగ
కాలాటవీసాధ కళ్యాణసమయ విప్రార్పితబహుళ మం • త్రాక్షతలన
గౌతమశాండిల్య • కణ్వాది మానిసంచయశాఖ బద్ధ కా • షాయములన

విరహిణీ చైత్రయాత్రా ప్ర • వీణ మన్మథాశ్వనాశికములనంగ, • నమరనాథ
గజకపోలప్రదీపిత • గైరికలన సాంధ్యరాగంబు లలరె నా • శాముఖముల.

తే॥ లీలవిహగంబు లాబద్ధ • మాలలగుచు గగనమునఁబారె ముకుళించెఁ గమలపంక్తి
జలములింకె మరీచికా • సంచయములఁ బంకజాప్తుండు జలనిధిఁ • గ్రుంకటయును.

ఉ॥ పల్కులపుల్గుమావు జగ • బంటు వియోగినులైన కాంతలన్
వలఁతితనంబుతోడఁ గెలు • వన్ బయనంబొనరించి పూనికన్
దొలితనబంట్ల నంపెననఁ • దోఁచె నిరుల్ జెలరేఁగి యంతఁ జు
క్కల సరణిన్ గణింప నతి • గాఢములై భయకారణంబులై.

తే॥ ప్రోల్లఁదోఁచుకొనఁగఁ • బూనిక నొనరించి భక్తిజోరులెల్లఁ • బసిఁడివలువ
వేల్పునజ్జనిడిన • విమలకుందసుమంబు లనఁగఁదారలభ్ర • మందుఁజెలఁగె.

వ॥ అంత.

తే॥ లచ్చిసైదోడుకలువల • మెచ్చువాఁడు మిన్నుసికవేల్పు తలలోన• మెలఁగువాఁడు
జక్కవలనూడు చుక్కల • సంగడీఁడు ప్రొద్దుజోడుదయంబయ్యెఁ • బూర్వగిరిని.

వ॥ అదియే సుముహూర్తంబని నిశ్చయించి భూనాథుండు నూతన దంపతుల
నొక్కటిసేయు తలంపున ప్రౌఢలగు ముత్తైదువల నేర్పరచిన వారలయ్యెడ.

సీ॥ పట్టెమంచము విరి • పాన్పు దిండును దోమ తెరయును బాగాల • బరిణెపీటె
వట్టివేళ్లసురటి • పచ్చికస్తురిమంద సము మంచిగంధంబు • చందువాలు
సంపెంగనూనెయు • జాలవల్లిక పెద్ద పీటవెలుంగు దీ • పికయు నగురు
ధూపంబు దంతపు • దువ్వెన నిలువుట ద్దంబు సున్నవుగిన్నె • తమ్మపడిగ
మును దివాచియుఁ బన్నీరు • మున్నుగాగ ద్రవ్యములకెల్ల నునికియై • తనరు నొక్క
కేళికాభవనంబున • లీలఁ బెండ్లి కొమరునిన్నిల్పిరప్పుడు • కూర్మిహెచ్చ.

వ॥ అప్పుడు.

క॥ నవయౌవనోద్ధతుండగు నవనీనాథుండు మృదుల • మగు శయ్యపయిన్
బ్రవిమలమతిగూర్చుండియు నవలామణిసంగమము మ • నంబునఁగోరన్.

క॥ శారికలునుమదపికములుఁ గీరము లిరుదెసలయం దొ • గిన్ గొల్వఁగ భూ
దారకుమారకు నేయఁగ మారుఁడు పయనంబొనర్చె • మమతదలిర్పన్.

చ॥ చిలుకటటాణినెక్కి యొక • చే వెడసింగిణిదాల్చి వాడిపూ
ములుకులఁగూర్చి యార్చి బమి • పుర్వులు ఝుమ్మన నల్లెలాఁగి య

వ్వలఁతి వెడంద బొమ్మనఁ జి • వాలున నమ్ములఁ గుమ్మరించెను
మ్మలికను సోలఁగా నళిఁడు • మారుఁడు పాంథజనాళిమారుఁడై.

తే॥ అంతఁ బెండ్లికొమరుఁ • డాతుల్యమారుని దాడికోర్వలేక • తరుణి రాక
యాలసించుచుండ • నంబుజబాణుని వేడికొందుననుచు • వెతలమునిగి.

సీ॥ నీదాడికోర్వక • బూదిదాలుపుజంగ మయ్యెదాపలి దెస • నతివఁ జేర్చె
నీబారికోర్వక • నీరజలోచనుం డిందిరాసతి నెద • నెలమిఁ బూనె
నీచయ్యాలకుఁ దాళ • కా చదువుల వేల్పు మోముదమ్ములయందె • ముగుద నుంచె
నీవె తలన్మన్గి • రే వెల్గు జతఁ గ్రుంకు వలుకఁ బద్మినిని గా • పాడుచుండె.

నారయిట్టి జగాజెట్టి • వాత్మ లేత కూనలని యెంచ కిట్టులఁ • గొఱఁతవడఁగ
వాడికోలల నేసెదు • పాడియగునె క్షణవిజిత సర్వగీర్వాణ • జలజబాణ.

క॥ సిరిగలవాఁడనటంచును గరువంబున విరహిజనులఁ • గాసిలఁ జేయన్
దొరతనపువారిచయ్యవలె మరుఁడా యిఁకనైన మంచి • మార్గము గనుమా.

తే॥ అద్వితీయుఁడ వాకన్న న • న్యులెవరుఁ గానఁబడరైరే నీపరా • క్రమముఁ జూప
నవనిఁ బిచ్చుకమీఁద బ్రహ్మాస్త్ర మిడెడు చందమున సతజగముల • యందగాడ.

తే॥ హరివిరించాది యమరుల • నైన సాధ్య సాత్తచిత్తులఁ జేయు నీ • యంబకముల
విరహిజనమంచు నెంచక • వేయఁదగునె విరహిణీమార జితశూర • హరికుమార.

చ॥ చిలుకలు గోరువంకలును • జెన్నగు కోయిలలంచపిండులు
న్గొలువఁగ నించు విల్లుఁగొని • కోరికెలిమ్మడిగాగ వేల్పులన్
గెలువఁగఁజాలు నీవిటు లో • గిన్ విడనాడియుఁ గూర్మిలేకయే
పలువలు సేయు చయ్యాలకుఁ • బాల్పడుటొప్పునె పచ్చవిల్తుఁడా.

తే॥ మ్రొక్కెదను నీకు రాచిల్క • జక్కినెక్కి యుక్కు మెరయంగ జగముల • నోలిగెల్చి
దినుసులేనట్టి వలఁతివై • తేజుమీటె కనఁపడక చరియించు జ • గాముగండ.

చ॥ విరివిలుకాఁడ మిన్నసిక • వేల్పు నెదుర్కొని బన్నమొంది వే
గరుమడంగి మైదొఱఁగు • కాలమునందున నేడబోయె గ్ర
ద్దరితనమెల్ల నిప్పుడు ప • దంపడి నాయెడఁ జూపుచుంటివే
పురిపులుగుల్ పికంబులును • బూనికడంక నపోటుబంటవై.

తే॥ అకట యవ్వకున్కి • యరపడనమ్ములఁ దమ్ములూని విరహు • లుమ్మలికమఁ
జెందనేసెదేల • చెన్నగునిలుదీసి పందలిగ నొనర్చు • పగిది మరుఁడ.

వ॥ అని యనేకవిధంబులఁ గామోద్రేకంబున మదను నుద్దేశించి పలుకుచుండె నక్కడఁ
బుణ్యాంగన లప్పుడు.

క॥ చిరచిరఁజనికన్నియ కెల్లరలంకారముల జేసి లలినిట్లనిరో
తరుణీ నీ వెనిమిటి వేమరు మనసిజకేళిఁగోరు • మక్కువతోడన్.

తే॥ అనుచు బల్కు కల్కి • కర్మలితోడుత బడుకటింటికడకుఁ • బడఁతితోడు
కొనిచిరానఁజేరి • కొమ్మచేతి విడెంబుఁ బతికిఁ బతివిడెంబు • సతికిఁగూర్చి.

వ॥ కార్యాంతరవ్యాజంబున నొక్కొక్క రరిగి రంత దశరథుడు గళావతిసోయగంబున
కాశ్చర్యంబును నానందంబును డెందంబున గ్రమ్మకొన సార్థకనామధేయగు
తోయజాక్షి తన కిల్లాలగు టెంతయు సుకృతఫలంబని.

సీ॥ కలికిబంగరుబొమ్మ • గాదనియను టెట్లు జిలిబిలిపలుకులఁ • బలుకుదాక
కొమ్మ జేజే ముద్దు • గుమ్మ గాదను టెట్లు బెళుకుఁజూపుల సొంపు • లలరుదాక
మెలత తొల్కరిమించు • మించు గాదను టెట్లు నెమ్మి నొక్కించుక • నిలుచుదాక
గోతిక్రొన్ననవిల్తు • నాతి గాదను టెట్లు లామని చెలిరాక • కదరుదాక

యీపడతి మేలుబంతి య • ప్సాపరాప దంతిగాదను టెట్లు ర • వ్వంతకౌను
గానుపించెడుదాక యి • క్కన్నెమిన్న నాకుఁ దక్కుటఁ జూడ పు • ణ్యంబె కాదో.

సీ॥ చెలియపాల్కడలి ము • ద్దులపట్టి యనవచ్చు గోముగా బెడిముద్దు • మోముఁగాంచి
పడఁతికొండలలేని • పట్టియనానవచ్చుఁ జెలువారు గబ్బిగు • బ్బలనుగాంచి
పాలతుకపలుకుల • వెలఁదియనానవచ్చుఁ దడవుగల్గిన చిన్ని • నడలఁగాంచి
పూఁబోడి వేలుపుఁ • బోడియనానవచ్చుఁ జలనంబులేని కన్ను • లనుగాంచి

యిదియనుచు నిక్కముగఁబల్కు • నెవరితరమొ యలరువిల్కాడ నెడు బోయ • కదరికావ
గోనదాఁగిన నెఱజింక • కూనయనుచు నాకుఁదోఁచెడు మెలఁతక • న్నాకుజూడ.

తే॥ అనుచు సుమశరు నిశితశ • రాళికోర్వ జాలక పెండ్లికొమరుండు • చారుగాత్రి
యగువరారోహ డాసి నెయ్యమునఁగమ్మ తేనియలు గాఱఁ గామిని • తో నిటులను.

చ॥ పలుకవదేల బాల మరు • బారికిఁ దాళఁగజాలఁ దేనియల్
జిలుకఁగఁ గాలయాపనముఁ • జేయకనీ యకలంకమూర్తిలో
నిలిపినవాఁడ నీకు సరి • నీవె యటంచుఁ దలంచినాఁడ రం
తుల నెనలేని వేడుకల • తో నలరారఁగఁజేయుమా ననున్.

— • కళావతి దశరథునితో బంచాక్షరీమంత్రము జపించుమని చెప్పుట • —

క॥ అనుచుం గామోద్రేకం బునఁ దనకరముఁ గ్రహింపఁ • బూనినమగనిన్
గనుగొని కళావతీ సతి యనులజ్జావనతవదన • యై మెలమెల్లన్.

క॥ ఓమహినాయక నీకి ట్లేమిటికి విగాళిఁ జెందు • టీ లలితాంగిన్
గామాతురతన్ గవయఁగ నీమది కోరికయకల్గు • నేని వినుమిటుల్.

ఉ॥ దక్షమఖాంతకుండగు సు • ధాకరమౌళి పదాంబుజంబు పా
పక్షయకారణంబనుచు • భక్తి భజించుచున్నదాన బం
చాక్షరికన్న నా కధిక • మైనది మంత్రజపంబులేమి ప్ర
త్యక్షము గాదె నీకు వసు • ధాధిపనంద కీర్తిచంద్రమా.

క॥ నీరూపవిలాసంబుల సారయ శివభక్తి యింత • యైనను గనరా
దేరీతి నన్నుముట్టెదు భూరమణా శైవభక్తి • పూర్ణాంగనికన్.

క॥ గురుముఖమునఁ బంచాక్షరిఁ గర ముపదేశంబుగాంచి • క్ష్మాపాలక మ
త్కరము గ్రహింపుము కాదే విరసంబుగ నన్నుముట్టి • వెతగందువికన్.

చ॥ అన విని యబ్బురంబున న • హా యిదియేటి విరుద్ధధర్మ నీ
వనరుహనేత్ర యిట్టియెల • ప్రాయమునందునె విరక్తయై
తనువు సుఖంబునొల్లక పఁ • దంపడి యోగినులట్ల బల్కుచున్
దనను స్పృశింపకుండుమని • తద్దయుఁ జెప్పుచున్నదీక్రియన్.

తే॥ ఈ లతాంగి ముద్ద • రాలనిమదిలోన నుబ్బ ముటెయుచుంటి • నువిదయహహ
యిట్టిప్రౌఢయనుచు • నెఱుఁగలేకకీ కాంతయెట్లువశ్యయగునొ యింకమీఁద.

తే॥ అనుచుఁ బలువిధముల • నాత్మఁదలంచుచు నా నృపాలపుత్త్రుఁ • డతివఁ గాంచి
యింతిసోయగముల • దొంతివనుచు నిన్నుగలయఁగోర నిట్లు • బలుకఁదగునే.

చ॥ అనఘుఁడు ప్రాజ్ఞుఁ డుత్తమగు • ణాఢ్యుడు నీ జనకుండుపూన్కి రా
ట్తనయులలోపలన్ బహువి • ధంబుల నీకుచితుండు నైనవాఁ
డని నిను నాకొసంగెఁగదయ • గ్రజులెల్లరు సమ్మతింప నో
వనితనినున్ గ్రహించితిని • పత్నిని గాననలంబు సాక్షిగా.

తే॥ అన్నివిధముల నీడుజో • డైనదానవనుచుఁ బ్రాణంబులెల్ల నీ • యం దెయుంచి
కేళికాభవనమున నీ • లీల నిన్ను వేడినను పల్కవేల పూ • బోడియిపుడు.

చ॥ ఎలమి ననేకవత్సరము • లెంతయుఁ బ్రీతిగృహస్థధర్మముల్
సలిపి పితామహాదులకు • సద్గతిగూర్చ సమర్థులైన పు
త్రులఁగని నిర్విచారులయి • తోరపు కర్జములెల్ల వారిపై
నిలిపినవారుగాక రమ • ణీమము బోటులు భక్తికర్హులే.

తే॥ ఎట్టిచింతలేక • యెల్లసౌఖ్యంబులఁ జెందఁదగినయట్టి • చిన్నివయసు
వారలేడ మాని • వర్యులధర్మమా భక్తిమార్గ మేడఁ • బడఁతిచెపుమ.

తే॥ అగ్నిసాక్షిగఁ బరిణయ • మైనయట్టి వానికన్నను వేరు దై • వంబుకలదె
తరుణియేమిటికిట్లు వ్య • ర్థముగఁ గాలయాపనము జేయుదేను సం • తాపమొంద?

తే॥ వ్రతములొనరించుటయును సం • తతము దేవపూజలను సల్పుటయును ని • ప్పుడమి [యందు
నన్నివిధముల ననుకూలుఁ • డైన మగఁడు కలుగుటకునైగదా నవ • కంజనయన.

తే॥ వార్ధకంబునసంసార • వాంఛవీడి యింద్రియపటుత్వముల్ లేక • యొందునకును
జతురులుల్ గానివారికి • గతిగనున్న వ్రతము లేటికి యౌవనో • ద్ధతులకిలను.

చ॥ ఎఱిఁగిరియెఱుంగ కిట్లుగుణ • హీనులెవారొ వచించిరంచు నే
డ్తెలి సుఖమొందఁగాఁ దగిన • తిన్నని నీయభిప్రాయమెల్ల ని
త్తఱి వృధయై చనంగను వ్ర • తంబులటంచు జపంబులంచు గ్ర
చ్ఛల వచియింతువేల నిహ • సౌఖ్యము లేని పరంబదేటికో.

చ॥ తెలియనిదాననే వసుమ • తిన్ సుఖసంతతికెల్లఁ గారణం
బలరెడు యౌవనంబనుచు • నట్టి మనోహరమైన యౌవనం
బిల వృధసేయ నేల తరు • ణీయుచితస్థితి నన్నుగూడి రం
తుల నలరింపుమింక మద • నుండెదనాటుచునుండె గోలలన్.

ఉ॥ ఆర్తజనంబు బ్రోచుటకు • నై తమలాభమె వీడుచుంద్రు స
త్కీర్తికి పరుల్ ధరిత్రి విను • తిందగు నాఢ్యకులీనవీవు కా
మాతురుఁడునై నినున్ బరిణ • యంబొనరించినవాఁడు వేడగా
ధూర్తవునైయనర్హమని • త్రోఁచెద వేటికి మాటిమాటికిన్.

తే॥ పరగఁ బంచాక్షరీమంత్ర • పఠనలేనివాని స్పృశియింపననియెడి • పట్టుదలయె
కలిగెనేని యేనిఁక యెల్లి • కలుషహరణ చతురుఁడగు దేశికునికడ • సంగ్రహింతు.

క॥ ఈయెడ నను మన్నింపుము తోయలి నీవాడనిపుడు • దుష్టుండగునా
తోయజబాణుఁడు కోలల నాయెడ నేయంగసాగె • ననవరతములన్.

క॥ అని మెచ్చిన యుత్సాహంబున నా దశరథుఁడు రాజ • పుత్రికరంబుల్
గొని యాలింగనమొనరించిన నాతనిఁ ద్రోచివైచెఁ • జెలి విముఖయునై.

వ॥ అంత నాళీకబాణశర సంతప్తహృదయుండైన రాజసుతుండు పంచాక్షరీమహామంత్ర పూతశరీరయగు నా కళావతి నాలింగనంబుఁ గావించుకతన దగ్ధదేహుండై విలపింపఁ దొడంగిన నజ్ఞాతకారణంబగు నార్తనాదంబు విని భయసంభ్రమ పరీతచిత్తులై రాజపురుషులును రాజదంపతులును నతివేగంబున నరుదెంచి యా లలితాంగి కిట్లనిరి.

క॥ ఇదియేటివిరుద్ధంబో మదవతి నీ నాయకుం డ • మానుష తేజుం
డు దహనబాధితుఁడై యిట్లడరిపడుచున్నవాఁడ • హా చెప్పఁగదే.

తే॥ అగ్నియేలపుట్టె • నంతఃపురంబున నేల నిన్నువిడి మ • హీశపుత్రు
నొకనినే దహించె • నోపయోజానన తెలుపుమనిన తరుణి • పలికెనిటుల.

సీ॥ వినుఁడిమ్మహారాజ • తనయుం డనిత్యమా నైహికసౌఖ్యంబు • నభిలషించి
యాముష్మికంబునం • దభిరతిలే కనయంబు ద్రిమ్మరుచుండు • నట్టివాఁడు
పతియౌటనాకు నై • నసమానుఁడేయగు నైనను నేను పం • చాక్షరీ మ
హామంత్రము జపించు • చనయంబు శివపూజసలుపుచుండెడుదాన • శంకరార్చ
నావిహీనుఁడైన • నరనాథుతో నెట్లుగలియుదాన ననుచుఁ • గలతెలంగు
జెలియఁజేసి యొక్క • దేశికునొద్దఁ బంచాక్షరిని గ్రహింపు • మనుచుఁ బలుక.

క॥ నరనాథుఁడు నాపలుకుం బరిభవమొనరించి నాకు • మంత్రమువలదో
తరుణీ యెలజవ్వమునఁ గర మిహసౌఖ్యం బొకండె • కాంక్షితమనుచున్.

తే॥ బలిమినన్నుబట్టి • పైకొనుటయు మంత్రపూత దేహనగుట • భూమిధవుని
తనువు దగ్ధమయ్యె • ధగ నకార్యమొనర్చి యశముగన్నవార • లరుదుగాదే.

మ॥ అనినన్ విస్మయమొంది తండ్రియను న • య్యబ్జాక్షి నీక్షించి యో
వనితా యిట్టిప్రభావవంతమగునే • పంచాక్షరీమంత్ర మెం
దున మున్నెవ్వరెఱుంగఁ జెప్పరయి రౌ • ఘుష్క్యంబునన్ నేఁడు మ
జ్జనియున్ సార్థకమయ్యె నీకతన దో • షంబుల్ గతించెన్ వెసన్.

తే॥ ఎందఱనో భక్తులనుగంటి • నెవ్వరేని తనయ పంచాక్షరీ మహ • త్త్వంబు నాకు
విశదముగఁ జెప్పరైరి వి • న్పింపు నేను సరగ నుపదేశముఁ గాంతు • గురుముఖమున.

క॥ అనినఁ గళావతీసతి ధ • రాధిపుఁ గన్గొనిపలుక్ నిట్టులో
యనఘచరిత్ర నీవెఱుఁగ • నట్టి విశేషములే నెఱుంగనే

ర్తనై శివభక్తవర్యుఁడవు • ధూర్జటిపాదపయోజయుగ్మముల్
మనమునఁ గొల్చుచుందువస • మానుఁడ వెల్లవిధంబులందునన్.

తే॥ మతములందు శైవ • మతమె శ్రేష్ఠంబంద్రు దానలింగధారి • యైనవానిఁ
బరమమంత్రమైన • పంచాక్షరిజపించు వానిగుఱించి యెట్లు • బలుకవలయు.

వ॥ బ్రహ్మాదినిర్జరులును దధీచ్యాది మహామునులును నిమ్మహామంత్ర ప్రభావంబు నరయ సమర్థులుగారన నొక్క యబల వక్కాణింపఁగలదే. శైవుండవును సంతత శివపూజాపరాయణుండవునగు నీవడిగిన తెలియదని పలుకుటయు శైవధర్మంబుగాదు కావున నిప్పంచాక్షరీప్రభావబోధకంబగు నొక్క యితిహాసంబు కల దద్దాని విని పింతునని యిట్లనియె.

—• కళావతి వజ్రబాహునకు సూర్యశర్మ చరిత్రము జెప్పుట •—

సీ॥ మున్ను కౌశిక దేశ • మునఁ బ్రసిద్ధంబయి, యలరు విక్రమసమాఖ్యాకనగర
మప్పట్టణంబున • కవతంసమై వేదవిహితమార్గంబున • వెలయువాఁడు
నిత్యసదాచార • నిరతుండు సర్వవేదాధ్యయనమొనర్చి • నట్టివాఁడు
షట్కాల శివపూజ • సలుపుచుండెడువాఁడు శివభక్తవర్యుఁడై • చెలఁగునాతఁ
డతిథిపూజాపరాయణుఁ • డైనవాఁడు నిరతసత్యవ్రతుండునై • నెగడువాఁడు
సూర్యశర్మండునాఁబడు • శుద్ధచరితుఁ డగ్రకుల శేఖరుం డన • యమువసించు.

తే॥ ఆడితప్పనివాఁడు ని•త్యాగ్నిహోత్రి దానశీలుండు శివపద • ధ్యానపరుఁడు
శాంతచిత్తుండు నిర్మల • స్వాంతుఁడతఁడు సూర్యశర్మండలరుఁ బ్రభా •
[ సూర్యుఁడగుచు

క॥ నిరతాన్నదానపరుఁడున్ బర తేజస్సహనుఁడగుచు • బ్రాహ్మణవంశో
ద్ధరణచతురుండగుచు భూసురవర్యుం డలరె నిఖిల • సూరిస్తుతులన్.

తే॥ పెక్కుజన్నము లొనరించి • పిన్నపెద్దలైనవారల దగురీతి • నాదరించుఁ
దనకుఁగలభంగి నొసఁగు నెం•తయును భక్తి యర్థిజనమున కనుదినం•బాద్విజుండు

తే॥ కొడుకుఁ గోడలు కూఁతుర•ల్లుఁడును సతియు బరిజనంబును దనయాజ్ఞ•శిరముదాల
నన్నివిధములఁ దగినవాఁ • డై ద్విజుండు కాపురముజేయు నహరహం•బాపురమున

ఉ॥ ఆ నగరావతంసమున • యందువసించుచునుండు నెప్డు దు
ర్మానియ సత్క్రియారతుఁడు • మానదుఁడన్ దురితాత్ము డొక్కఁడ

జ్ఞానుఁడు వంచకుండు నతి • గర్విష్ఠుఁడై బుధపాళి కెంతయున్
గ్లానియొనర్చువాఁడగుచు • గంటకుఁడై జనమెల్ల దూరగన్.

—• మానదుడు మార్యశర్మని సాధింపబూనుట •—

క॥ పరదారధనాదులయం దు రుచిగలిగి సంతతంబు • దుర్జనమైత్రిన్
గరమొనరించుచు మానదుఁ డొరులకలిమి సైపలేక • యుండుఁ పురమునన్.

తే॥ పాపభయమెు భూమి • పాలక భీతియెు భూతదయయెు ధర్మ • బుద్ధియో యెు
కింతలేక యతఁడు • సంతతంబన్యాయమార్గమునఁ జరించు• మమతఁబూని.

సీ॥ సలిపె నా సాధుహిం • సాప్రధానంబయి యఘమూలమైన కా • ర్యంబెసలుపు
పలికెనా పండిత • ప్రకర కర్ణకఠోరమగునట్టి పరుషవా • క్యంబెపలుకు
తలఁచెనా పంచభూ• తంబులు తల్లక్రిందయిపోవు కఠినమా • తలఁపె తలఁచుఁ
గూడెనాజగముల • గోడుగుడువజేయు దుష్టసంతానంబు • తోడఁగూడు

నఱచెనాశ్రావకుల గుండెలవియ నఱచుఁ జూపులనె పరధనముల • జూఱగొనును
మానదుఁడు కరము నిరభి • మానియగుచు సాధుజనకంటకుండయి • సతతంబు.

సీ॥ అనృతంబెదక్క స • త్యము బల్కఁడెన్నడు నొరులుబల్కుచునున్న•నోపివినఁడు
సత్కార్యములఁ దాను•సలుపఁడింతయు నొరుల్ కావించుచున్న•భంగంబుజేయుఁ
జేయెత్తి దానంబుఁ . జేయఁ డొరులుసేయవలదని వారించుఁ బలువిధములఁ
బితృదినంబులనైనఁ • బిలువఁ డెవ్వరి నొరుల్ పిలిచిరో వంచింపఁ • దలఁచు వారి

దాను దెలియఁడేఁడు • తగనొరుదెల్పినఁ దెలిసికొనఁగలేఁడు • తెలివిమాలి
వ్యర్థుఁడగుచు లాతి • వారల దూషించు నాత్మగౌరవమున • యందుఁబేర్మి.

క॥ తనయానతిఁ దలనిడియెడు ననదల కొందఱను దనకు • ననుచరులుగఁ జే
కొని సత్పరివృత్తలమున్ జని వారనదల్చునెపుడ • సాధుప్రియుడై.

తే॥ బాహ్యవేషమూని • పరమనైష్ఠికుడట్లు గానుపించు నెవ్వ • రేని తన్ను
జేరరాగ వారిఁ • గ్రూరుఁడై హింసించు మానదుండు నిరభి • మానధనుఁడు.

క॥ తనవారియెడల గౌరవమును బ్రకటింపంగఁగోరి • భూనుతులగు స
జ్జనుల కపకారమును సేయనఁగోరి చరించుచుండు • ననవరతంబున్.

సీ॥ పతిదేవతాత్వంబుఁ • బ్రకటించుసతినైన బలవంతముగఁ జెఱు • పంగఁజూచుఁ
గలనైన ననృతంబుఁ • బలుకనొల్లని సత్యరతునైన బొంకింప • మతిదలంచుఁ

దాఁ దినుటకునైన • దలఁపని లుబ్ధుని సర్వస్వము హరింప • సాహసించు
నిజధర్మమును వీడ • నేరని ధార్మికునైన దుష్టునిజేయ • నరయుచుండుఁ
దనకు లొంగినవారలఁ • దరిమికొట్టు నవసరంబగునంతకు • నడఁగియుండు
వ్రతదినంబులనైన దు • గకతిఁజరించు మానవుఁడు కులభ్రష్టుండు • మాయకుండు.

వ|| మహాపాపియుఁ దస్కరుండును గురుద్రోహియు నగు నమ్మానవుండు దుష్కార్యా
చరణ పరాయణుండై యన్నగరంబున వారినెల్ల నవమానించుచు నొక్కకుటుంబము
వారికైనఁ బరస్పరవిరోధంబుఁ గలిగించుచు నొక్కనాడు తన మనంబున.

తే|| సార్వభౌమునైన • శాసింపఁగా నేర్తు నెల్లఁబనులయందు • నేనపెద్ద
నాకు నతుఁడుగాని • నరుఁడొక్కఁడు గలండె యే పురంబునందు • నేనిఁజూడ.

తే|| ఎట్టి కట్టడిపనియైన • నెట్టివారిఁ బరిభవించుటయైన నా • తరమె యగును
నాకు దీటైనవారలీ • లోకమందుఁ గలుగుదురె బ్రహ్మసృష్టిలో • పల నెవారు.

క|| ననుగాదని యెవ్వం డేపనిసేయఁగడంగినను గృ • పారహితుఁడనై
కినుకైద గదురఁగ నప్పని యనుకూలముగాకయుండు • నట్లొనరింతున్.

క|| వెనకయ్యకన్న నన్నే వెనకయ్యయటంచుఁదలఁచి • వినయముతోడన్
ఘనమతిఁబూజింపకయే జనుఁడు ప్రయత్నంబుఁజేయ • సఫలంబగునే.

మ|| చతురంభోధిపరీతమైన ధరణిన్ • శాసింపఁగా నేర్చు భూ
పతియైనన్ దన పౌరుషం బుడిగి మ • త్పాదంబులన్ ప్రాలి యం
చితరీతిన్ నను గారవించునన దు•శ్శీలుండు సామాన్యుఁడే
గతి నన్నున్గని భీతివీడితిరుగం • గా నేర్చు నిద్ధారుణిన్.

ఉ|| ఇంతటి విక్రమాఢ్యుఁడని • యించుకయైన భయంబులేక దు
స్స్వాంతుడు సూర్యశర్ముఁడను • నాతఁడు నన్ను దిరస్కరించి య
త్యంతము స్వేచ్ఛగాఁ దిరుగు • నాతనిబట్టి యనేకరీతులన్
జింతలగుందఁజేయక యి • సీచరియించుటయానె నాకిఁకన్.

శ|| పంచాక్షరియట దాని జపించిన మోక్షమట వేద • వేత్తలకును గ
న్పించని హరుఁ డందునఁ గన్పించునట యదెట్టి లోక • విపరీతంబో.

చం|| తెలియనివారలన్ వయసు • దీరినవారల మూఢచిత్తులన్
బలమదమత్తులన్ విగత • భర్తృకలన్ దనయొద్దఁజేర్చి ని

చ్చలు గురుబోధయంచుఁ బెలు • చఁగపటోక్తులఁబల్కి వారలన్
బలిమిఁ బరాభవంబు • సలుపన్ యతనంబొనరించుఁ గ్రూరుడై.

క॥ ఇట్టి దురాచారరతునిఁబట్టి బలిమిఁ బరిభవించి • పౌరులకు ముదం
బట్టి సమకూర్పకున్నన్ దిట్టరియని పల్కుదురె సు • ధీవరులు ననున్.

క॥ పలువిధముల నిదివఱకే కలుషాత్ముని రూపుమాపఁ • గాఁబూనితి నా
సలిపిన ప్రయత్నములు నిష్ఫలములగుచుఁ జెడియెబలిమి • చాలకయుంటన్.

చ॥ సామము చేతనొండెయది • చాలకయున్న ధనంబొసంగియో
భూమిని భేదమానియొ రి • పున్ దగవశ్యునిజేయుటొప్పు నేఁ
డామనుజాధముండు కుటి • లాత్ముఁడు దుష్టుఁడు సూర్యశర్మనిన్
మామకయుక్తి మార్గమున • ద్రుంచెదునట్లొనరింపఁగాదగున్.

క॥ అనుచుఁ దలఁచి మానదుఁ డవ్వినయధురీణుఁడగు విప్రు • వినుతగుణాఢ్యున్
ఘను సూర్యశర్మఁ బరిభవమొనరింతు నటంచు వ్యాజ • మూని కడంకన్.

ఉ॥ ఆతనిచెంతఁజేరి వినయంబున నంజలిఁజేసి పల్కెనో
ఖ్యాతచరిత్ర నేను కలు• షాత్ముఁడ దుష్టుఁడ క్రూరకర్ముఁడన్
గాతరమానసుండ నను • గైకొని శిష్యునియట్ల బ్రోవు సం
ప్రీతిని సంతతంబుపచ •రించెద నీకు నయంబుమీఱఁగన్.

క॥ తెలియక నీయెడ మును నాసలిపిన నేరంబులెల్ల • సవరించి కృపా
కలితుఁడవుగమ్ము సాయం దలఘుచరిత్రుఁడవు నిర్మ • లాంతఃకరణా!

తే॥ ఎఱిఁగి యెఱుఁగ కెవ్వ • రేని యొనర్చిన తప్పులను క్షమించి • ధర్మబుద్ధి
నొరులు మెచ్చునట్లు • యుపకారమొనరించు టర్హమనిరి కాదె • యార్యులకును.

క॥ కావున నను నీ ఛాత్రునిగా వైళమ సేకరించి • కనకరమున నీ
సేవావసరంబొసగుము భూవినుతామలగుణాఢ్య • పుణ్యచరిత్రా!

మ॥ అనిప్రార్థించిన నంతరంగము కృపా • యత్తంబుగా నద్దురా
త్ముని మాయోక్తుల విశ్వసించి వినయం • బున్ శాంతమున్ స్వాంతమం
దునఁ బెంపొందఁగ వానిఁగాంచి యను నిర్ధూతాఘుఁడౌ విప్రుఁ డెం
దునఁ గన్గొన్నను సజ్జనుల్ విమలచి • త్తుల్ గాకదుష్టాత్ములే.

ఉ॥ ఓయి యిదేటిమాట విను • మొక్కటి జెప్పెద నెల్లయందు భ
ద్రాయితమూర్తియైన గిరి • జాధిపుఁ గన్గొనమే జగత్త్రియం

శాయన యిష్టమట్ల యన • యంబుఁ జరించుచునుండుగాదె దు
ష్కార్యుఁడు మానుషుండొకటి • సల్ప సమర్థుఁడె యెందు నేనియున్.

క॥ తెరమీఁది బొమ్మలను నేర్పరి యాడించెడు విధంబు • భక్తావనత
త్పరుఁడౌ హరుఁ డాడింపఁగఁ గరమాడుచునుండు నీ • జగంబులు సతముగ్.

క॥ నీ వెవ్వఁడ వేనెవ్వఁడ నీ విశ్వం బెల్ల శంభుఁ • డే యగు నెల్లన్
గావించువాఁడు ధారుణిఁ గావింపఁగఁబడు నదియును • గామారియెయౌ.

సీ॥ సచరాచరంబులౌ • జగముల సృష్టించి సమయింపఁజాలిన • చతురుఁడెవఁడు
నీవ నేన యటంచు • భావించు సుకృతులహృదయపదంబుల • నెసఁగు నెవఁడు
నిమాయదాటఁగ • నేమర్త్యుఁడు సమర్థుఁడని పల్కువారల • కండయెవ్వఁ
డష్టసిద్ధుల కునికి • యై సేవకజనంబుఁ బావనంబుగఁజేయు • భర్త యెవ్వఁ

డట్టిలోకనేత • యఘవినాశకరుండు భక్తరక్షకుండు • శక్తియుతుఁడు
చంద్రశేఖరుండు • సర్వేశ్వరుఁడు లోకకర్త యనుచుఁ దెలియఁ • గా వలయును.

క॥ కరచరణాద్యవయవములు ధరణిగలుగుటకు ఫలము సు • ధాకరమౌళిన్
బురహరుఁ గొల్చుటయేగా కరయఁగ వేరొకటియగునె • యార్యుల కెందున్.

మ॥ పరమేశుండు దయాంతరంగుఁడగుటన్ • బాపాంబుధిన్ మున్గు పా
మరసంతానము నుద్ధరించుటకునై • మౌనీంద్ర సంసేవ్యముల్
గురుసంతాపహరంబులైన దొలిప • లుకల్ శాస్త్రముల్ మున్నుగా
గరమొప్పారెడునట్టి విద్యల నెలం • గన్ జేసె లోకాళికిన్.

క॥ ఆ విద్యలు సాధనములుగా విశ్వేశ్వరుని లోక • కారణు శంభున్
దేవాదిదేవుఁగొల్వంగావలయు ముముక్షువులకు • గడకొనిభక్తిన్.

సీ॥ దేవాదిదేవ నీ • వేమాకు దిక్కని శితికంఠుధ్యానంబుఁ • జేయవలయు
నాదిమధ్యాంత శూ • న్యామత్కరంబున నిలువుమంచును శివు • బిలువవలయుఁ
గాలకూటాశన • గైకొను నాయొసంగెడు నంతయనియర్ఘ్య • మిడఁగవలయు
త్రిపురవిదారసం • తృప్తిఁజెందుము దీనననిపూజలెల్లఁ జే • యంగవలయు

లోకనాథ నిఖిల • లోకేశ్వరా సర్వభూతశరణ పరమ • పురుషనిగమ
వినుతయనుచు శంభు • వేడంగవలయును భక్తుఁడైనవాఁడు • ముక్తిగోరి.

క॥ జపములు తపములు వ్రతములు నుపవాసంబులను భక్తినొనరించి త్రిలో
కపతియగు చంద్రశేఖరు నెపుడారాధించు టవశ్య • మిల భక్తులకున్.

ఉ॥ ఓ రజితాద్రివాస పురు • షోత్తమ కాంచన శైలచాపమం
దారు సమస్తలోక శర • ణా భుజగాభరణా భవత్పదాం
భోరుహముల్ భజింతునను • మూఢుని గావుమటంచు నెప్పుడున్
బూరుషుఁ డమ్మహేశ్వరుని • బూనికఁ గొల్వఁదగున్ నయంబునన్.

వ॥ షడ్గుణైశ్వర్య సంపన్నుండగు సర్వమంగళామనోహరు నారాధించుటకు ముఖ్యసాధనంబు పంచాక్షరి నాఁబడు మహామంత్రం బొండుకల దద్దాని జపించిన ననేకవిధంబులగు నరకంబులనుండి విముక్తుండగుటయగాక పురుషుండు కోటియజ్ఞఫలంబుఁ గాంచును. కావున సంసృతిబంధమునుండి విడివడఁగోరుదువేని ప్రణవపంచాక్షరీ మంత్రంబును దేశికముఖంబున నాజింపుమని నిర్వ్యాజానురాగంబునఁ బలికి యవ్విప్రోత్తముండు దుర్మానియగు మానదుని బరిగ్రహించె నంత నాతండును గుటిలాత్ముండై లోలోనఁ గపటోపాయంబు నెమకుచుండి.

తే॥ ఇతఁడు నాకపట మెఱుంగ • కింతయేని నన్ను శిష్యునిగా నెంచు • చున్నవాఁడు
వీని నిట్టులె మెప్పించి • వేళఁ గాంచి పరిభవించెద నింక ను • పాయశక్తి.

తే॥ యనుచుఁ దలఁచి దుష్టుఁ • డై మానదుఁడు సూర్యశర్మఁ బరిభవింప • సమయ మెపుడు
గలుగునాయటంచుఁ • బలువిధముల మది నెంచుచుండ దినము • లేగెఁ గొన్ని.

ఉ॥ అంతట నొక్కనాఁడు వసు • ధామరవర్యుఁడు సూర్యశర్మ దు
శ్చింతితుఁడైన మానదుని • చెంతకుఁ బిల్చి వచించె నోయి యీ
ప్రాంతమునందునున్న పొల • మంత మెకంబులు జేరి పైరు ల
లత్యంతము కొల్లగొట్టెడు భ • యంబును గూర్చెడువారు లేమిచే.

వ॥ కావున మనమాపొలంబు నేమఱక నిశాసమయంబులఁ గాచుచుంట లాభంబయగు నీవును నేఁడాదిగ బ్రతిరాత్రియు నరుదెంచుచుండుమనిన మానదుండును నట్లేయనియె. అట్లు కొంతకాలం బరిగినపిదప నొక్కరాత్రి నభంబు మేఘావృతంబై కన్నుబొడిచి కొనుటకును గానరాకున్న సమయంబున మానదుండొక యావునకుఁ బులితోలుఁగప్పి సూర్యశర్మం జేరి యిట్లనియె.

క॥ అనఘ యొకపులి చరించెడు కనుఁగొంటివె యచట నంధ • కారంబున నె
ల్లన మనమీఁదికి • లంఘన మొనరించుటకొఱకునై మ • హోగ్రాకృతితో.

క॥ దానిఁ బరిమార్పకుండిన నీనిశమన నిరువుర వధి • యింపక యున్నే
కాననసంచరించు మృగానీకము విడిచిపుచ్చు • టహితంబగునే.

చ॥ అనుటయు సూర్యశర్మ యవు • నా పులి నేయుటకై గదా పొలం
బున కరుదెంచినార మిదె • పూనిక నానగు వాడికోలఁ గై
కొని పసిడిండి నేలఁబడఁ • గొట్టెదనంచు వచించి యవ్విధం
బున నొనరించె మానదుఁడు • మోసముఁ జేయు టెఱుంగ కింతయున్.

తే॥ భూతదయయె వలయుఁ • బురుషునకనెడు భూదేవుఁ డీతఁ డిపుడు • గోవధంబుఁ
జేయునట్ల యుక్తిఁ • జేసితినింక స్త్రీహత్యగూడఁ జేయు • నట్లొనర్తు.

తే॥ అనుచుఁ దలఁచి ద్విజున•కనియె నో యనఘ గ్రామంబునందుఁ గలక•లంబ దేమొ
సంభవించినట్లు శ్రవణగోచరమగు నరసివత్తు నిపుడ • యాజ్ఞయీవె.

వ॥ అనిపలికి మానదుండాతని నప్పొలంబునన యుంచి పురంబునకుఁ జని గాఢనిద్రాప
వశతనున్న సూర్యశర్మ భార్యను, గొడుకును, గోడలిని మేల్కొలిపి మీరిట్లొర
లుమరచి నిద్రించుట దగునే నేడు మనపల్లెన్ దస్కరులు ప్రవేశించి కొల్లగొట్టు
చున్నవారలు మీరు ప్రత్యేకంబుగ శయనింపరాదు కొమరుఁడా యింటను గోడ
లును నీవు నీయింటను నిర్నిద్రులరై పవళించియుండుఁడు పొలంబున నయ్యవా
రొంటిగనున్నవాఁ డాతనికి సాయంబుఁ జేయనేగవలయు తడవైన గురుఁడాగ్రహించు
నని చెప్పి సూర్యశర్మ కడ కరిగి ప్రణామంబుఁ గావించి యిట్లనియె.

తే॥ పురుషుఁడే మహాత్ము • గురునిగా భావించి కొలుచుచుండుఁ దనకుఁ • గలిగినట్టి
యెల్లసంశయముల • నెఱిఁగించి యాతని దయకుఁ బాత్రుఁడగుట • ధర్మమనిరి.

తే॥ ధర్మసందేహముగలట్టి • తఱిని దాని తత్త్వము నెఱుంగఁ దలఁపక • దాఁచినట్టి
యధముఁడేగును కలుషాత్ము • లైనవారి గతికినని తొల్లి చెప్పితి • గాదె నీవు.

ఉ॥ కావున నీయెడన్ మదిని • గౌరవమూని చరించునట్టి నీ
సేవకునందుఁ సత్కరుణ • జేసి జనించెడు సంశయంబులన్
ధీవిభవాభిరామ విను • తీఱదగఁ దీర్చుట నీకు ధర్మమౌ
నావుఁడు సూర్యశర్మయను • నాతనితోడ దయాంతరంగుఁడై.

తే॥ అవునవును నీదు వచనంబు లాలకింప శ్రవణపేయంబులగుచును • శాస్త్రసమ్మ
తమ్ములైయున్న వెట్టి య • ధర్మమ్మునందు నీకు సంశయమగు నవ • నీసురేంద్ర.

క॥ గురుఁడెట్లు జెప్పు నట్టులఁ జరియించెడువాఁడు మోక్ష • సౌఖ్యముఁగని సు
స్థిరుఁడై కైలాసంబునఁ నిరతము వసియింపనేర్చు నినిద్రుండై.

వ॥ అనిన మానదుండిట్లనియె నాచార్యా! యెవ్వండేని యకార్యంబుఁ గావించునెడ
నద్దాని స్వశక్తి నొండె నహర్హులగువారి కెఱిఁగించి యొండె నివారించుట పురుష

ధర్మం బట్టు గాదేని యందర్థంబగు దోషంబాతని కాపాడించునని మహామునులు వక్కాణింతురు. మఱియు నొరుల కెఱింగించినచోఁ దత్కార్యకర్తల కెద్దియేని మనస్సంకటంబుగలిగినఁ దత్కృతంబునగు గలుషం బెవ్వారికిఁజెందు నిద్దినితత్వంబుఁ దెలిపి నన్ను ధన్యగాఁజేయుమనవుఁ డా ద్విజపుంగవుం డిట్లనియె.

క॥ తానెఱిఁగినట్టి యర్థముఁ బూనికవచియింపఁడేని పురుషుఁడు ఘోరం
బౌ నరకము జెందును కులహీనుండై మరలఁబుట్టు • నిల దుఃఖితుఁడై.

క॥ మనుజుండు నిజమెఱింగించిన దానఁ గిల్బిషంబుఁ • జెందం డొకవే
ళను జెందిన దెలిసిన దానిని జెప్పనియట్లు జెందు • నే యిలలోనన్.

సీ॥ అనవిని మానదుం • డనియె నో ద్విజవర్య యిపుడేనుబోయి నీ • గృహమునందుఁ
గనుగొనినాడన • కార్యంబుఁ జెప్పంగ నోరాడదేరీతి • నుడువువాఁడఁ
గనరాదు వినఁగరా • దనఘ మహాపాప మెందునవేనియు • నెప్పుడెఱుఁగ
మేను దుష్టుఁడను గా • దేని దుష్కార్యంబు నాకంటఁబడునె యె • న్నడును లేక

యిట్టి ఘోరకృత్య • మిట్టి ధర్మవిరుద్ధ మిట్టి కపటకార్య • మెట్టినీచ
కులమునందునైనఁ • గలుగదు కలుగబోదహహ విప్రవంశ • మందె దక్క.

తే॥ తెలుపకున్న నఘము • తెలిపినను నఘంబె యగును గాన దేశి • కాజ్ఞకొఱకు
వేఁచియున్నవాఁడ • విప్రోత్తమా యాజ్ఞయయ్యె నేని తెలియు • నట్లొనర్తు

వ॥ అనిపలికి సూర్యశర్మ వల్లెయనుఁడు నిట్లనియె. అయ్యా యేనీ నిశీథంబున గ్రామంబు నందలి కలకలంబరసివత్తునుగదా యని యరిగి మునుమున్న మీగృహంబున కరిగితి. కవాటంబులుబంధింపఁబడియున్నవి. అందుకతన గవాక్షంబునుండి జాగరూకతో గాంచితి నేమనిచెప్పుదును తన సుతునితోఁ గూడి నీసతి శివశివా యిక నోరాడ దట్టి దుష్కార్యంబు వచింపనని చెవులుమూసుకొనియుండె అంత సూర్యశర్మ యొకలెఱుంగరానంతటి యాగ్రహంబున.

చ॥ తనపతి దేవతాత్వము వ్య • ధాయయిపోవ నకార్యమంచు లో
నెనక యనిత్యమౌ సుఖము • నందున భ్రాంతిని జెంది యింద్రియా
శ్వనికరముఁ మరల్పఁగల • శక్తి యొకింతయు లేక దుష్టయై
తనయునితోఁ జరించునె య • ధర్మభయంబును జెంద కింతయున్.

క॥ పతియే దైవ మతనియానతి లే కెద్దానియందు • నను స్వాతంత్ర్యం
బతివకు లేదనక యిదె దుష్కృతమునకే పాల్పడియెనె • ఛీ చెలియా రా!

సీ॥ పదునాలుగుతరములఁ • బావనంబుగఁ జేయఁగల నిజధర్మంబుఁ • గాల్చివైచి
యుభయవంశంబుల • కురుకీర్తిఁ గల్గించు తన మనస్థైర్యంబుఁ దగులఁబెట్టి
యాచకప్రకరంబు • నాదరించెడు నిత్యకృత్యంబు నంతయు • నేటఁగలిపి
యాముష్మికసుఖంబు • నందభిరతియెల్ల విడిచి యైహికమునె • విశ్వసించి

మంచిచెడుగులఁ దలఁపక • మదికినెద్ది ప్రియముగాఁదోఁచునది విప • రీతమైన
కార్యమైనను జేయుచు • గౌరవంబుఁ గోలుపోవుదురింతులు • కుటిలమతులు.

తే॥ సుతుఁడనుచుఁ బితయనుచును • సోదరుఁడని వాయువరుసలఁ దలఁపకె • వ్వారినైనఁ
గలయ నుంకించుచుందురు • కాంతలిలను గామదేవుని కోలల • గ్గలములైన.

తే॥ జనని స్త్రీస్వభావ • మును వీడలేక తన్గలయఁగోరినంతఁ • గలుషమనక
సుతుఁడు సమ్మతించి • సుమశరు క్రీడల నోలలాఁడునే • యనుచితమనక.

తే॥ ఎట్టిక్రూరకర్మఁ • డేని పితృద్రోహ మనక యిట్లు కార్య • మునకుఁబాలు
పడునె యహహ సుతుని • వంటి శత్రుఁడు గల్గఁడనెడు వాక్యమదియ • దార్థమగను.

చ॥ తమసౌఖ్యంబునయందు నాసవిడి యే • తజ్జన్మమెల్లన్ గృతా
ర్థముగాఁజేసెడువాఁడు పుత్రుఁడని సి • ద్ధాంతంబు గావించి దా
నములన్ ధర్మము లెన్నియోసలిపి నా • నాకష్టముల్ జెంది క
న్నమహాత్ముల్ తలిదండ్రులేయవని సం • తానంబు సంతానమే.

శా॥ ఔరాపుత్రుఁడె తల్లితోడనె యకా • ర్యంబంచు నూహింపకే
క్రూరుండై చరియించునే యిది మహా • ఘోరంబుగాకుండునే
ధీరుల్ గాంచిన సైఁతురేకులమునన్ • దేజంబు చల్లారదే
గౌరీశభ్రుకుటీకఠోర దహనా • క్రాంతుండుగాకుండునే.

తే॥ పుట్టకున్న మేలు • పుట్టిచచ్చిన మేలు గాని యిట్టి క్రూర • కర్ముఁడైన
కొడుకు బ్రతికి తనకు • నిడుమలగూర్పఁగఁ గాంచి సైఁచి యుంట • కన్న జగతి.

క॥ అని పలువిధములఁ దలఁచుచు దనయునిపడఁతిని వధించి • తగఁదన కోపంబును
దీర్చుకొందుననుచున్ జనియెను గరవాలమూని • దయ్యనఁ బురికిన్.

వ॥ అట్లుజని దుష్టుండగు మానదుని వాక్యంబులు విశ్వసించి తనపడఁతి కడఁ బండినవి
కొడుకేయని నిశ్చయించి నిశితంబగు కరవాలంబునఁ దెగనరికి వెలువలికేగె నంత
మానదుండు లోలోన సంతసించుచు సూర్యశర్మ కావించిన యకార్యంబు పౌరుల

కతిఁగించియాతని దండితునిగా జేయుదునని పెద్దపెట్టున నఱచిన నిదియేమి కలకలం బని యూరివా రెల్ల లేచియడిగిన వారికి మానదుండిట్లనియె.

క॥ పొలమున నొక పసరంబు బ్రాఁకలిచేఁ జరియించుచుండఁ • గకినుండై గొ
డ్డలిచేఁ దెగనరికెను వీఁ డలుకమెయిన్ బ్రాహ్మణుండే • యగు నాతలఁపన్.

వ॥ మఱియును.

చ॥ తన కులకాంతయున్ సుతుని • దారయు నొక్కటఁ బండియుండగాఁ
గని విపరీతభావమునఁ • గంటకవృక్షము నట్లద్రుంచె వీఁ
డనఘుఁడటంచు మీరహర • హంబు వచించుచునుండ్రు కాదె ప
జ్జను లిటు లాచరింతురె పా • సంగునె యిట్టిది సాధుకృత్యమై.

చ॥ అనవిని క్రోధచిత్తులయి • యచ్చటివారలు సూర్యశర్మునిన్
గనుగొని పల్కిరిట్టుల • జగంబున నెందుననైనఁ గంటిమే
తన కులకామినిన్ స్నుషను • తద్దయుఁ బాపటమునాక చంపు దు
ష్టనికరమున్ ద్విజుండవు పా • సంగునె నీకిటు లాచరింపఁగన్.

క॥ గోవధమును స్త్రీవధమును గావించినవాఁడవీవు • కలుషాత్ముఁడని
న్నీవిధి మననిచ్చుట పాపావళికిన్ గారణమగు • నస్మత్పురికిన్.

తే॥ ఇట్టి పాపకార్య • మే యొనర్చిన నిన్ను ద్విజుఁడ వైన కతన • విడిచివార
మరుగు మెచటికేని • యస్మత్పురము వీడియనుచుఁ బౌరులనిన • నాతఁడనియె.

క॥ తెలియక యాతఁడు పలికిన పలుకుల మదినమ్మి యిట్లు • బసరంబును మ
త్కులకాంతను స్నుషఁజంపితిఁ గలుషం బద్దాన నాకుఁ • గలిగె నిపుడహా.

వ॥ అనాలోచితంబుగను నవివేకంబునను నాకావించిన గో స్త్రీ వధంబునన్ గలిగిన దోషంబు నివారించుటకై యష్టోత్తరశతంబుఁ బంచాక్షరిఁ జపించి పవిత్రుండనైతిని నన్ను మీరీపురంబునుండి వెడల నడిపింపఁదలంచుట లగ్గుగాదనిన నాతని కందలి యొకవృద్ధుఁ డిట్లనియె.

ఉ॥ అవునవు మాటకారివె ద్వి • జాధమ యీ గతి నెందునేని సం
భవమగునే ధరిత్రి • బలవంతముగా నొకప్రాణిఁ జంపి త
ద్భవమగునట్టి పాపమును • వారణసేయ జపంబొ దానమో
యవిరళ హోమమో సలుపు • టారయుదాన ఫలంబు గల్గునే.

తే॥ మమ్ము వంచించుకొఱకునై • మాటలాడెడీవు పంచాక్షరిని జపి • యించినంత
నీయొనర్చిన పాపముల్ • బాయు నేని భూతదయ యెట్లుగల్గు ని • ప్పుడమియందు.

తే॥ పరగఁ బంచాక్షరీమంత్ర • పఠనముననె యెల్లపాపంబులను హరి • యింపఁగల్గు
బలిమి కల్గిన ధర్మదే • వతను బిలిచి కసవు మేసెడుగతిఁ జేయఁగలవె నీవు.

వ॥ అనవుఁడా సూర్యశర్ముఁడు వల్లెయని సమ్మతించి కేదారేశ్వర ప్రాకారంబునం
దలినందులు కసవు మేయునట్లొనర్పఁ జేయఁదలఁచి నెమ్మనమున.

చ॥ కలుషనివారకుండయిన • కామవిదారుని పాదపంకజం
బుల నిగతంబు భక్తిమెయిఁ • బూజయొనర్చుచునుండు నేని నం
దులిపుడ యేగుదెంచి పరి • తోషమెలర్పఁగ నాయొసంగు ని
ర్మలమగు పచ్చిమేఁతఁ దిని • మామకసత్యముఁ గాఁచుగావుతన్.

తే॥ అనుచు దశవారములను బం • చాక్షరిని స్మరించి చంద్రశేఖరుని ధ్యా • నించుటయును
నందులప్పుడ యరుదెంచి • నవ్యఘాస భక్షణమొనర్చెఁ బౌరు ల • బ్రంబుఁ జెంద.

సీ॥ పురజనులెల్ల ర • ప్పుడు వినతులగుచు నమ్మహాత్ముని గాంచి • యభినుతించి
యార్య నీమహిమ నిం • తైన నెఱుఁగలేక కలుషాత్ములగుచుఁ • బలుతెఱఁగుల
బలికితి మీనేర • ములఁ బాపిరక్షింపు మఘవినాశకరంబు • లైనయట్టి
త్వచ్చరణముల సం • దర్శించు భాగ్యంబు గలుగుకతనఁ బాప • ములు దొలంగె
నపరశంభుండవీవు పం • చాక్షరీ ప్రభావమును బ్రకటించిన • వాఁడవిపుడు
తత్ప్రభావంబుచేత మొ • దవును స్నుషను దారనుఁ బ్రతికించి సం • తసమొసఁగుము.

వ॥ అనిన నట్లకాకయని యతం డేనూఱుపర్యాయంబులఁ బంచాక్షరిని స్మరించి పాలంబునం
దలి యావును కులకాంతను గోడలిని సజీవులఁ జేసె నంత నప్పౌరులందఱు న మ్మహాత్మునివలనఁ
బంచాక్షరి నుపదేశంబుగాంచి దేహాంతంబునఁ గైలాసంబున కరిగిరి. మానదుండును
శివభక్తున కపకారంబుఁ జేసిన కారణంబున మహానరకంబుఁ జెందెఁ గావున వజ్రపాణే
శ్వరుండును సమర్థుఁడగు దేశికునిమూలమునఁ బంచాక్షరీమంత్రోపదేశంబుఁ
బొందనేని తొల్లిటి దివ్యరూపంబుగాంచి నాతోడఁ గలయ నర్హుండగునని కళా
వతి పలికిన నలరి వజ్రబాహుండు గర్గమహామునిని రప్పించి యల్లుండును తానును
మంత్రోపదేశంబుఁ గాంచి రంత దశరథుండు మనోహరాంగుఁడై యనేకవర్షం
బులు గళావతిఁగూడి కులకాంతతోడను శరీరంబుతోడను శివలోకంబున కరిగెఁ
గావున శివప్రీతికరంబులగు భూతి రుద్రాక్షల దాల్చి పంచాక్షరీ మహామంత్ర

పూర్వకంబుగ శివలింగంబు ధరింపుమని యంగిరోమునీంద్రుండు వచించిన భక్తి
వినమితగాత్రుండై దౌంధు మూకుండు మరల నిట్లనియె.

క॥ మునివర నీ కృపచే నిపు డనఘ మ పంచాక్షరీమ • హాత్మ్యము వినన
య్యెను రుద్రాక్ష మహాత్త్వంబునుగూడ నెఱుంగ జేయు • ము కరుణ వెలయన్.

క॥ అనుటయు నాదరమున నమ్మునివర్యుండనియె దౌంధు • మూకునిఁగని యో
యనఘా రుద్రాక్షమహిమయన సామాన్యంబె చెప్ప • నలవియె నాకున్.

సీ॥ కలిమలధ్వాంత భా • స్కరకోటి తేజంబు దుష్టమనోవ్యథా • తూలపవన
మజ్ఞానకృత దుష్క్రి • యాపర్వతాశని యరివర్గ నాగ మ • హాంకుశంబు
ఘోరదారిద్ర్య ప • యోరాశికోలంబు వివిధమోహలతాల • విత్రవితతి
తాపత్రయోద్వేల • దావపావకవమన్ మఖిలభవాతిక్ మ • హౌషధంబు

బ్రహ్మహత్యాదిపాప ని • వారకంబు మోక్షలక్ష్మీకర గ్రహం • బునను దెరువు
భక్తజనరక్షకము శుభావహము సకలధీరసేవ్యంబు రుద్రాక్ష • ధారణంబు.

ఉ॥ అక్షయ మోక్షదాయకము • లైన తపంబుల నెన్ని చేసినన్
దక్షనిహంత కెంతయు ము • దంబునుగూర్పఁగఁ జాలినట్టి రు
ద్రాక్షలఁ దాల్పఁగల్గిన మ • హత్త్వముతో సరిరావొకింత ప్ర
త్యక్షముగాదె దివ్వెవెలుఁ • గర్కుని తేజముఁ బోలకుండుటల్.

తే॥ అఘవినాశకరము • లైన రుద్రాక్షల వేయి దాల్చునట్టి • విమలచిత్తు
నంధకారితుల్యుఁ • డని గౌరవించెద రెట్టిమానివర్యు • లేని సతము.

— • అంగిరోముని దౌంధుమూకునకు రుద్రాక్షమహిమ జెప్పుట • —

వ॥ నీకు రుద్రాక్షమహిమ సాంగముగ నాలకించుతలంపు గలుగుట నీ పూర్వజన్మకృత
సుకృతంబయగు నిశ్చలచిత్తుండవై యాలకింపుము.

క॥ తొల్లి యొకప్పుడు గౌరీవల్లభు రజితాద్రినిలయుఁ • బన్నగవలయున్
మెల్లఁగ భుసుండ నెడు ముని తల్లజుఁడు వచించె భక్తి • తాత్పర్యమునన్.

తే॥ అనఘ రుద్రాక్షధారణం బున లభించునట్టి ఫలమెద్ది దానికి • నట్టి మహిమ
గలుగుటకుఁ గారణం బెద్ది • యలఘుమనుల కవియ ధరియింప యోగ్యంబు • లగుటయేల

తే॥ అనినఁ గాలాగ్ని రుద్రుఁ డి • ట్లను ననుగ్రహాతిరేకంబు మెయి భుసుం • డాఖ్యమౌనిఁ
గాంచినీయడిగిన యర్థ • మించుకయును దెలియనేరరు బ్రహ్మాది • దివిజులేని.

తే॥ అమరవర్గంబు త్రిపురాసు • రార్తిఁ గోర్వజాల కెంతయు దీనులై • సరగనన్ను
వేడినఁ బూర్వయుగమున • వీఁక వారి గాఁతుసని యభయమొసంగి • కనికరమున.

—• రుద్రాక్షోత్పత్తి •—

వ॥ వారినందఱ నిజాలయంబుల కనిచి సహస్రదివ్యవర్షంబులు నిమీలితాక్షుండనై త్రిపురవధార్థంబాలోచించితి. అప్పుడు మదీయనేత్రపుటంబులనుండి జలబిందువులు ధరణిఁబడి సర్వపాపహరంబులగు మహావృక్షంబు లయ్యె. రుద్రుండనగు మదీయ నేత్రజల సంభూతంబులగుటనవి రుద్రాక్షవృక్షంబులనఁ బ్రసిద్ధిఁగాంచె. వాని ఫలంబులు రుద్రాక్షలనఁ దనరె. అందు ధాత్రీఫల ప్రమాణ రుద్రాక్షధారణం బుత్తమంబు, బదరీఫలప్రమాణ రుద్రాక్షధారణంబు మధ్యమంబు. చణమాత్ర ప్రమాణరుద్రాక్షధారణం బధమంబు. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణజులు క్రమంబుగ శ్వేత రక్తపీత కృష్ణవర్ణులైయుండు రట్లగుటఁజేసి పూర్వోక్త వర్ణంబులగు. రుద్రాక్షలఁ గ్రమంబుగ బ్రాహ్మణాది వర్ణజులు ధరింపఁదగు. సమంబులును స్నిగ్ధంబులును దృఢంబులును, స్థూలంబులునునగు రుద్రాక్షలు ధారణార్హంబు లగు. కృమిదష్టంబులును, వ్రణయుక్తంబులునునగు నవి వర్జ్యంబులగు.

సీ॥ శిఖయందు నొక్కటి • శిరమునఁ ద్రిశతంబు బాహుయుగమున ము•ప్పదియు రెండు
నలుత ముప్పదియాఱు • నలరు స్కంధంబునఁ బంచశతము మణి • బంధమునను
నుపవీతముగను న • ష్టోత్తరశతమాల ధరియింపఁదగును కం • ధరమునందు
ద్విసరంబొ త్రిసరంబొ • తివిరి పంచసరంబొ సప్తసరంబొ వె • సఁ ధరింప

నర్హమగును సహస్ర రు•ద్రాక్షమాల దాల్పుటుత్తమమయ్యె మ•ధ్యమము పంచ
శతము త్రిశతం బధమమయి•జగతిఁ బరఁగు గౌరవపదంబు రుద్రాక్ష•ధారణంబు.

సీ॥ ఏకముఖంబయి • యెసఁగు రుద్రాక్షయఁ బరతత్త్వరూపమై • పరఁగవిల్లు
గానిధరించు క • తనఁ బరతత్త్వంబుఁ జేరిజితేంద్రియుఁ • డై గ్రహించు
ద్విముఖమా రుద్రాక్ష వెలయును నర్ధనా రీశ్వరాత్మకమయి • యెపుడు దాని
ధరియించుటఁ జేసి • హరుఁడు ప్రీతుండయి యెల్లవరంబుల • నిచ్చుచుండుఁ

త్రిముఖ రుద్రాక్ష యగ్నిరూ • పమయియలరు నదిధరించినఁ దృప్తుఁడౌ • నగ్నిదేవుఁ
డిలఁ జతుర్ముఖ రుద్రాక్ష • యే చతుర్ముఖ స్వరూపమై యలరు న • ఖండమగుచు.

వ॥ దానిధరించిన నరుండు చతుర్ముఖ కృపాపాత్రుండగు. మఱియుఁ బంచముఖంబు పంచబ్రహ్మ స్వరూపంబును షడ్వక్త్రంబు షడాననాధిదైవతంబును. సప్త

వక్త్రింబు సప్తమాతృకాధి దైవతంబును నష్టవక్త్రిం బష్టమాతృకాధి దైవతంబును నవవక్త్రింబు నవశక్త్యధి,దైవతంబును, దశవక్త్రింబు యమదైవత్యంబును నేకాదశముఖం బేకాదశ రుద్రాధిదైవత్యంబును, ద్వాదశముఖంబు ద్వాదశాదిత్య దైవత్యంబును, త్రయోదశ ముఖంబు కామదైవత్యంబును, జతుర్దశ ముఖంబు రుద్రనేత్రాధిదైవత్యంబునునై ధారణమాత్రంబున తత్తద్దేవతా ప్రీతికరంబై ముక్తి, గూర్చుచుండు రుద్రాక్షధారణ పవిత్రుండగు భక్తుండు మద్యమాంస లశున పలాండు శిగ్రుముఖ్యంబుల నేకరింపఁ జనదని వచయించిన భుసుండు సంతుష్టుండై కాలాగ్నిరుద్రుని పెక్కువిధంబులఁ గీర్తించి యరిగెఁ గావున రుద్రాక్షమహిమం బగణ్యంబైయుండు రుద్రాక్ష విహీనులైన యెట్టిమహాత్ములును రుద్రాక్షదాల్చిన యొక మార్జాలంబునకైన సాటిరారనుట వింతయే. ఇందులకొక చక్కని యితిహాసము గలదాలకింపుము.

## —• రుద్రాక్షమహిమ •—

క॥ భూచక్రంబను పురమున వా చంద్రార్ధకధరు భక్తుఁ • డమలగుణాఢ్యుం
డై చతురానన కులజుండౌ చతురుఁడు సుప్రతీపుఁ • డన నొకఁడుండున్.

చ॥ నిరత శివార్చనాపరుఁ డ • నింద్యచరిత్రుఁడు భూమిదేవతా
వరుఁడు ప్రశాంత చిత్తుఁడ ని • వారిత తేజోఘ ప్రకాండ భా
స్కరుఁడయి శైవలోకహిత • కారియునై యెన యెందులేక య
ప్పురమునఁ గాపురంబు సలు • పున్ బుధవర్గము గొల్వ నాతఁడున్.

క॥ శైవాచారపరాయణుఁ డా విప్రోత్తముఁడు మణి మ • యాభరణములన్
బోవిడి రుద్రాక్షలఁ దానేవేళ ధరించుచుండు నెంతయు భక్తిన్.

తే॥ పేరురంబున వేలు బంగారు లింగకాయ లొకవన్నెగూర్చిడి • గతి సహస్ర
మాలికలుగ రుద్రాక్షల • లీలఁదాల్చి సుప్రతీపుండు వర్తించుఁ • జూడఁగదగి.

క॥ రుద్రాక్షాలంకృతులగు భద్రాంగులఁ గాంచెనేని • భయభక్తులతో
రుద్రునిగతి మ్రొక్కును నక్షుద్రాత్ముఁడు బ్రాహ్మణుండు • చూపఱువొగడన్.

వ॥ మఱియు నమ్మహాభాగుండు యథాశాస్త్రంబుగఁ దననారి కందళకును రుద్రాక్ష ధారణంబును లింగధారణంబును గావించి సంతతశివపూజాపరాయణుండును శైవ లోకశరణ్యుండునునై కాపురంబుఁ జేయుచు మితిమీఱిన భక్తిచేఁ బురంబువారెల్ల రబ్బురంబుఁ జెందునట్లు.

మ॥ హరుఁడైనన్ గురుఁడైన సంతత శివ • ధ్యానైక చింతాగతే
తరలోకుండయినన్ మఱెవ్వఁడయినన్ • త్రైలోక్య సామ్రాజ్యకృ
దరనేత్రాంతర సంభవంబులగు రు • ద్రాక్షల్ విసర్జించినన్
దురితంబుల్ వోనగూడునట్లగుట నా • దుష్టుండు నిందార్హుఁడౌ.

క॥ కావున నిట్టి దురాత్మున కేవిధమగు దానమేని • యీయ నతని సం
భావింపఁగఁదలపననుచు నా విప్రోత్తముఁడు చాటె • నాశాంతములన్.

సీ॥ అవ్విధంబున జాటి • యఘవినాశకరంబులైన రుద్రాక్షల • నమలభక్తిఁ
దాల్చినవారలఁ • దగఁ బూజసేయుచుఁ దాల్పనివారలఁ • దాల్చునట్టు
లుపదేశమొనరించు • చెపుడు శివారాధనమొనర్చుచుండె • మోదమునఁ జెలఁగి
తివిరి యెల్లరు సుప్ర • తీపుని ఛాత్రులై శైవాగ్రసరులయి • సంతతంబు

శంభుకీర్తనంబు • సల్పుచు నిర్మలజ్ఞానశోభితులయి • కలుషహరణ
దక్షులై యనార • తంబు రుద్రాక్షయె శైవతత్వమనుచుఁ జాటుచుండ్రు.

ఉ॥ ఆగతి సుప్రతీపుఁడు మ • హాత్ముఁడునై శివపాదపూజనం
బే గతిగా మదిన్ దలఁచు • చెప్పుడు శైవుల నాదరించుచున్
యోగులకున్ లభింపని మ • హోన్నతత్వమునందు లీనమై
యాగమవేద్యుఁడైన గిరిజాధిప తుల్యుఁడు నాఁదనర్చుచున్.

క॥ అనుకూలవతియగుచుఁ దన మనసు నెఱిఁగి సంచరించు • మహిళామణి సా
ధ్వినిగూడి యరుంధతితో ననఘుండు వసిష్ఠుఁడట్ల • నతఁడు చెలంగున్.

తే॥ అటులఁ గొంతకాల • మరిగె నంత సగంగుఁడనెడువాఁడొకండు • యతివరుండు
సుప్రతీపుఁ డట్టు • లప్రతిమానుఁడై చెలఁగుచుంట మదిని • దెలిసి కినుక.

—• సగంగుడు సుప్రతీపుని పరిభవింపదలచుట •—

శా॥ ఔరా విప్రుఁడు దుర్మదాంధుఁడయి ధ • ర్మాధర్మ నిర్ణేతృతా
ధీరుల్ గల్గినఁ బూరికిన్ గొనక యు • ద్రేకించి రుద్రాక్షనే
వారల్ దాల్పకయుందు రాఖలుల సం • భావింపనం చిట్లు గం
భీరుండై వచియించె నాతని నికన్ • ద్వేషింపఁగాఁ గూడదే.

క॥ మమువంటి వారి కవమానము జేయు తలంపుఁ జెంది • న నుపేక్షా భా
వమునన్ సైఁచితి మన్యాయమునకె లోఁబడియె నాతఁ • దఘాతురుఁడై.

క॥ రుద్రాక్షల విడిచి జగద్భద్రంకరుఁడైన సుగుణ • భద్రుండైనన్
రుద్రుండేనియు వచ్చిన క్షుద్రుండని తలఁతుఁ గనియెఁ • జూపకు లద్రువన్.

సీ॥ తనమాట సాగినం • తవఱకు నెల్లవారలకు దుర్బోధల • సలుపుచుండుఁ
దన నాశ్రయించువా • రిని జేరఁగాఁబిల్చి శైవమతంబని • సంతసించుఁ
దనకు గౌరవము ని • తరుల కగౌరవమును గూర్చు పద్ధతిఁ • బూని తిరుగుఁ
దన లాభమునకునై • యనఘాత్ములగువారి నధమాధములంగఁ జే • యంగఁజూచు
తిన్న నమ్మినవారి యాదలనె చేయిబెట్టి దలఁచుచునుండెడు • నట్టి ఖలుఁడు
సుప్రతీపుని గర్వంబుఁ • జూఁడఁగొనకయుండు టర్హంబె మమువంటి • యోగులకిల.

తే॥ రుద్రునందుఁగాని • రుద్రాక్షలందునఁగాని తనకు భక్తి • గలిగెనేని
తానె ధన్యుఁడగును • తక్కినవారల జోలియేల సిగ్గు • మాలితనకు

తే॥ తాడినెక్కువాని • తలదన్నునాతఁడు గలుగుననుచు మదిని • తలఁపఁడేమొ
చూతునింక నతని • చాతుర్యమెట్టిదో యతని ప్రతిన యెట్లు • లలరఁగలదో.

తే॥ ఇట్టి విపరీతధర్మమెం • దేని కలదె తనమతమె యెల్లవారలు • దగునటంచు
మదిఁ దలంతురె రుద్రాక్ష • మాలికలను బహుళముగ నెడఁదాల్చియు•ర్వరసతంబు.

చ॥ ఇటు పయనంబుఁ జేయుదు మ • హీసురుఁడున్న పురంబుఁ జేరఁగా
బదపడి యద్దురాగతుని • పంతము వ్యర్థముగా నొనర్చెదన్
సదయుఁడనై పురిన్ గలుగు • సాధువులన్ దరియింపఁజేసెదన్
విదితమొనర్తు నా మహిమ • విప్రులకున్ జగదుత్తరంబుగన్.

చ॥ అనుచుఁ దలంచి యయ్యతిప్ర • థాకులితాత్ముఁడునై స్వగౌరవం
బును బ్రకటించుపూన్కి మెయి • భూమిసురేల్ చనుదేర సుప్రతీ
పుని నగరంబుఁజేరె బుధ • పుంగవులచ్చటఁ దన్ను నెంతయున్
వినయనతోత్తమాంగులయి • వేయువిధంబులఁ బూజసేయఁగన్.

క॥ ప్రతిదినమాపురిఁగల గృహపతులాసన్న్యాసి తేని • భక్తిమెయి యథా
గతిఁ బూజించుచు భిక్షల నతిముదమున నొసఁగుచుండ • నరిగె దినంబుల్.

తే॥ అంత నొక్కదినము • నందా యతివరుండు విప్రవర్యుఁడైన • సుప్రతీపు
నింట భిక్షకెంద • నెంచి సశిష్యుఁడై చనియె నమ్మహాత్ము • సదనమునకు.

ఉ॥ ఆగతి సుప్రతీపుని గృ • హాంగణ సీమఁజేరఁగఁబోయి య
య్యోగివరుండు భిక్ష • నిడరో నను గాంచరో గారవింపరో
భాగ్యముజేయరో యనుచు • దద్దయుబల్కుచునుండె గాని వా
రేగతినైన నుత్తరము • నీక కనుంగొనుచుండి రెంతయున్.

తే॥ అవ్విధంబున నా ద్విజు • నాలయమున వార లించుకయును దన్ను • గారవింపఁ
దలఁపకుండు టెఱింగి చి • త్తమున నతఁడు కినుక రేకెత్త బిగ్గర • ననియెనపుడు.

చ॥ పిలిచిన పల్కరేల యవి • వేకమొ గర్వమొ కన్నుగానరో
తెలియరొ యీసగంగుఁడ స • ద్బ్రహ్మమాధ్యుఁడటంచు నెంతయున్
గలుషమటన్న భీతిలరొ • కానక సేసినయట్టి కృత్యముల్
ఫలమిదునం చెఱుంగరొకొ • బ్రాహ్మణధర్మము మాలిఁదాల్పరో.

క॥ సామాన్యులైన యతిథులనే మానక గౌరవించు • టిల ధర్మముగా
గా మీరీ యతివరున న్నీమాడ్కి దిరస్కరింతు • రే గర్వమునన్.

క॥ స్తుతమతియై తనకెదు నీ యతివర్యుండేగుదెంచి • యహర్యమయిన య
ట్టి తఱిని భిక్షనొసఁగుఁ డన బ్రతికూలముగా, జరింపఁ • బాడియె మీకున్.

చ॥ వినుతగృహస్థ ధర్మమును • వీడి స్వలాభమునందె బుద్ధిఁ జే
ర్చి నిఖిలవేదుఁడౌ బుధుల • సేవయొనర్పక యాత్మగౌరవం
బునకయి సంచరించు నిను • బోటి ఖలున్ బరిమార్పకున్న స
జ్జనులకు నిల్వనీడ వసు • ధన్ గలదే యొకచోఁ దలంచినన్.

క॥ పూనిక నాకే యిట్లవమానము సేయంగఁదలఁచి • మాటాడవహో
మానవమాత్రుం డెవ్వండేని యయిన వాని నెట్లు • హింసించెదవో.

క॥ ఆకొని యేతెంచిన నరుఁ బ్రాకటమగుభక్తి నున్న • పగిదినిడక తా
నే కొ.నితినియెడు దుష్టునకేకరణి యశంబుగల్గు • నిలఁ బరికింపన్.

తే॥ అతిథియై తనయింటికి • నరుగుదెంచినట్టివానిని బిల్చి య • థాహరీతి
నాదరింపనివాని భా • గ్యంబ దేల మునిడి ప్రమాఁకునఁగల ఫలం • బులను బోలి.

ఉ॥ క్షుత్తునకోర్వలేక సర • సుండగు ప్రవ్రజితుండు వాకిటన్
మొత్తుకొనంగ నింటితలు • పుల్ బిగియించి యొకింతయేని చే
యెత్తి యొసంగలేని గుణ • హీనునకున్ జయమానె వాని రే
కెత్తిన సంపదల్ వసుమ • తీశులపాలయి ప్రమందకుండునే.

క॥ ఇదియా విప్రులకుఁదగిన యది పండితలక్షణము గృ • హాంగణసీమన్
వదరెడు సన్యాసుల నిట్ల దయతఁ గనుగొనుట ధర్మ • మా పరికింపన్.

మ॥ ఖలుఁడా పాపము నాక నన్నిటు దిర • స్కారంబుఁగావించినం
దులకున్ నిన్ను శపింపఁగాఁ దలచుటల్ • దోషంబుగా దైన నీ
కలుషంబే నిను సంహరించు మఱి భూ • కాంతుండు నీకూళసే
తలకున్ సైపక శాస్తిజేయు నికఁ గ్రో • ధస్ఫూర్తిన్ దీపింపఁగన్.

క॥ అని క్రోధంబునఁ బలికిన విని ద్విజవర్యుండు సుతుని • వీక్షించి వచిం
చెను వాకిటఁ గలకలమున్ గనుగొని యరుదెమ్మి మిపుడు • కడఁక జెలంగన్.

క॥ అనుటయుఁ బుత్రుం డిట్లను జనకా రుద్రాక్షలేని • సన్యాసి యొకం
డె నలేనివాఁడు మన గృహమునకున్ జనుదెంచిభిక్ష • మును వేడునిటుల్.

తే॥ అనిన జనకుఁడనియె ♦ నాబోఁడతపసిని వెడలనడపుఁ డిపుడు, వేరు నాక
రూఢియగునె తనకు, రుద్రాక్షలేకున్న ధరణిలో యతిత్వ ♦ మరియ నెందు.

వ॥ అంత నా సుప్రతీపుని పుత్రుం డరుదెంచి శాంతవచనంబులఁబోక దూషించు స
గంగాఖ్యుని బగిమి నలుతపట్టి నూకనాతం డోరువలేక బిట్టుఅచుచు నప్పురఁబు
పాలించు సాలంక నృపాలునిఁజేరి యిట్లనియె.

చ॥ అవనిని లోకపాలుఁడగు, నట్టి సమర్థుఁడు దేవతాంశ సం
భవుఁడగుఁగాని నీచుఁడగు, మానవమాత్రుఁడె యౌనె యట్టి భూ
ధవునకు నెల్లవారి నుచి ♦ తస్థితిఁ గాచుచునుంట ధర్మమా
ప్రవిమలచిత్తుఁ డా నృపతి, పర్యుని మించిన దొంగడు కల్గునే.

చ॥ తన కులధర్మ మార్గమును, దప్పఁగ ద్రొక్కి చరించువాఁడె పో
తనయుఁడెయైన భూపతికి ♦ దండ్యుఁడగుఁ దన కహితమైన కా
ర్యనికర మాచరించు దన, యంబును ద్రిమ్మరువాఁడు శత్రుడై
నను బుధుడుఁ వలెఁ మనుజ♦నాధుని గౌరవముఁ గొనఁదగుఁ.

క॥ తనయందు రీతి వినయంబు నితరులఁ గౌరవంబుఁ, బూని చరింపఁ
జను భూమి నేలఁగాఁదగు ఘనునకనుచు శ్రుతులు ♦ దెల్పఁగాదె మహీశా.

క॥ హితులఁ బ్రధానులఁ బౌరోహితులయతుల నతుల ధర్మ ♦ హితుల సుమతులఁ
సతతము స్వజనులఁ గన్గొను గతిఁ బ్రోచుట ధర్మమనిరి, క్ష్మాపతికెపుడుఁ.

తే॥ ప్రజల దోషంబు లెఱిఁగి ధ♦ర్మగతి నుచితదండనమొనర్చువాఁడె భూ♦ధవుఁడుగాక
పక్షపాతమునఁ దన ♦ వారియందె గౌరవంబునఁ జరియించు, ఖలుఁడు నృపుఁడే.

తే॥ అంశుమాలి తిరుగు ♦ నంతటి యీలోకమెల్లఁ దిరిగి కంటి, నెందు నేని
నిన్నుబోలువాని, నృపవరేణ్యునిఁ గాంచనేరనైతి నొకని ♦ ధారుణీశ.

ఉ॥ పంకజబాంధవాన్వయుఁ డ ♦ పారగుణాకరుఁడైనవాఁడు ని
శ్శంకితచిత్తుఁ డీశపద ♦ సారసముల్ భజియించువాఁడు సా
లంకనృపాలుఁ డొక్కఁడుఁడె ♦ లాలిత కీర్తి విశాలుఁడంచు నే
వంకను బోయినఁ జెవుల ♦ పండువ యౌనటులఁ వినంబడుఁ.

ఉ॥ దండితశాత్రవుండయి బు, ధప్రకరంబు శరణ్యుడౌచు నా
ఖండలతుల్యుఁడైన నర ♦ కాంతుఁడు పాలనసేయు దేశ మొ
క్కండు నివాసయోగ్యమగు, గాని తలంపఁగ నన్యదేశమం
దుండగరాదటన్న నిగ ♦ మోక్తిని చిత్తమునం దలంచుచుఁ.

క॥ గురుభక్తియు సాధుజనాదరమును ధర్మానురక్తి • తత్త్వార్థమునన్
స్థిరమగుఁ జిత్తముగలిగిన నరపాలుఁడవీవటంచు • నమ్మి మనమునన్.

తే॥ క్షత్రియకులావతంసమై • సాధులోక పోషకుఁడవైన నీదేశ • మున వసించి
యతిగణోచితమైన భి • క్షాటనమునఁ గాలయాపనమొనరింపఁ • గాఁదలంచి.

తే॥ ఇప్పురవరంబునన్ జేరి • యెల్లవిప్రు లొక్కొక్క దినంబునందున • నొక్కొకరుగఁ
జెలఁగి భిక్షనొసంగుచు • సేవజేయఁ గొన్నిదినములఁ గడపితిఁ • గువలయేశ.

చ॥ కలుషమటన్న భీతిలక • గర్వము పెంపున సంచరించువాఁ
డలసుఁడు క్రూరకర్ముఁడు దు • రాగ్రహయుక్తుఁడు సుప్రతీపుఁడన్
ఖలుఁ డొకఁడుండు నిప్పురిని • గంటకతుల్యుఁడు తక్కువారలన్
బలెనను బిల్చి భిక్షనిడ • భావమునందుఁ దలంపఁ డింతయున్.

సీ॥ అతఁడు దురాత్ముఁడం • చాత్మ నెఱుంగక పూర్వమీ భూమిదే • వుండు యతులఁ
బూజించు మార్గ మెప్పుడు గాంచియుండఁ డాతని గృహంబున కేన • తరలి తెలిపి
భిక్షగొందుననెడి • ప్రేముడి రేకెత్త సచ్ఛాత్రుఁడనగుచు • సరగ నతని
సదనంబునకుఁ జని సాధుభావంబున నతిథినంచునుబల్క • నా ఖలుండు
గౌరవంబొనర్చి • కాంక్షదీర్పక మంచిచెడ్డలైన నాకుఁ • జెప్పకపుడు
సుతునిబంప వాడుఁ • జూపఱు వేఱుగొంద నఱుతబట్టికొట్టె • నాగ్రహమున.

తే॥ దూరముగనుండి కన్గొను • వారెగాక వలదనుచు వాని దండించు • వారు లేమి
మీఁదుమిక్కిలి నాతఁడు • మేనుదెలియక కక్కటా దూరసాగెన • స్నధముఁడగుచు.
వ॥ అట్టి మహాపత్సమయంబున.

క॥ శిష్టజనానుగ్రహమును • దుష్టజనాగ్రహము గలిగి దోషాదోష
స్పష్టత నెఱిఁగి బుధజనుల కిష్టుఁడవై తిరుగువాఁడ • వీవని మదిలో.

చ॥ కనికరమూని భిక్షనిడఁ • గాఁ దలఁపోయక వాఁడు నాయెడన్
గినుకవహించి యవ్విధి న • కృత్యము నాకపరాధవం బొన
ర్చిన మది సైపలేక నృప • శేఖర నీవె యనాథులైనవా
రిని గృప గాతువంచుఁ గృత • కృత్యుఁడనౌదునటంచు వచ్చితిన్.

క॥ న్యాయాన్యాయము లెఱిఁగి కృపాయతచిత్తుండవైన • యట్టి ఘనుడవ
న్యాయంబు నీ పురమునందే యివ్విధి సంభవిలుట • హేయముగాదె.

చ॥ ప్రవిమలమైన విప్రకుల • మం దుదయించినవాఁడె యిట్లధ
ర్మమునఁ జరింపఁదక్కఁగల • మానవులన్ వచియింపనేల స

త్యమును జయంబుఁగోరు వసు • ధాధిపులట్టి దురాత్ములన్ సమూ
లముగ వధింపకున్న నృప • లక్షణ మెవ్విధి సార్థకంబగున్.

మ॥ ధనగర్వంబునఁ గన్నుగానక ప్రమ • త్తత్వంబునన్ జేసి యీ
యనఘుం డెంతయుఁ బూజనీయుఁడనుచున్ • న్యాయైకదీక్షారతిన్
నను బూజింపఁదలంప కివ్విధమునన్ • దండించె నా సుప్రతీ
పుని సైరించుట యోగ్యమే ధరణి మి • మ్మున్ వంటి రాజాళికిన్.

తే॥ సర్వసన్న్యాస మొనరించి • సంతతంబు హరిచరణముల మదిలోన • నాశ్రయించి
సాధుజనులుండు దేశముల్ • స్థానములుగ సంచరించుచునుందును • సంతసమున.

తే॥ అట్టి నన్ను నొక్కఁ • డజ్ఞానుఁడై నిందసేసినంత నేమి • చెట్టయగును
సర్వసాక్షియగుచు • జగముఁ బాలించెడు తండ్రి సుకృత దుష్కృతములఁగనఁడె.

వ॥ అసూయారహితుండనై బ్రహ్మానంద సంధాయకంబగు తురీయాశ్రమ స్వీకారంబుఁ గావించి నారాయణస్మరణయె నిత్యకృత్యంబుగ సంచరించు ననువంటి సన్న్యాసి కొక్క సామాన్యమానవుని గుఱించి వక్కాణించు టనుచితంబయ్యైన నొక్క గృహక్షేమంబుఁగోరి యొక్కమనుష్యు నొక్క పురాభివృద్ధిఁగోరి యొక గృహంబు నొక దేశసౌఖ్యముంగోరి యొకపురంబును ద్యజించుట ధర్మవిప్లవంబుగాదని మహర్షుల మతంబైనకతన జగద్గురుత్వంబుఁ గాంచి లోక క్షేమంబునకై పరమేశ్వరు నారాధించు నాయంతవానిఁ బూరికిన్ గొనక మెదబట్టినూకినవాఁ డన్యుల కపకారంబుఁ గావింపకుండఁడని యరసి సుప్రతీపునివిషయమై యింతతడ వుపన్యాసంబుఁ జేయ సమకట్టితిని. మనోహరంబునగు దేహంబునకు స్విత్రంబుఁబలె జగదుత్తరంబగు నీ పురంబునకు లఘుత్వాపాదనంబు గావింపనున్న వాని నేల వేల్పని తలంపక యథార్హశాసనంబుఁ గావించి సత్కీర్తి నార్జింపుము దీన నీకు శ్రేయంబగునని మఱియు నిట్లనియె,

చ॥ అరయ గృహస్థుగేహమున • యందలి దుష్టుఁ ద్యజించి యాత్మమం
దిరమును బాగుఁజేసెడి గ • తిన్ నరపాలుఁడు రాజ్యసౌఖ్యమున్
గర మొనరింపఁగోరి యొడి • కంబున దుర్మతియైనవాని నా
దర మిసుమంత లేకయె ప • దంపడి వీడదగున్ మహీశ్వరా!

॥ అనిపలికిన విని సాలంక నృపాలుం డిట్టులనియె • గర్వంబునఁ జే
సి నినున్ బాధించిన యాతని నిపు డిచ్చటికిఁ బిల్చి • దండింతు వెసన్.

॥ అనిపలికి యలుక మెయి నా సుప్రతీపుని బిలిపించి క్రోధారుణి తాననుండై యిట్లనియె'

ఉ॥ ఆకొని యేగుదెంచిన మ • హాత్మునకీ యతికర్హ రీతిఁ బూ
జాకలనన్ గుతూహలము • సల్పక నోటికివచ్చినట్లుగా
కేఁకలు వైఁచి కొట్టితి వ • కృత్యము నాక యిదేటిధర్మమా
నో కుటిలాత్మ భూమిపతి • యోర్చునటంచుఁ దలంచితే మదిన్.

క॥ తన కుచితంబగు ధర్మముఁబును విడిచి స్వతంత్రుఁడగుచు • మూఢాత్ముండై
యనయంబు సంచరించెడు మనుజుని శాసింతుననుచు • మదిఁ దెలియవొకో.

చ॥ గురుఁడు సమస్తశాస్త్రనిధి • కోవిదుఁడీతఁడటంచు నెంచి యి
ప్పురిఁగల విప్రులున్ సుకవి • పుంగవులున్ దగు గౌరవంబు నా
దరమును జూపరే స్వకులధర్మమువీడి యకారణంబ పా
పరతి క్షుధార్తుఁడౌ యతిని • బల్మినికొట్టినవాఁడ వీవకా.

తే॥ భూతి రుద్రాక్షలూని యెప్పుడును శివశివా యనుచుఁబల్కునంతనే యగునె ఫలము
కుతుపవేళల నరుదెంచు • నతిథిజనము నాదరింపని దుర్మతి • కరయజగతి.

చ॥ చదివితి నెల్లవేదముల • శాస్త్రములన్ బఠియించినాఁడ నా
హృదయము నిర్మలంబనుచు • నెంతయుఁ బల్కుచునుందు వెప్డు నీ
చదువున కిద్దియే ఫలము • సాధువులన్ భజియించు పూన్కిలేఁ
క దయతఁగొట్టుటొప్పునె య • హా విషపూరిత కుంభమట్లుగా.

శా॥ ఔరా నావలనన్ భయంబువిడి వి • ప్రాచార్యుఁడౌ నిమ్మహా
ధీరున్ గాసిఁజేసినాఁడ విపుడింతే దుర్మదాంధుండవై
క్రూరాత్ముండవు బ్రాహ్మణుండవని సం • కోచించితిన్ జంపఁగా
జేరన్ బొమ్మికనన్యదేశమునకున్ • శీఘ్రంబయిందుండకే.

చ॥ అనవిని సుప్రతీపుఁడను • సార్వనృపాలుఁడ వోట నెట్లు సే
సిననిను గాదటంచును వ • చించెడువారలు లేరు నీవు నె
ప్పినటుల నిష్ఠురంబు విడి • వేగమపోయెద నాకు నింతమా
త్రన నిసుమంతయున్ గొఱంత • గాదని నమ్ముము నెమ్మనంబునన్.

ఉ॥ భూపతిశాసనంబు వెలి • బుచ్చియుఁ గాదు శ్రితవ్రజంబుపై
కోపముఁబూని కాదొరుల • కున్ వెతఁగూర్పఁదలంచిగాదు నే
నీపురి బాయుచుంట వసు • ధేశ్వరు నాసతి మాళిదాల్చి సం
తాపము నాక నెమ్మది ము • దంబున నేగదలంతు నియ్యెడన్.

తే॥ జన్మభూమికన్న • సౌఖ్యాకరంబగునది లభింపదనుచు • నాత్మలోన
నెఱుఁగకుండిగాదు • నృపునాజ్ఞ మీరుట పాపమనుచుఁ దలఁచి • పయనమైతి.

క॥ సన్న్యాసియును గురుండును ధన్యుండగునట్టి యతని • దండించితి వి
ట్లన్యాయముగ ననుచు వాగ్విన్యాసమొనర్చితీపు • పృథ్వీశయిటన్.

తే॥ అవని రుద్రాక్షకన్న మో • క్షాస్పదమగునది యొకటి లేదటంచు మ • హర్షివర్యు
లాడుచుండెదరట్టి రు • ద్రాక్షదాల్ప కితఁడు యతియగు టెట్లు పృ • థ్వీశ చెపుమ.

క॥ రుద్రాక్షలను ధరింపక రుద్రుఁడువచ్చినను గాని • రూఢిగ నేన
క్షుద్రుగతిఁ దలఁపననుచున్ భద్రాత్ముఁ మున్న ప్రతిన • బట్టినవాఁడన్.

వ॥ ఇక్కపటసన్న్యాసి దుర్జనప్రేరేపణంబుననో యితరశ్శైవో సహనంబునగు స్వబుద్ధి ప్రేరేపణంబుననో యిట్లరుదెంచి నా వ్రతంబు భంగంబుగావింపఁదలంచి యుండెనోపు. కాక నిక్కవంపు యతియగునేని మోక్షాధుకాల కవశ్యంబులగు రుద్రాక్షలనేల తాల్పకుండును. రుద్రాక్షల దాల్పనివాఁడు క్షుద్రుండని శ్రుతులు వక్కాణింప వినమే. అక్షుద్రుని బూజించినఁ బ్రయోజనంబేమి. సముద్రమునఁ గురిసిన వర్షంబు, నడవి గాఁచిన వెన్నెలయు భీతుని పాండిత్యము నట్ల రుద్రాక్షదాల్పనివాని జపతపస్స్వాధ్యాయంబులు వ్యర్థంబులు గాక ఫలవంతంబులే ఇట్టి కుటిలస్వభావంబుగలవాని పలుకు లాలకించి మంచిచెడ్డలు విచారింపక పామరుడు బోలె నిట్లుబల్కు నీకు నోరెట్లాడనో తెలియకున్నయది నీకతని కల్పనావాక్యంబులే రుచించిన యేనియే నీదేశంబు విడిచి యరుగుట కింతయును సందియంపడనని వచించు సుప్రతీపుని గాంచి సగంగాఖ్యుఁడిట్లనియె.

ఉ॥ నేరమొనర్చినాఁడ నవ • నీధవ సైపు మటంచు దీనతన్
ధారుణి నాథు వేఁడక ప • దంపడి కర్కశఘోర వాక్యముల్
ధీరతఁ బల్కఁగాఁ దగునె • ధీనిధు లియ్యది విన్న మెత్తురే
పారుఁడ విట్ల ధర్మమగు • పద్ధతి నీ కుచితంబె చూడఁగన్.

క॥ యతిని బ్రహరించుటయు భూపతి కెదురాడుటయు ధర్మబాహ్యంబై యీ
గతిఁ జరించుటయును నే యితరునియందైనఁ గలుగు • నే కుటిలాత్మా.

తే॥ పుడమి మగనినొట్టి • మొఱవెట్టుకొనినట్లు నన్ను గొట్టి భూమి • నాథుని కడ
ననుచితంబు నాక • యహర్కాండననుచును బరుష వాక్యములను • బల్కఁదగునె.

తే॥ శాంతచిత్తుఁడగుట • జననాయకుండు నీ సలిపినట్టి తప్పు • సైఁచెఁగాక
యితరుఁడగునయేని • యీగతి మాటాడు నిను వధింపకున్నె • నీచహృదయ.

తే॥ తగునె రుద్రాక్షలేని యా • తండు ధాత్రి నెందులకుఁగొఱగాఁడని • యిట్లుబల్కు
గోరి భగవంతుఁ గన్గొను • కారణము లనేకములు గల్గవే నీకు • నెఱిఁగనానె.

సీ॥ "ఇతఁడు రుద్రాక్షల • నెన్నఁడును ధరింపఁ డేరీతియతియగు • నీ ఖలుండు
కాపట్యమునం బూని • నాపట్టిన వ్రతంబు భంగం బొనర్ప నీ • వ్యాజమునను
వచ్చియుండు"నటంచుఁ • బలికితి విప్రుఁడ యేను రుద్రాక్షల • యింతయేని
దాల్పనివాఁడఁగ • దాయేను సాధించు నట్టి కార్యములు రు • ద్రాక్షయందు

మహిమ కలదటంచు • మది విశ్వసించిన నీకు సాధ్యములగు • నే వచింపు
మురక పలుకనేయు • నుర్వీధవుని మ్రోల నఘౌరహితమైన • యట్టి పలుకు.

వ॥ నా కావించు మహాకార్యంబు లేవియంటి వేని యిటు వినుము.

సీ॥ బృందారకాధీశు • నందనవనమునఁ దనరారు పారిజా • త ప్రసవము
లే నిందయుండియే • యేనాడు గనకుండ మత్ప్రభావంబున • మహీధవుండు
మున్నగువారల్ ప్ర • ముదము జెందునట్టులఁ గొనివత్తుఁ గాకున్న • కుంఠిత ప్ర
భావుండ నని నీదు • పదములఁబడియెద • నీవిట్లు సేయుదు • వేని భక్తి

నీకు శిష్యుఁడనయి • నీ యుపదేశంబు నేకరంతు నట్లు • జేయ వేని
నాకు శిష్యుఁడవయి • నా చెప్పినట్లు రుద్రాక్షలను ద్యజింపు • మనని దేవ!

చ॥ అన విని విప్రుఁడిట్లను కృ • తార్థుఁడవయ్యెదవో తలంప న
య్యనిమిషలోకమందు గల • యా కుసుమంబుల నిందుఁ దెచ్చినం
తనె యిది యొక్క కజ్జమగు • నా జగతీతలమందు నెల్ల ని
ట్లన యొనరించుచుందువో భ • క్తా తెలియంబడె నీ పరిభావముల్.

తే॥ ఇదియ నీప్రతిజ్ఞ • యిక నాప్రతిన విను మీవు సెప్పినట్లు • నీవు సేయు
మమరలోకమునకు • నరుగకయే యేను పారిజాత వృక్ష • పంక్తిఁ దెత్తు

వ॥ నీవు ప్రాణవాయువుల బంధించి యోగశక్తిఁ గుసుమంబుల మాత్రము దెచ్చినట్లు జూపరకబ్బురంబు గల్గింతువు. ఇది యొక లోకోత్తర కార్యంబగునే. రుద్రాక్ష మాహాత్మ్యంబున మాయింట నొక బక్కపిల్లికూన గల దద్దానిచే నందన వనంబు నందలి కల్పతరువులనెల్ల నిటకుఁ దెప్పింతునట్లు గాదేని రుద్రాక్షలఁ ద్యజించుటయు గాక విప్రకులమునుండి తొలఁగి నీచేసిన శాసనంబునకుఁ బాత్రుఁడ నగుదుననిన నా సగంగాఖ్యుం డుత్సుకంబున ప్రాణాయామంబుఁ గావించి ముఖవస్త్రంబు దాల్చి క్షణమాత్రమునఁ గల్పపుష్పముల నందలి యందఱకుఁ జూపుటయు నద్దానికెల్ల వారు నుల్లాసంబు జెంది యయ్యతివరు ననేక విధంబులఁ గొనియాడి రంతఁ గొందఱు సుప్రతీపుని హితంబుఁ గోరినవారు నెమ్మనంబుల.

సీ॥ తనయింటికేగుదెం • చిన యతివరుని బూజింపక యితఁడు దూ • షింపనేల
దూషించెఁబో వీఁడు • దుష్టుడే యనిపోక పతితోడ యతియుఁ జె • ప్పంగనేల

చెప్పెఁబో నృపుఁ డింత • శిక్షించి విడువక చేరి యాగతిని బ్ర • శ్నింప నేల
ప్రశ్నించెఁబో కాంత • భావంబు విడిచి భూపతితోడ నితఁడట్లు బలుక నేల
యతిప్రతిజ్ఞఁ జేసి • యమరపురమునుండి కుసుమవిసరములను • గూడఁదెచ్చె
నింక సుప్రతీపుఁ • డేరీతి తనమాట నిలుపఁగలఁడొ జయము • గలుగుటెట్లొ.

చ॥ యతికులశేఖరుండు మహి • మాన్వితుఁడున్ నిఖిలజ్ఞుఁడున్ జగ
ద్ధితుఁడగుటన్ నిమేషమున • నెల్లరు నబ్బురమొందఁగా శచీ
పతి నగరంబునుండి సుమ • పంక్తిని గైకొనివచ్చి చూపె నీ
క్షితితలనాథు మ్రోలఁ దన • చేయు ప్రతిజ్ఞనుదీర్చె నిత్తఱిన్.

నాకమునకేగి కుసుమానీకముఁ దెప్పించుటన్న • నిఖిలజ్ఞునకే
గాకొకనికి సాధ్యంబే యీ కలహము సుప్రతీపుఁ • డెట్లు జయించున్.

తే॥ ఈషణత్రయంబు • నింద్రియవర్గంబుఁ గెలువలేక విషయ • ములను మరగి
నట్టి సుప్రతీపుఁ • డానాకముననుండి పారిజాతవృక్ష • పంక్తిఁ దెచ్చు ?

తే॥ సర్వమునకు స్వతంత్రుండు • జనవిభుండు నట్టిసామర్థ్యమును గలాఁడె • యతివరుండుఁ
దనకు బలవద్విరోధంబు • తగదటంచుఁ దలఁపఁడే సుప్రతీపుఁడిం • తయును మదని.

తే॥ వారివారికిఁదోఁచిన • పగిది నటుల నొక్కరొక్కరు బల్కుచు • నుండిరంత
సుప్రతీపుండు పుత్రుని • జూచి యింటి యందుఁగల పిల్లిఁ దెమ్మని • యనుడునపుడు.

జనకు నానతి మెయి సౌప్రతీపుండును గృహంబునందలి రుద్రాక్షమాలాలంకృతం
బగు నొక మార్జాలంబుఁ గొనివచ్చి తండ్రి చెంత నిలిపె నప్పుడు,

తే॥ అనట నున్నవార • లబ్బురంపడునట్లు క్షోణినాథుఁ గాంచి • సుప్రతీపుఁ
డివ్విధమునఁబల్కె • నీతండు సుమములఁ జూపినంత మీఁదఁ • జోద్యమయ్యె.

మనుజాధీశ్వర నిశ్చలుండవయి యీ • మార్జాలమున్ జూడు క్ర
న్నన నాకంబునకేగి కల్పతరు సం • తానంబు నిచ్చోటికిన్
జనులాశ్చర్యము నొందఁ దేఁగలదు శ • శ్వద్భక్తి రుద్రాక్షలన్
దన కంఠంబునఁ దాల్చియుంటను మరు • త్వంతుండు మన్నింపఁగన్.

అనుచుబల్కి బిడాలంబు • నంబరమున కెగురవైచిన నదియు న • హీనమైన
జవమునన్ బోయె నూర్ధ్వదే • శమున నెల్లవార లున్నమితాస్యులై • కొరకనంగ

ఆవ్విధంబునఁ బోయి • యా బిడాలము క్షణమాత్రంబుననఁ గల్ప • మహిజవితతిఁ
జేకొనియున్ దేవ • సిద్ధుండనెడు నొక్క దేవతాశ్రేష్ఠుండు • తివిరితోన

రావిమానము నెక్కి • రాజసభకుఁ జేరి వినతయై సుప్రతీ • పునకు వంద
నంబొనరించెఁ • గ్రమంబున సిద్ధుండు విప్రోత్తముని గాంచి • వినయమలర
కరయుగంబు మోడ్చి • కాంచువారలిదేమి యద్భుతంబటంచు • నట్టెయనిమి
షులయి నిలిచియుండ • లలితవాక్యంబుల నిట్టులనుచుఁ బల్కె • నెలమితోడ.

వ॥ శివభక్తాగ్రగణ్యుండవగు నీకు నమస్కారపూర్వకంబుగ సునాశీరుం డిట్లు విన్న
వించె నాకర్ణింపుము.

ఉ॥ ఓకరుణాలవాల సుగు • ణోన్నత నీయనుకంప పెంపునన్
నాకమె గాక సర్వభువ • నంబులుం సౌఖ్యముఁ జెందు దానవా
నీకము నీప్రభావమున • నే శమియించె నితాంతశర్వపూ
జాకలనన్ ఘనుండవయి • సన్నుతిపాత్రుడవైతి వెంతయున్.

తే॥ తడవుకాలంబునుండి నీ • దర్శనంబు సలుపఁగోరుచునుంటిని • స్వాంతమందు
దైవయోగంబులేమి సుం • తయును నట్టి భాగ్యము లభింపదయ్యె ని • ప్పటికినైన.

తే॥ అనుచు దేవసిద్ధుఁ • డాడిన విని సుప్రతీపుఁ డిట్టులనియె • దేవవిభున
కీ మనుష్యునందు • నింతటి కృపగల్గుటరయ నేను సుకృతి • నగుటగాదె.

క॥ నిరత గిరిశేశపూజాపరుఁ డివ్విప్రుండు నీ క్స • పన్ రుద్రాక్షా
భరణుండై మెలఁగెడు నని సురనాథునితోడఁ జెప్పు • సుగుణగణాఢ్యా!.

తే॥ అనుచుఁ బల్కి వినయ • మున దేవసిద్ధున కహా రీతి సత్క్రి • యనొనరించి
నా నమస్కృతుల శ • చీమనోహరునకుఁ దెల్పుమనుచుఁ బంపె • దేవసిద్ధు.

తే॥ అట్లకాక యనుచు • నా దేవసిద్ధుండు సంతసమునఁ జనియె • స్వర్గమునకు
నచటివారలెల్ల • రాశ్చర్యమున్ జెందిరా యతియు నతోత్త • మాంగుఁడయ్యె.

చ॥ నరపతి భక్తిసంభ్రమ స • నాథుఁడునై కరముల్మొగిడ్చి భూ
సురవరుఁ గాంచి యిట్లనియె • సూరివరేణ్య భవత్ప్రభావ మి
క్కరణి మహాద్భుతంబయి జ • గంబున సన్నుతిపాత్రమానటం
చరయగలేక నీయెడల • నాగ్రహ మొందితి సైపుమానసన్.

తే॥ తెలివిలేకిట్లు సన్యాసి • పలుకులవిని భ్రాంతిజెందితి నీ ప్రభావం బగణ్య
మగుచు లోకోత్తరంబైన • దని యెఱుఁగక ద్విజకులోత్తమ మన్నింపు • దీనునింక

మ॥ శతజన్మంబులకున్ లభింపఁగలదే • సంతానభూమీజ సం
తతిదర్శించుట యివ్విధంబున నయ • త్న ప్రాప్తమయ్యెన్ జగ

ద్ధిత కాంత్యుఁ జరించు నీకతన నీ • కీర్తి ద్రోహంబొన
ర్చితి నన్నుఁ గరుణింపు మో ద్విజకుల • శ్రేష్ఠాత్మ సంగతిన్.

చ॥ అనవుఁడు సుప్రతీపుఁడు న • రాధిపుఁ గన్గొని పల్కు నీ యొన
ర్చిన యుపకారమే యిది య • కృత్యము గాదు విచార మేల యో
యనఘ యతీంద్రువాక్యమున • యందలి నమ్మిక చేత యివ్విధం
బున నొనరించినాఁడ విది • భూపతి ధర్మము గాక దోషమే.

తే॥ దైవయోగంబున కొకింత • తావకీన కరుణయును యతి వాత్సల్య • కలనయునొక
కారణంబయి రుద్రాక్ష • ధారణంబు మహిమ సాటించె నివ్విధి • మనుజనాథ.

తే॥ అనుచుఁ బల్కు బిడాలంబుఁ • గని వచించె నీ విచటనుండి సురపురి • కేగిమరలి
వచ్చువఱ కేమిజరిగెనో • పలుకగదవె సందియమువీడి యీ సభా • సదనమందు.

వ॥ అనిన నమ్మార్జాలంబు సుప్రతీపునకు వందనం బొనరించి శాంతవచనంబుల నిట్లనియె
నట్లు సఫలప్రయత్నుండవగు నీవు నన్నాకసంబున కెగుర వేసినంత.

సీ॥ చక్కఁదనంబున • కిక్కలై తనరారు వేయుగన్నుల మేన • వెలయువాఁడు
ఆర్తావన సమర్థ • మగు కేల పదిపదులంచులుగల శాస • మించువాఁడు
శైలోన్నతంబగు • చారుగంధగజంబునందు సుఖాసీనుఁ • డైనవాఁడు
దానవకులభయ • దాయకంబులగు వృక్షాలశాంతరసము చె • న్నలరువాఁడు

గరుడగంధర్వ యక్షర • క్షః పిశాచముఖ నిఖిలజంతుజాలంబు • ముందు వెనుక
నడువ నరుదెంచువాఁడు బృం•దారకేశుఁ డభిముఖుండయ్యె మార్గమ•ధ్యమున నాకు.

క॥ ఆవిధమున నాకభిముఖుఁ డై వచ్చెడు వాని దేవ • తాధీశునిగా
భావింపనైతి నజ్ఞా నావృతనైయుంట భూసు • రాగ్రణి యపుడున్.

తే॥ ఐననాతఁడొక్క • యతిలోకుఁడని దార తొలఁగి చనుతలంపు • గలిగియున్న
నన్ను గాంచి మత్త • నాగంబుపైనుండి దిగి యతండు పలికె • నగుమొగమున.

క॥ నను జూచి యెఱుఁగవెన్నడు నిను జూచి యెఱుంగనైన • నీ యాగమనం
బున యందలి కారణమును మనమున నే దెలిసికొంటి • మార్జాలపతీ.

క॥ దయసేయుమీ విమానము రయమునఁ గొనిపోఁగలదు సు • రపురమునకు ని
శ్చయ మిది యని పల్కుచు హరి హయుఁ డప్పుడు నను విమాన•మందున జేర్చెన్.

ఉ॥ ఆవిధినన్ విమానమున • యందున జేర్చి వినీతిగాత్రుఁడై
యావిభుధేశ్వరుం డనియె నాఢ్యగుణోన్నతుఁడైన సుప్రతీ

పావని దేవుఁడెల్లెడల • యందు జయంబును గాంచుచుండునే
పావన చిత్తుఁడాతఁడు కృ • పన్ గనుచుండెనె యెల్లవారలన్.

వ॥ అట్లనేకవిషయంబులఁ గుఱిచి యాతఁడు ప్రశ్నించుచుండ నంత నవ్విమానంబు చయ్యన నమరావతి సమీపించె. అక్కడ సునాశీరుండనేక విధంబులగు మంగళ వాద్యంబులు మ్రోయ డిగ్గి రంభాది దేవకాంతలు నటింపఁ జింతామణీ సింహాసనంబున నన్నున్ జేర్చె నప్పుడు.

మ॥ అమరాధీశ్వరుఁ గాంచి పల్కె శచిద్ర • శ్యాదృశ్యమా జంతుజా
లము నెల్లన్ సృజియించు నేర్పరి విలీ • లన్ నీ ప్రతాపంబునన్
సుమనశ్శ్రేణి సుఖంబుఁ గాంచెదు సమి • చ్చాభరుండ వీవీబిడా
లము నీచంబన కిట్లు గౌరవము స • ల్పన్ బోలునే చెప్పుమా.

క॥ సామాన్యుఁడైన మానవుఁడేమా జాన్ లంబటన్న • హేయముఁ గగనున్
ధీమహితుఁడ వీవీగతిగా మర్యాద యొనరింపఁ • గారణమేమో?.

తే॥ హీనకులజమైన • యీబిడాలం బేడఁ ద్రిభువనములఁ బ్రోచుఁ • ధీరుఁడిట్లు
గౌరవించుటేడఁ • గనుగొన విపరీతమగుచు దోఁచుచుండె • నాత్మలోన.

క॥ నావుఁడు వాసవుఁడిట్లను దేవీ నీకేవిధముసఁ • దెలియును రుద్రా
క్షావళి మహత్త్వము మహాదేవునకే యింతయేని • తెలియదనంగన్.

మ॥ కలికీ దీనిని క్షుద్రజంతువని • పల్కన్ రాదు రుద్రాక్షమా
లలఁ గంఠంబునఁ దాల్చినంత నిది కై • లాసాచలావాసియై
జలజాతాసన ముఖ్యదేవనుతుఁడౌ • సర్వజ్ఞుఁడున్ వోలె ని
చ్చలు పూజార్హతఁ గాంచి చెన్నలరు నా • చంద్రార్కమున్ ధారుణిన్.

తే॥ తరుణి రుద్రాక్షమాలలఁ • దాల్చువాఁడు హీనుఁడైనను బూజార్హుఁ • డైనరీఁగను
శివునకన్నను శివభక్తు • లవనిలోన నధికులను వచనము తథ్య • మగును గాదే.

వ॥ దీనికి దృష్టాంతంబు విను మొక్కనాఁడు నేను.

మ॥ అరవిందాయతలోచనా వినుము వి • శ్వారాధ్యుఁడౌ చంద్రశే
ఖరు దర్శించు తలంపు మమ్మరముగాఁ • గైలాసమున్ జేరి ని
ర్జరలోక ప్రియుఁ గృత్తివాసుని(బ్రాంచద్భక్తిఁ గీర్తించుచో
నరఁగన్ వచ్చెఁ గృతాంతుఁ డచ్చటికిఁ జాం • చల్యంబుమై పాఱగన్.

తే॥ అటులవచ్చి యముఁడు • నిటలాక్షుఁ గన్గొని కరయుగంబు మోడ్చి • కాలకంఠ
నిఖిలలోకనాధ • నీ కృపాకలనచేఁ గాదె జగములెల్లఁ • గలుగుచుండు.

మ॥ నిను ధ్యానింపక యెట్టియోగులును గా • నీ ఘోరసంసార జీ
వనధిన్ దాఁటఁగ నేర్తురే త్రిజగతీ • వాల్లభ్యమున్ గాంచి భ
క్తనికాయంబున కండయై యలరునిన్ • దర్శించుటన్ జేసి నా
జని సాఫల్యము నొందె నెల్లయెడలన్ • శస్తంబు నాకౌనిఁకన్.

తే॥ ఆదిమధ్యాంతములులేక • యలరు నీవు పాపపుణ్యంబులను రెండు • పద్ధతులను
చెలఁగి కల్పనఁజేసి త • త్ఫలములుగను నరకనాకముల్ నిర్మించి • నావుదేవ.

చ॥ కలుషమొనర్చువారి నర • కంబునఁజేర్చి యనేకవత్సరం
బులు దరిలేని యాతనలఁ • బొందఁగఁజేయుమటంచు నన్నిటన్
నిలిపితి వవ్విధంబుననె • నేను త్వదాజ్ఞను మౌళిదాల్చి ని
చ్చలు జరియించుచుంటిఁ బుర • శాసనధర్మపథానుగామినై.

తే॥ దురితచిత్తు నొకని • నరకంబునన్ జేర్చి నాదు భటులు యాత • నలనొసర్పఁ
గాంచి క్రుద్ధులగుచుఁ • గరకంఠ నీ భటులిటకుఁ దెచ్చినార • లేమనందు.

క॥ ఇది ధర్మమె నీ భృత్యుల కిదఁ గ్రోధము దగునె నరక • మే వసియింపం
గఁదగిన దుష్టుని రజతగిరి దరికిఁగొని రానగునె వి • రించి స్తుత్యా.

క॥ నీ యానతికిన్ లోనై యేయన్యాయంబుఁ బూన • కెల్లెడలందున్
నాయుచితమొనర్తునుగాదే యభవా యిటులఁజేయ • నేటికి నన్నున్.

చ॥ అనవుఁడు భైరవుండు విని • యర్కతనూజునితోడఁ బల్కు నీ
యనఘుఁడు పార్వతీశ్వరుని • యంతికమందుననే భయంబులే
కనృతములాడఁజొచ్చితివె • యీ మృతుసందున నొక్క పుణ్యమై
నను గనరాదె యెల్లరును • నమ్మెడునట్లొనరింపఁ జేసెనే.

తే॥ అతఁడు సుకృతవంతుఁ • డగునొ కాఁడో నీకుఁ దెలిసికొనెడు బుద్ధి • కలదెసుంత
చిత్రగుప్తునిటకుఁ • జీరి ప్రశ్నింప నతండు చెప్పఁడే య • దంతమిపుడు.

వ॥ అనినభయవిహ్వలుండై పితృపతి చిత్రగుప్తు రప్పించి యప్పాపాత్మునిచరిత్రంబుఁ
జెప్పుమనుటయు నతండును భైరవునితో నిట్లనియె.

——•జామిత్రోపాఖ్యానము•——

సీ॥ ఆలకింపుము కళిం • గాఖ్యదేశంబున వ్రాఘ్రపురంబున • యందు జార
వనితాకుమారుండు • వర్ణహీనుఁడు పిశితాహార మొనరించు • నట్టివాఁడు
జామిత్రుఁడనియెడు • సాక్షరుం డొక్కండు దుష్టసంతానంబు • తోన దిరుగు
వాఁడయి బహువిధ • పాపకృత్యంబులఁ గావించుచున్ బెద్ద • కాలమునకు
దైవయోగముననుఁ • దనతల్లి మృత్యువు వాఁతబడుటయు ధన • వాంఛఁజేసి
బలిమిజనకుఁ జంపి • వారకామినులకు దాసుఁడగుచుఁ సంత • తము జరించు.

తే॥ అటులఁ గొంతకాల • మరిగిన జామిత్రుఁ డర్థ మెల్ల శూన్య • మైన బ్రతుక
దారిగాంచలేక • తస్కరప్రకరంబుగూడి తిరుగఁజొచ్చె • క్రూరుఁడగుచు.

తే॥ వాఁడుతస్కరవర్గంబు • తోడఁగూడి పాపమునక చరించెడు • పట్ల రాజ
భటులుఁగని స్వామి యానతి • వానిబట్టి చంపివైచిరి నిర్దయా • స్వాంతులగుచు.

వ॥ జామిత్రుండు జన్మించినదిమొద లిట్టి పాపకార్యంబులనెగాక పుణ్యకార్యంబొక్క
టియుఁ గావించియుండఁడు. మేమునువానినిగుఱించి యింతియ వ్రాసితిమని పలికిన
భైరవుండు దరహసితాస్యుండై జామిత్రుం డట్లు దుష్కార్యంబులఁ గావించిన
మహాసుకృతులకును జేరరాని కైలాసంబుఁ జేర నర్హుఁడగు నెట్లంటేని.

సీ॥ కలఁడు జామిత్రుని • కాలంబునందునఁ జక్రవాకుండను • క్ష్మావిభుండు
ఆతని పుత్రి స • ర్వాంగసుందరియను వనిత నిజాలయం • బుననె యొక్క
ముని మాపునన్ స్నాన • మొనరించుచోఁ దన యఱుతనున్నట్టి రు • ద్రాక్షమాల
మల్లి కావల్లీమ • తల్లిపైనుంచినఁ గరటమొక్కటి దాని • గైకొనియును

నాకసంబునఁబోవుచు • న్నంత మసనమందుఁ బడియున్న జామిత్రు • నందుఁ బడియె
నఖిలపుణ్యాస్పదమిగు రు • ద్రాక్షసోకి మహిని బుణ్యాత్ముఁడయ్యె నా • మానవుండు.

క॥ రుద్రప్రీతికరంబులు రుద్రాక్షలు పాతకముల • రూపఱజేయున్
క్షుద్రాత్మునేనియును నక్షుద్రునిగాఁ జేయుఁగాదే • సూర్యతనూజా!

తే॥ అట్టి జామిత్రుకన్నఁ బు • ణ్యాత్ముఁ డెవఁడు వాని నరకంబునన్ జేర్చి • బాధసేయు
టరయ నీదోషమగుఁగాదె • యరుణపుత్రుయతఁడు కైలాసమునకు న • నర్హుఁడగునే.

తే॥ అవని రుద్రాక్షఁదాల్చిన • యట్టివాఁడు హరునకన్నను నధికుఁడౌ • ననెడు పలుకు
నెఱిఁగియును శైవునకు దోష • మేమొనర్ప సాహసముఁబూనితౌర నీ • స్వాంతమందు.

క॥ నీ నేరంబును మాపైనే నిలుపందలంచు టఘా మే యెట్టిఖిలుం
డేనియుఁ బుణ్యాపుణ్యునిగా నెంచునె దురితిమనక కతినాత్మ్రండై.

వ॥ అన విని భీతచిత్తుండయి యంతకుఁడంజలిఁజేసి భైరవుఁ
గనుంగొనిపల్కెనిట్లు శితి కంఠుని భక్తచరిత్ర లెవ్విధం
బునఁ దెలియంగనేర్చు మము బోటి దురాత్ములకుఁ సహింపుమా
గినియక నాయొనర్చిన య కృత్యము శైవశిఖామణీ యిఁకన్.

తే॥ అతని కంఠమందు నపుడు కాక విముక్తమగుచును రుదురక్కె యటులఁ బడుట
తెలియనైతి నీవు తెలిపెడునందాక నను క్షమింపుమయ్య యనఘ చరిత.

తే॥ గౌరవార్హులైన ఘనులఁ బూజింపక మఱియు వెతలఁగూర్చి యెలుక సేయు
వారి నిందసేయు వారిలో నొక్కఁడనైతి నన్ను సైపు మయ్యదేవ.

మ॥ అనుచుఁ దండధరుండు పల్కెనెడ జం ద్రార్ధావతంసుండు కా
లునితోడన్ వచియించె నేడుమొదలీ లోకంబునం దెవ్వఁడే
ననయంబుఁ బ్రియమొప్ప భస్మమును రు ద్రాక్షన్ ధరించుఁ మహా
త్మునిగా వాని దలంచి యెట్టి కలుషం బుఁ జేసినఁ బ్రోక్కుమా.

తే॥ ఎట్టి దుష్టుఁడైన నేమి నాభక్తు నాకన్న నధికుఁడనుచు గారవింపు
మిదియ యాజ్ఞయయ్యె నికమీఁద శైవుల జోలి విడిచినరక మేలుకొనుము.

వ॥ అని పల్కిన నైవస్వతుండు తనసమ్మతమును శిరశ్చాలనమురూపంబునఁ దెలియఁజేసె సింగంబునుండి తప్పించుకొనిన కురంగంబు భాతి నిజలోకంబునకేగె. కావున నీ బిడాలంబు రుద్రాక్షాలంకృతంబగుటవలనఁ బూజించితినని చెప్పి సహస్రాక్షుండు నావచ్చినకార్యం బడిగి యీ పారిజాతవృక్షంబులతోగూడ దేవదూతను నన్ను నీ విమానంబున నిటకంపెనని బిడాలంబు సుప్రతీపునితోఁ బలికిన.

సీ॥ సాలంకన్నపుఁడును సన్యాసియును నతానములయి సుప్రతీ పుని గనుగొని
పలికిరో మహితాత్మ భవపాశబద్ధులమై జ్ఞానహీనుల మగుచు నింద్రి
యాశ్వంబులఁ గట్టు నట్టి నేరుపులేక కన్నులుంగలిగియుఁ గానలేని
వారలమైన మా యాచరించిన దోషముల సైపు నీవంటి ముక్తులకిల

నొరులు చెప్పఁదగన దొక్కండుగలుగునే నీవకాదె నిఖిల శైవజనము
పాలి కల్పతరువు ప్రజ్ఞాన్వితుండవు ద్విజకులాభరణమ ధీరవినుత.

క॥ మా కావించిన నేరమికై కినియక మమ్ముఁబ్రోవు మా భూసురలో
కైక త్రాణపరాయణతా కలితుఁడవరయనీవు ఘనుఁడవౌటన్.

వ॥ అజ్ఞానహతులమగు మాకు సర్వపాపహరంబగు రుద్రాక్షధారణంబొనరించి మమ్ముఁ గృతార్థులఁ జేయుమని ప్రార్థించిన సుప్రతీపుండు కృపాంతరంగుఁడై మఱియు నిట్లనియె.

చ॥ స్థిరచిత్తుండును ధర్మశీలుఁడు పర • శ్రేయస్స్పృహిష్ణుండు భూ
సురలోకప్రియుఁ డన్నదానరతుఁడున్ • సుశ్లోకుఁడౌ వాఁడు గా
కగయన్ శంకరభూషణంబయిన రు • ద్రాక్షావళిన్ దాల్పఁ గా
ధరణిన్ వేరొకరుండు యోగ్యుఁడగు నా • తత్త్వంబు చింతింపఁగన్.

తే॥ ధర్మమార్గంబు విడువక • తగినయట్టు లెల్లవారల సమ్మతి • నెపుడు గాంచు
వారలకుఁ గాక రుద్రాక్ష • ధారణంబు కపటచిత్తుల కేటికిఁ • గలదె ఫలము.

క॥ నిరతం బింద్రియలోలతఁ దిరుగుచు విషయంబులందుఁ • దేకువ చేతన్
దురితములఁ జేయు మూకేకరణిని రుద్రాక్షఁ • దాల్పఁగాఁ దగు నెంకన్.

తే॥ కలుషనాశకములు • గౌరీశు భక్తుల చరితములను వినక • చంచలించు
మనసు స్థైర్యమగునె మహి నెవ్వరికైన పవనహతదళంబు • భాతి గాక.

చ॥ అతుల సుఖాస్పదంబయిన • యంధకవైరి పదాంబుజాత సం
గతి లభియించు టెట్లొ కొఱ • గాని శరీరమిదేల యక్కటా
మతి తిరమెట్టు లౌనని య • మాయకులై చరియించువారికిన్
గతి శ్రుతులున్ బురాణములు • గాక యొకండు ధరిత్రిఁ గల్గునే.

క॥ కావునఁ బురాతనంబును నై విమలంబగుచుఁ గలుష • హరమై సద్ధ
ర్మావహమై తనరెడు నొక శైవచరిత్రము వచింతు • స్వాంతంబలరన్.

—• సుప్రతీపుడు సాలంకునకు శాంతోపాఖ్యానము జెప్పుట •—

సీ॥ మకరదేశంబున • మకరాహ్వయంబగు పురవరంబున సుగు • ప్తుండు నాగ
విప్రుఁ డొక్కఁడు నిరు • పేదవిద్యాహీనుఁ డస్నాతురుండగు • నట్టివాఁడు
ధనలుబ్ధుఁడై నిర • తం బకృత్యము నాక యఖిలకార్యంబుల • నాచరించు
కులధర్మహీనుండు • గుణవిదూరుఁడు వృద్ధు నివసించుచుండు వి • నీతుఁడగుచు
నతని కేవురుసుతులు వా • గహరహంబు చదువుసంధ్యయు లేక నీ • చకులు లట్ల
కష్టజీవనులగుచు న • స్పష్టవృత్తిఁ దిరుగుచుందురు సతత మా • పురమునందు.

తే॥ వివిధవృత్తులఁ దాల్చి య • వ్విప్రసుతులు కాసువీసములప్పురి • గడనసేసి
వార్ధకంబునఁ గృశియించు • వారలైన తల్లిదండ్రులఁ బోషింత్రు • తగవువిడక.

క॥ నారలలోనఁ గనిష్ఠ కుమారుఁడు శాంతాహ్వయుండ • మాయకుఁడు సదా
చారరతుఁడు గిరిశపదాంభోరుహపూజాపరుండు • భూనుతుఁడరయన్.

తే॥ అరుణుఁడుదయించుటకు పూర్వ•మంద లేచి పరులదళికాంపకయ తాను•భక్తి వెలయ
"శివశివా" యని ధ్యానంబుఁ జేయుఁ గాని యితరవిషయంబులనుమది• నెంచఁ డెపుడు

క॥ తనయన్న లెల్ల దమతమ పనులకునై జనుచునుండఁ • బరమేశునిఁ గీ
ర్తనసేయుచు నాతఁ డచేతనముగ బలె నొక్కమూలఁ •దగనివసించున్.

మ॥ శ్రితలోకైక శరణ్యుఁడైన గిరిశున్ • సేవించుటే దక్క నా
కితరంబేమిటికీ శరీరమునకై • హేయంబులౌ కార్యముల్
సతతంబుం బొనరించి పిమ్మట విప • స్వత్పుత్రలోకంబునన్
వెతలన్ జెందుటయన్న నెట్టిఖలుఁడున్ • భీతిన్ వహింపండొకో.

క॥ అని యాతఁ డైహికసుఖంబును గహ్యంబుగాఁ దలంచి • పురహరాతముఖా
వనుఁడగుఁ ద్రిలోచనుని దన మనమున భజియించుచుండు • మానకయెప్డున్.

చ॥ దురితవినాశకంబులగు • ధూర్జటి సత్కథలెవ్వరేని యా
దరమునఁ జెప్పుచుండినన • తండమృతాశనమైనవీడి భ
క్తిరసము వెల్లి బారఁగ సు • ధీవరులబ్బురమొందునట్లుగన్
గరముల మోడ్చి నృత్యము నొనర్చువనన్యమనస్కుఁడై తగన్.

చ॥ అనయము శాంతుఁడవ్విధిన • నన్యమనస్కుఁడునై చరించుటన్
గని దలిదండ్రులిట్టి కొల • గానిపనుల్ బచరించుఁగాని యీ
తనయుఁడు జీవనార్థమయి • తానొకవృత్తివహింపఁ దక్కటా
ధనము గడించుటే పురుష • ధర్మముగా మది నెంచఁ డేలకో.

క॥ ధనహీనుండగు బురుషుం డనయము జీవచ్ఛవంబు • నట్లలఘుత్వం
బును జెందుననుచు దెలియుఁడు తనయుఁడపస్మారివోలె • దగద్రిమ్మరుచున్.

క॥ తనయన్న లెల్లరు శ్రమం బున ధనమాజించుచుండ • మోమోటములే
కనయంబివ్విధి కాలంబును వ్యర్థము సేయు నితఁడు • మూర్ఖుండగుచున్.

తే॥ ఎంత కాలమిట్లు • లీతఁ డెట్టిపనికి నేని సాయపడక • హీనుఁడైనఁ
దెచ్చిపెట్టఁగలము • దీనదశకులొంగి కూడుగుడ్డలేక • కుందుచుఁడి.

తే॥ అనుచుఁ దల్లిదండ్రు • లాశాంతుఁడూరక యుండుటకునైపలేక •యూరిపసులఁ
గాఁచునట్టిపనినిఁ • గల్పింపనాతఁడు సమ్మతించియట్లె • చనుచునుండె.

తే॥ పెందలకడతల్లి • పెట్టినంతవఱకుఁ గుడిచిపసులదోలు • కొనియరణ్య
సీమకేగి యొక్క • చెట్టునీడను గూరుచుండి హరునిదలఁచు • చుండునెపుడు.

తే॥ అటులఁ గొన్నిదినముల • రిగినపిమ్మట నొక్కనాఁడు శాంతుఁడుదయముననె
చలిదిమెసవకయె ప • సులఁదోలికొని యరణ్యమునకేగె పూర్వ • పుట్లలోను.

తే॥ అటులనరిగి శాంతుఁ • డచ్చోటమృత్తికా క్రాంతమగుచు నివురుఁగప్పినట్టి
యగ్నివోలె వెలుఁగు • నఘహరంబైన రుద్రాక్షనొకటిగాంచి • యాత్మలోన.

మ॥ ఇదిసంసార పయోధి తారకము గా • దీశాంఘ్రిసాన్నిధ్య సం
పదకుఁ హేతువు యోగిలోకనుతమా • పద్ఘోరసంతాప నీ
రదమిద్దీని ధరింతునా జనిపవి • త్రంబైతగన్ ముక్తికిన్
సదనంబీశ్వర భూషణంబెయనుచున్ • సాటించు వేదంబులున్.

క॥ అని యారుద్రాక్షన్ గై కొని కంఠమునన్ ధరించి • గోత్రామరనం
దనుఁడు తదారాధ • నయే యనిశముముఖ్యముగఁజేయు • నవసరమందున్.

చ॥ కలఁడొక భూమి నాథుఁడరి • గర్వవిభంజనుఁ డాత్తరక్షకుం
డలఘు యశోవిశాలుఁడు చ • రాచర భూతదయాపరుండు ని
ర్మలిన మనస్కుఁడుత్తమ ధు • రంధరుడున్నత వేదవేత్త కే
రళమను దేశపాలకుఁడు • రాజకులాభరణంబు ధారుణిన్.

క॥ అతఁడు ప్రతిసంవత్సర మాతతభక్తిమెయిఁ గాళి • కారాధనముం
బ్రీతిగ నొనరించుచుఁ దా నాతతి నరబలినొసంగు • నాకాళికకున్.

వ॥ అయ్యాచారంబునన్ జేసి కేరళేశ్వరుండు యథావిధి దేవీపూజఁ బ్రారంభించి బలికై మనుష్యుని గొనిరమ్మని భటుల నియోగించినవారలును నెల్లదేశంబులఁ దిరిగి యెందునను మనుష్యుండు లభింపమి నమ్మకరపురంబున కరుదెంచి కనఁబడిన వారి నెల్ల విచారించుచుఁ గాకతాళీయముగఁ గానవచ్చిన సుగుప్తునకుఁ దమవచ్చిన వృత్తాంతంబు నివేదించిన నాతండు నెమ్మనమున.

### —• శాంతుండు కాళికాబలికై విక్రయింప బడుట •—

మ॥ ధనలోపంబునఁజేసి యివ్విధిని చిం • తావ్యగ్రతన్ గానవ
చ్చిన లుబ్ధావళికెల్ల లోనయివెసన్ • జేజాచి యాచించు కం
టెను దేహంబును విక్రయించి యయినన్ • దీనత్వమున్ బాసి యొ
క్కనికీయంగలశక్తిఁ గాంచుటది లో • కశ్రేష్ఠమా గాదొకో.

క॥ కొఱగాక తల్లిదండ్రులు గఱపిన యద్దాని నేర్వ • కయె నిత్యంబే
డ్తైఱఁదిని తిరిగెడు కొమరుని తఱిఁగని త్యజించుటొప్పు • ధరనందఱికిన్.

తే॥ పుట్టి తరుణితోడి • పొందెడలించును పెరిగిధనము నెల్ల • వెచ్చబెట్టు
చచ్చిప్రాణములకు • సంతాపముంగూర్చు కొడుకువంటి శాత్ర • వుఁడుకలుగునే.

చ॥ తనకులధర్మముల్ విడక • ధార్మికలోకముతోడి పొత్తునన్
గనవగు నెల్లకార్యములఁ • గన్గొని పండితగోష్ఠిఁ గీర్తికాం
తను గయిసేయనేర్చు తలి • దండ్రుల చిత్తము వట్టి సంచరిం
పని కొమరుండు వంశమును • పాడొనరించును గాక పెంచునే.

తే॥ అరయఁగ నజాతమృత మూర్ఖు • లైనయట్టి ముగురుపుత్రులలోపల • మూర్ఖుఁడైన
కొడుకు కతమున జనకుని • గుణగణంబు చెడు నదియుఁగాక జనియెల్ల • చింతనొందు.

క॥ మంచిచెడుగులన్ దెలియక వంచించుతలంపు గల్గు • వారిఁ గనక గ
ర్వించి చరించు ఖలుండు ప్రపంచమున జనించుకన్నఁ • బాపముగలదే.

చ॥ తనువు నశింపఁజేయఁగల • దారుణమైన విస్రవణఁబు చెం
దిన తలమెల్లఁగోసి పరి • తృప్తిగఁ దక్కుగలట్టి దేహమున్
గొనకొని బాగుసేసికొను • కోవిదుఁడుంబలె నెల్లవారికిన్
మనసుఁ దపింపఁజేసెడి కు • మారుఁ ద్యజించుట యుక్తమెల్లెడన్.

క॥ అలసుండు జ్ఞానహీనుఁడు కలుషాత్ముఁడు శాంతుఁడితని • గాళికి బలికై
వెలకమ్మి తద్ధనంబునఁ గలకాలము సౌఖ్యవితతి • గాంతుఁ గడంకన్.

తే॥ అనుచుఁదలఁచి విప్రుఁ డవ్వార్త కులకాంత కెఱుఁగఁదెలిపినంత • యింతియకట
యెఱిఁగియెఱిఁగి యిట్టు • లేరీతి సుతుజంప బంపఁగలవొ పాప • భయములేక.

చ॥ ధనము గడింపలేఁడు తలి • దండ్రులకున్ వెతగూర్చుచుండు నే
పనియును నేరకుండు • పరివారలలో నయశంబుఁజెందు నీ
తనయుఁడు వ్యర్థుఁడౌననుచుఁ • దద్దయు సంతమెకంబునట్లుగా
పనివడి విక్రయింతురె కృ • పన్ విడి యెంతటిదుష్టులేనియున్.

తే॥ ప్రబల దారిద్ర్యబాధ కో • ర్వంగలేక నిండుప్రాణంబులనుడీయు • చుండు కటిక
వానిరీతిని దయలేక • పట్టినిటుల ధనమునకు విక్రయించుటఁ • దగునెయకట.

తే॥ మన సుఖంబుగోరి • కనిపెంచి పెద్దఁజేసిన కుమారునిటులఁ • జిత్రవధకుఁ
బంపి యెట్టిఘనతఁ • బడయంగనేర్తుము శాంతుఁ డెట్టితప్పు • సలిపె మనకు.

తే॥ ఆశ్వరంబునైన ◆ యథార్థాగమముఁగోరి కన్నకొడుకు నిట్టి ◆ కటికవాని
పాలుజేయ నే ◆ మి ఫలమగు వసుమతి బ్రతుకు నిత్యమైన ◆ వలెను సుఖము.

చ॥ అనుచు నిజప్రయత్నమున ◆ కడ్డము సేసెడి కాంత నెవ్విధం
బున మరలింతునో యనుచు ◆ భూమిసురుండు మదిన్ దలంచి యి
ట్లనియె సరోజనేత్ర విన ◆ వా "ధనమూలమిదంజగత్త"టం
చనియెడు వాక్య మెట్టిఘను ◆ డైన దరిద్రుఁడు కీర్తిగాంచునే.

చ॥ ధనముకలాఁడె పండితుఁడు ◆ ధార్మికశేఖరుఁడున్నతుండు స
జ్జనుఁడు పరోపకారి వసు ◆ ధావరుఁడున్ యువతీప్రియుండు గా
వునపురుషుండు నిత్యమును ◆ పూనికతోడ నెదోవిధంబునన్
ధనముగడింపఁగావలయు ◆ నైజము దీనికి సాటిలేదిలన్.

తే॥ వారివారి మనసు ◆ వర్తించునట్టుల ననుదినంబు బరుల ◆ ననుసరించి
నడచుచుండవలయుఁ ◆ బడఁతి ధనములేని కష్టజీవియైన ◆ కలుషమతికి.

క॥ మనుజునకుఁ బ్రధానంబగు ధనమే లేకుండునేని ◆ తను వేమిటికా
తని జీవనంబు వృథయై చనునుగదా లోభివాని ◆ సంపదవోలెన్.

క॥ కావున నా వచనము సంభావింపుము వేరునాక ◆ పడఁతీ సుదినం
బీవేళ మనకు దైవము కావింపఁగ నున్నవాఁడు ఘనసంపదలన్.

క॥ ఈ సమయము వృథయైనన్ గాసయిన లభించు తెరువు ◆ గలుగదు పేర్మిన్
బాసి సుతు విక్రయించినచో సుఖముల నొందవచ్చు ◆ సుదతీ యింకన్.

వ॥ అని యనేక విధంబుల కులకాంతను సమ్మతింపఁజేసి సుగుప్తుండా కేరళవాసులవలన కొంతధనంబు గ్రహించి పుత్రవాత్సల్యంబులేక కన్నకొడుకును కాళికాబలికినై యొసంగె. వారలును శాంతునిగొని కతిపయ ప్రయాణంబుల నిజదేశంబుఁజేరి యమ్య భర్తకుని రాజున కొప్పగించిరంత.

క॥ జనపతి యా ద్విజనందను గనుగొని తలపోయూచి యుచిత ◆ కాలంబున కీ
తని తెమ్మని మంత్రుల కాజ్ఞనొసఁగి పూజించుచుండె ◆ గాళిని భక్తిన్.

తే॥ అంతటఁ బురోహితుండమా ◆ త్యప్రకరము నను మతిని విప్రసుతునక ◆ భ్యంగనాది
కృత్యముల నిర్వర్తించి య ◆ కృత్యమనక కాళికాలయమును జేర్చి ◆ కలుషబుద్ధి.

తే॥ జగముతల్లియైన ◆ శర్వాణిఁబూజించి శైవకులవతంసుఁ ◆ శాంతునప్పు
డర్పణంబుఁజేసి ◆ ద్వారంబులను మూసి యాలయంబు వెలికి ◆ నరిగి నిలిచె.

వ॥ అప్పుడు.

సీ॥ ప్రళయకాలాంబుద • ప్రభనొప్పు నెమ్మేను నాకసంబంటెడు • నంతఁ బెంచి
దావాగ్నికీలలఁ • దగఁగురిసెడు లోచనములఁ గ్రోధారుణి • తములఁ జేసి
గర్వితాసురనాశ • కములగు బాహుల నాశాముఖంబుల • యందుఁ జాచి
భూధరవ్రాతంబుఁ • బోఁగొట్టఁగాఁ జాలు నిశ్వాసపవనంబు • నెగడఁ జేసి

యెల్లభువనంబులుఁ దల్ల • డిల్లునట్టుల సింహగంభీర నాదంబు • జేసియట్టె
యట్టహాసంబుతోడ శాం • తాఖ్యుమీఁద నురికి యాతని దాకఁగ • వెరఁగుఁ జెంది.

క॥ నెమ్మేను చెమ్మగిల్లఁ గరమ్ములఁ జోడించి సకల • రాజమకుట ర
త్నమ్ముల నలరెడు పదపద్మమ్ములుగల జగముతల్లి • తగ నిట్లనియెన్.

మ॥ అనఘా నాయెడఁ గిన్కఁ జెందకుము రు • ద్రాక్షాంకితాంగుండ వీ
వనిసుంతేని యెఱుంగ నేరకిటు ల • న్యాయంబుగా నిన్నుఁ బై
కొని భక్షింపఁ దలంచితిన్ శివశివా • గోత్రాధరశ్రేష్ఠ భ
క్తనికాయంబును, శంభుఁడొక్కటియగా • దాతత్వమూహింపరన్.

క॥ నినుశివభక్తుని బలిగాఁ గొనితెచ్చెపురోహితుండు • కుటిలుండై యా
తని నప్పుడ వధియించితి ననఘా శివుఁడాగ్రహించు • ననుభీతి మెయిన్.

వ॥ నీవు మహానుభావుండవు సత్యశమదమాది సద్గుణగరిష్ఠుండవు. నీకపకారంబొనర్పఁ దలంచుట నాదోషంబ యగును. ఈశ్వరభక్తుండవగు నీప్రభావం బెఱుంగక నిన్ను బలికై పంపిన భూనాథుఁడు తనరాజ్యమెల్ల నీకిడి తనకూఁతు నొసఁగి నిన్ను గృహస్థుగా నొనరింపఁడేని వానికిని బురోహితునకుఁ గలిగిన దుర్గతియ గలుఁగ గలదు. నీకు వలసిన వరంబెట్టిదైన నొసంగుట నాకు ధర్మంబు సత్వరంబు కోరుమనిన నాదేవికి వినతుఁడై శాంతుఁడిట్లనియె.

తే॥ వరమొసంగఁ దలఁతు • వా నేఁడు మొదలుగ నరబలినిదొలఁగి • కరుణతోడ
భూతిసంచయంబుఁ • బ్రోవుమిదియచాలు ప్రజలసుఖముఁ గోర • వలయుఁ గాదె.

సీ॥ అనుటయు జగదంబ • యట్లకాయనిపల్కి జననాయకుని స్వప్న • మున వచించు
మూర్ఖుండవై నీవు • పురహరభక్తుఁడౌ శాంతునినాకు భ • క్షణముకొఱకు
నియమంబుఁ జేసితి • నీపురోహితుఁడు భస్మంబయ్యెగౌరవ • సరణిశాంతుఁ
గొనివచ్చి పేర్మిమై • కూఁతు నొసఁగి వివాహంబొనరించి రా • జ్యమునకెల్ల

నతని నధిపుఁజేసి • యాతని యాజ్ఞ నౌదలను దాల్చి తిరుగు • మెలమితోడ
నట్లుకాదయేని • యంతంబొనర్తు నీ యన్వయంబునెల్ల • నవనినాథ.

క॥ అనుచు నదృశ్యం బైనన్ గనులఁదెరచి యెదుట నెవరిఁ • గానక యిది యే
మనుచు భయమున నమాత్యుల ఘనమతులన్ బిలిచి తెలిపె • క్ష్మాపతి యంతన్.

చ॥ అనిన నమాత్యులెల్లరు య • థార్థమె యియ్యది మోహబుద్ధి శాం
తున కపకారమున్ సలుపు • దోషముఁ జేసి పురోధసుండు జీ
వనము దొలంగె దేవియును • బ్రజ్వలితాననయయ్యెఁ గాన నో
జనవర శంభుతుల్యుఁడగు • శాంతుని దెచ్చి భజింపుమా యిఁకన్.

సీ॥ నరనాయకుఁడు మంత్రి • వరులవాక్యంబుల విశ్వాసమున శాంతు • విమలచిత్తుఁ
గొనివచ్చి శుభలగ్న • మునఁ దనయునొసంగి పరిణ మొనరించి • బహుళవిభవ
సంయుతుఁ గాఁజేసి • సర్వరాజ్యము నాతనికొసంగుటయు వాఁడు • నిష్ఠతోడ
ధరణిరాజ్యంబెల్లఁ • దగ నేలుకొనుచు నందఱును రుద్రాక్షలఁ • దాల్చునటుల
సలిపి శైవజనుల • సతతంబుఁ బ్రోఁచుచునుండె నితఁడు శంక • రుండెయనుచు
ముక్తులెల్లఁజేర • ముదమున సేవింప శాంతుఁడఖిలగుణ ని • శాంతుఁడగుచు.

వ॥ మూఢభక్తిమెయి నొక్క రుద్రాక్షదాల్చినంతన నంతటి మహాత్మ్యుండయ్యెనన నింక యథాశ్రుతంబుగ దేశికోప దేశపూర్వంబుగ సర్వాంగంబులయందును రుద్రాక్షల ధరియించువాని పుణ్యం బగణ్యంబుగదా. కావున నీ కోరినట్ల రుద్రాక్షధారణం బొనరింతునని పల్కి సుప్రతీపుండు యతికిని భూపతికిని మంత్రపూర్వంబుగ రుద్రాక్షధారణంబును గావించినవారును తన్మహిమంబున శివసాయుజ్యంబునొందిరి. కావున పూర్వజన్మకృత దుష్కృతంబున నిట్లైన నీవు ముక్తుండవగుదువని పలికిన దౌంధుమాకుండాంగిరసున్ గాంచి యిట్లనియె.

తే॥ అనఘ నీ కృపవలనఁ బా • పౌఘహరములైన పంచాక్షరియును రుద్రాక్షమహిమ
యును దెలిసి ధన్యుఁడనయితి • నుత్తమమగు భస్మమహిమయు నింకఁ జె • ప్పంగదయ్య.

— • ఆంగిరసుండు దౌంధుమాకునకు విభూతిమహిమఁ జెప్పుట • —

క॥ అనిన విని దౌంధుమాకునిఁ గనుగొని యాంగిరసుఁడనియెఁ • గనికరమునన్
జనిధన్యమగు కతన నీ యనఘంబగు భస్మమహిమ • మడిగితి వర్థిన్.

తే॥ సకలకలుషహారము • శంకరప్రీతికరంబు భస్మమహిమ • డంబునీఱి
నిట్టిదనుచుఁ బలుక • నేరికి శక్యమౌ నీశ్వరునకుఁదక్క • నిజ్జగమున.

వ॥ అయినను నాయెఱింగినంత వచియింతు నాలకింపుము.

సీ॥ అరుణోదయంబున • కన్న ముందుగ లేచి హరుఁదలఁచుచు గోమ• యంబు బ్రహ్మ
పత్రంబున గ్రహించి • భక్తిఁ ద్ర్యంబక మంత్రమున నెండఁబెట్టి సం• పూర్ణముగను
శోషించినంతన • సొరిది స్వగృహోక్తవిధి వహ్ని బూదిగా • వించి దాని
హేమరాజత తామ్ర • మృణ్మయపత్రంబు లందొక్కపాత్రంబు • నందు రుద్ర

మంత్రములతోడ నునిచి ని • ర్మల మనీష వేదపాఠంబుఁ జేయుచు • విప్రవరుల
భోజనాది సత్క్రియలఁ దృ • ప్తులుగఁజేసి దాని ధరియింపఁదగును వి•ద్వాంసులకిల.

క॥ సర్వాంగభస్మధారణ ముర్వినిఁ గావించు భక్తుఁ • డొందు సుకృతముఁ
శర్వునకు నిష్టుఁడగును సుపర్వులలో నొక్కరుఁడయి • ప్రఖ్యాతిఁగనుఁ.

వ॥ లలాటకంఠోభయ పార్శ్వకపోలద్వయ నేత్రశ్రోత్ర వక్త్రనాభి బాహుమూల మణిబంధ కర పృష్ఠ భ్రూమధ్యహృదయాది సర్వశరీర భాగంబుల నాయాయి మంత్రధ్యానపూర్వంబుగఁ భస్మధారణముఁ గావింపఁదగు.

తే॥ తక్కఁగలపుట్టి బ్రాహ్మణ • ధర్మములను సలిపినను సల్పకుండిన • జగతిబ్రాహ్మ
ణులకుఁ బంచాక్షరియు భస్మ • యును శివార్చయును విహితధర్మములగుచుఁ •
[ దనరు ధరణి.

తే॥ ద్వాదశాత్మఁగాంచి • తమము బాఱినరీతి భస్మధారిరైన • వానిఁగాంచి
సకలపాతకములు • సమసిపోవును ముక్తి కాంతవశ్యయై సు • ఖంబుఁగూర్చు.

తే॥ భస్మపూతాంబు పానంబు • వలన నెట్టి యామయములైన నశియించు•నగ్రజుండు
శాంతుఁడనువాఁడు తొల్లి కు • ష్ఠంబు దొలగె భూతికలితాంబువులఁ ద్రావి •
పూతుఁడగుచు.

వ॥ నీ కాపవిత్రంబగు చరిత్రంబు వక్కాణింతు వినుము. తొల్లి విదిశాపురంబున.

మ॥ బలగర్వాంధుఁడు సాక్షరుండు కుటిల • వ్యాపార లోలుండు చం
చల చిత్తుండు వినిందితాఖిలమనీ • షావంతుఁ డర్థార్జనా
కలితుండావిలవర్గసుండు విజహాత్ • క్ష్మాదేవతాచారుఁ డు
జ్జ్వల తేజుండగు సోమశర్ముఁడను హింసాకర్ముఁ డొక్కండిలన్.

తే॥ బ్రాహ్మణోచితధర్మముల్ • పాడుజేసి కలుషమార్గ సంచారుఁడై • కాసు వీస
ముల గడించుటె తనకు ధ•ర్మువుగఁ దలఁచి కంటకుండయియుండు నా•క్ష్మాసురుండు.

తే॥ తనకు దోఁచినదియె • తగవంచు వాదించుఁగాని యొకరిమాట • గారవమున
వినదలంపఁ డెప్పు • డనుచితకర్మముల్ సేయుచుండు నతఁడు • చెనటియగుచు.

తే॥ ప్రొద్దుగలనె లేచి • మొగముఁ గడుగకయె చలిదిఁగుడిచి యొక్క • చంకలోన
దూడపలుపుఁబూని • దున్నల గేదెలఁ దోలుకొనుచు బొలము • దున్నఁబోవు.

తే॥ దేవతార్చన వలవఁ డ • తిథిప్రకరముఁజేరి గారవింపఁడు కులాచారములను
వెలితిసేయుచు నుండునే • వెరవుకతననైన ద్రవ్యంబు నార్జింప • నరయుచుండు.

వ॥ అతనికి ముప్పురుపుత్రికలుంగల రందు సత్యవతియనునది యవివాహితయై శమదమో
పేతయై నిచ్చలు నందఱకన్న నెక్కుడు శాంతంబున గృహకృత్యంబులఁ గావించు
చుండునది.

క॥ లోకానుభవములేకయు నా కన్నియ సాటివారి • కన్న వలఁతియై
ప్రాకటకౌశలమున బుధలోకము మెప్పువడు ధర్మ • లుబ్ధయగు చిలకన్.

తే॥ ప్రాజ్ఞ జననుతయా సత్య • వతి యనయము జనకుఁడాకదుపులఁదోలు • కొనిపాలఁబుఁ
జనినపిమ్మట నతిథి • సంచయముఁజేరి యలరఁగాఁజేయు నిష్టమృ • ష్టాన్నములిడి.

తే॥ అటుల సన్మార్గవర్తిని • యై తిరుగుచు నిరుగుపొరుగు జనంబుల కెల్ల నెల్ల
యగుచుఁ దలలోని నాలుక • యట్లు మెలఁగుచుండెనా బాలనుతశీల • యుచితగతిని.

వ॥ అట్లుండి యొక్కనాఁడు మధ్యందిన దినకరకరనికరంబుయు గవిగమకాల సంజనిత
మహోగ్రవీతి హోద్రజ్వాలలు నా లోకంబునకు సంతాపఁబుఁగూర్చు సమయంబున
స్నానంబుఁగావించి పానీయంబు గొనితేర నూరివెలుపలనున్న నూతికరిగిన నచ్చట.

క॥ బలహీనుఁడు బీదనరాల్గలయాతఁడు నెరసినట్టి • కనురెప్పలు మీ
సలు గడ్డంబును గలవాఁ డలసిన వృద్ధుండు గాన • నయ్యె నతివసున్.

తే॥ వెట్టగొట్టి యొక్క • చట్టుపైఁబడి పిపాసార్తి • నోర్వలేక • యట్టె నోరు
తెఱచి యింతజలముఁ • దెచ్చిపోయుఁడటంచు నఱచుచుండె వృద్ధుఁ • డలమటమున.

వ॥ అట్టియెడ.

చ॥ కడవల నీరుదోడుకొని • కాళులఁ జేతులఁ బాఱవోయుచున్
బుడకలు సేయుచున్ మడుఁగుఁ • బూనితి మంటకుఁడంచుఁ బల్కుచున్
బడఁతులు శుష్కవాక్యములఁ • బల్కుచునుండిరి కాని యట్లు వృ
ద్ధుఁడుదగఁగొంట నొక్కరును • దోడనచూడఁ దలంపరైరదన్.

తే॥ వాని పడునవస్థ • వాపఁబూన రాకింత జలమొసంగి సతులు • కలుషమతులు
మడుఁగుఁదాల్చి యెట్లు • మలినాంగుసన్నిధిఁ జేరవచ్చునని వ • చింత్రుగాని.

తే॥ దాహపీడితుఁడైన యా • తనికి సుంత నీరొసంగిన పాపమా • నే యటంచుఁ
బలుకుదురె కాని యొకరేని • పడఁతులందు దయఁ దలంపరు వృద్ధుని • దగఁ దొలంగ.

క॥ స్తుత్యచరిత్రయయిన యా సత్యవతి మాదుసలిఁగాంచి • జాలిఁగొని కటా
యత్యర్కతాపమున నితఁ డత్యయమును జెంది కుందు • నంబువులకునై.

తే॥ దిక్కులేనివాఁడు • దీనుఁడు వృద్ధుఁడు దాహపీడచేతఁ • దనువుఁ దొఱఁగ
నున్నవాఁడు వీని • కిన్ని నీళ్ళొసఁగమి కలుషకారణంబు • గాదె నాకు.

చ॥ దినకర భానుతప్తుఁడయి • దీనతఁ గ్రుక్కెడు నీరొసంగి యీ
తనువును నిల్పరే యనుచుఁ • దద్దయు వందురుచున్న వృద్ధునిన్
గనుఁగొని చూరకుండు కొలఁ • గాము లిఁకేసుకృతంబొనర్చినన్
దనువు పవిత్రమౌనొ యమ • దండన యెవ్విధిఁ గల్గకుండునో.

క॥ కలుషాకరమగు దేహంబిల శిలవలెఁ జిరము నిలుచు • నే భూతదయా
కలితంబు గాని పుట్టువు వలనఁ బుడమి వ్రేఁగె గాక • ఫలము గలుగునే.

తే॥ ఆర్తులైనవార • నాదరింపక యున్న వ్రతములేల జపత • పంబులేల?
మడుఁగుఁగట్టినంత మాలిన్యమడుగునే కాకి మునుఁగకున్నె గంగలోన.

వ॥ అని తలంచుచు నా వృద్ధుని డాయఁజని సత్యవతి మెల్లన నాతని కరంబుఁబట్టి యెత్తి యాప్యాయనంబుగఁ జల్లని పానీయంబొసఁగినవాఁడును బోనున్న ప్రాణంబులఁ గూడఁబెట్టుకొని సంతుష్టుండై యిట్లనియె.

తే॥ బాలసుగుణాలవాలవై • ప్రాజ్ఞలోకవినుతి పాత్రంబవైతివి • వెట్టదగిలి
ప్రాణములవీడనున్న నా • పై కృపార్ద్రచిత్తమున నీరువోయుటఁ • జేసి యిపుడు.

క॥ నీ సలిపిన యుపకారంబేసరణిన్ దీర్చుకొందు • నింతీ యిదె కై
సేసి సమస్తసుఖంబుల వాసికిన్ గను భస్మగొను మ • వారితభక్తిన్.

వ॥ అని తన సంచిలోని విభూతి నొసఁగిన సత్యవతియు మహాప్రసాదంబని గ్రహించి నిజాలయంబున కరిగి గృహకృత్యంబుల యథాపూర్వంబుగఁ దీర్చుచు నిరంతర భూతి భూషితగాత్రయై యుండె నంత నొక్కనాఁడు సోమశర్ముఁడు సత్యవతిన్ గాంచి యిట్లనియె.

మ॥ మనవంశంబున నెన్నఁడుం గనము భ • స్మంబన్న పేరింతయై
నను బాలా యిదియేటిగోల తగవా • నా కన్నియల్ క్రమకాం
చనవల్లీ సమకోమలాంగికములన్ • సన్యాసులన్ బోలె భూ
తినిఁ బూయంగఁ గడంగుటల్ తలఁపవే • స్త్రీధర్మ మింతేనియున్.

తే॥ గోముగాఱు చిన్నిమోమునఁ జేర్చుక్క దిద్దుటొప్పుఁగాని • తెలుప యిటుల
జోగిపేండ్లువోలె • సొబగు మాన్చెడు వెలిబూది పూఁతతగునె • పొలఁతులకిల.

తే॥ జిలుఁగుపావడయును • లలితాభరణములుఁ దాల్చి లేని చక్కఁ • దనముఁ దెచ్చు
కొనఁగవలయుఁగాని • కోమలి సొబగును జెఱుచు బూది తగునె • చిఱుతలకును.

తే॥ వృద్ధుఁడు విరాగియైనవాఁ • డెవఁడొ యొకఁడు సర్వశూన్యంబు చెప్పెనని • చుప్పొసకల
సుఖములకుఁ గారణంబైన • సోయగంబుఁ బాడుసేయుదురే లేత • వయసువారు.

చ॥ వలవదు పాఱవేయుమిఁక • భస్మము నీ సరివారు గాంచినన్
బలువురిలోన నీకు నగు • బాటగుఁ జిన్నతనంబునందె యో
గులక్రియ బ్రాహ్మణాగ్రసరు • కూఁతురు లోకము పాడిదప్పి వెం
గలియయి బూదిఁదాల్చుననఁ • గావిని యెట్లు సహింతు నీపయిన్.

చ॥ అని వచియించినన్ శివశి • వా యిది యెక్కడిమాట సాధువ
ర్తనులకు బూది పూఁతయె గ • దా యవతంసము పాపబుద్ధులై
తనువిల శాశ్వతంబనుచు • దద్దయు మాయఁ దరింపలేని దు
ర్జనులగతిన్ భవాదృశుల • సద్వననంబులఁ బల్కఁ దొప్పునే.

తే॥ ఎన్నిసొమ్ములైన • నీ భస్మధారణంబునకు సాటియగునె • తనువుతోడి
నాశమొందుఁగాదె • నగలెల్ల నిమ్మహి నెఱుఁగలేవె ధర్మ • నిపుణమతివి.

తే॥ చేత బంగరుకొండ • దాల్చిన దనీఁడు పురహరుండంతవాఁడె • యెప్పుడును భస్మ
ధారణముఁ జేయుచుండు నాఁ • తనికి లేని పొలుపుగలుగునె కాంచన • భూషణముల.

ఉ॥ భూతిఁ ద్యజించుమంచు నను • బూనిక వచించెదు వెఱ్ఱివాఁడవే
ఖ్యాతచరిత్రులైన వన • జాసన ముఖ్య నిలింపు లెల్లరున్
బూతి ధరించి కాదె పరి • పూతశరీరులునై సమస్తలో
కాతిశయాళు తేజులయి • యందఱచే నుతిగాంచు టెంతయున్.

తే॥ మనుజుఁడైనవాఁడు • మహితభక్తి విభూతిఁదాల్చుటొప్పునందు • ధరణిసురున
కిదియ ముఖ్యధర్మ • మెవని లలాటంబు భస్మరహిత మతఁడు • పాతకుండు.

గీ॥ భస్మమునఁజేసి యెల్ల సం ♦ పదలు గలుగు భస్మమున జనియించుఁ బ్ర♦పంచమెల్ల
సర్వ దేవతారూపమై ♦ జగతి భస్మమలరుకతన దాని ధరింతు ♦ రనఘమతులు.

తే॥ 'భస్మధార్య'మనుచుఁ ♦ బలుకు నాగమముల విడిచిపుచ్చి యిట్లు ♦ విప్రుఁడవయి
తగవటంచుఁ జెప్పఁ ♦ దలఁచితి వేమనిపలుక నేర్తునయ్య ♦ ప్రతివచనము.

తే॥ అనిపలుకు కూఁతు వచనంబు లాలకించి సోమశర్ముండు క్రుద్ధుఁడై ♦ సుతఁగనుగొని
చెడుగ! నిష్కారణంబుగఁ ♦ జెడఁదలంతె "భస్మధార్యం" బటంచును ♦ బలుకుచిటుల.

చ॥ వలవదు నీకు భస్మమని ♦ వారణసేయుచునున్నఁగాని నా
పలు కఱనేసి యివ్విధి వి ♦ వాదమొనర్చెదు దుస్స్వభావతన్
జెలులకు భూతిధార్యమని ♦ చెప్పనె యేశ్రుతియైనఁగాని వెం
గలియయి యెవ్వఁడో పలుకఁ ♦ గా నదె నిక్కమటంచు నెంచుచున్.

తే॥ తల్లిదండ్రులయాజ్ఞయా ♦ దలధరింప కాత్మస్వాతంత్ర్యమూని ♦ స♦న్యాసులట్ల
భూతిరుద్రాక్షలన్ దాల్చి♦పొంగెదీవు నిన్నెవఁడు పరిణయమగుఁ ♦ గన్నెచెపుమ.

వ॥ నీ శీలంబుఁగాంచిన నన్నివిధంబులఁ దగినవరుం డెవ్వఁడును లభింపఁ డట్లుగాన సులభలభ్యుండగు నొక వృద్ధుఁ బెండ్లియగుమని పలికి వికృతాంగుండును వికలావయవుండును కుష్ఠరోగియు నగు నొక ముదుసలిఁగొనివచ్చి సత్యవతికి వివాహం బొనరించిన నాకన్నియు స్థిరచిత్తయై చింతింపక భస్మమహిమంబున నిజనాథు మనోహరాకారుఁజేయఁగలనని ధైర్యంబవలంబించి పంచాక్షరీమంత్ర పూతంబును భస్మకలితంబును నగు పుడిసెడునీరు శాంతాఖ్యుఁడగు మగనికిచ్చిన నాతండును వలదనక దానిన్ గైకొనె నంత.

తే॥ చూడఁగదగినవాఁడు ♦ సోయగంబుగలాఁడు పసిఁడివన్నె మేని ♦ వాఁడు పడుచ
వాఁడగుచు నతండు ♦ వైభవోపేతుఁడై యలరెఁజూచువార ♦ లబ్రమొంద.

చ॥ కని యది సోమశర్ముఁడెదఁ ♦ గంపముఁజెందుచు భూతి సోఁకినం
తనె వికృతాంగుఁ డీతఁడు ము ♦ దంబునుగూర్చెడి రూపవంతుఁడై
మనసిజుఁబోలి యొప్పె నహో ♦ మానమువీడఁగలేక యాత్మనం
దన యెడఁ గిన్కఁజెందితిని ♦ నాపయి పుత్రిక యాగ్రహించునో.

వ॥ అని తలంచుచు సత్యవతి చరణంబులపైఁబడి తల్లీ నాయపరాధంబు సైఁచి రక్షింపుము. నాకు భస్మధారణంబుఁ గావించి నాజని పవిత్రంబుగఁ జేయుమని ప్రార్థించిన నా పూతగాత్రయుఁ దండ్రికినిఁ దక్కుఁగల బంధుజనంబులకును భస్మప్రభా

వంబుఁ జెప్పి భస్మంబిడియెనని పలికి మోక్షసాధనంబగు లింగధారణంబును బంచాక్షరీ మహామంత్రంబును రుద్రాక్షధారణంబును గావించి యాంగిరసుండు యథేచ్ఛగా జనియె నంత దౌంధుమూకుండును పార్వతీమనోనాథుఁ గీర్తించుచుఁ గాలక్షేపంబుఁ గావించి దేహాంతంబున శివసాయుజ్యంబు నొందెనని సూతుండు శౌనకాదులకుఁ జెప్పుటయు.

మ॥ శ్రితలోకైక వరప్రదానచణ • యుర్వీధృత్కుమారీ సమా
హృతదేహా పరిరక్షితాఖిలజగ • చ్ఛ్రేణీ మదీయావన
వ్రత సర్వోన్నత పాండ్యభూధవమనః • పంకేజ మార్తాండ గ
ర్విత దైత్యాన్వయ నాశ మత్కృతి పతి • శ్రీ సుందరేశ ప్రభూ

క॥ సకలచరాచరలోకప్రకరా పూర్ణోదరా వి • భాకర శశిపా
వకలోచన పురశాసన యకుటిలముని లోకశరణ • యంధకదమనా.

మాలినీవృత్తము॥ సురనుత పదపద్మా • సూరిహృద్దివ్యసద్మా
పురదనుజ వినాశా • భోగిరాట్తుంగభూషా
ధరణిధరనివాసా • తారకారాతిపోషా
సరసిజ శరభంగా • సాధుహృత్పద్మభృంగా

తే॥ కష్టపడి పెంచి యిడితి నా • కవితకన్నె నెవ్విధంబున నలరింతొ • యింకనీవు
గంగవోలెను గయ్యాళి • గాదు బేలసుమ్మ నీ తలనెక్కి నా • ట్యమ్ము సేయ.

సీ॥ ఏ మహామహుఁడు శ్రీ • వేమనారాధ్య వంశాబ్ధికిఁ బూర్ణ శ • శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రికెనయై సతుల్ మెచ్చ మహిని పాతివ్రత్య • మహిమఁ గాంచె
నట్టి నందయకు గౌ • రమకు ద్వితీయపుత్రుండఁ గౌండిన్య గో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోదరుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ

నార్యునకుఁ బౌత్రుఁడను మదీ•యమగు శ్రీమదాంధ్ర లింగపురాణోత్తరార్థమందు
బ్రవిమలంబగు సప్తమా • శ్వాసమయ్యె సతము దీనిని రక్షించుఁ • జంద్రమౌళి.

శ్రీమీనాక్ష్యై నమః.

# శ్రీమదాంధ్రలింగపురాణము

## ఉత్తరభాగము

### అష్టమాశ్వాసము

క॥ పాశుపతవ్రతరూపా! శ్రీశాదినిలింప లోక • సేవితచరణా!
కాశనిభాంగా! మీనాక్షీశా! శ్రీసోమసుంద • రేశసురేశ.

వ॥ అవధరింపు మమ్మహర్షిగణంబునకుఁ బౌరాణికశ్రేష్ఠుండగు సూతుండిట్లనియె.

తే॥ శిష్యవత్సలుండ • శేషపురాణ పారగుఁడు వ్యాసమౌని • రాజుకరుణ
నెఱుఁగఁజేసినట్టి • యెల్లపుణ్యకథలఁ దెలిసినంతవఱకుఁ • దెలపితిఁగద.

చ॥ కలుషవిదారుఁడైన శివి • కంతుని పుణ్యచరిత్రలెన్ని వం
దల యుగముల్ వచించినను • నాలుకకుఁ రుచితగ్గకుండు శ్రో
తలహృదయంబులన్ దవిలి • తద్దయు రుచ్యములై చెలంగు ని
మఁలములు ముక్తిమార్గములు • మానిజనాశ్రయముల్లలంపఁగన్.

—• పాశుపత వ్రతమాహాత్మ్యము •—

తే॥ ఎన్నిపుణ్యచరిత • లేనిపాశుపతవ్రత ప్రభావమునకు • ధరణిలోన
సాటిరాఁగలుగునె • చంద్రార్ధ ధరుఁడావ్రతంబున కధిదైవ • తంబగుటను.

క॥ వ్రతములలో నుత్తమమగు వ్రతమది పాశుపతమనఁగ • వఱలుధరిత్రిన్
గ్రతుభుక్సంతతి యావ్రత మతిభక్తి నొనర్చి ధన్యు • లైరి కడంకన్.

మ॥ అతిలోకుండగు శారదాపతియు ని ర్వ్యాజంబునౌభక్తిఁ ద
ద్వ్రతమున్దాల్చి మహానుభావుఁడగుచున్ • వందారుభక్తాళికిన్
సతతాభీష్టపదంబు లీయఁగలిగెన్ • సత్యస్వరూపాధ్యుఁడ
చ్యుతుఁడున్ దద్వ్రతమాచరించి సుగుణ • స్తోముండునై యొప్పెడున్.

తే॥ పతితుఁడగుదొంగ యమానుఁడైన • పరమపావనంబగు వ్రతంబుఁ బూని మోహంబుఁ బాసి
యనవరత చిత్సుఖాస్థితం • ద్రార్థక మాళి సన్నిధి వసించి సుఖియించు • సంతతంబు.

చ॥ అమల యశోభిరాముఁడగు • నాతఁడు బ్రహ్మసుతుఁడు రుద్రశా
పము మెయి సంభవించిన • కువారితమైతగు నుష్ట్రదేహముఁ
గమలజు సత్కృపన్ విడిచి • కాంచనశైలముఁ జేరవచ్చియు
త్తమగుణ శోభితుండగు సనందనునిం గాంచి నమ్రుఁడై.

మ॥ అనఘా నీవు మహానుభావుఁడవు నీ • యంద్రిజా నాయకుం
డనుకంపన్ జరయించు సంతతముద • త్యాదృశ్యమైనట్టి లో
కని కాయంబునకీవ కర్తవగు ద • జ్ఞానాంధకారంబునన్
గనలేకుండెడివారి బ్రోచుటయె నీ • కర్తవ్యమా చూడగన్.

క॥ సర్వజ్ఞునకున్ హితుఁడవు సర్వజ్ఞుఁడు నీకు హితుఁడు • సర్వంబును మీ
యిర్వుర యధీనమగు శ్రిత ధూర్వహుఁడవు నీవు సకల • దుష్టవినాశా!.

తే॥ పాపపుణ్యములను • బరికింప నీమేను హేయమనుచు దోఁచు • నెట్టివాని
కైనఁగాని పార • మార్థికచింతన చేయుటొకటె యెప్పుడు • శ్రేయమగును.

తే॥ అల్పబుద్ధులైన • యట్టివారికిఁగల్గు సంశయంబులెల్ల • సమయఁజేయు
ప్రజ్ఞమిమ్ము వంటి • వారలయెడఁ గాదె సఫలమైతనర్చు • సంతతంబు.

వ॥ కొండొక సంశయంబు విచ్ఛేదంబుఁ గావించు తలంపున ననేక మహాయుగంబులు
బ్రహ్మాదుల విచారించియు సఫల ప్రయత్నుండఁ గామి సర్వజ్ఞుండవని నిన్ను దర్శింప
నరుదెంచితి నదియెద్ది యంటేని.

క॥ హరుఁడెట్లు బశుపతియన బరఁగు నెవఁడు పశువనఁగఁ • బడు నేపాశ
స్ఫురణన్ బద్ధుండగువాఁ డరయ విముక్తుఁడగు నెట్టు • లయ్య మహాత్మా.

— • నందీశ్వరుడు సనత్కుమారునకుఁ బాశుపత వ్రతమహిమఁ జెప్పుట • —

క॥ నావుఁడు నందీశ్వరుఁడను నా విధిసుతుఁ గాంచి యిమ్మ • హార్థమపుణ్య
ప్రావిర్భావము కారణమై వెలయు నెఱుంగరాద • జాదులకైనన్.

తే॥ అరయ సంసారవశవర్తు • లైనవారు ధాత మొదలుగ స్థావరాం • తంబులైన
జీవరాశులు పశువులు • శివుఁడు పతియు నగుటఁ బశుపతి యనఁదగు • హరుఁడు జగతి.

తే॥ ఆదిమధ్యాంతరహితుఁడ • వ్యయుఁడు విష్ణుఁడనఘుఁడాతఁడు తనమాయ • యనెడు పాశ
సమితిచే పశువుంబోలె • జగములెల్ల బంధన మొనర్చు మౌనులు • ప్రస్తుతింప.

మ॥ హరుఁడీశుం డొకరుండె దక్క గ నవి • ద్యాపాశ బద్ధాంగులౌ
నరులన్ ముక్తులఁ జేయఁగాఁగల జగ • న్నాథుండు లేఁడన్యుఁడా
సరసీజోదరముఖ్య నిర్జరులు వి • శ్వాసంబునన్ జేసి శం
కరు సేవించుచునుండ్రు సంతతము న • జ్ఞానంబుఁ బోఁద్రోలఁగన్.

తే॥ తలఁప నిరువదినాల్గుత • త్త్వములు పాశములనఁబడు వాని చేత బద్ధులను జేసి
జీవకోటుల ముక్తులఁ • జేయుచుండు హరుఁడు సేవింపఁబడుచు ని • త్యము ముదమున.

వ॥ దశేంద్రియ మయంబులును నంతఃకరణ సంభవంబులును భూతతన్మాత్రంబులు
నగు పాశంబులచే బరమేశ్వరుండు జీవసంచయంబును ముక్తంబు గావించు
చుండును. జీవుండు పరమేశ్వర సేవచే భక్తుఁడు నాఁబడు. భజనయను ధాతువు
సేవార్థకమగు కతన బుధులు సేవను భక్తియని వక్కాణింతురు.

సీ॥ బ్రహ్మ మొదలు స్తంభ • పర్యంతమగు జీవరాశిని గుణవికా • రంబులైన
పాశసంతతితోడ • బంధించి యెల్ల కార్యంబుల జేయించు • చనవరతము
దృఢమగు భక్తిఁ బూ • జింపఁగబడి ముక్తి గలిగించుచుండు ని • ష్కాముఁడగుచు
వాఙ్మనఃకాయసం • భవమగు భజనంబె భక్తినాఁబడుచుండు • వసుధయందు
కలుషనాశకుండు • గౌరీమనోహరుఁ డఖిలకార్యములకు • నాదికార
ణంబు లోకనేత నాగభూషుఁడు భజనమున కర్హుఁడగుచు • నమరుధరణి.

—• భక్తి భేదములు •—

తే॥ భజనమరయ మూఁడు • పద్ధతులఁ జెలంగు మానసికము నాఁగ • మఱియు వాచి
కంబు నాఁగఁ గాయి • కంబనఁ బరమేశు దయకుఁ బాత్రమగుచు • ధరణిలోన.

క॥ హరునెడఁ జిత్తముఁ జేర్చియుఁ బరమాత్ముఁడు శంభుఁడిట్టి • వాఁడని పలుకన్
దరమే యని భజియించుట యరయఁగ మానసిక భజన • మనఁబడు జగతిన్.

మ॥ పరమేశుండు దయాపయోధి త్రిజగత్పాలుండు గౌరీమనో
హరుఁ డార్తావనుఁ డీశ్వరుండు పురసం • హారుండు బ్రహ్మాదిని
ర్జరలోక స్తవనీయుఁ డంచెపుడు • ప్రాంచద్భక్తితోఁ గొల్చినన్
ధరణిన్ వాచికమై చెలంగు సురసం • తానస్తుత్యంబై తగన్.

క॥ తలపఁగఁ బ్రాణాయామాదులయిన కర్మములతోడ • ధూర్జటిసేవన్
సలుపుటయె కాయికంబన వెలయుమహామాని లోక • వినుతంబగుచున్.

వ॥ ధర్మాధర్మ మయంబులగు పాశంబులచే బంధింపఁబడిన దేహులకుఁ బరమేశ్వ
రుండగు శివుండొక్కం డుపాస్యుండు. పాశముల బంధించుట వలన చతుర్వింశతి
తత్వములు మాయాకర్మ గుణములనియు విషయములనియు జెప్పఁబడు. అట్టి
పాశంబులచే బంధింపఁబడిన సర్వదేహులును శివభక్తిచే విడువఁబడుదురు. పంచ
క్లేశమయంబులగు పాశంబులచే శంకరుండు పశువుల బంధించి భక్తిచే నుపా
సింపఁబడి వాని దొలగించుచుండును.

క॥ భవపాశ బద్ధులై సం భవమరణాద్యఖిల దుఃఖ • భాక్కులయినదే
హివితలికి మోచకుండగు శివుడెఱుఁగంబడడవిద్య • చే నెవ్వరికిన్.

సీ॥ పాశత్వమొందిన • క్లేశంబులనవిద్య యనియును నస్మిత • యనియు రాగ
మనియు ద్వేషంబని • యభినివేశంబని వచియింతురార్య • లవ్వానియందు
నజ్ఞానము తమంబు • నామోహమన మహామోహంబు తామిస్ర • ముమఱియంధ
తామిస్రమననొప్పుఁ • దగన విద్యాపాశబద్ధులౌ వారలఁ బార్వతీశుఁ

దర్చితుండగుచు ద • యాన్వితుండగుచు రక్షించుచుండు నతని • సేవవిడిచి
పద్మనాభుఁడైన • భవపాశములఁ ద్రెంప నేరఁడితరుఁడెట్లు • నేర్పఁగలుగు.

తే॥ ఆరయఁగ నవిద్యతమము నా • నతిశయిల్లు నస్మితయు మోహమనఁబడు • నవని రాగ
మదిమహామోహమనియెడు • నాఖ్యఁదనరు ద్వేషమిలను తామిస్రమై • వెలయు నెపుడు.

వ॥ అభినివేశంబంధతామిస్రమనఁదగు మఱియు దమంబును మోహంబును బ్రత్యేక
మెనిమిది విధంబులుగను మహామోహంబు పదివిధంబులుగను తామిస్రంబు నంధ
తామిస్రంబు నొక్కొక్కటి పదునెనిమిది భేదంబులుగను జెప్పఁబడు. లోక
నియంతయగు మహాదేవున కవిద్యాదులతోడను కర్మసంతానంబుతోడను కర్మవిపా
కంబులతోడను సంబంధంబు గలుగదు. కాలత్రయసంభూతంబులగు సుఖదుఃఖంబు
లును, కర్మసంస్కారంబులును, భోగసంస్కారంబులును, నవిద్యాజేతయగుఁ బర
మేశ్వరు నంటనేరవు. పుంవిశేషపరుండగు నార్యామనోహరుఁడు చేతనాచేతన
యుక్తంబునగు బ్రపంచంబునకన్న బరుండునై యతిశయంబుగ జ్ఞానైశ్వర్యమును
గాంచుచు శివకరుండగుట నా లోకేశ్వరుఁడు శివపదవాచ్యుండగు. కాలావచ్ఛేద
వర్జనంబులగు శాస్త్రంబుల నుపదేశించువాఁడును నట్టిదేశికులకు దేశికుండును నగు
శంకరుండు కాలావచ్ఛేదవర్జితుండై చరించుచు, విజ్ఞానోత్కర్షలతో ననాది

సంబంధంబుఁ గాంచి స్వార్థ పరత్వంబు వీడి సకల కార్యంబులకుఁ దానప్రయో జనంబై ప్రణవవాచ్యుండై జగంబు నుద్ధరించు తలంపున జ్ఞానతత్త్వంబగు పాశుపత వ్రతంబు నుపదేశించెనని చెప్పిన సనత్కుమారుండు మోదాతిశయంబున శైలాదిఁ గాంచి యిట్లనియె.

క॥ హరునకుఁ బ్రాణపదంబవు సరసిజనాభా ద్యనిమిష • సంతానమునీ
కరుణా పాత్రములగుటకు నిరతంబును గోరుచుంద్రు • నిర్మలచరితా.

క॥ పరమపవిత్రములగు శంకరుచరితము లెన్నివిన్నఁ గాని మఱివినఁగ
మురిపంబుగలుగు • చుండెడు దురితనివారకములగుట • దుష్టవినాశా.

తే॥ మొదలుతుదయు లేక • ముక్కోటిపులలోన మేలుబంతియైన • మిత్తిగొంగ
మహిమఁ దెలియవలతు • మానక యెఱిఁగించి ననుఁ గృతార్థుఁ జేయు • మనఘ యిపుడు.

చ॥ అనవుఁడు నందికేశుఁడను • వాతని పల్కుల నాలకించి రౌ
యనఘ చరిత్ర నీయెఱుఁగ • నట్టిది శంభుమహత్త్వమెవ్వి
ధంబున నెఱుఁగంగ నేర్తుఁ మని • ముఖ్యులయందు నగ్రగామివై
తనరుచునుండు వాఁడవుగ • దా సరసీరుహ సంభవాత్మజా!

తే॥ తెలియనడిగితీవు • తెలిసినంత వఱకు వినుము నేవచింతు • ననఘ చిత్త
యధర్మలైనవారి • నాదరింపకయున్న నన్నృతదోషమందు • నంద్రుబుధులు.

వ॥ చరాచర లోకనియంతయగు నమ్మహా పురుషుని బ్రకృతియు, బుద్ధియు నహం కారంబును, జిత్తంబును, వాఙ్మనః కాయపాదపాయూపస్థాదులును, గామ క్రోధాదులును, బంధింప నేరవు. భూతతన్మాత్రంబు లయ్యోగీశ్వరేశ్వరుని డాయ వెఱచు. స్వభావంబుచే నిత్యశుద్ధుండును నిత్యబద్ధుండును నిత్యముక్తుండగు నీశుని వర్ణింప నలవిగాదని తత్త్వవేత్తలగు మునీంద్రులు వక్కాణింతురు. అనాదిమధ్య నిష్ఠుఁడును, బరమేష్ఠియుఁ బురుషోత్తముండును, నగు శివునాజ్ఞచేఁ బ్రకృతివలన బుద్ధియు బుద్ధివలన నహంకారంబును నహంకారంబున నింద్రియవర్గంబును, దన్మాత్రలును, వానివలన నశేషంబులగు మహాభూతంబులు, నుద్భవించు మఱియు

తే॥ ఈశ్వరాజ్ఞఁబూని • యెల్లమహాభూత వితతి బ్రహ్మ మొదలు • తృణమువఱకు
గలుగు ప్రాణికోటిఁ • గలిగించు నజ్ఞుఁడు చంద్రార్ధ ధరుఁడు జూచి • యప్రబపడఁగ.

సీ॥ అరయనంతర్యామి • యని దేహములలోఁ బ్రశస్తిఁ గాంచిన మహా • సాధుమాత్రికి
సకలచరాచర • జంతుజాలంబు సృష్టిస్థితిలయములఁ • జేయుఘనుఁడు

అఖిలలోకేశ్వరుం । డయ్యు నేసంబంధమిం తేనియు నెఱుంగ । కేసఁగు జ్ఞాతఁ
డెచ్చోటఁగనొన్న । నచ్చోటఁదానయై యేరికిఁగనరాని । యిద్ధచరితుఁ
డాదిమధ్యలయము । లరిదని దేవుండు ఫాలలోచనుఁడు స్వ । భావసిద్ధ
మైన యీశ్వరత్వ । మవధరించునతండు భూతకోటికెల్లఁ । బ్రీతిఁగూర్చు.

వ॥ అమ్మహాదేవునసుమతి నహంకారం బఖిలార్థకంబుల నతిమానించును, మనస్సు సంకల్పించును, శ్రోత్రంబువినును, వేయుతేల నకలేంద్రియంబులు నాగారీ కాంతు నానతి స్వధర్మంబులగు నెల్లకార్యంబులఁ గావించుచుండు.

సీ॥ పరమేశుననుమతి । ప్రాణివర్గమునకు నవకాశము నొసంగు । నాకసంబు
ప్రాణంబులర్గఁగూర్చుఁ । బవనుండు వహ్నియు హవ్యంబు సురలకు । కవ్యభుక్కు
లకుఁ గవ్యమిడి ప్రాణు । లకు బాకముఁగూర్చు జలములు సంతృప్తిసలుపుచుండు
పరగఁ జరాచర । ప్రాణికోటుల నెల్ల రక్షించుచుండు బు । రంధరుండు

భవునియాజ్ఞయెల్ల । నవిలంఘ్యమగుటను శిరములందు దాల్చి । సురలుసతము
న్యాయపథము విడక । యనయరబు జగములఁ గాచుచుందు రధిక । కరుణ వెలయ.

వ॥ మఱియు నాదిత్యులును, వసువులును, రుద్రులును, నశ్వినులును, మరుత్తులును, యక్షరక్షః పిశాచాదులగు దేవయోనులును, గ్రహంబులును, నక్షత్రంబులును, యజ్ఞంబులును, వేదంబులును, తపస్సులును, ఋషులును, కవ్యభుక్కులును, సముద్రంబులును, పర్వతంబులును, నదులును, కలలును, కాష్ఠలును, నిమిషంబులును, ముహూర్తంబులును, దివసంబులును, రాత్రులును, ఋతువులు, వత్సరంబులు, యుగంబులు, పుష్కరంబులు, నెనిమిదివిధంబులగు దేవజాతులును, పశువులును, దైత్యదానవులును, పదునాల్గుయోనుల జన్మించిన భూతబృందంబులును, పరమేశునను మతి నిజోచిత కార్యంబుల నతిక్రమించక ప్రవర్తించుచుండు నింక నాదిదంపతులగు పార్వతీపరమేశ్వరుల విభూతిఁ గూర్చి వచియింతు నాకర్ణింపుము.

—♦ పార్వతీపరమేశ్వరుల విభూతిమహిమ ♦—

క॥ కలిమల సంహారులు నిర్మలచరితులు నైన యోగి । రాజులమర ము
ఖ్యులు నే దేవునిఁ గొల్చెద । రలఘుండాశంభుఁడు పర । మాత్మయగు జుమీ!

క॥ శివుఁ డీశ్వరుండు పర్వతభవ మాయయనంగఁ దనరుఁ । బ్రకృతి గిరిజయౌ
భవుఁడు పురుషుండు నాఁబడు నవని గిరిజవాణియగుఁ ద । దర్థము హరుఁడౌ

వ॥ దివసంబు శంభుండును రాత్రి గౌరియు, సప్తతంతువు మహాదేవుండును రుద్రాణి దక్షిణయు, నాకాశంబు శంకరుండు పృథివి భవానియు, సముద్రుండు శివుండు వేల శైలకన్యయు, వృక్షంబు శూలాయుధుండు పార్వతిలతయు, హరుండు ధాతయు సావిత్రి యీశ్వరియు, మధుసూదనుండు హరుండు దుర్గలక్ష్మియు, నింద్రుండు త్రిపురాంతకుండు, మృడాని శచియు, రుద్రుండు వహ్నియు, జండికి స్వాహయు, నని పెద్దలు వచియింతురు. పెక్కులేల స్త్రీపురుషరూపంబగు సర్వంబు నయ్యాదిమ దంపతుల విభూతి నాఁబడు. కావున బదార్థశక్తులు గౌరియనియు శక్తిమంతంబు లగు పదార్థంబులు శంభుండనియుఁ బ్రాబల్యులు మెఱవెట్టుచుండు.

తే॥ అష్టవిధములైన • యాప్రకృతులు మహాదేవి మూర్తులగుచుఁ • దెలియఁగఁదగు
వికృతులెల్ల సర్వ • వేత్రియాశైలజ పూతదేహగత వి • భూతిచయము.

తే॥ అనలమున విస్ఫులింగంబు • లట్లనేక గతులజీవసమితి కాల • కంఠునందు
భేదము నభేదమును జెంది• పృథ్వీఁదనరు సకలగుణ సాంద్రులగుమాని•జనులు వొగడ

తే॥ సకలదేహములును • శర్వాణిరూపముల్ తలఁపఁగా శరీరి • తతులు జగతి
శంకరాంశములగు • శ్రావ్యముమారూపమమర శ్రోతశశిక • లార్ధధరుఁడు.

క॥ గిరిజ విషయతారూపము హరుఁడును విషయిత్వమొంది యలరుచునుండున్
ధర ద్రష్టవ్యము శాంకరి పరమేశుఁడు ద్రష్టయగుచు • భాసిలు నెపుడున్.

వ॥ దృశ్యవస్తుజాలంబుమయు ద్రష్టశశిఖండ శిఖామణియగు విశ్వేశ్వరుండు; ఘ్రేయ మునగు రసజాత ముమారూపమగు రసయితయగు ఘ్రాతహరుఁడు స్మరణీయ వస్తు జాతంబు శాంకరీరూపంబు తలంచువాఁడు శంభుండు, బోద్ధవ్యంబు భవవల్ల భయు, బోద్ధభవుండు, పీఠాకృతి కాత్యాయనియు, లింగంబు హరుండునగు. మఱియు స్వర్గమర్త్య పాతాళాన్త బ్రహ్మాండంబగు జ్ఞేయంబు దేవీరూపం బనియు, జ్ఞాతపురారి యనియు నెఱుంగనగు సర్వమంగళ క్షేత్రత్వంబు భరించు, క్షేత్రజ్ఞత్వ మీశుండు వహించును. శివలింగంబు విడిచి యితర దేవతల నుపా సించువాఁ డగౌరవంబునొందు.

చ॥ పరమ కృపాపయోధియగు • పన్నగభూషణునందు నిశ్చలున్
విరమగుభక్తి లేకితర • దేవతలన్ భజియించువాఁడిలన్
నరకమునొంది కుందునిజ • నాథునివీడి భుజంగ సంగతిన్
దిఁగెడి దుష్టకామినిగ • తిన్ శశితారకలుండు కాలమున్.

తే॥ సరసిజాసనాది ♦ సకలామృతాశనుల్ నృపులు మానివరులు ♦ నిరతభక్తి
లింగపూజఁ గోరి ♦ లింగాంగులై భవపాశములను ద్రెంచి ♦ పరఁగుచుండ్రు.

తే॥ ప్రాణలింగార్చనా పరా♦యణుఁడు వెన్నఁడాహవంబున దశకంఠు♦హతముఁ జేసి
తత్కలుష పరిహారంబు ♦ దానకోరి తివిరి నదిదరి లింగప్ర♦తిష్టఁ జేసె.

తే॥ భక్తియుక్తుఁడగుచు ♦ భవు నాశ్రయించినవాఁడు హీనకులము ♦ వాఁడైన
నవని నెపుడు బ్రహ్మ ♦ హత్యాదిపాపముల్ వాసిపుణ్యలోక ♦ వాసియగును.

వ॥ దృశ్యాదశంబగు ప్రపంచంబెల్ల లింగమయంబగుడు శాశ్వత పదలోలుపులగు
వారలు లింగపూజా నిరతులగుట శ్రేయంబు.

క॥ అవనియు జలంబులగ్నియుఁ బవనం బాకసము శశియు ♦ భాస్కరుఁడును నా
శివునిశరీరంబులనుచుఁ దవిలినభక్తిని వచింత్రు ♦ తజ్జ్ఞులు సతమున్.

క॥ తరుమూల సేచనంబున నరయఁగ శాఖోపశాఖ ♦ లన్నియుఁ దృప్తిన్
బరగుగతి ననలమున నిడు గురుతరవస్తుతతి వేల్పు ♦ కోటికిఁ జెందున్.

తే॥ హరుని సూర్యాత్మకంబగు ♦ నట్టితనువు పదియు రెండువిధంబులఁ ♦ బరగుచుండు
నఖిలదేవాత్మకంబగు ♦ నట్టియాజ్యము నొసఁగుచునుందు రారూప♦మునను మునులు.

వ॥ అమృతంబును భూతసంజీవనియుఁ జంద్రంబును శుక్లంబును హరికేశంబును విశ్వ
కర్మంబును విశ్వవ్యచయంబును సంయద్వసువును నర్వావసువును స్వరాట్టువును
సుషుమ్నంబును సోమంబును ననఁ బదియు రెండు తెఱంగుల విలసిల్లు సూర్యాత్మ
కంబగు నీశ్వరరూపంబుల ప్రత్యేక ప్రయోజనంబు వక్కాణింతు నాకర్ణింపుము.

— ♦ ఈశ్వర స్వరూపములు ♦ —

సీ॥ ఆదిత్యరూపుఁడౌ ♦ హరునమృతకలయు భూతసంజీవని ♦ ఖ్యాతిఁ దనరు
కలయును లోకసం ♦ ఘము ప్రీతిఁ గల్గించుఁ జంద్రాఖ్యకిరణమో ♦ షధులవృద్ధిఁ
గల్గింప హిమవృష్టిఁ ♦ గల్గించు శుక్లంబు సస్యపాకాదిబీ ♦ జమగు ఘర్మ
మునుగూర్చు హరికేశ ♦ మనునది నక్షత్రపోషకంబగుచును ♦ బొదలు ధరణి
విశ్వకర్మాహ్వయంబయి ♦ వినుతిగాంచు నదియు బుధజనరక్షకం ♦ బగుచు నలరు
నరయ విశ్వవ్యచయనెడు ♦ నదియె శుక్రపోషకత్వంబుచే నిత్య ♦ మును రహించు.

సీ॥ సంయద్వసువునాఁగ ♦ జగతి నొప్పెడు నది కామారిలోహితాం ♦ గమును బ్రోచు
నర్వావసువనెడు ♦ నది బృహస్పతిఁ గాచు నలస్వరాట్టువునాఁగ ♦ నలరునదియు

సర్వజా రక్షించు • ననిశంబును సుషుమ్నయనునది శశధరు • ననుదినంబు
గాచు సోమాఖ్యయగాఁ • కలవసుజాతులో సౌమ్యుల ప్రకృతిత్వ • సంగతయను
నిది మహారహస్య • మిందిరాహృదయేశ ముఖ్యులైన దేవ • ముఖ్యులకును
దెలియఁ దరము గాదు • కలుషవినాశకంబగుటఁ గోరుచుందు • రఖిలమునులు.

తే॥ భవుని సోమాత్మకమగు రూపము శరీరభాక్కులందున శుక్రరూ • పంబుతోడఁ
బొసఁగు బ్రహ్మాదినిర్జర • పుంగవులును గనుఁగొనఁగరాని మహిమంబుఁ • గాంచి మించి.

సీ॥ పదునాఱు తెఱఁగులఁ • బరఁగు నమృతకలాత్మకుఁడగు హరుని సోమయనుమూర్తి
వేలుపు మూఁకకుఁ • బితృగణంబులకును నమృతంబుచేఁ దృప్తి • నాచరించు
మఱియుఁ జరాచరా • త్మకమగు లోకంబు నుద్ధరించుటకునై • యోషధులకుఁ
బరితృప్తిఁ గావించుఁ • బతిభావమున యజ్ఞసమునయంబునుఁ బ్రోచు • సంతతంబు
నుదక సంచయమున • నోషధులకునట్లు బతియయగుచు నెపుడు • బ్రథను గాంచు
నిట్టిదనుచుఁ దెలుప • నెవ్వారికేనియుఁ దరముగాదు దానిఁ • దగ గణింప.

వ॥ సోమాత్మకుండును బ్రభుండునగు శివుండు జీవత్వంబుననుండ సర్వలోక రక్షణి యగు మధురయనునది విలయమును జెందును. యజమానాఖ్యయగు నీశునిమూర్తి యనిశంబు హవ్యకవ్యంబులచే దేవతాగణంబును బితృసంతతిని బోషించుచుండు. మఱియు నాహుతి జన్యయగునది యజమానాహ్వయంబుచే బరాపరంబగు నఖిలంబును వృష్టినొసఁగి రక్షించు. అంబుమయియగునది యఖిల బ్రహ్మాండముల నంతర్బహిస్థమును నదీనదసముద్రరూపంబగుజలంబును గాచుచుండు. ఇవ్విధంబునఁ బరమేశుని మూర్తులన్నియు నయ్యయిరూపంబుల నయ్యైవిధంబులనున్న పదార్థములఁ బ్రోచుచుండు. అనంత గుణగరిష్ఠుండగు చంద్రాధర మౌళి మహిమంబుఁ గూడ వినవలతు వేని నాయెఱింగినంతవచింతు నాకర్ణింపుమని నందీశ్వరుఁడు సనత్కుమారున కిట్లనియె.

## —• ఈశ్వర మహిమ •—

తే॥ తలఁప నఖిలలోక • ములను వ్యాపించి వెలుంగువాఁడు భూత • లోకమునకు
రక్షకుండు త్రిగుణ • రాజితుఁడష్టమూర్తియనఁ బరగువాఁడు • త్రిణయనుండు.

క॥ పరమేష్ఠియు శర్వుండును నరయఁగ విశ్వంభరాత్ముఁ • డగు శంభునకున్
బరఁగు వికేశి గృహిణియై ధరనంగారకుఁడు పుత్ర • తను గాంచ వెసన్.

తే॥ వేదవాదులైన • విప్రులవ్వీశ్వేశు భవుఁడటంచుస్తోత్ర • పాఠములను
సలుపుచుందురఖిల • సంజీవనుండౌట నిర్మలాత్ములగుచు • నిత్యమరసి.

సీ॥ అమ్మహాత్మునకార్య • యగు సుమదేవియై యలరువారికి శక్రుఁ • డాత్మజుండు
నఖిలలోకేశుండు • వ్యాపియు సర్వలోకైక రక్షకుఁడు వ • హ్న్యాత్ముఁడైన
హరునకు షణ్ముఖుం • డాత్మజుండై యొప్పుఁ బవనాత్ముఁడగు నుమా • వల్లభునకు
శివయను నాఖ్యచేఁ • జెలఁగు దేవియు మనోజవుఁడను వాఁడుకృ • శానురేత
సునకుఁ బుత్రకుండు • సోమశేఖరుఁడు వ్యోమాత్ముఁడగుట భీముఁ • డనదనర్చు
నతనికెల్లదిక్కు • లంగనలై పొల్చు సర్గమతనికతన • జరుగుచుండు.

సీ॥ సర్వాత్ముఁడును జగ • త్స్వామియు భుక్తిముక్తుల నిడుహరుఁడురు • ద్రుఁడన వెలయు
నరయ సూర్యాత్ముఁడౌ • నతనికి దేవి సువర్చలనాఁబడు • వారికాత్మ
జుండగును శనైశ్చ • రుండు సమస్తలోకావనుఁడగుచు సో • మాత్ముఁడైన
ఘనుఁడు మహాదేవుఁ • డనఁబడు నతనికి దయిత రోహిణి నాఁగఁ • దనరు నెపుడు
బుధసమాహ్వయుండు • పుత్రుండు వారికి దేవతలకును బితృ • దేవతలకు
హవ్యకవ్యములిడ • హరుఁడు దా యజమాన సంజ్ఞ దనరుమాని • సన్నుతుఁడయి.

క॥ అతనికి దక్షయనంబడు సతికిని సంతానసంజ్ఞ • జనువాఁడరయన్
సుతుఁడయ్యె వారికరుణన్ బ్రతిభూతము వఱలుచుండు • బహుసౌఖ్యములన్.

—• పంచబ్రహ్మను కథనము •—

వ॥ పరమేశ్వరుం డష్టమూర్తుల ధరించుటయగాక పంచబ్రహ్మ స్వరూపుండనియుఁ బెద్దలు వచింతురు. పంచబ్రహ్మోపాసనంబు గావించు నరుండు శశాంకశేఖరునకు ముఖ్యుండగు. సకలలోకముల కుపాదానకారణంబును నిమిత్తకారణంబును నగు నీశ్వరుండు పంచవిధంబుల విలసిల్లు. అవ్విధంబులె పంచబ్రహ్మంబులనఁ బరఁగు. అవిక్రమంబుగ నీశాన తత్పురుషాఘోర వామదేవ సద్యోజాతంబులన నొప్పు. అందుఁ బ్రథమంబు శ్రోత్రేంద్రియ స్వరూపంబున నెల్లజీవులందుండును. ద్వితీయంబు గుణాత్మకమై ప్రకృతి నాఁబడు. తృతీయంబు ధర్మాద్యష్టాంగ సంయుతమై జ్ఞానరూపంబగు. చతుర్థం బహంకార రూపంబున సర్వంబును వ్యాపించియుండు. పంచమంబు తత్త్వస్వరూపంబున సర్వభూతముల నావరించి చెలంగు. వెండియుఁ దత్పురుషంబు త్వగింద్రియరూపంబునను, నఘోరంబు చక్షురింద్రియ రూపంబునను, వామదేవంబు జిహ్వేంద్రియ రూపంబునను, సద్యోజాతంబు ఘ్రాణేంద్రియ రూపంబునను, నీశానంబు వాగింద్రియ స్వరూపంబునను సర్వశరీరంబుల నధిష్ఠించియుండును. మఱియు శబ్దతన్మాత్రరూపంబగు నీశానంబాకాశ జనకంబనియు, స్పర్శ తన్మాత్రకాత్మకంబగు తత్పురుషంబు సమీర జనకంబనియు, రూపతన్మాత్రకంబగు నఘోరంబు జాతవేదో జనకంబనియు, రస

గతన్మాత్ర రూపంబగు వామదేవం బుదకజనకంబనియు, గంధతన్మాత్ర రూపంబగు సద్యోజాతంబు భూజనకంబనియు వర్ణింపంబడు. ఈ స్థావరజంగమంబగుఁ బ్రపంచంబు పంచబ్రహ్మాత్మకంబు పంచవింశతి తత్త్వాత్మకుండును, బంచబ్రహ్మాత్మకుండును నగు సదాశివుండు ప్రణతార్తి శమనుండు గావున నయ్యుందు ధర నందఱును డెందంబులఁ గొని యాడుదురని చెప్పి మఱియు శివమాహాత్మ్యంబు వక్కాణించువాఁడై శైలాది యిట్లనియె.

## — శివమాహాత్మ్యము —

క॥ హరుని మహిమంబు వొగడఁగ సరసిజభవ ముఖ్యులైన • స్వర్గౌకసులేఁ
గర మసమర్థులు నాఁగను నరుఁ డెంతటివాఁడు మౌని • నాయకవింటే.

సీ॥ సదసత్స్వరూపుండు • సదసత్పతియనని ప్రాఁబల్కులు వచించుఁ • బార్వతీశు
వ్యక్తంబు సత్తనాఁ • బడు నిల నవ్యక్త మరయ నసత్తనఁ • నలరుచుండు
సత్తు నసత్తును • శంకరురూపముల్ హరునకన్నను బర • మవని లేదు
వానికిఁ బతియౌట • వామదేవుఁడు సద సత్పతి నాఁగను • జగతి బరగు
నమ్మహాదేవుఁ డుత్క్షరాక్ష • రాత్మకుఁడని మఱి క్షరాక్షర పరుఁ డని • మౌనిగణము
బలుకు వ్యక్తంబు క్షరమగుఁ • దలప నక్షరంబె యవ్యక్త మగుచును • దంబు నిగాలు.

తే॥ అక్షరాక్షరములును శ • శాంకమౌళి రూపములె యగుఁ బర్వత • చాపుఁ డరయ
నతనికన్నను బరుఁడు లేఁ • డక్షరాక్షరముల కాతఁడె పరుఁడన • రహిఁ జెలంగు.

సీ॥ శ్రీ గిరీశ్వరుఁడు వ్య • ష్టి సమష్టిరూపుఁడై తత్కారణుండయి • తనరు వ్యష్టి
యనఁగ వ్యక్తంబు స • మష్టి నా నవ్యక్తమని వచియింతురు • మునులు సతము
క్షేత్రరూపుండును • క్షేత్రరూపియు శివుఁడే యనుచు శ్రుతుల్ • జెప్పుచుండు
వివరింపఁగా జతు • ర్వింశతి తత్త్వముల్ క్షేత్రశబ్దంబుచేఁ • జెప్పఁగఁబడు
సారిది క్షేత్రజ్ఞుఁ డన బురు • షుండు వెలయుఁ బలుక నవి రెండు శివునిరూ • పములె యగును
శశిధరునకన్న నన్యంబు • జగతి లేమి వేదవేత్తలు గొల్తురా • విశ్వనాథు.

వ॥ అని పలికిన నలరి సనత్కుమారుండు వెండియు శైలాది కిట్లనియె.

తే॥ శ్రవణపేయంబులై పూర్వ • సంచితాఘ నాశకములయి త్రిజగతీ • నాథ వినుత
ములగు నీశునిరూపముల్ • చెలఁగి యెన్ని గతుల విన్నను సంతృప్తి • గలుగదనఘ.

సీ॥ కావున నాయెడఁ • గరుణించి వినఁదగియున్న శంకరునిమ • హోన్నతంబు
లగురూపభేదంబు • లను దెల్పుమిది యకాదా ప్రాజ్ఞులగువారి • కహరహంబు

నుచితమాఘధర్మవు • సుచరిత్ర యుపదేశకుఁడు సంభవించిన • ప్పుడెయెఱుంగ
దగునంద్రుఁ తెలియఁగఁ • దగువిషయంబుల నావిని శైలాది • యతనికనియె

లోకనాయకుండు • పాకారిముఖసుర ప్రకరవందితుండు • భవుఁడుభక్త
సులభుఁడతని గుఱించి • కలయట్టితత్వంబు నిట్టిదనుచుఁ జెప్ప • నెవరితరము.

తే॥ ఆగమార్ణవపారగు • లైనదేశికోత్తములు పరమేశుఁడ • యోనిజుండై
యరయ క్షేత్రజ్ఞుఁడనియందు రతనికతిన భూతసంచయమెల్లను బు • ట్టుచుండు.

వ॥ మహాయోగు లయ్యీశుని బ్రధాన పురుషునిగ వక్కాణింతురు. సర్వంబగు వికార
జాతంబు ప్రకృతివలన వ్యక్తమగు. ప్రధానవ్యక్తులకుఁ గాలంబు పరిణామైక
కారణంబు. మహాయోగులొక కొందఱయ్యీశుని హిరణ్యగర్భుండనియు, బ్రధా
నుండనియు, వ్యక్తరూపియనియు, వక్కాణింతురు సకల చరాచరంబగు నీప్రపం
చంబునకుఁ గర్తయు భోక్తయు హిరణ్యగర్భుండేయగు. ఎల్లవికార జాతంబునకు
వ్యక్తరూపియగు శంభుండు ముఖ్యకారణంబు. మఱియుఁ బరమేశుండు పిండజాతి
స్వరూపియనియుఁ జెప్పఁబడును. సకలంబులగు చరాచర శరీరములు పిండము
లనియు వచింపఁబడు. కావున పరమేశుని రూపభేదంబులిట్టివని వర్ణింపనలవి
గాదనిన విని సనత్కుమారుండు మరల నిట్లనియె.

తే॥ ఎన్నిగతులవిన్న • నీశ్వరుమహిమంబు మఱియు వినెడుకోర్కె • మదినిబొడము
దేవదేవుఁడెట్లు • దేహియయ్యెఁ బ్రతాపమెటులఁగల్గె నతని • కెఱుఁగఁబలుకు.

చ॥ సరసిజసంభవాద్యమర • సంతతి సర్వసమర్థులయ్యు నా
హరుపదసేవఁ జేయుటకు • నైమదిఁగోరఁగనే లయీచరా
చరము శివస్వరూపమను • సంగతియెట్టిది యమ్మహాత్ముఁడే
కరణిననంతుఁడయ్యె నెఱుఁ • గఁగ వచియింపగదయ్య నాకిఁకన్.

క॥ నావుఁడు నందీశ్వరుఁడను నావిధి మానునకు నిర్మ • లాత్ముండు మహా
దేవుండిట్టిఁ డనుచునుతిఁ గావింపఁగఁదరమెయెట్టి • ఘనులకు నైనన్.

తే॥ మూఁడుకాలములకు • ముఖ్యకారణమీశుఁ డభవుఁడప్రమేయుఁ • డాదిపురుషుఁ
డమ్మహానుభావుఁ • డవ్యక్తభవుఁడని పలుకుచుందు రెపుడు • ప్రాజ్ఞులవని.

సీ॥ ఎల్లసృష్టికిఁబూర్వ • మీశుండుముఖపంకజ మునుండి దేవతా • సార్వభౌముఁ
బరమేష్ఠిసృష్టించెఁ • బరఁగ నాతఁడు శివుననుమతిఁగొని సోమ • మును సృజించె
నద్దానలోకంబు • లన్నియు భూతంబు లెల్లను జనియించె • నిందిరేశుఁ
డాదిగాఁగల దేవ • తావళియునుబుట్టె నప్పట్ల నారాయ • ణాదిసురలు

హరునిఁ గీర్తించి రయ్యద్రి • జాధిపుండుఁ వారి విజ్ఞానము హరించి వారివడుమ
నిర్మలాననుఁడగుచును • నిలిచినంత నబ్బురంబున వేల్పు లా • హరుఁ గనిరి.

తే॥ ఎచటనుండువాఁడ • వెందుండి యిచ్చోటి కేగుదెంచినాఁడ • వెవ్వఁడవీవు
వింతరూపుతోడ • వెలయుచున్నాఁడవేని కార్యమయ్యె • నిచటనీకు.

చ॥ అనవుఁడు శంభుఁ డిట్టులను • నాత్రిదశావళితోడ నేఁ బురా
తనుఁడ జగంబు భర్తను ప • దంపడి యీకనుబట్టు లోకముల్
జననమునొందు నాయెడల • సర్వము శంభుమయంబటన్న ప
లుక్కు నెఱుఁగరే ప్రపంచమున • కుఁ గర్త జనకుండను నేనగాదొకో.

తే॥ అరయఁగ మదన్యమైనట్టి • యది యులేదు సర్వభూతంబులందున • సంచరింతు
నేనయోనిజుఁడను నాకు నే న కారణంబు కార్యంబగుదు నన • యంబు జగతి.

సీ॥ బ్రహ్మాదులకు నేన • పతిని బ్రహ్మను నేన నిత్యుండ నేన య • నిత్యుఁడేన
దిక్సంతతియునువి • దిక్సమూహము నేన పుంస్వరూపము నేన • పుంస్త్వమేన
ప్రకృతియుఁ బ్రకృతిధ • ర్మము నేనదేహియు దేహంబు నేనవి • ధియు విధాత
నేనస్థూలంబును • నేనసూక్ష్మంబును ఛందస్సమితియు శా • స్త్రంబు నేన

వినెడువాఁడ నేన • వినిపించువాఁడ నే నంతకుండ నేన • యఖిలమునకు
వేయులేల నేన • విశ్వంబుమూలంబు పంచభూతములకుఁ • బ్రాణమేన.

వ॥ నిశ్చలచిత్తుండై యెవ్వండు శర్వుండు సర్వజ్ఞుండనియు, సర్వేశ్వరుండనియు నెఱుంగఁగలఁడాతఁడు మత్పదంబుఁ గాంచఁగలఁడని నిక్కమనిపల్క భగవంతుఁడగు నుమాపతి యంతర్ధానంబైన నవ్వేల్పులెల్లరు నూర్ధ్వబాహులును, ప్రసన్నవదనులును, కృతాంజలులునై యప్పరమేశు నిట్లు ధ్యానంబుఁ గావించిరి.

సీ॥ అఖిలదృశ్యాదృశ్య • మగు ప్రపంచంబున కెవ్వాఁడు కర్తయై • యొసఁగుచుండు
నేనేవులీలలై • యూపంచభూతంబులయ్యాయి కార్యంబు • లాచరించు
నెల్ల వేలుపులకై • యెపుడు చేసెడి నుతు లేదేవునకు జెందు • ప్రోదిఁ గాంచు
నింతటిలోకంబు • నే ప్రోవఁగల్గియు నెవఁడు నిర్గుణుఁడయి • యిలఁ జెలంగు

నెవనికతనఁ బుట్టు • నీ చరాచరమైన జగ మెవానిఁ గొలిచి • శాశ్వతమగు
ముక్తిఁ గాంచుచుంద్రు • మునులట్టి నినుగొల్తు ఘనఘ కరుణఁ జూడు • మయ్య మమ్ము.

తే॥ అలుకనైనఁ బ్రమాదంబు • వలననైన భక్తినైన నిర్వ్యాజానురక్తినైన
నెవఁడు నిన్నుస్మరించు నాయిద్ధచరితుఁ డతఁడు ముక్తుండె యగుఁ గదా! • యద్రిజేశ!

సీ॥ బ్రహ్మవిష్ణు మహేశ్వర • రస్వరూపుండయి సృష్టిస్థితిలయముల్ • జేయునెవఁడు
స్కందుండును బులోమ • జానాయకుండును నశ్వినుల్ గ్రహములు • నలరుతార
కలుభువనములుది • క్కులు నాకసంబును బంచభూతంబులు • బద్మమిత్రుఁ
డిందుండు గాల మమృతము వాయువులును మృత్యువు జలధులు • పృథివియున్న

గాఁ గనంబడునెల్లలోకములు నీవ నీ ప్రభావం బగణ్యమై • నెగడుచుండు
నెట్టికుటిలాత్ముఁడైన న • హీనభక్తి నిన్నె ధ్యానించి ముక్తిసం • పన్నుఁడగును.

వ॥ ప్రాణరక్షకంబును సర్వవ్యాపకంబును బ్రణవ విశిష్టంబగు నోంకారంబు నీవ అసారంబగు సంసారంబునుండి తరింపఁజేయుదువు గావున నీవు తారకుండవనియు, సూక్ష్మాకృతిఁగొని సర్వశరీరంబులందును వసించుకతన సూక్ష్ముండవనియు, గొనియాడఁబడుదువు. నిఖిలవిద్యలకు నీశుండవగుట నీశానుండని నిన్ను బ్రాఁబలుకులు బలుకుచుండును. హిరణ్యబాహుండును, హిరణ్యపతియు, నంబికాపతియు హిరణ్యరేతసుండును, వృషధ్వజుండును నగు భగవంతుఁడవీవ. సనాతనుండగు బ్రహ్మను తొలుత సృష్టించి యాత్మప్రకాశకంబగు జ్ఞానమొసఁగిన నేతవీవ. నిన్ను వర్ణించుటకు వాక్కులుగూడ జాలకుండునని స్తుతించిన బ్రహ్మాదులకుఁ బరమేశ్వరుండు ప్రమథగణం బిరుగెలకుల సేవింపఁ బార్వతీసహితుండై సాక్షాత్కరించె నంత.

## — శివపూజావిధి —

మ॥ కరుణాశాలి శశాంకశేఖరుఁడు లో • కత్రాణదక్షుండు శం
కరుఁడారీతిని భక్తవత్సలత సా • క్షాత్కారుఁడైనన్ నిరం
తర కౌతూహల మగ్న మానసులరై • ధాత్రాద్యమర్త్యుల్ కరాం
బురుహంబుల్ జతఁజేసి పల్కిరి నయం • బున్ గోర్కెయున్ హెచ్చగన్.

మ॥ అనఘా నీవలనన్ గదా గలుగు దృ • శ్యాదృశ్యమౌ నీజగం
బనయంబీ భువనంబు భారమది నీ • యందుండు పాపంబు పెం
పున నాశంబును జెందు లోకమును సం • పూర్ణానుకంపన్ గనుం
గొనుటహర్ణంబగు గాదె సంతతము నీ • కున్ బార్వతీనాయకా!

సీ॥ ముక్కంటి యేరూప • ముననెవ్విధంబున నెచ్చోట నీపూజ • నెలమిఁజేసి
యిష్టసిద్ధిం గాంతు • రెల్లభక్తులు దీని కధికారి యెట్టి వాఁ • డగ్రజునకుఁ
బూజించుతెఱఁ గెద్ది • భూనాయకుం డెట్లు నినుఁగొల్చి తరియించు • జననమరణ
దుఃఖంబుఁ బాయు సం • తోషంబునన్ జేసి వైశ్యుండు పూజించు • పగిదియెద్ది

స్త్రీలకును శూద్రులకును నీ • సేవఁ జేయ నర్హవిధియెద్ది యుండఁగో • శాదులెట్లు
దేవ! నీభజనమొనర్చి • తీవ్రమైన కలుషబాధను దొలఁగుదు • రిలవచింపు.

వ॥ ఇయ్యర్థంబు లోకహితంబు గావునను, నీవు భక్తవత్సలుండవగుటను, నజ్ఞానులమగు మాకెఱింగించు టుచితంబయని బ్రహ్మాదులు పరమేశుని బ్రార్థించిన.

తే॥ వారి వేఁడికోలు • వలన జాలినిజెంది పార్వతీశ్వరుం డ • పారకరుణ
పూర్వజన్మ పాప • పుణ్యానుభవముకై పుట్టువారు తన్నుఁ • బూజసేయ.

వ॥ మార్గంబు వక్కాణించిన నా బృందారక సందోహంబు మండలస్థుండును, సుమాసహితుండును, విద్యుత్కోటి సమప్రభుండును, చతుర్వక్త్రుండును, ద్వాదశాక్షుండును, నర్ధనారీశ్వరుండును, జటామకుటధారియు, సర్వాభరణసంయుతుండును రక్తమాల్యానులేపనుండును, రక్తాంబరధరుండును, సృష్టిస్థితి సంహారకారకుండును, పూర్వదక్షిణోత్తర పశ్చిమాభిముఖంబులును, పీత, నీల, విద్రుమప్రభ, ధవళవర్ణ విరాజితంబులును, నగు తత్పురుషాఘోర వామదేవ, సద్యోజాతాది ముఖంబులచేఁ బ్రకాశించువాఁడును, పూర్వదిక్కువక్త్రంబలె నగ్రభాగంబునఁ జతురాననుండగు నాదిత్యుని, బుశోభాగంబునఁ జతుర్వక్త్రుండగు భాస్కరుని దక్షిణంబున జతుర్వక్త్రుండగు భానుని, నుత్తరంబునఁ జతురాననుండగు రవిని, సర్వాభరణ భూషితలును, సర్వసమ్మతలునై, మండలంబునకుఁ బూర్వంబుననున్న విస్తారయు, దక్షిణస్థితయగు నుత్తరయు, బశ్చిమభాగంబునందలి బోధినియు, నేకవక్త్రంబును జతుర్భుజంబులును గలిగి యుత్తరభాగంబుననున్న యాప్యాయనియు నను శక్తులను, దక్షిణభాగంబున బ్రహ్మను, వామభాగంబున జనార్దనుండగు విష్ణునిగాంచుచున్నవాఁడును, ఋగ్యజుస్సామరూప మూర్తిత్రయ విరాజితుండును, నీశానుండును, వరదుండును, వైరాగ్యైశ్వర్య సంయుక్తంబును ప్రభూతంబును విమలంబును పరమ సుఖావహంబునగు ధర్మజ్ఞానాసనోపరిభాగంబున బ్రహ్మాసనంబు నధిష్ఠించి, దీప్తశిఖాకారయగు దీప్తయు విద్యుత్ప్రభయు శుభయు నగు సూక్ష్మయును, నగ్నిశిఖాకారయగు జయయును, కనకసుప్రభయగు ప్రభయును, విద్రుమప్రఖ్యయగు విభూతియును, పద్మసన్నిభయగు విమలయును, కర్ణికాకారయగు నమోఘయును, విశ్వవర్ణయగు విద్యుత్తును, చతుర్వక్త్రయుఁ జతుర్వర్ణయగు సర్వతోముఖియను దేవియును బరివేష్టింప నవగ్రహ పరివృతుండై సూర్యశివ జగన్నాథ సోమోమా పంచభూతమయుండగు పరమేశ్వరునిగాంచి కృతాంజలిపుటులై యష్టవిధంబులగు వాక్కుల స్తుతించిరని పలికి మరల నిట్లనియె.

కం॥ భవజలధి తారకంబగు శివపూజారతి నెవాఁడు • స్థిరచిత్తుండై
యవిరళభక్తి ననయముఁ గా భవునిఁ గా సేవించుటొప్పు • బ్రాహ్మణులగుననఘా

సీ॥ పరమసుఖంబయి ◆ ప్రవిమలంబయి ప్రభూతంబయి సారమై ◆ తనరునట్టి
యాధారపద్మంబు ◆ నందున నవశక్తిసంయుతుండైన భా ◆ స్కరునిగొల్తు
నాదిత్యుగవిని ◆ దివాకరుభానుని ప్రభనుసావిత్రిని ◆ ప్రజ్ఞ నుమను
సంధ్యనుత్తరనువి ◆ స్తరనుబోధినిగొల్చి వరదనాప్యాయిని ◆ సరసిజభవు

కేశవునిహరు సోమాది ◆ కిల్బిషహరులైనవారల విహితక్ర ◆ మానుగతిని
బూజగావించి యవహిత ◆ బుద్ధితోడ హరుని రవిమండలస్థునే ◆ నాశ్రయింతు.

మ॥ అమరాధీశుఁడుమున్ను గాఁగలయను త్ర్యక్షశ్రేణి ప్రార్థింతుని
త్య ముదావాప్తికినై ముకుందునివిధా ◆ తన్ గొల్తుసింధూరవ
ర్ణున్ మహాదేవు హరీంద్రపద్మజులకున్ ◆ మూలంబునౌ వానిని
త్యము జంద్రార్ధధరున్ భజింతుజగదా ◆ ధారున్ భవానీపతిన్.

తే॥ లోకబాంధవుని ది ◆ వాకరు మందేహ గణవినాశకరు న ◆ ఖండభాను
సప్తతురగు నరుణసారధిద్వాదశాత్మునిభజింతు హృదయ ◆ వనరుహమున.

వ॥ అని నిశ్చలభక్తి బూజ్యులగు నెల్లవేల్పులను, నాచార్యపాదులను మును మున్న
భజియించి వివిధంబులగు నర్హవస్తువు నగ్నియందు హోమంబుగావించి విధ్యు
క్తవిధంబున శివపూజావిధి సమాప్తమొనరించి పూజాంతసమయమున హృత్పం
కజ మధ్యస్థుండగు నీశ్వరు ధ్యానంబు గావింపవలయు.

మ॥ దనుజానీకభయంకరంబు విచల ◆ ద్దంష్ట్రాకరాళంబుదు
జ్జనలోకాంతకరంబు దివ్యములస ◆ త్సౌదామినీసన్నిభం
బనఘంబాశ్రిత రక్షకంబు నిగమాం ◆ తాటీకమూ నాత్రిలో
చనువక్త్రంబుస్మరింతుభక్తి శివపూ ◆ జావేళలన్ నిత్యమున్.

తే॥ భక్తజనపారిజాతమా ◆ భవుఁడునిత్య మధివసింపఁదగినదిస ◆ హస్రభాను
మండలంబపహృతపాప ◆ మండలంబు భక్తిమెయిస్మరియించెద ◆ భావమునను.

తే॥ ధవళదేహు తుహిన ◆ ధాము నంగారకు నగ్నివర్ణుఁగాంచ ◆ నాభు సౌమ్యు
నమరగురుని శుక్రు ◆ నర్కతనూజుని రాహుకేతువులను ◆ రవినిగొల్తు.

తే॥ పూర్ణచంద్ర నిభము ◆ పుష్పసుగంధము ప్రస్థతోయయుతము ◆ భాస్వరమగు
తామ్రపాత్రతోడఁ ◆ దగ నర్ఘ్యమిడియెద నఘవినాశ గొనుమ ◆ యాదరమున.

తే॥ అనుచు నెవ్వఁడేని యనయంబు నిర్మలచిత్తుఁడగుచు హృదయ ◆ సీమమండ
లస్థుఁడైన శశిక ◆ శాధరు బూజించునతఁడు హరునితోడ ◆ నైక్యమొందు.

సీ|| మండలస్థుఁడగును • మామనోహరుఁడు విప్రులకును క్షత్రియ • పుంగవులకు
వైశ్యోత్తములకును • వసుధఁ బూజ్యుండగుగాని శూద్రులకును • మానినులకు
హరుని బూజించెదు • నధికారమొగిలేదు సాఁకి పూజకుని శు • శ్రూషఁజేసి
తరియించు టొక్కండు • దక్క రాజన్యులు పాలకులగుట సు • శీలురునగు
భూమిసురులకతన • పూజాఫలముఁగోరు చుండురట్టులగుట • నుర్వీనాథు
లర్ఘ మొసఁగి బ్రాహ్మ • ణాన్వయంబును గాచు టర్హమైన కార్య • మయ్యెజుమ్ము.

— • గురుశిష్య లక్షణము • —

చ|| హరుఁడు సురాసురార్చితప • దాబ్జుఁడు లోకహితేచ్ఛ వాగమో
త్కరము షడంగసంతతిన • ఖండపురాణచయంబొసంగెఁ బా
మరులయి పాపకర్మలయి • భ్రమందెదు ప్రాణులకున్ శివార్చనా
సరణియెఱుంగ నౌనటుల • సర్వసుపర్వులు సన్నుతింపఁగన్.

తే|| వేదములు నాలుగయ్యెఁబృ • ధ్వీధరములఁబోలి గంభీరములగుటఁ • బురుషుఁడెవ్వఁడు
వానియర్థంబెఱుఁగనేర • డూనియెపుడు సరిలితంబగు గురుసేవ • సలుపకునికి.

వ|| భక్తానుగ్రహకాంక్షుఁబరమేశ్వరునిచే వచింపఁబడిన శైవశాస్త్రంబు నిష్కపట చిత్తుండగు నాచార్యు ననుగ్రహంబులేక యలవడదు. శివజ్ఞానంబు నుపదేశించు వాఁడు శివాచార్యుండనఁబడు. నిర్మలభక్తి శివజ్ఞానంబు నాచరించువాఁడును నాచరింపఁజేయువాఁడును శాస్త్రంబులందలి రహస్యంబులగు నర్థంబులఁ గ్రోడీకరించి శిష్యుల కుపదేశించువాఁడును నగుట గురుండు శివాచార్యుండనఁబరగు.

క|| అమలినభక్తి శివజ్ఞానముఁగోరెడు మానవుండ • నంతగుణాఢ్యుం
డు మహితచిత్తుండగు గురుగ్రమమున సేవింపవలయు • గౌరవమతియై.

తే|| కనఁబడినవారలెల్ల న • జ్ఞానతిమిర భాస్కరులటంచు మదిఁదలఁ • పంగరాదు
నిర్మలజ్ఞానపూర్ణుఁడై • నెగడువాఁడె దేశికోత్తముఁడనుచును • దెలియవలయు.

సీ|| ప్రియదర్శనుఁడు శ్రుతి • స్మృతివిహితాచార సంపన్నుఁ డార్తత • త్వాకరుండు
వేదాంతవిజ్ఞాన • విగత పాపుండును భూతిరుద్రాక్ష వి • భూషితుండు
మహితపంచాక్షరీ • మంత్ర పారాయణరతుఁడును లింగ సం • గతశరీరుఁ
డమలచిత్తుండు బ్ర • హ్మానంద సంధాన చతురుండు ప్రాజ్ఞుండు • సర్వవిషయ
వేది పండితుండు • విప్రుండు సుభగుండు శిష్యవత్సలుండ • శేష భూత
జాలహితుఁడు శంభు • చరణ సేవకుఁడగు ఘనుఁడె పో గురుత్వ • మునకుఁదగును.

క॥ ఆశావిరహితుఁడును భవపాశ విమోచకుఁడు సత్య • భాషారతుఁడున్
పాశుపతవ్రత నిరతుఁడై దేశికుఁడగువానినే ను • తింపఁగవలయున్.

సీ॥ తన కన్నవారియం • దున మాడ్కిఁ బెరవారిఁ గన్నవారలఁ గృపఁ • గాంచువాఁడు
తృణసంచయంబున • రీతి సువర్ణంబునెడ నాస విడనాడి • నడచువాఁడు
తివిరి పిపీలికా • ది విరించిపర్యంత మొక్కగతిఁ జరించు • చుండువాఁడు
ప్రాణలింగంబునఁ • బగిదిలింగాంగుల యందును భక్తిఁ బె • న్నలరువాఁడు
ఆఱుకాలంబులందును • నధికభక్తి హరునిపూజించువాఁడుశి • ష్యార్తిహరుఁడు
శాంతచిత్తుఁడు దేశిక • సార్వభౌముఁ డనుచు నాతనిసేవింప • నగునుసతము.

క॥ ఇట్టిగొనంబులగని యగు నట్టిగురుని యడుగుదమ్మ • లనయంబును జేఁ
బట్టి శివజ్ఞానముఁ దుద ముట్టఁగఁ దెలియంగవలయు • మోక్షార్థులకున్.

క॥ శివయోగియైన గురునిన్ భవునిగొలుచునట్టిమాడ్కి • భజియించెడువాఁ
డవనిన్ ముక్తుండగు నిజ భవబంధంబులనుబాసి • భాసురలీలన్.

చ॥ అనఘచరిత్రుఁడైన గురు • నానతినొందలఁదాల్చి యెమ్మెయిన్
దనయెడ దేశికోత్తముఁడె • దన్ గృపఁబూనునో యవ్విధంబునన్
జనసుతపద్ధతిన్ నడచు • సత్కులజాతుని ఛాత్రుగాఁగొనన్
జనుశివయోగికెల్లపుడు • శాంభవపూజ యొనర్చువేళలన్

—• శిష్యలక్షణము •—

తే॥ తను ధనంబుల గురునకు • ధారవోసి నిత్యసంతోషవంతుఁడై • నీలకంఠ
చరణగతమానసుండగు • ఛాత్రుఁబడసి దేశికుఁడు కృతకృత్యుఁడై • తేజరిల్లు.

చ॥ వినయనతోత్తమాంగుఁడు వి • వేకిగుణాఢ్యుఁడు దేశికాంఘ్రిజ
వనరుహపూజకుండు జిత • వైరినిరంతగధర్మ మార్గవ
ర్తనుఁడు జపాగ్నిహోత్రపర • తంత్రుఁడు నిర్మలచిత్తుఁడైనశి
ష్యునిదనయొద్దఁ జేర్చుకొను • టొప్పు గురూత్తముఁడైనవానికిన్.

తే॥ గురుఁడెమాన్యుండు పూజ్యుండు • గురుఁడెశివుఁడు గురుఁడెతల్లియుఁ దండ్రియు • [గురుఁడెహితుఁడు
గురుఁడెసర్వంబటంచును • కోరిగురుని గొలుచునాతఁడె సచ్ఛాత్రుఁ • డిలగణింప.

మ॥ కలుషాత్ముండయినన్ గురూపియయినన్ • గర్వోద్ధతుండైనఁజం
చలచిత్తుండయినన్ గృతఘ్నుఁడయినన్ • సన్న్యాసియైనన్ గ్రుథా

కలితుండైన నెవ్వానిభక్తిమెయిరా • గంబూఁడ్చు నాచార్యగాఁ
దలఁచుఁగా నానినెవిశ్వసింపఁదగు స్వాం • తంబందుశిష్యాళికిన్.

తే॥ మిన్ను గూలి నెత్తి • మీఁదనె పడినను గురుఁడు కొట్టి తిట్టి • కోపపడిన
విసుగులేక యెవఁడు • విమలమాభక్తిచే సేవజేయునతఁడె • శిష్యతముఁడు.

క॥ గురుశుశ్రూషానిరతుఁడు సరసుండు, పరోపకార • చతురుఁడు నాగా
భరణార్చాసక్తుండగు పురుషుఁడు శిష్యోత్తముండు • పుడమి గణింపన్.

తే॥ ఈషణత్రయంబు • హేయంబుగా నెంచి కరణముల జయించి • యరులమించి
త్రికరణముల గురుని • దేవునిగా నెంచునతఁడె శిష్యవర్యుఁ • డైనవాఁడు.

తే॥ దంభమాత్సర్యరహితుండు • దారచిత్తుఁ డఖిలసుగుణరత్నాకరుఁ • డమలచరితుఁ
డైన యాతఁడె నిర్మల • జ్ఞానదమగు నల శివజ్ఞానమునకు యో • గ్యతముఁడగును.

సీ॥ శాంతుండు విపులవే • దాంతార్థనిరతుండు వినయయుతుండు వి • వేకజలధి
పితృకులాచార సం • గతమానసుఁడు నిత్యసత్యవ్రతుండను • స్నానపరుఁడు
శివయోగిపాద • రాజీవసేవకుఁడన్న దానశీలుఁడు స్వామ • తప్రవర్త
కుఁడు భూతరక్షణా కుంఠితచిత్తుండు సర్వసముం డహింసారతుండు
శుద్ధవర్తనుండు సు • శ్లోకుఁ డనఘుండు నప్రతిగృహీత • యాద్యవినుతుఁ
డైనవాఁడె శిష్యుఁ • డనయంబను గ్రహక్షముఁడటంచుఁ దెలియఁ • జను గురునకు.

తే॥ సర్వలక్షణయుతుఁడును • సకలశాస్త్ర చతురుఁడును • నిఖిలోపాయ చణుఁడునయ్యుఁ
దత్వహీనుండెయైన సుం • తయు ఫలంబు దానగలుగ దట్లగుటఁ ద • త్వంబువలయు.

వ॥ భూతిరుద్రాక్షాలంకృత శరీరుండును, ప్రాణలింగ పూజాపరాయణుండును, తపస్వియు, శివజ్ఞానపూర్ణుండునునగు దేశికుండు మోక్షార్థియు గుర్వాజ్ఞాపరిపాలకుండును నగు శిష్యుని వత్సరత్రయంబు బరీక్షించి యనుగ్రహింపఁదగు. స్వసంవేద్యంబగు పరతత్వంబున నిశ్చయంబులేనివాఁడును నాత్మానుగ్రహంబులేనివాడును శిష్యునను గ్రహింప సమర్థుండుగాఁడు. మఱియు నట్టివాఁడు పశుసంబరగు. కావున గురుండు తత్వవేత్తయైన ముక్తుండును మోచకుండునునగు. పరానందసముద్భవంబగు తత్వంబు సంవిత్తిజనకంబగు. తత్వజ్ఞుండానంద దర్శకుండగు. సముద్రమగ్నంబగు పాషాణంబును పాషాణంబుద్ధరింప నేరనట్లు సంవిత్తి రహితుండు పామరలోకంబును దరింపఁజేయ నేరఁడు. మహాయోగులగువారి దర్శన స్పర్శసంభాషణంబుల కతనఁ బాశోప క్షయకారకంబగు జ్ఞానంబుసిద్ధించు. అట్లుగాదేని తత్వవిదుండగు గురుండు యోగమార్గంబున శిష్యుని దేహంబునఁ బ్రవేశించి చతుర్వింశతితత్వంబుల శోధించి బోధింపఁదగు. పృథివ్యాది భూతంబులును, శబ్దస్పర్శ రూపరస

గంధమును బుద్ధీంద్రియ వికల్పనంబును గర్మేంద్రియంబులును నహంకారంబును నవ్యక్తంబును బురుషాది విరించ్యంతమగు నున్మనత్వంబును బరాత్పరంబగు నీశత్వమును సర్వ తత్వార్థబోధకమగు కాలాధ్వగమనంబడును. శివాత్మికయగు తత్వశుద్ధి నరయోగి యెఱుంగఁడు.

క॥ దీపముననుండి వేరొక దీపంబుదయించునట్లు • దేశికుని ప్రభావా
పాదితమగు జ్ఞానంబే పారును శిష్యునందు • నీద్యంబగుచున్

తే॥ అఖిలసమ్మతమగుచుఁ ద • త్వాఖ్యమగుచు నలరుగాలాధ్వర మెవాని • యధికశక్తి
కలన భేదిల్లునతనికిఁ • గలుగు సిద్ధి ముక్తియును గురుకరుణాప్ర • భూతమగుచు.

— • శివపూజాక్రమము • —

సీ॥ గంధవర్ణరసాది • కంబుచే నీశ్వరావాహనక్షమమైన • వసుమతిఁదగఁ
గడిఁగి వితానాది • కముచే నలంకృతిఁగావించి శాస్త్రయు • క్తముగ నేక
హస్త ప్రమాణంబు • నగు మండలముఁగూర్చి తన్మధ్యమమున విం • తగను బంచ
రత్నయుతంబయి • రాణించు నెనిమిది దళములు గల్గు ప • ద్మంబు వ్రాయ

వలయునవియు ధవళ • వర్ణ యుక్తంబులోగ హితములో యగుచు • రూఢి వెలయు
నంత లింగమూర్తి • నావాహనముఁ జేయఁదగును కర్ణికాగ్ర • భాగమందు.

తే॥ అటుల దేవుదేవు • నావాహనమొనర్చి భక్తియుక్తుఁడగుచు • భావమందుఁ
బూజసేయవలయుఁ • బురుషుండు మోక్షార్థి యైనవాఁడు ధీరుఁడైనవాఁడు.

వ॥ అష్టదళంబులం దష్టసిద్ధులను, కర్ణికాకయందు మనోహరంబును ధర్మకందంబునగు వైరాగ్యజ్ఞాననాళంబును, గింజల్కంబులఁ గ్రమంబున వామయు, జ్యేష్ఠయు, రౌద్రియు, కాలియు, వికరణియు, బలవికరణియు, బలప్రమథినియు విన్యాసము జేసి రుద్రదిగ్భాగంబగు వాహ్నేయదళంబునను, రక్తాభంబగు నైఋతిదళంబునను, వాయుదళంబునను, తక్కినదిక్కులందును నీశానదళంబునను విధివిహితంబులగు నాయయి మంత్రంబుల న్యాసంబుగావింపవలయు. పిమ్మట శివుండును సర్వభూతదమని మున్నగు శక్తులను, శివాసనంబగు కర్ణికయందు వామదేవాదిసహితముగ మహామాయ యగు మనోన్మనిని ద్వంద న్యాసము గావింపఁదగు. పంచరత్నసహితంబగు కమలంబు మధ్యభాగంబున మనోన్మనుండగు మహాదేవుని మనోన్మనీ సంయుతంబుగ నిలుపు టర్హంబు. అద్దాని పూర్వదళంబున సూర్యసోమాగ్ని సంబంధమువలన బ్రణవాఖ్యంబును, శివస్వరూపంబును, రవిప్రభంబగు తత్పురుష

ముఖంబును, దక్షిణపత్రంబున స్మరణమాత్రాశేష పాపసంహారంబును నీలాంజన చయోపమంబగు నఘోరముఖంబును, నుత్తరపత్రంబున సమస్త దేవతాధీశ మకుట మణిగణ రంజితంబును జపాకుసుమ సన్నిభంబగు వామదేవముఖంబును, బశ్చిమదళం బునఁజరాచర ప్రపంచనిర్మాణకారణంబును, గోక్షీరధవళంబునగు సద్యోజాతముఖం బును, గర్ణికయందు శుద్ధస్ఫటికసంకాశంబును జంద్రమండల సన్నిభంబును, వందారు భక్తసంతోషానందకరంబును నగు నీశానముఖంబును, నపర్ణామనోహరుండును, సృష్టిస్థితి సంహారకర్తయు, గుమారజనకుండును, త్రిపురఘ్నుండును శ్రితజనామరభూరుహంబును, కృతాంతగర్వభంజకుండును, సదాశివుండును, మహేశ్వరుండును, రుద్రుండును బ్రాణ లింగస్వరూపియునగు నీశ్వరుని, లోకస్థితికారకుండును, గమలాలయామనోహరుం డును, మురాసురగర్వపర్వత దంభోళియు, శ్రీవత్సలాంఛనుండునగు విష్ణుని భూత భౌతిక ప్రపంచసృష్టికరుండును, శారదాహృదయాంభోజలోక బాంధవుండునగు విరిం చనిసృష్టిన్యాసంబుచే భావించి సంకల్పనిర్విఘ్నా కాంక్షియై యిట్లు స్తుతించవలయును.

తే॥ అశ్వమేధసహస్రంబు • నాచరించి కాంచుపుణ్యంబుకన్నను • గృపనిశ్చ
లాత్ముఁడైనిన్నుఁబూజించు • నట్టిసుకృత మధికమౌఁగాదెయుర్వి శ • శాంకమౌళి.

మ॥ సురలంగొల్చిన యట్టిమానవుఁడున • స్తోకప్రభావాఢ్యుఁడై
సరివారల్ వినుతింప నొప్పునఁగా • సర్వంబురక్షించు నీ
చరణాబ్జంబుల గొల్చువాతనికిఁగ • ష్టంబెవ్విధిఁగల్గునో
యరవిందాసనసన్నుతాంఘ్రియుగ మీ • నాక్షీమనోవల్లభా.

తే॥ కల్పకోటిశతంబులు • కాననములఁ జేరితపమొనరించెడి • వారికైన
స్థిరమగునభక్తినిన్నుఁ బూ • జించునట్టి భాగ్యములభించునేయింత • పార్వతీశ.

తే॥ చతురుదధివేష్టితాఖండ • సర్వభూత లాధికారంబయిననాకు • నరుచిఁగూర్చు
సంతతభవత్పదాంబుజ • చింతనామృ తానుభవములభించిన • యట్టివేళ

తే॥ పూర్వజన్మార్జితంబైన • పుణ్యమునన గాకనీభక్తి కలుగునే • కాలకంఠ
యనిశముకరస్థలింగ పూ • జాభిరతియె కలుగుగతినన్ను గరుణింప • వలయునీశ.

తే॥ అనిశతావకసేవకు • లైనవారి కేదిహితమగునాకది • యేహితంబు
నీకరుణలేనిచో సుర • లోకరాజ్య వైభవంబైనవలదు కృ • పాసముద్ర.

తే॥ ముక్తికాంతాపరిగ్రహ ♦ ముంబొనర్చు తావకాచార సమయజని ♦ తమగుస్థైర్య
మనయమమ్మదికి లభియించు ♦ నట్టిపగిదిఁ గరుణఁజూడఁగదయ్య శం ♦ కరగిరీశ.

చ॥ కలుఁగరివేల్పులెందఱో జ ♦ గత్త్రితయావనదక్షులైన వా
రలమది వారలన్ విడిచి ♦ రాజకళాధర తావకార్చయే
యలఘుశుభాస్పదంబనుచు ♦ నాత్మఁదలంచితి సంతసంబు ని
ర్మలభవదీయ మంత్రజప ♦ రాజమునీడనియట్లుబ్రోవుమా.

తే॥ శైవజనమునందు ♦ శంకరార్చనయందు సత్యమందువిబుధ ♦ సముదయమున
యందుభక్తిగలుగు ♦ నట్టులఁగరుణింపు మయ్యశాంకరీమ ♦ నోబ్జభృంగ.

తే॥ ఎల్లవారలందు ♦ నీశ్వరభక్తుఁడై ప్రాణలింగపూజ ♦ భక్తిఁజేయు
నట్టివాఁడెయధికుఁ ♦ డని నిశ్చయించెడి తెలివిగూర్పుమయ్య ♦ దీనశరణ !

సీ॥ దైత్యాంతకాయ రు ♦ ద్రాయశాంతాయకా, లాగ్నిరూపాయ తు ♦ భ్యంనమోస్తు
శాంత్యతీతాయ కృ ♦ తాంతవిరోధాయ యఘవినాశాయ తు ♦ భ్యంనమోస్తు
విద్యాస్వరూపాయ ♦ వేదాంతవేద్యాయ హరివినుతాయ తు ♦ భ్యంనమోస్తు
ప్రాణలింగస్వరూ ♦ పాయభక్తావన చతురాయమామక ♦ శంకరాయ

వహ్నివర్చసేశ ♦ వాయప్రతిష్ఠాయ శంభవేసమస్త ♦ శంకరాయ
దుష్టశిక్షకాయ ♦ తుభ్యంనమోస్తని వినుతిసేయవలయు ♦ విశ్వసాధు.

వ॥ మఱియు నీశానముకుటుండును, బురుషాస్యుండును, నఘోరహృదయుండును, సదసద్వ్యక్తికారణుండును, బంచవక్త్రుండును, దశభుజుండును, నష్టత్రింశత్కలామయుండును, నగునీశ్వరుని స్మరించవలయు. అనంతరము కలామయుండగు సద్యమూర్తియెనిమిది విధంబులుగను, సర్వవ్యాపకుండును, ప్రభుండును, నగువామమూర్తిని త్రయోదశవిధంబులుగను, కలారూపసంస్థితుండగు నఘోరమూర్తి యెనిమిది విధంబులుగను, బంచమూర్తి విరాజితుండగు నీశానుని బంచవిధంబులుగను గల్పించి ప్రధానసహితుండును, ప్రళయోత్పత్తివర్జితుండును నణోరణీయుండును, స్థూలాతిస్థూలుండును, నూర్ధ్వరేతసుండును, సహస్రచరణుండును, నాదాన్తుండును, నాదవిగ్రహుండును, ఖద్యోతసదృశాకారుండును, జంద్రరేఖాకృతియు ద్వాదశాన్తభ్రూమధ్యతాలుమధ్య హృద్దేశసంస్థితుండును, స్వానందుండును, నమృతుండును, శివుండును విద్యుద్వలయసంకాశుండును, విద్యుత్కోటి సమప్రభుండును, శ్యామవర్ణుండును, రక్తకలాకారుండును, శక్తిత్రయకృతాసనుండును, తత్త్వత్రయసమన్వితుండును, విద్యామూర్తియగు దేవునిబూజించి,

తే॥ అనిమిషాధీశ్వరుఁడు మొద ♦ లైన లోకపాలకులఁ బూజసేయంగ ♦ వలయు నంతఁ
జరువు నాజ్జించి చంద్రశే • ఖరున కద్ది యర్పణముఁ జేయఁదగును శాస్త్రానుగతిని.

తే॥ భక్తినిరాజి సగము • ఫాలలోచనున కర్పణము జేసి శేష • భాగ మగ్ని
యందు వేల్చవలయు • నటుపైన ఘోరమంత్రార్థ ముచ్చరించి ♦ యాదరమున.

వ॥ శివార్పితంబగు దానిని శిష్యునకొసంగి "ఈశాన" యను మంత్రంబునఁ దాను బంచగవ్య ప్రాశనముఁ గావించి భూతిభూషిత గాత్రుండై 'వామదేవ' యను మంత్రంబున శిష్యునకు భస్మధారణఁ జేయఁదగు. పిమ్మట రుద్రదేవతాకమగు గాయత్రిని కర్ణంబుల సమాత్రంబులును సాపిధానంబులును వస్త్రయుగ్మవేష్టితములును హేమరత్నౌషధవాసితంబులును హిరణ్మయంబులునగు నైదు కలశంబులఁ బంచబ్రహ్మమంత్రంబులచే మండలముపై స్థాపించి యథాశక్తి చరు హోమముఁ గావింపవలయును.

తే॥ శంకరధ్యానపరుఁడగు ♦ ఛాత్రునపుడు తివిరి మండలదక్షిణ • దిక్కునందు
దర్భశయ్యాసనమునఁ ద ♦ ద్దయు వసింపఁజేయఁదగు దేశికుఁడు శిష్యు • నేమరసి.

క॥ పిమ్మట నఘోరయను మంత్రమ్మున ఘృతపూర్వకముగఁ • దగ ననలమునన్
నెమ్మిని నూటెనిమిదిమార్లిమ్మగ హోమంబుఁజేసి యెంతయుభక్తిన్.

వ॥ ప్రభాతంబున దుస్స్వప్నపరిహారంబును మలశోధనంబును గావించి.

తే॥ గతదినోపవాస • కలనఁబూతాంగుఁడై స్నాతుఁడై విశుద్ధ ♦ భూతిభూషి
తుండు విగతకల్మ • షుండునై నవవస్త్ర ధారియైనశిష్యు • దయదలిర్ప.

వ॥ దుకూలాదికములచే నేత్రబంధంబుఁ గావించి మండపమునకుఁ గొనివచ్చి "ఈశాన" యను మంత్రంబున సువర్ణపుష్ప మిశ్రితంబగు పుష్పాంజలిఁ గొని ప్రదక్షిణత్రయం బొనర్చి ప్రణవంబుచేనొండె రుద్రాధ్యాయంబుచేనొండె శివధ్యానంబుఁ జేయుచుఁ బుష్పాంజలి నీశానదిక్కునందు విడువవలయు. ఏమంత్రంబునఁ బుష్పంబు వడు నామంత్రం బాతనికి సిద్ధించు, శివోదకంబును నఘోరమంత్రపూతంబునగు భస్మంబును శిష్యుని శిరంబునఁ బ్రోక్షించి గంధపుష్పాదులచే నాతని నర్చింపవలయు. ఎల్లవర్ణంబులవారికిని బశ్చిమ ద్వారంబున మండపమునఁ బ్రవేశించు టుచితంబని చెప్పఁబడు. అందు క్షత్రియులకు బశ్చిమద్వార ప్రవేశము ముఖ్యము.

తే॥ అవ్విధిని శిష్యునర్చించి ♦ యతని నేత్ర బంధమువీసి పశ్చిమ ♦ ద్వారమునను
మండలంబునఁ జేర్చి క్ర • మంబు విడక వానినిఁ గుశాసనమునఁ • జేర్పంగవలయు

వ॥ గురుండు దక్షిణాభిముఖుండై పంచతత్త్వ ప్రకారంబులఁ దత్త్వశుద్ధిఁ గావించి నివృత్తికళచే రుద్రపర్యంతమగు నండంబును, బ్రతిష్ఠాకళచే నవ్యక్తగోచరంబగు తదూర్ధ్వంబును విద్యాకళచే విశ్వేశ్వరాంతంబగు తదూర్ధ్వమార్గంబును శోధించి శివభక్తిచే శివుని బొందింపవలయును.

సీ॥ భక్తిచెన్నలరఁ ద • త్త్వస్వరూపుండగు భోగేశ్వరస్వామి • పూజకొలసఁ
దత్త్వత్రయ ప్రభే • దంబున నొండె దత్త్వచతుష్టయము నొండె • భ్రాంతివీడి
యంగమంత్రంబున • యజియింపఁ గాఁదగు శాన్త్యతీతుండగు • శాంకరీశుఁ
బూని కా సద్యోజాత • ముఖ్యమంత్ర చతుష్టయంబున నొండె శా • న్త్యన్తమగను

శాంత్యతీతుని హరుని నీ • శానమంత్రమునను బ్రత్యేకముగ నూట • యెనిమిదిగను
హోమమొనరింపగా నగు • నుడుపమాళి కరుణవడయఁగఁగోరిన • గురుఁడుభక్తి.

తే॥ సరగ సమిదాజ్యచరు లాజ • సర్షపముల యవలఁ దిలలనుగొని హోమ మాచరింప
వలయుఁ బ్రణవాది స్వాహాంత • మెలమితోడ నంతఁ బూర్ణాహుతి నొసర్చు •
[ ట్వర్గ మగును.

తే॥ అరయఁ బ్రణవాద్యమైన 'స • హంస' యనెడు మంత్రమున 'నఘోర'యనెడు •
[ మంత్రమునను
విధిహితమగు బ్రాయశ్చిత్త • విధియగాన తజ్ఞులెఱుఁగంగ వలయు నింతయనుమదిని.

వ॥ జయాదిస్విష్టపర్యంతమగు నగ్నికార్యమును గుణసంఖ్యాప్రకారంబున బూర్వోక్తంబగు ప్రధానహోమంబుచే యోజింపనగు. పిమ్మట గురుండు మానయుక్తుండై పృథివ్యాది పంచభూతంబుల సద్యోజాతాది పంచబ్రహ్మమంత్రంబులతోడను బ్రాణాపానంబుల నీశానమంత్రంబుతోడను నియమించి షష్ఠమంత్రంబున నాత్మస్వరూపమగు బ్రణవవాదముతోఁగూడిన బ్రహ్మరంధ్రమును భేదించి బ్రహ్మ విష్ణు రుద్రుల బరస్పర ముపసంహరించి రుద్రునందు సంహారమూర్తియగు హరుని రుద్రు నీశాను నందును నుపసంహరించి యా రుద్రు నాత్మసృష్టి ప్రకారంబున ధ్యానింపదగు.

తే॥ ఇవ్విధంబున సద్గురుఁ • డిద్ధచరితుఁ డాగమోక్తప్రకారంబు • ననుసరించి
విధివిహితములం నగు మంత్ర • వితతిచేత నగ్నికార్యంబు నొనరింప • నర్హమగును.

తే॥ పొసఁగ లింగసంబంధంబు • నొసఁగునదియు చెలఁగి మలములమూటి నశింపఁజేయు
నదియునగు శైవదీక్షచే • నర్హుఁడైన శిష్యుని పవిత్రతమునిగాఁ • జేయవలయు.

సీ॥ అరయ వేధాత్మికం • బనఁగ మంత్రాత్మికమనఁ గ్రియాత్మికమన • నలరుచుండు
ద్రివిధంబులుగ శైవ • దీక్ష వేధాత్మికహస్త మస్తకయోగ • మమరుకతన

నొప్పు గురుండు • శిష్యుని కర్ణమునఁ జెప్ప మంత్రాత్మకంబన • మహిదనర్పు
శిష్యునికరమునఁ • జేర్పఁ గ్రియాత్మికమనఁదగు సకలపా • పాళిఁద్రోలి
గురుఁడు శిష్యునకును• గురుకొని శివదీక్షనొసఁగి ప్రాణలింగ మొత్తమగతి
గలుగుకొలుకు నీయ • గావలయును సర్వవేదవిహిత మిదియ • విప్రముఖ్య.

వ॥ అవిద్యా మహాకోశంబును ఛేదించి కళాభ్యాసముఁ జింతింపవలయు. కళననుస రించి భావంబును, భావంబువలె మనంబును మనంబు గతి దృష్టియు, దృష్టి చందంబున స్థలంబును, సుండఁదగు. ఉత్తమంబును సూక్ష్మంబును నగు కళయే మంత్రబోధిని యగు. అట్టికళ నాకర్షించి యథా న్యాయంబుగ లింగంబున నివేశిం పఁజేయువలయు. పిమ్మట నా లింగంబును శిష్యుని శరీరంబున యోజింపఁదగు. గురుండు తను క్రియాగతంబగు ననాదిమలంబును దీక్షాత్రయంబున దహించి శిష్యు నకు లింగత్రయంబు నొసంగవలయు.

తే॥ స్థూలమనఁగ మఱియు • సూక్ష్మంబునాగను కారణంబునాఁగ • శ్మాతలమునఁ
త్రివిధమగుచుఁ జెలఁగు • ధీజనవినుతమై లింగమఖిలపాప • భంగకరము.

తే॥ పుడమి స్థూలలింగ • మును దాల్చి మనుజులు కారణంబుఁ జెందఁ • గలుగుచుందు
రిలఁ జతుర్థముక్తి • హేతువౌ త్రిపుటి సంధాన మాచరింపఁ • దగునుభక్తి.

తే॥ భ్రమరకీటాగంబునను గీట • కము ధరిత్రి భ్రమరమేయై పొసంగిన • పగిది మాన
వుండు శివయోగమునను శి•వుండెయగును గానలింగధారణముముఖ్య•మయి వెలయు.

క॥ శివలింగధారియగువాఁ డవనిమనుజుఁడయ్యు శివుఁడె • యగుఁగావునఁ గే
శవ కమలాసన శక్రముఖవిబుధవర్గంబు దాల్చు • ఘనతరభక్తిన్.

క॥ శ్రుతిచయమును స్మృతులును శాస్త్రతతియును బురాణములును • సకలాగమముల్
క్షితి బ్రాహ్మణునకు లింగబలిభక్తి ధరించు టర్హ • మని బోధించున్.

తే॥ నిర్మలానంద విజ్ఞాన • నిధులు గౌతమాదిమానులు విజిత పా • పాఘులగుట
వినుతమగు లింగధారణ•మననె యనుచు నెలమి శివలింగమును•ధరియింపవలయు.

తే॥ వేదవిహితంబులగునట్టి • విధులయందు విప్రున కిదియె ముఖ్యమౌ • విధియటంచుఁ
బలువిధంబుల శాస్త్రముల్ • దెలుపుకతన నర్హమగు లింగధారణ • మగ్రజునకు.

చ॥ అరయగ గోచరంబగు చ • రాచర జంతుచయంబు లింగమం
దురు వడిఁబుట్టి నాశనము • నొందుటచే నది లింగసంజ్ఞచేఁ

బరఁగుచునుండు లింగము నె • బ్రహ్మమటంచు వచింత్రు దానికిన్
హరుఁడు విభుండుగావున మ • హాత్మ్యము దాని ధరింత్రు భక్తిమై.

తే॥ లింగము పవిత్రమగుటఁ ద • త్సంగతిమెయి నెట్టి యపవిత్రమగు తను • వేనిపూత
మై యలరు లింగధారి స • ర్వార్థసిద్ధి నొంది దేహాంతమున ముక్తి • నొందునిజము.

వ॥ పూర్వంబునఁ దపంబుఁ గావించిన యతండు తప్తతనుండనబరగు.

క॥ అరయ నతప్తతనుండగు నరుఁడును సంసారలక్షణ యుతుఁడు దీక్షా
విరహితుఁ డజ్ఞుండఘియును ధరణిని లింగంబుఁ దాల్పఁ • దగ రించుకయున్.

తే॥ లింగధారణం బ • భంగురగతి మోక్షము నిడునని యథర్వ • మునఁ గననగు
లింగమే సమస్త • ముం గూర్మి స్థాపించునని యజుస్సుపల్కు • ననవరతము.

క॥ దీక్షా కాలంబున యం దక్షయమహిమాఢ్యుఁడైన • యాచార్యుఁడు పా
పక్షయకరమగు లింగము దక్షుండగు శిష్యుహస్త • తలమున నిడుచున్.

తే॥ ఎట్టిమంత్రంబునన్ శార్వ • తీశువినుతి మదినొనర్చునయ్యది పాణి • మంత్రమనఁగ
నెఱుఁగదగు దానినిఁ బఠియించు • చిష్టసిద్ధికరమునగు లింగము ధరింపఁ • గావలయును.

క॥ పురహరుఁ బ్రతిపాదించున్ నరులఁ బవిత్రులుగఁ జేయు • నానార్థంబుల్
బరగించుఁ గాన లింగము పరమపవిత్రంబటంచుఁ • బలుకుదురు మునుల్.

తే॥ నడచుతతేఁ గూరుచుండిన • యెడను నిదురనొందు కాలంబునన్ స్వప్న • మొందునదన
మేలుకొనుచోనయిన నెట్టి • వేళనైన లింగము ధరింపఁదగును సం • త్సంగతిమెయి.

చ॥ అనయము లింగధారియగు • నాతఁడు శుద్ధుఁడునై మనోరమం
బును కలుషాపహంబునయి • భూనుతమై యలరారు లింగమున్
దన కరపీఠమందునిడి • తద్దయు భక్తి యథావిధిన్ సమ
ర్చనమొనరింపఁ గావలయు • స్వాంతము నిశ్చలమై సొసంగఁగన్.

తే॥ నిత్య నైమిత్తికంబులై • నెగడునట్టి కర్మబృందంబులను జగ • త్కర్తయైన
శివున కర్పించి శివపూజ • సేయునట్టివాఁడు పరమపదంబున • వఱలు నెపుడు.

తే॥ కర్మబృందంబునన్ జేసి • జ్ఞానియగును జ్ఞాన మానందమునకెల్లఁ • గారణంబు
జ్ఞానముననె కైవల్యంబు • గలుగుననుచు వేదవేత్తలు వచియింత్రు • విహితమతిని.

తే॥ తనకు నవిహితమైన కృ • త్యంబు సలుప కెలమిని నిషిద్ధమునువీడ • వలయు నెపుడు
బుడమిని నిషిద్ధపరిహార • ముననె విహితమును వహించును జిత్తంబు • మునులువొగడ.

తే॥ అక్కృతన సర్వయత్నంబు • లాచరించి నిత్యనైమిత్తికంబుల • నెగడఁజేసి
కామ్యమగు కర్మను విడువఁ • గావలయును శంకరార్చాపరుండయి • సంతతంబు.

వ॥ త్యాగమునఁదక్క కర్మబృందంబునను, బ్రజచేతను ధనంబుకతనను నమృతత్వము సంభవింపదు.

తే॥ కర్మ పాశరూపంబగుఁ • గానపాశవితతిబంధన హేతువై • వెలయుచుండు
నక్కృతనఁ గర్మమున నవి • ద్యాపటలము తొలఁగిపోదించుకేనియుఁ • దలఁపనిలను.

వ॥ అవిద్య కర్మజనకంబు గావున కర్మయవిద్యా నివర్తనంబుఁ గావింపనేరదు. అవిచ్ఛిన్నమగు తిమిర సంచయంబును దేజంబువోలె నజ్ఞానంబును జ్ఞానంబుహరించు. అవిద్యా నాశంబునఁజేసి మేఘాపాయంబునఁ జంద్రమండలమట్లు లింగమా ప్రకాశించు.

తే॥ కలుషజలముల నిర్మలం • బులుగఁజేసి కతకరేణువదృశ్యమా • గతినవిద్య
వలనఁ గలుషాత్ముఁడగుజీవు • నెలమివిమలు గాఁగనొనరించి నశియించు • జ్ఞానమిలను.

సీ॥ తలఁపరాగద్వేష • ములనుమూలంబగు సంసారమిల స్వప్న • సదృశమగును
అజ్ఞానమునశించు • నందాకయదియు నసత్యమైతోఁచు న • సంశయముగ
జ్ఞానోదయంబైన • కాలంబునసెమిథ్య యనియెదునట్టిప్ర • త్యయముగలుగు
తగశుక్తిపైరజ • తభ్రాంతివలెలింగ మెఱుఁగఁబడెడునట్టి • వఱకుజగము

సత్యమగుచువెలుఁగు • జాంబూనదంబున వలయము మొదలైన • వానిరీతి
నిత్యలింగమందు • నిఖిలశక్తులు బ్రకల్పనముఁ జేయఁబడున • వారతముగ.

వ॥ ద్రవ్యంబునందు రసవర్ణాది భేదమువలె నానోపాధి వంశంబున నామజాత్యాశ్రమాదులు లింగంబున నారోపింపఁబడు అచార్యలింగంబు ప్రథమంబు, గురులింగంబు ద్వితీయంబు, శివలింగంబు తృతీయంబు చరలింగంబు చతుర్థంబు ప్రసాదలింగంబు పంచమంబు మహాలింగంబు షష్ఠంబు, మఱియును భక్తస్థలంబనియు, మహేశ్వరస్థలమనియు, ప్రసాదస్థలమనియు, ప్రాణలింగస్థలమనియు, శరణస్థలమనియు, నైక్యస్థలమనియు స్థలము లాఱువిధంబులై పొసంగు.

సీ॥ పరగసహస్రార • పద్మగతుండిందు మండలమధ్యసం • భాసివామ
భాగస్థశక్తిసం • డాగమ వినుతుండు శుద్ధస్ఫటికవర్ణ • శోభితుండు

శ్వేతవస్త్రధరుండు • చిద్రూపితత్వ ప్రసూనమాల్యాది భూ • షుండు పరుఁడు
వరదుఁడు శంకరుం • డురుతరధైర్యుండు త్రిణయనుండు కృపాస• దృక్షిభుండు
దరహసిత ముఖాంబుజుఁడు వి • ద్వన్నుతుండు సంతతానందుఁడుత్తమ • చరతుఁడీశ్వ
రావతారుండయినగురు • నధికభక్తి జెలఁగ నావాహముఁజేయ • వలయునెలమి.

వ॥ మహేశ్వరుండు షట్చక్ర స్థానసంచారియు, జ్యోతీరూపుండునునగు. గురులింగం
బనియు, జరలింగంబనియు, నిష్టలింగంబనియుఁ బ్రశస్తిఁగన్న లింగంబొక్కటియ
స్వయంభువమనియు బాణంబనియు, నాకరజంబనియు బరంబనియుఁ జిల్లింగ
మనియు నానందమనియు జ్యోతిర్లింగంబనియుఁ గ్రమంబున సప్తవిధంబుల నలరు.

సీ॥ అరయబిందు స్వరూ • పామల మూలపీఠంబు నాదస్వరూ • పంబునైన
యూర్ధ్వపీఠముగల దుత్కళారూప తి ర్యగ్గతగోముఖా • ధ్యము మనోబ్జ
సంస్థంబు చిద్రూప • సదమలంబగు సిద్ధలింగంబు నాత్మన • భంగురగతి
దయయు నహింసయుం • ద్రియనిగ్రహముక్షమ జ్ఞానంబులను బ్రసూ• నములచేత

ధ్యానము తపంబు సత్యమ•యంబులైన క్రియలఁ బూజింపఁదగుదయా•మయుఁడఁ శివుఁడు
లింగరూపంబుఁబూనిచె • లింగుఁగాన ముక్తికాంతా సమాశ్లేష • మును వహింప.

వ॥ శివపూజాగమమునం దష్టాంగయోగము ముఖ్యముగావున దానినభ్యసించవలయు.
నిరంతర కృతాభ్యాసంబున జరామరణ వర్జితుండై మనియనంతరము ముక్తిఁ గాం
చును. పురుషుండు యమ నియమంబులచే భక్తస్థలియు, నాసనంబున మహేశ్వర
స్థలియుఁ బ్రాణాయామంబునఁ బ్రాణలింగస్థలియుఁ బ్రత్యాహారంబునఁ బ్రసాద
స్థలియు, ధ్యానధారణంబుల శరణస్థలియు సమాధిచే నైక్యస్థలియునగు. కావున
కర్మచేనొండె జ్ఞానంబుచేనొండె యష్టాంగమార్గంబున శివపూజఁ గావింపఁ
వలయు, అంతర్లింగాను సంధానము, ఆత్మవిద్యా పరిశ్రమము, గురూపాసనా
శక్తియు మోక్షసంపదకుఁ గారణంబులు. స్థిరచిత్తులును వైరాగ్యజ్ఞానయుక్తులును
నగు యోగుల కంతర్లింగాను సంధానమున బాహ్యశుద్ధి గలుగదు. అందువలన
శాస్త్రవేదియగు గురుఁడు కృపాసహితుండై యిడిన లింగంబును బూజింపవలయు.
పూజోపచార విధులచే శివాచార్యక్రమంబు ముప్పదియాఱు భేదంబులు గలిగి
యుండు. అందుఁ బూజ పంద్రెండు విధంబులు. ఉపచారమా లిరువదినాలుగు
విధములు అందుఁ బూజావిధు లెవ్వియన.

సీ॥ అమలభూత్యభ్యు • క్షణముస్నపనంబునం గారతాపనముని • ష్కల్మషమగు
భూతసంజీవనం • బుసుగంధిధూపప్ర సాగగంధావతం • సనములక్షు

తారోపణ సుమోప • హారణ దీపప్రకా శనములనైవేద్య • మును మఱియును
దాంబూలదానంబు • తగవసవప్రావ గణము నాఁబడు శివా • ర్చావిధులిల

సర్వకలుష నిచయ • సంహారకంబగు నీశ్వ రార్చనంబు • నెలమిఁజేసి
ముక్తుఁడగును ధరణి • భక్తుఁడీరీతుల నింక నుపచరించు • లెఱుకపఱతు.

సీ॥ ఆవాహనాసనా • ర్ఘ్యములు పాద్యాచమనము యజ్ఞోపవీ • తము మిగులను
మాల్యానులేపన • మండనంబులు ఛత్రచామరంబులునువీ • జనముదర్ప
ణంబుఘంటయును శం• ఖంబుగీతంబు వాద్యము మఱియును నృ• త్తముప్రదక్షి
ణము నమస్కృతి నుతి • నాడెమాయాచన సరసవిజ్ఞప్తి వి • సర్జనంబు

మొదలుగాదగు నుప • చారములనొనర్చి నిర్మలానంద విజ్ఞాన • నిధులరైన
మునులకును గోచరింపని • యనఘునీశుఁ దనయెడఁబ్రసన్నునిగఁజేయఁ • దగుసతంబు.

వ॥ పూజోపచారంబులు షట్త్రింశద్భేద భేదితంబులని శ్రుతుల వినంబడు. ఇంకఁ బూర్వోక్తంబులగు పూజోపచారంబుల యోగ్యక్రమంబు వక్కాణింతు నాకర్ణింపుము.

వ॥ శివభక్తి షట్త్రింశత్తత్త్వసంయుతంబని శ్రుతులు వక్కాణించు.

సీ॥ మొదట భస్మస్నాన • మున శుద్ధిఁగావించి పంచాక్షరీమంత్ర • పఠనఁజేసి
యామీఁదనాసనం • బర్థినొసంగి యావాహనంబొనరించి • పరుసతోడఁ
దనదేహమున లింగ • మును బ్రవిష్టముజేసి యమర భూత్యభ్యుక్ష • ణమునొనర్చి
యర్ఘ్యాదులొనరించి • యటుపయిస్నపన కర్మముజేసి పిమ్మట • మహితమగుచు

నలరునంగారతాపనా • దులనొనర్చి యజ్ఞసూత్రాది విజ్ఞాప • నాంతముగవి
సర్జనముఁజేసి లింగంబు • సరగస్వాంగ మున నివేశింపఁజేయుట • యనఘమగును.

క॥ ఈవిధి నిర్మలచిత్తుండై విడువకభక్తియుక్తుఁ • డైనిత్యము సం
భావించి లింగపూజన్ గావించిన సుకృతమెంచఁ • గలుగునె విధియున్.

తే॥ సకలలోకావనాసక్తి • సంచరించు టర్హమగుటను లింగము • ధ్యమునయందు
హరుఁడునివసించు నట్లౌటనందఱకిల నుచితమగులింగపూజ సే • యుటసతంబు.

క॥ సకల చరాచరలోక ప్రకరము లింగంబునడుమ • వసియించుటఁబూ
నిక లింగధారణంబున సకలంబుధరించినట్లు • జనుఁడునుతిఁ గనున్.

తే॥ ఏకవారలింగార్చన • మే సమస్తసౌఖ్యములఁగూర్చి మోక్షంబు • సంఘటింప
సంతతము లింగధారియై • చంద్రమౌళిఁ బూజసేసెడు నాతనిఁ • బొగడవశమే.

తే॥ భక్తియుక్తుఁడగుచుఁ • బ్రాణలింగము మేనఁ దాల్చి పూజసేయఁ • దలఁపఁడేని
యట్టియన్నశత్రుఁ • డవనికిభారమై తుదను ఘోరనరక • పదమునొందు.

తే॥ నూకరాంతంబులగుచును • శోచ్యములగు జన్మకోటి సహస్రముల్ • సంసృతిఁబడి
యుండఁదగు పాపియేయైన•నొక్కపరిగ ముక్తుఁడగుఁ బ్రాణలింగంబుఁ•బూజఁజేసి

చ॥ ఒకపరిలింగ పూజనము • నున్నతభక్తి నొనర్చునేని దుః
ఖకరము గర్భపాతమిఁకఁ • గల్గదనంగ నిరంతరంబుఁబూ
నికనొనరించు నాతనికి • నీరదసన్నిభగాత్రుఁడైనయం
తకుఁగనునట్టి పాతకము • గల్గునెనిత్యము ముక్తిగల్గదే.

క॥ పరమేశ్వరుండయిన పురహరు నర్చింపకయ దినుటకన్న నుసురులన్
ధరవిడుటొ శిరశ్ఛేదమొ వరమగు మనుజునకుఁ గలుష • వర్ధకమగుటన్.

తే॥ ఈశ్వరార్చనమొనరింప • కెవ్వఁడేని యుంచుకంతయును భుజింప • నేమి మాంస
భక్షణంబొనరించిన • పతితుఁడట్లు నిందితుండగు నరకంబు • నొందుమిగుల.

క॥ రుద్రార్పితము భుజించుట రుద్రవ్రతజలముఁగ్రోలి • రూఢిమెఱయఁగా
రుద్రాఘ్రాతముఁ బీల్చుట భద్రములకుఁ గారణంబుఁ • పరికింపంగన్.

తే॥ శివునకర్పణంబుఁ • జేయనిద్రవ్యంబు కరముముట్టరాదు • కనులఁజూడ
రాదటంచుశ్రుతుల • రహివినఁగాఁబడు నట్టులగుటసర్వ • మర్పణంబు.

సీ॥ తగశివనిర్మాల్య • ధారణంబునఁగల్గు సాలోక్యముక్తిని • స్సంశయంబు
హరుపాదజలపాన • మవిరళగతిఁగూర్చు సామీప్యముక్తిని . సంతతంబు
శంకరార్పితసత్ప్రసా • దోపభోగంబు శక్తంబుసారూప్య • ముక్తినొసఁగ
ననయంబు బ్రాణలింగార్చనంబొనగూర్చు సాయుజ్యముక్తిని • స్స్వాంతమలర

నన్నివిధములౌ ముక్తుల • కాస్పదంబు లింగధారణమిల సర్వ • సంగముక్తు
లైనవారికిఁ గూడఁజి • దాప్తిఁగూర్చు నిగ్గతాఘులఁగావించు • నిశ్చయంబు.

మ॥ విమలంబైన శివప్రసాదమునను • ర్విన్ శుద్ధభావంబులే
నిమనుష్యుండు రయంబునన్ నిరయమున్ • జేరున్ • మహానందకం
దమునౌ లింగమునందు మాడ్కిని బ్రసా • దంబందునన్ బూర్వభా
వములేకుండఁ జరింపఁగావలయు వి • ప్రాతుండు గాకింతయున్.

క॥ గురునెడ మానుషభావము పరికింపఁ బ్రసాదమునెడ • భావాంతరముఁ
బరమ శివలింగమునపై వరుసశిలాబుద్ధివాఁడు • బ్రహ్మఘ్నుండౌ.

తే॥ తలఁపమూఁడు కాల • ములనొండెనొక కాల మందునొండె యీశ్వ•రార్చనంబుఁ
జేసినంత ముక్తి • సిద్ధించునని పల్కు వేరసెప్ప నేల • వేయుగతుల.

తే॥ అగ్నిహోత్రాది యాగంబు • లధికదక్షి ణాకములనెన్ని జేసిన • నాకఫలద
ములగు నఖిలదానంబుల•సలుపుటయును దులయగునె యీశ్వరార్చనా•ఫలముతోడ.

తే॥ అధికభక్తిశంక • రార్చన మొనరించు వారలెల్ల మనసి • జారులరయ
నట్టివారు కరత • లామలకంబుగ ముక్తిఁ గాంచి సౌఖ్య • మును వహింత్రు.

క॥ రుద్రుండు గాని యాతఁడు రుద్రుని స్పృశియింపరాదు • రుద్రుఁడె భక్తిన్
రుద్రుని బూజింపఁగఁదగు రుద్రుండగునట్టివాఁడె • రుద్రుని జేరున్.

తే॥ లింగమున నెవ్వని మనంబు • లీనమగునొ యెవనివాక్కు లింగస్తుతి•నే యొనర్చు
నెవని కరములు లింగార్చ • నేచ్ఛ జెలఁగు నతఁడె రుద్రుండు సందియ • మంద నేల.

తే॥ కోటిగోదానములొనర్చి • కొనిన ఫలము నొక్కపరి యీశ్వరార్చన • మచిత రీతిఁ
జేసిన ఫలంబుతో సాటి • జేయనగునె యెల్లదానంబులను మించు • నీశుపూజ.

వ॥ చతుర్విధ పురుషార్థప్రదంబగు శివపూజాక్రమంబు సంగ్రహంబుగ వచియించి
నింక సౌరస్నానవిధి నెఱిఁగింతు నాకర్ణింపుమని శైలాది సనత్కుమారున కిట్లనియె.

—• సౌరస్నానవిధి •—

తే॥ నిర్మలాంతఃకరణుఁడయి • నెమ్మితోడ సూర్యదేవతాకములయి • సొబగుమీఱు
స్నానయాగాదికర్మముల్ • సలిపి పిదప నిందుశేఖరు ననుకంపఁ • జెందఁ గోరి.

వ॥ శివస్నానంబును భస్మస్నానంబును నీశ్వరార్చయు గావింపదగు.

సీ॥ షష్ఠమంత్రంబున • సరగమృత్తిక గొని భక్తిచే భూమిపై • పరగ నిల్పి
సౌరిద్వితీయంబున • బ్రోక్షణమొనరించి మూఁడవ మంత్రంబు • తోడ దాని
శోధించి నాల్గిట • సారిది విభాగంబు గావించి తొలిమంత్ర • కమున మలము
శోధించి యాఱిట • సొబగుమీఱగ స్నాన మొనరించి మఱియుత • క్కినమృదంబు

మూఁడు భాగంబులుగ జేసి • మొదముతోడ మధ్యమృత్తిక నాలవ • మంత్రమునను
పూత మొనరించి యాఱిట • బొసగ సప్త వారములు మూలమంత్రంబు • వలన మఱియు

తే॥ వామభాగస్థమృత్తిక • వరుసఁగొనియు షష్టమున దశవారముల్ • సరగదిశల
బంధనమొనర్చి యద్దాని • వలనమేను రాచికొని స్నానమును జేయ • రహిఁజెలంగు

వ॥ అట్లు స్నానంబొనర్చి భాస్కరుదలంచుచు శృంగజలముననొండె పర్ణపుటంబున నొండె పాలాశదళంబుననొండె దీప్తాస్యుండగు భాస్కరునకు సర్వసిద్ధికరంబులును శుభదాయకంబులునగు బాష్కలాది సౌరమంత్రముల చేతను నంగమంత్రముల చేతను నభిషేకముఁగావింపవలయు. సర్వవేదసారభూతం బై నవాక్షరయుతం బైనది బాష్కలంబు నాఁబడు. మఱియు నీమంత్రంబులఁ బఠించుచు శృంగాది పాత్రలచే దా నభిషేకముఁ గావించుకొనవలయు. విప్రక్షత్రియ వైశ్యులు కుశసహితంబగు తామ్రకుంభజలంబులచే స్నానంబుఁ గావించి రక్తవస్త్రపరీధానులై యహః కాలంబునను తత్తత్కాలోచితంబులగు మంత్రములచే నాచమనముఁజేసి షష్ట మంత్రంబున శుద్ధిగావించి యుత్తమంబగు మొదటి మంత్రంబు జపింపవలయు. వౌషడంతంబును నవాక్షర యుతంబునగు మూలమంత్రంబును కరశాఖలచేతను మధ్యమానామికలచేతను కరతలంబున తర్జన్యంగుష్ఠభాగంబులచే న్యాసంబుగావించి యంగమంత్రంబులచే శరీరంబును నవాక్షర మయంబుగావించి "సూర్యుండ నేన" యని చింతించి గంధవాసితంబులగు వామహస్తగత జలంబుల గుశపుంజము తోడఁ బ్రోక్షించుకొని యెనిమిది విధంబులగు మంత్రంబులచే జలంబును వామ నాసాపుటంబుచేత నాఘ్రాణంబుజేసి దేహంబున నీశ్వరు సంభావనంబుజేసి దేవ తలకును ఋషులకును భూతంబులకును పితృదేవతలకును యథావిధి తర్పణంబుఁజేయ దగు. ప్రాతర్మధ్యాహ్న సాహాయాహ్నంబుల వ్యాపినియుఁ బరయు జ్యోత్స్నయు నగు సంధ్యాదేవి నుపాసించి యర్ఘ్యం బొసంగవలయు. రక్తచందన తోయం బుచే నేకహస్తప్రమాణంబగు వృత్తమండలంబును రచించి ప్రాఙ్ముఖుండై గంధ యుతంబగు తామ్రపాత్రము నామండల మందునిచి రక్తచందన సంయుతంబగు జలంబుతోడను రక్తపుష్పంబులతోడను గుశాక్షత సమన్వితంబులగు తిలలతోడను దూర్వాపామార్గ గవ్యంబులతోడను కేవలఘృతంబుతోడను నవాక్షరమయం బగు మూలమంత్రంబుతోడను నిండించి మోకాళ్ళతో గూర్చుండి దేవదేవుం డగు నీశ్వరునకు నమస్కరించి యప్పాత్రంబును శిరంబునఁదాల్చి మూలమంత్రంబు చేత నర్ఘ్యమీయవలయు. ఇవ్విధంబున సౌరార్ఘ్యంబుగావించి మానవుండయు తంబులగు నశ్వమేధయాగంబులఁ గావించి పొందుఫలంబునకంటె నధికంబగు ఫలంబునొందును. అట్లు సూర్యునకర్ఘ్యంబిడి భక్తియుక్తుండై యీశ్వరార్చనముఁ గావింపఁదగు. ఇంక నాగ్నేయ స్నానంబువినుము. దంతధావనాదికంబగు సౌర స్నానంబును శివస్నానంబును గావించి తీర్థస్థలంబున విఘ్నేశ్వరుని వరుణుని గురు వును బూజించి పద్మాసనస్థుండై తీర్థంబునుబూజించి యద్దానిం గ్రహించి యర్ఘ్యం బుఁగావించుచు పూజాస్థానముఁ బ్రవేశించి పూర్వంబువలె కరవిన్యాసంబును దేహ

విన్యాసంబును జేసి పద్మాసనంబు వేసి ప్రాణాయామంబుఁ జేయవలయును. కమలంబు మున్నగు రక్తపుష్పంబుల గ్రహించి జలభాండంబును తనదక్షిణభాగంబుననుంచి వామభాగంబున సారంబులగు తామ్రపాత్రములనుంచవలయును. అర్ఘ్యపాత్రంబును దీసికొని పూర్వోక్తంబగు జలంబుచే జలభాండంబునఁ బ్రక్షాళనంబు గావించి యర్ఘ్యద్రవ్య సమన్వితమగు నర్ఘ్యంబును బ్రథమమంత్రంబుచేఁ బూజించి నాల్గవదాన నవకుంఠనముఁ జేసి తనయందు స్థాపనజేసి గంధపుష్ప సమన్వితంబునగు పాద్యము జలశుద్ధంబగు పాత్రమున వేరువేరుగనుంచి సంహితావిన్యాసంబును కవచావకుంఠనంబును జేసి యర్ఘ్యజలంబులఁ బూజాద్రవ్యములఁ బ్రోక్షించి సర్వదేవ నమస్కృతుండగు నాదిత్యుని యథోక్తమంత్రంబున నమస్కరించి యద్దేవున కాగ్నేయాది కోణంబుల మధ్యమాంతంబుగ నాసనంబుఁ గల్పించి ప్రభూతంబును విమలంబును సారంబును నారాధ్యంబును బరమంబునగు నంగవిన్యాసము జేసి సుషిర సంయుక్తంబును సూత్రకంటక సంయుతంబును శ్వేతంబును హేమాభంబును రక్తవర్ణంబును గర్ణికాకేశరోపేతంబును, భాస్కరాభిముఖంబులగు దీప్తయు సూక్ష్మయు జయయు భద్రయు విభూతియు విమలయు నఘోరయు విద్యుత్తనియెడి శక్త్యష్టకంబు గూడిన బీజంబు నాగ్నేయాదికోణంబులందు మధ్యమాంతంబులుగ నుంచి పూజామంటపమధ్యమున దేవి నిస్థాపించి భాస్కరోక్తంబగు నవాక్షరమంత్రంబుచే సూర్యదేవు నావాహన మొనర్చి పద్మముద్రఁ బట్టవలయు. మూలమంత్రంబుచే సూర్యున కర్ఘ్యంబిడి యాచమనం బొసగి మరల భాస్కరమంత్రంబుచే నర్ఘ్యమిడవలయును. అనంతరము రక్తపద్మంబులును రక్తపుష్పంబులును రక్తచందనము ధూపదీప నైవేద్యవస్త్ర తాంబూలాదుల భాస్కరమంత్రంబుననే సమర్పించవలయు. ఆగ్నేయంబునను నైఋతిని వాయువ్యంబునఁ బూర్వంబునఁ బశ్చిమంబునను నాలువిధంబులఁ బూజ గావించు టుచితంబు. ప్రణవాదినమోన్తంబుగ నేత్రాంతం బచరించి కర్ణికావిన్యాసంబుఁ జేసి రూపకధ్యానంబు గావింపవలయు. దంష్ట్రికరాళ వదనుండును, భయంకరుండును, వరదంబగు దక్షిణహస్తంబును, పద్మాలంకృతంబగు వామహస్తంబును, గలవాఁడును, సర్వాభరణసంపన్నులును, రక్తస్రగ్ధరులును, రక్తాంబరధరులగు మూర్తులు పార్శ్వంబుల వెలయువాఁడును, సింధూరారుణ విగ్రహుండును పద్మహస్తుండును, ద్విహస్తుండును, ద్వినయనుండును, రక్తాభరణ సంయుక్తుండుసు, రక్తస్రగనులిప్తుండును నగు భాస్కరుని ధ్యానమాగావించి సాయుధులును, సాలంకారులును, నగు సోమాంగారకబుధ బృహస్పతి భార్గవశనైశ్చర రాహుకేతుముఖగ్రహంబులఁ బ్రణవాదినమోంతంబుగఁ బూజించి పరమేశ్వరునకు బహిర్భాగంబున సప్తగణంబులను, ఋషులను, దేవగంధర్వులను, పన్నగులను నప్సరోగణంబును, గ్రామణులను, యాతుధానులను, యక్షులను, సప్తాశ్వంబులను, బూజింపవలయు; వారికర్ఘ్యమొసఁగి యుద్వాసనము గావించి సహ

స్రంబొండె నష్టోత్తరశతంబొండె బాష్కలమంత్రంబుజపించి దశాంశంబు హోమం బుగావింపవలయు. వర్తులంబును, నేకమేఖలంబును, చతురంగుళ ప్రమాణంబును, నిత్య నైమిత్తికంబుల నేకహస్తప్రమాణంబును, నశ్వత్థదళాకారంబును, దశాంగుళ ప్రమాణంబగునాభిగలదియు, నగు కుండంబును పూజాస్థానమునకుఁ బశ్చిమభాగంబున నేర్పరచి యందు హోమంబుఁగావింపవలయును.

తే॥ ఇవ్విధిని సూర్యుఁ బూజించి • హృదయపీఠి సకలలోకైక రక్షావి • చక్షణుఁడగు
శైలజా నాయకుని పూజ • సలుపవలయు నిష్కపటభక్తిగలిగిన • నృతతికెపుడు.

సీ॥ ఇది సంగ్రహముగ నీ • కెఱిఁగించితీ సూర్యయజనంబు పాపభ • యంకరంబు
దృఢభక్తి నెవ్వండ • యేని యవ్విధి వరుఁ బూజించునేని యా • పుణ్యాత్ముఁడు
పాపవిముక్తుఁడై • బహుధనోపేతుఁడై పుత్రమిత్రకళత్ర • పౌత్రసుభట
సంతానవంతుఁడై • సతతంబు వివిధభోగంబులఁ జెంది సు • ఖంబు వెలయఁ

బరమునకా బెద్దకాలమా • పద్మమిత్రుఁగూడి సుఖముండి పిమ్మట • జోడులేని
ఠీవి నరపాలకుండయి • యీ వసుమతి జననముకా జెందు ధార్మికస్వామియగుచు.

క॥ అనిపలికి నందికేశ్వరుఁడనఘుఁడగు విరించి సూను • నాదరమునఁ గ
న్గొని యుత్సాహము పెంపునఁ గనుగవఁ గరుణారసంబు • కణములు వెలయకా.

—• అఘోరార్చనవిధి •—

తే॥ ఈశ్వరధ్యానపరుఁడయి • యుద్ధచరితుఁడైన శివభక్తవర్యుఁడౌ • నగ్రజుండు
సదమలజ్ఞానపూర్ణుఁడై • సాధుభక్తి లింగపూజ యొనర్చు స • త్సంగతిమెయి.

వ॥ అగ్నిహోత్రజంబగు భస్మంబును తదుక్తమంత్రంబున నాపాదతల మస్తకంబగు దేహంబున నుద్ధూళనము గావించి యుదఙ్ముఖుండై బ్రహ్మతీర్థంబున నాచమనము శేసి పంచాక్షరీ మంత్రంబున శరీరంబును బవిత్రము గావించుకొని పరమేశ్వరు బ్రణవమంత్రంబున బూజింపవలయు. అఘోరరూపుండగు నీశ్వరు బూజించుట యెల్లపూజలకన్న నధికఫలదంబని యండ్రు. సమస్తంబగు నగ్నికార్యంబు సామాన్యంబయ్యును నఘోర దేవతామంత్రంబు మాత్రము వేరుగఁ జెప్పంబడు. అఘమర్షణ స్నానముఁ గావించి తర్పణార్ఘ్యపూర్వంబుగ సూర్యార్చనజేసి యఘోర దేవు లింగంబున నొండె స్థండిలంబున నొండెఁ బూజింపవలయు. స్థండిలపూజ కన్న లింగపూజయే కోటిగుణితంబు.

తే॥ అనవరత లింగపూజారతాత్ముఁ డెట్టి కలుష మొనరించియును నరకంబునొందఁ
దబ్జపత్రంబు జలముల నంటుకొనియు నాద్రతా భావంబుజెందని? యట్లుజగతి.

తే॥ పుణ్యదము లింగదర్శనం బు వసుమతిని దర్శనముకన్న నధికంబు స్పర్శనంబు
స్పర్శనంబునకన్నఁ బూ జాఫలంబు కోటిగుణితంబనుచు బుధ కోటియంద్రు.

వ॥ అని వచించెనని జయాభిషేకము పలికిన సంతుష్టహృదయులై నైమిశీయులు
సూతుంగాంచి.

తే॥ ధీరనుతమఘోర దేవసమర్పనా క్రమమువింటిమింకఁ గ్రతుభుగధిప
సేవ్యమగు జయాభిషేకం బెతెంగించి సుకృతమును ఘటింపు సూరివినుత.

తే॥ నృపతిహితమాఁగోరి నీలకంఠుఁడు తొల్లి స్వర్ణనగము శిఖరభాగమందు
వినిచెననఘుఁడైన మనువునకు జయాభి షేకమంచు మాకుఁ జెప్పితీవు.

తే॥ శ్రీదమగు జయాభిషేకంబు షోడశ విధములెట్టులయ్యె వీనులలరఁ
దెలుపుడనుడు మౌని తిలకుండు సూతుండు వారి కిట్టులనుచుఁ బలికెనపుడు.

క॥ మనువులలో స్వాయంభువ మనువు సకల ధర్మవేత్త మహితగుణాఢ్యుం
డనఘుఁడు తొల్లి యొకప్పుడు కనకగిరీంద్రమున వేడ్క గడలంకొనంగన్.

తే॥ అఘవినాశకమైన జ యాభిషేక మహిమ మెఱుఁగఁగఁగోరియు మామనోబ్జ
రాజమధుపంబయిన యుడు రాజమౌళిఁగుఱించి కఠిన తపమొనర్చెఁగొదుకులేక

తే॥ అటులఁదపముసేయు నాతని భక్తికి సంతసించి మౌని సన్నుతుండు
చంద్రశేఖరుఁడు ప్ర సన్నుండగుటయు స్వాయంభువుండు నయధయంబులలర

తే॥ వినయనమితోత్తమాంగుఁడై మనువుహరుని బహువిధంబుల వినుతించి పాపనిచయ
హారమగుజయాభిషేకమా హాత్మ్యమెఱుఁగఁదెల్పుమని వేడుకొనుటయుఁ ద్రిపురవైరి.

చ॥ కరుణదలిర్పనమ్మనువుఁ గన్గొని పల్కెహసన్ముఖాబ్జుఁడై
నిరతమెవాఁడు భక్తియును నిష్ఠయుఁగల్గి మదీయపాదపం
కరుహము లాశ్రయించెడినొ యాతఁడె దక్కజయాభిషేకముం
గరమెఱుఁగంగనేర్చునె యు కండు తపంబుల చేయుసల్పినన్.

క॥ ఇది సకలవేదసారం బిది సుకృతాస్పదము దీని నెవఁడేని ముదం
బొదవవినఁగోరు నాతని నెదమెచ్చి యొసంగుచుందు నిష్టార్థంబుల్.

తే॥ ఆయురభివృద్ధియగును ధ॥ ర్మార్థకామ మోక్షములు సంఘటిల్లు రిపుప్రకాండ
మంతరించు సమస్త సౌ ॥ ఖ్యములుంగల్గు గలుషహరము జయాభిషే ॥ కంబుకతన.

చ॥ సమరము సంభవించునెడ ॥ శత్రుజిగీష గలట్టి ఱేఁడుస
క్రమమగు పద్ధతిం గొని ని ॥ రంతరభక్తి మెయిం జయాభిషే
కము నొనరించి నాకు నధి ॥ కంబగు తృప్తిని గూర్చునేని యు
ద్ధమున జయంబుఁగాంచి విశ ॥ దంబగు కీర్తి గడించు నెంతయుఁ.

తే॥ అసురహృతరాజ్య సర్వస్వుఁడైన శక్రు డిమ్మహాభిషేకముఁజేసి ॥ నెమ్మిసకల
రాజ్యముజయించి నిఖిలభ॥ద్రములనొంది తనదుశక్రత్వమును నిల్పుకొనియెమున్ను.

తే॥ మానినాధవినుత ॥ మైన జయాభిషేచనమొనర్చి పద్మ ॥ సంభవుండు
ప్రథితమై తనర్చు ॥ బ్రహ్మత్వముం గాంచి సృష్టికర్తయగుచుఁ ॥ జెలఁగె ధరణి.

సీ॥ శ్రీనాధుఁడీ యభి ॥ షేకంబుఁ గావించి విష్ణుత్వముంబొంది ॥ విమలకీర్తిఁ
గడియించినాఁడంబి ॥ కాదేవియంబిక యగుచును సౌభాగ్య ॥ మందిమించె
సావిత్రిలక్ష్మియు ॥ సకలభోగములు మాంగల్యాభివృద్ధియుఁ ॥ గాంచియలరి
రనఘుఁడా శైలాది ॥ యును మృత్యువుజయించి మృత్యుహీనుండయి ॥ మించెమున్ను
తారకుండను దనుజనే ॥ తయు సమస్త భువనపతియయ్యెను నృసింహ ॥ మూర్తికనక
కశిపుని జయింపఁగా నేర్చెఁ॥ గార్తికేయుఁ డుగ్రుఁడైఁ తారకు జయించె॥యుద్ధభూమి.

తే॥ తొల్లి సుందోపసుందపుత్రులు జగత్త్రయంబు బాధించుచున్నెడ ॥ నంబయీజ
యాభిషేకంబొనర్చి యా ॥ హవతలమునఁ జెలఁగి వారి వధించి ర ॥ క్షించెజగము.

వ॥ మఱియు మున్నొకప్పుడు దేవదానవులకు మహాఘోరంబగు పోరు సాగినప్పుడు రక్కసు లుక్కుమిగిలి యొక్కుమ్మడి పైఁబడి బాధించుచుండ సైపలేక వేల్పులెల్ల నలువకడ కరిగి శత్రుజయోపాయం బెఱిఁగింపుమనుటయు నాతండు వారికి జయాభిషేకం బుపదేశించె. దానఁజేసి యాదితేయులు దైత్యుల జయించి సుఖంబుఁ గాంచిరి. కావున జయాభిలాష గల నరవరుండు జయాభిషేకంబు ముఖ్యంబుగ నొనర్పందగు.

తే॥ కల్పకోటిశతార్జిత ॥ కలుషవితతి తొలఁగి చనుమానవుండు ని ॥ ర్మలినుఁడగుచు
నెట్టి మునికేనిఁ జెందరా ॥ నట్టి సుకృతమందు నీ యభిషేకంబు ॥ నాచరించి.

వ॥ చత్వారింశన్మహావ్యూహాత్మకంబును సహస్రకలశసమన్వితంబును ననేకావరణశోభితంబును సుభద్రాది మహాశక్తిసంయుతంబగు నీజయాభిషేకంబుఁ గావించిన భూనాధుండు క్షయాపస్మార విపిధవ్యాధిముక్తుడై విజయోపేతుండై జనానురాగసం

పన్నుండై మారటదేవేంద్రుండునాఁబరఁగిఁ పాపహీనుండై సకల శుభంబుల నొందు
నని వచియించి నీలలోహితుండంతర్హితుండయ్యె నప్పుడు.

క॥ స్వాయంభువమనువు జగద్ధేయమగు సదాశివోప • దేశంబునఁ బ్ర
జ్ఞాయుధ్ధన సత్పుత్ర శ్రేయస్కరమగు జయాభి • షేకము సలిపెన్.

తే॥ అవ్విధి జయాభిషేకంబు • నాచరించ కలుషసంహరు నద్రిజా• కాంతువినుతి
జేసి కృతినైతి ననుచు ని•శ్చింత నచటఁ గనుగొనియెను సనత్కుమా•రుని ముదమున.

చ॥ కని యెనలేనిభక్తిఁబరికంపితగాత్రుఁడునై సనత్కుమా
రునకు జోహారు సేసిన స • రోజభవాత్మజుఁ డమ్మనీంద్రుడా
తని కుశలంబు నారసి ప • దంపడి యిట్లనిపల్కెఁ బల్కునన్
గనికరఁపున్ గణంబు లొలు • కన్ విమలార్థగభీరమై తగన్.

తే॥ ఎట్టివారికైన • నెఱుఁగంగ రాని జయాభిషేక మహిమ • మంధకారి
కరుణఁ దెలిసికొంటి • వఘములఁ బాసితి కలఁడె నిన్నువంటి • యలఘుఁడిలను.

క॥ ఏవిషయ మెఱుఁగఁదలఁచితి నావలనన్ సకలలోక • నాథుఁడు శంభుం
డే వినిచెఁ గద సమస్తము నావుడు మనువిట్టులనియె • నయమెసఁగంగన్.

తే॥ హరుఁడు సర్వజ్ఞుఁడగుట నా•కఖిలవిషయముల నెఱింగించెఁ గరతలా•మలకములుగ
నన్నియును వింటి నైన న• య్యంధకారి నడుగమఱచితి నొకవిష • యంబునపుడు.

వ॥ సమస్తలోకాకాంక్షితంబగు నిర్వృతికి సాధనంబు కేవలకర్మంబో జ్ఞానంబో లేక
కర్మజ్ఞానమిశ్రమంబో తెలియవలతుననిన స్వాయంభువ మనువునకు సనత్కుమారుం
డిట్లనియె.

తే॥ కర్మమున లభించు • జ్ఞాన మద్దానిచే నిర్వృతిని గడించు • నృనిచయంబు
కాన చిత్తశుద్ధి • గలిగెడు నందాక కర్మమాచరింపఁ • గావలయును.

తే॥ ముక్తికాంతాలయమనకు•మూఁడు మెట్లుకర్మమును జ్ఞానమును భక్తి• కాండమనఁగ
వానఁగర్మంబునన్ జేసి • జ్ఞానసిద్ధి గలుగునద్దానమానవుం • డలరునెపుడు.

వ॥ అనేక జన్మార్జితంబగు సుకృతంబునన్ గాక శివజ్ఞానంబు లభించదు. పరమే
శ్వరునకుఁ బామరలోకంబు నుద్ధరించుట యత్యావశ్యకంబగుడు శివసాయుజ్యసాధ
నంబగు జ్ఞానంబు లభించుటకై సంతతికిఁ గర్మరూపంబులగు శివపూజాదికృత్యంబు
లును తులాపురుషాది మహాదానంబులును శ్రుతివిహితంబుగ విధింపఁబడియె.

అందుముఖ్యంబు లింగార్చనంబు దాననాలయస్థలింగపూజకన్నఁ గరస్థలింగపూజయే శ్రేష్ఠంబు. కావున బ్రహ్మ విష్ణ్వాది సురలును గౌతమాదిమునులును లింగ ధారణంబుఁ గావించుకొని తత్పూజామహిమఁ జేసి యాప్సితసిద్ధి నొందిరి. ఈశ్వ రప్రసాదాహర్హుఁడవగు నీవును లింగధారివికమ్మనిచెప్పి హిరణ్యగర్భదాన విధియుఁ దిలపర్వదాన విధియు సువర్ణమేదినీదాన విధియుఁ గల్పపాదపదానవిధియు గణేశ దాన విధియు హేమధేనుదానవిధియు లక్ష్మీదానవిధియుఁ దిలధేనుదానవిధియు గోసహస్రదానవిధియు హిరణ్యాశ్వదానవిధియుఁ గన్యాదానవిధియు స్వర్ణవృషభ దానవిధియు గజదానవిధియు సర్వదానవిధియు జీవచ్ఛ్రాద్ధవిధియు లింగాదిప్రతిష్ఠా విధియు లింగస్థాపనవిధియు సర్వదేవతాప్రతిష్ఠావిధియు సంగ్రహంబుగఁ జెప్పెనని చెప్పిన

—◆ హోమద్రవ్య విశేషవిధి ◆—

తే|| మునికాయంబు సూతుఁ గ ◆ న్గొని మహాత్మ! తెలిపితివి శంభుకథలను◆ తేటపడఁగ
నమ్మహాదేవుఁ బూజించు ◆ నట్టితెఱఁగు నింక వినిపింపు వీనుల ◆ కెలమిగలుఁగ.

తే|| అనిన సూతుఁ డిట్టు ◆ లనియె వారలతోడ నంగమంత్రయుక్త ◆ మగు నఘోర
మంత్రపూర్వకముగ ◆ మహితశుభప్రదుఁ డతని బూజసేయ ◆ నగు ఫలంబు.

సీ|| అవ్విధంబున నగ్ని ◆ నర్చించి దధిమధు సర్పియుతంబుగ ◆ సరగ వేయి
యొండె తదర్థంబు ◆ నొండె యష్టోత్తరశత మొండె తిలలచే ◆ శ్రుతిహితముగ
హోమంబొనర్చుట ◆ యుచితమాదధిసక్త మధుహోమమార్తిప్ర ◆ మార్జనంబు
తిలహోమమిలరోగ ◆ ములను దొలంగించి సకలసంపదలనొ ◆ సంగుచుండు

వేయిదైనమహాభూతి ◆ వెలయునెపుడు శతమువ్యాధి నాశకరంబ ◆ సంశయంబు
సతతమష్టోత్తరశతంబు ◆ సలుపనిఖిల దుఃఖములబాసినరుఁడు సం ◆ తోషమొందు.

తే|| అరయనష్టోత్తరసహస్ర ◆ మాచరించి సిద్ధుఁడైపుట్టునిరతంబు ◆ క్షీరమునను
వేయిహోమంబుగావించి ◆ విగతరోగుఁ డగును సందేహమేలని ◆ త్యానుభూతి.

వ|| ఒకమాసము త్రికాలంబుగఁ బయస్సుచే హోమంబుఁజేసిన మహాభాగ్యంబు సిద్ధించు క్షుద్రాజ్య దధిసంయుతంబగు సంవత్సర హోమంబుచేతను, జాతితండుల యుతంబగు యవక్షీర హోమంబుచేతను భగవంతుండగు నఘోరేశుండు సంతృప్తుం డగు దధిచే రాజపుష్టియు, షాణ్మాసిక ఘృతహోమంబున వ్యాధి నాశనంబును, సంవత్సర తిలహోమంబునున రాజయక్ష్మాది హారంబునునగును. యవహోమవిధి

నాయుష్యంబును, ఘృతంబున జయంబును గలుగు. మధుమిశ్రితంబగు తిలహోమంబున సర్వకుష్ఠక్షయంబునునగును. ఆజ్యక్షీర మధువులు మధుత్రయంబనంబడు,ఆట్టి మధుహోమంబున భగందరంబు నివారించు. కేవలఘృతము సర్వరోగక్షయంబగు. అఘోరధ్యానంబును, నఘోరప్రతిష్టయు, నర్చనంబును, సర్వవ్యాధి నాశకంబగు. ఈరహస్యంబు శైలాదివలన సనత్కుమారుండును వాతని ముఖంబునఁ బరాశరుండును, 'నమ్మహర్షి వలన నేనును దెలిసికొంటి మనిన సూతునకా మునిపుంగవు లిట్లనిరి.

## —• ఆభిచారిక విశేషవిధి •—

తే॥ సాపగాధులైన • సాత్రవులనఘోర విభుఁడు నిగ్రహించి • వీతశుభులఁ
జేయునంచుమున్ను • చెప్పితివదియెట్లు విశదపరపుమయ్య • వీనులలర.

తే॥ ఈవెఱుంగని వైదిక • మేనిశ్రౌత మేనిస్మార్తంబు నేనియు • నెందుగలుగ
దనఘునీకరుణఁగదా • యఖిలవిషయములను వినెడునదృష్టంబు • గలుగుచుండు.

తే॥ అనినసూతుఁడిట్టు • లనియెనియ్యర్థంబె తొల్లికనకనేత్రుఁ • డుల్లమలర
భృగుసుతుండువల్క • ప్రీతితోడ నెఱింగి తత్ప్రభావమునను • ధన్యుఁడయ్యె.

ఉ॥ అతఁడఘోరనిగ్రహమ • హత్వమునన్ రణసీమదేవతా
వ్రాతము నెల్లగెల్చి పరి • పంథి కులక్షయకారకుండునై
యాతతశౌర్యతేజముల • కాస్పదుఁడై పరమేశు సత్కృపన్
ఖ్యాతచరిత్రు నాత్మజుని • గాంచెగణాధిపు నంధకాభిధున్.

తే॥ స్త్రీలబాలురగోవులఁ • జెలఁగియిడుము లొందఁజేసెడి కనకాక్షు • నోర్చియొకరుఁ
డేనివిజయంబుఁగొననేరఁ • డించుకేని • యలతియె యఘోరనిగ్రహం • బనధరిత్రి.

తే॥ తనకఘోరనిగ్రహశక్తి • జనితమైన ప్రోఢతనముగలదటంచుఁ • బూనిధర్మ
హానియొనరించునాకన • కాక్షునందు నిష్ఫలత్వమొందెనఘోర • నిగ్రహంబు.

ఆ॥ అట్టికారణమున • నతఁడొకకొంతకా లంబుజనినయంత • లావుదొఱఁగి
యాహవమున నిహతుఁ • డయ్యెవరాహరూపుఁడగువిష్ణుకోప • మునను జేసి.

క॥ కావునసీనిగ్రహమున్ దేవబ్రాహ్మణులయందు • దీనులయెడలన్
గోవులయెడ ననదలపై గావింపఁగరాదఘోర • కరుణాస్పదులై

తే॥ చంపనుద్యుక్తుఁడైనట్టి • శత్రునందుఁ గాకయేనరపతికైనఁ • గాని దీని
బ్రాహ్మణులయెడనొనిజ • రాష్ట్రమందొ సలుపరాదుప్రమాదంబు • వలననైన

తే॥ కలనఁ దనబలమునశించు • కతనఁ దనకు నపజయము సంభవింపను • న్నృపుఁడధర్మ
సంగరంబు ప్రాప్తించిన • సమయమందు దీనినొనరింపఁదగు నర • దేవులకిల.

తే॥ ఘోరరూపుఁడగున • ఘోరదేవునిలక్ష జపమొనర్చి తద్దశ • మగుభాగ
మునను దిలలతోడ • మనుకొనిహోమంబుఁ జేయఁదగునభీష్ట • సిద్ధిఁగూర్చి.

వ॥ లక్షసంఖ్యాకంబులగు శ్వేతపుష్పంబులతో బాణలింగమునందొండె దక్షిణామూర్తి నాశ్రయించియొండె పూజించిన నఖిల సిద్ధియగు. మంత్రసిద్ధిగల బ్రాహ్మణుండీ నిగ్రహప్రయోగంబును బ్రేతస్థానంబున నొండె, మాతృస్థానంబుననొండె స్వార్థంబుఁగోరియైనను నృపార్థంబైనను చేయవలయును. పూర్వాదీశానాంతంబు శూలకపాల పాశదండ శరాశనబాణ డమరు ఖడ్గాద్యష్టవిధంబులగు నాయుధంబులఁగూర్చి త్రిశిఖలును త్రిశూలంబును జతుర్వింశతి శిఖాగ్రంబులును జేర్చి యఘోర నిగ్రహంబు గావింపవలయు. అష్టహస్తుండును, వరదుండును, నీలకంఠుండును, దిగంబరుండును, బంచతత్వసమారూఢుండును, నర్ధచంద్రధరుండును దంష్ట్రాకరాళ వదనుండును, రౌద్రదృష్టియు, భయంకరుండును, హుంఫట్కార మహాశబ్ద శబ్దితాఖిల దిఙ్ముఖుండును నగు నఘోరేశ్వరు భక్తియుక్తుఁడై.

తే॥ నాగచర్మవసను • నాగపాశసుబద్ధ మకుటు నీలమేఘ • నికరకల్ప
నిస్వనుఁ ద్రినేత్రు • నీలాంజనాద్రిసన్నిభు నఘోరదేవు • నిష్ఠఁగొల్తు.

తే॥ భూతములును బ్రేత • ములుఁ బిశాచంబులు ఢాకినులునుగొల్వ • లోకనేత్ర
తావిరాజితుఁడయి • తనరునఘోరేశు నాశ్రయింతు వాంఛి • తాప్తికొఱకు.

వ॥ అట్లు ధ్యానించి షట్త్రింశదుక్తమాత్రలచేతను, బ్రాణాయామంబులచేతను, మహాముద్ర నవలంబించి సర్వకర్మము లాచరించి ప్రేతస్థానంబునందలి చితాగ్నియందుఁ బూర్వాపరదక్షిణోత్తరదిశల యథోక్తంబులగు హోమకుండంబుల నిర్మింపవలయు. పిమ్మట నాచార్యుండు మధ్యకుండంబునందలి పీఠంబున నాసీనుండై తక్కిన దిక్కుండములందు సాధకుల నాసీనులఁగావించి ద్వాదశాక్షరయుతంబగు నఘోర మంత్రంబున నఘోరేశు ధ్యానించి విభీత కాష్టంబున ద్వాదశాంగుల ప్రమాణంబుగ శత్రువిగ్రహంబు నొనరించి పీఠంబున నునిచి పిమ్మట నవ్విగ్రహంబును బొగ్గుల తోడఁ గుండమున నధోభాగంబున ఖననంబుఁజేయవలయు. అనంతర మధోముఖుండును నూర్ధ్వపాదుండును నై సర్వకుండములందును స్మశానాంగారముఁ గొని తుషచే దాహంబొనర్పవలయు. అంత మయూరాస్త్రంబుచే నగ్నినిఁ బ్రజ్వరిల్లఁజేసి తుషసంయుతంబులును, గార్పాసాస్థిసమన్వితంబులును, రక్తవసనసమ్మిశ్రితంబులును, హస్తయంత్రోద్భవంబులును నగు శిలలచేత నష్టోత్తర సహస్రంబుఁ

కృష్ణచతుర్దశి మొదలష్టమివఱకు హోమంబుఁ గావింపవలయు. ఇట్లు హోమంబుఁ గావించిన శాత్రవులు దుఃఖార్తులై మృతిఁగాంతురు. ఈ యఘోరమంత్రంబు జపించుచు నరకపాలంబున నఖంబులును, కేశంబులును, నంగారంబులును, దుషకంచుకంబును, జీగచ్ఛటయు, గృహధూళియు, విషసర్ప వృషభ గోవ్యాఘ్ర కృష్ణమృగ బిడాలనకులవరాహదంష్ట్రంబులును సాధించి యష్టోత్తరశతంబు జపంబుఁగావింపవలయు. పిమ్మటఁ దత్కపాలనఖంబుల క్షేత్రంబున నొండె గృహంబున నొండె నగరంబున నొండె ప్రేతస్థానంబున నొండె రాష్ట్రంబున నొండె మృతవస్త్రంబుచేఁ గట్టి వైరి యష్టమరాశియందు సూర్యుండుగాని చంద్రుండుగాని యున్నపుడీమంత్రంబు జపించిన వైరికి స్థానభ్రంశంబును కులనాశనంబును గలుగు. మఱియు శత్రుమార్గంబునను స్థానంబునను భూతలంబునను, శత్రువును రాజును లిఖించి వైరిమూర్ధంబున దక్షిణపాదంబుచేఁదాడనంబుఁగావింపఁదగును. ఇట్లు గావించిన రాజశత్రు వినాశంబగు. ప్రమాదంబున నేని నిజరాజ్యపరిపాలకు గుఱించి యిక్కార్యంబుఁ గావించిన నాచార్యునకు గోత్రనాశనంబు సంభవించును. ఇదియ యభిచారిక విశేషవిధి యింక వజ్రవాహినీవిద్య వక్కాణింతు వినుఁడని సూతుం డిట్లనియె.

—• వజ్రవాహినీవిద్య •—

తే॥ వజ్రవాహిని కాభిధ • వఱలువిద్య యఖిల శత్రుభయంకర • మై తనర్చు
క్షోణిపుల వజ్రమును దాన • శుద్ధిఁజేయ నెల్లకర్జముల్ శిద్ధించు • నెసకమెసఁగ.

తే॥ వజ్రమొండుదెచ్చి • వారక యభిషేకమాచరించి యిమ్మ • హాప్రభావ
వంతమైన విద్య • నెంతయు సద్దాన విన్యసింపవలయు • విధియుతముగ.

సీ॥ అంతట నావిద్య • నక్షరలక్షగా జపమొనరించి ని • శ్శంకచిత్తుఁ
డగుచు దశాంశంబు • సాజ్యాదికంబుగ నవ్వజ్రకుండంబు • నందు హోమ
మొనరించి యవ్వజ్ర • ముర్వీశున కొసంగఁదగు నృపాలుఁడు దాని • దాఁచియవస
రంబగుచో నాహ • వంబునకుఁ గొని చనిన శాత్రవ వినా • శంబు గలుగు
నొక్కపుడు కమలాసనుం • డుల్లమలర వజ్రవాహిని నార్జించి • వాసవునకు
నాహవతలంబునఁ విజ • యంబుఁగూర్చెఁ గాన నివ్విద్య విజ • యంబు కారణంబు

తే॥ మఱియునొక కాలమున శత • మన్యుఁడాజియందుఁద్వష్టృప్రజానాథు • నాత్మజుఁడగు
విశ్వరూపుండనెడువాని • విగతజీవుగా నొనర్చెఁ బ్రజాపతి • కనలి మదిని.

తే॥ వజ్రవాహినీ విద్యాప్ర • భావమునను సోమము హరించినఁ బల • సూదనుండు
వానిసేయు యజ్ఞంబున • వచ్చి తాహవిస్సు నిడుమని పలికిన • విని యతండు.

క॥ నా కేశనీవు రణమున నాకొమరు వధించుకతన • నాయజనమునన్
నీకు హవిర్భాగంబే గాకయు • భాగార్హతయును • గలుఁగ దొకింతన్.

క॥ చనుమిందు నిలక యపకృతిఁ బొనరించినవాఁడవీవు • పురుషాధమ నీ
కెనయగువారుండినచోఁ నొనరించుట యుచితమగునె • యుపకృతి యింకన్.

తే॥ అనుచు నిగ్రహించి • యాశ్రమంబెల్ల మాయావిమోహితముగ • నాచరించె
నంత ననిమిషేశుఁ • డమ్మాయ నిర్జించి సోమమును గ్రహించె • సురలు మెచ్చ.

వ॥ అప్పుడు త్వష్టృప్రజాపతి తచ్ఛేషభాగంబుఁగొని దానక్రోధావిష్టుండై 'ఇంద్రశత్రు ర్వర్ధస్వ స్వాహా' యని హోమంబుఁ గావింపఁ గాలాగ్ని సంకాశుండగు వృత్రుండను వాఁడుదయించిన భయవిహ్వలుండై సునాశీరుండు దివంబునకుఁజని వృత్రవధోపాయంబుఁ జింతించుచు.

క॥ కమలాసనునికడకుఁ జని యమరేంద్రుఁడు చేతులొగ్గి • యనఘా వృత్రుం
డమరులపాలిటి యముఁడై శ్రమఁ గుడుప నుపేక్ష సేయఁ • జనునే నీకున్.

తే॥ ఎట్టియిడుమలైన • నిల సహింపఁగవచ్చుఁగాని వానిసేయు • కర్జములకు
నోర్వరాదు మాకు • నో సురజ్యేష్ఠ మమ్మాదరింపు మిప్పు • డార్తిఁబాపి.

క॥ అని ప్రార్థించిన వనజాసనుఁడు కృపాకలితుఁడగుచు • స్వర్గేశునకున్
దన వజ్రవాహినీవిద్య నొసంగి వచించె నిట్టు • లనుకంప మెయిన్.

క॥ ఇది శత్రునాశకంబగునది వజ్రముఁగొని యథేచ్ఛ • నాసురవైరిన్
గదనంబునందు హతుఁజేయుదు వరుగుమా లోకములకు • నుపకారమగున్.

వ॥ అనిపలికి యంపినఁ బురందరుఁ డుత్సాహంబు మెయి నరిగి వజ్రవాహినీ విద్యాప్రభావంబున లోకకంటకుఁడగు వైరి నున్మూలించి వైభవంబున నుండె. కావున నవ్విద్య శత్రుభయంకరంబును, నిష్టదాయకంబును నని మంత్రజ్ఞులు వక్కాణింతు రని పల్కి మునిపుంగవులతోఁ దద్విద్యావినియోగ క్రమంబు వక్కాణించువాఁడై సూతుం డిట్లనియె.

## — • వజ్రవాహినీ విద్యావినియోగ క్రమము • —

వ॥ వశ్యంబును, నాకర్షణంబును, విద్వేషణంబును, స్తంభనంబును, మోహనంబును, దాడనంబును, నుత్సాదంబును, మారణంబును, ప్రతిబంధనంబును, సేనాస్తంభనం

బును మున్నగు నుపయోగింబులీ మహావిద్యోపాసనంబున నగును. కావున నీవిద్య నుపాసించి యథావిధి జపహోమాదు లొనరించి దేవినుద్వాసనముఁ జేయవలయు. జాతీపుష్పంబులచే వశ్యంబును, కరవీరంబులచే నాకర్షణంబును, లాంగలకంబుచే విద్వేషణంబును, దైలంబున నుచ్చాటనంబును, మధువుచే స్థంభనంబును, దిలలచే మోహంబును, స్నపంబున ఖరగజోష్ట్రస్థంభనంబును, గుళంబునఁ బాటనంబును రోహిబీజంబున మారణోచ్చాటనంబును, నహిపత్రంబున బంధన సేనాస్థంభనంబులును, మణిశిలచే నియతంబును, సిద్ధించును. మఱియు ఘృతంబున సర్వసిద్ధియుఁ దిలలచే రోగనాశనంబును, గమలంబున ధనంబును, మధూకపుష్పముచేఁ గాంతియుఁ గలుగు. ఇది వజ్రవాహినీ విద్యావినియోగ క్రమంబిక మృత్యుంజయ విధినాలింపుఁడు. విధివిహితంబగు రుద్రాధ్యాయంబుచేతను, ఘృతమిశ్రితంబులగు తిలలచేతను, గమలంబుచేతను నాజ్యగోక్షీర మిశ్రితంబగు దూర్వచేతను ఘృతయుతంబగు చరువుచేతను, గేవలపయస్సుచేనైనను హోమమాచరించినఁ గాల మృత్యువునైన జయింపనగును. మఱియుఁ దన్మంత్ర వినియోగ క్రమంబెట్లనిన.

—• "త్రియంబకమంత్ర" వినియోగవిధి •—

సీ॥ మహిత్రియంబక • మంత్రంబుచేబాణ లింగంబునందొయ • భంగురగతి
నుద్భూతలింగమం • దొండె త్రిలోచను నష్టోత్తరసహస్ర • మైనయట్టి
పుండరీకములచేఁ • బొంకమలములచే నీలోత్పలాళిచే • నిష్ఠమెఱయఁ
బూజించిపాయసం • బును సఘృతంబగు నన్నంబు మఱియును • ద్రాక్షముమధు
సంయుతంబులైన • సకలవిధములగు భక్ష్యములనొసంగి • పరమభక్తి
ననలమందు హోమ • మాచరింపఁగఁదగు విప్రభోజనంబు • వెలయఁజేసి.

తే॥ ఇమ్మహామంత్రవినియోగ•విధముఁదొల్లి స్కందునకుఁ జెప్పెశంభుఁడా•శక్తిధరుని
వలన బ్రహ్మపుత్రుఁడెఱింగె•వ్యాసుఁడతని కడఁదెలిసినాఁడు జెప్పెను•కనికరమున.

తే॥ పూన్కివెలయశంభుఁ • బూజించి యిమ్మహామంత్రజపముఁజేసి•మానవుండు
సప్తజన్మకలుష • సంచయంబుఁదొఱంగి యిష్టకామ్యవితతి • నెల్లనొందు.

తే॥ లక్షహోమంబుఁజేసిన • లక్షణముగ రాజ్యముంగోరు నాతండు • రాజ్యమొందు
ధనముఁగోరెడు నాతండు • ధనమునొందుఁ బుత్రుఁగోరునతండును • పుత్రునొందు.

తే॥ పరఁగనిమ్మహామంత్రజ • పంబుఁజేసి పుత్రపౌత్రాదిసంపదఁ • బొందునరుఁడు
మఱియునమృతత్వమొందియు•మరసమూహ మధ్యముననిల్చుసౌఖ్యసం•పదలనొంది.

తే॥ వేదమునలోకమునయందు • వెదకిచూడ నిమ్మహామంత్రసదృశంబు•నెందుఁజూడ
మట్లగుటఁజేసి మునివర్య • లమలభక్తి జపముఁజేయుచునుందురు• స్వాంతమందు.

తే॥ మూఁడులోకములకు • మూఁడుగుణములకు వేదములకు నెల్ల • వేల్పులకును
నాల్గుజాతులకును • నాథుండుత్ర్యంబకుఁ డతనిఁబూజసేయు • టవసరంబు.

వ॥ అనిపలికి త్ర్యంబక మంత్రంబునకు సక్రమంబుగ నర్థంబుఁజెప్పి యీశ్వరధ్యానక్రమం
బుఁ జెప్పువాఁడై యిట్లనియె.

— • ఈశ్వర ధ్యానక్రమము • —

చ॥ అనఘుఁడుమౌనిరాజుకరు • ణాబ్ధిపరాశరపుత్రుఁడా దరం
బుననెఱిఁగించినట్టివియ • మోఘములౌహరు సచ్చరిత్రముల్
వినవిననించుకేనియును • వేడుకతీర దు మీకుఁగావునన్
దనియఁడుచంద్రశేఖరుని • ధ్యానవిధిన్ వినిపింతు భక్తిమై

తే॥ ఎవఁడుశ్రుతివిహితవిధాన • మెల్లఁదెలిసి చంద్రశేఖరునర్చించు • సాంద్రభక్తి
నతఁడు బ్రహ్మాదులేనియు • నందరాని మోక్షపదమును జెందుస • మ్మోదమునను.

తే॥ ఎట్టిపూజలేని • యెట్టితపములేని యెట్టిజపములేని • యేవియేని
క్రమమువిడక కాలకంఠునిధ్యానంబు సలుపఁగలుగుముక్తి • కిలనుసరియే.

తే॥ మున్నొకప్పుడు శైలాది • యున్నయెడకు వచ్చిప్రణమిల్లి పద్మసంభవతనూజుఁ
డగుసనత్కుమారుఁడుశివ • ధ్యానవిధిని దెలియఁగాఁజెప్పుమననంది • పలుకునిటుల.

ఉ॥ తొల్లియొకప్పుడద్రిజయు • ధూర్జటియున్ రజతాద్రి శృంగమం
దెల్లమనోహరక్రియల • కిక్కగనొప్పెడు సౌధరాజమం
దుల్లముపల్లవింపగను • ఖోదధివీచులదోఁగుచో మనో
వల్లభుగాంచిపల్కె హిమ • వత్సుతభక్తిసమేతయై వెసన్.

మ॥ జగదీశుండవు నీకృపాకలనదృ • శ్యాదృశ్యమై యొప్పునీ
జగమెల్లన్ జనియించునెల్లపుడువి • శ్వత్రాతవంచున్ నినున్
నిగమంబుల్ నుతిసేయునీకతనన్ • నిగ్రాహ్యుఁడౌవాఁడుని
ల్వఁగలండే యిసుమంతయేని కరుణా • వార్ధీ జగన్నాయకా!

క॥ కొందఱుధ్యానంబున మఱికొందఱు దానంబుకతనఁ • గొందఱుపూజన్
గొందఱుతపముననీకా నందంబునుగూర్చుచంద్రు • నాగాభరణా?

తే॥ యోగమెన్నిగతుల • నొప్పునేయోగంబు నాశ్రయించి మోక్ష • మందునరుఁడు
భక్తవత్సలుఁడవు • పరమేశలోకహి తంబుఁగోరి వినఁగ • దలతునిపుడు.

సీ॥ అనుచుఁ బ్రార్థించిన • నద్రిజఁ గనుఁగొని పరమేశ్వరుండిట్లు • బలుకుమంత్ర
యోగంబు నాస్పర్శ • యోగంబు నాభావ యోగంబవ నభావ • యోగమనఁగ
నఖిలోత్తమంబు మ • హాయోగమన నైదు విధముల యోగంబు • వెలయుధరణి
ధ్యానయుక్తమగుజ • పాభ్యాసమిలమంత్ర యోగంబునాఁదగు • నాగమముల
రేచకాదిక్రమాన్వితం • బైచెలంగ కడఁగినాడీవిశుధ్యాది • కమునఁగూడి
సర్వమును వ్యస్తముగఁ జేసి • సరగ వాయు జయముఁ గావించి • నిర్మలస్వాంతుఁడగుచు.

తే॥ బలము స్థైర్యంబుగలిగి • చాపల విరహిత ధారణాదులఁగూడి భే • దత్రయంబు
పరగ శోధించి కుంభకా • వస్థితమగు నభ్యసమొనర్ప స్పర్శయో • నాఖ్యమగును.

సీ॥ తలఁపమంత్రస్పర్శ • ములవీడి భక్తిమై పురహరు నాశ్రయం • బునఁ జెలంగి
బాహ్యాంతర విభాగ • పదము జేరియుస్ఫురత్సంహరణాత్మకై • శ్వర్య మెుంద
భావయోగంబునాఁ • బరగు చిత్తవిశుద్ధి దాయకంబిది శుభ • దాయకంబు
స్థావరజంగమా • శ్రయముజగము విలీ నావయవంబు శూ • న్యంబుమఱియు
నలని రాభాసరూపమం • చరయనొప్పు భావవిరహితయోగంబు • భక్తవిలతి
చిత్తనిర్యాణ కారణ • శ్రీఁదనర్చు నఖిలమునిసమాశ్రితమయి • యనవరతము.

వ॥ నీరూపుంబును, కేవలంబును, శుద్ధంబును, స్వచ్ఛందంబును, శోభనంబును, ననిర్దే
శ్యంబును, స్వయంవేద్యంబును నగులోకంబు స్వభావంబున భాసించినది మహా
యోగంబు నాఁబడు. నిత్యోదితంబును, స్వయంజ్యోతియు, సర్వచిత్త సముద్ధితం
బును, నిర్మలంబును నగు నాత్మయే మహాయోగంబని చెప్పఁబడు.

సీ॥ జ్ఞానదాయకము లై • శ్వర్యప్రదంబులీ యోగంబులెల్ల స • మున్నతిఁ దగఁ
దనరఁగ నుత్తరో • త్తరమను క్రమమును శిష్యోత్తముని వీనఁ • జేర్పవలయు
నేనిల సంగ వి • నిర్ముక్తుఁడను మహాకాశోపముఁడను శం • కారహితుఁడఁ
బరుఁడ సర్వావర • ణ రహితుఁడనచింత్యుఁడను ప్రవీణుఁడను • ఘనుఁడ సర్వ
సాక్షికుండననుచు స్థైర్యంబుఁ గాంచిన శిష్యసత్తమునకుఁ జెలఁగివీని
యందుఁ దగిన యోగమందఁ జేయఁగఁదగుఁ బాక్షికుండు గాని పరమగురుఁడు.

తే॥ ధార్మికుండు కృతజ్ఞుండు • ధరణిసురుఁడు నిర్మలస్వాంతుఁడాహితా • గ్నియగుఛాత్రు
వివిధగతులఁ బరీక్షించి • వెలయఁజేయవలయు నీయోగములవాని • నెలమితోడ.

తే॥ సర్వసంగ వినిర్ముక్తు • సాధుచరితు ననిశమద్భక్తి నిరతుఁ • బుణ్యాత్ముఁ జ్ఞాన
యుక్తు గురుదేవతా విప్ర • భక్తుఁ గాక పరుని యోగంబులందుఁ జే • ర్పంగరాదు.

తే॥ అరయస్వార్థ పరాయణుం•డగుచుగురుఁడు నిందితాచారుఁడగువాని•నిందుఁజేర్చ
నేనిరోగియు నల్పాయు • వైనవాఁడు జననమొందివ్యథితుఁజేయు•సతతమతని.

తే॥ అఖిలవేదాగమాంభోధి • కమృతమైన దానియోగమార్గముఁ బురా•తనమునైన
దానిఁదెలియఁగఁజేసితిఁ • దరుణినీకు ధన్యుఁడగు యోగియోగామృ•తంబుఁద్రావి.

తే॥ ఉత్తమోత్తమమగు • యోగంబు పాశుప తాభిధానమదిమ • హామతులకు
నాశ్రయింపఁదగిన • దత్యాశ్రమము ముక్తి కారణంబుకలుష • మారణంబు.

తే॥ కావునశివార్చనారతి • గలిగిమిగుల సంతతాచారపరులైన • సాధుచరితు
లెల్లరిద్దీనిభజియింతు • రుల్లములను నారియిష్టముఁగూర్తున • వారితముగ.

తే॥ అనుచుఁ బ్రియముమీఱ • నద్రిజయడిగిన యర్థమెల్లఁదెలిపి • హరుఁడు శంకు
కర్ణమునువహించి• కడకనాత్మను నాత్మయందుఁజేర్చినిశ్చ • నిశ్చలాత్ముఁడగుచు.

క॥ కావుననీవుసరఁగమో క్షావిర్భవహేతువైన • యయ్యోగమునన్
భావంబుఁజేర్పుము మహా దేవునకున్ హితుఁడవగుదు • ధీరులుపొగడన్.

తే॥ అఖిలవిధముల మోక్షార్థి • యైనవాఁడు పాశుపతయోగరతుఁడయి•భస్మమునను
స్నానమొనరించి క్రమముగ•స్వాంతమందుఁద్ర్యంబకుననుగ్రహంబుఁజెం•దంగఁగోరి

వ॥ వైష్ణవయోగంబొండె మహేశ్వర యోగంబొండె చాల్పవలయు. ఇదియ యోగక్రమంబని శైలాది సనత్కుమారున కెఱింగింప నతండు వ్యాసమునీంద్రున కుపదేశించె. శిష్యవత్సలుండగు పరాశర తనయుండు నాకుబోధించె నద్దాని నిప్పుడు మీకుఁదెల్పి ధన్యుండనైతినని పల్కి సూతుండు పరమేశ్వర ధ్యానంబుఁ గావించి యిమ్మహాపురాణం బేకాదశ సహస్రంబందుఁ బూర్వార్థంబష్టోత్తర శతాధ్యాయంబును నుత్తరార్థంబు పంచ పంచాశ ధ్యాయంబునునై యున్నయది. భగవంతుండగు కమలాసనుండు పురాణరాజంబును నేకాదశంబును నగు నీలైంగంబువచియించి యిట్లనియె.

—• ఫలశ్రుతి •—

సీ॥ "ఆద్యంతముగ నిమ్మ • హాపురాణము సర్వమును భక్తితోఁ బఠిం • చినను విన్న
ద్విజసంచయమునకు • వినిపించినను వాఁడు పరమపదముఁబొంది • ధరణివెలయుఁ
దపమొనరించియు • దానంబుఁజేసియు యజ్ఞాది సత్క్రియ • లాచరించి
యును జెందఁగారాని•యనఘమా సాయుజ్యమును జెందుఁ జంద్రార్క•మునుస్థిరముగ

నెట్టి పుణ్యవంతులేని • యాతనిఁబోల రమలమైనభక్తి • యావహిల్లు
వేదవిద్యయందు • విపులచాతుర్యంబు గలిగి వినుతుఁడగును • కలిదొఱఁగి.

తే॥ తోయజాక్షునందు • నాయందునతనికి శ్రద్ధగలుగవాని • సత్కులంబు
దినదినాభివృద్ధిఁ • దేజరిల్లును చిరస్థాయియైమనీషి • జనము మెచ్చ.

తే॥ అనుచుసూతుఁడాడి • నట్టిపలుకులవిని యాశ్రమీయులిట్టు • లనిరి వేడ్క
నిమ్మహాపురాణ • మెలమివినెడి భాగ్యమునుఘటించెదేవ • మునివరుండు.

ఉ॥ నారదమౌనిశేఖరుఁడ • నంతకృపానిధి యిప్పురాణముఁ
గోరికమీఱఁజెప్పడని • కోరఁడయేనినినుఁ భవాబ్ధిసం
తారకమైన దీనివిని • ధన్యతఁగాంచఁగనేర్తుమే యహం
కారము వెంటనంటుకొని • గాసిలఁజేయఁగనే మొకప్పుడుఁ.

తే॥ తీర్థయాత్రాపరుండైన • దేవమునికి నెట్టిసిద్ధిలభించెనో • యింకమీఁద
నట్టిసిద్ధియెకల్గుచం • ద్రార్థమాళి కరుణమనకును సత్యంబు • గాఁగసూత.

చ॥ అనువెడ నారదుండుదర • హాసముఁజేయుచు నక్షమాలికా
ఘనపరివర్తనంబుమెయిఁ • గాయలఁజెందినయట్టి చేతులఁ
మునినికరంబుమధ్యమును • బొందిన సూతునిమేను రాయుచి
ట్లనియె సమంజసోక్తులఁద • దాశ్రమవాసులు సన్నుతింపఁగఁ.

తే॥ కుశలమగుఁగాకనీకునీ • కోవిదత్వమునకు నీయాశ్రమీయుల•కునుసతంబు
నిమ్మహార్థంబునెఱిఁగించి • యిపుడుమాకు సుకృతమును గూర్చితివిగద• సూరివర్య.

క॥ హరునకు సకలదురిత సంహరునకు, శ్రితవత్సలునకు • నద్రిసుతాహృ
త్సరసిజహేళికి మధురా పురసోమేశునకుహస్త • ములు మోడ్తువెసఁ.

వ॥ ఇప్పటికి సంధ్యాకాలం బాసన్నమయ్యెఁ గావున నిత్యకృత్యములఁదీర్చి వేరొండు పురాణము శ్రుతిపేయంబుఁ గావింతముగాక యని పలుకుటయు.

ఆశ్వాసాంతము

మ॥ శ్రితలోకావనదక్ష దక్షయజన • శ్రీస్థైర్యనాశక్రియా
రత, విద్విడ్దనుజాటవీ దహన, స్వ • గ్గస్థామరోర్వీరుహా
శ్రుతిసంతాన విభూషణా! త్రిజగతీ • శుద్ధాంత సంచారమ
త్కృతి సంత్రాణపరాయణా! సుకవిరా • ట్బృందస్తుతాంఘ్రిద్వయా.

క॥ వామాంగ వశంసిత సుశ్యామా, మధురావని వి • శాలభవనసం
ధామా! నిర్మితలోక స్తోమా! సోమేశవిధృత • సోమాభీమా!

క॥ నిరతగణాగ్ర్య వ్రత సుస్థిరవేమారాధ్యవంశ • శేఖరనందీ
శ్వరగోత్రవృద్ధిదాయక సురవినుతా పాండ్యదేశ • సోమేశవిభూ.

తే॥ కష్టపడిపెంచియిడితి నాకవితకన్నె నెవ్విధంబున నలరింతొ యింకమీఁద
గంగవోలెను గయ్యాళి గాదుబేలసుమ్మ నీతలకెక్కి నాట్యమ్ము సేయ.

సీ॥ ఏమహామహుఁడు శ్రీవేమనారాధ్య వంశాబ్ధికిఁబూర్ణ శశాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రికెనయైసతుల్ మెచ్చ మహినిబాతివ్రత్యమహిమఁగాంచె
నట్టినందయకు గౌరమకు ద్వితీయపుత్రుండఁ గౌండిన్య గోత్రుండ దక్షి
ణామూర్తికిని శివానందునకును సోదరుండఁ గూరిమి యగ్రజుండ సుబ్బ

నార్యునకుఁ బౌత్రుఁడను మదీయమగు శ్రీమదాంధ్ర లింగపురాణోత్తరార్ధమందుఁ
బ్రవిమలం బెనిమిదవ యాశ్వాసమయ్యె సతము దీనిని రక్షించుఁ జంద్రమౌళి.

సీ॥ కల్యాదిగణుతింపఁ • గానైదువేలముప్పది యవదగు శుక్లవత్సరమున
శ్రావణశుద్ధపం • చమిని భార్గవవాసరమున హస్తయనుతా • రను శశాంక
మౌళికరుణజేసి • మామకజనిధన్యముగను లింగపురాణమును తెనుంగు
బాసరచించితి • శ్వప్రదాన చతురులైభక్తవత్సలులై తనర్చు

పూర్వదంపతులకు సుర • పూజితులకు మధురమీనాక్షికిని కృపా • మహితుడైన
సుందరేశునకిడితినా • నందము మెయి సతము దీనిని రక్షించు • జంద్రమౌళి.

మంగళం మహత్.

శ్రీ శ్రీ శ్రీ

——(౦)——

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | అశుద్ధము | శుద్ధము |
|---|---|---|---|
| 3 | 14 | కార్తీకగణాచార్య వ్రతమొనర్చి | కార్తికగణాచార్యాభిరతిఁ జేసి |
| 3 | 27 | దొలుత | తొలుత |
| 9 | 1 | పృథ | పృధి |
| ,, | 5 | భిదా | భిక్షా |
| ,, | 9 | భగవదర్శనం | భగవద్దర్శనం |
| ,, | 16 | తచ్చాప | తచ్చాప |
| ,, | 28 | జీవచ్ఛ్రిద్ధ | జీవచ్ఛ్రిద్ధ |
| ,, | 34 | మహాత్మ్యం | మాహాత్మ్యం |
| 10 | 21 | గోలఁగలిగిత | గోలఁగంటిన |
| ,, | 29 | వజ్ర | వజ్ర |
| ,,, | 25 | గనుగొనఁగల్గితించుకయ | గనుగొననయ్యె నాకిలన |
| ౿ | 12 | ఒక్క ప్రహరణ మొనరించితుక్క | ఒక్క ప్రహరణమొనర్చితినుక్క |
| 21 | 26 | మెచ్చితిపుడు | మెత్తునిపుడు |
| 29 | 5 | కథానానంతరము | కథనానంతరము |
| 42 | 27 | హరుంనంత | హరుండునంత |
| 46 | 14 | నాకీశ్వరా | నేనీశ్వరా |
| 51 | 14 | లగ్న | లగ్ని |
| 52 | 27 | శరగ | సరగ |
| 54 | 10 | దర్చ | చర్చ |
| 62 | 32 | నావిడు | నాకిడు |
| 64 | 4 | సదసుల్ | సదస్యుల్ |
| ,, | 17 | ఎలుగుదింక | ఎలుంగుమింక |
| 66 | 21 | డందళ మెత్తితిప్పుడ | డందళ మెత్తి నాడన |
| 67 | 1 | నపరాధ మొనరించితిపుడు | నపరాధి నైతి నేనిపుడు |
| ,; | 6 | నీయెడలనలిగితిద్ధ | నేదోషి నైతినిద్ధ |
| 68 | 27 | గావుంచు | గావించు |
| 69 | 2 | గాలించితిట్టుల | గాల్చితినిట్టుల |
| 72 | 5 | జేసితిప్రడు | జేసినాడ |

| పుట | పంక్తి | అశుద్ధము | శుద్ధము |
|---|---|---|---|
| 80 | 31 | గలుగుదని | గలుగుదునని |
| 81 | 9 | సంతసమొందిలిల్లెదిరొ | సంతసముగ వహించితిని |
| 84 | 12 | మెచ్చితెదగ | మెప్పగ్యోగ |
| 90 | 2 | దలఁపు జెందితి | దలంచినాడ |
| 95 | 24 | నంపితిటకు | నంపినాడ |
| 96 | 12 | నీకిచ్చితింక | నీకిత్తునింక |
| 97 | 14 | నలిచితప్పుడో | నలిచినంతనో |
| 98 | 1 | మహాత్మ్యం | మాహాత్మ్యం |
| 104 | 33 | శక్తివహించితి | శక్తి నిగంటిని |
| 122 | 1 | దక్షాయణీ | దాక్షాయణీ |
| 154 | 21 | గాంచిపన్కు | గాంచిపల్కు |
| 163 | 2 | వించు | మించు |
| ,, | 1 | శోకుట | సోకుట |
| ,, | 26 | వాసినగ | వాసినిగ |
| ,, | ,, | వెనయొసంగిత | వనలనిడితిన |
| 186 | 11 | వించితక్కుతనజయించితాశ | వించియాశలను జయించినాడ |
| 194 | 19 | క్రిమ్మరు | ద్రిమ్మరు |
| 208 | 22 | సంతసమ్మిడిగాగ | సంతసమిమ్మడిగాగ |
| 206 | 20 | యించును | యంచును |
| 207 | 19 | వాంఛితంట | వాంచితంబు |
| 212 | 7 | నిప్పరిమంద | నిప్పరమంద |
| 213 | 5 | పట్కుమును వెసగ దాటిరే | పట్కుమపుడుగడచియు |
| 226 | 11 | రా గాంధతమో | రాగతమస్సద్ |
| 252 | 19 | తరాభిఘాత | తలాభిఘాత |
| 262 | 1 | కృపాను | కృపాణ |
| 264 | 11 | తూరీగళుండు | తూణీరయుగళుండు |

శేషంబులూహ్యంబులు.

—:o:—

## ఉత్తరభాగము.

# తప్పొప్పుల పట్టిక.



| పుట | పంక్తి | అశుద్ధము | శుద్ధము |
|---|---|---|---|
| 1 | 1 | భక్తవాత | భక్తవ్రాత |
| ,, | 14 | ఆనుకంపా | అనుకంపా |
| 2 | 1 | చీకెలను | చీరలను |
| 24 | 12 | టార్ప్యులై | తార్క్ష్యులై |
| ,, | 21 | సువాని | సురవరాని |
| 83 | 25 | నిమ్నగ | నిమ్నగా |
| 40 | 7 | భావ్యంబుకై | భావ్యంబునై |
| ,, | 26 | ఎట్టివారిసైన | ఎట్టివారికైన |
| 43 | 25 | ద్రోలి | ద్రోలం |
| 74 | 7 | రూపము | రూపయు |
| 77 | 3 | కురురుట | కురుకుట |
| 79 | 4 | పరీతమయి | పరీతయయి |
| ,, | ,, | నతండా | నతండు |
| 89 | 23 | దేవదాత్ప్రము | దేవతాత్వము |
| 93 | 6 | పాక్కల | పాక్కయుల |
| 94 | 2 | తులసి | తులసి పేర్లు |
| 95 | 24 | శిభ్యుని | శిష్యుని |
| 97 | 2 | కాశికు | బ్రాహ్మణు |
| 110 | 1 | మహాభారతము | లింగపురాణము |
| 147 | 1 | తనయకు | తరుణికి |
| 157 | 30 | యర్తార్తి | యార్తార్తి |

| పుట | సంఖ్య | అశుద్ధము | శుద్ధము |
|---|---|---|---|
| 161 | 1 | వష్టమా | పష్ఠా |
| 162 | 5 | నయమునిక్ | నయమమునిక్ |
| ,, | 13 | సిద్ధజివు | సిద్ధుఁడవు |
| 166 | 8 | క్షుథారుడై | క్షుథార్తుడై |
| 172 | 18 | కొనరింప | మనోనరింప |
| 201 | 4 | మనువుడు | మనవుఁడు |
| 205 | 12 | ధారుణంబు | ధారణంబు |
| 231 | 14 | బంచాక్షరియుభస్మయును | బంచాక్షరీవి భూతులు |
| 232 | 17 | పీతిహోద్ర | పీతిహోత్ర |
| 244 | 7 | దృశ్యాదృశ్యము | దృశ్యాదృశ్యంబగు |
| 254 | 6 | లింగాగుల | లింగాంగుల |
| 255 | 27 | స్పగశ | స్పర్శ |
| 257 | 8 | కీరంబుల | కరంబుల జపించుచు |
| 259 | 21 | లింగపతిభక్తి | లింగంబతిభక్తి |
| 276 | 21 | కతనగా | కతమునగా |

—*—*—
*